| విషయము. | సంఖ్య. |
|---|---|
| వేగముగవస్తికర్మను ప్రయోగించుటవలన జనించుచుపద్రవచికిత్స | 481 |
| వస్తియంత్రముపు చక్కఁగ ప్రయోగింపకుండుటచే జనించుచుపద్రవచికిత్స | ,, |
| వస్తినిమిక్కుటముగ ప్రయోగించుటచే జనించుచుపద్రవచికిత్స | ,, |
| వమనాదికర్మవిశుద్ధరక్షణావశ్యకత్వము | ,, |
| వమనాదికర్మలచే శుద్ధశరీరికి రసోపయోగక్రమము | 482 |
| **షష్ఠాధ్యాయము.** | |
| భేషజకల్పాధ్యాయప్రారంభము | 483 |
| ప్రశస్తౌషధస్వరూపము | ,, |
| ఓషధిగ్రహణక్రమము | 484 |
| క్షీరాదిగ్రహణక్రమము | ,, |
| స్వరసాదిపంచవిధకషాయములు | ,, |
| స్వరసలక్షణము | 485 |
| కల్కలక్షణము | ,, |
| శృతకషాయలక్షణము | ,, |
| శీతకషాయలక్షణము | 487 |
| ఫాంటలక్షణము | 487 |
| స్వరసాదిద్రవ్యప్రమాణనిర్ణయము | 488 |
| స్వరసమధ్యమప్రమాణము | ,, |
| కల్కద్రవ్యమధ్యమప్రమాణము | ,, |
| శృతకషాయమధ్యమప్రమాణము | ,, |
| శీతకషాయద్రవ్యప్రమాణము | ,, |
| ఫాంటకషాయద్రవ్యప్రమాణము | ,, |
| తైలఘృతాదిపాకమున కల్కాదిపరిమాణము | 489 |
| శౌనకమతకల్కాదిపరిమాణము | ,, |
| స్నేహపాకలక్షణము | ,, |
| ఘృతాదిసమ్యక్పాకలక్షణము | 490 |
| స్నేహాదులకు త్రివిధపాకము | ,, |
| శాణాదిపరిమాణలక్షణము | ,, |
| శుష్కార్ద్రద్రవ్యపరిమాణము | ,, |
| అనుక్తద్రవప్రకరణమునందుదక గ్రహణము | 491 |
| పరిమాణముచెప్పకుండుస్థలమునపరిమాణనిర్ణయము | ,, |
| కోలాదిపరిమాణనిర్ణయము | ,, |
| దేశభేదమువలన ద్రవ్యభేదము | 492 |




శ్రీ ర స్తు.

# అష్టాంగహృదయము

## ఆంధ్ర తాత్పర్యము.

---

# చికిత్సాస్థానము.

---

## ప్రథమాధ్యాయము.

అవతారిక:—నిదానస్థానంబున జ్వరాదిరోగపరీక్షాక్రమంబులు జక్కగవక్కాణింపంబడియె. "రోగమాదౌపరీక్షేతతతో౽నంతరమౌషధమ్" అను వచనానుసారంబుగ దొలుత రోగంబులను నిదానాదులచే బరీక్షించి పిదప యాయారోగంబులకుందగిన యౌషధంబుల నిర్ణయింపవలయునని వచించు చరకవచనంబు ననుసరించి నిదానస్థానంబును నిరూపించి తదనంతరం బీ చికిత్సాస్థానంబున జ్వరాదిరోగ చికిత్సాక్రమంబులు నిరూపింపబడుచున్నయవి. నిదానస్థానంబున జ్వరాదిరోగంబు లెబ్భంగి నిర్దేశింపంబడియెడినో అవ్విధంబుననే చికిత్సలను క్రమముగ నిరూపించుట యుక్తంబని తలంచి వాగ్భటాచార్యం డీస్థానంబునం దొలుత జ్వరచికిత్సాక్రమంబులను విశదపరచుచున్నాడు.

సూ. అథాతో జ్వరచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

తాత్పర్యము. జ్వరాదిరోగనిదాననిరూపణానంతరము జ్వరచికిత్సాక్రమంబులను బోధించెడు జ్వరచికిత్సితమను నీ యధ్యాయమును ఆత్రేయాది మహర్షులు జ్వరచికిత్సల నెబ్భంగి నుపదేశించిరో, అపద్ధతికి విరోధము లేక (వానినే ప్రమాణముగ జేసికొని) వివరించెదనని భావము.

### లంఘనము.

శ్లో. ఆమాశయస్థో హత్వాగ్నిం సామో మార్గాన్ పిధాయ యత్,
విదధాతి జ్వరం దోష స్తస్మాత్కుర్వీత లంఘనమ్. ౧
ప్రాగ్రూపేషు జ్వరాదౌ వా బలం యత్నేన పాలయన్,

ఆమాశయంబునందలి దోషము జాఠరాగ్నిని నశింపజేసి ఆమముతోడం గూడినదై స్రోతోమార్గముల నడ్డగించి జ్వరమును కల్గుగజేయుచున్నది; కావున జ్వరమునకు

పూర్వరూపంబులు జనించియుండునపుడుగాని లేక జ్వరము జనించినతోడనే గాని రోగియొక్క శరీరబలమునకు హానికలుగంజేయక మిగుల బ్రయత్నముతో రోగి యొక్క బలమును రక్షించుచు ఉపవాసరూపమైన లంఘనమును జేయించవలయును. మూలశ్లోకమునందు "కుర్వీత లాఘునమ్" అని సాధారణముగ జెప్పియుండినను "లంఘ నస్యావిశేషాత్తూపవాసు ప్రకల్పయేత్" లంఘనము చేయించవలయునని సామాన్య ముగ జెప్పియుండు స్థలంబునందు ఉపవాసరూపమైన లంఘనము చేయించవలయునని తంత్రాంతరమునందు జెప్పియుండుటవలనను "తస్మాదాదోషపచనాజ్జ్వరితా నుపవాస యేత్" దోషములు పాకంబును జెందువరకు జ్వరపీడితుల కుపవాసము జేయించవలయు ననియు త్రత్ర జెప్పబోవుటవలనను యిచట లంఘనశబ్దమునకు ఉపవాసమనియే అర్థము నిశ్చయింపవలసియున్నది.

బలాధిష్ఠానమారోగ్యమారోగ్యార్థం క్రియాక్రమః. ౨

రోగికి ఆరోగ్యము కలుగుటకై చికిత్సలు జేయబడుచున్నవి. అట్టి ఆరోగ్య మునకు బలము ఆధారముగ నుండుటంజేసి బలమును బ్రయత్నముచే గాపాడుచు లంఘనము జేయించవలయును.

## లంఘనఫలము.

లంఘనైః క్షపితే దోషే దీప్తేఽగ్నౌ లాఘవే సతి,
స్వాస్థ్యం క్షుత్తృడ్రుచిః పక్తిర్బలమోజశ్చ జాయతే. ౩

జ్వరితుని కుపవాసంబులచే దోషంబులు క్షయించి జాఠరాగ్నికి దీపనము గలిగి శరీరము లఘుత్వమును జెందియుండగా స్వస్థత, ఆకలి, దప్పి, అన్నాదులయందిచ్ఛ, ఆమదోషమునకు పాకము, ఉత్సాహము, ఓజస్సు (అనగా ధాతుగతంబైన తేజస్సు) కలుగును. "లంఘనైః" అని బహువచనము జెప్పియుండుటవలన ఆయాదోషబలాను సారముగ 1, 2, 3, లంఘనములు జేయించవలయునని భావంబగుచున్నది.

## వమనము.

తతోఽత్యుత్క్లిష్టే సముత్క్లిష్టే కఫప్రాయే చలే మలే,
సహృల్లాసప్రసేకాన్న ద్వేషకాసవిషూచికే. ౪
సద్యోభుక్తస్య సంజాతే జ్వరే సామే విశేషతః,
వమనం వమనార్హస్య శస్తం కుర్యాత్తదన్యథా. ౫
శ్వాసాతీసారసమ్మోహహృద్రోగవిషమజ్వరాన్,

వాతదోషముగాని పిత్తదోషముగాని తమతమ యుత్పత్తి గుణకర్మ లక్షణము లధికములై కఫాధిక్యముతోగూడి స్వస్థానమునందుండి బయలువెడలి శిథిలమై ఓకర,

నోటిలోనీరుగారుట, అన్నద్వేషము, కాసము, విషూచిక మొదలగు సుపద్రవములతో గూడియుండునపుడును, అపుడే భుజించినవానికి జనించిన జ్వరమునందును, విశేష ఆమముతో గూడియుండు జ్వరమునందును, వమనవిరేచన విధ్యధ్యాయమునందు వమనార్హుడుగ జెప్పబడియుండువానికి వమనము జేయించిన హితముకలుగును. పైలక్షణములు లేకుండువానికి వమనము జేయించిన శ్వాసము, అతిసారము, మూర్ఛ, హృద్రోగము, విషమజ్వరము కలుగును.

## వమనద్రవ్యములు.

పిప్పలీభిర్యుతాన్ గాలాన్ కలింగైర్మధుకేన వా. ౬
ఉష్ణాంబునా సమధునా పిబేత్సలవణేన వా,
పటోలనింబకర్కోటవేత్రపత్రోదకేన వా. ౭
తర్పణేన రసేనేక్షోః మద్యైః కల్పోదితాని వా,
వమనాని ప్రయుంజీత బలకాలవిభాగవిత్. ౮

వైద్యవరుండు జ్వరితునియొక్క శరీరబలాబలముల, వ్యాధిబలాబలముల కాలముల జక్కగ నెఱింగి వానికిడగినట్లు వమనౌషధము నిప్పించవలయును. అందు మంగ పండ్లను పిప్పలి సహితముగ గాని, కొడిసెవిత్తుల సహితముగ గాని, యష్టిమధుక సహితముగ గాని, తేనెతో కలిసిన ఉష్ణోదక సహితముగ గాని, సైంధవలవణ సహితముగ గాని, పొట్ల, వేము, కర్కోటకము, (అనగా ఆగాకర) పేము వీనియాకులతో కాచిన కషాయసహితముగ గాని * తర్పణద్రవ్యరససహితముగ గాని, చెఱుకురస సహితముగ గాని, మద్యసహితముగ గాని, వాంతియగుటకై పానము జేయించవలయును. లేక కల్పస్థానమున వమనకల్పాధ్యాయమునందు జెప్పబడియుండు వమనౌషధములనైన నిప్పించవలయును.

## జ్వరితులకు లంఘనావశ్యకత్వము.

కృతేఽకృతే వా వమనే జ్వరీ కుర్యాద్విశోషణమ్,
దోషాణాం సముదీర్ణానాం పాచనాయ శమాయ చ. ౯

వమనకర్మకర్హుడుగనుండు జ్వరితునికి వమనము జేయించినను, లేక వమనమున కనర్హుడుగనుండుటవలన వమనము చేయించకయుండినను, ఆమముతో గూడి ప్రకోపించియుండు వాతాదిదోషములు పాకముజెందుటకును, ఆమరహితముగ ప్రకోపించియుండు వాతాదులు శమించుటకును, లంఘనమవశ్యముగ జేయించవలయును.

---

* తర్పణద్రవ్యమనగా—ద్రాక్ష, దానిమ్మ, ఖర్జూరము, అరటి అనువానిపండ్లు పంచదార, వరిపేలపిండి, తేనె, ఆవునెయ్యి వీని నొకటిగ చేర్చి చేయబడినరసము.

ఆమేన భస్మనేవాగ్నౌ చ్ఛన్నేఽన్నం న విపచ్యతే,
తస్మాదాదోషపచనాజ్జ్వరితానుపవాసయేత్. ౧౦

నిప్పు బూడిదెచే గప్పబడియుండునపుడు దానియందుంచబడిన నీళ్లబియ్యము మొదలగునవి యెటుల పాకము జెందకుండునో అటులనే ఆమదోషముతో గూడిన వాతాదులచే జాఠరాగ్ని గప్పబడియుండునపుడు ఆమాశయంబును జేరి యన్నాదులు పాకంబు జెందనేరవు; కావున అట్టి యామదోషము పాకమగువరకు జ్వరితునికి లంఘనము జేయించవలయును.

### వాతకఫజ్వరమునం దుష్ణోదకపానము.

తృష్ణగల్పాల్పముష్ణాంబు పిబేద్వాతకఫజ్వరే,
తత్కఫం విలయం నీత్వా తృష్ణామాశు నివర్తయేత్. ౧౧
ఉదీర్య చాగ్నిం స్రోతాంసి మృదూకృత్య విశోధయేత్,
లీనపిత్తానిలస్వేదశకృన్మూత్రానులోమనమ్. ౧౨
నిద్రాజాడ్యారుచిహరం ప్రాణానామవలంబనమ్,
విపరీతమతశ్శీతం దోషసంఘాతవర్ధనమ్. ౧౩

వాతకఫజ్వరముగల జ్వరితునికి దప్పిగలిగినచో మిగుల స్వల్పముగ నుష్ణోదకము పానము చేయించవలయును. అట్లు జేయుటచే నాయుష్ణోదకము వాతముచే శోషింపంబడి ఘనీభావమును జెందియుండు పిత్తమునులేక కఫమును గరగునటులంజేసి దప్పిని త్వరితంబుగ నివర్తింపజేయును. మఱియు నది జాఠరాగ్నిని జ్వలింపజేయుటయే గాక స్రోతస్సులకు మృదుత్వమును కలుగజేసి స్రోతోమార్గములను శుద్ధిపరచును. స్రోతస్సులయందు లీనమై బయలువెడలకుండునట్టి పిత్తము, వాతము, చెమట, మలము, మూత్రము వీనిని బయలువెడలించును. నిద్ర, జడత్వము, అరుచి అనువానిని హరింపజేయును. ప్రాణమున కాధారంబుగనుండును. అట్లుగాక శీతోదకము నిప్పించిన పైవికారములను పోకడచకుండుటయే గాక సమస్తదోషములనుగూడ నభివృద్ధిజేయును. (ఇటుల జెప్పుటచే వాతకఫజ్వరమునందు కఫము వాతముచే శోషింపబడి గట్టిగనై విశేషముగ దప్పిని అగ్నిమాంద్యమును స్రోతోమార్గంబులయం దశుద్ధిని కలుగజేసి పిత్తము, వాతము, చెమట, మలమూత్రములు వీనిని బయలువెడలనియ్యక యడ్డగించునని విశదమగుచున్నది.)

### ఉష్ణోదకపాననిషేధము.

ఉష్ణమేవంగుణత్వేఽపి యుంజ్యాన్నైకాంతపిత్తలే,
ఉద్రిక్తపిత్తే దవథుదాహమోహాతిసారిణి. ౧౪

విషమద్యోత్థితే గ్రీష్మే క్షతక్షీణేఽస్రపిత్తిని,

పైనిజెప్పిన ప్రకారము ఉష్ణోదక మనేకగుణములతో గూడియుండినను పిత్తదోషముమాత్రము మిక్కుటముగ బ్రకోపించియుండుజ్వరితునికిని, పిత్తాధిక్యముగల జ్వరితునికిని నేత్రాదిద్వారములనుండి యతితీవ్రమైన యుష్ణము వెడలుట, సర్వాంగ తాపము, భ్రమము, అతిసారముగలవారికిని విషముచేగాని మద్యముచేగాని జనించిన జ్వరముగలవారికిని, ఉరఃక్షతముచే క్షీణించినవారికిని, రక్తపిత్తముగలవారికిని, ఉష్ణోదకపానము జేయింపంజనదు. మఱియును గ్రీష్మకాలంబునం దుష్ణోదకపానము చేయించగూడదు.

## తృష్ణాధిక్యమునందు ఘనాదిశృతశీతాంబుపానము.

ఘనచందనశుంఠ్యంబుపర్పటోశీరసాధితమ్. ౧౫

శీతం తేభ్యో హితం తోయం పాచనం తృడ్జ్వరాపహమ్,

పిత్తాదిజ్వరపీడితులకు విశేషముగ దప్పి గలిగినచో తుంగముస్తెలు, రక్తచందనము, శుంఠి, కురువేరు, పర్పాటకము, వట్టివేరు వీనిని దినుసుకు కర్షప్రమాణము చొప్పున గ్రహించి (1) ప్రస్థముదకములోవైచి అర్ధావశేషముగ కాచి చల్లారినపిదప నిప్పించినయెడ దప్పి, జ్వరము హరించును. జీర్ణకారిగ హితకరముగనుండును. "కర్షం గృహీత్వా ద్రవ్యస్య తోయస్య ప్రస్థమావపేత్, అర్ధావశేషం తద్గ్రాహ్యం తోయపానే త్వయం విధిః" 1. ప్రస్థప్రమాణముగల యుదకములో కర్షప్రమాణము ద్రవ్యములనువైచి అర్ధావశేషముగ కాచి యిప్పించవలయును. ఇదియ యుదకపానంబునందు విధియని తంత్రాంతరమునందు జెప్పబడియున్నది.

## జ్వరమునందు వర్జనీయములు.

ఊష్మా పిత్తాదృతే నాస్తి జ్వరో నాస్త్యూష్మణా వినా. ౧౬

తస్మాత్పిత్తవిరుద్ధాని త్యజేత్పిత్తాధికేఽధికమ్,

స్నానాభ్యంగప్రదేహాంశ్చ పరిశేషం చ లంఘనమ్. ౧౭

పిత్తసంబంధములేకయే ఊష్మము కలుగదు. ఊష్మములేనిదే జ్వరముజనింపదు; కావున సకలజ్వరములయందు పిత్తమునకు విరుద్ధంబులైన యాహారవిహారాదులను వర్జింపవలయును. పిత్తాధికజ్వరమునందు పిత్తవిరుద్ధాహారాదులను విశేషముగ వర్జింపవలయును. మఱియు స్నానము, అభ్యంగము, చందనాద్యనులేపము, సేకము, శుద్ధి మొదలగు 11 విధంబులయిన లంఘనములను జ్వరితుడువర్జింపవలయు. ఉపవాసరూపమయిన లంఘనము జ్వరమువచ్చినతోడనే చేయించవలయును. స్నానాభ్యంగాదులు పిత్తహరంబులుగ నుండినను జ్వరమునందు విరుద్ధంబులగుటంజేసి వర్జనీయంబులు.

## ఆమజ్వరమునందు శూలహర పాననిషేధము.

అజీర్ణ ఇవ శూలఘ్నం సామే తీవ్రరుజి జ్వరే,
న పిబేదౌషధం తద్ధి భూయ ఏవామమావహేత్. ౧౮
ఆమాభిభూతకోష్ఠస్య క్షీరం విషమహేరివ,

ఆమముతోఁగూడియుండు అజీర్ణమునందు మిక్కుటమైన యుపద్రవములుగలిగి యుండినను తన్నివారణార్థము శూలహరమైనయౌషధముల నెట్టుల పానము జేయింపఁ గూడదో అటులనే దారుణమైన యుపద్రవములతోఁ గూడియుండు ఆమజ్వరము నందు ముస్తాపర్పటకాది కషాయాదిరూపమగు నౌషధమును పానము జేయించఁగూడదు. అటుల చేయించినచోఁ నది విశేషముగ ఆమదోషముచే దూషింపబడిన కోష్ఠముగల జ్వరితునికి "విషహారంబైన క్షీరమును పామునకు బానము జేయించిననది మిక్కుటముగ విషమును వృద్ధిజేయుచందంబున" అధికముగ ఆమదోషమునే వృద్ధిజేయును.

## ఉదర్దాదియుపద్రవములుగల జ్వరితునికి స్వేదకర్మ.

సోదర్దపీనసశ్వాసే జంఘాపర్వాస్థిశూలిని. ౧౯
వాతశ్లేష్మాత్మకే స్వేదః ప్రశస్తస్సంప్రవర్తయేత్,
స్వేదమూత్రశకృద్వాతాన్ కుర్యాదగ్నేశ్చ పాటవమ్ ౨౦
స్నేహోక్తమాచారవిధిం సర్వశశ్చానుపాలయేత్,

ఉదర్దము పీనసము శ్వాసము వీనితోఁగూడినదియు, పిక్కలు గణుపులు ఎముకలు అనువానియందు శూలగలదియునగు వాతకఫజ్వరమునందు స్వేదకర్మను జేయించిన హితకరంబుగనుండును. దానివలన చెమట మలమూత్రములు అపానవాతమును బైట వెడలును. జాఠరాగ్నికి దీపనముగూడ కలుగును. మఱియు స్నేహవిధ్యధ్యాయము నందు జెప్పబడిన యాచారవిధులనన్నిటిని జేయుచుండవలయును.

## ఆమమల పాచనంబులు.

లంఘనం స్వేదనం కాలో యవాగ్వాస్తిక్తకో రసః. ౨౧
మలానాం పాచనాని స్యుః యథావస్థం క్రమేణ వా,

ఉపవాసరూపమయిన లంఘనము స్వేదకర్మ కాలము యవాగు (అనగాగంజి) చేదురసముతోఁ గూడియుండు ద్రవ్యోపయోగము అనునవి వేర్వేఱుగ నుండువదియు సంసర్గముతోఁగూడినదియు సన్నిపాతమును జెందినదియునగు ఆమదోషముచే దుష్టంబైన వాతాదులకు ఆయాయవస్థానుసారంబుగ పాచనంబులగును. (అనగా నొకజ్వరావస్థయం దుపవాసరూపమయిన లంఘనము, మఱియొక జ్వరావస్థయందు స్వేదకర్మ, మఱియొక జ్వరావస్థయందు ఆరు దినముల కాలము, మఱియొక జ్వరావస్థయందు

యవాగుపానము, మఱియొకజ్వరావస్థయందు తిక్తరసద్రవ్యోపయోగము, ఇటుల జ్వరావస్థావశంబువలన పైలంఘనస్వేదనాదులు సంసర్గసన్నిపాతాది యుక్తంబుగ ఆమదోషదుష్టంబుగనుండు వాతాదిదోషములకు ఆమపాకమును కలుగజేయుననిభావము. లేకయథాక్రమంబుగ పైలంఘనస్వేదనాదులుఆమదోషదుష్టంబుగ సంసర్గసన్నిపాతాది యుక్తంబుగనుండు వాతాదిదోషములకు పాకమునుకలుగజేయును. అదెట్లనిన; తరుణజ్వరమునందు తొలుత 6, దినంబులపరకు లంఘనస్వేదనములను జేయించుచు పిమ్మట యవాగునిప్పించి తిక్తరసద్రవ్యంబుల నుపయోగింపంజేసిన నాలంఘనాదు లామదోషముచే దూషింపంబడిన వాతాదులకు పాకంబును కలుగజేయును.

## లంఘననిషేధము.

శుద్ధవాతక్షయాగంతుజీర్ణజ్వరిషు లంఘనమ్. ౨౨
నేష్యతే

ఆమదోషాదులచే దూషింపబడకుండు వాతజ్వరము, ధాతుక్షయముచే జనించిన జ్వరము, భూతగ్రహ, విషవాత, అగ్నిసంబంధయుద్ధాదులచే జనించిన జ్వరము జీర్ణజ్వరము వీనియందు లంఘనము చేయింపంజనదు.

## శుద్ధవాతజ్వరాదులకుబృంహణచికిత్స.

తేషు హి హితం శమనం యన్న కర్శనమ్,

శుద్ధవాతజ్వరాదులయందు కొంచెము బృంహణరూపమైన శమనౌషధము నిచ్చిన హితకరంబుగ నుండును.

## అలంఘితలక్షణము.

తత్ర సామజ్వరాకృత్యా జానీయాదవిశోషితమ్. ౨౩
ద్వివిధోపక్రమజ్ఞానమవేక్షేత చ లంఘనే,

పైనుదహరించిన జ్వరములకు లంఘనము జేయించియు ఆమజ్వరమునకు జెప్పియుండు ఉపద్రవాధిక్యము మొదలగు లక్షణములుండిన లంఘనముక్రమముగా జరగలేదనియు, సూత్రస్థానములో ద్వివిధోపక్రమణీయాధ్యాయమున "విమలేంద్రియతా సర్గో మలానా" మిత్యాదిశ్లోకములచే చెప్పబడియుండునటుల యింద్రియములు నిర్మలముగనుండుట, స్వేదమలమూత్రాదులు సక్రమముగ బయటలువెడలుట అనులక్షణములు కలిగియుండిన లంఘనము చక్కగజరిగినదనియు, మిక్కిలి కృశత్వము మొదలగు లక్షణములు కలిగియుండిన లంఘనమధికముగ జేయబడినదనియు నెఱుంగవలయును,

## జ్వరితునికి పేయాద్యుపచారము.

యుక్తం లంఘితలింగైస్తు తం పేయాభిరుపాచరేత్. ౨౮
యథాస్వౌషధసిద్ధాభిర్మండపూర్వాభిరాదితః,
తస్యాగ్నిర్దీప్యతే తాభిస్సమిద్భిరివ పావకః. ౨౯
షడహం వా మృదుత్వం వా జ్వరో యావదవాప్నుయాత్,

జ్వరితునికి లంఘనలక్షణములు చక్కగ కలిగియుండిన వానికి ప్రత్యేకసంసర్గసన్నిపాతావస్థలను జెందియుండు వాతాది దోషములకు దగిన శుంఠ్యాద్యౌషధములతో సిద్ధముచేయబడి తేటగనుండు గంజిమొదలగువానిని ఆరుదినములవరకుగాని జ్వరము మృదుత్వమును జెందువరకుగాని యిప్పించవలయును. అటుల జేసినచో "సమిధలచే బాహ్యాగ్ని జ్వలింపుమాడ్కి" పేయమొదలగువానిచే జ్వరితునిజాఠరాగ్ని దీపనము జెందును. "తాశ్చ భేషజసంయోగాత్ లఘుత్వాదగ్నిదీపకాః, స్వేదనాద్ద్రవోష్ణత్వాత్ మృదుత్వాత్తృట్ప్రశాన్తయే. ఆహారభావాత్ప్రాణాయ సరత్వాల్లాఘవాయచ, జ్వరఘ్న్యో జ్వరసాత్మ్యత్వాత్ తస్మాత్పేయాభిరాదితః. జ్వరానుపాచరేద్ధీమాన్" పేయమొదలగు గంజులలో శొంఠి పిప్పల్యాద్యౌషధములు జేరియుండుటవలనను తేటగనుండుటవలనను అవి జాఠరాగ్నికి దీపనమును కలుగజేయును. మఱియు నా పేయద్రవముగ ఉష్ణముగ మృదువుగ నుండుటవలన దప్పిని శమింపజేయును. ఆహారరూపముగ నుండుటవలన శరీరమునకు బలమును కలుగజేయును. శీఘ్రముగ శరీరమునందంతట వ్యాపించునట్టి స్వభావముకలది యగుటవలన శరీరమునకు లఘుత్వమును కలుగజేసి జ్వరమును బోగొట్టును. కావున బుద్ధిమంతుడగు వైద్యుడు తొలుత పేయమొదలగువానిని జ్వరితునికి పానము చేయించవలయును. అని చరకాచార్యుడు చెప్పియున్నాడు. "పిబేదచ్ఛాం సుసిద్ధాం వా స్వాం స్వాం పేయాం నవజ్వరే" వాతాదిదోషములకు యుక్తమైన ఔషధములతో సిద్ధముచేయబడి తేటగనుండు పేయను నూతనజ్వరమునందు జ్వరితుని కిప్పింపవలయును అని ఖరనాదుడును వచించియున్నాడు "షడహం వా" అని యీ గ్రంథకర్త జెప్పియుండుటవలన ఆరుదినములలోపల జ్వరము శాంతముజెందియున్నచో దోషదూష్యాద్యనుగుణముగా అన్నాదులనుగూడ నిప్పింపవలయుననియు "మృదుత్వంవా" అని చెప్పియుండుటవలన ఆరుదినములుకడచియు జ్వరము శమింపకయుండిన జ్వరము మృదుత్వముజెందువరకు పేయమొదలగు గంజి నిప్పింపవలయుననియు గ్రంథకర్తయభిప్రాయము. ఆరు దినములలో తఱుచుగ జ్వరము మృదుత్వముజెందియుండినను జ్వరితునికి ఆరు దినములవరకు పేయ నిప్పింపవలయునని దెలియబరచుటకై "షడహం వా" అని జెప్పియున్నాడని కొంద

రాచార్యులు వ్యాఖ్యానము జేసియున్నారు. జ్వరము మృదుత్వమును జెందుటకై కాలబాహుళ్యము కారణమని తెలియపరచుటకై "షడహం వా" అని గ్రంథకర్త చెప్పియున్నవాడని మఱికొందరాచార్యులు జెప్పుచున్నారు.

## పేయాపానక్రమము.

ప్రాగ్లాజపేయాం సుజరాం సశుంఠీధాన్యపిప్పలీమ్. ౨౬
ససైంధవాం తథామ్లార్థీ తాం పిబేత్సహదాడిమామ్,

శుంఠి దనియాలు పిప్పళ్లు వీనిని చేర్చి కాచబడినదియు శీఘ్రముగ జీర్ణమును జెందునదియునైన లాజ పేయయందు (అనగా కొంచెముగ వరిపేలాలను చేర్చి తేటగా కాచబడిన గంజియందు) కొంచెము సైంధవలవణమును జేర్చి జ్వరితునికి తొలుత నిప్పింపవలయును. జ్వరితుడు పుల్లనిరసముగల యాహారపదార్థములను గోరినచో పైగంజిలో దానిమ్మపండురసమును జేర్చి యిప్పించవలయును. ఇచ్చట జీర్ణమగునంత పరిమితికల లాజలను శుంఠిని దనియాలను పిప్పళ్లను ఒకటిగగూర్చి పేయావిధానప్రకారము పక్వము జేసి పిదప సైంధవలవణమును కొద్దిగ జేర్చి ఇప్పించవలెనని యర్థము. ఈయర్థము "ససైంధవాం"అని వేరుగ చెప్పుటచే దెలిసెడి. ఈయర్థమునే చరకమున—"లాజపేయాం చ సుజరాం పిప్పలీనాగరైశ్శృతామ్" అని స్పష్టముగ జెప్పెను. మరియు 'ససైంధవాం' అనుచోట సశబ్దమునకు ఇంచుక యర్థము. కావున సైంధవలవణమును కొంచెముగ గూర్పనగునని యర్థము.

## పిత్తాధికజ్వరితునికి పేయ.

సృష్టవిడ్బహుపిత్తో వా సశుంఠీమాక్షికాం హిమామ్. ౨౭

జ్వరితుడు మలము విసర్జించినవాడుగ లేక పిత్తాధిక్యముగలవాడుగనుండిన నట్టివానికి లాజపేయ యను గంజిలో కొంచెము శొంఠి, తేనె, సైంధవలవణము వీనిని చేర్చి పానము జేయించవలయును.

## పొత్తికడుపు మొదలగువానియందు శూలగలజ్వరితునికి పేయాక్రమము.

వస్తిపార్శ్వశిరశ్శూలీ వ్యాఘ్రీగోక్షురసాధితామ్,

పొత్తికడుపు ప్రక్కలు తల వీనియందు నొప్పితోగూడియుండు జ్వరితునికి వాకుడు పల్లేరు అనువానిని సమముగచేర్చి కాచబడిన లాజపేయను సైంధవలవణసహితముగ పానము చేయించవలయును.

## జ్వరాతిసారికి పేయాక్రమము.

పృశ్నిపర్ణీబలాబిల్వనాగరోత్పలధాన్యకైః. ౨౮
సిద్ధాం జ్వరాతిసార్యమ్లాం పేయాం దీపనపాచనీమ్,

జ్వరాతిసారికి కోలపొన్న ముత్తవపులగము (చిట్టాముట్టి) మారేడు శొంఠి నల్ల కలువ ధనియాలు వీనిని సమభాగముగ జేర్చి సిద్ధముచేయబడినదియు అమ్లరసముగలదియు అగ్ని దీపనమును కలుగజేయునదియు ఆమదోషమును పాకముచేయునదియునైన పేయను పానముజేయించవలయును.

### హిక్కాదులుగల జ్వరితునికి పేయాక్రమము.

హ్రస్వేన పంచమూలేన హిక్కారుక్శ్వాసకాసవాన్. ౨౯

ఎక్కిళ్లు శూల శ్వాసము కాస వీనితోగూడియుండు జ్వరితునికి * లఘు పంచమూలములతో సిద్ధముజేయబడిన లాజపేయను సైంధవలవణసహితముగ పానము జేయించవలయును.

### కఫపీడితజ్వరితునికి పేయాక్రమము.

పంచమూలేన మహతా కఫార్తో యవసాధితామ్,

కఫపీడితుడైన జ్వరితునికి † బృహత్పంచమూలములతో సిద్ధముచేయబడిన యవలగంజిని సైంధవలవణ సహితముగ పానముచేయించవలయును.

### మలబంధముగలజ్వరితునికి పేయాక్రమము.

విబద్ధవర్చాస్సయవాం పిప్పల్యామలకైః శృతామ్. ౩౦
యవాగూం సర్పిషా భ్రష్టాం మలదోషానులోమనీమ్,

మలబంధముగల జ్వరితునికి పిప్పళ్లు ఉసిరికెవరుగు అనువానితో సిద్ధము జేయబడినదియు, నేతితో సంస్కరింపబడినదియు, మలమూత్రాదులు వాతాదిదోషములు వీనిని తమతమ మార్గములయందు ప్రవర్తింపజేయునదియునైన యవలగంజిని సైంధవ లవణసహితముగ పానముజేయించవలయును.

### బద్ధకోష్ఠజ్వరితునికి పేయాక్రమము.

చవికాపిప్పలీమూలద్రాక్షామలకనాగరైః. ౩౧
కోష్ఠే విబద్ధే సరుజి

కోష్ఠము—అనగా దోషస్థానము బంధింపబడి నొప్పితోగూడియుండు జ్వరితునికి చవ్యము మోడి ద్రాక్ష ఉసిరికెవరుగు శొంఠి వీనితో సిద్ధముజేయబడిన పేయను సైంధవలవణసహితముగ పానముజేయించవలయును.

---

* లఘుపంచమూలములు అనగా— పల్లేరు, ముయ్యాకుపొన్న, కోలపొన్న, ములక, వాకుడు.

† బృహత్పంచమూలములు అనగా—మారేడు, తక్కాలి, గుమ్ముడు, దుంది లము, కలిగొట్టు.

## పరికర్తనముగలజ్వరితునికి పేయాక్రమము.

పిబేత్తు పరికర్తిని,
కోలవృక్షామ్లకలశీధావనీశ్రీఫలైః కృతామ్. ౩౨

పరికర్తనము—అనగా కత్తిరిచే కత్తిరింపబడుచున్నటుల కోష్ఠమునందు నొప్పితోఁగూడియుండు జ్వరితునికి రేగుపండ్లు పుల్లప్రబ్బలి నక్కతోకపొన్న కోలపొన్న మారేడుపండు వీనితో సిద్ధము జేయబడిన పేయను సైంధవలవణసహితముగ పానము జేయించవలయును.

## నిద్రాదులులేకుండుజ్వరితునికి పేయాక్రమము.

అస్వేదనిద్రస్తృష్ణార్తస్సితామలకనాగరైః,

చెమట నిద్ర లేకుండువాడును దప్పిచే పీడింపబడినవాడునునగు జ్వరితునికి శర్కర ఉసిరికవరుగు శొంఠి వీనితో కాచబడిన పేయను పానము జేయించవలయును.

## దప్పికగలజ్వరితునికి పేయాక్రమము.

సితాబదరమృద్వీకాసారిబాముస్తచందనైః. ౩౩
తృష్ణాచ్ఛర్దిపరో దాహజ్వరఘ్నీం క్షౌద్రసంయుతామ్,

దప్పి వాంతిగలజ్వరితునికి శర్కర రేగుపండ్లు ద్రాక్షపండు సుగంధిపాల తుంగముస్తెలు రక్తచందనము వీనితో సిద్ధము జేయబడినదియును తాపమును జ్వరమును పోఁగొట్టునదియునైన పేయను తేనెతోఁడ పానము జేయించవలయును.

## జ్వరితునికి మాంసరసాదిక్రమము.

కుర్యాత్పేయౌషధై రేవ రసయూషాదికానపి. ౩౪

పై పేయకు జెప్పియుండు ఔషధములతోఁడ మాంసరసము పెసరకట్టు మొదలగువానిని సిద్ధము జేసి జ్వరితునికిప్పించవలయును. "కుర్యాత్పేయౌషధై రేవ రసయూషాదికానపి" అని పైయర్థమునే సంగ్రహకారుడును జెప్పియున్నాడు. "పేయాయూషరసాద్యేషు రసాలాపానకాదిషు, ద్రవ్యమాత్రాం ప్రయుంజీత లోకసిద్ధాం యథార్థతః." ఏ రోగికి యెంతపరిమాణముగల ద్రవ్యములతో పేయాదులను పక్వము జేసిన యుక్తంబుగనుండునో ఆ రోగికంతపరిమాణముగల ద్రవ్యములతో పేయ పెసరకట్టు మొదలగు కట్టులు * రసాలపానకము ఉష్ణోదకము వ్యంజనము వీనిని సిద్ధము జేయవలయుననని తంత్రాంతరమునందు జెప్పబడియున్నది."బహుద్రవ్యో ఘనః క్వాథః

* పెరుగును చేతితో చిలికి దానిలో మిరియములు, శుంఠి, లవణము, శర్కర వీనిని చేర్చి సిద్ధముచేయబడినది రసాల యనబడును.

స్వచ్ఛమల్పౌషధం జలమ్." ఓషధు లధికముగ జేర్చి చిక్కగ కాచబడునది కషాయ మని జెప్పబడును. కొంచెముగ నోషధులను జేర్చి తేటగ కాచబడినది ఉదకమని చెప్ప బడును. కషాయోదకములకు పాక మొక్కటేవిధముగ నుండినను వానిలో జేర్చబడు ఓషధులపరిమాణభేదమువలన కషాయము ఉదకము అని వెవ్వేరుగ జెప్పబడెను. కావున పేయయనుగంజి పెసరకట్టు మొదలగునవి మాంసరసములు పానార్థమైన యుదకము వీనియందు ఓషధులను కొంచెముగా జేర్చి పక్వము జేయవలయునని కొందరాచార్యులు వచింపుచున్నారు. జ్వరరోగముగలవారికి పేయలు కట్టులు మాంసరసములు అనువానిని తేటగా పక్వము జేసి యిప్పించవలయును. గట్టిగానుండిన అగ్నిమాంద్యమును కలుగ జేయును గావున జ్వరమునందధిక ఓషధులతో చిక్కగ కాచబడిన కషాయము నిప్పింప జనదని తంత్రకారుడు తిక్తరసద్రవ్య కషాయములను నిషేధించియున్నవాడు.

పేయానిషిద్ధులు.

మదోత్థ్యద్భవే మద్యనిత్యే పిత్తస్థానగతే కఫే,
గ్రీష్మే తయోర్వాధికయోః తృట్ఛర్ద్దిదాహపీడితే. ౩౫
ఊర్ధ్వం ప్రవృత్తే రక్తే చ పేయాం నేచ్ఛంతి,

మద్యపానమువలన జనించిన జ్వరమునందును, నిత్యము మద్యపానముజేయు వానికిని, కఫము పిత్తస్థానమును జేరి యుండునపుడును, గ్రీష్మకాలమునందును, పిత్త కఫము లధికముగనుండునపుడును దప్పి, వాంతి, సర్వాంగతాపము వీనిచే బీడింపబడు జ్వరితునికిని, ఊర్ధ్వమార్గముగ రక్తస్రావముగల జ్వరితునికిని పేయను నిప్పించగూడదని మహర్షులు వక్కాణింపుచున్నారు.

మద్యజాదిజ్వరములయందు లాజసక్తుపానము.

తేషు తు,
జ్వరాపహైః ఫలరసై రద్భిర్వా లాజతర్పణమ్. ౩౬
పిబేత్సశర్కరాక్షౌద్రం

పై మద్యపానజజ్వరాదులయందు జ్వరమును హరించునట్టి ద్రాక్ష ఉసిరికె మొదలగు పండ్లరసములలోగాని పై పండ్ల కషాయములలోగాని కాచి చల్లార్చిన యుదకములోగాని వరిపేలాలసత్తును—అనగా మెత్తగనుండు వరిపేలపిండిని కలిపి తేనె శర్కరను జేర్చి పానము జేయించవలయును.

పేయాదిపానానంతరకర్తవ్యము.

తతో జీర్ణే చ తర్పణే,
యవాగ్వా మోదనం క్షుద్వానశ్నీయాద్ఘృష్టతండులమ్. ౩౭

దకలావణికైర్యూషై రసైర్వా ముద్గలావజైః,

వరిపేలాల సత్తుపిండిగాని గంజిగాని త్రాగి యది జీర్ణమైనతర్వాత జ్వరితునికి మరల యాకలిగలిగియున్న రెండవతూరి భోజనము చేయుసమయమునందు పెసరకట్టు ఉలవకట్టు మొదలగువానితోగాని, లావుకపిట్టమాంసము అధికముగను పెసరపప్పు స్వల్పముగను చేర్చి పక్వము చేయబడినమాంసరసములోగాని వేయించినబియ్యాపన్నమును యిప్పించవలయును. "నాతిమాంసాస్తనురసా దకలావణికాః స్మృతాః, అల్పమాంస పటుస్నేహా దకలావణికాః స్మృతాః." మాంసములను జేర్చి తేటగ కాచబడినది దకలావణికమని కొందరాచార్యులును, స్వల్పముగ మాంసముచేర్చి పక్వముచేయబడి ఉప్పుకారము నెయ్యి మొదలగువానితో సంస్కరింపబడినది దకలావణికమని మఱి కొందరాచార్యులును వచింపుచున్నారు.

ఆరుదినములవరకు పేయాదిపాననియమము.

ఇత్యయం షడహో నేయో బలం దోషం చ రక్షతా. ౩౮

వైద్యశ్రేష్ఠుండు జ్వరితునియొక్క శరీరబలము సంసర్గ సన్నిపాతాద్యవస్థలను జెందియుండు వాతాదిదోషములు వీనిని రక్షింపుచు ఆరు దినములవరకు పైన చెప్పియుండు పేయాది పానక్రమంబును తొలుత జేయించవలయును. అనగా ఆమ దుష్టంబైన వాతాదిదోషములు వెవ్వేరుగ, లేక సంసర్గావస్థను జెందినదిగ, లేక సన్నిపాతావస్థను జెందినదిగ నున్నదా? కృచ్ఛ్రసాధ్యముగగాని యున్నదా? అని తెలిసి కొని ఈయవస్థయందు రోగిశరీరబలరక్షణార్థమై సంతర్పణచికిత్సలంజేసిన ఆమదోషము వృద్ధిజెందును. అది శమించుటకై అపతర్పణచికిత్సలంజేసిన రోగికి బలహాని కలుగును. కావున నానాయవస్థానుగుణముగ మిగుల జాగరూకతతో సంతర్పణాపతర్పణ చికిత్సలంజేయుచు తొలుత ఆరు దినములవరకు నానారోగములకుదగిన ఓషధులతో సిద్ధముచేయబడిన పేయ మొదలగువానిని పానముచేయించు చుండవలయునని భావము.

పాచనకషాయోపయోగము.

తతః పక్వేషు దోషేషు లంఘనాద్యైః ప్రశస్యతే,
కషాయో దోషశేషస్య పాచనశ్శమనోఽథ వా. ౩౯

జ్వరమును కలుగజేయునట్టి ఆమవాతాదిదోషములను పాకము చేయునదిగ ఆయా కాలమున నుచితముగనుండు లంఘనాదులచే ఆమదుష్టవాతాది దోషములు తఱుచుగా పాకము జెందినపిదప ఆరు దినములకు పైన దోషశేషమును పాకము జేయు

ముస్తాపర్పటకాది కషాయములను అయిదు విధములైన కళింగాది శమనకషాయముం నిప్పించిన హితము కలుగును.

"ఘనచందనశుంఠ్యంబు పర్పటోశీరసాధితమ్, శీతం తేభ్యో హితం తోయం పాచనం తృడ్జ్వరాపహమ్." అను శ్లోకముచే జ్వరితునికి ప్రథమదినమున ముస్తాది తిక్తరసకషాయ మిప్పించవలయునని వచించి మఱలనిచట ఆరు దినములకు పైన ముస్తాపర్పటకాది పాచనకషాయ మిప్పించునటుల తంత్రకారుడు జెప్పినది యసంగతమను శంక గలుగును. అయినను జ్వరితునికి విశేషముగ దప్పి కలిగినయెడల శీతజలక్షీరాదుల నిప్పించిన నవి విశేషముగ జ్వరమును వృద్ధిజేయును గావున నట్టిసమయంబున పానార్థము స్వల్పముగ ముస్తాదితిక్తరస ద్రవ్యములను చేర్చి కాచబడిన యుదక మిప్పించవలయునని గ్రంథకర్త యభిప్రాయంబుగాని తొలిదినమునందే ముస్తాపర్పటకాది కషాయ మిప్పించవలయునని యభిప్రాయము కానేరదు. మఱియు మిగుల దప్పితోగూడి యుండు జ్వరితునికి ఓషధుల నధికముగ జేర్చి చిక్కగా కాచబడినజలము నిప్పించిన దానిని పానము చేయుట కష్టంబుగావున కొన్ని ఓషధులను స్వల్పముగా జేర్చి లేటగ కాచబడిన యుదక మిప్పించవలయునని తంత్రకారుడు చెప్పియున్నాడు.

## పిత్తకఫజ్వరములకు తిక్తాదికషాయము.

**తిక్తః పిత్తే విశేషేణ ప్రయోజ్యః కటుకః కఫే,**

పిత్తదోషజనిత జ్వరమునందు తిక్తరసముగల యోషధులతో సిద్ధము జేయబడిన కషాయమును విశేషముగ నిప్పించవలయును. కఫజ్వరమునందు కటురసముగల వియు జ్వరమునుపోగొట్టునవియునైన యోషధులం జేర్చి కాచబడినకషాయము నిప్పించవలయును. "తిక్తస్స్వయమరోచిష్ణురరుచిం కృమితృడ్విషమ్, కుష్ఠమూర్ఛాజ్వరోత్క్లేదదాహపిత్తకఫాన్ జయేత్." అని తంత్రాంతరమునందును "తిక్తో రసస్స్వయమరోచిష్ణురరోచకఘ్నో విషఘ్నః క్రిమిఘ్నో మూర్ఛాదాహప్రశమన స్తృష్ణాప్రశమన స్త్వఙ్మాంసయోః స్థిరీకరణో జ్వరఘ్నః" అని చరకాచార్యుడును తిక్తరసద్రవ్యము స్వభావముగనే జ్వరమును పోగొట్టుశక్తిగలదని చెప్పియుండుటవలన వాతశ్లేష్మజ్వరములయందును తిక్తరసద్రవ్యకషాయమును యుక్తిచే నిప్పించవలయును. పిత్తజ్వరమునందు మాత్రము విశేషముగ తిక్తరసద్రవ్యకషాయము నిప్పించవలయునని తెలియపరచుటకై "పిత్తేవిశేషేణ" అని తంత్రకారుడు మూలమునందు జెప్పియున్నాడు.

## కషాయరసద్రవ్యకషాయనిషేధము.

**పిత్తశ్లేష్మహరత్వేఽపి కషాయస్తు న శస్యతే. ౪౦**
**నవజ్వరే మలస్తంభాత్కషాయో విషమజ్వరమ్,**

కురుతేఽరుచిహృల్లాసహిధ్మాధ్మానాదికానపి. ౪౧

కషాయరసముతోఁగూడియుండు ద్రవ్యములతో సిద్ధము చేయబడిన కషాయము పిత్తశ్లేష్మములను పోఁగొట్టునదిగ నుండినను దానిని తరుణజ్వరమునం దిప్పించంజనదు. అటుల నిప్పించినచో కషాయరసము మలబంధకారియగుటవలన నది సతతకము మొదలగు విషమజ్వరములు అరుచి హృల్లాసము ఎక్కిళ్లు కడుపుబ్బరము మొదలగువానిని కలుగజేయును. "యః కషాయకషాయస్తు స వర్జ్యస్తరుణజ్వరే, న తు కల్పనముద్దిశ్య కషాయ ప్రతిషిధ్యతే." తరుణజ్వరమునందు కషాయరస ద్రవ్యకషాయము నిప్పించుట యుక్తంబుగాదని చరకాచార్యుఁడును జెప్పియున్నాఁడు.

మతాంతరమునం దౌషధప్రయోగకాలము.

సప్తాహాదౌషధం కేచిదాహురన్యే దశాహతః,
కేచిల్లఘ్వన్నభుక్తస్య యోజ్యమామోల్బణేన తు ౪౨

జ్వరహరములైన ముస్తాపర్పటకాది కషాయాద్యౌషధములను జ్వరితునికి ౭-వ దినమునం దిప్పించవలయునని కొందరాచార్యులును, పది దినములకుపైన నిప్పించవలయునని మఱికొందరాచార్యులును, మండము పేయ మొదలగు లఘ్వాహారములను భుజించియుండువానికి నిప్పించవలయునని మఱికొందరాచార్యులును వచించుచున్నారు. ఆమదోషాధిక్యముతోఁగూడియుండు జ్వరితునికి 6, 7, 10 దినములకు పైనను జ్వరహరౌషధముల నిప్పించంజనదు.

తీవ్రజ్వరమునం దౌషధనిషేధకారణము.

తీవ్రజ్వరపరీతస్య దోషవేగోదయే యతః,
దోషేఽథవాతినిచితే తంద్రాస్తైమిత్యకారిణి ౪౩
అపచ్యమానం భైషజ్యం భూయో జ్వలయతి జ్వరమ్,

తీవ్రజ్వరముచే బీడింపబడియుండువానికి ఆమాధిక్యముగల వాతాదిదోషములు మిగులవేగముతో గూడియుండునపుడును లేక తంద్రను స్తబ్ధత్వమును కలుగజేయునట్టి దుష్టవాతాదిదోషములు వృద్ధిఁజెందియుండునపుడును జ్వరహరములైన ముస్తాపర్పటకాది కషాయాద్యౌషధముల నిప్పించిన నవి ఆమదోషముచే గప్పబడియుండు జాఠరాగ్నిచే జీర్ణింపబడక మఱల విశేషముగ జ్వరమును వృద్ధిజేయునుగాని శమింపజేయదు. కావున ఆమదోషాధిక్యముతోఁగూడిన జ్వరమునందు 6, 7 లేక 10, దినములకుపైనను జ్వరహరౌషధముల నిప్పించంజనదు.

ఔషధప్రయోగయుక్తకాలము.

మృదుజ్వరో లఘుర్దేహశ్చలితాశ్చ మలా యదా. ౪౪

అచిరజ్వరితస్యాపి భేషజం కారయేత్తదా,

జ్వరితుని కెపుడు జ్వరోపద్రవము మృదువుగను దేహము చులకనగను మల మూత్రాదులు చక్కఁగ వెడలుచునుండునో అపుడును, ఆరు దినములకు మించనిజ్వరము గలవానికిని జ్వరహరకషాయాద్యౌషధముల నిప్పించవచ్చును.

ముస్తాదిపాచన కషాయములు.

ముస్తయా పర్పటం యుక్తం శుంఠ్యా దుఃస్పర్శయాపి వా. ౪౫
పాక్యం శీతకషాయం వా పాఠోశీరం సవాలకమ్,
పిబేత్తద్వచ్ఛ భూనింబగుడూచీముస్తనాగరమ్. ౪౬
యథాయోగమిమే యోజ్యాః కషాయా దోషపాచనాః,
జ్వరారోచకతృష్ణాస్యవైరస్యాపక్తినాశనాః ౪౭

తుంగముస్తలతోగాని శుంఠితోగాని పిన్నరేగటి దూలగోవెలతోగాని పర్పాటకముచు సమముగ చేర్చి కాచబడినకషాయముచుగాని లేక శీతకషాయమునుగాని విషబొద్ది, వట్టివేరు, కురువేరు వీనిని చేర్చి కాచబడినకషాయమును లేక శీతకషాయమునుగాని, నేలవేము తిప్పతీగె తుంగముస్తలు శుంఠి వీనితో కాచబడిన కషాయమును లేక శీతకషాయమునుగాని ఆ యా యోగానుసారముగ నిప్పించవలయును:— అనగా ఏ జ్వరమునందు పైకషాయములలో నేదియిప్పించిన యుక్తంబుగనుండునో యా కషాయము నా జ్వరమునం దిప్పించవలయును. అటుల నిప్పించిన పైకషాయములు అపక్వముగనుండు ఆమదోషమును పాకముజేయును. జ్వరము అరోచకము దప్పి నోటియందు విరసత్వము అజీర్ణము మొదలగువానిని నశింపజేయును. పైకషాయములు ఆమదోషముచు పాకముజేయుటవలన నవి పాచనకషాయములనబడును. "ప్రయుక్తం పాచయేదామం యత్తత్పాచనముచ్యతే," దేని పానముచే ఆమదోషము పాకముజెందునో యదియ పాచనమనబడునని తంత్రాంతరమునందు చెప్పబడియున్నది. జ్వరహారములైన సర్వౌషధులలో తుంగముస్తలు, పర్పాటకము మిగుల శ్రేష్ఠంబులని తెలియపరచుటకై "ముస్తయా పర్పటం" అని తొలుత మూలమునందు తంత్రకారుడు వచించియున్నాడు.

కళింగకాదిశమనకషాయములు.

కళింగకాః పటోలస్య పత్రం కటుకరోహిణీ. ౪౮
పటోలం సారిబా ముస్తా పాఠా కటుకరోహిణీ,
పటోలనింబత్రిఫలామృద్వీకాముస్తవత్సకాః. ౪౯

కిరాతతిక్తమమృతా చందనం విశ్వభేషజమ్,
ధాత్రీముస్తామృతాక్షౌద్రమర్ధశ్లోకసమాపనాః ౫౦
పంచైతే సంతతాదీనాం పంచానాం శమనా మతాః,

కొడిసెపాల చేదుపొట్లాకు కటుకరోహిణి వీనిని సమభాగములుగ చేర్చి కాచబడిన కషాయము 1, చేదుపొట్ల సుగంధిపాల తుంగముస్తలు విషబొద్ది కటుకరోహిణి వీనిని సమభాగములుగ చేర్చి కాచబడినకషాయము 2, చేదుపొట్ల వేము త్రిఫలములు ద్రాక్ష తుంగముస్తలు కొడిసెపాల వీనిని చేర్చి సిద్ధముచేయబడినకషాయము 3, నేలవేము తిప్పతీగె రక్తచందనము శుంఠి వీనిని చేర్చి కాచబడినకషాయము 4, ఉసిరిక తుంగముస్తలు తిప్పతీగె వీనితో సిద్ధముచేయబడి తేనెతో చేర్చబడినకషాయము 5, ఈ కషాయములు యథాక్రమముగ సతతసంతతాది 5 విధంబులైన విషమజ్వరంబులను శమింపజేయును. జ్వరాద్యుపద్రవములను శమింపజేయుటవలన నవి శమనకషాయంబులనబడును. "పిత్తాదిజిన్నిరామస్య యస్స్యాత్తచ్ఛమనం మతమ్," ఆమదోషములేనివానికి పిత్తాదుల నెద్ది శమింపజేయునో యది శమనౌషధమనబడునని తంత్రాంతరమునందును జెప్పబడియున్నది.

## వాతజ్వరమునందు పాచనకషాయములు.

దుఃాలభామృతాముస్తా నాగరం వాతజే జ్వరే. ౫౧
అథవా పిప్పలీమూలగుడూచీవిశ్వభేషజమ్,
కనీయః పంచమూలం చ

చిన్నరేగటి దూలగోవిల తిప్పతీగె తుంగముస్తలు శుంఠి వీనిని సమభాగములుగ చేర్చి కాచబడిన కషాయము, లేక మోడి తిప్పతీగె శొంఠి వీనితో సిద్ధముచేయబడిన కషాయము, హ్రస్వపంచమూలముల కషాయము—(అనగా వ్రాకుడు పెద్దములకముయ్యాకుపొన్న కోలపొన్న పల్లేరు వీనిని సమముగ చేర్చి కాచబడినకషాయము) వీనిని వాతజ్వరమునం దిప్పించవలయును.

## పిత్తజ్వరమునందు పాచనకషాయము.

పిత్తే శర్కరయా ఘనమ్ ౫౨
కటుకా చేతి సక్షౌద్రం ముస్తాపర్పటకం తథా,
సధన్వయాసభూనింబం

పిత్తజ్వరమునందు కొడిసెవిత్తులు తుంగముస్తలు కటుకరోహిణి వీనిని సమభాగములుగజేర్చి కాచబడినకషాయమును తేనెసహితముగ నిప్పించవలయును. మఱియు

తుంగముస్తలు పర్పాటకము దురదగొండి నేలవేము వీనితో కాచబడినకషాయము నిప్పించిన పిత్తజ్వరము హరించును.

కఫజజ్వరమునందు పాచనకషాయము.

వత్సకాద్యో గణః కఫే. ౪౩

అథవా వృషగాంగేయీ శృంగబేరదురాలభాః,

కఫజ్వరమునందు వత్సకాదిగణకషాయము—(అనగా కొడిసెపాల చాగ గంటుభారంగి మిరియములు కటుకరోహిణి తెల్లఅతివస ఏలకలు చిరుబొద్ది బ్రహ్మ జెముడు తెల్లజీలకఱ్ఱ * పెద్దమ్రానుపసుపు ఓమము తెల్లఆవాలు వస జీలకఱ్ఱ ఇంగువ వాయువిడంగములు వాయింట పిప్పళ్లు మోడి చవ్యము శొంఠి చిత్రమూలము వీనిని సమముగచేర్చి కాచబడిన కషాయము)నుగాని, అడ్డసరము గాంగేయి అనగా— భద్రముస్తలు అల్లము దూలగొండి వీనిని సమభాగములుగచేర్చి కాచబడినకషాయ మునుగాని యిప్పించవలయును.

వాతశ్లేష్మజ్వరమునందు దీపనాదికషాయము.

రుగ్విబంధానిలశ్లేష్మయుక్తే దీపనపాచనమ్. ౪౪

అభయాపిప్పలీమూలశమ్యాకకటుకాఘనమ్,

శూల మలబంధము వాతశ్లేష్మము వీనితోగూడియుండు జ్వరమునందు కర క్కాయ, మోడి, రేల, కటుకరోహిణి, తుంగముస్తలు వీనిని సమముగచేర్చికాచ బడిన కషాయమునిప్పించినచో జఠరాగ్నిదీపించును మలముల పచింపజేయును.

వాతపిత్తజ్వరమునకు ద్రాక్షాదిగణఫాంటము.

ద్రాక్షామధూకమధుకం లోధ్రకాశ్మర్యసారిబాః. ౪౫

ముస్తామలకహ్రీబేరపద్మకేసరపద్మకమ్,

మృణాళచందనోశీరనీలోత్పలపరూషకమ్. ౪౬

ఫాంటో హిమో వా ద్రాక్షాదిర్జాతీకుసుమవాసితః,

యుక్తో మధుసితాలాజైర్జయత్యనిలపిత్తజమ్ ౪౭

జ్వరం మదాత్యయం ఛర్దిర్మూర్ఛాదాహం శ్రమం భ్రమమ్,

ఊర్ధ్వగం రక్తపిత్తం చ పిపాసాం కామలామపి. ౪౮

ద్రాక్షఇప్పపువ్వు అతిమధురము. లొద్దుగ గుమ్ముడు సుగంధిపాల తుంగముస్తలు ఉసిరిక కురువేరు తామరకింజల్కములు పద్మకము తామరతూండ్లు రక్తచందనము వట్టివేరు నల్లకలువ పేరితపండు వీనిని సమముగచేర్చి కాచబడిన ఫాంటమునుగాని

* పెద్దమ్రానుపసుపు అనగా—మంధిలపుపసుపు యని కొందఱుచెప్పుచున్నారు.

పైద్రవ్యముల శీతకషాయమునుగాని జాజిపూలతో వాసనకలుగునట్లుచేసి తేనె పంచదార వరిపేలాలు వీనితోఁగూర్చి యిప్పించిన వాతపిత్తజ్వరము మదాత్యయము వాంతి మూర్ఛ సర్వాంగతాపము బడలిక భ్రమ రక్తపిత్తము దప్పి కామిల వీనిని హరించును.

### జ్వరహర కషాయము.

పాచయేత్కటుకాం పిష్ట్వా కర్పరేఽభినవే శుచౌ,
నిష్పీడితో ఘృతయుతస్తద్రసో జ్వరదాహజిత్. ౫౯

కటుకరోహిణి నుదకముతోనూరి పరిశుభ్రమైన క్రొత్తకుండ పెంకులో బోసి అగ్నియందు పాకముజేసి వడియగట్టి దానిని ఘృతముతోఁడగలిపి యిప్పించిన జ్వరము సర్వాంగతాపము హరించును.

### వాతశ్లేష్మజ్వరమునందు వచాదికషాయము,

కఫవాతే వచాతిక్తాపాఠారగ్వధవత్సకాః,
పిప్పలీచూర్ణయుక్తో వా క్వాథశ్ఛిన్నోద్భవోద్భవః. ౬౦

వాతశ్లేష్మ జ్వరమునందు వస కటుకరోహిణి * చిరుబొద్ది రేల కొడిసెపాల వీనిని సమముగజేర్చి కాచిన కషాయమునుగాని లేక పిప్పళ్లచూర్ణమును తిప్పతీగె కషాయములో గలిపిగాని యిప్పించవలయును.

### వాతశ్లేష్మజ్వరమునకు వ్యాఘ్ర్యాదికషాయము.

వ్యాఘ్రీశుంఠ్యమృతాక్వాథః పిప్పలీచూర్ణసంయుతః,
వాతశ్లేష్మజ్వరశ్వాసకాసపీనసశూలజిత్. ౬౧

వ్రాకుడు శొంఠి తిప్పతీగె వీనిని సమముగజేర్చి కషాయముగాచి అందులో పిప్పళ్లచూర్ణమువైచి యిప్పించిన వాతశ్లేష్మ జ్వరము శ్వాసము కాసము పీనసము శూల వీనిని హరించును.

### వాతశ్లేష్మజ్వరమునకు పథ్యాదిచూర్ణము.

పథ్యాకుస్తుంబరీముస్తాశుంఠికత్తృణపర్పటమ్,
సకట్ఫలవచాభార్గీదేవాహ్వాం మధుహింగుమత్. ౬౨

కఫవాతజ్వరేష్వేవ కుక్షిహృత్పార్శ్వవేదనాః,
కంఠామయాస్యశ్వయథుకాసశ్వాసాన్నియచ్ఛతి. ౬౩

కరక్కాయ దనియాలు తుంగముస్తలు శుంఠి కామంచిగడ్డి పర్పాటకము కాయఫలచెక్క వస గంటుభారంగి దేవదారుచెక్క వీనిని సమభాగములుగ గ్రహించి మెత్తగచూర్ణముజేసి రెండుశాణముల ప్రమాణము తేనె ఇంగువ కలిపి యిప్పించిన కఫ

---

* దీనినే విషబొద్దియనియు-హటవేళ్లనియు - అగరుశొంఠియనియు కొందరు వచింపుచున్నారు.

వాతజ్వరము కడుపు బొమ్మప్రక్కలు వీనియందలి శూలలు కంఠరోగము నోటియందు వాపు కాసము శ్వాసము నివర్తించును.

కఫపిత్తజ్వరమునకు ఆరగ్వధాది చూర్ణము.

ఆరగ్వధాదిస్సక్షౌద్రః కఫపిత్తజ్వరం జయేత్,
తథా తిక్తావృషోశీరత్రాయంతీత్రిఫలామృతాః. ౬౪

రేల కొండిసెపాల కలిగొట్టు గురిజ వేము తిప్పతీగె చాగ కానరేగు చిరుబొద్ది నేలవేము ములుగోరింట చేదుపొట్ల నెమలడుగు క్రానుగు ఏడాకులపొన్న చిత్రమూలము ఆరెపట్ట మ్రంగకాయ నల్లగోరింట పోక ఇవి యారగ్వధాదిగణ ద్రవ్యములు. వీనిని సమభాగములుగ జేర్చి చేయబడిన చూర్ణమును తేనె సహితముగ నిప్పించినను, చేదుపొట్ల అడ్డసరము వట్టివేళ్లు కలుక్రానుగు కరక్కాయ తానికాయ ఉసిరికపరుగు తిప్పతీగె వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముజేసి తేనెతోడ నిప్పించినను కఫపిత్తజ్వరము నివర్తించును.

సన్నిపాతజ్వరమునకు వ్యాఘ్ర్యాదిచూర్ణము.

సన్నిపాతజ్వరే వ్యాఘ్రీదేవదారునిశాఘనమ్,
పటోలపత్రనింబత్వక్త్రిఫలాకటుకాయుతమ్. ౬౫

సన్నిపాతజ్వరమునందు వాకుడు దేవదారు పసుపు తుంగముస్తలు చేదుపొట్లాకు వేపపట్ట కరకతాండ్ర యుసిరికలు కటుకరోహిణి వీనిని సమభాగములుగ గ్రహించి చేయబడిన చూర్ణము నిప్పించిన హితము కలుగును.

వాతశ్లేష్మాధికజ్వరమునందు నాగరాదిచూర్ణము.

నాగరం పౌష్కరం మూలం గుడూచీ కంటకారికా,
సకాసశ్వాసపార్శ్వార్తౌ వాతశ్లేష్మోత్తరే జ్వరే. ౬౬

కాసము శ్వాసము పార్శ్వశూల వీనితోగూడియుండు వాతశ్లేష్మాధిక జ్వరమునందు శుంఠి పుష్కరమూలము తిప్పతీగె వాకుడు వీనిచూర్ణము నిప్పించిన హితము కలుగును.

సర్వజ్వరహర శీతకషాయము.

మధూకపుష్పం మృద్వీకాత్రాయమాణాపరూషకమ్,
సోశీరతిక్తాత్రిఫలాకాశ్మర్యం కల్పయేద్ధిమమ్. ౬౭

కషాయం తం పిబన్కాలే జ్వరాన్ సర్వాన్వ్యపోహతి,
జాత్యామలకముస్తాని తద్వద్ధన్వయవాసకమ్. ౬౮

ఇప్పపూలు ద్రాక్ష కలుగ్రానుగు పేరీత వట్టివేరు చేదుపొట్ల కరకతాండ్రయుసిరికలు గుమ్మడు వీనిని సమముగచేర్చి చేయబడిన శీతకషాయమును శాస్త్రమునందు జెప్పియుండుకాలమున పానము జేయించిన ఏకదోష ద్విదోష త్రిదోష సమస్తజ్వరములను హరించును. జాజిచిగుళ్లు ఉసిరికపరుగు తుంగముస్తెలు దూలగొండి వీనిని సమముగచేర్చి చేయబడిన శీతకషాయము నిప్పించిన సంసర్గసన్నిపాతాది జ్వరముల నన్నిటిని హరించును. మఱియు దూలగొండిని మాత్రము శీతకషాయముగ పానము జేయించిన సకల జ్వరములు హరించునని కొందరు వచింపుచున్నారు.

### మలబంధజ్వరమునందు కటుకాదికషాయము.

బద్ధవిట్కటుకాద్రాక్షా త్రాయంతీత్రిఫలాగుడాన్,

మలబంధముతోగూడియుండు జ్వరితునికి కటుకరోహిణి ద్రాక్ష కలుగ్రానుగు కరక్కాయ తానికాయ ఉసిరికపరుగు వీనిని సమముగచేర్చి కాచినకషాయమును గుడసహితముగ పానము జేయించవలయును.

### జ్వరితునికి పేయాద్యాహారము.

జీర్ణౌషధోఽన్నం పేయాద్యమాచరేచ్ఛ్లేష్మవాన్న తు. ౬౯
పేయా కఫం వర్ధయతి పంకం పాంసుషు వృష్టివత్,

కషాయము మొదలగు నౌషధములను త్రాగి యవి జీర్ణంబైయుండు జ్వరితునికి పూర్వోక్త పేయాదిఆహారములను పథ్యముగ నిప్పించవలయును. అయితే శ్లేష్మాధిక్యముగల జ్వరితునికి ఆయౌషధములు జీర్ణంబైయుండినను పేయాదుల నిప్పించంజనదు. అటుల నిప్పించినచో "వర్షధార ధూళిని బురదగా జేసి వృద్ధిపరచు చందంబున" పేయయనుగంజి లీనంబైయుండు కఫమును వృద్ధిపరచును. "పేయా కఫం వర్ధయతి యథా వృష్టిర్నదీజలమ్" వర్షము నదీజలమును యభివృద్ధిజేయుచందంబున పేయయను గంజి కఫమును వృద్ధిపరచునని తంత్రాంతరమునందు జెప్పబడియున్నది.

### పేయాక్రమము.

శ్లేష్మాభిష్యన్నదేహానామతః ప్రాగపి యోజయేత్ ౭౦
యూషాన్కుళుత్థచణకదాడిమాదికృతాన్లఘూన్,
రూక్షాంస్తిక్తరసోపేతాన్ హృద్యాన్ రుచికరాన్ పటూన్.

శ్లేష్మాధిక్యముతోగూడిన శరీరప్రకృతిగల జ్వరితులకు [illegible] ఉలవలు సెనగలు ధా[illegible] మొదలగువానిని స్వల్పముగ జేర్చి పాకముజేయబడినవి[illegible] లఘుగుణముగలవి[illegible]

ఘృతాది స్నేహపాకరహితంబులై రూక్షంబులుగ నుండునవియు చేదురసముగలవియు రుచికరమైనవియు లవణముతోగూడియుండునవియునైన కట్టుల నిప్పించవలయును.

—— జ్వరమునందు హితకరధాన్యంబులు. ——

**రక్తాద్యాశ్శాలయో జీర్ణాః షష్టికాశ్చ జ్వరే హితాః,**

జ్వరితులకు ప్రాతవియైన యెఱ్ఱసంబాధాన్యము అరువది దినములకుఫలించెడు ధాన్యము పథ్యకరంబులుగ నుండును.

—— శ్లేష్మజ్వరితునికి హితకరధాన్యము. ——

**శ్లేష్మోత్తరే వీతతుషా స్తథా వా ట్యకృతా యవాః. ౨౨**

శ్లేష్మాధిక్యముగల జ్వరితునికి యవలను పొట్టుతీసివేయించి పగలగొట్టి యిప్పించిన హితముకలుగును.

—— జ్వరితునికి పథ్యాహారము. ——

**ఓదన స్తైశ్శృతో ద్విత్రిః ప్రయోక్తవ్యో యథాయథమ్,**
**దోషదూష్యాదిబలతః జ్వరఘ్నక్వాథసాధితః. ౨౩**

ఎఱ్ఱసంబావు మొదలగు ప్రాతబియ్యములను (మంచియుదకములో రెండుమూడు పర్యాయములు చక్కగ కడిగి) జ్వరితునియొక్క దోషదూష్యాది బలానుగుణంబుగ జ్వరహరములైన ద్రవ్యములతో గాచబడిన కషాయములో రెండు మూడు పర్యాయములు పాకము జేసినవార్చబడినయన్నమును వాతాదిదోషము రసాదిదూష్యములు వయస్సు సత్వము సాత్మ్యము శరీరము దేశము కాలముమొదలగువానిబలాబలములను పర్యాలోచించి జ్వరితునికి పథ్యముగ నిప్పించవలయును.

—— జ్వరహరయూషములు. ——

**ముద్గాద్యై ర్లఘుభిర్యూషాః కుళుత్థైశ్చ జ్వరాపహాః,**

లఘువుగను త్వరలో జీర్ణమునొందునవియునైన పెసలు సెనగలు మొదలగువానిచేతను ఉలవలచేతను పక్వముచేయబడిన యూషములు (అనగా కట్టులు) జ్వరములను పోకడచును, "ముద్గశ్శింబిధాన్యానాం పథ్యత్వే శ్రేష్ఠతమః" శింబిధాన్యములలో పెసలు మిగుల శ్రేష్ఠమైనదియు పథ్యకారియనియు వచించిన చరకాచార్యవచనంబు ననుసరించి జ్వరమునందు తఱుచుగ పెసలకట్టు నుపయోగింపందగునని తెలియపరచుటకై "ముద్గాద్యైః" అని తంత్రకారుడు మూలమునందు చెప్పియున్నాడు. "ఉష్ణాః కుళుత్థాః పాకే మ్లాః శుక్రాశ్మశ్వాసపీనసాన్, కాసార్శః కఫవాతాంశ్చ ఘ్నంతి పిత్తప్రదాః పరమ్." అను తంత్రాంతరవచనప్రకారము ఉలవలు ఉష్ణముగ అమ్లపాకము

గలదిగ రక్తపిత్తము గలుగజేయునదిగ నుండుటంజేసి దానిని విశేషముగ జ్వరమునం దుపయోగింపగూడదు. అటుల నుపయోగించిన జ్వరము అభివృద్ధియగును. శ్లేష్మము శమింపజేయుటకై స్వల్పముగ ఉలవలను జేర్చి పాకము చేయబడిన కట్టుల నిప్పించవలయు నని తెలియపరచుటకై "కులత్థైశ్చ" అని మూలమునందు జెప్పబడినది.

జ్వరమునందు హితకరమాంసరసములు

కారవేల్లకకర్కోటబాలమూలకపర్పటైః ౨౪
వార్తాకనింబకుసుమపటోలఫలపల్లవైః,
అత్యంతలఘుభిర్మాంసైర్జాంగలైశ్చ హితా రసాః ౨౫
వ్యాఘ్రీపరూషకర్కారీద్రాక్షామలకదాడిమైః,
సంస్కృతాః పిప్పలీశుంఠీధాన్యజీరకసైంధవైః. ౨౬
సితామధుభ్యాం ప్రాయేణ సంయుతా వా కృతాకృతాః,

కాకర, ఆగాకర, లేతముల్లంగి, పర్పాటకము, లేతవంకాయ, వేపపువ్వు, పొట్లకాయ, పొట్లచిగుళ్లు, అనువానిని, వ్రాకుడు పేరీత, తక్కెడ, ద్రాక్ష, ఉసిరిక, దానిమ్మ, అనువానిని అత్యంతము లఘుగుణముగల జాంగలదేశజంతుమాంసములతో జేర్చి పాకము జేసిన రసములను; పిప్పళ్లు, శుంఠి, దనియాలు, జీలకఱ్ఱ, సైంధవలవణము, అను వానితో సంస్కరించి జ్వరితుని కిప్పించిన హితము కలుగును. మరియు జ్వరావస్థాను గుణముగ శర్కర, తేనె, అనువానిని జేర్చి పైవిధముగ సిద్ధము చేసిన కృతయూష రసములను గాని; లేక అకృత అనగా దానిమ్మ జీలకఱ్ఱ మొదలగువానితో సంస్కరింపబడనట్టి యూషరసములనుగాని యిప్పించిన హితముగనుండును.

జ్వరమునందు హితకరవ్యంజనము.

అనమ్లతక్రసిద్ధాని రుచ్యాని వ్యంజనాని చ. ౨౭
అచ్ఛాన్యనలసంపన్నాని

పులియనిమజ్జిగతో అగ్నియందు పాకము చేయబడినదిగ, రుచికరముగ తేటగ నుండు వ్యంజనములను జ్వరితుని కిప్పించవలయును. వ్యంజనమనగా—అన్నముతోడం జేర్చి భుజంపదగిన పులుసుకట్టు మొదలగునవి.

జ్వరితునికి ఉదకాదిపానము.

అనుపానేఽపి యోజయేత్,
తాని క్వథితశీతం చ వారి మద్యం చ సాత్మ్యతః ౨౮

జ్వరితునికి భోజనానంతరము పూర్వోక్తయూషము, రసము, కాగిచల్లారిన యుదకము, మద్యము, వీనిని సాత్మ్యానుగుణముగ పానము జేయించవలయును.

### జ్వరితునికి భోజనకాలము.

సజ్వరం జ్వరముక్తం వా దివాంతే భోజయేల్లఘు,
శ్లేష్మక్షయవివృద్ధోష్మా బలవాననలస్తదా. ౭౯
యథోచితేఽథవా కాలే దేశసాత్మ్యానురోధతః,
ప్రాగల్పవహ్నిర్భుంజానో న హ్యజీర్ణేన పీడ్యతే. ౮౦

జ్వరితునికి జ్వరము కలిగియుండినను లేక జ్వరము విడిచియుండినను సాయం సమయంబున స్వభావముచే లఘువుగనుండు నాహారమును స్వల్పముగ నిప్పించవలయును. ఏలననగా—సాయంకాలమున శ్లేష్మము క్షయించియుండుటవలన మిగులవృద్ధిజెంది బలిష్ఠముగనుండు జాఠరాగ్ని భుజించిన యన్నాదులను జీర్ణింపజేయును. లేక ఏజ్వరితునికేది యుచితమైనయాహారకాలమో యాకాలమునందు ఆహారమును దేశసాత్మ్యానుగుణముగ నిప్పించవలయును. మందాగ్నిగల జ్వరితుడు పూర్వాహ్ణకాలమునందు భుజించినను వానికి యజీర్ణబాధ కలుగనేరదు.

### ఘృతపానకాలము.

కషాయపానపథ్యాన్నైర్దశాహ ఇతి లంఘితే,
సర్పిర్దద్యాత్కఫే మందే వాతపిత్తోత్తరే జ్వరే. ౮౧
పక్వేషు దోషేష్వమృతం తద్విషోపమమన్యథా,
దశాహే స్యాదతీతేఽపి జ్వరోపద్రవవృద్ధికృత్. ౮౨
లంఘనాదిక్రమం తత్ర కుర్యాదాకఫసంక్షయాత్,

పైచెప్పినప్రకారము ముస్తాపర్పటకాది పాచనకషాయములను పేయాది పథ్యాహారములను పది దినములవరకు నిప్పించవలయును, కఫము క్షయించి వాతపిత్తాధిక్యముతో గూడియుండు జ్వరమునందు వాతాది దోషములు ఆమదోషరహితముగ నుండునపుడు ఆయాజ్వరమునకు తగిన ఓషధులతో సిద్ధముజేయబడినఘృతమును జ్వరితునికిప్పించవలయును. అటుల నిప్పించిన యాఘృతము రోగికి అమృతతుల్యమగును. కఫాధిక్యముతో గూడియుండుజ్వరమునందు పది దినములు గడచినపిదపను వాతాది దోషము లామదోషముతో గూడియుండినచో ఘృతము నిప్పించజనదు. అటులనిప్పించినచో నది విషప్రాయంబగుటయేగాక జ్వరోపద్రవములను వృద్ధిపరచును. అట్టి కఫాధిక్యముతో గూడియుండు జ్వరమునందు కఫము నిశ్శేషముగక్షయించువరకు లంఘనాదిక్రమంబులను జేయించవలయును. జ్వరితునికి ముస్తాపర్పటకాది కషాయపానముచేతను పేయయూషాది పథ్యములచేతను 6, దినములకుపైన 7, లేక 8, వ దినమునందు తఱుచుగ ఆమదోషము నివర్తించి కఫముశమించును; కావున పది దినములకు

పైని జ్వరహరఘృతము నిప్పించవలయునని యీతంత్రకారుడుచెప్పియున్నాడు. "సప్తాహేనహిపచ్యంతే సప్తధాతుగతామలాః, నిరామశ్చాప్యతఃప్రోక్తో జ్వరః ప్రాయోఽష్టమే హని." రసాదిసప్తధాతువుల నాశ్రయించియుండు ఆమదోషములు 7, దినములకు పాకముజెందును. కాబట్టి యెనిమిదవ దినమున జ్వరము ఆమదోషరహితంబగునని చరకాచార్యుడును చెప్పియున్నాడు.

జీర్ణజ్వరమునందు ఘృతపానవిధి.

దేహధాత్వబలత్వాచ్చ జ్వరో జీర్ణోఽనువర్తతే. ౭౩
రూక్షం హి తేజో జ్వరకృత్తేజసా రూక్షితస్య చ,
వమనస్వేదకాలాంబుకషాయలఘుభోజనైః. ౭౪
యస్స్యాద్వతిబలో ధాతుస్సహచారీ సదాగతిః,
తస్య సంశమనం సర్పిర్దీప్తస్యేవాంబు వేశ్మనః. ౭౫

రోగి శరీరాంతర్గతంబులైన రసరక్తాదులు వాతాది ధాతువులు అతిస్వల్పబలముగలవగుటచే జ్వరము పురాణమై ఇంకను దీర్ఘకాలమనుసరించుచుండును. అట్టి పురాణజ్వరము శమించుటకును దేహమునకు బలముకలుగుటకును ఘృతపానము చేయించవలయును. ఏలయనగా—జ్వరమును గలుగజేయునదియు రూక్షకరమైనదియునైన జాఠరాగ్ని తేజస్సుచే రూక్షతనుజెందియుండురోగికి వమనము, స్వేదము, కాలము, ఉదకము, కషాయములు, లఘ్వాహారములు వీనిచేవృద్ధిజెంది బలిష్ఠముగ జాఠరాగ్నితో గూడి యెల్లపుడు సంచరించుచుండునదిగనుండు వాతధాతువునకు "కాలుచుండుగృహమునకు ఉదకము శమనంబుగ నుండుమాడ్కి" ఘృతపానము శమనంబుగనుండును.

ఘృతమునకు శ్రేష్ఠత్వము.

వాతపిత్తజితామగ్ర్యం సంస్కారమనురుధ్యతే,
సుతరాం తద్ఘృతో దద్యాద్యథాస్వౌషధసాధితమ్. ౭౬

ఘృతము వాతపిత్తహరములైన యౌషధములకన్నిటికంటె మిగుల శ్రేష్ఠంబుగ నుండుటవలనను, నిజశైత్యాది స్వభావగుణములను విడువకయే యితరద్రవ్యముల గుణము లనుసరించుటవలనను మిగుల శ్రేష్ఠంబు. కావున జీర్ణవాతపిత్తాధిక్యజ్వరమునకు ఆయావ్యాధికితగిన ద్రవ్యములతో పక్వముచేయబడిన ఘృతము నిప్పించవలయును. "నాన్యస్స్నేహస్తథా కశ్చిత్సంస్కారమనువర్తతే, యథా సర్పిరతస్సర్పిస్సర్వస్నేహోత్తమం మతమ్" ద్రవ్యములయొక్క సంస్కారమును ఘృతము అనుసరించునటుల తదితర స్నేహములు సంస్కారముల ననుసరింపవు; కావున ఘృతము అన్నిస్నేహములకంటె కడుశ్రేష్ఠంబని చరకాచార్యుడు చెప్పియున్నాడు.

ఘృతమునకు వాతాదిదోషహరత్వము.

విపరీతం జ్వరోష్మాణం జయేత్పిత్తం చ శైత్యతః,
స్నేహాద్వాతం ఘృతం తుల్యం యోగసంస్కారతః కఫమ్. ౮౭

ఘృతము జ్వరతాపమును పోగొట్టును. శైత్యస్వభావముగలది యగుటవలన ఉష్ణస్వభావమైన పిత్తమును, స్నిగ్ధముగనుండుటవలనరూక్షమైన వాతదోషమును హరింపజేయును. సూత్రస్థానమున శోధనాదిగణ సంగ్రహాధ్యాయములో జెప్పియుండు కఫహారములైన ద్రవ్యములను చేర్చి కాచబడిన ఘృతము కఫమును పోగొట్టును.

ఘృతసహిత కషాయవిధానము.

పూర్వే కషాయాస్సఘృతాః సర్వే యోజ్యా యథామలమ్,

పూర్వోక్తములైన ముస్తాపర్పటాది పాచన కషాయముల నాయాదోషాను గుణంబుగ ఘృతముతోడం జేర్చి యిప్పించవలయును.

జ్వరకాసహరకషాయము.

త్రిఫలాపిచుమందత్వఙ్మధుకం బృహతీద్వయమ్,
సమసూరదళం క్వాథస్సఘృతో జ్వరకాసహా. ౮౮

త్రిఫలములు, వేపపట్ట, అతిమధురము, పెద్దములక, చిన్నములక, నల్లతెగడ వీనిని సమముగ చేర్చి కాచబడిన కషాయమును నేతితో నిప్పించిన జ్వరమును కాసమును హరించును. సమసూరదళమను పదమునకు చిరుసెనగపప్పని కొందరు వ్యాఖ్యానము చేయుచున్నారు.

జ్వరమునకు పిప్పల్యాదిఘృతము.

పిప్పలీంద్రయవ్యాథావనితిక్తా సారిబామలకతామలకీభిః,
బిల్వముస్తహిమపాలనిసేవ్యైర్ద్రాక్షయా తివిషయా స్థిరయా చ.
ఘృతమాశు నిహంతి సాధితం జ్వరమగ్నిం విషమం హలీమకమ్,
అరుచిం భృశతాపమంసయోర్వమథుం పార్శ్వశిరోరుజంక్షయం.

పిప్పళ్లు, కొడిసెపాలవిత్తులు, వ్రాకుడు, కటుకరోహిణి, సుగంధిపాల, ఉసిరికవలుపు, నేలయుసిరిక, మారేడు, తుంగముస్తలు, రక్తచందనము, పాలని—(అనగా కలుక్రాసుగు), వట్టివేరు, ద్రాక్ష, అతివస, ముయ్యాకుపొన్న, వీనిని సమముగ చేర్చి కల్కముచేసి ఆకల్కము 1 భాగము, నెయ్యి 1 భాగము, నేతికి నాల్గు భాగములధికముగ ఉదకము వీనినన్నిటినిఒకటిగాచేర్చి ఘృతపాకవిధానముగ పాకము చేయవలయు. ఈఘృతము జ్వరము విషమాగ్ని హలీమకము అరుచి భుజశిరమునందధికతాపము వాంతి పార్శ్వశూల తలనొప్పి క్షయము వీనిని బోగొట్టును.

### వాతజ్వరపిత్తజ్వరములకు తైల్వకాదిఘృతము.

తైల్వకం పవనజన్మని జ్వరే యోజయేత్త్రివృతయా వియోజితమ్,
తిక్తకం వృషఘృతంచ పైత్తికే యచ్చ పాలనికయా శృతం హవిః

వాతవ్యాధి చికిత్సితాధ్యాయమునందు జెప్పబోవు తైల్వకఘృతమును వాతజ్వరమునందిప్పించవలయు. అయితే ఆ తైల్వకఘృతమునందు వచించబడియుండు తెగడను మాత్రము వర్జించవలయును. మఱియును పిత్తజ్వరమునందు కుష్ఠచికిత్సితాధ్యాయమునందు జెప్పబోవు తిక్తకఘృతమును, రక్తపిత్త చికిత్సితాధ్యాయమునందు జెప్పబోవు వృషఘృతమును, కల్యాక్రానుగతో కాచబడినఘృతమును, ఇప్పించవలయును.

### జీర్ణకఫజ్వరహారఘృతము.

విడంగసౌవర్చలచవ్యపాఠావ్యోషాగ్నిసింధూద్భవయావశూకైః,
పలాంశకైః క్షీరసమం ఘృతస్య ప్రస్థం పచేజ్జీర్ణకఫజ్వరఘ్నమ్. ॥ ౨

వాయువిడంగములు, సౌవర్చలవణము, చవ్యము, చిరుబొద్ది, శుంఠి, పిప్పళ్లు, మిరియాలు, చిత్రమూలము, సైంధవలవణము, యవక్షారము, ఇవిప్రత్యేకము ఒక్కొక పలము, ఆవుపాలు 1 ప్రస్థము, నెయ్యి, 1 ప్రస్థము, ఉదకము 4 ప్రస్థములు ఇటుల వీనినన్నిటిని యొకటిగాచేర్చి ఘృతపాకవిధిగ పక్వము చేయబడిన ఘృతము పురాణ కఫజ్వరమును పోగొట్టును.

### జ్వరహారి ఘృతములు.

గుడూచ్యా రసకల్కాభ్యాం త్రిఫలాయా వృషస్య చ,
మృద్వీకాయా బలాయాశ్చ స్నేహాస్సిద్ధా జ్వరచ్ఛిదః. ॥ 3

తిప్పతీగెరసము, తిప్పతీగెకల్కము, వీనితో పక్వముచేయబడిన ఘృతము 1; త్రిఫలరస కల్కములతో పక్వము చేయబడినఘృతము 2; అడ్డసరరసము అడ్డసర కల్కము వీనితో పక్వముచేయబడిన ఘృతము 3; ద్రాక్షపండురసము ద్రాక్షకల్కము వీనితో పక్వముచేయబడిన ఘృతము 4; చిట్టాముట్టిరసము, చిట్టాముట్టి కల్కము వీనితో పక్వముచేయబడిన ఘృతము 5; యివి పురాణజ్వరములను హరింపజేయును.

### ఘృతపానమునందు పథ్యము.

జీర్ణే ఘృతే చ భుంజీత మృదుమాంసరసౌదనమ్,
బలం హ్యలం దోషహరం పరం తచ్చ బలప్రదమ్. ॥ ౪

జ్వరహార ఘృతమును పానముచేయించి యది జీర్ణించినపిదప రోగికి మృదువుగనుండు మాంసరసముతో అన్నమును భుజింపజేసిన ఆ యన్నము శరీరమునకు విశేషబలమును కలుగజేయుటయేగాక దోషములను కూడ పోగొట్టును.

వాతాధిక్యజ్వరమునందు వర్జ్యరసంబులు.

కఫపిత్తహరా ముద్గకారవేల్లాదిజా రసాః,
ప్రాయేణ తస్మాన్న హితా జీర్ణే వాతోత్తరే జ్వరే. ౪౨
శూలోదావర్తవిష్టంభజననా జ్వరవర్ధనాః,

కఫపిత్తముల హరింపంజేయునట్టి పెసలు కాకర మొదలగువానిరసంబులు వాతాధిక్యముతో గూడియుండు పురాణజ్వరములయందు హితకరములు కానేరవు. కావున పై జ్వరమునందు పెసలు మొదలగు రసములనిప్పించిన నవి శూల ఉదావర్తము మలబంధము వీనిని గలుగంజేయుటయే కాక జ్వరమును కూడ వృద్ధినందించును.

పురాణజ్వరమునందు వమనకర్మ.

న శామ్యత్యేవమపి చేజ్జ్వరః కుర్వీత శోధనమ్. ౪౩
శోధనార్హస్య వమనం ప్రాగుక్తం తస్య యోజయేత్,
ఆమాశయగతే దోషే బలినః పాలయన్బలమ్. ౪౪

పై జెప్పినప్రకారము చికిత్సలంజేసియు జ్వరము శమింపకయుండిన శోధనకర్మకర్హుడుగ బలిష్ఠుడుగనుండు జ్వరితునికి దోషము ఆమాశయగతంబైయుండు నపుడు శరీరబలమును రక్షింపుచు "పిప్పలీభిర్యుతాన్గాలాన్" అని పూర్వము చెప్పియుండు పిప్పళ్లసహితమగు మ్రంగకాయ మొదలైన వమనౌషధముల నిప్పించవలయును.

పక్వదోషమునందు త్రిఫలాదిమోదకము.

పక్వే తు శిథిలే దోషే జ్వరే వా విషమద్యజే,
మోదకం త్రిఫలాశ్యామాత్రివృత్పిప్పలికేసరైః ౪౫
ససితామధుభిర్దద్యాద్దోషపాద్యం వా విరేచనలుం,
ఆరగ్వధం వా పయసా మృద్వీకానాం రసేన వా. ౪౬
త్రిఫలాం త్రాయమాణాం వా పయసా జ్వరితః పిబేత్,

ఆమముతోగూడియుండు వాతాది దోషములు ఆమదోషరహితముగ శిథిలముగనుండునపుడును, విషముచేతగాని మద్యముచేతగాని జనించిన జ్వరమునందును త్రిఫలములు, సుగంధిపాల, తెగడ, పిప్పళ్ళు, నాగకేసరములు, పంచదార, తేనె, వీనిని సమభాగములుగచేర్చి చేయబడిన మోదకమునుగాని, "వ్యోషత్రిజాతకాంభోదకృమిఘ్నామలకైస్త్రివృత్, సర్వైస్సమాస్సమసితాః క్షౌద్రేణ ఘుటికాః కృతాః." త్రికటుకములు, త్రిజాతకములు, తుంగముస్తలు, వాయువిడంగములు, ఉసిరికపరుగు, ఋబి

సమభాగములు, వీటికన్నిటికి సమభాగము తెగడ, వీటికన్నిటికి సమభాగము పంచదార, యిటుల తేనెసహితముగ గూర్చి చేయబడిన వ్యోషాదిగుటికలనుగాని, రేలగుజ్జును ఆవుపాలతో గాని, ద్రాక్షపండు రసముతో గాని, విరేచనార్థము నొసంగవలయు. లేక త్రిఫలములను గాని కలుక్రాపుగనుగాని ఆవుపాలతో జ్వరితుని కిప్పించవలయును.

—◎ విరిక్తజ్వరితునికి పేయాదిక్రమము. ◎—

విరిక్తానాం చ సంసర్గీ మండపూర్వా యథాక్రమమ్. ౧౦౦

విరేచనౌషధములను సేవించినవారును, వమనౌషధములను సేవించినవారునైన జ్వరితులకు యథాక్రమముగ గంజిని పేయాదులను ఆహారముగ నిప్పించవలయును. బాగుగ విరేచనమైయుండువానికిని వమనమైయుండువానికిని యిప్పించు గంజి మొదలైన యాహారక్రమంబు సంసర్గీ యనబడును.

—◎ మలనిరోధ నిషేధము. ◎—

చ్యవమానం జ్వరోత్క్లిష్టముపేక్షేత మలం సదా,
పక్వోఽపి హి వికుర్వీత దోషః కోష్ఠే కృతాస్పదః. ౧౦౧
అతిప్రవర్తమానం వా పాచయన్సంగ్రహం నయేత్,
ఆమసంగ్రహణే దోషా దోషోపక్రమ ఈరితాః ౧౦౨

జ్వరితునికి జ్వరవేగముచే మలము బైలువెడలుచుండిన దానినౌషధములచే నడ్డగింపంజనదు. ఏలననగా—మలము పాకముజెందియుండినను దాని నడ్డగించిన నది ఆమాశయపక్వాశయములను జేరి రోగములనుకలుగ జేయును.మలము అపక్వమై యధికముగా వెడలుచుండిన దానిని ఔషధములచే పాకముజెందునటుల జేసి స్వల్పముగ వెడలునటులం జేయవలయును. అపక్వమైన మలము నడ్డగించినచో సూత్రస్థానమున దోషోపక్రమణీయాధ్యాయమునందు "ఉత్క్లిష్టానథ" ఇత్యాదిశ్లోకములలో జెప్పబడియుండు అనేకదోషములు జనించును. కావున ఆ అపక్వమలము నడ్డగించుటకై యౌషధముల నిప్పించంజనదు.

—◎ ఆమజ్వరమునం దౌషధనిషేధము. ◎—

పాయయేద్దోషహరణం మోహాదామజ్వరే తు యః,
ప్రసుప్తం కృష్ణసర్పం స కరాగ్రేణ పరామృశేత్. ౧౦౩

వైద్యుం డజ్ఞానమువలన ఆమజ్వరమునం దామహరౌషధముల నిప్పించిన "నిద్రింపుచుండు కృష్ణసర్పమును నిజహస్తముచే తట్టి లేపువానివలె" ననేకములగు నాపదలం జెందును.

### జ్వరక్షీణునికి వమనాదినిషేధము.

జ్వరక్షీణస్య న హితం వమనం చ విరేచనమ్,
కామం తు పయసా తస్య నిరూహైర్వా హరేన్మలాన్. ౧౦౪

జ్వరముచే క్షీణించియుండువానికి వమనవిరేచనములు హితకరంబులు కానేరవు. అయితే వానిమలమును ఔషధంబులచేర్చి కాచబడినపాలతోగాని నిరూహవస్తులతోగాని వెడలింపజేయవలయును.

### జ్వరితునికి క్షీరము.

క్షీరోచితస్య ప్రక్షీణశ్లేష్మణో దాహతృడ్వతః,
క్షీరం పిత్తానిలార్తస్య పథ్యమప్యతిసారిణః. ౧౦౫

శ్లేష్మము విశేషముగ క్షయించినవాడును, సర్వాంగతాపము దప్పి కలవాడును, పిత్తవాతముచే పీడింపబడినవాడును, క్షీరపానమునం దభ్యాసముకలవాడునైన జ్వరికొనికి క్షీరము హితకరంబుగనుండును. అతిసారముతోగూడియుండు జ్వరితులకును క్షీరము పథ్యముగ నుండును.

### జ్వరితునికి క్షీరపానగుణము.

తద్వత్పుర్లంఘనోత్తప్తం ప్లుష్టం వనమివాగ్నినా,
దివ్యాంబు జీవయేత్తస్య జ్వరం చాశు నియచ్ఛతి. ౧౦౬

"కాఱ్చిచ్చుచే గాల్చబడిన యడవిని వర్షోదకము మరల ననుసరింపం జేయుచందంబున" లంఘనాదులచే తపింపబడిన జ్వరితునిశరీరమునకు క్షీరపానము సౌఖ్యమును కలుగజేయుటయేగాక శీఘ్రముగ జ్వరమునుగూడ నశింపజేయును.

### శీతోష్ణాది క్షీరపానము.

సంస్కృతం శీతముష్ణం వా తస్మాద్ధారోష్ణమేవ వా,
విభజ్య కాలే యుంజీత జ్వరిణం హన్త్యతోఽన్యథా. ౧౦౭

పైజెప్పినచొప్పున క్షీరము మిక్కిలిగుణముగలదియగుటచే వైద్యుడారోగములకు తగినయౌషధులతో గూర్చి కాచబడిన ఆవుపాలను చల్లగగాని సుఖోష్ణముగగాని లేక ధారోష్ణముగనుండు ఆవుపాలనుగాని యుక్తకాలంబున జ్వరితునికి పానము జేయించవలయును. అటులంజేయక వేఱువిధంబుగనిప్పించినచో యాక్షీరము జ్వరితుని జంపును.

### జ్వరహర క్షీరము.

పయస్సశుంఠీఖర్జూరమృద్వీకాశర్కరాఘృతమ్,

శృతశీతం మధుయుతం తృడ్దాహజ్వరనాశనమ్ ౧౦౭
తద్వద్ద్రాక్షాబలాయష్టిసారిబాకణచందనైః,
చతుర్గుణేనాంభసా వా పిప్పల్యా వా శృతం పిబేత్. ౧౦౮

ఆవుపాలలో శుంఠి, ఖర్జూరము, ద్రాక్ష, పంచదార, ఆవునెయ్యి, వైచి చక్కగాకాచి చల్లారినపిదప అందులో కొంచెము తేనెగలిపి జ్వరితునికి పానము జేయించినను; లేక ఆవుపాలలో ద్రాక్షపండు, చిట్టాముట్టి, అతిమధురము, సుగంధిపాల, పిప్పళ్లు, చందనము ఈద్రవ్యములను వైచి చక్కగా కాచి చల్లారినపిదప తేనెతోడ పానము జేయించినను దప్పి సర్వాంగతాపము జ్వరము హరించును; లేక క్షీరము 1 భాగము, ఉదకము 4 భాగములు యిటుల వీటినేకము జేసి కాచబడిన పాలనుగాని పిప్పళ్లనుచేర్చి కాచిన పాలనుగాని జ్వరితుని కిప్పించిన ఆరోగ్యము కలుగును.

## కాసాదిహరక్షీరము.

కాసాచ్ఛ్వాసాచ్ఛిరశ్శూలాత్పార్శ్వశూలాచ్చిరజ్వరాత్,
ముచ్యతే జ్వరితః పీత్వా పంచమూలీశృతం పయః. ౧౧౦

పంచమూలముల జేర్చి కాచబడిన ఆవుపాలను జ్వరితునికి పానముచేయించిన కాలము శ్వాసము శిరమునందలిశూల పార్శ్వశూల చిరకాలముగ ననుసరించి వచ్చుచుండు జ్వరము హరించును.

## మలబంధ జ్వరాదిహర క్షీరము.

శృతమేరండమూలేన బాలబిల్వేన వా జ్వరాత్,
ధారోష్ణం వా పయఃపీత్వా విబద్ధానిలవర్చసః ౧౧౧
సరక్తపిచ్ఛాతిసృతేః సతృట్శూలప్రవాహికాత్,

ఆముదపువేళ్లతోగాని లేతమారేడుకాయలతోగాని కాచినపాలను, లేక ధారోష్ణమైన (అప్పుడు పిండబడినురుగుతోగూడి వేడిగనుండు) పాలను జ్వరితునికి పానము జేయించిన వాత మలబంధముతోగూడియుండు జ్వరము రక్తస్రావాతిసారములతో గూడియుండుజ్వరము, దప్పి శూలప్రవాహిక (ముక్కుట) అనువానితో గూడియుండుజ్వరము ఇవియన్నియు శమించును.

## శోఫాదిహరక్షీరము.

సిద్ధం శుంఠీబలావ్యాఘ్రీగోకంటకగుడైః పయః. ౧౧౨
శోఫమూత్రశకృద్వాతవిబంధజ్వరకాసజిత్,

శుంఠి, చిటాముట్టి, వాకుడు, పల్లేరు, బెల్లము, వీనిని సమముగచేర్చి చక్క

గా కాచబడిన పాలను పానము జేయించిన వాపు మూత్రబాధము మలబంధము అపాన వాతబాధము మొదలగు వానితోఁగూడిన జ్వరము కాసము హరించును.

—— జ్వరశోఫహర క్షీరము. ——

వృశ్చీవబిల్వవర్షాభూసాధితం జ్వరశోఫనుత్. ౧౧౩

తెల్లగలిజేరు, మారేడు, ఎఱ్ఱ గలిజేరు, వీనితోఁ కాచబడిన పాల నిప్పించిన జ్వరము శోఫ ఇవి హరించును.

—— సద్యోజ్వరక్షీరము. ——

శింశిపాసారసిద్ధం వా క్షీరమాశు జ్వరాపహమ్,

కృష్ణాగరుతోఁ కాచబడిన పాలనిప్పించిన శీఘ్రముగ జ్వరము హరించును. ''పయస్యుత్క్వాథ్యముస్తాదిశంతి'' అని అతిసార చికిత్సితాధ్యాయమునందు జెప్పియుండు ప్రకారము పాలను కాచి పక్వము జేయవలయును. ''ద్రవ్యాదష్టగుణం క్షీరం క్షీరాత్తోయం చతుర్గుణమ్, క్షీరావశేషః కర్తవ్యః క్షీరక్వాథే త్వయం విధిః''. ఓషధులు 1 భాగము, పాలు 8 భాగములు, పాలకంటె ఉదకము 4 భాగములు, ఇటుల జేర్చి పాలుమాత్రము మిగులునటుల కాచవలయును. ఇది పాలనుకాచు క్రమము. అని తంత్రాంతరమునందు చెప్పబడియున్నది. వాతపిత్తోత్తరజ్వరమునందు ముఖ్యముగా ఘృతమునిప్పించవలయునని పూర్వముచెప్పి యిచట పైజ్వరమునందు క్షీరమే ముఖ్యముగా నిప్పించవలయునని చెప్పుటచే నీ రెంటిలోఁ దేని నిప్పించవలయున నే శంక గలుగును. అయితే వాతపిత్తాధిక జ్వరమునందు ఘృతక్షీరములు రెండును ముఖ్యంబులే యైనను ఆయాజ్వరావస్థకు తగినటుల కొన్ని జ్వరములయందు ఘృతమును మరికొన్ని జ్వరముల యందు క్షీరమును ఇప్పించవలయునని భావము.

—— నిరూహవస్తికర్మగుణము. ——

నిరూహస్తు బలం వహ్నిం విజ్వరత్వం ముదం రుచిమ్. ౧౧౪
దోషే యుక్తః కరోత్యాశు పక్వే పక్వాశయం గతే,

దోషములు ఆమదోషరహితంబులై పక్వాశయమును జెందియుండునపుడు నిరూహవస్తిని ప్రయోగించిన బలము జాఠరాగ్ని దీపనము జ్వరనాశము మనస్సంతోషము రుచికలుగును.

—— నిరూహవస్తిప్రశంస. ——

పిత్తం వా కఫపిత్తం వా పక్వాశయగతం హరేత్. ౧౧౫
స్రంసనం త్రీనపి మలాన్ వస్తిః పక్వాశయాశ్రయాన్,

విరేచనకర్మ చేయించిన నది పక్వాశయగతంబైన పిత్తముగాని శ్లేష్మపిత్తమును గాని హరింపజేయును. వస్తికర్మమునుచేయించినచోఁ నది పక్వాశయము నాశ్రయించియుండు వాతాది త్రిదోషములను హరింపజేయును.

### అనువాసనవస్తి.

ప్రక్షీణకఫపిత్తస్య త్రికపృష్ఠకటిగ్రహే. ౧౧౬
దీప్తాగ్నేర్బద్ధశకృతః ప్రయుంజీతానువాసనమ్,

కఫపిత్తములు విశేషముగ క్షయించి జాఠరాగ్ని దీపనమునొంది మలబంధము గల జ్వరితునికి ముడ్డిపూస వీపు నడుము వీనియందు పట్టు కలిగియుండిన అనువాసన వస్తిని ప్రయోగించవలయును.

### వస్తికర్మోపయోగకషాయములు.

పటోలనింబచ్ఛదనకటుకాచతురంగులైః. ౧౧౭
స్థిరాబలాగోక్షురకమదనోశీరవాలకైః,
పయస్యర్ధోదకే క్వాథం క్షీరశేషం విమిశ్రితమ్. ౧౧౮
కల్కైస్తైర్ముస్తమదనకృష్ణామధుకవత్సకైః,
వస్తిం మధుఘృతాభ్యాం చ పీడయేజ్జ్వరనాశనమ్. ౧౧౯

చేదుపొట్ల, వేపాకు, కటుకరోహిణి, రేల, ముయ్యాకుపొన్న, చిట్టాముట్టి, పల్లేరు, మ్రంగ, వట్టివేరు, కురువేరు, వీనిని సగమునీళ్లుకలిపిన పాలలోచేర్చి పాలు మాత్రము మిగులునటులకాచి,దానిలో తుంగముస్తలు,మ్రంగ, పిప్పళ్లు, అతిమధురము, కొడిశపాల వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి కలిపి కొంచెము తేనె ఆవునెయ్యిచేర్చి నిరూహవస్తిని ప్రయోగించిన జ్వరము హరించును.

### ముద్గపర్ణ్యాదివస్తికషాయము.

చతస్రః పర్ణినీర్యష్టీఫలోశీరసృపద్రుమాన్,
క్వాథయేత్కల్కయేద్యష్టీశతాహ్వాఫలినీఫలమ్. ౧౨౦
ముస్తం చ వస్తిః సగుడక్షౌద్రసర్పిర్జ్వరాపహః,

పిల్లిపెసర, కాటుమినుములు, ముయ్యాకుపొన్న, కోలపొన్న, అతిమధురము, మ్రంగపండు, వట్టివేరు, రేల, వీనిని సమభాగముగ నుదకములో వైచి కషాయము కాచి అందులో అతిమధురము పెద్దసదాప, ప్రేంఖణము, మ్రంగపండు, తుంగముస్తలు వీనికల్కమును కలిపి బెల్లము తేనె నెయ్యిచేర్చి వస్తికర్మను ప్రయోగించిన జ్వరము హరించును.

### అనువాసనవస్తికర్మ.

జీవంతీం మదనం మేదాం పిప్పలీం మధుకం వచామ్. ౧౨౧
ఋద్ధిం రాస్నాం బలాం బిల్వం శతపుష్పాం శతావరీమ్,

పిష్ట్వా క్షీరం జలం సర్పిస్తైలం చైకత్ర సాధితమ్ ౧౨౨
జ్వరేఽనువాసనం దద్యాద్యథాస్నేహం యథామలమ్,
యే చ సిద్ధిషు వక్ష్యంతే వస్తయో జ్వరనాశనాః. ౧౨౩

మనుబాల, మ్రంగ, మేద, పిప్పళ్లు, అతిమధురము, వస, బుద్ధి, సన్నరాస్నము, చిట్టాముట్టి, మారేడు, సదాప, పిల్లిపీచర,వీనిని స్నేహమునకునాల్గవభాగము గ్రహించి ఉదకములో నూరి కల్కము చేయవలయు. ఆవుపాలు 1 భాగము, నువ్వులనూనె 1 భాగము, నెయ్యి 4 భాగములు, యిటుల వీటినినొక్కటిగ జేర్చి అందులో పైకల్కము ను కలిపి వీనికన్నిటికి నాలుగింతలుదకము బోసి కలిపి పక్వము జేసి ఆకషాయముచే జ్వరమునందనువాసవస్తిని దోషానుగుణముగ ప్రయోగించవలయును. వస్తికల్ప సాధ్యాయమునం దికజెప్పబోవు జ్వరహరములైన వస్తికర్మలను జ్వరితునికి బ్రయోగించవలయును.

జీర్ణ జ్వరమునందు నస్యము.

శిరోరుగ్గౌరవశ్లేష్మహరమింద్రియబోధనమ్,
జీర్ణజ్వరే రుచికరం దద్యాన్నస్యం విరేచనమ్. ౧౨౪
స్నైహికం శూన్యశిరసో దాహార్తే పిత్తనాశనమ్,

తలనొప్పి, శిరోభారము, శ్లేష్మము, వీనిని పోకడచునదిగ చక్షురాదీంద్రియములకు పటుత్వమును కలుగజేయునదిగ రుచినిబుట్టించునదిగనుండు విరేచననస్యములను ప్రయోగించవలయును. శిరోభారము మొదలగు నుపద్రవములులేని శిరముగల పురుషునికి స్నేహమిశ్రముగనుండునస్యము ప్రయోగించవలయును. తాపమువలన పీడింపబడిన శిరముగలవానికి పిత్తహరమైననస్యమును జీర్ణ జ్వరమునందు ప్రయోగించవలయును.

ధూమగండూషాదిప్రయోగము.

ధూమగండూషకబలాన్ యథాదోషం చ కల్పయేత్. ౧౨౫
ప్రతిశ్యాయాస్యవైరస్యశిరఃకంఠామయాపహాన్,

పీనస, నోటియందు విరసత, శిరోరోగము, కంఠరోగము, వీనిని పోగొట్టునట్టి ధూమపానము గండూషము కబలము వీనిని ఆయాదోషానుగుణముగ జ్వరితునికి చేయించవలయును.

అరుచౌ మాతులుంగస్య కేసరం సాజ్యసైంధవమ్. ౧౨౬
ధాత్రీద్రాక్షాసితానాం వా కల్కమాస్యేన ధారయేత్,

జ్వరితునికి అరుచిగలిగియుండినచో, మాదీఫలపుకేసరములను తేనె సైంధవలవ

ణము వీనితోడగలిపిగాని, లేక ఉసిరిక, ద్రాక్ష, పంచదార, వీనికల్కమునుగాని నోటి యందు ధరింపజేయవలయును.

జీర్ణ జ్వరమునం దభ్యంగాదులు.

యథోపశయసంస్పర్శాన్ శీతోష్ణద్రవ్యకల్పితాన్. ౧౨౭
అభ్యంగాలేపసేకాదీన్ జ్వరే జీర్ణే త్వగాశ్రితే,
కుర్యాదంజనధూమాంశ్చ తథైవాగంతుజేపి తాన్. ౧౨౮

జీర్ణజ్వరము చర్మము నాశ్రయించినచో సుఖమునకుతగిన స్పర్శగలదిగను శీత వీర్యము ఉష్ణవీర్యముగల ద్రవ్యములతో సిద్ధము చేయబడినదిగను ఉండు అభ్యంగము ఆలేపము సేకము మొదలగువానిని అంజన ధూమపానములను చేయించ వలయును. పైయంజన ధూమపానములను భూతవిషాదులచే జనించిన అగంతుకజ్వరము నందు విశేషముగా చేయించవలయును.

సర్వాంగతాపమునం దభ్యంగము.

దాహే సహస్రధౌతేన సర్పిషాభ్యంగమాచరేత్,
సూత్రోక్తైశ్చ గణైస్తైస్తైర్మధురామ్లకషాయకైః. ౧౨౯
దూర్వాదిభిర్వా పిత్తఘ్నైః శోధనాదిగణోదితైః,
శీతవీర్యైర్హిమస్పర్శైః క్వాథకల్కకృతైః పచేత్. ౧౩౦
తైలం సక్షీరమభ్యంగాత్సద్యోదాహజ్వరాపహమ్,
శిరో గాత్రం చ తైరేవ నాతిపిష్టైః ప్రలేపయేత్. ౧౩౧

జ్వరితునికి సర్వాంగతాపముగలిగినచో ఆవునెయ్యిని వేయిమార్లు నీళ్లతోకడిగి దానిచే నభ్యంగము చేయించవలయును. మఱియు సూత్రస్థానంబున జెప్పియుండు శీత వీర్యము శీతస్పర్శముగల మధురగణ ద్రవ్యములు అమ్లగణద్రవ్యములు కషాయగణద్రవ్య ములు శోధనాదిగణములో జెప్పబడియుండు దూర్వాదిగణ ద్రవ్యములు న్యగ్రోధాదిగణ ద్రవ్యములు పద్మకాదిగణ ద్రవ్యములు సారిబాదిగణ ద్రవ్యములు వీనికషాయకల్కములతో నువ్వులనూనె, ఆవుపాలనుగలిపి తైలపాకవిధిగ పక్వముజేసి యాతైలముచే జ్వరితునికి అభ్యంగనముచేయించిన సర్వాంగతాపముతో గూడియుండుజ్వరము శీఘ్రముగ నివర్తి యగును. మఱియు పైనిచెప్పిన మధురాదిగణద్రవ్యములను ఉదకముతో కొంచెముగనూరి శిరము అవయవములు వీనియందు లేపనముచేసిన తాపముతోగూడియుండు జ్వరముహ రించును. "శుష్కపిష్టఘనోలేపః చందనస్యాపిదాహకృత్, త్వగ్యాతస్యోష్మణోరోధా చ్ఛీతకృత్వన్యథా గురోః" అనువచనప్రకారము పైమధురాదిగణద్రవ్యములను మెత్తగ

నూరిలేపనము జేసిన తాపమధికమగును; కాబట్టి కొంచెముగ నూరవలయునని తెలియపర చుటకై "నాతిపిష్టైః"అని మూలమునందు జెప్పబడియున్నది. "గాత్రం ప్రలేపయేత్" అని చెప్పుటవలన శిరమునకును లేపనము జేయవలయునని యర్థంబగుచుండినను "విముక్తస్యాపిహిశిరో జ్వరో యస్య నముంచతి, అవిముక్తస్య విజ్ఞేయో జ్వరః పునరుపైతితమ్" అనుతంత్రాంతరవచనప్రకారము శిరము జ్వరమునకు ముఖ్యస్థానంబుగ నుండుటంజేసి దానికివిశేషముగ పైకల్కమును లేపనముజేయవలయునని తెలియబరచుటకై "శిరోగాత్రం చ" అని గ్రంథకర్త జెప్పియున్నాడు.

జ్వరితునికి పరిషేకావగాహనములు.

తత్క్వాథేన పరీషేకమవగాహం చ యోజయేత్,
తథారనాళసలిల క్షీరసూక్తఘృతాదిభిః. ౧౩౨

జ్వరితునికి పైజెప్పిన మధురాది ద్రవ్యకషాయములచేతను; కలి ఉదకము ఆవుపాలు పులికడుగు ఆవునెయ్యి మొదలగువానిచేతను; పరిషేకావగాహములను జేయించవలయును.

జ్వరతాపహరలేపనము.

కపిత్థమాతులుంగామ్ల విదారీరోధ్రదాడిమైః,
బదరీపల్లవోత్థేన ఫేనేనారిష్టజేన వా. ౧౩౩
లిప్తేఽఙ్గే దాహరుఙ్మోహఛర్ది స్తృష్ణా చ శామ్యతి,

వెలగపండు, మాదీఫలము, పుల్లప్రబ్బలి, నేలగుమ్మడు, లొద్దుగు, దానిమ్మపండు, వీని కల్కముచేతగాని, రేగుచిగుళ్లనురుగుతోగాని, కుంకుడుకాయ నురుగుతోగాని, శరీరమునకు లేపనముజేయించిన జ్వరితునికి సర్వాంగతాపము, శూల, మూర్ఛ, వాంతి దప్పి ఇవియన్నియు శమించును.

యో వర్ణితః పిత్తహరో దోషోపక్రమణే క్రమః. ౧౩౪
తం చ శీలయతశ్శీఘ్రం సదాహో నశ్యతి జ్వరః,

దోషోపక్రమణీయాధ్యాయమునందు జెప్పబడియుండు పిత్తహరములైన చికిత్సలచేయుచుండిన తాపముతో గూడియుండు జ్వరము శమించును.

శీతజ్వరహరతైలము.

వీర్యోష్ణైరుష్ణసంస్పర్శైస్తగరాగురుకుంకుమైః. ౧౩౫
కుష్ఠస్థౌణేయశైలేయసరళామరదారుభిః,
నఖరాస్నామురవచాచండైలాద్వయచోరకైః. ౧౩౬

పృథ్వీకాశిగ్రుసురసాహింస్రాధ్యామకసర్షపైః,
దశమూలామృతైరండద్వయపత్తూరరోహిషైః ౧౩౭
తమాలపత్రభూతిక్తసల్లకీధాన్యదీప్యకైః,
మిశిమాషకుళుత్థాగ్నిప్రకీర్యానాకులీద్వయైః. ౧౩౮
అన్యైశ్చ తద్విధైర్ద్రవ్యైశ్శీతే తైలం జ్వరే పచేత్,
క్వథితైః కల్కితైర్యుక్తైస్సురాసౌవీరకాదిభిః ౧౩౯
తేనాభ్యంజ్యాత్సుఖోష్ణేన

ఉష్ణవీర్యము ఉష్ణస్పర్శముగలదిగనుండు గ్రంథితగరము, అగరుచెక్క, కుంకుమ
పువ్వు, చెంగల్వకోష్టు, మాచిపత్రి, శిలాజతు, సరళదేవదారు, నఖము—(అనగా
వ్యాఘ్రనఖమను) గంధద్రవ్యము, సన్నరాస్నము, మురయను గంధద్రవ్యము, వస,
గదొండ, బొంతయేలకులు, పిన్నఏలకులు, కచోరములు, పెద్దజీలకఱ్ఱ, మునుగ,
లసి, జటామాంసి, ధ్యామకమనెడుగంధద్రవ్యము, ఆవాలు, దశమూలములు, తిప్ప
గె, పెద్దాముదపుచెట్టు, చిన్నాముదపుచెట్టు, రక్తచందనము, కామంచిపూరి, తమాల
త్రము, నేలవేము, అంపుగుచెట్టు, దనియాలు, ఓమము, సదాప, మినుములు, ఉల
ం, చిత్రమూలము, పూతికరంజము, పెద్దసర్పాక్షి, చిన్నసర్పాక్షి, వీనివలె శీతో
ముగనుండు నితరయోషధులు, అనువాని కషాయకల్కములతోడ అమ్లపాకరసములు
సురయను మద్యము సౌవీరకమనుమద్యము మొదలగువానిని నువ్వులనూనెను కలిపి
పాకవిధానముగ పక్వముచేసి ఆతైలమును శీతజ్వరమునందు సుఖోష్ణముగ నభ్యం
ము చేయించవలయు.

శీతజ్వరహరలేపనాదులు.

తైస్సుపిష్టైశ్చ లేపయేత్,
కవోష్ణైస్తైః పరీషేకమవగాహం చ కల్పయేత్. ౧౪౦
కేవలైరపి తద్వచ్చ శుక్తగోమూత్రమస్తుభిః,
ఆరగ్వధాదివర్గం చ పానాభ్యంజనలేపనైః. ౧౪౧
ధూపానగరుజాంస్తాంశ్చ వక్ష్యంతే విషమజ్వరే,

శీతజ్వరముగలవానికి పై చెప్పిన గ్రంథితగరము మొదలగు ద్రవ్యములను
త్తగనూరి సర్వాంగములయందు లేపనము జేయించవలయును. మఱియు పైనివచించి
ల గ్రంథితగరము మొదలగు ద్రవ్యములను నూరి ఉదకములోకలిపి సుఖోష్ణముగ
దానిచేతను; పులికడుగు గోమూత్రము పెరుగుమీదిమీగడ వీనిచేతను; పరి

షేకావగాహములను ప్రయోగించవలయును. ఆరగ్వధాదిగణములో జెప్పియుండె ద్రవ్యములను పానాభ్యంజన లేపనాదులయందుపయోగించవలయును. మఱియు అగరు చెక్క ధూపమును విషమజ్వరమునకు చెప్పియుండు ధూపమును వేయవలయును.

## శీతజ్వరహర స్వేదకర్మాదులు.

అగ్న్యనగ్నికృతాన్ స్వేదాన్ స్వేదిభేషజభోజనమ్ ౧౪౨
గర్భభూవేశ్మశయనం కుథాకంబళరల్లకాన్,
నిర్ధూమదీప్తైరంగారైర్హసంతీశ్చ హసంతికాః. ౧౪౩
మద్యం సతూష్ణమరిచం తక్రం కుళుత్థప్రీహీకోద్రవాన్,
సంశీలయేద్వేపథుమాన్యచ్చాన్యదపి పిత్తలమ్. ౧౪౪
దయితాః స్తనశాలిన్యః పీనా విభ్రమభూషణాః,
యౌవనాసవమత్తాశ్చ తమాలింగేయురంగనాః. ౧౪౫
వీతశీతం చ విజ్ఞాయ తాస్తతోపనయేత్పునః,

శీతజ్వరితునికి సూత్రస్థానమున స్వేదవిధ్యధ్యాయములో చెప్పబడియుండు అగ్నివలనజేయబడిన స్వేదకర్మలు అగ్నిసంబంధములేకయే చేయబడిన స్వేదకర్మలు, స్వేదమును పుట్టించునట్టి ఔషధాహారములు, గృహమధ్యములోనుండు భూగృహము—(అనగా నేలమాళిక)యందు శయనము, రత్నకంబళము, కంబళము, శాలువ, మొదలగువానిని కప్పుకొనుట, ధూమవిహీనంబైన యగ్నితోడం జ్వలింపుచుండెడి కుంపటి యందు శరీరమును కాచుకొనుట, మద్యము, త్రికటుకములతో చేర్చబడిన మజ్జిగ, వీనిని పానముజేయుట, ఉలవలు కోద్రవధాన్యము అనువాని నుపయోగించుట, వీనిని పలుమారు చేయుచుండవలయు. వణకుతోగూడియుండు శీతజ్వరితునికి పైచెప్పిన స్వేదకర్మాదులను చేయించుటయేగాక పిత్తకరమైన వస్తువులనుకూడ నుపయోగించవలయును. మఱియు పీనపయోధర సమన్వితలును శృంగారభూషణాలంకృత సర్వాంగములుగలవారును యౌవనమదాంధలును మధుపానమత్తలును ప్రియురాండ్రునైన జవరాండ్రను నాలింగనముజేయించి శీతము నివర్తించినతోడనే యట్టిస్త్రీలను వెలిపరచవలయును.

## సన్నిపాతజ్వరచికిత్స.

వర్ధనేనైకదోషస్య క్షపణేనోచ్ఛ్రితస్య చ. ౧౪౬
కఫస్థానానుపూర్వ్యా వా తుల్యకక్షాన్ జయేన్మలాన్.

హీనముగను అధికముగను విషమించియుండు దోషములవలన జనించిన సన్నిపాతజ్వరమునందు క్షీణించియుండు 1 లేక 2 దోషములను వృద్ధిజేయుట చేతను,

వృద్ధిజెందియుండు 1 లేక 2 దోషములను క్షయింపజేయుటచేతను చికిత్స చేయవలెను. అది యెట్లనగా—వాతాదులలో నొక దోషము క్షయించి రెండుదోషములు వృద్ధిజెందియుండు సన్నిపాతమునందు వృద్ధిజెందిన 2 దోషములు జ్వరమునకు కారణం బగును. పై దోషములు విషమంబులుగ నుండుటవలన వానికి సులభముగ చికిత్స జేయుటకు సాధ్యముకాదు. క్షయించియుండు 1 దోషమును యుక్తమైన ఔషధములచే వృద్ధిపరచిన వాతాదిత్రిదోషములకు సామ్యముకలిగి దానివలన సన్నిపాతజ్వరము సుఖసాధ్యమగును. అనగా వాతము క్షయించి పిత్తశ్లేష్మములు వృద్ధిజెందియుండు సన్నిపాతమునందు పిత్తశ్లేష్మములు జ్వరమును కలుగజేయును. అవి విషమముగ నుండుట వలన సుఖసాధ్యంబుకానేరవు. అట్టి సన్నిపాతజ్వరమున శీతముగ లఘువుగ రూక్షగ నుండు ఔషధములచే క్షయించియుండు వాతమును వృద్ధిపరచిన శ్లేష్మపిత్తములు క్రమముగ క్షయించి త్రిదోషములకు సామ్యావస్థకలిగి జ్వరవేగము తగ్గి యాజ్వరము సుఖసాధ్యమగును.

అటులనే పిత్తదోషము క్షయించి వాతకఫములు వృద్ధిజెందియుండు సన్నిపాతమున నా వాతకఫములు జ్వరకారణంబులుగ నుండును. అవి విషమాశ్రయములుగ నుండుటవలన సుఖసాధ్యము కానేరవు. క్షయించియుండు పిత్తదోషమును జ్వరహారముగ తీక్ష్ణముగ ఉష్ణముగనుండు ఔషధముల ప్రయోగమువలన వృద్ధిపరచిన ప్రకోపించియుండు వాతకఫములు క్షయించి జ్వరవేగము తగ్గి యాజ్వరము సుఖసాధ్యమగును. ఇటులనే కఫము క్షయించి వాతపిత్తములు వృద్ధిజెందియుండు సన్నిపాతమున పై వాతపిత్తములు జ్వరహేతువులుగనుండును. అవి విషమాశ్రయంబులుగనుండుటంజేసి సుఖసాధ్యముకానేరవు. అట్టి సన్నిపాతజ్వరమునందు క్షయించియుండు కఫమును జ్వరహారముగ స్నిగ్ధముగ మధురముగ శీతముగనుండు నౌషధములచే వృద్ధిపరచిన వాతపిత్తములు క్షయించి జ్వరవేగముతగ్గి యాజ్వరము సుఖసాధ్యంబగును. ఇటులనే వృద్ధిజెందియుండు దోషములను తగిన యౌషధములచే క్షయించునటులంజేసి సన్నిపాతమునకు చికిత్సింపవలయును. ఇదియు 1 లేక 2 దోషముల ప్రకోపాధిక్యతవలన జనించిన సన్నిపాతజ్వరమునకు చికిత్సాక్రమము.

ఏకకాలమున వాతాదిదోషములు సమముగ వృద్ధిజెందియుండు సన్నిపాతమునందు కఫస్థానములనుపురస్కరించుకొని క్రమముగ చికిత్సింపవలయును. యెట్లనగా—వాతపిత్తకఫములు సమముగ ప్రకోపించియుండు సన్నిపాతజ్వరమునందు తొలుత కఫమునకును పిదప పిత్తమునకును తర్వాత వాతమునకును చికిత్స జేయవలయును. ఇదియే

కఫమును పురస్కరించుకొని చేయు చికిత్సాక్రమము. "స్థానతః కేచిదిచ్ఛంతి ప్రాక
శ్లేష్మణోవధమ్, శిరస్యురసి కంఠే చ ప్రలిప్తేన్నరుచిఃకుతః. తదభావేకథం భోజ్యపా
ద్రవ్యావచారణా, అసత్య భ్యవహారేచ కుతో దోషవినిగ్రహః. తస్మాదాదౌ కఫ
ఘాత్యః కాయద్వారార్గళోహిసః, మధ్యస్థాయియతః పిత్తమాశుకారి చ చింత్య
అతో వాత సఖస్యాస్యకుర్యాత్తదను నిగ్రహమ్, అధఃస్థస్యాచ తదసునిగ్రాహ్యస్సా
త్సమీరణః." శిరము ఱొమ్ము కంఠము యివి కఫముచేకప్పబడియుండినచో యన్న
పానములయం దిచ్ఛకలుగదు. అపుడు అన్నపానాదు లిష్పించుటకు శక్యముకాదు. ఆ
రములేకుండునపుడు ఔషధములిచ్చి దోషములను శమింపజేయుటకు సాధ్యముకాద
కఫము శరీరమునందలి ద్వారములకు గడియవలె అడ్డముగ నుండును. దానం జే
తొలుత కఫమునకు చికిత్సజేసి పిదప శరీరమధ్యప్రదేశమునందుండు పిత్తమునకును పిద
శరీరమున కధోభాగమునందు వాతమునకును చికిత్సజేయవలయునని తంత్రాంతరవ
నందు జెప్పియున్నది.

"జర్వేజ్జ్వరేఽతిసారే చ క్రమాత్పిత్తకఫానిలాః, ప్రాయేణ తాపాత్తతయ
జ్వరే తేజో విశిష్యతే. విశశ్చ సతతా పిత్తా త్తథాచ మృదుకోష్ఠతా, తస్య చానుగ
శ్లేష్మా గౌరవాపక్తిజాడ్యకృత్. వాయుశ్చ వర్ధతేఽవశ్యంయేష్వహస్సు తయోః క్షయే
జ్వరాతిసారయోస్తస్మాదేష దోషక్షయే క్రమః. కఫపిత్తా నిదానన్యే క్రమాదాహు
రెపోవపి, యస్మాదామాశయో ద్వేదామ్యాయిష్ఠం తత్సముద్భవః. క్రమేణాద్యేన తత్రాః
ప్రవృద్ధాస్స్వాశయే స్థితాః, స్వాశ్రయేషు ప్రదుష్టానాం స్థితైర్బహ్వ్యాశుకారితా
విజ్ఞాయ కర్మభిస్తైస్తైర్దోషోద్రేకం యథామలమ్, భేషజం యోజయేత్తత్తు స్వీక
ర్యాన్న క్రమం భిషక్." జ్వరము తఱుచుగ తాపరూపముగుటంజేసి తాపజ్వరము
కలుగుటకు పిత్తము కారణంబగును. శ్లేష్మము పైపిత్తముతోడంజేరి గురుత్వమును అజీ
ర్ణమును శరీరమందంతట నొప్పిని కలుగజేయును. వాతము పై పిత్తశ్లేష్మములతోగూడి
నదై విశేషముగ వృద్ధియగును. కావున జ్వరమునందును అతిసారమునందును పిత్తకఫ
వాతములకు యథాక్రమముగ చికిత్సలంజేయవలయును. వాతాదులు ఆమాశయమును
జేరి వృద్ధిజెంది దుష్టంబులై దారుణములగు జ్వరాదులను కలుగజేయును. ఆయాదోష
ప్రకోపములను చక్కగ తెలిసికొని వానికి తగిన యౌషధములను ప్రయోగించి తొలుత
కఫమునకును,పిదప పిత్తమునకును తర్వాత వాతమునకును చికిత్సజేయవలయునని కొంద
రాచార్యులు వచించుచున్నారు. అయినను పై క్రమముల ననుసరింపక ఆమాశయ
మున నేదోషము దుష్టమై జ్వరాదులను కలుగజేయుచుండునో యాదోషమునకే
ముందుగ చికిత్సజేయవలయునని సుశ్రుతాచార్యుడును జెప్పియున్నాడు.

"క్రమాన్మరుత్పిత్తకఫాః సర్వత్ర సదృశే బలే, వాతాదీనాం యథాపూర్వం యతస్స్వాభావికం బలమ్. ఊచే పరాశరోఽప్యర్థమముమేవ ప్రమాణయన్. యథోప న్యాసతః ప్రాప్తమాదౌ దోషభిషగ్జితమ్, నేతృభంగేన దృష్టో హి సమం సైన్యపరాజయః" వాతపిత్తశ్లేష్మములు సమానబలము కలవిగనుండినను వానిలో శ్లేష్మమునకన్న పిత్తము, పిత్తమునకన్న వాతము స్వభావముగనే విశేషబలముకలదిగ నుండును. "రాజును జయించినమాత్రముచేత తత్సైన్య మెటులజయింప బడియెడునో" అటులనే దోషములకు రాజైన వాతమును జయించుటవలన పిత్తకఫములు జయింపబడును. దానంజేసి వాతపిత్తకఫములకు యథాక్రమముగ చికిత్స జేయవలయునని పరాశరుడుజెప్పియున్నాడని తంత్రాంతరమునందు జెప్పబడియున్నది.

ఇక స్థానమును పురస్కరించుకొనిచేయు చికిత్సాక్రమ మెట్టిదన:—సూత్రస్థానమునందు "ఆమాశయగతే వాయౌ కఫే పక్వాశయాశ్రితే, రూక్షపూర్వం తథా స్నేహ పూర్వం స్థానానురోధతః" వాతము ఆమాశయమును బొందినప్పుడు తొలుత నట్టిస్థానమననుసరించి స్థానిదోషమగు కఫమునకు రూక్షకర్మనుజేసికొని పిదప నాగంతుక దోషమగు వాతమును స్నేహకర్మ చేతను,ఇటులనేకఫము పక్వాశయమునుబొందినప్పుడు తొలుత నట్టిస్థానము ననుసరించి స్థానిదోషమగువాతమునకు స్నేహకర్మనుజేసికొని పిదప నాగంతుకదోషమగుకఫమును రూక్షకర్మచేతను జికిత్స జేయవలెను." అని జెప్పబడియుండుటంజేసి యిట నామాశయమును పిత్తవాతములలో నేదోషముబొందినను తొలుతనట్టిస్థానముననుసరించి స్థానిదోషమగు కఫమును, పిమ్మట ఆగంతుకములగు నితర దోషములు చికిత్సజేయవలెను. ఇటుల సన్నిపాతజ్వరమునందు మూడుదోషములును సమానబలముగ వృద్ధిబొందినప్పుడు పైనిజెప్పినవిధముగ కఫమును పురస్కరించుకొని గాని లేక స్థానమును పురస్కరించుకొనిగాని జికిత్స జేయవలెను. అయితే ఇట గొందరు "కఫస్థానానుపూర్వ్యా" అనుపదమునకు 'కఫముయొక్కస్థానమును పురస్కరించుకొని' యని కలిపి యర్థము చెప్పుచున్నారు. దీనినిబట్టి కఫస్థానములగు నురఃకంఠాదులు గ్రహింపవలసియున్నట్లు తేలుచున్నది. అయినను "ఆమాశయస్థో హత్వాగ్నిం సామో మార్గాన్ పిధాయ యత్, విదధాతి జ్వరం దోషః తస్మాత్కుర్వీత లంఘనం." అను వాక్యముచేత నామాశయమున కఫముచేరి జఠరాగ్నిని మందిగించి జ్వరమును కలిగించునని తెలియుచున్నది. కావున జ్వరమునందు కఫము ముఖ్యముగదుష్టముగును గాన నట్టి యామాశయమునే గ్రహింపవలెను. సన్నిపాతజ్వరమునందు వాతపిత్తకఫములు సమముగ ప్రకోపించి దుష్టంబులైయున్నప్పుడు జ్వరమును పోగొట్టుటకును పరస్పరనిరుద్ధముతో

గూడినత్రిదోషప్రకోపమును ఒకేకాలమున శమింపజేయుటకును యొకటే ద్రవ్యము దొరుకుట దుర్లభంబుగాన జ్వరహరంబులగు ద్రవ్యములు త్రిదోషములను హరింపజేయు నవిగ ననేకముగానుండుటవలన నట్టివానిని దోషముల పరస్పరవైరుధ్యమును బోగొట్టు నటుల గల్పించి చికిత్స జేయవలెను.

## సన్నిపాతజశోఫచికిత్స.

సన్నిపాతజ్వరస్యాంతే కర్ణమూలే సుదారుణః ౧౪౭
శోఫస్సంజాయతే తేన కశ్చిదేవ ప్రముచ్యతే,
రక్తావసేచనైశ్శీఘ్రం సర్పిఃపానైశ్చ తం జయేత్. ౧౪౮
ప్రదేహైః కఫపిత్తఘ్నైః నావనైః కబలగ్రహైః,

సన్నిపాతజ్వరము శమించినతోడనే చెవిక్రింది ప్రదేశములలో దారుణమైన వాపు జనించును. ఆట్టివాపు జనించినవారలలో ఒకానొకడు పుణ్యవశమువలన జీవించినను జీవించును. అది తఱుచుగ నసాధ్యమగుటంజేసి యావాపును రక్తమోక్షణము ఘృతపానము కఫపిత్తహరములైన ప్రలేపములు నస్యములు కబళగ్రహములు వీనిచే చికిత్స చేయవలయును.

## రక్తగతజ్వరచికిత్స.

శీతోష్ణస్నిగ్ధరూక్షాద్యైః జ్వరో యస్య న శామ్యతి. ౧౪౯
శాఖానుసారీ తస్యాశు ముంచేద్బాహ్వోః క్రమాత్సిరామ్,

వాతపిత్తశ్లేష్మసంసర్గ సన్నిపాతజ్వరములను శమింపజేయునట్టి శీత ఉష్ణస్నిగ్ధరూక్షమొదలగు చికిత్సలంజేసియు జ్వరము శమింపకుండిన నది రక్తము నాశ్రయించి యున్నదని తెలిసికొని శీఘ్రముగా చేతులలో నుండుసిరలను క్రమముగా—అనగా తొలుతకుడిచేతిసిరను పిదప యెడమచేతిసిరను వేధించి రక్తము తీయవలయును.

## విషమజ్వరచికిత్స.

అయమేవ విధిః కార్యో విషమేఽపి యథాయథం. ౧౫౦
జ్వరే విభజ్య వాతాదీన్యశ్చానంతరముచ్యతే,

సతతకముమొదలగు విషమజ్వరములయందు వాతాదిదోషములను ప్రత్యేకముగ విభజించి పూర్వోక్తచికిత్సలం జేయవలయును. మఱియు విషమజ్వరమునందు "పటోలకటుకా" ఇత్యాదిశ్లోకములచే నిక చెప్పబోయెడు చికిత్సలనుగూడ చేయవలయును.

## విషమజ్వరహరకషాయము.

పటోలకటుకాముస్తా ప్రాణదామధుకైః కృతాః. ౧౫౧

త్రిచతుః పంచశః క్వాథాః విషమజ్వరనాశనాః,

చేతిపొట్ల కటుకరోహిణి తుంగముస్తలు కరక్కాయ అతిమధురము ఈ 5 ద్రవ్యములనుగాని లేక వీనిలో 4 ద్రవ్యములనుగాని, 3 ద్రవ్యములనుగాని చేర్చి కాచబడిన కషాయమును పానముచేయించిన విషమజ్వరములు హరించును.

విషమజ్వరమునకు త్రిఫలాదియోగము.

యోజయేత్త్రిఫలాం పథ్యాం గుడూచీం పిప్పలీం పృథక్.
తైస్తైర్విధానైస్సగుడైర్భల్లాతకమథాపి వా,
లంఘనం బృంహణం చాపి జ్వరాగమనవాసరే. ౧౫౩

సతతకము మొదలగు విషమజ్వరములయందు త్రిఫలములనుగాని కరక్కాయనుగాని తిప్పతీగెనుగాని పిప్పళ్లనుగాని ప్రత్యేక ప్రత్యేకముగ ప్రయోగించవలయును. రసాయన ప్రకరణములో జెప్పియుండు ఆయావిధులతోడ బెల్లమును జేర్చి జీడిగింజలనిప్పించవలయును. లేక జ్వరమువచ్చే దినమునందు తొలుత లంఘనమునుగాని బృంహణచికిత్సనుగాని చేయించవలయును.

విషమజ్వరమునందు లశునాదిప్రయోగము.

ప్రాతస్సతైలం లశునం ప్రాగ్భక్తం వా తథా ఘృతమ్,
జీర్ణం తద్వద్దధిపయస్తక్రం సర్పిశ్చ షట్పలమ్. ౧౫౪
కల్యాణకం పంచగవ్యం తిక్తాఖ్యం వృషసాధితమ్,

విషమజ్వరమునందు జ్వరితునికి ప్రాతఃకాలమున నువ్వులనూనెలో వెల్లుల్లిని జేర్చి యిప్పించవలయును. పాతదియగు ఆవునెయ్యి ఆవుపాలు ఆవుపెరుగు మజ్జిగె క్షయచికిత్సితాధ్యాయమునందు చెప్పియుండు షట్పలఘృతము, ఉన్మాదప్రతిషేధాధ్యాయమునందు చెప్పబడియుండు కల్యాణకఘృతము, అపస్మారప్రతిషేధాధ్యాయమునందు చెప్పబడియుండు పంచగవ్యఘృతము, కుష్ఠచికిత్సితాధ్యాయమునందు చెప్పబడియుండు తిక్తకఘృతము, రక్తపిత్తచికిత్సితాధ్యాయమునందు చెప్పబడియుండు వృషఘృతము, వీనిని దోషానుగుణముగ ప్రాతఃకాలమునందుగాని భోజనమునకు పూర్వముగాని జ్వరితుని కిప్పించవలయును.

విషమజ్వరములకు త్రిఫలాదిఘృతము.

త్రిఫలాకోలతర్కారీ క్వాథదధ్నా శృతం ఘృతమ్. ౧౫౫
తిల్వకత్వక్కృతావాపం విషమజ్వరజిత్పరమ్,

త్రిఫలములు రేగు తక్కోడ వీనికషాయము 4 భాగములు; ఘృతము 1 భాగము; పెరుగు 2 భాగములు; వీనిని నొకటిగ జేర్చి లొద్దుగుపట్టచూర్ణమును కలిపి

ఘృతపాకవిధిగ పక్వముచేసి యీ ఘృతము నిప్పించిన నిస్సంశయముగ విషమజ్వరములు హరించును.

### విషమజ్వరమునకు సురాదిప్రయోగము.

సురాం తీక్ష్ణం చ యన్మద్యం శిఖితిత్తిరికుక్కుటాత్. ౧౫౬
మాంసం మధ్యోష్ణవీర్యం చ సహాన్నేన ప్రకామతః,
సేవిత్వా తదహస్స్వప్యా దథవా పునరుల్లిఖేత్. ౧౫౭
సర్పిషో మహతీం మాత్రాం పీత్వా తచ్ఛర్దయేత్పునః,

సురయను మద్యము తీక్ష్ణమద్యము కొంచెముష్ణవీర్యముతోఁగూడియుండు నెమలి తిత్తిరి కోడి వీనిమాంసములు అనువానిని అన్నముతో యథేష్టముగ భుజించి ఆదినమంతయు నిద్రించవలయును. లేక పైచెప్పిన మద్యమాంసాద్యన్నములను తృప్తిగ భుజించి వమనముచేయవలయును. లేక ఉత్తమమాత్రగ ఆవునెయ్యినిత్రాగి వమనము చేయవలయును.

### విషమజ్వరమునకు నీలిన్యాదికషాయము.

నీలినీమజగంధాం చ త్రివృతాం కటురోహిణీమ్. ౧౫౮
పిబేజ్జ్వరస్యాగమనే స్నేహస్వేదోపపాదితః,

జ్వరితునికి స్నేహస్వేదకర్మలను చేయించి నీలియాకు వాయింట తెల్లతెగడ కటుకరోహిణి వీనిని ప్రత్యేకప్రత్యేకముగ నుదకములోవైచి కషాయముకాచి దానిని జ్వరమువచ్చెడిదినమునందు ఇప్పించవలయును.

### విషమజ్వరహర అంజనము.

మనోహ్వా సైంధవం కృష్ణా తైలేన నయనాంజనమ్. ౧౫౯
యోజ్యం

మణిశిల సైంధవలవణము పిప్పళ్లు వీనిని నువ్వులనూనెతో నూరి కండ్లకు అంజనమువేసిన విషమజ్వరములు హరించును.

### విషమజ్వరమునందు నస్యము.

హింగుసమా వ్యాఘ్రీ వసా నస్యం ససైంధవమ్,
పురాణసర్పిస్సింహస్య వసా తద్వత్ససైంధవా. ౧౬౦

ఆడపులిక్రొవ్వు ఇంగువ వీనిని సమభాగములుగ చేర్చిగాని, లేక ప్రాతనెయ్యి సింహముయొక్క క్రొవ్వు వీనిని సమభాగములుగ చేర్చిగాని, కొంచెము సైంధవలవణ సహితముగ నస్యముచేయించిన విషమజ్వరములు హరించును.

### విషమజ్వరమునకు అపరాజితధూపము.

పలంకషా నింబపత్త్రం వచా కుష్ఠం హరీతకీ,
సర్షపా సయవా సర్పిర్ధూపో విడ్వా బిడాలజా. ౧౬౧
పురధ్యామవచాసర్జనింబార్కాగరుదారుభిః,
ధూపో జ్వరేషు సర్వేషు ప్రయోక్తవ్యోఽపరాజితః ౧౬౨
ధూపనస్యాంజనత్రాసా యే చోక్తాశ్చిత్తవైకృతే,

పల్లేరు, వేపాకు, వస, చెంగల్వకోష్టు, కరక్కాయ, ఆవాలు, యవలు, నెయ్యి వీనిచేవేయబడిన ధూపము; మార్జాలవిష్ఠము, మహిసాక్షి, గుగ్గిలము, కామంచి, వస, సర్జరసము, వేప, జిల్లేడు, అగరు, దేవదారు, వీనితోవేయబడినధూపము; అపరాజిత యనబడును. ఈ రెండు ధూపములను సర్వజ్వరములయందు ప్రయోగించవలయును. ఉన్మాదాపస్మార రోగములకు చెప్పియుండు ధూపములు నస్యములు అంజనములు భయ పరచుట వీటినన్నిటిని విషమజ్వరములయందును చేయించవలయును.

### విషమజ్వరములకు మణిమంత్రాదిప్రయోగము.

దైవాశ్రయం చ భైషజ్యం జ్వరాన్ సర్వాన్వ్యపోహతి. ౧౬౩
విశేషాద్విషమాన్ప్రాయస్తే హ్యాగన్తవనుబంధజాః,

మణి, మంగళము, బలిదానము, ప్రాయశ్చిత్తము, మంత్రజపము, దానము, స్వస్తివాచనము మొదలగు దేవతాసంబంధములైన యౌషధములు జ్వరములనన్నిటిని పోకడచును. విషమజ్వరములు ప్రాయికముగ భూతాదిసంబంధమువలన జనించును. కాన పైచెప్పిన మణ్యాద్యౌషధములు వానిని నిస్సంశయముగ నివర్తిజేయును.

### విషమజ్వరమునందు సిరావేధము.

యథాస్వం చ సిరాం విధ్యేదశాంతౌ విషమజ్వరే. ౧౬౪

విషమజ్వరము శమింపకయుండిన నాయాదోషానుగుణముగ సిరలను వేధించ వలయు. "రసస్థే సతి సర్వస్మిన్కుర్యాద్వమనలంఘనే, సేకసంశమనాలేప రక్తమోక్ష మసృక్స్థితే, తీక్ష్ణం విరేకం మాంసస్థే మేదోఘ్నం మేదసి స్థితే, అస్థిస్థే వాతశమన మభ్యంగస్వేదమర్దనమ్, జ్వరే వాతార్తిశమనం విశేషాద్వస్తికర్మ చ." జ్వరము రస ధాతువునాశ్రయించియుండిన వమనలంఘనములను, రక్తమునాశ్రయించియుండిన సేక మును, సంశమనౌషధమును, ప్రలేపమును, రక్తమోక్షణమును, మాంసమునాశ్రయించి యుండిన తీక్ష్ణవిరేచనమును, మేదస్సునాశ్రయించియుండిన మేదోదోషహరౌషధము లను, అస్థులనాశ్రయించియుండిన వాతహారములైన అభ్యంగ స్వేదమర్దనములను, విశేషముగ వాతహారములైన వస్తికర్మలను, చేయించవలయును. మజ్జాశుక్రములనాశ్ర

చేతను, కామక్రోధములవలన జనించినజ్వరము భయశోకములచేతను శమనము జెందును.

—॥ శాపాదిజనితజ్వర చికిత్స. ॥—

శాపాథర్వణమంత్రోత్థే విధిర్దైవవ్యపాశ్రయః. ౧౬౯

ఋష్యాది శాపములు అథర్వణమంత్రములు వీనివలన జనించిన జ్వరమునందు దైవసంబంధములగు చికిత్సలను అనగా—మణి మంత్ర బలి ఉపహార ప్రాయశ్చిత్త జప దాన స్వస్త్యయనాదులను చేయవలయును.

—॥ ఆగంతుకజ్వరములయం దాహారాదినియమము. ॥—

తే జ్వరాః కేవలాః పూర్వం వ్యాప్యంతేఽనంతరం మలైః,
తస్మాద్దోషానుసారేణ తేష్వాహారాది కల్పయేత్. ౧౭౦
న హి జ్వరోఽనుబధ్నాతి మారుతాద్యైర్వినాకృతః,

ఔషధాదులవలనజనించు పైఆంగతుక జ్వరములు తొలుత వాతాదిదోష ప్రకోపములులేకయే జనించును. మరియు నవి వాతాదులసంబంధములేక చిరకాలమును వర్తింపనేరవు. కావున పై జ్వరములు కలిగిన పిదప వాతాదిదోషములు ప్రకోపించి శరీరమంతట వ్యాపించును. అపుడు దోషానుగుణములైన యాహారాదుల నిప్పించవలయును.

—॥ జ్వరితోపచారము. ॥—

జ్వరకాలస్మృతిం చాస్య హారిభిర్విషయైర్హరేత్. ౧౭౧

జ్వరకాలవేగములనుందలచి భయపడుచుండు జ్వరితునికి మనోహరములైన శబ్దాదివిషయములచే జ్వరకాలవేగస్మరణములను మరచునటుల జేయవలయును.

—॥ జ్వరితునికి మనశ్శుద్ధ్యావశ్యకము. ॥—

కరుణార్ద్రం మనశ్శుద్ధం సర్వజ్వరవినాశనమ్,

రాగద్వేషాదులచే దూషింపబడక కరుణార్ద్రంబుగనుండెడి శుద్ధమైన మనస్సు సమస్తజ్వరములను హరింపజేయును.

—॥ జ్వరవిముక్తులు వర్జింపతగినవి. ॥—

త్యజేదాబలలాభాచ్చ వ్యాయామస్నానమైథునమ్. ౧౭౨
గుర్వసాత్మ్యవిదాహ్యన్నం యచ్చాన్యజ్జ్వరకారణమ్,

జ్వరమునివర్తించి పిదప తనశరీరమునకు మరల బలముకలుగుపర్యంతము వ్యాయామము, స్నానము, స్త్రీసంభోగము, గురువుగ అసాత్మ్యముగ విదాహకారిగనుండు యన్నములను జ్వరకారణములైన తదితరవస్తువులనుభుజింపంజనదు. "పిష్టాన్నం హరితం

శాకం మాంసం పిష్టం తిలాం దధి, గ్రామ్యానూపౌదకాజావిగవ్యసూకరమాహిషమ్, మాంసం శుష్కాహి శాకాని సర్వమేవ త్యజేజ్జ్వరీ" పిండిచే జేయబడిన యన్నము, ఆకుకూరలు, ఎండినమాంసము, నువ్వులు, పెరుగు, గ్రామ్యానూపదేశజమాంసములు, మేక గొఱ్ఱె ఆవు పంది దున్నపోతు వీనిమాంసములు, యెండిన శాకములు మొదలగు వానిని జ్వరితుడు వర్జింపవలయునని ఖరనాదుడును చెప్పియున్నవాడు. "జ్వరితైస్తిత్తిరి క్రౌంచ శిఖివర్తకకుక్కుటాః, గురూష్ణత్వాద్వివర్జ్యాస్స్యురత్ర సోపద్రవే జ్వరే." తిత్తిరిపక్షి క్రౌంచపక్షి నెమలి మీనవల్లంకిపిట్ట కోడి వీని మాంసములు గురువుగ ఉష్ణముగ నుండుటవలన వానిని జ్వరితుడు వర్జింపవలయునని మరియొక తంత్రకారుడు వచించియున్నవాడు.

న విజ్వరో పి సహసా సర్వాన్నీనో భవేత్తథా,
నివృత్తో౽పి జ్వరశ్శీఘ్రం వ్యాపాదయతి దుర్బలమ్. ౧౭౩
సద్యఃప్రాణహరో యస్మాత్తస్మాత్తస్య విశేషతః,
తస్యాం తస్యామవస్థాయాం తత్తత్కుర్యాద్భిషగ్ఘితమ్. ౧౭౪

జ్వరము చక్కగ విడిచియుండినను తోడనే అన్నియన్నములను భుజింపం జనదు. ఏలననగా—జ్వరము నివర్తించియుండినను అది యపథ్యములచే దుర్బలుడుగ నుండువానిని శీఘ్రముగ జంపును. మఱియు జ్వరము సద్యః ప్రాణహరంబగుటవలన దాని యందు సామపచ్యమానపక్వ జీర్ణవిషమచిరనివృత్తజ్వరాదియవస్థలయందు లంఘనస్వేదనయవాగు పాచన క్షీర ఘృతపానాది ఔషధములను మిక్కిలిజాగ్రతతో నిప్పింపవలయును.

ఓషధయో మణయశ్చ సుమంత్రాః సాధుగురుద్విజదైవతపూజాః
ప్రీతికరా మనసో విషయాశ్చఘ్నంత్యపివిష్ణుకృతంజ్వరముగ్రమ్.

ఓషధులను మణులను ధరించుట, శ్రేష్ఠమైనమంత్రములను జపించుట, సాధువులు గురువులు బ్రాహ్మణులు దేవతలు వీరినిపూజించుట, మనస్సునకు ప్రియమైనవిషయములను నను భవించుట, ఇవి విష్ణువుచే చేయబడిన ఉగ్రజ్వరములనుకూడ పోగొట్టును.

ప్రథమాధ్యాయము, ముగిసెను.

# ద్వితీయాధ్యాయము.

అవ. జ్వరము రుద్రకోపమువలన జగదీశుని ఫాలనేత్రమువలన సంభవించినదని జ్వరముయొక్క యుత్పత్తి చెప్పబడెను. అట్టి చిచ్చుకంటివలన గల్గుటం జేసియే జ్వరము సంతాపరూపమైనది. అట్టి జ్వరసన్తాపమువలన రక్తపిత్తము సంభవించునని "తద్యథా జ్వరసన్తాపాద్రక్తపిత్తముదీర్యతే" అను తంత్రాన్తరవచనముచే దెలిసెడి. అట్టి పౌర్వాపర్య సంబంధమునుబట్టి జ్వరచికిత్సను జెప్పినపిదప రక్తపిత్తచికిత్సను చెప్పుట సమంజసము. అందును రక్తపిత్తము మిక్కిలి శీఘ్రముగ నపాయమును గల్గించుస్వభావము కల్గినది కావున నిదానమున జెప్పబడని విశేషాంశముల వివరింపుచు చికిత్స చెప్పబడును.

సూ. అథాతో రక్తపిత్తచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

జ్వరచికిత్సితాధ్యాయనిరూపణానంతరము రక్తపిత్తరోగచికిత్సలను తెలియపరచునట్టి రక్తపిత్తచికిత్సితమను నీయధ్యాయమును నిరూపించుచున్నారము.

## సాధ్యరక్తపిత్తరోగములు.

ఊర్ధ్వగం బలినోఽవేగమేకదోషానుగం నవమ్,
రక్తపిత్తం సుఖే కాలే సాధయేన్నిరుపద్రవమ్. ౧

బలశాలిగా నుండువానికి జనించినదియు, కఫముతోగూడినదియు, వేగరహితమైనదియు, హేమంతఋతువునందు లేక శిశిరఋతువునందు జనించినదియు, శారీరస్థానములో వికృతవిజ్ఞానీయాధ్యాయమునందు "రక్తపిత్తం భృశం రక్తం" ఇత్యాది శ్లోకములలో జెప్పియుండు నుపద్రవములు లేకుండునదియు, నూతనమైనదియు నైన ఊర్ధ్వగత రక్తపిత్తరోగము చికిత్సింపవలయును. రక్తపిత్తరోగమునకు పై లక్షణములు లేకుండినచో నది యసాధ్యము.

## యాప్యరక్తపిత్తరోగములు.

అధోగం యాపయేద్రక్తం యచ్చ దోషద్వయానుగమ్,

ఊర్ధ్వగతరక్తపిత్తమునకు చెప్పియుండు లక్షణములుగల అధోగతరక్తపిత్తము దుర్బలమైన వాతపిత్తములతోగూడియుండు ఊర్ధ్వగతరక్తపిత్తము ఇవియాప్యంబులు.

### అసాధ్యరక్తపిత్తరోగములు.

శాంతం శాంతం పునః కుప్యేన్మార్గాన్మార్గాన్తరంచ యత్. ౨
అతిప్రవృత్తం మందాగ్నేస్త్రిదోషం ద్విపథం త్యజేత్,

మిక్కుటముగ శమించి మరల ప్రకోపించియుండు ఊర్ధ్వగతరక్తపిత్తము లేక అధోగతరక్తపిత్తము, ఊర్ధ్వమార్గములగు ముక్కు కండ్లు చెవులు నోరు వీనియందుండి, అధోమార్గములైన మేఢ్ర గుదములను జెందురక్తపిత్తము, అధోమార్గమునుండి ఊర్ధ్వమార్గమును జెందు రక్తపిత్తము, "జీవితం ప్రాణినాం తత్ర రక్తే తిష్ఠతి తిష్ఠతి," అను వచనప్రకారము ప్రాణములకు ముఖ్యాధారంబుగ నుండురక్తమును విశేషముగ వెడలింప జేయునట్టి ఊర్ధ్వగత అధోగతరక్తపిత్తములు, మందాగ్నిగలవారికి జనించినరక్తపిత్తములు, వాతాది త్రిదోషప్రకోపములతోగూడియుండు రక్తపిత్తము. ఏకకాలమున ఊర్ధ్వాధోమార్గములరెంటియందు ప్రవర్తించునట్టి రక్తపిత్తము ఇవి అసాధ్యంబులగుట వలన చికిత్సయందు వర్జనీయంబులు.

### రక్తపిత్తచికిత్సాక్రమము.

సంతర్పణోత్థం బలినో బహుదోషస్య సాధయేత్. 3
ఊర్ధ్వమార్గం విరేకేణ వమనేన త్వధోగతమ్,
శమనైర్బృంహణైశ్చాన్యల్లంఘ్యబృంహ్యానవేక్ష్య చ. ౪

బలిష్ఠుండును అనేకదోషములుగలవాడునైన మనుజునికి సంతర్పణచికిత్సచే జనించిన యూర్ధ్వగతరక్తపిత్తమును విరేచనముచేతను, అధోగతరక్తపిత్తమును వమనముచేతను చికిత్సచేయవలయు. దుర్బలుడును స్వల్పదోషముగలవాడునైనమనుజునికి అపతర్పణమువలన జనించిన యూర్ధ్వగతరక్తపిత్తమును శమనౌషధములచేతను, అధోగత రక్తపిత్తమును బృంహణౌషధములచేతను చికిత్సచేయవలయు. మఱియు అపతర్పణజనిత రక్తపిత్తమునందు లంఘ్యబృంహ్యములను జక్కగ పర్యాలోచించి చికిత్స చేయవలయు. అనగా అధోగతరక్తపిత్తము లంఘనాదులచే జనించియుండినచో దానిని శమనౌషధముచేతను, ఊర్ధ్వగతరక్తపిత్తము బృంహణాదులచే జనించియుండినచో దానిని లంఘనములచేతను చికిత్సచేయవలయుననిభావము.

"జ్ఞాత్వా నిదానమయనం మలానుబలా బలమ్, దేశకాలాద్యవస్థాం చ రక్తపిత్తే ప్రయోజయేత్, లంఘనం బృహణంచాదౌ శోధనం శమనం తథా." తీక్ష్ణోష్ణ కట్వమ్లాది సేవనరూపములైన రక్తపిత్తనిదానములు, ఊర్ధ్వాధోమార్గములు, రక్తపిత్తములకు సహాయముగనుండు వాతకఫములు మూడువిధములగు బలములు, శరీరము భూమి

అను రెండువిధములైనదేశములు, జాంగల అనూప సాధారణములను భేదముగల భూప్రదేశము, ముహూర్తాదికాలములు, శీతోష్ణవర్ష స్వరూపావస్థలు, జాఠరాగ్ని ఆహారము సత్వము సాత్మ్యము వయస్సు ప్రకృతిమొదలగువానిని చక్కగ పర్యాలోచించి సద్వైద్యుడు రక్తపిత్తరోగమునందు లంఘనము బృంహణము శోధనము శమనము వీనిని రోగాద్యనుగుణముగ జేయించవలయు ననితంత్రాంతరమునందు జెప్పబడియున్నది.

## ఊర్ధ్వగతరక్తపిత్తచికిత్స.

ఊర్ధ్వం ప్రవృత్తే శమనౌ రసౌతిక్తకషాయకౌ,
ఉపవాసశ్చ నిశ్శుంఠీషడంగోదకపాయినః. ౫

ఊర్ధ్వగతరక్తపిత్తమునందు రోగికి శుంఠిని చేర్చక షడంగోదకమును పానము చేయించి చేదు వగరు రసములుగలద్రవ్యము లుపయోగించుటయేగాక యుపవాసము జేయించిన హితము కలుగును.

## అధోగతరక్తపిత్తచికిత్స.

అధోగే రక్తపిత్తే తు బృంహణో మధురో రసః,

రక్తపిత్తము అధోమార్గముగ ప్రవర్తించుచుండిన బృంహణమైన మధురరసము నుపయోగించిన హితకరంబుగనుండును.

## ఊర్ధ్వాధోగతపిత్తరోగమునకు పథ్యము.

ఊర్ధ్వగే తర్పణం యోజ్యం పేయాపూర్వమధోగతే. ౬

ఊర్ధ్వగత రక్తపిత్తరోగమునందు తొలుత పుష్టికరములైన గంజిమొదలగు వానిని, అధోగతరక్తపిత్తమునందు తొలుత పేయాదులను నిప్పించవలయును.

## అశుద్ధరక్తధారణ నిషేధము.

అశ్నతో బలినోఽశుద్ధం న ధార్యం తద్ధి రోగకృత్,
ధారయేదన్యథా శీఘ్రమగ్నివచ్ఛీఘ్రకారి తత్. ౭

పేయాదులను భుజించువాడును బలిష్ఠుడునైన రక్తపిత్తరోగికి అశుద్ధరక్తము వెడలుచుండిన దాని నడ్డగింపంజనదు. ఏలననగా—అట్టిదుష్టరక్తము సూత్రస్థానములో సిరావ్యధవిధ్యధ్యాయమునందు జెప్పియుండు విసర్ప విద్రధి ప్లీహాదిరోగములను గలుగ జేయును. దుర్బలుడుగ భోజనములేకుండువాడుగనుండు రక్తపిత్తరోగికి అశుద్ధరక్తము వెడలుచుండిన దానిని శీఘ్రముగ నడ్డగింపవలయును. అటుల జేయనిచో రోగి శీఘ్రముగ మరణముజెందును.

## రక్తపిత్తమునకు త్రివృతాదిలేహ్యము.

త్రివృచ్ఛ్యామాకషాయేణ కల్కేన చ సశర్కరమ్,



సాధయేద్విధివల్లేహం లిహ్యాత్పాణితలం తతః. ౮

తెల్లతెగడ నల్లతెగడ అనువాని కషాయకల్కములలో పంచదారను జేర్చి విధి ప్రకారము లేహమును పక్వముజేసి పాణితలప్రమాణము సేవించిన రక్తపిత్తరోగము శమించును. కంటకారికాలేహమునకు చెప్పియుండు పరిమాణప్రకారము తెగడ కషాయకల్కములు, పంచదార వీని పరిమాణమును నెరుంగవలయునని వృద్ధవైద్యులు వచింపుచున్నారు.

## త్రివృతాది మోదకము.

త్రివృతా త్రిఫలా శ్యామా పిప్పలీ శర్కరా మధు,
మోదకస్సన్నిపాతోర్ధ్వరక్తశోషజ్వరాపహః. ౯
త్రివృత్సమసితాతద్వత్పిప్పలీ పాదసంయుతా,

తెల్లతెగడ త్రిఫలములు నల్లతెగడ పిప్పళ్లు పంచదార తేనె వీనితో చేయబడిన మోదకమును అనగా—వటకమును యిప్పించినను, లేక తెల్లతెగడ పంచదార సమభాగములు, పిప్పళ్లు పాలికభాగము వీనినన్నిటిని యొకటిగ జేర్చి యిప్పించినను సన్నిపాతము ఊర్ధ్వగతరక్తపిత్తము శోష జ్వరము హరించును.

## అధోగతరక్తపిత్తచికిత్స.

వమనం ఫలసంయుక్తం తర్పణం ససితామధు. ౧౦
ససితం వా జలం క్షౌద్రయుక్తం వా మధుకోదకమ్,
క్షీరం వా రసమిక్షోర్వా

అధోగతరక్తపిత్తరోగమునందు వమనముగుటకై మ్రంగపండుతోగూడిన తర్పణమును పంచదార తేనెలతోడ నిప్పించవలయును. లేక శర్కరోదకమునుగాని తేనె గలిపిన యుదకమునుగాని యష్టిమధుకోదకమునుగాని ఆవుపాలనుగాని చెరుకురసమునుగాని మ్రంగపండు సహితముగ నిప్పించవలయును.

## అధోగతరక్తపిత్తమునకు పేయాదులు.

శుద్ధస్యానంతరో విధిః. ౧౧
యథాస్వం మంథపేయాదిః ప్రయోజ్యో రక్షతా బలమ్,

ఊర్ధ్వగతరక్తపిత్తముగలవారికి లేక అధోగతరక్తపిత్తముగలవారికి విరేచన వమనంబుల జేయించిన పిదప ఆయా యోగానుసారంబుగ పక్వముజేయబడిన మంథమును పేయాదులను యథాక్రమముగ (అనగా—ఊర్ధ్వరక్తపిత్తరోగమునందు మంథమును అధోరక్తపిత్తరోగమునందు పేయాదులను) ఆహారముగ నిప్పించవలయును.

## రక్తపిత్తరోగికి మంథాదులు.

మంథో జ్వరోక్తో ద్రాక్షాదిః పిత్తఘ్నైర్వా ఫలైః కృతః. ౧౨
మధుఖర్జూరమృద్వీకా పరూషకసితాంభసా,
మంథో వా పంచసారేణ సఘృతైర్లాజసక్తుభిః. ౧౩
దాడిమామలకామ్లో వా మందాగ్న్యమ్లాభిలాషిణామ్,

జ్వరచికిత్సలో "ద్రాక్షామధూకమధుకేత్యాది" శ్లోకములలో చెప్పబడియుండు ద్రాక్షాదిద్రవ్యములతో పక్వముచేయబడిన మంథమునుగాని, పిత్తహరములైన ద్రాక్షపండు ఉసిరిక పెద్దగుమ్ముడు యష్టిమధుకము మొదలగు ఫలములతో పక్వముచేయబడిన మంథమునుగాని, తేనె ఖర్జూరము ద్రాక్ష పేరీత పంచదార వీనిని యుదకములోచేర్చి చేయబడిన పంచసారకమను పేరుగల పానకములో వరిపేలాల పిండిని కలిపి ఘృతసహితముగ చేయబడిన మంథమునుగాని యిప్పించవలయును. అగ్నిమాంద్యముగలవారికిని పులుపునుగోరువారికిని దానిమ్మ ఉసిరికజేర్చిన మంథము నిప్పించవలయును.

## అధోగతరక్తపిత్తమునందు పేయాక్రమము.

కమలోత్పలకింజల్కపృశ్నిపర్ణిప్రియంగుకాః. ౧౪
ఉశీరం శాబరం లోధ్రం శృంగిబేరం కుచందనమ్,
హ్రీబేరం ధాతకీపుష్పం బిల్వమధ్యం దురాలభా. ౧౫
అర్ధార్ధవిహితా పేయా వక్ష్యంతే పాదయౌగికాః,
భూనింబసేవ్యజలదా మసూరః పృశ్నిపర్ణ్యసి ౧౬
విదారిగంధా ముద్గాశ్చ బలా సర్పిర్హ్రేణుకా,

అధోగతరక్తపిత్తముగలవారికి విరేచనకర్మను చేయించినపిదప తామరకేసరములు నల్లకలువలకేసరములు కోలపొన్న ప్రేంకణము వీనితో పక్వముజేయబడిన పేయ; వట్టివేరు తెల్లలొద్దుగు లొద్దుగు అల్లము రక్తచందనము వీనితో సిద్ధముచేయబడినపేయ; కురువేరు ఆరెపువ్వు మారేడుగుజ్జు దూలగోవిల వీనితో పక్వముచేయబడిన పేయ; నేలవేము వట్టివేరు తుంగముస్తలు వీనితో పక్వముచేయబడినపేయ; చిరిసెనగలు కోలపొన్న వీనితో పక్వముచేయబడిన పేయ; ముయ్యాకుపొన పెసలు వీనితో పక్వముచేయబడిన పేయ; చిట్టాముట్టి ఆవునెయ్యి రేణుకలు వీనితో పక్వముచేయబడిన పేయ యీ పేయలను ఇప్పించవలయును.

## రక్తపిత్తరోగులకు హితకరమాంసరసములు.

జాంగలాని చ మాంసాని శీతవీర్యాణి సాధయేత్. ౧౭

పృథక్పృథగ్జలే తేషాం యవాగూః కల్పయేద్రసే,
శీతాస్సశర్కరాక్షౌద్రాస్తద్వన్మాంసరసానపి. ౧౮
ఈషదమ్లానసమ్లాన్వా ఘృతభృష్టాన్సశర్కరాన్,

శీతవీర్యముగల కుందేలు మొదలగు జాంగలమాంసములను ప్రత్యేకప్రత్యేకముగ ఉదకములో పక్వముచేసి యామాంసరసములలో యవాగును పాకముచేసి చల్లార్చి శర్కర తేనెసహితముగ అధోగతరక్తపిత్తరోగికి యిప్పించవలయును. మఱియు పై మాంసరసములను పులుపునుగోరువారికి కొంచెము పుల్లగను, పులుపుగోరనివారికి నేతితో సంస్కరించి పంచదార యుక్తముగను, ఇప్పించవలయును.

రక్తపిత్తరోగికిపథ్యకరధాన్యములు.

శూకశింబీభవం ధాన్యం రక్తే శాకం చ శస్యతే ౧౯
అన్నస్వరూపవిజ్ఞానే యదుక్తం లఘు శీతలమ్,

రక్తపిత్తరోగమునందు శూకశింబిజధాన్యములు శాకములు హితకరంబులు. మఱియు సూత్రస్థానములో అన్నస్వరూపవిజ్ఞానీయాధ్యాయమునందు జెప్పబడినట్టి లఘువుగ శీతలముగనుండు ధాన్యంబులన్నియు హితకరంబులు.

రక్తపిత్తరోగులకు హితకరోదకము.

పూర్వోక్తమంబు పానీయం పంచమూలేన వా శృతమ్. ౨౦
లఘునా శృతశీతం వా మధ్వంభో వా ఫలాంబు వా,

పూర్వముచెప్పిన శుంఠిరహితమైన షడంగోదకమునుగాని లఘుపంచమూలములతో కాచబడిన యుదకమునుగాని కాచి చల్లార్చిన యుదకమునుగాని తేనెచేర్చిన యుదకమునుగాని పిత్తహరములైన ద్రాక్ష మొదలగు పండ్లతో కాచబడిన యుదకమునుగాని పానముజేయించిన రక్తపిత్తరోగులకు హితము గలుగును. "కర్షం గృహీత్వా ద్రవ్యస్య క్వాథయేత్ప్రస్థికేఽంభసి, అర్ధశృతం ప్రయోక్తవ్యం జలపాకే త్వయం విధిః"1 ప్రస్థముదకములో కర్షప్రమాణము ద్రవ్యములజేర్చి అర్ధభాగము మిగులునట్లు కాచవలయును. ఇదియ ఉదకమును కాచునట్టి విధియని తంత్రాంతరమునందు జెప్పయున్నది.

రక్తపిత్తరోగికి హితకరమాంసములు.

శశస్సవాస్తుకశ్శస్తో విబంధే తిత్తిరిః పునః. ౨౧
ఉదుంబరస్య నిర్యూహే సాధితో మారుతేఽధికే,
ప్లక్షస్య బర్హిణస్తద్వన్న్యగ్రోధస్య చ కుక్కుటః. ౨౨

రక్తపిత్తరోగికి మలబంధము కలిగియుండినచో చక్రవర్తికూరతో పక్వముజేయబడిన కుందేలుమాంసము, వాతమధికముగనుండిన మేడికషాయములో పక్వము

చేయబడిన తిత్తిరిపక్షిమాంసము, జువ్వికషాయములో సిద్ధముచేయబడిన నెమలి మాంసము, మఱ్ఱికషాయములో పక్వముచేయబడిన కోడిమాంసమును హితకరంబులు.

రక్తపిత్తరోగికి వర్జ్యంబులు.

యత్కించిద్రక్తపిత్తస్య నిదానం తచ్చ వర్జయేత్. ౨౩

రక్తపిత్తరోగమునకు కారణమైనదానిని (అనగా—దేనినుపయోగించినందువలన రక్తపిత్తరోగము జనించినదో అట్టిదానిని) రక్తపిత్తరోగి వర్జింపవలయును.

రక్తపిత్తమునకు వాసాదికషాయము.

వాసారసేన ఫలినీ మృత్ధ్రాద్రోంజనమాక్షికమ్,
పిత్తాసృక్శమయేత్పీతం నిర్యాసో వాటరూషకాత్. ౨౪
శర్కరామధుసంయుక్తః కేవలో వా శృతోఽపి వా,
పృషస్సద్యో జయత్యస్రం స హ్యస్య పరమౌషధమ్. ౨౫

అడ్డసరరసములో ప్రేంఖణము నల్లమన్ను అంజనము మాక్షికము కలిపి పానముచేసిన రక్తపిత్తము శమించును. మఱియు అడ్డసరకషాయమును పంచదారతోగాని లేక అడ్డసరరసమును మాత్రముగాని లేక అడ్డసర కషాయమునుగాని పానముచేసిన రక్తపిత్తము శమించును. రక్తపిత్తరోగమునకు అడ్డసరము ముఖ్యౌషధము కావున దానినుపయోగించిన తత్క్షణమే రక్తపిత్తరోగము నివర్తింను.

రక్తపిత్తరోగమునకు పటోలాదికషాయము.

పటోలమాలతీనింబచందనద్వయపద్మకమ్,
లోధ్రోవృష స్తండులీయః కృష్ణమృణ్మదయంతికా. ౨౬
శతావరీ గోపకన్యా కాకోళ్యౌ మధుయష్టికా,
రక్తపిత్తహరాః క్వాథాః త్రయస్సమధుశర్కరాః ౨౭

చేదుపొట్ల, జాజియాకు, వేము, చందనము, రక్తచందనము, పద్మకము, వీని కషాయము, లొద్దుగు, అడ్డసరము, చిఱ్ఱికూర, నల్లమన్ను, మల్లె అనువాని కషాయము, పిల్లిపీచర, సుగంధిపాల, కాకోళి, క్షీరకాకోళి, అతిమధురము, వీనికషాయము ఈమూడు విధములగు కషాయములను తేనె శర్కరలతోడ ప్రత్యేక ప్రత్యేకముగ పానముచేసిన రక్తపిత్తరోగము శమించును. "వాసాకుటజకూశ్మాండ శతపుష్పాసహాచరాః, నిత్యమార్ద్రాః ప్రయోక్తవ్యా స్తథాహి ద్విగుణానతే." అడ్డసరము కొడిశెపాల పెద్దగుమ్ముడు సదాప ములుగోరింట వీనిని యెల్లపుడు పచ్చిదిగనే ప్రయోగించవలయును. పచ్చిదిగ నుండినను వానిని ద్విగుణముగ చేర్చకూడదు. అని తంత్రాంతరమునందు జెప్పియుండుట వలన నైకషాయప్రయోగములలో అడ్డసరమును పచ్చిదిగనే చేర్చవలయును.

రక్తపిత్తరోగమునకు పలాశాదికషాయము.

పలాశవల్కక్వాథో వా సుశీతశ్శర్కరాన్వితః,
పిబేద్వా మధుసర్పిర్భ్యాం గవాశ్వశకృతో రసమ్. ౨౮

మోదుగుపట్టకషాయము శీతముగ శర్కరతోడ పానముచేయించినను, లేక ఆవుపేడరసము గుఱ్ఱపువెంటికెలరసము అనువానిని తేనె నెయ్యి వీనితో పానము జేయించిన రక్తపిత్తరోగములు హరించును.

గ్రథితరక్తపిత్త చికిత్స.

సక్షౌద్రం గ్రథితే రక్తే లిహ్యాత్పారావతం శకృత్,

రక్తపిత్తరోగము గ్రంథులతోగూడియుండిన పావురపిట్టమలమును తేనెలో కలిపి నాకించవలయును.

అధికరక్తస్రావమునకుచికిత్స.

అతినిస్సృతరక్తశ్చ క్షౌద్రేణ రుధిరం పిబేత్. ౨౯
జాంగలం భక్షయేద్వాజమామం పిత్తయుతం యకృత్,

రక్తపిత్తరోగికి రక్తపిత్తము అధికముగ బైలువెడలుచుండినచో జాంగల జంతు రక్తమును తేనెతోడ పానముజేయించవలయును. లేక మేకయొక్క యకృత్తు అను మాంసఖండమును పాకముజేయకయే పిత్తసహితముగ భక్షింపజేయవలయును.

రక్తపిత్తహరకషాయము.

చందనోశీరజలదా లాజా ముద్గకణా యవైః. ౩౦
బలాజలేపర్యుషితైః కషాయో రక్తపిత్తహా,

చందనము, వట్టివేరు, తుంగముస్తలు, వరిపేలాలు, పెసలు, పిప్పళ్లు, యవలు, వీనిని చిట్టాముట్టి కషాయములో నొకరాత్రి నానబెట్టి కషాయము కాచి సేవించిన రక్తపిత్తమును హరించును.

రక్తపిత్తమునకు చందనాది శీతకషాయము.

ప్రసాదశ్చందనాంభోజసేవ్యం మృద్భృష్టలోష్టజః. ౩౧
సుశీతస సితాక్షౌద్రశ్శోణితాతిప్రవృత్తిజిత్,

చందనము, తామరపువ్వు, వట్టివేరు, కాల్చినమట్టిగడ్డ, వీనిని యుదకములో వైచి కలియబెట్టి దానితేటలో పంచదార తేనెకలిపి చల్లగ రక్తపిత్తరోగికి పానము జేయించిన అధికముగ బైలువెడలు రక్తపిత్తము శమించును.

రక్తపిత్తమునకు చెఱుకుకషాయము.

ఆపోథ్య వా నవే కుంభే ప్లావయేదిక్షుఖండికాః. 32
స్థితం తద్గుప్తమాకాశే రాత్రిం ప్రాతస్స్రుతం జలమ్,
మధుమృద్వీకసాంభోజకృతోత్తంసం చ తద్గుణమ్. 33
యే చ పిత్తజ్వరే ప్రోక్తాః కషాయాస్తాంశ్చ యోజయేత్,

శ్రేష్ఠమైన చెఱుకును తునకలుచేసి నలియగొట్టి క్రొత్తకుండలోవైచి నీళ్లుబోసి రాత్రియందు బహిఃప్రదేశమునం దుంచి చీమలు మొదలగువానిని చేరనియ్యక రక్షించుచు ప్రాతఃకాలంబున దానిని చక్కగ కాచి యందు తేనె ద్రాక్ష తామరపువ్వు వీనిని చేర్చి పానముచేసిన శమించును. మరియు పిత్తజ్వరమునందు జెప్పబడిన కషాయములను అధిక రక్తస్రావముతోగూడిన రక్తపిత్తమునందుగూడ తేనెతోడ నిప్పించవలయును.

వాతాధికరక్తపిత్తమునకు చికిత్స.

కషాయైర్వివిధై రేభిర్దీప్తే ఽగ్నౌ విజితే కఫే,
రక్తపిత్తం న చేచ్ఛామ్యేత్తత్ర వాతోల్బణే పయః 34
యుంజ్యాచ్ఛాగం శృతం తద్వ ద్రవ్యం పంచగుణేఽంభసి,
పంచమూలేన లఘునా శృతం వా ససితామధు. 35
జీవకర్షభకద్రాక్షా బలాగోక్షురనాగరైః,
పృథక్పృథక్ శృతం క్షీరం సఘృతం సితయాథవా. 36

పైజెప్పిన నానావిధకషాయములను పానముజేయుటచే జాఠరాగ్ని దీప్తినొంది కఫముశమించి రక్తపిత్తము శమింపక వాతాధిక్యముతో గూడియుండిన మేకపాలలోగాని ఆవుపాలలోగ్గాని ఐదు భాగములధికముగ నుదకమునుజేర్చి చక్కగకాచి దానిని గాని లేక ఆవుపాలలో లఘుపంచమూలములు వైచి చక్కగకాచి యందులో పంచదార తేనెకలిపిగాని; జీవకము, ఋషభకము, ద్రాక్ష, చిట్టాముట్టి, పల్లేరు, శుంఠి, అను వానితో ప్రత్యేకప్రత్యేకముగ కాచబడిన యావుపాలలోజేర్చి పంచదారకలిపిగాని, లేక ఘృతమును కలిపిగాని, పానముజేయించిన వాతాధిక్యముగల రక్తపిత్తము శమించును.

నొప్పిగల రక్తపిత్తమునకు చికిత్స.

గోకంటకాభీరుశృతం పర్ణినీభిస్తథా పయః,
హంత్యాశు రక్తం సరుజం విశేషాన్మూత్రమార్గగమ్. 37

పల్లేరు, పిల్లిపీచర, వీనినిచేర్చి కాచబడినపాలనుగాని; కోలపొన్న, ముయ్యాకుపొన్న, అడవిపెసర, కాఱుమినుములు, వీనితో కాచబడిన పాలనుగాని; పానముజేసిన

నొప్పితోఁగూడియుండు రక్తస్రావ మతి శీఘ్రముగ నివర్తియగును.మఱియు నిది మూత్ర మార్గమునుండి విశేషముగ స్రవించురక్తమును పోఁకడచును.

గుదమార్గగతరక్తపిత్త చికిత్స.

విణ్మార్గగే విశేషేణ హితం మోచరసేన తు,
వటప్రరోహైశ్శృంగై ర్వా శుంఠ్యాదిచోత్పలై రపి. 3౮

బూరుగుబంకతోఁగాని, మఱ్ఱియూడలతోఁగాని, మఱ్ఱిచిగుళ్లతోఁగాని, శుంఠి వట్టివేరు నల్లకలువ వీనితోఁగాని, కాచబడినపాలను పానము జేయించిన గుదమునందలి రక్తపిత్తరోగము నిస్సంశయముగ శమించును.

రక్తపిత్త సామాన్య చికిత్స.

రక్తాతిసారదుర్నామ చికిత్సాం చాత్ర కల్పయేత్,

రక్తాతిసారము, అర్శోరోగము, వీనికిజెప్పియుండు చికిత్సలనే రక్తపిత్త రోగమునకును చేయవలయును.

రక్తపిత్తమునం దాహారాదులు.

పీత్వా కషాయాన్ పయసా భుంజీత పయసైవ చ. 3౯
కషాయయోగై రేభి ర్వా విపక్వం పాయయేద్ఘృతమ్,

పూర్వము జెప్పియుండు కషాయములను ఆవుపాలతోఁడ పానముచేసి ఆవుపాలతోఁడ నన్నమును భుజించినను లేక పైకషాయములకు చెప్పియుండు ఓషధులతోఁడ ఘృతమును పక్వము చేసి పానముచేసినను రక్తపిత్తము శమించును.

రక్తపిత్తమునకు అడ్డసరపుఘృతము.

సమూలమస్తకం క్షుణ్ణం వృషమష్టగుణేఽంభసి. ౪౦
పక్త్వాష్టాంశావశేషేణ ఘృతం తేన విపాచయేత్,
పుష్పగర్భం చ తచ్ఛీతం సక్షౌద్రం పిత్తశోణితమ్. ౪౧
పిత్తగుల్మజ్వరశ్వాసకాసహృద్రోగకామలాః,
తిమిరభ్రమవీసర్పస్వరసాదాంశ్చ నాశయేత్. ౪

అడ్డసరమును సమూలముగ చూర్ణముచేసి యెనిమిదింతల ఉదకములోఁవైచి యెనిమిదవ భాగము మిగులునటుల కషాయముకాచి దానిలోఁ నెయ్యిబోసి అడ్డసరపుప్వ కల్కమును కలిపి విధిప్రకారము పాకముచేసి చల్లార్చి యా ఘృతమును తేనెతోఁగూర్చి యిప్పించిన రక్తపిత్తము పిత్తగుల్మము జ్వరము శ్వాసము కాసము

హృద్రోగము కామిల తిమిరరోగము భ్రమము విసర్పము స్వరహాని ఇవి యన్నియుం శమించును.

పలాశవృంత ఘృతము.

పాలాశవృంతస్వరసే తద్గర్భం చ ఘృతం పచేత్,
సక్షౌద్రం తచ్చ రక్తఘ్నం తథైవ త్రాయమాణయా. ౪౩

మోదుగపువ్వుకాడలను ఉదకములో వైచి పాదావశేషముగ కషాయముకాచి అందులో ఆవునెయ్యి బోసి దానిలో పై మోదుగపువ్వుకాడల కల్కమును కలిపి ఘృతపాకవిధిగ పక్వముజేసి అందు తేనెకలిపి పానముజేయించినను, కలుత్రానుగు కషాయకల్కములలో ఆవునెయ్యిబోసి విధిప్రకారముగ పాకముజేసి దానిలో తేనె కలిపి యిప్పించినను రక్తపిత్తము హరించును.

రక్తపిత్తమునకు ఉత్పలనాళక్షారము.

రక్తే సపిచ్ఛే సకఫే గ్రథితే కంఠమార్గగే,
లిహ్యాన్మాక్షికసర్పిర్భ్యాం క్షారముత్పలనాళజమ్. ౪౪
పృథక్పృథక్తథాంభోజరేణుశ్యామామధూకజమ్,

రక్తపిత్తరోగమునందు రక్తము బూరుగరసమువలె నుండినను కఫతుల్యముగనుండినను గ్రంథియుక్తముగనుండినను కంఠమార్గము నాశ్రయించియుండినను నల్లకలువ తూండ్లక్షారమును తేనె నెయ్యి అనువానిలో కలిపి నాకించవలయును. మఱియు తామరచూర్ణము అగరుచూర్ణము సుగంధిపాలచూర్ణము యష్టిమధుకచూర్ణము వీటిలో తేనె నెయ్యికలిపి నాకించవలయును.

గుదగతరక్తపిత్తమునకు వస్తికర్మ.

గుదాగమే విశేషేణ శోణితే వస్తిరిష్యతే. ౪౫

గుదమార్గములోజనించినరక్తపిత్తరోగమునందు విశేషముగ వస్తికర్మను చేయించవలయును.

ముక్కులోనుండి స్రవించు రక్తపిత్తమునకు చికిత్స.

ఘ్రాణగే రుధిరే శుద్ధే నావనం చానుషేచయేత్,
కషాయయోగాన్ పూర్వోక్తాన్ క్షీరేక్ష్వాదిరసప్లుతాన్. ౪౬
క్షీరాదీన్ ససితాంస్తోయం కేవలం వా జలం హితం,
రసోదాడిమపుష్పాణామామ్రాస్థశ్శాడ్వలస్య వా. ౪౭

ముక్కున రక్తము శుద్ధముగ వెడలుచుండిన పైచెప్పిన కషాయములలో ఆవుపాలు చెఱుకురసను మాంసరసము ఆవునెయ్యి వీనినిజేర్చిగాని ఆవుపాలలో పంచదారను కలిపిగాని శుద్ధోదకముతోగాని దానిమ్మపువ్వు రసముతోగాని శ్రేష్ఠమైన మామిడిపండురసముతోగాని గరికెరసముతోగాని నస్యము చేయించవలయును.

### రక్తపిత్తమునం దభ్యంజనాదులు.

కల్పయేచ్ఛీతవర్గంచ ప్రదేహాభ్యంజనాదిషు,

రక్తపిత్తరోగమునందు శీతవీర్యముగల ద్రవ్యములను పట్లు అభ్యంజనము మొదలగువానియందు నుపయోగించవలయును.

యచ్చ పిత్తజ్వరే ప్రోక్తం బహిరంతశ్చ భేషజమ్, ౭౮
రక్తపిత్తే హితం తచ్చ క్షతక్షీణే హితం చ యత్.

పిత్తజ్వరము క్షత క్షీణము వీనికి చెప్పియుండు బాహ్యాభ్యంతరౌషధములు రక్తపిత్తరోగమునందును హితకరంబుగ నుండును.

ద్వితీయాధ్యాయము, ముగిసెను.

---

# తృతీయాధ్యాయము.

అవ: కాసరోగము రక్తపిత్తమువలన జనించునదియగుటంజేసి రక్తపిత్తచికిత్సితాధ్యాయనిరూపణానంతరము కాసరోగచికిత్సితాధ్యాయము చెప్పబడుచున్నది.

సూ. అథాతః కాసచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

రక్తపిత్తచికిత్సితాధ్యాయ నిరూపణానంతరము కాసరోగ చికిత్సలం దెలియ పరచునట్టి కాసచికిత్సితమను నీయధ్యాయమును వివరించెదము.

వాతజకాసచికిత్స.

కేవలానిలజం కాసం స్నేహైరాదావుపాచరేత్,
వాతఘ్నసిద్ధైస్స్నిగ్ధైశ్చ పేయాయూషరసాదిభిః ౧
లేహైర్ధూమైస్తథాభ్యంగైస్స్వేదసేకావగాహనైః,
వస్తిభిర్బద్ధవిడ్వాతం సపిత్తం త్వూర్ధ్వభక్తికైః. ౨
ఘృతైః క్షీరైశ్చ సకఫం జయేత్స్నేహవిరేచనైః,

ఇతర దోషసంబంధములేక వాతదోషముచేమాత్రము జనించిన కాసరోగమును తొలుత వాతహరద్రవ్యములతో పక్వముచేయబడిన స్నేహములచేతను; స్నిగ్ధముగ నుండు పేయయూషము మాంసరసము మొదలగువానిచేతను లేహములచేతను ధూమపానము అభ్యంగము స్వేదకర్మ పరిషేకము అవగాహనము వీనిచేతను చికిత్స చేయవలయును. అపానవాతమును మలమును బంధించియుండు కాసమును వస్తికర్మలచే చికిత్స చేయవలయును. పిత్తముతోగూడిన వాతకాసమును ఊర్ధ్వభక్తకములైన ఘృతముల— అనగా భోజనానంతరము పానముచేయబడు ఘృతములచేతను; ఆవుపాలచేతను పైజెప్పిన వాతహరద్రవ్యములతో కాచబడిన స్నేహాదులచేతను చికిత్స చేయవలయు. కఫముతో గూడియుండు వాతకాసమును స్నేహవిరేచనంబులచే చికిత్స చేయవలెను.

వాతకాసమునకు గుడూచ్యాదిఘృతము.

గుడూచీకంటకారీభ్యాం పృథక్త్రింశత్పలాద్రసే. 3
ప్రస్థస్సిద్ధో ఘృతాద్వాతకాసనుద్వహ్నిదీపనః,

తిప్పతీగెరసము 30 పలములు, వాకుడురసము 30 పలములు, వీనిని నొకటిగ జేర్చి, అందు ఒక ప్రస్థము ఆవునెయ్యి కలిపి ఘృతపాకవిధిగ కాచబడిన ఘృతము నిప్పించిన వాతకాసము హరించుటయేగాక అగ్నిదీపనముగూడ గలుగును.

వాతకాసమునకు క్షారాదిఘృతము.

క్షారరాస్నావచాహింగుపాఠాయష్ట్యాహ్వధాన్యకైః ౪
ద్విశాణైస్సర్పిషః ప్రస్థం పంచకోలయుతైః పచేత్,
దశమూలస్య నిర్యూహే పీతో మండానుపాయినా. ౫
స కాసశ్వాసహృత్పార్శ్వగ్రహణీరోగగుల్మనుత్,

సర్జక్షారము, సన్నరాస్నము, వస, ఇంగువ, చిరుబొద్ది, అతిమధురము, దనియాలు, పిప్పళ్లు, మోడి, చెవ్యము, శుంఠి, చిత్రమూలము, ఇవి దినుసుకు రెండు శాణముల ప్రమాణముగ్రహించి కల్కముజేసి దశమూలకషాయములోకలిపి అందులో నొక ప్రస్థము ఆవునెయ్యిని జేర్చి విధిప్రకారము పాకముజేయవలయును. ఈఘృతమును పానముజేయించి మండమును అనుపానముగ నిప్పించిన కాసము శ్వాసము ఱొమ్మునొప్పి పార్శ్వశూల గ్రహణీరోగము గుల్మము హరించును.

కాసమునకు రాస్నాదిఘృతము.

ద్రోణేఽపాం సాధయేద్రాస్నాదశమూలశతావరీః. ౬
పలోన్మితా ద్వికుడవం కుళుత్థం బదరం యవమ్,
తులార్ధం చాజమాంసస్య తేన సాధ్యం ఘృతాఢకమ్. ౭
సమక్షీరం పలాంశైశ్చ జీవనీయైస్సమీక్ష్య తత్,
ప్రయుక్తం వాతరోగేషు పాననావనవస్తిభిః. ౮
పంచకాసాఞ్ఛిరఃకంపం యోనివంక్షణవేదనామ్,
సర్వాంగైకాంగరోగాంశ్చ సప్లీహోర్ధ్వానిలాఞ్జయేత్. ౯

సన్నరాస్నము, దశమూలములు, పిల్లిపీచర, యివి ప్రత్యేక మొక్కొకపలము; ఉలవలు, రేగు, యవలు, ఇవి దినుసుకు రెండేసి కుడవములు, మేకమాంసము ఏబది పలములు ఇటుల వీటినన్నిటిని ద్రోణప్రమాణముదకములో వైచి చక్కగ కషాయముకాచి యా కషాయములో 1 ఆఢకము ఆవునెయ్యి, 1 ఆఢకము ఆవుపాలునుబోసి జీవనీయ గణ ద్రవ్యములగు మనుబాల, కాకోళి, క్షీరకాకోళి, మేద, మహామేద, పిల్లిపీచర, కారుమినుములు, ఋషభకము, జీవకము, అతిమధురము, వీనిని ప్రత్యేకము 1 పలము చొప్పునగ్రహించి కల్కముచేసిచేర్చి ఘృతపాకవిధానంబున పక్వముచేయవలయును దేశకాలబలాదుల నాలోచించి వాతరోగములయం దీఘృతపానము నస్యము వస్తికర్మ

వీనినిజేయించిన 5 విధములైన కాసరోగములు యోనిశూల తలవణకుట గజ్జలయందు నొప్పి సర్వాంగవాతము ఏకాంగవాతము ప్లీహరోగము ఊర్ధ్వవాతము ఇవియన్నియు హరించును.

కాసమునకు విదార్యాదిఘృతము.

విదార్యాదిగణక్వాథకల్కసిద్ధం చ కాసజిత్,

నేలగుమ్ముడు, చిట్టాముదము, తేలుమణి, లేక వద్ది, గలిజేరు, దేవదారు, పిల్లిపెసర, కాఱుమినుములు, దూలగోవిల, పెద్దపిల్లిపీచర, పిన్నపిల్లిపీచర, కాకోళి, మనుబాల, జీవకము, ఋషభకము, వ్రాకుడు,ములక, ముయ్యాకుపొన్న, నక్కతోకపొన్న, పల్లేరు, సుగంధిపాల, వీని కషాయకల్కములతో పక్వముచేయబడిన ఘృతమును పానముచేయించిన కాసరోగము హరించును.

కాసమునకు అశోకాదిఘృతము.

అశోకబీజక్షవకజంతుఘ్నాంజనపద్మకైః. ౧౦
సబిడైశ్చ ఘృతం సిద్ధం తచ్చూర్ణం వా ఘృతప్లుతమ్,
లిహ్యాత్పయశ్చానుపిబేదాజం కాసాభిపీడితః. ౧౧

అశోకవిత్తులు క్షవకము అనగా—తెల్లజిల్లేడు వాయువిడంగములు సౌవీరాంజనము పద్మకము బిడాలవణము వీనితో పక్వముచేయబడిన ఘృతము కాసముచు పోగొట్టును. లేక పై అశోకవిత్తులు మొదలగుద్రవ్యములను చూర్ణముచేసి నేతిలోకలిపి నాకించి మేకపాలను అనుపానముగ నిప్పించిన కాసరోగము నివర్తించును.

కాసమునకు విడంగాదిచూర్ణము.

విడంగం నాగరం రాస్నా పిప్పలీ హింగు సైంధవమ్,
భార్గీక్షారశ్చ తచ్చూర్ణం పిబేద్వా ఘృతమాత్రయా. ౧౨
సకఫే ఽనిలజే కాసే శ్వాసహిధ్మాహతాగ్నిషు,

వాయువిడంగములు, శుంఠి, సన్నరాస్నము, పిప్పళ్లు, ఇంగువ, సైంధవలవణము, గంటుభారంగి, సర్జక్షారము, వీనిని సమముగ గ్రహించి చూర్ణముచేసి యాచూర్ణమును ఆయా యోగమునకుతగినట్లు హ్రస్వ మధ్యమ ఉత్తమ మాత్రగ నేతిలోకలిపి పానముజేయించిన కఫముతోగూడిన వాతకాసము శ్వాసము ఎక్కిళ్లు అగ్నిమాంద్యము హరించును.

కాసమునకు దురాలభాదిచూర్ణము.

దురాలభాం శృంగబేరం శఠీం ద్రాక్షాం సితోపలామ్. ౧౩
లిహ్యాత్కర్కటశృంగీం చ కాసే తైలేన వాతజే,

దూలగోవిల, అల్లము, శఠీ (అనగా—గంధకచోరము), ద్రాక్ష, కలకండ, కర్కాటకశృంగి, వీనిని సమముగ గ్రహించి నూరి నువ్వులనూనెలో కలిపి వాతజ కాసముగలవానికి నాకించవలయును.

కాసమునకు దుస్పర్శాదిచూర్ణము.

దుస్పర్శాం పిప్పలీముస్తాం భార్గీం కర్కటకీం శఠీం. ౧౪
పురాణగుడతైలాభ్యాం చూర్ణితాన్యవలేహయేత్,
తద్వత్కృష్ణాం శుంఠీం చ సభార్గీం తద్వదేవ చ. ౧౫

వాతజకాసమునందు దూలగోవిల, పిప్పళ్లు, తుంగముస్తలు, గంటుభారంగి, కర్కాటకశృంగి, గంధకచోరము,అనువానిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి పాతబెల్లము నువ్వులనూనె వీటిలోకలిపి నాకించవలయును. మఱియు పిప్పళ్లు శుంఠి వీటిచూర్ణమును, గంటుభారంగి శుంఠి వీటిచూర్ణమును వెవ్వేఱుగ పాతబెల్లము నువ్వుల నూనె అనువానిలోకలిపి నాకించవలయును.

కాసమునకు పిప్పల్యాదిచూర్ణము.

పిబేచ్చ కృష్ణాం కోష్ణేన సలిలేన ససైంధవామ్,
మస్తునా ససితాం శుంఠీం దధ్నా వా కణరేణుకామ్. ౧౬

వాతజకాసమునందు పిప్పళ్లచూర్ణమును కొంచెముష్ణముగనుండు నుదకములో కలిపి అందులో సైంధవలవణము జేర్చి పానముచేయించవలయును. లేక పెరుగుమీది తేటలో శర్కర శుంఠి చూర్ణముకలిపిగాని పెరుగులో పిప్పళ్లచూర్ణమును రేణుకల చూర్ణమును కలిపిగాని పానముచేయించవలయును.

కాసమునకు బదరమజ్జాదికల్కము.

పిబేద్బదరమజ్జో వా మదిరాదధిమస్తుభిః,
అథవా పిప్పలీకల్కం ఘృతభృష్టం ససైంధవమ్. ౧౭

కాసరోగికి రేగుపండులోనిపప్పును మదిరయను మద్యముతోగాని పెరుగుతో గాని పెరుగుమీది తేటతోగాని లేక పిప్పళ్లకల్కమును నేతిలోవేయించి అందులో సైంధవలవణముజేర్చి పై మద్యాదులతో గలిపిగాని పానముజేయించవలయును.

కాసరోగమునందు స్నైహికాదిధూమపానము.

కాసీ సపీనసో ధూమం స్నైహికం విధినా పిబేత్,
హిధ్మాశ్వాసోక్తధూమాంశ్చ క్షీరమాంసరసాశనః. ౧౮

కాసరోగముగలవారును పీనసరోగముగలవారును స్నేహసంబంధమైన ధూమమును విధిప్రకారము పానముజేయవలయును. మఱియు ఆవుపాలు మాంసరసము వీనిని భుజింపుచు హిక్కా శ్వాసరోగములకు జెప్పియుండు ధూమములనుగూడ పానము జేయవలయును.

## కాసరోగమునందు పథ్యము.

గ్రామ్యానూపౌదకైశ్శాలియవగోధూమషష్టికాన్,
రసైర్మాషాత్మగుప్తానాం యూషైర్వా భోజయేద్ధితాన్. ౧౯

కాసరోగముగలవారికి గ్రామ్య అనూప ఔదక జంతుమాంసరసములతోడగాని మినుములు దూలగోవిల వీని కట్టులతోగాని దేశకాలసాత్మ్యాద్యనుగుణముగ హితమైన సంబావుబియ్యము యవలు గోధుమలు 60 దినములకు ఫలించెడు ధాన్యపుబియ్యము వీనియన్నములను పథ్యముగ నిప్పించవలయును.

## వాతజకాసమున పేయాక్రమము.

యవానీపిప్పలీబిల్వమధ్యనాగరచిత్రకైః,
రాస్నాఽజాజీపృథక్పర్ణీపలాశశఠిపౌష్కరైః. ౨౦
సిద్ధాం స్నిగ్ధామ్లలవణాం పేయామనిలజే పిబేత్,
కటిహృత్పార్శ్వకోష్ఠార్తి శ్వాసహిక్కాప్రణాశినీమ్. ౨౧
దశమూలరసే తద్వత్పంచకోలగుడాన్వితామ్,
పిబేత్పేయాం సమతిలాం క్షైరేయీం వా ససైంధవామ్. ౨౨
మాత్స్యకౌక్కుటవారాహైర్మాంసైర్వా సాజ్యసైంధవామ్,

వాతజకాసమునందు ఓమము, పిప్పళ్లు, మారేడుగుజ్జు, శుంఠి, చిత్రమూలము, సన్నరాస్నము, జీలకఱ్ఱ, ముయ్యాకుపొన్న, మోదుగు, కచోరములు, పుష్కరమూలము, వీనితో పక్వము జేయబడినదియు స్నిగ్ధమైనదియు కొంచెముమ్లలవణరసములతో గూడినదియునైన పేయను పానముజేయించిన నడుము ఱొమ్ము ఇరుపార్శ్వములు వీనియందలిశూలల కడుపునొప్పి శ్వాసము ఎక్కిళ్లు హరించును. మఱియు దశమూలముల కషాయములో పక్వముచేయబడినదియు పంచకోలములు బెల్లము వీనితోగూడినదియునైన పేయనుగాని; పాలతో పక్వముజేయబడినదియు నువ్వులు సైంధవలవణము వీనితోగూడినదియునైన పేయనుగాని; మత్స్యములు కోడి పంది వీనిమాంసములలో పక్వముజేయబడినెయ్యి సైంధవలవణము వీనితోగూడిన పేయనుగాని పానముజేయించవలయును.

వాతజకాసమున పథ్యకరశాకములు.

వాస్తుకో వాయసీశాకం కాసఘ్నస్సునిషణ్ణకః. ౨౩
కంటకార్యాః ఫలం పత్రం బాలం శుష్కం చ మూలకమ్,
స్నేహాస్తైలాదయో భక్ష్యాః క్షీరేక్షురసగౌడికాః. ౨౪
దధిమస్త్వారనాళామ్లఫలాంబుమదిరాః పిబేత్,

చక్రవర్తికూర, కాచికూర, కసివెందకూర, చెంచెలికూర, వాకుడాకులు, వాకుడుకాయలు లేతదియు ఎండినదియునైన ముల్లంగి, తైలము మొదలగు స్నేహములు, ఆవుపాలు, చెఱకురసము, బెల్లము, వీని సంబంధమైన భక్ష్యములు పెరుగుమీఁది తేట, పులికడుగు, పుల్లనిపండ్లరసము, మదిరయను మద్యము, ఇవి వాతజనిత కాసరోగమునందు మిగుల హితకరములుగ నుండును.

పిత్తకాస చికిత్స.

పిత్తకాసే తు సకఫే వమనం సర్పిషా హితమ్. ౨౫
తథా మదనకాశ్మర్యమధుకక్వథితైర్జలైః,
ఫలయష్ట్యాహ్వకల్కైర్వా విదారీక్షురసాప్లుతైః. ౨౬

కఫముతోఁగూడిన పిత్తకాసమునందు ఆవునెయ్యిచేతగాని, మ్రంగపండు పెద్దగుమ్ముడు అతిమధురము, వీనిని సమభాగములుగ చేర్చి కాచబడిన ఉదకముచేతగాని, మ్రంగపండు అతిమధురము, వీనిని సమభాగముగ గ్రహించి కల్కముచేసి దానిలో నేలగుమ్ముడుగడ్డ చెఱకు వీనిరసములనుకలిపి దానిచేతగాని యవస్థానుగుణముగ వమనముజేయించవలయును.

పిత్తకాసమునకు విరేచనము.

పిత్తకాసే తు సకఫే త్రివృతాం మధురైర్యుతామ్,
యుంజ్యాద్విరేకాయ యుతాం ఘనశ్లేష్మణి తిక్తకైః. ౨౭

స్వల్పకఫముతోఁగూడిన పిత్తకాసమునందు తెల్లతెగడను మధురరసముగల ద్రవ్యములతోఁజేర్చి విరేచనమున కిప్పించవలయును. మిక్కిలి కఫముతోఁగూడిన పిత్తకాసమునందు చేదురసముగల ద్రవ్యములతో తెల్లతెగడను జేర్చి విరేచనమున కిప్పించవలయును.

పిత్తకాసమునకు పథ్యము.

హృతదోషో హిమం స్వాదు స్నిగ్ధం సంసర్జనం భవేత్,
ఘనే కఫే తు శిశిరం రూక్షం తిక్తోపసంహితమ్. ౨౮

పై వమనకర్మచే దోషము హరించియుండువానికి శీతముగ మధురముగ స్నేహయుక్తముగనుండు పేయాదులను పథ్యముగ నిప్పించవలయును. కఫమధికముగ నుండి

నచో రూక్షముగ శీతముగ తిక్తరసముతోఁగూడినదిగనుండు పేయాదుల నిప్పించ నలయును.

పిత్తకాసమునందు సితాదిలేహ్యము.

లేహః పైత్తే సితాధాత్రీ క్షౌద్రద్రాక్షాహిమోత్పలైః,
సకఫే సాబ్దమరిచస్సఘృతస్సానిలే హితః. ౨౯
మృద్వీకార్ధశతం త్రింశత్పిప్పలీశ్శర్కరా పలం,
లేహయేన్మధునా గోర్వా క్షీరపస్య శకృద్రసమ్. ౩౦

పిత్తకాసమునందు పంచదార, ఉసిరిక, తేనె, ద్రాక్ష, రక్తచందనము, నల్ల కలువ, వీనిని సమముగ చేర్చి చేయబడిన లేహము నిప్పించవలయును. పిత్తకాసము కఫముతోఁగూడియుండిన తుంగముస్తలు, మిరియాలు, వీనితోడను; వాతముతోఁగూడియుండిన ఆవునేతితోడను, పైలేహము నిప్పించిన హితముకలుగును. మఱియు ద్రాక్ష పండ్లు ఏబది పిప్పళ్లు ముప్పది శర్కర ఒకపలము, వీనితో లేహమును పక్వముచేసి తేనె తోడ నిప్పించవలయును. లేక పాలుగుడుచుచుండు యావుదూడ పేడరసమును తేనె తోడ నిప్పించవలయును.

కాసరోగమునకు త్వగాదిలేహ్యము.

త్వగేలావ్యోషమృద్వీకాపిప్పలీమూలపౌష్కరైః,
లాజముస్తాశఠీరాస్నాధాత్రీఫలవిభీతకైః. ౩౧
శర్కరాక్షౌద్రసర్పిర్భిర్లేహో హృద్రోగకాసహా,

లవంగపట్ట, ఏలకలు, శుంఠి, పిప్పళ్లు, మిరియాలు, ద్రాక్ష, మోడి, పుష్కర మూలము, వరిపేలాలు, తుంగముస్తలు, కచోరములు, సన్నరాష్ట్రము, ఉసిరికపండ్లు, తానికాయ, పంచదార, తేనె, ఆవునెయ్యి, వీనిని సమముగజేర్చిచేయబడిన లేహము కాసరోగము హృద్రోగములు వీనిని పోగొట్టును.

శ్లేష్మాధికపిత్తకాసమున పథ్యములు.

మధురైర్జాంగలరసైర్యవశ్యామాకకోద్రవాః. ౩౨
ముద్గాదియూషైశ్శాకైశ్చ తిక్తకైర్మాత్రయా హితాః,
ఘనశ్లేష్మణి లేహాశ్చ తిక్తకా మధుసంయుతాః. ౩౩

మిక్కిలి కఫముతోఁగూడియుండు పిత్తకాసమునందు మధురముగనుండుజాంగల మాంసరసముతోడను; పెసలు ఉలవలు మొదలగు కట్టులతోడను; చేదుగనుండు శాకములతోడను; యవలు చామలు కొఱ్ఱలు వీనియన్నమును మాత్రగానిప్పించిన హితము

గలుగును. మఱియు చేదుగల ద్రవ్యములతో పక్వము చేయబడిన లేహమును తేనెతో నిప్పించవలయును.

కఫము స్వల్పముగనుండు పిత్తకాసమునందు పథ్యము.

శాలయస్స్యుస్తనుకఫే షష్టికాశ్చ రసాదిభిః,
శర్కరాంభోనుపానార్థం ద్రాక్షేక్షుసర్పిసాః పయః. 34

స్వల్పకఫముతోగూడియుండు పిత్తకాసమునందు సంబావుధాన్యము అరువది చాళ్లలో ఫలించెడు సంబావుధాన్యము వీనియన్నమును మాంసరసాదులతోడ నిప్పించిన హితము కలుగును. అనుపానార్థము శర్కరోదకము ద్రాక్షరసము చెరుకురసము పాలు వీనిని యిప్పించవలయును.

పిత్తకాసమున పేయాక్రమము.

కాకోలీబృహతీమేదాద్వయైస్సవృషనాగరైః,
పిత్తకాసే రసక్షీరపేయాయూషాన్ప్రకల్పయేత్. 35

పిత్తకాసమున కాకోళి, క్షీరకాకోళి, పెద్దములక, చిన్నములక, మేద, మహామేద, అడ్డసరము, శుంఠి, వీనిని మాంసరసము పాలు పేయ కట్టులు మొదలగువానిలో జేర్చి పక్వము జేసి యిప్పించవలయును.

పిత్తకాసమునకు క్షీరాదిపానము.

ద్రాక్షాం కణాం పంచమూలం తృణాఖ్యం చ పచేజ్జలే,
తేన క్షీరం శృతం శీతం పిబేత్సమధుశర్కరమ్, 36
సాధితాం తేన పేయాం వా సుశీతాం మధునాన్వితమ్,

పిత్తకాసమున ద్రాక్ష పిప్పళ్లు తృణ పంచమూలములు వీనిని సమముగ గ్రహించి నాలుగింత లుదకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి అందులో ఆవుపాలు పోసి ఆవుపాలకు సమముగ ఉదకముజేర్చి చక్కగకాచి దానిని పంచదార తేనె సహితముగగాని పై ద్రాక్షాది వస్తువులనుజేర్చి కాచిన యుదకములో పేయయను గంజినికాచి చల్లారిన పిదప నందులో కొంచెము తేనెకలిపిగాని పానముజేయించవలయును.

పిత్తకాసమునకు శట్యాదిరసము.

శటీహ్రీబేరబృహతీ శర్కరావిశ్వభేషజమ్. 37
పిష్ట్వా రసం పిబేత్పూతం వస్త్రేణ ఘృతమూర్ఛితమ్,

గంధకచోరములు, కురువేరు, వాకుడు, పంచదార, శుంఠి, వీనిని సమముగ

గ్రహించి యుదకముతో చక్కగనూరి తెల్లనివస్త్రములో వడియగట్టి ఆరసములో ఆవునెయ్యిని అధికముగకలిపి పానముజేయించవలయును.

### పిత్తకాసమునకు జీవకాదిఘృతము.

శర్కరాం జీవకం ముద్గమాషపర్ణ్యౌ దురాలభామ్. ౩౮
కల్కీకృత్య పచేత్సర్పిః క్షీరేణాష్టగుణేన తత్,
పానభోజనలేహేషు ప్రయుక్తం పిత్తకాసజిత్. ౩౯
లిహ్యాద్వా చూర్ణమేతేషాం కషాయమథవా పిబేత్,

పంచదార, జీవకము, పిల్లిపెసర, కాఉమినుములు, దురదగొండి, వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముజేసి ఆవునేతిలో కలపి నేతికి ఎనిమిదిపాళ్లధికముగ నావుపాలనుజేర్చి ఘృతపాకవిధానముగ పక్వముజేసి యాఘృతమును పాన భోజన లేహములయం దుపయోగించిన పిత్తకాసము నివర్తించును. మఱియును పైశర్కరమొదలగు వస్తువులను సమముగ గ్రహించి చూర్ణముజేసి యాచూర్ణమును తేనెలోగలిపి నాకించినను, లేక పైవస్తువులను సమముగజేర్చి కాచినకషాయమును పానముచేయించినను, పిత్తకాసము నివర్తించును.

### కఫకాస చికిత్స.

కఫకాసీ పిబేదాదౌ సురకాష్ఠాత్ప్రదీపితాత్. ౪౦
స్నేహం పరిస్రుతం వ్యోషయవక్షారావచూర్ణితమ్,
స్నిగ్ధం విరేచయేదూర్ధ్వమధో మూర్ధ్ని చ యుక్తితః. ౪౧
తీక్ష్ణైః విరేకైర్బలినం సంసర్గీం చాస్య యోజయేత్,
యవముద్గకులుత్థాన్నైరుష్ణరూక్షైః కటూత్కటైః. ౪౨
కాసమర్దకవార్తాకవ్యాఘ్రీక్షారకణాన్వితైః,
ధాన్వబైలరసైః స్నేహైస్తిలసర్షపనింబజైః ౪౩

కఫకాసరోగముగలవానికి తొలుత దేవదారుకట్టెను కాల్చి యందుండి స్రవించునట్టి తైలమును తీసి అందులో త్రికటుకములు యవక్షారము వీనిచూర్ణమునుచేర్చి రోగియొక్క బలానుగుణముగ పానముజేయించవలయును. ఆరోగి బలిష్ఠుడుగనుండినచో తీక్ష్ణములగు విరేచనౌషధములచే యూర్ధ్వాధోభాగములయందును శిరమునందును యుక్తియుక్తముగ విరేచనముచేయించి యవలు పెసలు ఉలవలు వీనితో పక్వముచేయబడిన యన్నమును ఉష్ణముగను రూక్షముగను కారమధికముగను కసివెంద వంకాయ వ్రాఘ్రి యవక్షారము పిప్పళ్లు వీనితో పక్వముజేయబడినదిగనుండుజాంగల

మాంసరసముతోడను, బిలములలోనుండునట్టి యుడుము మొదలగు జంతువులమాంసరసములతోడను, నువ్వులనూనె ఆవనూనె వేపనూనె వీనిలో దేనితోడనైనను, పథ్యముగా నిప్పించవలయును.

## కఫకాసరోగికి దశమూలాంబుపానము.

దశమూలాంబు ఘర్మాంబు మద్యం మధ్వంబు వా పిబేత్,
మూలైః పౌష్కరశమ్యాకపటోలైః సంస్థితం నిశామ్. ౪౪
పిబేద్వారి సహక్షౌద్రం కాలేష్వన్నస్య వా త్రిషు,

కఫకాసరోగి దశమూలకషాయమునుగాని ఉష్ణోదకమునుగాని మద్యమునుగాని తేనెకలిపిన యుదకమునుగాని పుష్కరమూలము రేలవేరు పొట్లవేరు వీనిని నలియగొట్టి యుదకమునందు ఒకరాత్రి నానబెట్టి యాయుదకము తేనెతోగాని ఉదయకాలమునందు పానము చేయించవలయును. లేక భోజనమునకు ముందును భోజనమధ్యకాలమునందును భోజనాంతమునందును పైజెప్పిన దశమూలాదికషాయములను పానము జేయించవలయును.

## కఫకాసహర లేహములు.

పిప్పలీ పిప్పలీమూలం శృంగిబేరం విభీతకమ్. ౪౫
శిఖికుక్కుటపిచ్ఛానాం మషీక్షారోయవోద్భవః,
విశాలా పిప్పలీమూలాం త్రివృతా చ మధుద్రవాః. ౪౬
కఫకాసహరా లేహాస్త్రయశ్లోకార్ధయోజితాః,

పిప్పళ్లు, మోడి, శుంఠి, తాడికాయ, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణము జేసి తేనెలోకలిపి పక్వము చేసిన లేహము ఒకటి, నెమలియీకెలు కోడియీకెలు వీనిని నిప్పులో కాల్చిచేసిన మసిచూర్ణము, యవక్షారము, వీనిని సమభాగములుగ గ్రహించి తేనెలోకలిపి పక్వము చేయబడిన లేహము రెండు; పెద్దపాపర మోడి తెల్లతెగడ మధుద్రవము అనగా—ఎఱ్ఱమునగవిత్తులు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణము జేసి తేనెలోకలపి సిద్ధము చేయబడిన లేహము మూడు; ఈ మూడు లేహము లిప్పించిన కఫకాసములు నివర్తించును.

## కఫకాసమునకు మరీచ్యాదిచూర్ణము.

మధునా మరిచం లిహ్యాన్మధునైవ చ జోంగకమ్. ౪౭
పృథగ్రసాంశ్చ మధునా వ్యాఘ్రీవార్తాకభృంగజాన్,
కాసఘ్నస్యాశ్వశకృతస్సురసస్యాసితస్య చ. ౪౮

కఫకాసమునందు మిరియాల చూర్ణము, అగరుచెక్క చూర్ణము, వ్రాకుడురసము, వంకాయరసము, గుంటగలగరాకురసము, కసివెందరసము, గుజ్జుపుపెంటికలరసము, నల్లతులసిరసము, వీనిని వేరువేరుగ తేనెలోకలిపి నాకించవలయును.

## వాతకఫహర లేహములు.

దేవదారుశఠీ రాస్నాకర్కటాఖ్యాదురాలభాః,
పిప్పలీ నాగరం ముస్తం పథ్యా ధాత్రీ సితోపలా. ४९
లాజా సితోపలా సర్పిః శృంగీ ధాత్రీఫలోద్భవా,
మధుతైలయుతా లేహాస్త్రయో వాతానుగే కఫే. ५०

దేవదారు, గంధకచోరములు, దుంపరాస్నము, కర్కాటకశృంగి, దురదగొండి, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముజేసి తేనె, నువ్వులనూనె, వీనితోడ కలిపి చేసిన లేహము ఒకటి; పిప్పళ్లు, శుంఠి, తుంగముస్తెలు, కరక్కాయ, ఉసిరికవరుగు, ఖండశర్కర, వీనిచూర్ణమును తేనె నువ్వులనూనె వీనితోకలిపిచేసిన లేహము రెండు; వరిపేలాలు, ఖండశర్కర, కర్కాటకశృంగి, ఉసిరికవరుగు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముజేసి తేనె నువ్వులనూనె ఆవునెయ్యి వీనితోడజేర్చి చేయబడిన లేహము మూడు ఈ మూడువిధములైన లేహముల నిప్పించిన వాతకఫకాసము హరించును.

## దాడిమాది చూర్ణము.

ద్వే పలే దాడిమాదష్టౌ గుడాద్వ్యోషాత్పలత్రయమ్,
రోచనం దీపనం స్వర్యం పీనసశ్వాసకాసజిత్. ५१

దానిమ్మపండ్లబెరడు 2 పలములు, బెల్లము 8 పలములు, శుంఠి పిప్పలి మిరియాలు యివి ప్రత్యేక మొక్కొకపలము వీనినన్నిటిని యేకముజేసి చక్కగ చూర్ణముచేసిన నది దాడిమాదిచూర్ణమనబడును. దాని సేవవలన రుచి అగ్నిదీపనము కలుగును. కంఠస్వరమును చక్కజేయును. పీనసలు శ్వాసకాసములు హరించును.

## గుడాది చూర్ణము.

గుడక్షారోషణకణాదాడిమం శ్వాసకాసజిత్,
క్రమాత్పలద్వయార్ధాక్షకర్షార్ధపలోన్మితమ్. ५२

బెల్లము 2 పలములు, యవక్షారము ½ కర్షము, మిరియాలు 1 కర్షము, పిప్పళ్లు ½ కర్షము, దానిమ్మపండు 1 పలము, ఇటుల వీటినన్నిటినిజేర్చి చక్కగ చూర్ణముజేసిన నది గుడాదిచూర్ణమనబడును. ఇది శ్వాసకాసములను బోగొట్టును.

### కఫకాసహరపాచనకషాయములు.

పిబేజ్జ్వరోక్తం పథ్యాది సశృంగీకం చ పాచనం,
అథవా దీప్యకత్రివృద్విశాలాఘనపౌష్కరమ్. ౫౩
సకణం క్వథితం మూత్రే కఫకాసీ జలేఽపి వా,

జ్వరచికిత్సితాధ్యాయమునందు జెప్పబడిన పథ్యాదిపాచన కషాయములను, కర్కాటకశృంగి సహితముగ పానము చేయించినను, లేక ఓమము తెల్లతెగడ పెద్దపాపర తుంగముస్తెలు పుష్కరమూలము వీనిని సమభాగములుగ గ్రహించి నలియగొట్టి గోమూత్రములోగాని శుద్ధోదకములోగాని వైచి కషాయముకాచి యా కషాయములో పిప్పలిచూర్ణముకలిపి పానము చేయించినను కఫకాసము నివర్తించును.

### కఫకాసమునకు పిప్పలీకల్కము.

తైలభ్రష్టం చ వైదేహీ కల్కాక్షం ససితోపలమ్. ౫౪
పాయయేత్కఫకాసఘ్నం కులుత్థసలిలాప్లుతమ్,

ఒక కర్షప్రమాణము పిప్పళ్లను కల్కముజేసి దానిలో నొకకర్షము శర్కరను జేర్చి నువ్వులనూనెలో పక్వముచేసి దానిని ఉలవల కషాయములో కలిపి పానము చేయించిన కఫకాసము హరించును.

### దశమూలఘృతము.

దశమూలాఢకే ప్రస్థం ఘృతస్యాక్షసమైః పచేత్. ౫౫
పుష్కరాహ్వశఠీబిల్వసురసావ్యోషహింగుభిః,
పేయానుపానం తత్సర్పిర్వాతశ్లేష్మామయాపహమ్. ౫౬

ఆఢకప్రమాణము దశమూలకషాయములో నొకప్రస్థము ఆవునెయ్యికలిపి పుష్కరమూలము, గంధకచోరములు, మారేడుగుజ్జు, తులసి, శుంఠి, పిప్పలి, మిరియాలు, ఇంగువ, వీనిని ప్రత్యేకము ఒకకర్షప్రమాణము చొప్పున గ్రహించి కల్కముజేసి పైకషాయములోకలిపి ఘృతపాకవిధిగ పక్వముజేయవలయును. దీనిని కఫకాసరోగికిప్పించి పేయయను గంజిని అనుపానముగ నిప్పించిన వాతకాసములు కఫకాసములు నిశ్శేషముగ హరించును.

### నిర్గుండీఘృతము.

నిర్గుండీపత్రనిర్యాససాధితం కాసజిద్ఘృతమ్,

ఆవునెయ్యి వావిలియాకు కషాయము వీనిని సమభాగములుగ జేర్చి ఘృతపాకవిధానముగ పక్వముజేయవలయు. ఇది కాసరోగములనన్నిటిని బోగడచును.

### విడంగఘృతము.

ఘృతం రసే విడంగానాం వ్యోషగర్భం చ సాధితమ్. ౫౭

వాయువిడంగములరసములో (కషాయములో) ఆవునెయ్యిని కలిపి త్రికటుక కల్కము జేర్చి ఘృతపాకవిధానంబుగ పక్వము చేసి యిప్పించిన కాసరోగములన్నియుం నిశ్చయముగ నివర్తించును.

### కాసములకు పునర్నవాఘృతము.

పునర్నవశివాటికాసరళకాసమర్దామృతా
పటోలబృహతీఫణిజ్జకరసైః పయస్సంయుతైః,
ఘృతం త్రికటునా చ సిద్ధముపయుజ్య సంజాయతే
న కాసవిషమజ్వరక్షయగుదాంకురేభ్యో భయమ్. ౫౮

తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు, లేక హింగుపత్రి, సరళదేవదారు, కసివెంద, తిప్పతీగె, చేదుపొట్ల, వ్రాకుడు, మరువము, వీనిరసము నాల్గు భాగములు. ఆవుపాలు ఒక భాగము, ఆవునెయ్యి, ఒకభాగము, ఇటుల వీనినన్నిటిని ఒకటిగ జేర్చి నేతికి నాల్గవ భాగము త్రికటుక కల్కమును జేర్చి ఘృతపాకవిధిగ పక్వము జేయవలయును. దీనిని పానము జేయించిన కాసము విషమజ్వరము క్షయము అర్శస్సులు హరించును.

### కాసమునకు కంటకారీఘృతము.

సమూలఫలపత్రాయాః కంటకార్యా రసాఢకే,
ఘృతప్రస్థం బలావ్యోషవిడంగశఠిదాడిమైః. ౫౯
సౌవర్చలయవక్షారమూలామలకపౌష్కరైః,
వృశ్చీవబృహతీపథ్యాయవానీచిత్రకర్ధిభిః. ౬౦
మృద్వీకాచవ్యవర్షాభూదురాలంభాహ్లవేతసైః,
శృంగితామలకీభార్గీరాస్నాగోక్షురకైః పచేత్. ౬౧
కల్కైస్తత్సర్వకాసేషు శ్వాసహిధ్మాసు చేష్యతే,

వ్రాకుడుచెట్టు సమూలమును అనగా—వేళ్లు ఆకులు పండ్లు మొదలగువానిని గ్రహించి దంచి ఒక ఆఢకముగల యూరసములో నొక ప్రస్థము ఆవునెయ్యి కలిపి అందులో చిట్టాముట్టి శుంఠి పిప్పళ్లు మిరియాలు వాయువిడంగములు కచోరములు దానిమ్మ సౌవర్చలలవణము యవక్షారము మోడి ఉసిరికవరుగు పుష్కరమూలము వృశ్చీవము అనగా—తెల్లగలిజేరు, నేలములక కరక్కాయ ఓమము చిత్రమూలము ఋద్ధి ద్రాక్ష చవ్యము ఎఱ్ఱగలిజేరు దురదగొండి పుల్లప్రబ్బలి కర్కాటకశృంగి నేల

యునిరికి గంటుభారంగి సన్నరాష్ట్రము పెద్దపల్లేరు వీనికల్కము ప్రస్థముచేర్చి ఘృత పాకవిధిగపక్వముచేయవలయును. ఇది కంటకారీఘృతమనంబడును. కాసములు శ్వాసము ఎక్కిళ్లు వీనిని హరింపజేయును. కఫరోగమును నిశ్శేషముగ బోకడచును.

కాసమునకు కంటకారీలేహ్యము.

పచేద్వ్యాఘ్రీతులాం క్షుణ్ణాం వహేఽ పామాఢకస్థితే. ౬౨
తేన పేత్పూతే తు సంచూర్ణ్య వ్యోషరాస్నామృతాగ్నికాన్,
శృంగీభార్గీఘనగ్రంథి ధన్వయాసాన్ పలార్ధకాన్. ౬౩
సర్పిషః షోడశపలం చతుర్వింశత్పలాని చ,
మత్స్యండికాయాశ్శుద్ధాయాః పునశ్చ తదధిశ్రయేత్. ౬౪
దర్వీలేపిని శీతే చ పృథక్ ద్వికుడవం క్షిపేత్,
పిప్పలీనాం తవక్షీర్యా మాక్షికస్యానవస్య చ. ౬౫
లేహోఽయం గుల్మహృద్రోగదుర్నామశ్వాసకాసజిత్,

వ్యాఘ్రము 1 తులమును గ్రహించి నలియగొట్టి 4 ద్రోణముల పరిమితమైన జలములోవైచి పాదావశేషముగ కషాయముగాచి వడియగట్టి ఆఢక ప్రమాణముగల యా కషాయములో శుంఠి పిప్పళ్లు మిరియాలు సన్నరాష్ట్రము తిప్పతీగె చిత్రమూలము కర్కాటకశృంగి గంటుభారంగి తుంగముస్తెలు గ్రంథితగరము పిన్నరేగటిదూలగొండి వీనిని దినుసుకు ½ పలము చొప్పున గ్రహించి చూర్ణముచేసి కలిపి అందులో 16 పలములు ఆవునెయ్యిబోసి 40 పలములు శుద్ధమైన ఖండశర్కరను జేర్చి పొయిమీదబెట్టి గరిటకంటుకొనునటుల పాకముజేసి దించుకొని యది చల్లారినపిదప దానిలో పిప్పళ్లు తవక్షీరి పాతతేనె వీనిని ప్రత్యేకము 2 కుడవముల ప్రమాణము చేర్చవలయును. ఇది కంటకారిలేహమనబడును. గుల్మము రొమ్మునొప్పి అర్శస్సు శ్వాసము కాసము వీనిని నిశ్శేషముగ హరింపజేయును.

కఫకాసమునందు ధూమపానము.

శమనం చ పిబేద్ధూమం శోధనం బహులే కఫే. ౬౬

కఫకాసమునందు శమనమైన ధూమపానము చేయవలయును. కఫాధిక్యము గలిగియుండినచో శోధనమైన ధూమపానము చేయవలయు.

కాసమునకు శమనధూమము.

మనశ్శిలాలమధుక మాంసీముస్తేంగుదీత్వచః,
ధూమం కాసఘ్నవిధినా పీత్వా క్షీరం పిబేదను. ౬౭

నిష్ఠ్యూతాంతే గుడయుతం కోష్ణం ధూమో నిహంతి సః,
వాతశ్లేష్మోత్తరాన్ కాసానచిరేణ చిరంతనాన్. ౭౮

మణిశిల, హరిదళము, అతిమధురము, జటామాంసి, తుంగముస్తెలు, గారపట్ట, వీనిధూమమును సూత్రస్థానమునందుచెప్పబడియుండు కాసహరవిధి ప్రకారము పానము చేసి కఫమును కారియుమిసి పిదప కొంచెముష్ణముగనుండు ఆవుపాలలో బెల్లము కలిపి పానముచేయవలయును. ఇటుల చేసిన వాతశ్లేష్మాధిక్యముగలవియు చిరకాల మనువర్తింపుచుండునవియునైన కాసములన్నియు కడుశీఘ్రముగ నివర్తించును.

తమకశ్వాసచికిత్స.

తమకః కఫకాసే తు స్యాచ్చేత్పిత్తానుబంధజః,
పిత్తకాసక్రియాం తత్ర యథావస్థం ప్రయోజయేత్. ౭౯

కఫకాసరోగికి పిత్తప్రకోపమువలన తమకమను శ్వాసరోగము కలిగినచో దానియందు పైత్తకాసమునకు చెప్పియుండు చికిత్సలన్నియును ఆయా యవస్థానుగుణముగ చేయించవలయును.

కఫాధికవాతకాసచికిత్స.

కఫానుబంధే పవనే కుర్యాత్కఫహరాం క్రియామ్,
పిత్తానుబంధయో ర్వాతకఫయోః పిత్తనాశనీమ్. ౮౦

కాసరోగమునందు వాతము కఫాధిక్యముతోగూడియుండిన కఫకాసహర చికిత్సలును వాతకఫములు పిత్తాధిక్యముతోగూడియుండినపిత్తకాసహర చికిత్సలును చేయనగును.

వాతశ్లేష్మకాసచికిత్స.

వాతశ్లేష్మాత్మకే శుష్కే స్నిగ్ధం చార్ద్రే విరూక్షణమ్,
కాసే కర్మ సపిత్తే తు కఫజే తిక్తసంయుతమ్. ౮౧

వాతశ్లేష్మాధిక్యముగల శుష్కకాస రోగమునందు స్నిగ్ధౌషధములను ఆర్ద్రకాసమునందు రూక్షౌషధములను ఇ...
కఫకాసమునందు తిక్తరసముగల యౌష...

క్షతజ...

ఉరస్యంతః క్షతే సద్యో...
క్షీరేణ శాలీన్ జీర్ణే ౮౨

క్షతజకాసరోగికి ...మ్మునందు
తత్క్షణము లక్క చూర్ణమును కొంచెము తే...

యిచ్చి యది జీర్ణమైనతోడనే సంబాపుబియ్యము అన్నమును ఆవుపాలు శర్కరతోడ జేర్చి పథ్యముగ నిప్పించవలయును.

పార్శ్వశూలాదియుక్త క్షతజకాసచికిత్స.

పార్శ్వవస్తిసరుక్చాల్పపిత్తాగ్నిస్తాం సురాయుతామ్,
భిన్నవిట్కస్సముస్తాతివిషాపాఠాం సవత్సకామ్. 23

ప్రక్కశూల పొత్తికడుపునొప్పి స్వల్పపిత్తము అగ్నిమాంద్యము ఇవిగల క్షతజకాసరోగికి లక్కను సురయనుమద్యములో కలిపి యిప్పించవలయును. మలబంధముగల కాసరోగికి తుంగముస్తలు అతివస చిరుబొద్ది కొడిసెపాల వీటిచూర్ణమును లక్కతోడ సురయను మద్యములో కలిపి పానము చేయించవలయును.

క్షతకాసమునందు సంధానౌషధము.

లాక్షాం సర్పిర్మధూచ్ఛిష్టం జీవనీయగణం సితామ్,
త్వక్ క్షీరీసమ్మితం క్షీరే పక్త్వా దీప్తానలః పిబేత్. ౨౪
ఇక్ష్వారికాబిసగ్రంథిపద్మకేసరచందనైః,
శృతం పయోమధుయుతం సంధానార్థం క్షతీ పిబేత్. ౨౫

లక్క ఆవునెయ్యి మైనము జీవనీయగణద్రవ్యములు పంచదార తవక్షీరి వీనిని ఆవుపాలలో జేర్చి చక్కగ పాకముచేసి ఆ పాలను జాఠరాగ్ని దీపనముగల క్షతజకాసరోగికి పానముచేయించవలయును. మఱియు కుందురుగడ్డి తామరదుంపలు పద్మకేసరములు చందనము వీనిని సమముగ ఆవుపాలలోచేర్చి కాచి చల్లార్చి తేనెకలిపి క్షతకాసముగలవానికి సంధానార్థము అనగా—పగలినఱొమ్ము ఒకటిగాజేర్చుటకై యిప్పించవలయును.

జ్వరయుక్తకాసచికిత్స.

యవానాం చూర్ణమామానాం క్షీరే సిద్ధం ఘృతాన్వితమ్,
జ్వరదాహే సితాక్షౌద్రసక్తూన్వా పయసా పిబేత్. ౨౬

కాసరోగికి జ్వరతాపముగలిగియుండినచో యవలచూర్ణమును ఆవుపాలలో పక్వముచేసి దానిని ఘృతసహితముగగాని పంచదార తేనె పేలాలపిండి వీనిని ఆవుపాలలో కలిపిగాని పానముచేయించవలయును.

కాసవాంశ్చ పిబేత్సర్పిర్మధురౌషధసాధితమ్,
గుడోదకం వా క్వథితం సక్షౌద్రమరిచం హిమమ్. ౨౭
చూర్ణమామలకానాం వా క్షీరపక్వం ఘృతాన్వితమ్,
రసాయనవిధానేన పిప్పలీర్వా ప్రయోజయేత్. ౨౮

కాసరోగముకలవారికి మధురౌషధములతో సిద్ధముచేయబడిన ఘృతమును గాని, బెల్లముచేర్చి కాచి చల్లార్చబడిన యుదకమును మిరియముల చూర్ణము తేనె వీనితోగాని, ఉసిరికవరుగు చూర్ణముతో కాచబడిన ఆవుపాలను ఆవునేతితోగాని, పానముచేయించవలయు. రసాయనకల్పములో చెప్పబడియుండు విధిప్రకారము పిప్పళ్లను ఇప్పించవలయును.

కాసరోగమునందు మధూకాదిలేహము.

కాసీ పర్శ్వాస్థిశూలీ చ లిహ్యాత్సఘృతమాక్షికాన్,
మధూకమధురద్రాక్షా త్వక్ క్షీరీపిప్పలీబలాన్. ౭౯

గణపులు అస్థులు వీనియందుశూలగలకాసరోగికి ఇప్పపండు, అతిమధురము, ద్రాక్ష, తవక్షీరి, పిప్పళ్లు, ఉలిమిడి, వీనిని తేనె ఆవునెయ్యి వీనితో నాకించవలయును.

త్రిజాతకాది గుటికలు.

త్రిజాతమర్ధకర్షాంశం పిప్పల్యర్ధపలం సితా,
ద్రాక్షా మధూకం ఖర్జూరం పలాంశం శ్లక్ష్ణచూర్ణితమ్. ౮౦
మధునా ఘుటికా ఘ్నంతి తా వృష్యాః పిత్తశోణితమ్,
కాసశ్వాసారుచిచ్ఛర్దిమూర్ఛాహిధ్మావమిభ్రమాన్. ౮౧
క్షతక్షయస్వరభ్రంశప్లీహశోషాఢ్యమారుతాన్,
రక్తనిష్ఠీవహృత్పార్శ్వరుక్పిపాసాజ్వరానపి. ౮౨

త్రిజాతకములు ప్రత్యేకము ½ కర్షము, పిప్పళ్లు ½ పలము, పంచదార, ద్రాక్షపండు, అతిమధురము, ఖర్జూరము, ఇవి ప్రత్యేకము ఒక్కొకపలము ఇటుల వీనినన్నిటిని సన్నగ చూర్ణముచేసి తేనెతో గుటికలుచేసి ఆగుటికల నిప్పించిన పిత్తశోణితము కాసము శ్వాసము అరుచి వాంతి మూర్ఛ ఎక్కిళ్లు ఓకర భ్రమ క్షతక్షయము స్వరహాని ప్లీహరోగము వాపు ఆఢ్యవాతము నోటరక్తమువెడలుట, రొమ్ముపార్శ్వములు వీనియందు శూల, దప్పి, జ్వరము వీనినన్నిటిని హరించును. వీర్యవృద్ధి కలుగును. ఇది త్రిజాతకాదిగుటిక లనబడును.

రక్తకాసరోగికి వర్షాభూచూర్ణము.

వర్షాభూశర్కరారక్తశాలితండులజం రజః,
రక్తష్ఠీవీ పిబేత్సిద్ధం ద్రాక్షారసపయోఘృతైః. ౮౩
మధూకమధుకక్షీరసిద్ధం వా తండులీయకమ్,

కారియుమియునపుడు రక్తముపడు కాసరోగికి గలిజేరు, పంచదార, ఎఱ్ఱరాజనాలబియ్యము, వీనిచూర్ణమును; ద్రాక్షపండురసము ఆవుపాలు ఆవునెయ్యి వీనిలో

పాకముచేసి దానినిగాని లేక యిప్పపండు అతిమధురము, ఆవుపాలు వీనితో పక్వముచేయబడిన చిత్రికూరనుగాని యిప్పించవలయును.

—— ముఖాది రక్తస్రావౌషధము. ——

యథాస్వ మార్గవిసృతే రక్తే కుర్యాచ్చ భేషజమ్. ౮౪

నోరు మొదలగు రంధ్రంబులయందుండి రక్తము వెడలుచుండిన రక్తపిత్తచికిత్సితాధ్యాయమునందు చెప్పబడియుండు ఔషధముల నిప్పించవలయును.

—— మూఢవాతౌషధము. ——

మూఢవాతస్త్వజామేదస్సురాభృష్టం ససైంధవమ్,

మూఢవాతముగల పురుషునికి సురయను మద్యములో పక్వముచేయబడి సైంధవలవణము చేర్చబడిన మేకమేదస్సు నిప్పించవలయు.

—— కృశశరీరులకు పుష్టికరౌషధము. ——

క్షామః క్షీణఃక్షతోరస్కో మందనిద్రోఽగ్నిదీప్తిమాన్. ౮౫
శృతక్షీరసరేణాద్యాత్సఘృతక్షౌద్రశర్కరమ్,

కృశించిన శరీరముగలవాడు, రేతస్సు క్షయించియుండువాడు, ఱొమ్మునందు గాయము తగిలినవాడు, నిద్రలేనివాడు, మిక్కుటముగ జాఠరాగ్ని దీపనముగలవాడు వీరలకు చక్కగ కాచబడిన ఆవుపాలమీది మీగడ ఆవునెయ్యి తేనె పంచదార వీనితోడ మేకమేదస్సును చేర్చి యిప్పించవలయు.

—— క్షతక్షీణులకు పుష్టికరౌషధములు. ——

శర్కరాం యవగోధూమం జీవకర్షభకౌ మధు. ౮౬
శృతక్షీరానుపానం వా లిహ్యాత్క్షీణః క్షతః కృశః,
క్రవ్యాత్పిశితనిర్యూహం ఘృతభృష్టం పిబేచ్చ సః. ౮౭
పిప్పలీక్షౌద్రసంయుక్తం మాంసశోణితవర్ధనమ్,

క్షీణించియుండువాడు, గాయము తగిలినవాడు, కృశించియుండువాడు, వీరలకు పంచదార యవలు గోధుమలు జీవకము ఋషభకము తేనె వీనిని సమముగ చేర్చి యిప్పించి చక్కగ కాచబడిన ఆవుపాలను అనుపానముగ నిప్పించవలయు. లేక మాంసము భక్షించునట్టి జంతువులయొక్క మాంసరసమును నేయితో సంస్కరించి అందులో పిప్పలిచూర్ణము తేనె వీనిని జేర్చి యిప్పించవలయు. ఇది మాంసము రక్తము వీనిని వృద్ధిపరచును.

## క్షీణించియుండువారికి హితకరౌషధము.

న్యగ్రోధోదుంబరాశ్వత్థప్లక్ష సాలప్రియంగుభిః. ౭౭
తాలమస్తకజంబూత్వక్ప్రియాలైశ్చ సపద్మకైః,
సాశ్వకర్ణైశ్శృతాత్క్షీరాదద్యాజ్జాతేన సర్పిషా. ౭౯
శాల్యోదనం క్షతోరస్కః క్షీణశుక్రబలేంద్రియః,

ఱొమ్మునందు గాయముతగిలినవారికిని శుక్రముబలము ఇంద్రియములు క్షయించినవారికిని మఱ్ఱి మేడి రావిజువ్వి ఏపి ప్రేంకణము వీటిపట్టలు తాటిమోవు, నేరేడుపట్ట అశ్వకర్ణము (అనగా—మద్దిపట్ట,) పద్మకము వీనిని సమముగ నావుపాలలోవైచి చక్కగకాచి దానిలోనుండితీసిన నేతితో సంబావుబియ్యపు అన్నము నిప్పించిన హితముకలుగును.

## వాతాదిపీడితక్షతకాసికి అభ్యంగము.

వాతపిత్తార్దితేఽభ్యంగో గాత్రభేదే ఘృతైర్మతః. ౮౦
తైలైశ్చానిలరోగఘ్నైః పీడితే మాతరిశ్వనా,

క్షతకాసికి శరీరము వాతపిత్తముచే పీడింపబడియుండినచో నేతితోను, కేవలవాతముచే పీడింపబడియుండినచో వాతహరతైలముతోను అభ్యంగము చేయించవలయును.

## హృచ్ఛూలాది యుక్తక్షతకాస చికిత్స.

హృత్పార్శ్వార్తిషు పానం స్యాజ్జీవనీయస్య సర్పిషః. ౮౧
కుర్యాద్వా వాతరోగఘ్నం పిత్తరక్తవిరోధి యత్,

ఱొమ్మునొప్పి పార్శ్వశూల వీనితోగూడియుండు క్షతకాసరోగికి జీవనీయగణద్రవ్యములతోకాచబడిన ఘృతము నిప్పించవలయు. లేక వాతరోగహరముగ రక్తపిత్తమును పోగొట్టునదిగనుండు చికిత్సను చేయించవలయు.

## క్షతకాసమునకు యష్ట్యాహ్వా[illegible]

యష్ట్యాహ్వనాగబలయోః కా[illegible]
పయస్యాపిప్పలీమాంసీకల్కైః[illegible]

అతిమధురము, నాగబల (జిబిలిక) [illegible]
ఆవుపాలను ఆవునెయ్యినికలిపి, అందు చి[illegible]
మును కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసి [illegible]
కలుగును,

## అమృతప్రాశఘృతము.

జీవనీయో గణశ్శుంఠీ వరీ వీరా పునర్నవా. ౯౩
బలా భార్గీ స్వగుప్తాహ్వా శఠీ తామలకీ కణా,
శృంగాటకం పయస్యా చ పంచమూలం చ యల్లఘు. ౯౪
ద్రాక్షాక్షోడాది చ ఫలం మధురస్నిగ్ధబృంహణమ్,
తైః పచేత్సర్పిషః ంకర్షాంశైః ప్రస్థస్తత్కల్కితైః. ౯౫
క్షీరధాత్రీవిదారీక్షు ఛాగమాంసరసాన్వితమ్,
ప్రస్థార్ధం మధునశ్శీతే శర్కరార్ధతులారజః. ౯౬
పలార్ధకం చ మరిచం త్వగేలాపత్రకేసరమ్,
వినీయ చూర్ణితం తస్మాల్లిహ్యాన్మాత్రాం యథాబలమ్. ౯౭
అమృతప్రాశమిత్యేతన్నరాణామమృతం ఘృతం,
సుధామృతరసం ప్రాశ్యం క్షీరమాంసరసాశినా. ౯౮
నష్టశుక్రక్షతక్షీణదుర్బలవ్యాధికర్శితాన్,
స్త్రీప్రసక్తాన్ కృశాన్ వర్ణస్వరహీనాంశ్చ బృంహయేత్. ౯౯
కాసహిధ్మాజ్వరశ్వాసదాహతృష్ణాస్రపిత్తనుత్,
పుత్రదం ఛర్దిమూర్ఛాహృద్యోనిమూత్రామయాపహమ్. ౧౦౦

సూత్రస్థానమున జీవనీయగణములోచెప్పియుండు ద్రవ్యములు, శుంఠి, పెద్ద పిల్లిపీచర, కాకోళి, గలిజేరు, చిట్టాముట్టి, గంటుభారంగి, దూలగొండి, కచోరములు, నేలయుసిరిక, పిప్పళ్లు, పరికెగడ్డ, మనుబాల, లఘుపంచమూలములు, ద్రాక్ష, మధురముగ స్నిగ్ధముగ శరీరపుష్టికారిగనుండు ఆక్షోడాదిపండ్లు, వీనిని ప్రత్యేకము 1 కర్షప్రమాణముచొప్పున గ్రహించి బాగుగనూరి కల్కముచేసి 1 ప్రస్థము ఆవునేతిలో కలిపి ఆవుపాలు ఉసిరికపండ్లరసము, నేలగుమ్ముడురసము, చెరుకురసము, మేకమాంసరసము. వీనిని 1 ప్రస్థముచేర్చి ఘృతపాకవిధిగ పక్వముజేసి చలారినపిదప దానియందు 16 పలములు, తేనె 50 పలములు, పంచదార, మిరియాలు లవంగపట్ట ఏలకులు జాపత్రి నాగకేసరములు వీనిని దినమునకు రెండుకర్షములచొప్పున గ్రహించి చూర్ణముచేసి కలిపి దేహబలానుసారముగ సేవించి; క్షీరము మాంసరసము వీనితోడ ఆహారమును భుజించవలయును. ఇటుల చేసిన దుర్బలులు, వ్యాధిచే కృశించినవారు, మిక్కుటముగ స్త్రీసంభోగమువలన కృశించినవారు, స్వరము వర్ణము ఇవి క్షీణించియుండువారు, వీరవల శుక్రవృద్ధి శరీరబలము పుష్టికలుగును. కాసము ఎక్కిళ్లు జ్వరము శ్వాసము శర్వాంగతాపము దప్పి రక్తపిత్తము వాంతి మూర్ఛ బొమ్మునొప్పి యోనిశూలమూత్ర

రోగము ఇవి హరించును. గోడ్రాలికిని సంతానముకలుగును. ఇది అమృతప్రాశ ఘృత మనబడును. అమృతమువలెనే మనుజులకు హితమును గలుగజేయును.

### శ్వదంష్ట్రాదిఘృతము.

శ్వదంష్ట్రోశీరమంజిష్ఠాబలాకాశ్మర్యకత్తృణమ్,
దర్భమూలం పృథక్పర్ణీ పలాశర్షభకౌ స్థిరా. ౧౦౧
పాలికాని పచే త్తేషాం రసే క్షీరచతుర్గుణే,
కల్కైస్స్వగుప్తా జీవంతీమేదకర్షభజీవకైః. ౧౦౨
శతావర్యృద్ధిమృద్వీకాశర్కరాశ్రావణీబిసైః,
ప్రస్థస్సిద్ధో ఘృతాద్వాతపిత్తహృద్రోగశూలనుత్. ౧౦౩
మూత్రకృచ్ఛ్రప్రమేహార్శఃకాసశోషక్షయాపహః,
ధనుస్స్త్రీమద్యభారాధ్వఖిన్నానాం బలమాంసదః. ౧౦౪

పల్లేరు, వట్టివేరు, మంజిష్ఠి, చిట్టాముట్టి, గుమ్ముడు, కామంచిపూరి, దర్భవేళ్లు కోలపొన్న, మోదుగు, ఋషభకము, నేలపొన్న, వీని నొక్కొక పలమువంతున గూర్చి పరిభాషానుసారముగ కషాయముకాచి యాకషాయము ఒకభాగమును ఆవుపాలు నాలుగు భాగములును ఒక ప్రస్థము ఆవునేతిలోకలిపి, అందు దూలగొండి, పాలకూర, మేద, ఋషభకము, జీవకము, పిల్లిపీచర, ఋద్ధి, ద్రాక్ష, పంచదార, బోడతరము, తామరతూండ్లు వీనిని ప్రత్యేకము కర్షప్రమాణముచొప్పున గ్రహించి నూరి కల్కము చేసి కలిపి ఘృతపాకవిధానముగ పాకముచేయవలయును. ఇది వాతపిత్తము, హృద్రోగము, శూల, మూత్రకృచ్ఛ్రము, ప్రమేహము, అర్శస్సు, కాసము, శోష, క్షయము, వీనిని పోగొట్టును. ధనుస్సు నాకర్షించుట, స్త్రీసంభోగము, మద్యపానము, భారమును మోయుట, మార్గము నడుచుట వీనిచే శ్రమను జెందినవారికి బలము మాంసపుష్టి వీనిని కలుగజేయును.

### మధుయష్ట్యాది ఘృతము.

మధుకాష్టపలద్రాక్షాప్రస్థక్వాథే
పిప్పల్యష్టపలే కల్కే ప్రస్థం
పృథగష్టపలం క్షౌద్రశర్కర
సమసక్తు క్షతక్షీణరక్తగుల్మే

అతిమధురము 8 పలములు, ద్రా
వైచి చతుర్థాంశముగ కషాయముకాచి అం
చేసి కలిపి 1 ప్రస్థము ఆవునెయ్యిబోసి

చల్లారిన పిదప దానిలో తేనె 8 పలములు,పంచదార 8 పలములు చేర్చవలయును. దీనిని సమభాగము లాజచూర్ణముతో చేర్చి సేవించిన క్షతక్షీణరోగము రక్తగుల్మరోగముగల వారికి మిక్కిలి హితమును గలుగజేయును.

## ధాత్ర్యాది ఘృతము.

ధాత్రీఫలవిదారీక్షుజీవనీయరసాద్ఘృతాత్,
గవ్యాజయోశ్చ పయసోః ప్రస్థం ప్రస్థం విపాచయేత్. ౧౦౭
సిద్ధపూతే సితాక్షౌద్రం ద్విప్రస్థం వినయేత్తతః,
యక్ష్మాపస్మారపిత్తాసృక్కాసమేహక్షయాపహమ్. ౧౦౮
వయఃస్థాపనమాయుష్యం మాంసశుక్రబలప్రదమ్,

ఉసిరికపండురసము, నేలగుమ్ముడుగడ్డరసము, చెఱకురసము, జీవనీయగణ ద్రవ్యరసము, ఆవునెయ్యి, ఆవుపాలు, మేకపాలు, వీనిని ప్రత్యేకము ఒక్కొక ప్రస్థము చొప్పున గ్రహించి యొకటిగచేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి వడియకట్టి చల్లారిన పిదప అందులో పంచదార 1 ప్రస్థము, తేనె 1 ప్రస్థముచేర్చి సేవించిన యక్ష్మ రోగము అపస్మారము రక్తపిత్తము కాసము ప్రమేహము క్షయము ఈ రోగము లన్నియు హరించును. యౌవనమును నిలుపును. ఆయుర్వృద్ధి మాంసపుష్టి శుక్రవృద్ధి శరీరబలము వీనిని కలుగజేయును.

## ఘృతపానక్రమము.

ఘృతం తు పిత్తే ఒభ్యధికే లిహ్యాద్వాతే ఒధికే పిబేత్. ౧౦౯
లీఢం నిర్వాపయేత్పిత్తమల్పత్వాద్ధంతి నానలమ్,
ఆక్రామత్యనిలం పీతమూష్మాణం నిరుణద్ధి చ. ౧౧౦

హిధ్మాశ్వాసరోగికి పిత్త మధికముగ నుండునపుడు ఘృతమును నాకించ వలయు. ఇటులజేసిన నది పిత్తమును శమింపజేయును. ఆ ఘృతము స్వల్పముగ నుండుటవలన జాఠరాగ్నిని చెరచకుండును. వాతమధికముగ నుండునపుడు ఘృతమును పానముచేయించవలయును. ఇటులజేసిన నా ఘృతము వాతప్రకోపమును శమింపజేసి జాఠరాగ్ని వేగమును శమింపజేయును.

(పిత్తము మిక్కుటముగ నున్నపుడు స్వల్పపరిమాణముగ నేతిని నాకినచో నుత్కటమైనపిత్తమును శమింపజేయును. పరిమాణము స్వల్పమగుటవలన జాఠరాగ్నిని చల్లార్ప నేరదు. వాతంబుత్కటమైయున్నపుడు నేతిని అధికపరిమాణముగ త్రాగినచో వాత

మును బలాత్కారముగ నిరోధించును. వాతసంబంధమునంజేసి మిక్కిలి జాజ్వల్యమాన ముగనుండు జాఠరాగ్నిని సమస్థితికి దెచ్చునని భావము.)

దుర్బలాదులకు ఘృతోపయోగక్రమము.

క్షామక్షీణకృశాంగానామేతాన్యేవ ఘృతాని తు,
త్వక్క్షీరీపిప్పలీలాజచూర్ణైః పానాని యోజయేత్. ౧౧౧

సర్పిర్గుడాన్ సమధ్వంశాన్ కృత్వా దద్యాత్పయోఽను చ,
రేతో వీర్యం బలం పుష్టిం తైరాశుతరమాప్నుయాత్. ౧౧౨

దుర్బలులు క్షీణులు కృశించినశరీరముగలవారు వీరలకు పై చెప్పిన ఘృత ములలో తవక్షీరి పిప్పళ్లు వరిపేలాలు పంచదార వీనిచూర్ణమును కలిపి పానము చేయిం చుటయేగాక తేనెతోగూడియుండు సర్పిర్గుడము నిప్పించి ఆవుపాల ననుపానముగ నిప్పించవలయును. ఇటులచేసిన రేతస్సు వీర్యము బలము శరీరపుష్టి ఇవి కడుశీఘ్రకాల ములో కలుగును. "విదారీక్షురసప్రస్థైః ప్రస్థం గవ్యాద్ఘృతాత్పచేత్, శర్కరార్థ తులాం శీతే క్షౌద్రార్ధప్రస్థమేవ చ, క్షిప్త్వా సర్పిర్గుడాన్ కుర్యాద్ధికాకాశ్వాస జ్వరా పహాన్." నేలగుమ్ముడుగడ్డరసము 1 ప్రస్థము, చెఱకురసము 1 ప్రస్థము, ఆవునెయ్యి 1 ప్రస్థము, ఇటుల నీమూడిటిని ఒకటిగ కలిపి అందులో 50 పలములు పంచదార చేర్చి పాకముచేసి యది చల్లారినపిదప అందులో నెనిమిది పలములు తేనెపోసిన నది సర్పిర్గుడమనబడును. ఇది ఎక్కిళ్లు శ్వాసము జ్వరము వీనిని పోగొట్టునని సర్పిర్గుడ లక్షణమును చరకాచార్యుడు చెప్పియున్నాడు.

కూష్మాండకరసాయనము.

వీతత్వగస్థికూష్మాండతులాం స్విన్నాం పునః పచేత్,
ఘట్టయన్ సర్పిషః ప్రస్థే క్షౌద్రవర్ణే ఽత్ర చ క్షిపేత్. ౧౧౩
ఖండాచ్ఛతం కణాశుంఠ్యోర్ద్విపలం జీరకాదపి,
త్రిజాతధాన్యమరిచం పృథగర్ధపలాంశకమ్. ౧౧౪
అవతారితశీతే చ దత్వా క్షౌద్రం ఘృతార్ధకమ్,
ఖజేనామథ్య చ స్థాప్య తన్నిహంత్యుపయోజితమ్. ౧౧౫
కాసహిక్కాజ్వరశ్వాసరక్తపిత్తక్షతక్షయాన్,
ఉరస్సంధానజననం మేధాస్మృతిబలప్రదమ్. ౧౧౬
అశ్విభ్యాం విహితం హృద్యం కూష్మాండకరసాయనమ్,

బెరడువిత్తులు గిజురుతీయబడిన గుమ్మడుకాయ (బూడిదెగుమ్మడు) బద్దలు ఒకతులము (నూరుపలములు) గ్రహించి అర్ధపాకమగువరకు వండి దానిని ఒక ప్రస్థమావు నేతిలోవైచి గెరిటెతో కలియబెట్టుచు వేయించి తేనెతో సమానమైన వర్ణముగనుండు నపుడు అందు ఖండశర్కర నూరుపలములు, పిప్పళ్లు, శుంఠి, జీలకఱ్ఱ, ఇవి ప్రత్యేకము రెండుపలములు, త్రిజాతకములు దనియాలు మిరియాలు ఇవి ప్రత్యేకము అరపలము, ఇటుల వీని నన్నిటిని చేర్చి పక్వముచేసి దించుకొని చల్లారినపిదప దానిలో పదునాఱు పలములు తేనెబోసి కొయ్య కవ్వముతో చక్కగ కలియబెట్టి యిప్పించిన కాసము, ఎక్కిళ్లు, జ్వరము, శ్వాసము, రక్తపిత్తము, ఉరఃక్షతము, క్షయము ఇవి హరించును. బుద్ధి స్మృతి బలము ఇవి కలుగును. పగిలినఱొమ్ము నొకటిగ జేర్చును. ఇది అశ్వినీదేవతలచే నిర్మింపబడిన కూష్మాండక రసాయనము.

## నాగబలాదికల్పము.

పిబేన్నాగబలామూలస్యార్ధకర్షాభివర్ధితమ్. ౧౧౭
పలం క్షీరయుతం మాసం క్షీరవృత్తిరనన్నభుక్,
ఏష ప్రయోగః పుష్ట్యాయుర్బలవర్ణకరః పరమ్. ౧౧౮
మండూకపర్ణ్యాః కల్పోఽయం యష్ట్యా విశ్వౌషధస్య చ,

జబిలికెవేళ్లు ఒకపలము గ్రహించి నూరి ఆవుపాలలోకలిపి దినము ఒకటికి అర్ధ కర్షముచొప్పున హెచ్చించుచు నొకమాసము పర్యంతము పానముచేయవలయు. అన్నములేకయే ఆవుపాలనుమాత్రము పథ్యముగ త్రాగవలయు. ఈయోగము శరీర పుష్టి ఆయుర్వృద్ధి శరీరబలము శరీరవర్ణము వీనిని మిక్కుటముగ గలుగజేయును. ఇటులనే మండూకబ్రహ్మి (సరస్వతియాకు), అతిమధురము, శుంఠి, వీనినికూడ పైజెప్పిన కల్పప్రకార ముపయోగించినచో శరీరపుష్ట్యాదులను మిక్కుటముగ గలుగజేయును.

## నాగబలాఘృతము.

పాదశేషం జలద్రోణే పచేన్నాగబలాతులామ్. ౧౧౯
తేన క్వాథేన తుల్యాంశం ఘృతం క్షీరేణ పాచయేత్,
పలార్ధకైశ్చాతిబలాబలాయష్టిపునర్నవైః. ౧౨౦
ప్రపౌండరీక కాశ్మర్య ప్రియాళకపికచ్ఛుభిః,
అశ్వగంధాసితాభీరుమేదాయుగ్మత్రికంటకైః. ౧౨౧
కాకోలీక్షీరకాకోలీక్షీరశుక్లాద్విజీరకైః,
ఏతన్నాగబలాసర్పిః పిత్తరక్తక్షతక్షయాన్. ౧౨౨

జయేత్తృడ్భ్రమదాహాంశ్చ బలపుష్టికరం పరమ్,
వర్ణ్యమాయుష్యమోజస్యం వలీపలితనాశనమ్. ౧౨౩
ఉపయుజ్య చ షణ్మాసాన్ వృద్ధోఽపి తరుణాయతే,

జిబిలికెచెట్టును సమూలముగ నొకతులము (నూఱుపలములు) గ్రహించి ద్రోణ ప్రమాణ ముదకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి దానికి సమభాగము ఆవునెయ్యి ఆవుపాలుచేర్చి, పేరాముట్టి, చిట్టాముట్టి, అతిమధురము, తెల్లగలిజేరు, ప్రపౌండరీకము (కర్పూరపుబెండ) గుమ్ముడు, చారపప్పు, దూలగొండి, పెన్నేరుగెడ్డ, తెల్లమూలక, పిల్లిపీచర, మేద, మహామేద, త్రికంటకములు, కాకోళి, క్షీరకాకోళి, పాల, నేలగుమ్ముడుగడ్డ, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, వీనిని ప్రత్యేకము అరపలముచొప్పున గ్రహించి కల్కముజేసి కలిపి ఘృతపాకవిధిగ పాకము జేయవలయు. ఇది నాగబలాఘృతమని చెప్పబడును. దీని నిప్పించిన రక్తపిత్తము, ఉరఃక్షతము, క్షయము, దప్పి, భ్రమ, సర్వాంగతాపము, వలీపలితములు, ఇవియన్నియు హరించును. శరీరబలము పుష్టి కాంతి ఆయుర్వృద్ధి ఓజస్సు యివిమిక్కుటముగగలుగును. ఆరుమాసములపర్యంత మీఘృతమును సేవించిన వృద్ధుండును వయోవంతుడగును.

### అగ్నిమాంద్యముగల క్షతకాసులకు చికిత్స.

దీప్తే ఽగ్నౌ విధిరేష స్యాన్మందే దీపనపాచనః. ౧౨౪
యక్ష్మోక్తః క్షతినాం శస్తో గ్రాహీ శకృతి తు ద్రవే,

క్షతక్షయముగలవారికి జాఠరాగ్ని దీప్తికలిగియుండినచో పై చెప్పిన ఘృతముల నిప్పించవలయు. అగ్నిమాంద్యముగలిగియుండినచో రాజయక్ష్మచికిత్సితాధ్యాయమునందు చెప్పియుండు దీపన పాచనౌషధముల నిప్పించవలయు. మలము ద్రవముగ వెడలుచుండిన మలమును గట్టిపరచునట్టి యౌషధము నిప్పించవలయును.

### అగస్త్యప్రోక్త దశమూలాదిరసాయనము.

దశమూలం స్వయంగుప్తాం శంఖపుష్పీం శఠీం బలామ్. ౧౨౫
హస్తిపిప్పల్యపామార్గపిప్పలీమూలచిత్రకాన్,
భార్గీం పుష్కరమూలం చ ద్విపలాంశాన్ యవాఢకమ్. ౧౨౬
హరీతకీశతం చైకం జలే పంచాఢకే పచేత్,
యవస్విన్నే కషాయం తం పూతం తచ్చాభయాశతమ్. ౧౨౭
పచేద్గుడతులాం దత్వా కుడవం చ పృథగ్ఘృతాత్,

త్రైలాత్సపిప్పలీచూర్ణాత్సిద్ధశీతే చ మాక్షికాత్. ౧౨౮
లేహం ద్వే చాభయే నిత్యమతః ఖాదేద్రసాయనాత్,
తద్వలీపలితం హన్యాద్వర్ణాయుర్బలవర్ధనమ్. ౧౨౯
పంచకాసాన్ క్షయం శ్వాసం సహిధ్మం విషమజ్వరమ్,
మేహగుల్మగ్రహణ్యర్శోహృద్రోగారుచిపీనసాన్. ౧౩౦
అగస్త్యవిహితం ధన్యమిదం శ్రేష్ఠం రసాయనమ్,

దశమూలములు, రేగటిదూలగొండి, శంఖపుష్పి, గంధకచోరములు, చిట్టాముట్టి, ఏనుగపిప్పళ్లు, ఉత్తరేణు, మోడి, చిత్రమూలము, గంటుభారంగి, పుష్కరమూలము ఇవి దినుసుకు రెండుపలములు, యవలు ఒక ఆఢకము, కరక్కాయ నూరు యిటుల వీటినన్నిటిని ఐదు ఆఢకముల యుదకములో వైచి పాకముజేసి యవలు అర్ధముపాకమైయుండునపుడు దించి ఆ కషాయమును వడియకట్టుకొని అందులో పైజెప్పిననూరు కరక్కాయలు నూరుపలములు పాతబెల్లము,ఆవునెయ్యి1కుడవము, నువ్వులనూనె 1 కుడవము, పిప్పలిచూర్ణము 1 కుడవము వీనినన్నిటిని యొకటిగ జేర్చి పాకముజేసి దించుకొని చల్లారిన పిదప అందులో తేనె 1 కుడవముచేర్చి పాత్రయందుంచుకొని అరపలముగల ఆ రసాయనముతోడ రెండు కరక్కాయలనుజేర్చి ప్రతిదినము భక్షించిన వలీపలితము, ఐదు కాసరోగములు, క్షయము, శ్వాసము, ఎక్కిళ్లు, విషమజ్వరము, ప్రమేహరోగము, గుల్మము, గ్రహిణి, అర్శోరోగము, ఱొమ్మునొప్పి,అరుచి, పీనసము, ఇవి యన్నియు హరించును. శరీరమునకు మంచివర్ణము బలము ఆయుర్వృద్ధి కలుగును. ఇది అగస్త్యమహర్షిచే నిర్మింపబడిన కడుశ్రేష్ఠమైన రసాయనము.

### వసిష్ఠప్రోక్త దశమూలాదిరసాయనము.

దశమూలం బలాముస్తం హరిద్రే పిప్పలీద్వయం. ౧౩౧
పాఠాశ్వగంధాపామార్గస్వగుప్తాతివిషామృతమ్,
బాలబిల్వంత్రివృద్దంతీమూలం పత్రం చ చిత్రకాత్. ౧౩౨
పయస్యాం కుటజం హింస్రాం పుష్పం సారం చ బీజకాత్,
బోటస్థవిరభల్లాతవికంకతశతావరీః. ౧౩౩
పూతీకరంజశమ్యాకచంద్రలేఖాసహాచరమ్,
శోభాంజనకనింబత్వగిక్షురం చ పలాంశకమ్. ౧౩౪
పథ్యాసహస్రం సశతం యవానాం చాఢకద్వయమ్,
పచేదష్టగుణే తోయే యవస్వేదే ఉవతారయేత్. ౧౩౫

పూతే క్షిపేత్సపథ్యేచ తత్ర జీర్ణగుడాత్తులామ్,
తైలాజ్యధాత్రీరసతః ప్రస్థం ప్రస్థం తతః పునః. ౧౩౬
అధిశ్రయేన్మృదావగ్నౌ దర్వీలేపేఽవతార్య చ,
శీతే ప్రస్థద్వయం క్షౌద్రాత్పిప్పలీకుడవం క్షిపేత్. ౧౩౭
చూర్ణీకృతం త్రిజాతాచ్చ త్రిపలం నిఖనేత్తతః,
ధాన్యే పురాణకుంభస్థం; మాసం ఖాదేచ్చ పూర్వవత్. ౧౩౮
రసాయనం వసిష్ఠోక్తమేతత్పూర్వగుణాధికమ్,
స్వస్థానాం నిష్పరీహారం సర్వర్తుషు చ శస్యతే. ౧౩౯

దశమూలములు, చిట్టాముట్టి, చాగ, పసుపు, మ్రానిపసుపు, పిప్పళ్లు, ఏనుగు పిప్పళ్లు, చిరుబొద్ది, పెన్నేరుగడ్డ, ఉత్తరేణు, దురదగొండి, అతివస, తిప్పతీగె, లేత మారేడు, తెల్లతెగడ, నేలదంతి, చిత్రమూలపువేళ్లు, చిత్రమూలపు ఆకులు, మను బాల, కొడిసెపాలవిత్తులు, హింస్ర (అనగా—కల్లుపుప్పి,) వేగిసపుష్పము, వేగిసగుజ్జు, పెద్దబోడతరము, శిలాజిత్తు, జీడి, పుల్లవెలగ, పిల్లిపీచర, కలుక్రానుగు, రేల, క్రాలుగచ్చ (అనగా—బావంచి)ములుగోరింట, మునుగపట్ట, వేపపట్ట, గొలిమిడి, ఇవి ప్రత్యేకము ఒకపలము, కరక్కాయలు 1100, పదునొకండువందలు, యవలు 2 ఆఢకములు, వీటినన్నిటిని 10 ఆఢకముల యుదకములోవేసి పాకముజేసి యవలు సగము పాకమైన పిమ్మట దించి యాకషాయమును వడియకట్టుకొని అందులో పై 1100 కరక్కాయలు, 1 తులము (నూరుపలములు) పాతబెల్లము, నువ్వులనూనె, ఆవునెయ్యి, ఉసిరికపండ్ల రసము యివి ప్రత్యేము ఒక్కొక ప్రస్థము యిటులజేర్చి పొయిమీపబెట్టి మృద్వగ్నిచే పాకముజేసి గరిటెలోనంటుకొనునపుడు దించుకొని యది చల్లారినపిదప దానిలో తేనె 2 ప్రస్థములు,1 కుడవము పిప్పలిచూర్ణము, త్రిజాతకచూర్ణము 3పలములు, వీటిని చేర్చి నేతితోమాగిన కుండయందుంచి యొకమాసమువరకు ధాన్యరాశియందు పూడ్చియుంచవలయును. పిదప దానిని సేవించిన ఐదువిధములైన కాసరోగములు క్షయము శ్వాసము ఎక్కిళ్లు ప్రమేహము గుల్మము ఈరోగములు హరించును. ఇది ముందు అగస్త్యమహర్షిచే చెప్పియుండు దశమూలాదిరసాయనమునకంటె మిక్కిలి శ్రేష్ఠమైనది. రోగము లేనివారికికూడ సౌఖ్యమునుజేయును. సర్వర్తులయం దుపయోగించతగినది. వసిష్ఠమహర్షిచే చెప్పబడిన దశమూల రసాయనము.

## సైంధవాదిచూర్ణము.

పాలికం సైంధవం శుంఠీ ద్వే చ సౌవర్చలాత్పలే,

కుడవాంశాని వృక్షామ్లం దాడిమం పత్రమార్జకమ్. ౧౪౦
ఏకైకాం మరిచాఽజాజ్యోః ధాన్యకాద్ద్వే చతుర్థికే,
శర్కరాయాః పలాన్యత్ర దశ ద్వే చ ప్రదాపయేత్. 141
కృత్వా చూర్ణమతో మాత్రామన్నపానేషు దాపయేత్,
రుచ్యం తద్దీపనం బల్యం పార్శ్వార్తిశ్వాసకాసజిత్. ౧౪౨

సైంధవలవణము 1 పలము, శుంఠి 1 పలము, సౌవర్చలవణము 2 పలములు, చింతపండు దానిమ్మపండు నందివృక్షపు ఆకు ఇవి ప్రత్యేకము 1 కుడవము, మిరియాలు 1 పలము, జీలకఱ్ఱ 1 పలము, దనియాలు 2 పలములు, పంచదార 12 పలములు, యిటుల వీనినన్నిటిని చేర్చి చక్కగ చూర్ణము చేసి దానిని అన్నపానములయందు యుక్తితో నుపయోగించిన అగ్నిదీపనము కలుగును. బలము కలుగును, పార్శ్వశూల శ్వాసము కాసము వీనిని పోగొట్టును.

ఖాండవము.

ఏకాం షోడశికాం ధాన్యాత్ ద్వే ద్వే వాఽ జాజిదీప్యకాత్,
తాభ్యాం దాడిమవృక్షామ్లైర్ద్విర్ద్విస్సౌవర్చలాత్పలమ్. ౧౪3
శుంఠ్యాః కర్షం దధిత్థస్య మధ్యాత్పంచ పలాని చ,
తచ్చూర్ణం షోడశపలైశ్శర్కరాయా విమిశ్రయేత్. ౧౪౪
ఖాండవోఽయం ప్రదేయః స్యాదన్నపానేషు పూర్వవత్,

దనియాలు 1 కర్షము, జీలకఱ్ఱ 2 కర్షములు, ఓమము 2 కర్షములు, దానిమ్మపండు 8 కర్షములు, చింతపండు 8 కర్షములు, సౌవర్చలవణము 1 పలము, శుంఠి 1 కర్షము, వెలగగుజ్జు 5 పలములు, యిటుల వీనినెల్ల నొకటిగ జేర్చి చక్కగ చూర్ణము జేసి అందులో 16 పలములు పంచదార కలిపిన నది ఖాండవమనబడును. దీనిని అన్నపానములయందుపయోగించిన పార్శ్వశూల శ్వాసకాసములు హరించి అగ్నిదీపనము గూడ కలుగును.

క్షతజకాసచికిత్స.

విధిశ్చ యక్ష్మవిహితో యథావస్థం క్షతే హితః. ౧౪౫

రాజయక్ష్మ చికిత్సితమునందు జెప్పియుండు చికిత్సలను ఉరఃక్షతమున జనించిన కాసమునందును నాయా యవస్థానుగుణముగ జేయవలయును.

క్షతజకాసమున ధూమపానవిధి.

నివృత్తే క్షతదోషే తు కఫే వృద్ధే ఉరశ్శిరః,
దాల్యతే కాసినోఽయస్య స ధూమానాపిబేదిమాన్. ౧౪౬

క్షతదోషము శమించి కఫము వృద్ధిజెంది ఱొమ్ము శిరము యివి చీల్చబడినట్లు ఉపద్రవముగల కాసరోగికి నిక చెప్పబోయెడు ధూమపానము చేయించవలయును.

క్షతజకాసమునకు ధూమపానయోగములు.

ద్వేమేదాద్వేబలాయష్టికల్కైః క్షౌమే సుభావితే,
వర్తిం కృత్వా పిబేద్ధూమం జీవనీయఘృతానుపః. ౧౪౭
మనశ్శిలాపలాశాజగంధాత్వక్ క్షీరినాగరైః,
తద్వదేవానుపానం తు శర్కరేక్షుగుడోదకమ్. ౧౪౮
పిష్ట్వా మనశ్శిలాం తుల్యామార్ద్రయా వటశృంగయా,
ససర్పిష్కం పిబేద్ధూమం తిత్తిరిప్రతిభోజనమ్. ౧౪౯

మేద, మహామేద, చిట్టాముట్టి, పేరాముట్టి, అతిమధురము వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముజేసి తెల్లపట్టుగుడ్డకు పట్టించి నీడ నెండించి వర్తిజేసి ముట్టించి యందువెడలెడి పొగను పానముచేసి తోడనే జీవనీయఘృతమును సేవించుట 1, మణిశిల, మోదుగువిత్తులు, వాయింట, తపక్షీరి, శుంఠి, వీనిని చక్కగనూరి కల్కముచేసి యాకల్కమును తెల్లపట్టుగుడ్డకు పట్టించి యెండించి వర్తిజేసి ముట్టించి యందు వెడలెడి ధూమమును పానముచేసి పంచదారతోడ కలిసిన యుదకమునుగాని చెరుకురసమునుగాని పానకమునుగాని అనుపానముగ నిప్పించుట 2, మణిశిల, మఱ్ఱిచిగుళ్లు వీనిని సమభాగములుగ గ్రహించి నూరి అందులో ఆవునెయ్యి కలిపి తెల్లగుడ్డకు పట్టించి వర్తిజేసి యెండించి ముట్టించి యందుండిబయలువెడలు ధూమమును పానముచేసి తోడనే తిత్తిరిపిట్టమాంసముతో అన్నమును భుజించుట 3, ఇటుల జేసిన కఫాధిక్యముతో గూడి యుండు క్షతజకాసము శమించును.

క్షయజకాసచికిత్స.

క్షయజే బృంహణం పూర్వం కుర్యాదగ్నేశ్చ వర్ధనమ్,
బహుదోషాయ సస్నేహం మృదు దద్యాద్విరేచనమ్. ౧౫౦

క్షయమువలన జనించిన కాసమునందు పూర్వము చెప్పియుండు బృంహణచికిత్సయును జాఠరాగ్నికి దీపనమును గలుగజేయునట్టి చికిత్సయును తొలుత జేయించవలయును. దోషాధిక్యముగల క్షయకాసరోగికి నిక చెప్పబోయెడు స్నేహములతోడ మృదువుగ విరేచనౌషధము నిప్పించవలయును.

### క్షయజకాసమున విరేచనౌషధము.

శమ్యాకేన త్రివృతయా మృద్వీకారసయుక్తయా,
తిల్వకస్య కషాయేణ విదారీస్వరసేన చ. ౧౫౧
సర్పిస్సిద్ధం పిబేద్యుక్త్యా క్షీణదేహో విశోధనమ్,

దుర్బలుడైనక్షయకాసరోగికి రేలరసముతోగాని, ద్రాక్షరసము తెల్లతెగడ వీనితోగాని, తెల్లలొద్దుగుకషాయముతోగాని, నేలగుమ్మడుగెడ్డరసముతోగాని, పక్వము చేయబడిన ఘృతమును దేశకాలబలాద్యనుగుణముగ విరేచనమున కిప్పించవలయును.

### క్షయకాసమునకు కర్కటక్యాదిఘృతము.

పిత్తే కఫే ధాతుషు చ క్షీణేషు క్షయకాసవాన్. ౧౫౨
ఘృతం కర్కటకీక్షీరద్విబలాసాధితం పిబేత్,

క్షయకాసరోగికి పిత్తము కఫము రసాధిధాతువులు క్షయించియుండినచో దూలగోవెల ఆవుపాలు చిట్టాముట్టి, పేరాముట్టి, వీనితో కాచబడిన ఘృతమును పానము చేయించవలయును.

### విదార్యాదిఘృతము.

విదారీభిః కదంబైర్వా తాలసస్యైశ్చ సాధితమ్. ౧౫౩
ఘృతం పయశ్చ మూత్రస్య వైవర్ణ్యేః కృచ్ఛ్రనిర్గమే,

క్షయకాసరోగికి మూత్రము వికారవర్ణముతోగూడి కడుకష్టముచే వెడలుచుండినచో నేలగుమ్మడు గెడ్డలతోగాని కడిమితోగాని తాటిపండ్లతోగాని కాచబడిన ఆవునెయ్యిని లేక ఆవుపాలను పానము చేయించవలయును.

### క్షయకాసరోగికి అనువాసనవస్తి.

శూనే సవేదనే మేఢ్రే పాయౌ సశ్రోణివంక్షణే. ౧౫౪
ఘృతమండేన లఘునాఽనువాస్యో మిశ్రకేణ వా,
జాంగలైః ప్రతిభుక్తస్య వర్తకాద్యా బిలేశయాః. ౧౫౫
క్రమశః ప్రసహాస్తద్వత్ప్రయోజ్యాః పిశితాశినః,
ఔష్ణ్యాత్ప్రమాథిభావాచ్చ స్రోతోభ్యశ్చ్యావయంతి తే. ౧౫౬
కఫం శుద్ధైశ్చ తైః పుష్టిం కుర్యాత్సమ్యగ్వహన్ రసః,

మేఢ్రము లేక గుదము పిఱ్ఱలు గజ్జలు ఇవి యుబ్బి వేదనతోగూడియుండు కాస రోగికి లఘువైన ఘృతమండము అనగా — నేతిమీదిమీగడతోగాని, ఆవునెయ్యినువ్వులనూనె వీనిని సమముగజేర్చి దానిచేగాని, అనువాసనవస్తిని జేయించి జింకమొదలగు

జాంగల మాంసములతో భోజనము నిష్పింపవలయును. జాంగలమాంసము దొరకనియెడల దానికి సమమైన గుణముగల మాంసములతో అన్నము నిష్పించి యతనికి వర్తకపక్షి మొదలగు బిలేశయములమాంసములను; మాంసములనుభుజించునట్టి పెద్దపులి మొదలగు ప్రసహ జంతువుల మాంసములను క్రమక్రమముగ నిష్పించవలయును. అటుల నిష్పించిన యా మాంసములు ప్రమాథిగ ఉష్ణముగ నుండుటవలన నవి కఫముతో గప్పియుండు స్రోతోమార్గములనుండి కఫమును వెడలింపజేయును. పిదప శుద్ధములుగనుండు స్రోతోమార్గములవలన భుజించిన యాహారాదిరసములు శరీరమంతట వ్యాపించి పుష్టిని గలుగజేయును.

"స్రోతాంసి దోషలిప్తాని ప్రమథ్య వివృణోతి యత్, ప్రవిశ్య సౌక్ష్మ్యాత్తైక్ష్ణ్యాచ్చ తత్ప్రమాథీతి సంజ్ఞితమ్." ఏద్రవ్యము సూక్ష్మముగను తీక్ష్ణముగను నుండుట వలన దోషములతోగూడియుండు స్రోతోమార్గములయందు ప్రవేశించి దోషములను పోగొట్టి స్రోతస్సులను శుద్ధిపరచునో యది ప్రమాథి యనబడును. అని ప్రమాథి ద్రవ్యలక్షణము తంత్రాంతరమునందు చెప్పబడియున్నది.

## చవ్యాదిఘృతము.

చవికాత్రిఫలాభార్గీదశమూలైస్సచిత్రకైః. ౧౫౭
కులుత్థపిప్పలీమూలపాఠాకోలయవైర్జలే,
శృతైర్నాగరదుస్పర్శాపిప్పలీశటిపౌష్కరైః. ౧౫౮
పిష్టైః కర్కటశృంగ్యా చ సమైస్సర్పిర్విపాచయేత్,
సిద్ధేఽస్మింశ్చూర్ణితౌ క్షారౌ ద్వౌ పంచలవణాని చ. ౧౫౯
దత్వా యుక్త్యా పిబేన్మాత్రాం క్షయకాసనిపీడితః,

చవ్యము, త్రిఫలములు, గంటుభారంగి, దశమూలములు, చిత్రమూలము, ఉలవలు, మోడి, చిరుబొద్ది, రేగుపండ్లు, యవధాన్యము, వీనిని సమభాగములుగ అష్టక ప్రమాణజలములోవైచి పాదావశేషముగ కషాయముకాచి, వడియకట్టి; అందులో శుంఠి, దూలగోవిల, పిప్పళ్లు, గంధకచోరములు, పుష్కరమూలము, కర్కాటకశృంగి, వీనిని సమభాగములుగ గ్రహించి నూరి కల్కముజేసి కలిపి ఘృతమునుజేర్చి విధిప్రకారము పాకముజేసి; అందు సర్జక్షారము, యవక్షారము, పంచలవణములు, వీనిని కర్షప్రమాణముచేర్చి కలిపి యొక పాత్రలో నుంచికొని క్షయకాసరోగికి తగుమాత్రము బలాద్యనుగుణముగ పానము జేయించవలయును.

## కాసమర్దాదిఘృతము.

కాసమర్దాభయాముస్తాపాఠాకట్ఫలనాగరైః. ౧౬౦
పిప్పల్యా కటురోహిణ్యా కాశ్మర్యా స్వరసేన చ,
అక్షమాత్రైర్ఘృతం ప్రస్థం క్షీరద్రాక్షారసాఢకే. ౧౬౧
పచేచ్ఛోషజ్వరప్లీహసర్వకాసహరం శివమ్,

ఆవుపాలు 1 ఆఢకము, ద్రాక్షపండురసము 1 ఆఢకము, ఆవునెయ్యి 1 ప్రస్థము, వీటినొకటిగ చేర్చి అందులో కసివెంద, కరక్కాయలు, తుంగముస్తలు, చిరుబొద్ది, కాయఫలము, శుంఠి, పిప్పళ్లు, కటుకరోహిణి, గుమ్మడురసము, వీనిని ప్రత్యేకము కర్షప్రమాణము చొప్పున చేర్చి ఘృతమునుగలిపి విధివిహితంబుగ పక్వముచేసి క్షయకాసరోగికి ఇప్పించిన శోష, జ్వరము, ప్లీహము, అయిదు కాసములు హరించును. ఇది మిగుల ఆరోగ్యకరమైన ఘృతము.

## వృషాదిఘృతము.

వృషవ్యాఘ్రీగుడూచీనాం పత్రమూలఫలాంకురాః. ౧౬౨
రసకల్కైర్ఘృతం పక్వం హంతి కాసజ్వరారుచీః,

అడ్డసరము, వాకుడు, తిప్పతీగె, వీనిని ప్రత్యేకము ఆకులు వేళ్లు పండ్లు చిగుళ్లు వీనితోడ గ్రహించి వానిరస కల్కములలో ఆవునెయ్యిచేర్చి పక్వముచేసి యాఘృతము నిప్పించిన కాసము జ్వరము అరుచి హరించును.

## దాడిమాదిఘృతము.

ద్విగుణే దాడిమరసే సిద్ధం వా వ్యోషసంయుతమ్. ౧౬౩
పిబేదుపరి భుక్తస్య యవక్షారయుతం నరః,
పిప్పలీగుడసిద్ధం వా ఛాగక్షీరయుతం ఘృతమ్. ౧౬౪

దానిమ్మపండురసము 2 భాగములు, ఆవునెయ్యి 1 భాగము, వీనినియొకటిగ జేర్చి అందులో త్రికటుకకల్కము కలిపి ఘృతపాకవిధిగ పక్వముజేసి యాఘృతములో యవక్షారమును కలిపి కాసరోగికి భోజనానంతరము పానము చేయించవలయును; లేక పిప్పళ్లు పాతబెల్లము యివి 2 భాగములు, వీనికి 4 గింతలు ఆవునెయ్యి, 4 గింతలు మేకపాలు, వీనికి 4 గింతలు ఉదకము, ఇటుల వీనినన్నిటిని యొకటిగ జేర్చి ఘృతపాకవిధానంబుగ పక్వముజేసి పానము జేయించవలయును.

## ఘృతపానగుణము.

ఏతాన్యగ్నివివృద్ధ్యర్థం సర్పీంషి క్షయకాసినామ్,

స్యాద్దోషబద్ధకంఠోరస్స్రోతసాం చ విశుద్ధయే ౧౬౫

పైనజెప్పిన చవ్యాదిఘృతములను పానముచేయించిన క్షయకాస రోగముగల వారికి జాఠరాగ్ని దీపనము కలుగుటయేగాక కఫదోషముచే కప్పబడిన కంఠముఱొమ్ము స్రోతస్సులు శుద్ధంబగును.

అభయాదిలేహ్యము.

ప్రస్థోన్మితే యవక్వాథే వింశతిర్విజయాః పచేత్,
స్విన్నా మృదిత్వా తాస్తస్మిన్ పురాణాత్షట్పలం గుడాత్. ౧౬౬
పిప్పల్యా ద్విపలం కర్షం మనోహ్వాయా రసాంజనాత్,
దత్వార్ధాక్షం పచేద్భూయస్స లేహశ్శ్వాసకాసనుత్. ౧౬౭

4 ప్రస్థములయుదకములో, 1 ప్రస్థము యవలను వైచి, పాదావశేషముగ కషాయముగాచి వడియగట్టుకొని అందులో 20 కరక్కాయలను వైచి, పాకముజేసి ఆకరక్కాయలను చక్కగ పిసికి విత్తులను యెత్తివేసి దానిలో పాతబెల్లముఆరు పలములు, పిప్పళ్లు రెండు పలములు, మణిశిల ఒక కర్షము, రసాంజనము అర్ధ కర్షము చేర్చి మరల లేహపాక విధిగ పక్వముచేయవలయును. ఇది శ్వాసకాసలను నిశ్శేషముగ హరింపజేయును.

శ్వాసకాసహరౌషధములు.

శ్వావిధాం సూచయో దగ్ధాస్సఘృతక్షౌద్రశర్కరాః,
శ్వాసకాసహరా బర్హిపాదౌ వా మధుసర్పిషా. ౧౬౮
ఏరండపత్రక్షారం వా వ్యోషతైలగుడాన్వితమ్,
లేహయేత్క్షారమేవం వా సురసైరండపత్రజమ్. ౧౬౯
లిహ్యాత్త్ర్యూషణచూర్ణం వా పురాణగుడసర్పిషా,
పద్మకం త్రిఫలా వ్యోషం విడంగం దేవదారు చ. ౧౭౦
బలా రాస్నా చ తచ్చూర్ణం సమస్తం సమశర్కరమ్,
ఖాదేన్మధుఘృతాభ్యాం చ లిహ్యాత్కాసహరం పరమ్. ౧౭౧
తద్వన్మరిచచూర్ణం వా సఘృతక్షౌద్రశర్కరమ్,

ముండ్లపందియొక్క ముండ్లను నిప్పులో కాల్చి ఆభస్మమును తేనె ఆవునెయ్యి పంచదార వీనిలోకలిపి భక్షించినను, లేక నెమలికాళ్లనుకాల్చి ఆభస్మమును తేనె ఆవునెయ్యి వీనిలోకలిపి సేవించినను, లేక ఆముదపాకు భస్మమునుగాని నల్లతులసి ఆముదపాకు వీనిభస్మమునుగాని త్రికటుకచూర్ణము నువ్వులనూనె పాతబెల్లము వీనిలో

కలిపి సేవించినను, లేక త్రికటుకచూర్ణము పాతబెల్లము ఆవునెయ్యి వీనిలో కలిపి సేవించినను, లేక పద్మకము త్రిఫలములు త్రికటుకములు వాయువిడంగములు దేవదారు పట్ట చిట్టాముట్టి, దుంపరాష్ట్రము వీనిని సమభాగములుగ గ్రహించి చక్కగ చూర్ణము చేసి ఆ చూర్ణమునకు సమము శక్కరకలిపి సేవించినను లేక పై పద్మకాది చూర్ణమును తేనె ఆవునెయ్యి వీనిలో కలిపి భక్షించినను లేక మిరియాల చూర్ణమును ఆవు నెయ్యి తేనె పంచదార వీనిలోకలిపి సేవించినను శ్వాసకాసములు హరించును.

## పథ్యాదిగుటికలు.

పథ్యాశుంఠీఘనగుడైర్గుటికాం ధారయేన్ముఖే. ౧౭౨
సర్వేషు శ్వాసకాసేషు కేవలం వా విభీతకమ్,

కరక్కాయలబెరడు శుంఠి తుంగముస్తలు బెల్లము ఈనాల్గిటిని సమముగజేర్చి చేసిన గుటికలనుగాని తాడికాయనుగాని నోటియందుంచుకొనిన అన్ని శ్వాసకాసల యందును హితముకలుగును.

## తిల్వకాదికల్కము.

పత్రకల్కం ఘృతభృష్టం తిల్వకస్య సశర్కరమ్. ౧౭౩
పేయా వోత్కారికా ఛర్దితృట్కాసామాతిసారనుత్,

తెల్లలొద్దుగ ఆకులనునూరి కల్కముచేసి దానిని నేతిలో పక్వముచేసి అందు పంచదారను కలిపి సేవించినను, లేక ఆ తెల్లలొద్దుగ ఆకులకల్కముతో పక్వముచేయ బడిన పేయను త్రాగినను, లేక పైకల్కముతో పక్వము చేయబడిన కుడుములను భక్షించినను వాంతి దప్పి కాసము ఆమాతిసారము హరించును.

## కాసహరముద్గయూషము.

కంటకారీరసే సిద్ధో ముద్గయూషస్సుసంస్కృతః. ౧౭౪
సగౌరామలకస్సామ్లస్సర్వకాసభిషగ్జితమ్,

వాకుడు కషాయముతో పెసరకట్టునుచేసి అందులో ఇంగువ సైంధవలవణము దానిమ్మపులుసు శుంఠి ఆవునెయ్యి వీనినిజేర్చి యిప్పించిన కాసములన్నియు హరించును.

## కాసహరక్షీరాదులు.

వాతఘ్నౌషధనిఃక్వాథే క్షీరం యూషాన్ రసానపి. ౧౭౫
వైష్కిరాన్ ప్రాతుదాన్ బైలాన్ దాపయేత్క్షయకాసినే,

వాతహరౌషధముల కషాయములనుచేర్చి కాచబడిన ఆవుపాలనుగాని, పైకషాయములతో పక్వముచేయబడిన పెసలు మొదలగు కట్టులనుగాని, లేక సూత్రస్థాన

ములో అన్నస్వరూప విజ్ఞానీయాధ్యాయమున చెప్పియుండు విష్కిరము ప్రతుదము బిలేశయము అను నీ జంతువుల మాంసరసములనుగాని, క్షయకాసరోగి కిప్పించిన హితముకలుగును.

### క్షయకాసహర ధూమపానము.

క్షతకాసే చ యే ధూమాస్సానుపానా నిదర్శితాః. ౧౭౬
క్షయకాసేఽపి తే యోజ్యా వక్ష్యంతే యచ్చ యక్ష్మణి,
బృంహణం దీపనం చాగ్నేస్స్రోతసాం చ విశోధనమ్. ౧౭౭
వ్యత్యాసాత్క్షయకాసిభ్యో బల్యం సర్వం ప్రశస్యతే,

క్షతకాసమునకు జెప్పియుండు అనుపానయుక్తములైన ధూమపానములును, ఇక యక్ష్మరోగములకు చెప్పంబడు బృంహణకారియు జాఠరాగ్ని దీపనకారియు స్రోతస్సులను శుద్ధిచేయునవియునైనచికిత్సలును, బలకరంబును అగ్నిదీపనమును గలుగజేయునవియునైన చికిత్సలన్నియును క్షయకాసరోగికి చేయించిన హితముకలుగును.

సన్నిపాతోద్భవో ఘోరః క్షయకాసో యతస్తతః,
యథాదోషబలం తస్య సన్నిపాతహితం హితమ్. ౧౭౮

సన్నిపాతమువలనజనించిన క్షయకాసము మిగుల దారుణముగ కష్టసాధ్యముగ నుండినను దానియందు ప్రకోపించియుండు వాతాదిదోష ప్రకోపానుగుణముగ సన్నిపాతమునకు జెప్పియుండు చికిత్సలన్నియు చేయవలయును.

తృతీయాధ్యాయము - ముగిసెను.

# చతుర్థాధ్యాయము.

అవః "కాసాచ్ఛ్వాసక్షయచ్ఛర్ది స్వరసాదాదయో గదాః, భవంత్యుపేక్షయా" అను వచనప్రకారము శ్వాసరోగము కాసమువలన జనించుటంజేసియు, శ్వాసహిధ్మారోగములకు నిదానప్రాగ్రూపాదులు సమములుగ నుండుటంజేసియు కాసచికిత్సితాధ్యాయనిరూపణానంతరము శ్వాసహిధ్మాచికిత్సాధ్యాయము చెప్పబడుచున్నయది.

## శ్వాసహిధ్మా చికిత్సితాధ్యాయప్రారంభము.

సూ. అథాతశ్శ్వాసహిధ్మాచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

కాసచికిత్సానిరూపణానంతరము శ్వాసము ఎక్కిళ్లు వీని చికిత్సలను వివరించునట్టి శ్వాసహిధ్మాచికిత్సితమను నీ యధ్యాయమును నిరూపించుచున్నారము.

శ్వాసహిధ్మాయతస్తుల్యహేత్వాద్యాస్సాధనం తతః,
తుల్యమేవ

"శ్వాసైకహేతుప్రాగ్రూపసంఖ్యాప్రకృతిసంశ్రయాః," అను నిదానవచనప్రకారము శ్వాసము ఎక్కిళ్లు ఈ రెండింటికి నిదాన పూర్వరూప రూపఉపశయ సంప్రాప్తి లక్షణంబులు ఒకటిగ నుండుటవలన చికిత్సలుకూడ నొకటే విధముగనుండునని మహర్షులు చెప్పియున్నారు.

## శ్వాసహిధ్మరోగికి స్వేదకర్మ.

తదార్తం చ పూర్వం స్వేదైరుపాచరేత్. ౧
స్నిగ్ధైర్లవణతైలాక్తం తైః ఖేషు గ్రథితః కఫః,
సులీనోఽపి విలీనోఽస్య కోష్ఠం ప్రాప్తస్సునిర్హరః. ౨
స్రోతసాం స్యాన్మృదుత్వం చ మారుతస్యానులోమతా,

శ్వాసము ఎక్కిళ్లు వీటిచే పీడింపబడురోగికి తొలుత సైంధవలవణముచేర్చి కాచబడిన తైలముచే నభ్యంగము చేయించి స్నిగ్ధములగు స్వేదకర్మలను జేయవలయును. ఇటులచేసిన స్రోతోమార్గములయందు పేరి గడ్డకట్టి గట్టిగ అంటుకొనియుండు

కఫము కరిగి కోష్ఠమునుజేరి సుఖముగ బైలువెడలుటయేగాక వాతముచే స్తబ్ధముగనుండు స్రోతస్సులకు మృదుత్వమును వాతమునకు స్వమార్గసంచారమును కలుగును.

శ్వాసహిధ్మరోగికి వమనము.

స్విన్నం చ భోజయేదన్నం స్నిగ్ధమానూపజై రసైః. 3
దధ్యుత్తరేణ వా దద్యాత్తతోఽస్మై వమనం మృదు,
విశేషాత్కాసవమథుహృద్గ్రహస్వరసాదినే. ౪
పిప్పలీసైంధవక్షౌద్రయుక్తం వాతావిరోధి యత్,

పైజెప్పిన ప్రకారము స్వేదకర్మను జేయించికొనియుండు శ్వాసరోగికైనను హిధ్మరోగికైనను అనూపదేశజనితంబులైన పంది మొదలగు జంతువుల మాంసరసములతోగాని పెరుగుమీది మీగడతోగాని స్నిగ్ధమైన యెఱ్ఱసంబాబియ్యపు అన్నమును యిప్పించి మృదువైన వమనౌషధము నొసంగవలయును. శ్వాసహిధ్మ రోగములుగలవానికి కాసము వాంతి ఱొమ్మునొప్పి స్వరభంగము యివి విశేషముగ కలిగియుండినచో వాతప్రకోపమును కలుగజేయకుండు వమనౌషధములో పిప్పళ్లు సైంధవలవణము తేనె చేర్చి యిప్పించవలయును.

వమనముచే గల్గుసౌఖ్యము.

నిర్హృతే సుఖమాప్నోతి స కఫే దుష్టవిగ్రహే. ౫
స్రోతస్సు చ విశుద్ధేషు చరత్యవిహతోఽనిలః.

కడుకష్టమును కలుగంజేయుకఫము పై వమనౌషధప్రయోగంబుచే బైలువెడలుటవలన శ్వాసహిధ్మరోగి సుఖమును జెందుటయేగాక దుష్టకఫసంబంధరహితంబుగ నిర్మలముగనుండు స్రోతోమార్గములయందు వాతము అడ్డగింపంబడక చక్కగ సంచరింపుచుండును.

ధ్మానోదావర్తతమకే మాతులుంగామ్లవేతసైః. ౬
హింగుపీలుబిడైర్యుక్తమన్నం స్యాదనులోమనమ్,
ససైంధవం ఫలామ్లం వా కోష్ణం దద్యాద్విరేచనమ్. ౭

శ్వాసహిధ్మరోగికి కడుపుబ్బరము మలమూత్రప్రతిబంధము తమకశ్వాసము ఇవి గలిగియుండిన మాదీఫలము పుల్లప్రబ్బలి ఇంగువ వరగోగు బిడాలవణము వీనితో సంబాబియ్యపు అన్నము నిప్పించిన వాతమునకు అనులోమగతి కలుగును. లేక స్రోతోమార్గము శుద్ధియగుటకై వాతమునకు అనులోమగతినికలుగజేయునట్టి మాదీఫలరసము సైంధవలవణము వీనితో గూడినదియు కొంచెముష్ణముగ నుండునదియునైన విరేచనౌషధమును ఇప్పించవలయును.

శ్వాసరోగమునం దూర్ధ్వాధశ్శోధనము.

ఏతే హి కఫసంరుద్ధ గతిప్రాణప్రకోపజాః,
తస్మాత్తన్మార్గశుద్ధ్యర్థమూర్ధ్వాధశ్శోధనం హితమ్ ౭
ఉదీర్యతే భృశతరం మార్గరోధాద్వహజ్జలమ్,
యథానిలస్తథా తస్య మార్గమస్మాద్విశోధయేత్. ౯

కఫముచే నడ్డగింపఁబడిన ప్రాణవాతముయొక్క ప్రకోపమువలన ఎక్కిళ్లు శ్వాసము జనించును. ఆ వాతమార్గము శుద్ధంబగుటకై యూర్ధ్వాధోభాగములయందు శోధనౌషధము నిప్పించవలయును. అతివేగముగ ప్రవహించునట్టి జలమార్గమును అడ్డగించుటవలన ఆజలము విశేషముగ వృద్ధిజెంది వేరుమార్గముగ బ్రవహించునటులనే స్వభావముగ నెల్లపుడు సంచరింపుచునుండు వాతముయొక్క మార్గము అడ్డగింపబడుట వలన నా వాతము వృద్ధిజెంది ప్రకోపించి దారుణమైన రోగములను బుట్టించును. కావున వాతమార్గమును శోధనౌషధప్రయోగములచే శుద్ధిజేయవలయును.

శ్వాసరోగమున ధూమపానము.

అశాంతౌ కృతసంశుద్ధే ర్ధూమైర్లీనం మలం హరేత్,

పైని జెప్పిన ప్రకారము చికిత్స జేసియు శ్వాసహిధ్మరోగములు శమింపకయుండిన ఆ రోగికి ఊర్ధ్వాధశ్శోధన(వమనవిరేచన) ఔషధముల నిప్పించి అతి సూక్ష్మములైన స్రోతోమార్గములయందు అంటుకొనియుండు కఫమును బైలువెడలింపజేయుటకై ఇకజెప్పబోయెడు ధూమపానంబులను జేయించవలయును.

శ్వాసాదిహరధూమపానయోగములు.

హరిద్రాపత్త్రమేరండమూలం ద్రాక్షాం మనశ్శిలామ్. ౧౦
సదేవదార్వలం మాంసీం పిష్ట్వా వర్తిం ప్రకల్పయేత్,
తాం ఘృతాక్తాం పిబేద్ధూమం యవాన్వా ఘృతసంయుతాన్.
మధూచ్ఛిష్టం సర్జరసం ఘృతం వా గురు వాఽగురు,
చందనం వా తథా శృంగం వాలాన్వా స్నావజాన్ గవామ్.
ఋక్షగోధాకురంగైణచర్మశృంగఖురాణి వా,
గుగ్గులుం వా మనోహ్వాం వా సాలనిర్యాసమేవ వా. ౧౩
సల్లకీం గుగ్గులుం లోహం పద్మకం వా ఘృతప్లుతమ్,

పసుపు ఆకుపత్రి ఆముదపువేళ్లు ద్రాక్షపండు మణిశిల దేవదారుచెక్క హరిదళము జటామాంసి వీనిని సమముగ గ్రహించి యుదకముతో నూరి తెల్లనివస్త్రఖండము

నను లేపనముజేసి ఎండబెట్టి వత్తిజేసి నేతిలోదడిపి దీపమునముట్టించి ఆపొగను శ్వాసహిధ్మ రోగికి పానము జేయించవలయును. లేక నేతిలోదడిపిన యవలనుగాని, మైనము సర్జ రసము ఆవునెయ్యి వీనిని సమభాగముగగాని, శ్రేష్ఠమైన నల్ల అగరుచెక్కనుగాని, చంద నపుచెక్కనుగాని, ఆవులయొక్క గంగడోలునందుండు వెండ్రుకలనుగాని కొమ్ములనుగాని, ఎలుగుమంటి ఉడుము జింకదుప్పి వీనిచర్మము కొమ్ములుగిట్టలునుగాని, గుగ్గిలమునుగాని, మణిశిలనుగాని, సర్జరసమునుగాని, అందుగుబంక గుగ్గిలము పద్మకమను గంధద్రవ్యము వీనినిగాని ఒక్కొకదానిని ఆవునేతితోతడిపి, వెవ్వేరుగ నిప్పులోవైచి అందుండివెడలెడు ధూమమును పానముజేయించిన ఎక్కిళ్లు శ్వాసము హరించును.

### శ్వాసమునందు స్వేదకర్మ.

అవశ్యం స్వేదనీయానామస్వేద్యానామపి క్షణమ్. ౧౪
స్వేదయేత్ససితాక్షీరసుఖోష్ణస్నేహసేచనైః,
ఉత్కారికోపనాహైశ్చ స్వేదాధ్యాయోక్తభేషజైః ౧౫
ఉరఃకంఠం చ మృదుభిస్సామే త్వామవిధిం చరేత్,

శ్వాసహిధ్మరోగులు స్వేదకర్మకర్హులుగలేక అనర్హులుగనుండినను ఆవుపాలు పంచదార యివి చేర్చబడి సుఖోష్ణముగనుండు స్నేహసేచనములచేతను సూత్రస్థానములో స్వేదవిధ్యధ్యాయమునందు జెప్పబడిన యౌషధములతో చేయబడిన ఉత్కారికా ఉపనాహస్వేదములచేతను కంఠము ఱొమ్ము వీనికి స్వేదకర్మలను చేయించవలయును. శ్వాసము ఆమాజీర్ణముతో గూడియుండిన లంఘనపాచనములైన ఆమహర చికిత్సలను చేయవలయును.

### వమనాద్యతియోగమున నౌషధము.

అతియోగోద్ధతం వాతం దృష్ట్వా పవననాశనైః. ౧౬
స్నిగ్ధైరసాద్యైర్నాత్యుష్ణైరభ్యంగైశ్చ శమం నయేత్,

శ్వాసహిధ్మరోగికి వమనవిరేచనములయొక్క అతియోగమువలన వాతము ప్రకోపించియుండిన వాతహరముగ స్నిగ్ధముగనుండు మాంసరసము ఘృతము క్షీరము మొదలగువానిచేతను కొంచెముష్ణముగనుండు అభ్యంగములచేతను వాతమును శమింపజేయవలయును.

### శోధనాద్యనర్హులకు శమనకషాయము.

అనుత్క్లిష్టకఫాస్విన్నదుర్బలానాం హి శోధనాత్. ౧౭
వాయుర్లబ్ధాస్పదో మర్మ సంశోష్యాశు హరేదసూన్,

కషాయలేహస్నేహాద్యైస్తేషాం సంశమయేదతః. ౧౮

స్వస్థానమునందుండి చలించకుండు కఫములుగలవారు, స్వేదకర్మచేయబడనివారు, దుర్బలులు వీరికి వమనవిరేచనరూప శోధనకర్మలను చేయించుటవలన వాతము ప్రకోపించి మర్మములను శోషింపజేసి శీఘ్రముగ ప్రాణములను హరింపజేయును. అట్టివారికి కషాయము లేహము స్నేహము మొదలగువానిచే శ్వాసహిధ్మలను శమింపజేయవలయును.

## పిత్తాదిజశ్వాసచికిత్స.

క్షీణక్షతాతిసారాసృక్పిత్తదాహానుబంధజాన్,
మధురస్నిగ్ధశీతాద్యైః హిధ్మాశ్వాసానుపాచరేత్. ౧౯

క్షీణము క్షతము అతిసారము రక్తపిత్తము తాపము వీనివలన జనించిన హిధ్మాశ్వాసరోగములను మధురముగ స్నిగ్ధముగ శీతలముగనుండు ఔషధములచే చికిత్స చేయవలయును.

## హిధ్మాశ్వాసరోగికి పేయాయూషాదులు.

కులిత్థదశమూలానాం క్వాథే స్యుర్జాంగలా రసాః,
యూషాశ్చ శిగ్రువార్తాకకాసఘ్నవృషమూలకైః. ౨౦
పల్లవైర్నింబకులకబృహతీమాతులుంగజైః,
వ్యాఘ్రీదురాలభాశృంగీబిల్వమధ్యత్రికంటకైః. ౨౧
పేయా చ చిత్రకాజాజీశృంగీసౌవర్చలైః కృతా,
దశమూలేన వా కాసశ్వాసహిధ్మారుజాపహా. ౨౨

శ్వాసహిధ్మరోగికి ఉలవలు దశమూలములు వీని కషాయములో పక్వముచేయబడిన జాంగలమాంసరసము; పైకషాయములో పక్వము చేయబడిన పెసలు మొదలగువాని కట్టులు; మునగ వంకాయ కసివెంద అడ్డసరము ముల్లంగి వీనితోడను వేము చేదుపొట్ల నేలములక మాదీఫలపుచెట్టు వీటిచిగుళ్లతోడను వాకుడు దూలగొండి కర్కాటకశృంగి, మారేడుగుజ్జు పల్లేరు వీనితోడను పక్వముచేయబడిన పెసలు మొదలగువాని కట్టులు; చిత్రమూలము జీలకఱ్ఱ కర్కాటకశృంగి సౌవర్చలలవణము వీనితోగాని దశమూలకషాయముతోగాని పక్వముచేయబడిన పేయ; వీనినిప్పించిన కాసము శ్వాసము ఎక్కిళ్లు హరించును.

## హిధ్మాశ్వాసమునకు దశమూలాదికషాయము.

దశమూలశఠీరాస్నాభార్గీబిల్వర్ధిపుష్కరైః,

కులీరశృంగిచపలాతామలక్యమృతౌషధైః. ౬౩
పిబేత్కషాయం జీర్ణేఽస్మిన్ పేయాం తైరేవ సాధితామ్,

దశమూలములు గంధకచోరములు దుంపరాష్ట్రము గంటుభారంగి మారేడు బుద్ధి పుష్కరమూలము కర్కాటకశృంగి పిప్పళ్లు నేలయుసిరిక తిప్పతీగె శుంఠి వీనిని సమములుగ గ్రహించి ఉదకములోవైచి కషాయముకాచి శ్వాసహిధ్మరోగికి పానముజేయించి అది జీర్ణమైనతోడనే పైదశమూలాది కషాయములో పాకముచేయబడిన పేయను పానము చేయించవలయును.

## హిధ్మాశ్వాసరోగికి పథ్యకరధాన్యములు.

శాలిషష్టికగోధూమయవముద్గకుళత్థభుక్. ౬౪
కాసహృద్గ్రహపార్శ్వార్తిహిధ్మాశ్వాసప్రశాంతయే,

హిధ్మాశ్వాసరోగికి సంబావుబియ్యము అరువది దినములకు ఫలించెడు సంబావు బియ్యము గోధుమలు యవలు పెసలు ఉలవలు వీని సిప్పించిన కాసము రొమ్ముపట్టు పార్శ్వశూల ఎక్కిళ్లు శ్వాసము ఇవి శమించును.

సక్తూన్ వార్కాంకురక్షీరభావితానాం సమాక్షికాన్. ౬౫
యవానాం దశమూలాదినిఃక్వాథలులితాన్ పిబేత్,

హిధ్మాశ్వాసరోగికి పైజెప్పిన దశమూలాది కషాయమునందు జిల్లేడు చిగుళ్ల పాలలో భావనచేయబడిన యవలపిండిని కలిపి కొంచెము తేనెను చేర్చి పానము చేయించిన హితముకలుగును.

## హిధ్మాశ్వాసరోగికి ఆహారోపయోగము.

అన్నే చ యోజయేత్క్షారం హింగ్వాజ్యబిడదాడిమాన్. ౬౬
సపౌష్కరశటీవ్యోషమాతులుంగామ్లవేతసాన్,

హిధ్మాశ్వాసరోగికి సర్జక్షారము ఇంగువ ఆవునెయ్యి బిడాలవణము దానిమ్మపండు పుష్కరమూలము కచ్చూరములు త్రికటుకములు మాదీఫలము పుల్లప్రబ్బలి వీనిని ఆహారమునందు చేర్చి యుపయోగించవలయును.

## హిధ్మాశ్వాసరోగికి ఉదకాదిపానము.

దశమూలస్య వా క్వాథమథవా దేవదారుణః. ౬౭
పిబేద్వా వారుణీమండం హిధ్మాశ్వాసీ పిపాసితః,

హిధ్మాశ్వాసరోగికి దప్పికలిగినయెడ దశమూలకషాయముగాని దేవదారు చెక్క కషాయమునుగాని వారుణియను మద్యముయొక్క తేటనుగాని పానము చేయించవలయును.

హిధ్మాశ్వాసరోగికి తక్రప్రయోగము.

పిప్పలీపిప్పలీమూలపథ్యాజంతుఘ్నచిత్రకైః ౨౮
కల్కితైర్లేపితే రూఢే నిక్షిపేద్ఘృతభాజనే,
తక్రం మాసస్థితం తద్ధి దీపనం శ్వాసకాసజిత్. ౨౯

పిప్పళ్లు మోడి కరక్కాయ వాయువిడంగములు చిత్రమూలము వీనిని సమభాగముగ గ్రహించి నూరి కల్కముచేసి ఆ కల్కమును నేతిపాత్రను లోభాగమున పూసి యెండించి దానిలో ఆవుమజ్జిగపోసి యొక మాసమువరకు నుంచి దానిని పానము చేయించిన శ్వాసకాసములు హరించి అగ్నిదీపనముకలుగును.

హిధ్మాశ్వాసహరపానము.

పాఠాం మధురసాం దారు సరళం నిశిసంస్థితమ్,
సురామండేఽల్పలవణం పిబేత్ప్రసృతిసమ్మితమ్. ౩౦
భార్గీశుంఠ్యౌ సుఖాంభోభిః క్షారం వా మరిచాన్వితమ్,
స్వక్వాథపిష్టాం లులితాం బాష్పికాం పాయయేత వా. ౩౧

సురయను మద్యముమీది తేటలో చిరుబొద్ది చాగ సరళ దేవదారుచెక్క వీనిని చేర్చి ఒకరాత్రి నానబెట్టి అందు కొంచెము లవణముకలిపి ప్రసృతి అనగా—చారెడు, ప్రమాణము పానము చేయించవలయును. లేక గంటుభారంగి శుంఠి వీని చూర్ణమును ఉష్ణోదకములో కలిపిగాని యవక్షారము మిరియపుచూర్ణము వీనిని యొకటిగచేర్చి ఉష్ణోదకములో కలిపిగాని హింగుపత్రికషాయములో హింగుపత్రిచూర్ణము కలిపిగాని పానముచేయించిన హిధ్మాశ్వాసరోగములు హరించును.

పిత్తకఫాన్వితహిధ్మాశ్వాసచికిత్స.

స్వరసస్సప్తపర్ణస్య పుష్పాణాం వా శిరీషతః,
హిధ్మాశ్వాసే మధుకణాయుక్తః పిత్తకఫానుగే. ౩౨

హిధ్మాశ్వాసరోగము పిత్తకఫములతో గూడియుండినచో ఏడాకులపొన్నరసమునుగాని దిరిసనపువ్వురసమునుగాని తేనె పిప్పలిచూర్ణము వీనితో గూర్చి పానము చేయించవలయును.

పిత్తాద్యన్వితహిధ్మాశ్వాసచికిత్స.

ఉత్కారికా తుగాకృష్ణా మధూలీఘృతనాగరైః,
పిత్తానుబంధే యోక్తవ్యా పవనే త్వనుబంధిని. ౩౩
శ్వావిచ్ఛశామిషకణాఘృతశల్యకశోణితైః,

చతుర్గుణాంబుసిద్ధం వా పయః సగుడనాగరం. ౩౪
సువర్చలాదిసిద్ధం వా తయోః శాల్యోదనాదను,

హిధ్మాశ్వాసరోగము పిత్తముతో గూడియుండినచో తవక్షీరి పిప్పళ్లు అతిమధురము ఆవునెయ్యి శుంఠి వీనితో పక్వముచేయబడిన కుడుములు నిప్పించవలయును. వాతముతో గూడియుండినచో ఏదుపందిమాంసము కుందేలుమాంసము పిప్పళ్లు వీనిని సమభాగములుగ గ్రహించి అందులో ఆవునెయ్యి ఏదుపందిరక్తము సమభాగముగ జేర్చి కుడుములుజేసి దానినిగాని, 4 భాగములుదకములో 1 భాగము మేకపాలనుచేర్చి చక్కగ కాచి కొంచెము బెల్లము శుంఠిచేర్చి ఆ పాలనుగాని యిప్పించవలయును. వాతపిత్తముతో గూడియుండినచో సువర్చలాది రసమునుచేర్చి కాచబడిన ఆవుపాలనుగాని 1 భాగము మేకపాలు 4 భాగములుదకము నొకటిగచేర్చి చక్కగ కాచి అందులో కొంచెము శుంఠి బెల్లముచేర్చి ఆపాలనుగాని, శాలిధాన్యపు అన్నముతోగూడ ననుపానముగ నిప్పించవలయును.

## హిధ్మాశ్వాసహరౌషధములు.

పిప్పలీమూలమధుకగుడగోఽశ్వశకృద్రసాన్. ౩౫
హిధ్మాభిష్యందకాసఘ్నాన్ లిహ్యాన్మధుఘృతాన్వితాన్,

హిధ్మాశ్వాసరోగికి మోడి అతిమధురము వీని చూర్ణములో బెల్లము ఆవుపేడరసము గుఱ్ఱపుపెంటికలరసము వీని నొకటిగాచేర్చి అందులో తేనె ఆవునెయ్యి కలిపి నాకించిన ఎక్కిళ్లు అభిష్యందము కాసము హరించును.

గోగజాశ్వవరాహోష్ట్రఖరమేషాజవిడ్రసమ్. ౩౬
సమధ్వేకైకశో లిహ్యాద్బహుశ్లేష్మాఽథవా పిబేత్,
చతుష్పాచ్చర్మరోమాస్థిఖురశృంగోద్భవాం మషీమ్. ౩౭
తథైవ వాజిగంధాయా లిహ్యాచ్ఛ్వాసీ కఫోల్బణః,
శఠీపుష్కరధాత్రీర్వా పౌష్కరం వా కణాన్వితమ్. ౩౮
గైరికాంజనకృష్ణాం వా స్వరసం వా కపిత్థజమ్,
రసేన వా కపిత్థస్య ధాత్రీ సైంధవపిప్పలీః. ౩౯
ఘృతక్షౌద్రేణ వా పథ్యావిడంగోషణపిప్పలీః,
కోలలాజామలద్రాక్షాపిప్పలీనాగరాణి వా. ౪౦
గుడతైలనిశాద్రాక్షా కణారాస్నోషణాని వా,
పిబేద్రసాంబుమద్యామ్లైర్లేహౌషధరజాంసి వా. ౪౧

శ్వాసహిధ్మరోగికి శ్లేష్మము అధికముగనుండినచో ఆవు ఏనుగు గుఱ్ఱము పంది ఒంటె గాడిదె మేక గొఱ్ఱె వీని విష్ఠరసములను ప్రత్యేకప్రత్యేకము తేనెసహితముగ పానము చేయించవలయును. చతుష్పాద జంతువులయొక్క చర్మము వెండ్రుకలు ఎముకలు గిట్టలు కొమ్ములు వీనిని నిప్పులో కాల్చి ఆ మసిని తేనెలో కలిపి నాకించవలయును. శ్వాసరోగికి కఫాధిక్యముగలిగియుండినచో పెన్నేరుగడ్డను కాల్చి ఆ మసిని గాని కచ్చూరములు పుష్కరమూలము ఉసిరికవరుగు వీనిచూర్ణమును గాని పుష్కరమూలము పిప్పళ్లు వీనిచూర్ణమును గాని గైరికాంజనము పిప్పళ్లు వీని చూర్ణమును గాని వెలగరసమును గాని తేనెతో నాకించవలయును. లేక ఉసిరికవరుగు సైంధవలవణము పిప్పళ్లు వీని చూర్ణమును వెలగరసములో కలిపి నాకించవలయును. లేక కరక్కాయ వాయువిడంగములు మిరియాలు పిప్పళ్లు వీనిచూర్ణమును గాని, లేక రేగుపండు వరిపేలాలు ఉసిరికవరుగు ద్రాక్ష పిప్పళ్లు శుంఠి వీనిచూర్ణమును గాని, లేక బెల్లము నువ్వులనూనె పసుపు ద్రాక్ష పిప్పళ్లు దుంపరాష్ట్రము మిరియాలు వీనిచూర్ణమును గాని తేనె ఆవునెయ్యి వీనిలో కలిపి నాకించవలయును. లేక మాంసరసము ఉదకము పుల్లనిమద్యము వీనిలో దేనియందైన అగస్త్యలేహమునకు చెప్పియుండు ఔషధ చూర్ణమును కలిపి పానము చేయించవలయును.

## జీవంత్యాదిచూర్ణము.

జీవంతీముస్తసురసత్వగేలాద్వయపౌష్కరమ్,
చండాతామలకీలోహభార్గీనాగరవాలకమ్. ౪౨

కర్కటాఖ్యా శఠీ కృష్ణా నాగకేసరచోరకమ్,
ఉపయుక్తం యథాకామం చూర్ణం ద్విగుణశర్కరమ్. ౪౩
పార్శ్వరుగ్జ్వరకాసఘ్నం హిధ్మాశ్వాసహరం పరమ్,

మనుబాల తుంగముస్తలు తులసి లవంగపట్ట చిన్నఏలకులు పెద్దఏలకులు పుష్కరమూలము లింగదొండ నేలయుసిరిక అగరుచెక్క గంటుభారంగి శుంఠి కురువేరు కర్కాటకశృంగి కచ్చూరములు పిప్పళ్లు నాగకేసరములు కచోరములు వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి ఆ చూర్ణమునకు రెండింతలు పంచదార కలిపి సేవించిన పార్శ్వశూల జ్వరము కాసము ఎక్కిళ్లు శ్వాసము ఇవి హరించును.

## శఠ్యాది చూర్ణము.

శఠీతామలకీభార్గీచండావాలకపౌష్కరమ్, ౪౪
శర్కరాష్టగుణం చూర్ణం హిధ్మాశ్వాసహరం పరమ్,

కచ్చూరములు నేలయుసిరిక గంటుభారంగి చండయను గంధద్రవ్యము లేక లింగదొండ కురువేరు పుష్కరమూలము వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణము చేసి 8 దింతలు శర్కరకలిపి సేవించిన ఎక్కిళ్లు శ్వాసము హరించును.

హిధ్మాశ్వాసహర నస్యము.

తుల్యం గుడం నాగరం చ భక్షయేన్నావయేత వా. ౪౫

బెల్లము శుంఠి వీనిని సమభాగముగ గ్రహించి చూర్ణముచేసి భక్షించినను లేక యీ చూర్ణముచే నస్యముచేయించుకొనినను ఎక్కిళ్లు శ్వాసము హరించును. లేక యిక చెప్పబోయెడు ఔషధములచే నస్యము నుపయోగించవలయును.

లశునస్య పలాండోర్వా మూలం గృంజనకస్య వా,
చందనాద్వా రసం దద్యాన్నారీక్షీరేణ నావనమ్. ౪౬
స్తన్యేన మక్షికావిష్ఠామలక్తకరసేన వా,

హిధ్మాశ్వాసరోగికి ఉల్లిగెడ్డలనుగాని నీరుల్లిగెడ్డలనుగాని వెల్లుల్లిగెడ్డలనుగాని నూరి చనుపాలలో కలిపి నస్యముచేయించవలయును. లేక చందనరసమును చనుపాలలో కలిపి నస్యము చేయించవలయును. లేక ఈగలమలమును చనుపాలలో గలిపి దానిచేత గాని లక్కరసముచేత గాని నస్యముచేయించిన హితము కలుగును.

కణాదిఘృతము.

కణాసౌవర్చలక్షారవయస్థాహింగుచోరకైః. ౪౭
సకాయస్థైర్ఘృతం మస్తు దశమూలరసే పచేత్,
తత్పిబేజ్జీవనీయైర్వా లిహ్యాత్సమధు సాధితమ్ ౪౮

పిప్పళ్లు సౌవర్చలవణము సర్జక్షారము ఉసిరికపప్పు ఇంగువ కచోరములు కరక్కాయలు వీనిని సమభాగముగ గ్రహించి కల్కముచేసి దశమూలకషాయములో కలిపి అందులో ఆవునెయ్యి పెరుగుమీఁదిమీఁగడ చేర్చి స్నేహపాకవిధ్యధ్యాయమునందు చెప్పబడియుండు విధిప్రకారము పక్వముచేసి యీ ఘృతమును పానముచేయించిన హిధ్మాశ్వాసరోగములు హరించును. లేక జీవనీయగణద్రవ్యములను సమభాగములుగ గ్రహించి నూరి యీ కల్కమును ఆవునేతిలో జేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి దానిలో కొంచెము తేనెకలిపి నాకించిన ఆరోగ్యము కలుగును.

తేజోవత్యాదిఘృతము.

తేజోవత్యభయాకుష్ఠం పిప్పలీ కటురోహిణీ,
భూతీకం పౌష్కరం మూలం పలాశశ్చిత్రకః శఠీ. ౪౯
పటుద్వయం తామలకీ జీవంతీ బిల్వపేశికా,

వచా పత్రం చ తాళీసం కర్షాంశైస్తైర్విపాచయేత్. ౫౦
హింగుపాదైర్ఘృతప్రస్థం పీతమాశు నిహంతి తత్,
శాఖానిలార్శోగ్రహణీహిధ్మాహృత్పార్శ్వవేదనాః. ౫౧

తేజోవతీపత్రము (ఆకుపత్రి), కరక్కాయలు చెంగల్వకోష్టు పిప్పళ్లు కటుకరోహిణి కామంచిగడ్డి పుష్కరమూలము మోదుగవిత్తులు చిత్రమూలము గంధకచోరములు సైంధవలవణము సాముద్రలవణము నేలయుసిరిక మనుబాల మారేడుగుజ్జు వస తాళిసపత్రి యివి ప్రత్యేకము కర్షప్రమాణము,వీనికి 4 వ భాగము యింగువ యిటుల వీనినన్నిటిని యొకటిగాచేర్చి కల్కముజేసి దానిని 1 ప్రస్థము ఆవునెయ్యిలోకలిపి ఘృతపాకవిధిగ పాకముజేసి హిధ్మాశ్వాసరోగికిప్పించిన శాఖావాతములు (కాళ్లుచేతుల యందు కల్గినవాత రోగములు) అర్శస్సు గ్రహణి ఎక్కిళ్లు ఱొమ్మునొప్పి పార్శ్వశూలల యివి హరించును.

### హిధ్మాశ్వాసరోగికి ధాన్వంతరాది ఘృతోపయోగము.

అర్ధాంశేన పిబేత్సర్పిః క్షారేణ పటునాథవా,
ధాన్వంతరం వృషఘృతం దాధికం హపుషాది వా. ౫౨

హిధ్మాశ్వాసరోగికి ప్రమేహచికిత్సితాధ్యాయమునందు జెప్పబడియుండు ధాన్వంతరఘృతము, రక్తపిత్తచికిత్సితాధ్యాయమునందుజెప్పబడియుండు వృషఘృతము గుల్మరోగచికిత్సితాధ్యాయమునందు జెప్పిబడియుండు దాధికఘృతము, ఉదరరోగ చికిత్సితాధ్యాయమునందు జెప్పబడియుండు హపుషాదిఘృతము ఈఘృతములను అర్ధాంశము సర్జక్షారసహితముగగాని లేక అర్ధాంశము సైంధవలవణ సహితముగగాని పానము జేయించిన హితకరముగనుండును.

### హిధ్మారోగికి శీతోదకాద్యుపయోగము.

శీతాంబుసేకస్సహసా త్రాసవిక్షేపభీశుచః,
హర్షేర్ష్యోచ్ఛ్వాససంరోధా హితం కీటైశ్చ దంశనమ్. ౫3

హిధ్మారోగికి అకస్మాత్తుగ శరీరముపైని చల్లనియుదకమును పోయుట, హఠాత్తుగ చిత్తమునకు ఉద్వేగము (భయము), శరీరమును కదల్చుట (కుదుపుట), భయము, శోకము, మిక్కిలి సంతోషము, అసూయ, ఉచ్ఛ్వాస నిశ్వాసములను బంధించుట, వీనిని గలుగజేయుట, పురుగులచే కరిపించుట, శ్వాసము నడ్డగింప జేయుట మొదలగునవి వాతవేగహరంబులు.

### హిధ్మాశ్వాసరోగికి సామాన్యోపచారము.

యత్కించిత్కఫవాతఘ్నముష్ణం వాతానులోమనమ్,

తత్సేవ్యం ప్రాయశో యచ్చ సుతరాం మారుతాపహమ్. ౫౪

కఫవాతములను బోకడచునదియు వాతమునకు స్వమార్గగమనంబును గలుగ జేయునదియు వాతప్రకోపమును పోగొట్టునదియు మిక్కిలి యుష్ణముగనుండునదియు నైన ఆహార విహారౌషధాదులను హిధ్మాశ్వాసరోగి కుపయోగించవలయును.

హిధ్మాశ్వాసమునందు శమనబృంహణచికిత్స.

సర్వేషాం బృంహణే హ్యల్పశ్శక్యశ్చ ప్రాయశో భవేత్,
నాత్యర్థం శమనే పాయో భృశో శక్యశ్చ కర్షణే ౫౫
శమనై ర్బృంహణైశ్చాతో భూయిష్ఠం తానుపాచరేత్,

హిధ్మాశ్వాసరోగ పీడితులకు బృంహణ చికిత్సలను జేయించుటవలన ఒకానొకపుడు దైవవశంబుచే రోగవృద్ధిగాని లేక మరియొకరోగముగాని జనించిననది తఱుచుగ సుసాధ్యంబుగనుండును. అటులనే శమనచికిత్సలం జేయుటవలన యొకపుడు దైవవశముచే రోగవృద్ధిగాని లేక మరియొక రోగముగాని జనించినచో నది కొంచెము కష్టసాధ్యంబుగనుండును. కర్షణచికిత్సలను జేయించుటవలన దైవవశముచే రోగవృద్ధిగాని లేక మరియొకరోగముగాని జనించినయెడల యది మిగుల అసాధ్యంబుగనుండును. కావున హిధ్మాశ్వాసరోగులకు శమనౌషధంబులను బృంహణౌషధంబులను పలుమారు ఇప్పించవలయును.

కాసశ్వాసక్షయచ్ఛర్దిహిధ్మాశ్చాన్యోన్యభేషజైః. ౫౬

కాసము శ్వాసము క్షయము వాంతి ఎక్కిళ్లు వీనికి జెప్పియుండు చికిత్సలను పరస్పరము మార్చి చేయవలెను. ఎట్లనగా:—కాసరోగమునకు జెప్పియుండు చికిత్సలను శ్వాసరోగమునకును శ్వాసరోగమునకు జెప్పియుండు చికిత్సలను కాసరోగమునకును జేయవలయును. ఇటులనే క్షయము వాంతి ఎక్కిళ్లు వీనికిగూడ పరస్పరము జెప్పియుండు చికిత్సలను పరస్పరము మార్చి చేయవలయును.

చతుర్థాధ్యాయము, ముగిసెను.

---

# పంచమాధ్యాయము.

అవ: కాసహిక్కాశ్వాసరోగములకు చికిత్సలుజేయక యుపేక్షించుటవలన రాజయక్ష్మరోగము జనించును. కావున రాజయక్ష్మ రోగంబునకు పై కాసాదిరోగంబులు కారణభూతంబులగుటవలనను శ్వాసహిక్కా చికిత్సితాధ్యాయములో "కాసశ్వాసక్షయచ్ఛర్దిహిక్కారోగములకు చికిత్సలు పరస్పరముమార్చి చేయవలయు"నని చెప్పియుండుటవలనను శ్వాసహిక్కా చికిత్సానిరూపణానంతరము రాజయక్ష్మ చికిత్సితాధ్యాయము చెప్పబడుచున్నయది.

## రాజయక్ష్మచికిత్సితాధ్యాయప్రారంభము.

సూ. అథాతో రాజయక్ష్మాదిచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

హిక్కాశ్వాసచికిత్సితాధ్యాయనిరూపణానంతరము (రాజయక్ష్మ) క్షయరోగ చికిత్సలందెలియపరచునట్టి రాజయక్ష్మాదిచికిత్సితమను నీయధ్యాయమును వివరించెదము.

## రాజయక్ష్మచికిత్సాక్రమము.

బలినో బహుదోషస్య స్నిగ్ధస్విన్నస్య శోధనమ్,
ఊర్ధ్వాధో యక్ష్మిణః కుర్యాత్సస్నేహం యన్న కర్శనమ్. ౧

దోషాధిక్యముగలవాడును బలిష్ఠుడునగు రాజయక్ష్మరోగికి అనగా:—క్షయరోగికి, తొలుత స్నేహస్వేదకర్మలనుచేయించి కొంచెము స్నేహముతో గూడినదియు శరీరమునకు బలహానిని కలుగజేయకుండు నదియునైన ఊర్ధ్వాధశ్శోధనములగు వమన విరేచనౌషధంబుల నిప్పించవలయును.

## రాజయక్ష్మరోగికి వమనౌషధము.

పయసా ఫలయుక్తేన మధురేణ రసేన వా,
సర్పిష్మత్యా యవాగ్వా వా వమనద్రవ్య సిద్ధయా.
వమేత్

రాజయక్ష్మరోగికి మ్రంగపండును ఆవుపాలలోచేర్చిగాని మధురమగు మాంసరసములోచేర్చిగాని లేక వమనకరంబగు మ్రంగపండు మొదలగు ద్రవ్యములతో యవాగును పక్వముచేసి అందులో ఆవునెయ్యివేసి విశేషముగ కలిపిగాని వమనార్థము ఇప్పించవలయును.

## రాజయక్ష్మమునవిరేచనౌషధము.

విరేచనం దద్యాత్త్రివృచ్ఛ్యామాన్నృపద్రుమాన్,
శర్కరామధుసర్పిర్భిః పయసా తర్పణేన వా. 3
ద్రాక్షావిదారికాశ్మర్యమాంసానాం వా రసైర్యుతాన్,

రాజయక్ష్మరోగికి తెల్లతెగడ నల్లతెగడ రేలదిగుడ్లు వీనిని ప్రత్యేక ప్రత్యేకముగ పంచదార తేనె ఆవునెయ్యి వీనిలోకలిపిగాని లేక ఆవుపాలతోడగాని లేక తర్పణౌషధసహితముగగాని లేక ద్రాక్షరసము నేలగుమ్ముడుగడ్డరసము గుమ్ముడురసము మాంసరసము వీనిలో జేసితోడగాని విరేచనార్థము ఇప్పించవలయును.

## యక్ష్మరోగికి వమనాద్యనంతరకర్తవ్యము.

శుద్ధకోష్ఠస్య యుంజీత విధిం బృంహణదీపనమ్. ౪
హృద్యాని చాన్నపానాని వాతఘ్నాని లఘూని చ,
శాలిషష్టికగోధూమయవముద్గం సమోషితమ్. ౫

పై వమనవిరేచనౌషధసేవనచే కోష్ఠముశుద్ధమైయుండు రాజయక్ష్మరోగికి శరీరపుష్టినిఅగ్నిదీపనమును గలుగజేయునట్టి చికిత్సలంజేయవలయును. ప్రియముగ లఘువుగ వాతహరముగనుండు అన్నపానములు 1 సంవత్సరము నిలువయుంచిన సంబావుధాన్యము 60 దినములకు ఫలించెడు సంబావుధాన్యము గోధుమలు యవలు పెసలు అనువానితోగల్పించిన యాహారమును ఇప్పించవలయును.

## యక్ష్మరోగహరమాంసాదులు.

అజం క్షీరం ఘృతం మాంసం క్రవ్యాన్మాంసం చ శోషజిత్,

మేకపాలు మేకనెయ్యి మేకమాంసము మాంసమునుభుజించునట్టి పులి మొదలగు జంతువులమాంసములు ఇవి రాజయక్ష్మరోగమును పోగొట్టును.

కాకోలూకవృకద్వీపిగవాశ్వనకులోరగమ్. ౬
గృధ్రభాసఖరోష్ట్రం చ హితం ఛద్మోపసంహితమ్,
జ్ఞాతం జుగుప్సితం తద్ధి ఛర్దిషే న బలౌజసే. ౭

రాజయక్ష్మరోగికి కాకి గుడ్లగూబ తోడేలు చిరుతపులి ఆవు గుఱ్ఱము ముంగిస పాము గద్ద భాసపక్షి గాడిదె ఒంటె వీనిమాంసమును అట్టి జంతుమాంసమని తెలియకుండునటుల యిప్పించవలయును. అటుల తెలిసినచో జుగుప్స(అసహ్యత)చేత వాంతియగును. అందువలన బలవీర్యములు కలుగనేరవు.

మృగాద్యాః పిత్తకఫయోః పవనే ప్రసహాదయః,

వేసవారీకృతాః పత్థ్యా రసాదిషు చ కల్పితాః. ౯
భృష్టాస్సర్షపతైలేన సర్పిషా వా యథాయథమ్,
రసికా మృదవస్స్నిగ్ధా మృదుద్రవ్యాభిసంస్కృతాః. ౯
హితా మూలకకౌలుత్థాస్తద్వద్యూషాశ్చ సాధితాః,

రాజయక్ష్మరోగికి పిత్తకఫములయందు జింక విష్కిరము (అనగా—నెమలి కోడి) మొదలగువాని మాంసములను వాతమునందు సింహము ఏనుఁగు మొదలగు మహామృగమాంసములను వేసవారముగజేసిగాని లేక పై మాంసములను రసముగాజేసి దేశకాలబలాద్యనుగుణముగ ఆవనూనెతోడనైనను ఆవు నేతితోనైనను పక్వముచేసి యిప్పించిన హితముకలుగును. మఱియు పై మాంసరసాదులను సైంధవలవణసహితముగ పక్వముచేసిన యవి మృదువుగ స్నిగ్ధముగ హితకరముగనుండును. ఇటులనే పక్వముచేయబడిన ముల్లంగికట్టు ఉలవకట్టు మొదలగునవియును హితకరములుగనుండును. వేసవారమనగా—శుంఠి దనియాలు జీలకఱ్ఱ ఇంగువ నెయ్యి మొదలగు వస్తువులను చేర్చి కలియబెట్టి పక్వముచేయబడిన మాంసము.

### యక్ష్మరోగహర మాంసరసము.

సపిప్పలీకం సయవం సకుళుత్థం సనాగరమ్. ౧౦
సదాడిమం సామలకం స్నిగ్ధమాజం రసం పిబేత్,
తేన షడ్వినివర్తంతే వికారాః పీనసాదయః. ౧౧

యక్ష్మరోగికి పిప్పళ్లు యవలు ఉలవలు శుంఠి దానిమ్మపండు ఉసిరికవరుగు వీనితోడ మేకమాంసరసముచు పక్వముచేసి అందులో ఆవునేయిని బోసి పానము జేయించిన పీనసము శ్వాసము కాసము శరీరకృశత్వము స్వరహాని అరుచి ఇవి హరించును.

### యక్ష్మరోగికి మద్యాదులు.

పిబేచ్చ సుతరాం మద్యం జీర్ణం స్రోతోవిశోధనమ్,
పిత్తాదిషు విశేషేణ మధ్వరిష్టాస్సవారుణీః. ౧౨
సిద్ధం వా పంచమూలేన తామలక్యాథవా జలమ్,
పర్ణినీభిశ్చతసృభిర్ధాన్యనాగరకేణ వా. ౧౩
కల్పయేచ్చానుకూలోఽస్య తేనాన్నం శుచి యత్నవాన్,

రాజయక్ష్మరోగికి మిగుల పాతదియైన మద్యమును పానముచేయించిన స్రోతస్సులు శుద్ధములగును. పిత్తకఫవాతము లధికముగనుండినచో వానికనుగుణముగ అరి

ష్టము ఆసవము వారుణి అనుమద్యములను పానము జేయించవలయును. లేక హ్రస్వ పంచమూలములతో గాని నేలయుసిరికతో గాని కారుమినుములు పిల్లిపెసర ముయ్యాకుపొన్న కోలపొన్న వీనితోగాని దనియాలు శుంఠి వీనితో గాని కాచబడిన యుదకమును పానము జేయించవలయును. మఱియు పై యుదకముతో పక్వము చేయబడిన యన్నాదుల నిప్పించిన విశేషముగ హితము కలుగును. (హ్రస్వపంచ మూలములనగా వాకుడు పెద్దములక ముయ్యాకుపొన్న కోలపొన్న పల్లేరు అనునవి.)

### దశమూలాది ఘృతము.

దశమూలేన పయసా సిద్ధం మాంసరసేన వా. ౧౪
బలాగర్భం ఘృతం యోజ్యం క్రవ్యాన్మాంసరసేన వా,
సక్షౌద్రం పయసా సిద్ధం సర్పిర్దశగుణేన వా. ౧౫

దశమూలకషాయము ఆవుపాలు వీనిలో గాని, లేక మాంసరసములో గాని ఆవునెయ్యినిబోసి అందులో బలామూలకల్కమును కలిపి విధిప్రకారము పక్వము చేయబడిన ఘృతము నిప్పించవలయును. లేక మాంసమును భుజించునట్టి మృగముల యొక్క మాంసరసములో బలామూల కల్కమును ఆవునెయ్యిని కలిపి పక్వము చేయబడిన ఘృతమును ఇప్పించవలయును. లేక ఆవుపాలు పదిభాగములు, ఒకభాగము ఆవు నెయ్యి, వీనితో బలామూలకల్కమును కలిపి పక్వము చేసి అందు తేనె కలిపి సేవింపదగును.

### జీవంత్యాది ఘృతము.

జీవంతీం మధుకం ద్రాక్షాం ఫలాని కుటజస్య చ,
పుష్కరాహ్వాం శఠీం కృష్ణాం వ్యాఘ్రీం గోక్షురకం బలామ్.
నీలోత్పలం తామలకీం త్రాయమాణాం దురాలభామ్,
కల్కీకృత్య ఘృతం పక్వం రోగరాజహరం పరమ్. ౧౬

మనుబాల అతిమధురము ద్రాక్ష కాడిసెవిత్తులు పుష్కరమూలము గంధకచోరములు పిప్పళ్లు వాకుడు పల్లేరు బలామూలము నల్లకలువ నేలయుసిరిక కలుక్రానుగు దూలగొండి వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి 1 ప్రస్థము ఆవునేతిలో కలిపి అందులో 4 గింతలుదకముబోసి ఘృతపాకవిధిగ పక్వముచేసి యిప్పించిన రాజ యక్ష్మరోగము హరించును.

### ఖర్జూరాదిఘృతము.

ఘృతం ఖర్జూరమృద్వీకామధుకైస్సపరూషకైః,
సపిప్పలీకం వైస్వర్యకాసశ్వాసజ్వరాపహమ్, ౧౭

ఖర్జూరము ద్రాక్ష అతిమధురము పేరీతపంజు వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి ఒక ప్రస్థము ఆవునేతిలోకలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసి దానిని పిప్పలి చూర్ణసహితముగ పానముజేయించిన స్వరదోషము కాసము శ్వాసము జ్వరము హరించును.

### దశమూలక్షీరఘృతము.

దశమూలశృతాత్క్షీరాత్సర్పిర్యదుదియాన్నవమ్,
సపిప్పలీకం సక్షౌద్రం తత్పకం స్వరబోధనమ్. ౧౯
శిరఃపార్శ్వాంసశూలఘ్నం కాసశ్వాసజ్వరాపహమ్,
పంచభిః పంచమూలైర్వా శృతాద్యదుదియాద్ఘృతమ్ ౨౦

దశమూలములను ఆవుపాలలోవైచి చక్కగకాచి దానిలోనుండి తీయబడిన ఘృతమునందును, లేక పంచమూలములతో గాచబడిన ఆవుపాలనుండి తీయబడిన ఘృతమునందును, పిప్పలిచూర్ణము తేనెకలిపి రాజయక్ష్మరోగికి పానముజేయించిన మంచి కంఠస్వరము కలుగుటయేగాక తలనొప్పి పార్శ్వశూల భుజశిరములయందు నొప్పి కాసము శ్వాసము జ్వరము నివర్తించును.

### పంచమూలఘృతము.

పంచానాం పంచమూలానాం రసే క్షీరచతుర్గుణే,
సిద్ధం సర్పిర్జయత్యేతద్యక్ష్మణస్సప్తకం బలమ్. ౨౧

ఆవుపాలు 1 భాగము, ఆవునెయ్యి 1 భాగము, ప్రత్యేకము మహాపంచమూలములకషాయము 4 భాగములు యిట్టుల వీనినెల్ల నొకటిగాజేర్చి ఘృతపాకవిధానంబుగ పక్వముజేసి యక్ష్మరోగికిప్పించిన కాసము శ్వాసము పీనసము స్వరహాని అరుచి మానును. మహాపంచమూలములనగా—మారేడు గుమ్ముడు తక్కెల లేక కూరనెల్లి దుందిలము కలిగొట్టు అనునవి.

### షట్పలఘృతము.

పంచకోలయవక్షారషట్పలేన పచేద్ఘృతమ్,
ప్రస్థోన్మితం తుల్యపయస్స్రోతసాం తద్విశోధనమ్. ౨౨
గుల్మజ్వరోదరప్లీహగ్రహణీపాండుపీనసాన్,
శ్వాసకాసాగ్నిసదనశ్వయథూర్ధ్వానిలాన్ జయేత్. ౨౩

పంచకోలములు యవక్షారము వీనిని ప్రత్యేకమొక్కొక్క పలముచొప్పున గ్రహించి కల్కముచేసి 1 ప్రస్థము ఆవునెయ్యిలోకలిపి అందు 1 ప్రస్థము ఆవుపాలు

4 ప్రస్థము లుదకముచేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి యక్ష్మరోగికి పానముచేయించిన స్రోతోమార్గములు శుద్ధియగును. మఱియు గుల్మము జ్వరము ఉదరరోగము ప్లీహము గ్రహణి పాండురోగము పీనస శ్వాసము అగ్నిమాంద్యము వాపు ఊర్ధ్వవాతము హరించును (పంచకోలములనగా—పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శుంఠి అనునవి.)

### రాస్నాదిఘృతము.

రాస్నాబలాగోక్షురకస్థిరావర్షాభునారిణి,
జీవంతీపిప్పలీగర్భం సక్షీరం శోషజిద్ఘృతమ్. ౨౪

దుంపరాస్నము బలామూలము పల్లేరు ముయ్యాకుపొన్న గలిజేరు వీనిని సమభాగములుగ గ్రహించి ఉదకములోవైచి కషాయముకాచి అందులో మనుబాల పిప్పళ్లు వీనికల్కమునుకలిపి ఆవునెయ్యి ఆవుపాలు సమభాగములుగజేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి సేవించిన రాజయక్ష్మరోగము హరించును.

### అశ్వగంధాక్షీరఘృతము.

అశ్వగంధాశృతాత్క్షీరా ద్ఘృతం చ ససితాపయః,

పెన్నేరుగడ్డను ఆవుపాలలోవైచికాచి అందుండి తీయబడిన ఘృతములో ఆవుపాలు శర్కరకలిపి సేవించిన రాజయక్ష్మరోగము హరించును.

### మాంసఘృతము.

సాధారణామిషతులాం తోయద్రోణద్వయే పచేత్. ౨౫
తేనాష్టభాగశేషేణ జీవనీయైః పలోన్మితైః,
సాధయేత్సర్పిషః ప్రస్థం వాతపిత్తామయాపహమ్. ౨౬
మాంససర్పిరిదం పీతం యుక్తం మాంసరసేన వా,
కాసశ్వాసస్వరభ్రంశశోషహృత్పార్శ్వశూలజిత్. ౨౭

సాధారణదేశములో జనించునట్టి బిలేశయ ప్రసహజంతువులయొక్క మాంసము నూరు పలములను రెండు ద్రోణము లుదకములోవైచి ఎనిమిదవ భాగము మిగులునటుల కషాయముకాచి అందులో జీవనీయగణద్రవ్యములు ప్రత్యేకము 1 పలముచొప్పున గ్రహించి కల్కముచేసి కలిపి 1 ప్రస్థము ఆవునెయ్యిపోసి ఘృతపాకవిధిగ పక్వముచేసి దానినిమాత్రముగాని, లేక మాంసరససహితముగాని పానముచేసిన వాతపిత్తరోగములు కాసము శ్వాసము స్వరదోషము రాజయక్ష్మరోగము ఱొమ్మునొప్పి పార్శ్వశూల ఇవి నివర్తించును. ఇది మాంసఘృత మనబడును.

### ఏలాదిరసాయనము.

ఏలాజమోదాత్రిఫలాసౌరాష్ట్రీవ్యోషచిత్రకాన్,
సారానరిష్టగాయత్రీసాలబీజకసంభవాన్. ౨౮
భల్లాతకం విడంగం చ పృథగష్టపలోన్మితమ్,
సలిలే షోడశగుణే షోడశాంశస్థితం పచేత్. ౨౯
పున స్తేన ఘృతప్రస్థం సిద్ధే చాస్మిన్ పలాని షట్,
తవక్షీర్యాః క్షిపేత్త్రింశత్సితాయా ద్విగుణం మధు ౩౦
ఘృతాత్త్రిజాతాత్త్రిపలం తతో లీఢం ఖజాహతమ్,
పయోఽనుపానం తత్ప్రాత్నా రసాయనమయంత్రణమ్. ౩౧
మేధ్యం చక్షుష్యమాయుష్యం దీపనం హంతి చాచిరాత్,
మేహగుల్మక్షయవ్యాధిపాండురోగభగందరాన్. ౩౨

ఏలకులు ఓమము కరకతాండ్ర యుసిరికలు సౌరాష్ట్రి శుంఠి పిప్పలి మిరియాలు చిత్రమూలము కుంకుడుబంక చంద్రబంక వేపిబంక వేగిసబంక జీడిగింజలు వాయువిడంగములు ఇవి ప్రత్యేకము 8పలములచొప్పున గ్రహించి ఈద్రవ్యసముదాయమునకు పదునారంతలు జలమును బోసి పదునారవపాలు మిగులునట్లు కషాయము కాచి వడియకట్టి అందులో 1 ప్రస్థము ఆవునెయ్యిపోసి ఘృతపాకవిధిగా పక్వము చేసి దానిలో తవక్షీరి 6 పలములు, పంచదార 30 పలములు, తేనె, 2 ప్రస్థములు, త్రిజాతకములు, 3 పలములు, వీనిని చేర్చి గరిటతో చక్కగ కలియబెట్టి యీరసాయనమును ప్రాతఃకాలములందు శరీరదేశకాల బలాద్యనుగుణముగ నాకించి ఆవుపాలను అనుపానముగ నిప్పించిన బుద్ధి ఆయుస్సు వృద్ధియగును. నేత్రములకు విశేషదృష్టి అగ్నిదీపనము కలుగును. మేహము గుల్మము క్షయరోగము పాండువు భగందరము ఈ రోగములు శీఘ్రముగ హరించును. ఇది శ్రేష్ఠమైన రసాయనము.

యే చ సర్పిర్గుడాః ప్రోక్తాః క్షతే యోజ్యాః క్షయేఽపి తే,

క్షతరోగమునకు చెప్పబడిన సర్పిర్గుడములను క్షయరోగమునందును యిప్పించవలయును.

### త్వగేలాదిచూర్ణము.

త్వగేలాపిప్పలీక్షీరీశర్కరాః ద్విగుణాః క్రమాత్. ౩౩
చూర్ణితా భక్షితా క్షౌద్రసర్పిషా చావలేహితాః
స్వర్యాః కాసక్షయశ్వాసపార్శ్వరుక్కఫనాశనాః. ౩౪

లవంగపట్ట 2 పలములు, ఏలకులు 4 పలములు, పిప్పళ్లు 3 పలములు క్షీర అనగా— పాలనేలగుమ్మడుగెడ్డ, 16 పలములు, పంచదార 32 పలములు, వీనినొకటిగ చేర్చి చక్కగ చూర్ణముచేసి దేహబలానుగుణముగ భక్షించినను లేక పై చూర్ణమును తేనె ఆవునెయ్యి వీనిలోకలిపి సాకించినను కాసము క్షయము శ్వాసము పార్శ్వశూల కఫము హరించును. కంఠస్వరము శుద్ధమగును.

విశేషాస్స్వరసాదేఽస్య నస్యధూమాది యోజయేత్,

రాజయక్ష్మరోగికి స్వరభంగము నిక్కటముగ కలిగియుండిన ఉత్తరత్ర చెప్పంబడు నస్యధూమపానాదులను చేయించవలయును.

వాతజ స్వరభంగచికిత్స.

తత్రాపి వాతజే కోష్ణం పిబేదుత్తరభక్తికమ్. ౩౫
కాసమర్దకవార్తాకీమార్కవస్వరసైర్ఘృతమ్,
సాధితం కఫజిత్స్వర్యం సిద్ధమార్తగళేన వా. ౩౬

వాతజ స్వరభంగ రోగమునందు కసివెంద ములక గుంటగలగర వీని రసములతో పక్వముచేయబడిన ఘృతమును సుఖోష్ణముగ భోజనానంతరము పానముచేయించిన స్వరభంగము కాసము హరించును. లేక నల్లములుగోరింటాకు రసముతో పక్వము చేయబడిన ఘృతమును భోజనానంతరము సుఖోష్ణముగ పానము చేయించిన కాసము హరించును. కంఠస్వరమునకు మేలుకలుగును.

బదరీపత్రకల్కం వా ఘృతభృష్టం ససైంధవమ్,

రేగాకులను నూరి కల్కముచేసి నేతిలో పక్వముచేసి సైంధవలవణసహితముగ భోజనానంతరము సుఖోష్ణముగ నిప్పించిన కాసము హరించి కంఠస్వరము శుద్ధమగును.

వాతజ స్వరభంగమునకు నస్యము.

తైలం వా మధుకద్రాక్షాపిప్పలీక్రిమినుత్ఫలైః ౩౭
హంసపాద్యాశ్చ మూలేన పక్వం నస్తో నిషేచయేత్,

వాతజస్వరభంగముగలవానికి అతిమధురము ద్రాక్ష పిప్పళ్లు వాయువిడంగములు మ్రంగపండు హంసపాదివేళ్లు వీనిని సమభాగములుగ నువ్వులనూనెలో వైచి విధి ప్రకారముగా కాచబడినతైలమును నస్యముచేయించిన కాసము స్వరహాని హరించును.

వాతజస్వరభంగమునందు గుడోదనాద్యుపయోగము.

సుఖోదకానుపానం చ సర్పిష్కం చ గుడౌదనమ్. ౩౮
అశ్నీయాత్పాయసం చైవం స్నిగ్ధం స్వేదం నియోజయేత్,

వాతజస్వరభంగమునందు గుడాన్నమును (బెల్లముగూర్చి చేయబడిన పొంగలిని) ఆవునేతితోడ భుజింపజేసి సుఖోష్ణముగనుండు నుదకమును పానము జేయించినను, పాయసమును ఆవునేతితోడ పానముచేయించి సుఖోష్ణోదకమును అనుపానముగ నిప్పించి స్నిగ్ధముగనుండు స్వేదకర్మను చేయించినను హితముకలుగును.

పిత్తజస్వరభంగచికిత్స.

పిత్తోద్భవే పిబేత్సర్పిశ్శృతశీతపయోఽనుపః. ౩౯
క్షీరివృక్షాంకురకాథకల్కసిద్ధం సమాక్షికమ్,
అశ్నీయాచ్చ ససర్పిష్కం యష్టీమధుకపాయసమ్. ౪౦

పిత్తజస్వరభంగ రోగమునందు క్షీరివృక్షములయొక్క చిగుళ్ల నుదకములోవైచి కషాయముకాచి అందులో ఆవునెయ్యిబోసి పై క్షీరివృక్షముల చిగుళ్లను నూరి కల్కము చేసి కలిపి పక్వముచేయబడిన ఘృతమును తేనెతోడ పానముచేయించి తోడనే కాచిచల్లార్చిన ఆవుపాలను అనుపానముగ నిప్పించి పిదప అతిమధురముతో పక్వము చేయబడిన పాయసమును ఆవునేతితోడ భుజింపజేయవలయును. (క్షీరివృక్షములనగా—మఱ్ఱి మేడి రావి కలురావి జువ్వి అనునవి.)

పిత్తజస్వరభంగమునకు నస్యము.

బలావిదారిగంధాభ్యాం విదార్యా మధుకేన చ,
సిద్ధం సలవణం సర్పిర్నస్యం స్వర్యమనుత్తమమ్. ౪౧

చిట్టాముట్టి ముయ్యాకుపొన్న నేలగుమ్ముడు అతిమధురము, వీనిని సమభాగములుగజేర్చి కాచబడినఘృతములో కొంచెము సైంధవలవణముకలిపి నస్యముచేయించిన స్వరభంగము నివర్తించును.

పిత్తజస్వరభంగమునకు ప్రపౌండరీకాదిఘృతము.

ప్రపౌండరీకం మధుకం పిప్పలీ బృహతీ బలా,
సాధితం క్షీరసర్పిశ్చ తత్స్వర్యం నావనం పరమ్. ౪౨
లిహ్యాన్మధురకాణాం చ చూర్ణం మధుఘృతాప్లుతమ్,

ప్రపౌండరీకము అతిమధురము, పిప్పళ్లు నేలములక చిట్టాముట్టి, వీనిని సమభాగములుగ ఆవుపాలలోచేర్చి చక్కగ కాచి దానిలోనుండి తీయబడిన ఘృతమును నస్యముజేయించిన పిత్తజస్వరభంగము హరించును. మఱియు మధురద్రవ్యముల చూర్ణమును తేనె ఆవునెయ్యి వీనిలో కలిపి నాకించవలయును.

కఫజస్వరభంగచికిత్స.

పిబేత్కటూని మూత్రేణ కఫజే రూక్షభోజనః. ౪౩

కట్ఫలామలకవ్యోషం లిహ్యాత్తైలమధుప్లుతమ్,
వ్యోషక్షారాగ్నిచవికాభార్ఙ్గీపథ్యామధూని వా.　　౪౪

కఫజనితస్వరభంగరోగమునందు కటురసముగల ద్రవ్యముల చూర్ణమును ఆవు మూత్రములో కలిపి పానముచేయించవలయును. నెయ్యి మొదలగు స్నేహములను చేర్చక రూక్షముగనుండు ఆహారమును భుజింపజేయవలయును. మఱియు గన్నేడి రేగు ఉసిరికవరుగు శుంఠి పిప్పలి మిరియాలు వీనిని సమభాగములుగ గ్రహించి చేయబడిన చూర్ణమునుగాని, లేక త్రికటుకములు సర్జక్షారము చిత్రమూలము చవ్యము గంటుభారంగి కరక్కాయలబెరడు అతిమధురము వీనిని సమభాగములుగ గ్రహించి చేయబడిన చూర్ణమునుగాని నువ్వులనూనె తేనె వీనిలో కలిపి నాకించవలయును.

## కఫజస్వరభంగమునందు యవాగూపానము.

యవైర్యవాగూం యమకే కణాధాత్రీకృతాం పిబేత్,
భుక్త్వాద్యాత్పిప్పలీం శుంఠీం తీక్ష్ణం వా వమనం భజేత్.　　౪౫

కఫజస్వరభంగముగలవానికి పిప్పళ్లు ఉసిరికవరుగు వీనిని సమభాగములుగ గ్రహించి ఉదకములో వైచి కషాయముకాచి అందులో పక్వముచేయబడిన యవలగంజిని యమకస్నేహముతోడ నిప్పించవలయును. పైరోగిని భోజనానంతరము పిప్పలినిగాని శుంఠినిగాని భక్షించునటుల జేయవలయును. లేక తీక్ష్ణమైన వమనౌషధముల నిప్పించవలయును.

## అతిసంభాషణజనిత స్వరభంగచికిత్స.

శర్కరాక్షౌద్రమిశ్రాణి శృతాని మధురైస్సహ,
పిబేత్పయాంసి యస్యోచ్చైర్వదతోఽభిహతస్స్వరః.　　౪౬

బిగ్గరగ మాటలాడుటవలన స్వరభంగముగలిగియుండినచో మధురద్రవ్యములను సమభాగములుగజేర్చి కాచబడిన ఆవుపాలలో పంచదార తేనెకలిపి పానముచేయించవలయును.

## అరుచిరోగచికిత్స.

విచిత్రమన్నమరుచౌ హితైరుపహితం హితమ్,

అరోచకరోగమునందు పథ్యమగువస్తువులు చేర్చబడినవియు నానావిధములుగ నుండునవియునైన యన్నముల నిప్పించవలయును. "అన్నం హి ప్రాణినాం ప్రాణాః" అను వచనానుసారంబుగ ప్రాణులకు అన్నము ప్రాణాధారంబుగనుండును. అట్టి అన్నము నందు ద్వేషమును బుట్టించుటవలన అరోచకరోగము అన్నిరోగములకన్న మిగుల బలిష్ఠ

లిహ్యాద్వా శర్కరాసర్పి ర్లవణోత్తమమాక్షికమ్,

పిత్తమువలన జనించిన అరోచకరోగమునందు పంచదార ఆవునెయ్యి సైంధవలవణము తేనె వీనిని సమభాగములుగ కలిసి నాకించవలయును. లేక గుడోదకములో మ్రంగపండు మొదలగు వమనౌషధములను కలిపి దానిచే వమనము చేయించవలయును.

కఫజారోచకచికిత్స.

కఫాద్వమేన్నింబజలైర్దీప్యకారగ్వధోదకమ్. ౫౨
పానం సమధ్వరిష్టాశ్చ తీక్ష్ణాస్సమధుమాధవాః,
పిబేచ్చూర్ణం చ పూర్వోక్తం హరేణ్వాద్యుష్ణవారిణా. ౫౩

కఫజారోచకమునందు వేపాకుకషాయములో మ్రంగపండు మొదలగు వమనౌషధములను కలిపి యిప్పించి వమనము చేయించవలయును. ఓమము రేల వీని కషాయములో తేనెను కలిపి పానము చేయించవలయును. అరిష్టమను మద్యము ద్రాక్షామద్యము ఆసవమనుమద్యము వీనిని తేనెతోడ పానము చేయించవలయును. పైనివాతారోచకమునకు చెప్పియుండు రేణుకాదిచూర్ణమును ఉష్ణోదకములో కలిపి దానిని పానము చేయించవలయును.

ఏలాదిచూర్ణము.

ఏలాత్వఙ్నాగకుసుమతీక్ష్ణకృష్ణామహౌషధమ్,
భాగవృద్ధం క్రమాచ్చూర్ణం నిహంతి సమశర్కరమ్. ౫౪
ప్రసేకారుచిహృత్పార్శ్వకాసశ్వాసగళామయాన్,

ఏలకులు 1 భాగము లవంగపట్ట 2 భాగములు, నాగకేసరములు 3 భాగములు, మిరియాలు 4 భాగములు, పిప్పళ్లు 5 భాగములు, శుంఠి 6 భాగములు వీనినన్నిటిని చూర్ణముచేసి యా చూర్ణమునకు సమము పంచదార కలిపి సేవించిన నోటియందు నీరుకారుట అరుచి రొమ్మునొప్పి పార్శ్వశూల కాస శ్వాసములు కంఠరోగము ఇవి హరించును.

యవాన్యాదిచూర్ణము.

యవానీతింత్రిడీకామ్లవేతసౌషధదాడిమమ్. ౫౫
కృత్వా కోలం చ కర్షాంశం సితాయాశ్చ చతుష్పలమ్,
ధాన్యసౌవర్చలాజాజీవరాంగం చార్ధకార్షికమ్. ౫౬
పిప్పలీనాం శతం చైకం ద్వే శతే మరిచస్య చ,
చూర్ణమేతత్పరం రుచ్యం గ్రాహి హృద్యం హినస్తి చ ౫౭
విబంధకాసహృత్పార్శ్వప్లీహార్శోగ్రహణీగదాన్,

ఖురాసానివోమము చింతపండు పుల్లప్రబ్బలి శుంఠి దానిమ్మపండు రేగుపండ్లు యివి దినుసుకు 1 కర్షము, పంచదార 4 పలములు, దనిమాలు సౌవర్చలవణము జీలకఱ్ఱ లవంగపట్ట ఇవి ప్రత్యేకము $\frac{1}{2}$ కర్షము, నూరు పిప్పళ్లు, ఇన్నూరు మిరియాలు వీనినన్నిటిని యొకటిగచేర్చి చూర్ణముచేసి దేహబలాద్యనుగుణముగ సేవించిన మలబంధము కాసము బొమ్మునొప్పి పార్శ్వశూల ప్లీహరోగము మూలరోగము గ్రహణి హరించును. రుచిని పుట్టించును. మలమును గట్టిపరచును.

## తాళీసాదిచూర్ణము.

తాళీసపత్రం మరిచం నాగరం పిప్పలీ కణా. ౫౮
యథోత్తరం భాగవృద్ధ్యా త్వగేలే చార్ధభాగికే,
తద్వివ్యం దీపనం చూర్ణం కణాష్టగుణశర్కరమ్. ౫౯
కాసశ్వాసారుచిచ్ఛర్ది ప్లీహహృత్పార్శ్వశూలనుత్,
పాండుజ్వరాతిసారఘ్నం మూఢవాతానులోమనమ్. ౬౦

తాళిసపత్రి 1 భాగము, మిరియాలు 2 భాగములు, శుంఠి 3 భాగములు, పిప్పళ్ళు 4 భాగములు, ఏనుగపిప్పళ్లు లేక జీలకఱ్ఱ 5 భాగములు, ఏలకులు లవంగపట్ట యివి ప్రత్యేకము $\frac{1}{2}$ భాగము వీనినన్నిటిని చక్కగ చూర్ణముచేసి అందులో 40 భాగములు పంచదార కలిపి సేవించిన కాసము శ్వాసము అరుచి వాంతి బొమ్మునొప్పి పార్శ్వశూల పాండురోగము జ్వరము అతిసారము ఇవి హరించును. మూఢవాతమునకు అనులోమగతి కలుగును.

## ప్రసేకచికిత్స.

అర్కామృతాక్షీరిజలే శర్వరీముషితైర్యవైః,
ప్రసేకే కల్పితాః సక్తూః భక్ష్యాంశ్చాద్యాద్వలీ వమేత్. ౬౧
కటుతిక్తైస్తథా శూల్యం భక్షయేజ్జాంగలం పలమ్,
శుష్కాంశ్చ భక్ష్యాః సులఘూంశ్చణకాదిరసానుపః. ౬౨

ప్రసేకరోగమునందు జిల్లేడుకషాయము తిప్పతీగెకషాయము క్షీరివృక్షముల యొక్క పట్టలకషాయము వీనిలో ప్రత్యేకముగ నొక్కొక్కరాత్రి యవలను నానబెట్టి యెండించి పిండిచేసి ఆపిండిని దానిచే చేయబడిన భక్ష్యములను భుజింపజేయవలయును. కారముగ చేదుగనుండు నౌషధములచే వమనము చేయించవలయును. జాంగలమాంసమును శూలముతో కాల్చి భక్షింపజేయవలయును. ఎండినవిగ లఘువుగనుండు భక్ష్యములను భుజింపజేసి సెనగకట్టును అనుపానముగ నిప్పించవలయును.

కఫప్రసేకచికిత్స.

శ్లేష్మణోఽతిప్రసేకేన వాయుశ్శ్లేష్మాణమస్యతి,
కఫప్రసేకం తం విద్వాన్ స్నిగ్ధోష్ణైరేవ నిర్జయేత్. ౬౩

ప్రకోపించియుండువాతము వృద్ధిజెందిన కఫమును నోటిమార్గముగ వెడలింపజేయును. దీనిని కఫప్రసేకరోగమని బుద్ధిమంతుడగు వైద్యుఁడు తెలిసికొని స్నిగ్ధముగ ఉష్ణముగనుండు ఔషధములచే చికిత్స జేయవలెను.

పీనసరోగచికిత్స.

పీనసేఽపి క్రమమిమం వమథౌ చ ప్రయోజయేత్,

పైచెప్పిన స్నిగ్ధోష్ణచికిత్సలను పీనసము వాంతి ఈరోగములయందును చేయువలయును.

విశేషాత్పీనసేఽభ్యంగాన్ స్నేహస్వేదాంశ్చ శీలయేత్ ౬౪
స్నిగ్ధానుత్కారికాపిండైశ్శిరఃపార్శ్వగళాదిషు,
లవణామ్లకటూష్ణాంశ్చ రసాన్ స్నేహోపసంహితాన్. ౬౫

పీనసరోగికి శిరము పార్శ్వములు కంఠము మొదలగువానియందు స్నిగ్ధముగనుండు ఉత్కారికా పిండము అతి స్నేహ స్వేదములను అభ్యంగములను విశేషముగ చేయించుచు ఉప్పు పులుపు కారము వీనితో గూడినదియు ఉష్ణముగనుండునదియుం ఆవునెయ్యి మొదలగు స్నేహములతో పక్వము చేయబడినదియునైన మాంసరసములను ఇప్పించవలయును.

శిరఃపార్శ్వశూలలయందు స్వేదకర్మ.

శిరోఽంసపార్శ్వశూలేషు యథాదోషవిధిం చరేత్.
ఔదకానూపపిశితైరుపనాహైస్సుసంస్కృతాః. ౬౬
తత్రేష్టాస్సచతుస్స్నేహాః

శిరము భుజశిరములు పార్శ్వములు వీనియందు శూలగలిగియుండిన ఆయా దోషానుసారముగ చికిత్సలం జేయుటయే గాక ఔదక (ఉదకమునందలిజంతువుల) మాంసము అనూపజంతుమాంసము ఘృతాదిచతుస్స్నేహములు వీనితో పక్వము చేయబడిన ఉపనాహ స్వేదములను చేయించవలయును.

ప్రలేపములు.

దోషసంసర్గ ఇష్యతే,
ప్రలేపో నతయష్ట్యాహ్వాశతాహ్వాకుష్ఠచందనైః. ౬౭

బలారాస్నాతిలై స్తద్వత్సర్పిర్మధుకోత్పలైః,

వాతాదిద్వంద్వదోషమువలన జనించిన శిరశ్శూలాదులయందు గ్రంథి తగరము అతిమధురము పెద్దసదాప చెంగల్వకోష్ఠు చందనము వీనిని సమభాగములుగ గ్రహించి నూరి పట్టువేయవలయును. మఱియు బలామూలము దుంపరాస్నము నువ్వులు అతిమధురము నల్లకలువ వీనిని సమభాగములుగ గ్రహించి నూరి అందులో ఆవునెయ్యికలిపి పట్టువేయవలయును.

నస్యాదులు.

పునర్నవాకృష్ణగంధా బలావీరావిదారిభిః. ౬౮
నావనం ధూమపానాని స్నేహాశ్చోత్తరభక్తికాః,
తైలాన్యభ్యంగయోగీని వస్తికర్మ తథా పరమ్. ౬౯

గలిజేరు కృష్ణగంధా (అనగా—మునగ) బలామూలము కాకోళి నేలగుమ్ముడు వీనిచే నస్యమును ధూమపానములను చేయించవలయును. మఱియు ఉత్తరభక్తికములైన స్నేహములు తైలాభ్యంగము వస్తికర్మ ఇవి పార్శ్వశూలయందు హితకరంబులు.

క్షయరోగికి రక్తమోక్షణము.

శృంగాద్యైర్వా యథా దోషం దుష్టమేషాం హరేదసృక్,

రాజయక్ష్మరోగులకు వాతపిత్తకఫదుష్టంబులైన రక్తములను చిమ్మనగొట్టము సొరకాయబుఱ్ఱలు జలగలు వీనిచే నాయాదోషానుగుణముగ వెలిపరచవలయును.

క్షయరోగులకు ప్రదేహము.

ప్రదేహస్సఘృతైశ్శ్రేష్ఠః పద్మకోశీరచందనైః. ౭౦
దూర్వామధుకమంజిష్ఠా కేసరైర్వా ఘృతప్లుతైః,

పద్మకము వట్టివేరు చందనము వీనినినూరి నేతిలోకలిపి దానిచేతగాని గరికె అతిమధురము మంజిష్ఠ నాగకేసరములు వీనిని సమభాగములుగ గ్రహించి నూరి నేతిలోకలిపి దానిచేతగాని రాజయక్ష్మరోగులకు పట్టువేయవలయును.

క్షయరోగులకు అభ్యంగము.

వటాదిసిద్ధతైలేన శతధౌతేన సర్పిషా. ౭౧
అభ్యంగః పయసా సేకశ్శస్తశ్చ మధుకాంబునా,

క్షయరోగులకు న్యగ్రోధాదిగణములో చెప్పియుండు ద్రవ్యములను సమభాగములుగచేర్చి కాచబడిన తైలముచేతగాని, నూరుపర్యాయములు చక్కగ కడిగిన

నేతితోగాని అభ్యంగము చేయించవలయును. మఱియు ఆవుపాలతోగాని అతిమధుర రసముతోగాని సేకమును చేయించవలయును.

### క్షయరోగికి అగ్నిమాంద్యచికిత్స.

ప్రాయేణోపహతాగ్నిత్వాత్సపిచ్ఛమతిసార్యతే. ౭౨
తస్యాతిసారగ్రహణీవిహితం హితమౌషధమ్,

క్షయరోగికి తరుచుగ జాఠరాగ్ని చెడియుండుటవలన అతిసారము కలుగును. దానియందు గ్రహణీరోగమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

### క్షయరోగికి మలరక్షణావశ్యకత్వము.

పురీషం యత్నతో రక్షేచ్ఛుష్యతో రాజయక్ష్మిణః. ౭౩
సర్వధాతుక్షయార్తస్య బలం తస్య హి విడ్బలమ్,

రసరక్తాది సర్వధాతువులు క్షయించి శరీరము కృశించి పీడితుడుగనుండు క్షయరోగికి మలమే ముఖ్యబలముగనుండును. కావున ఆ క్షయరోగికి మలము అధికముగ వెడలకుండునటుల కడు ప్రయత్నముతో చికిత్స చేయవలెను.

### క్షయరోగశమనోపాయము.

మాంసమేవాశ్నతోయుక్త్యా మార్ద్వీకం పిబతోఽను చ. ౭౪
అవిధారితవేగస్య యక్ష్మా న లభతేఽంతరమ్,

దేశకాలబలసాత్మ్యాద్యనుగుణముగ మాంసమును భుజించి ద్రాక్షామద్యమును పానముచేయుచు మలమూత్రాది వేగములను అడ్డగింపకుండువానిని క్షయరోగము పీడించనేరదు.

### క్షయరోగికి సురాదిమద్యపానము.

సురాం సమండాం మార్ద్వీకమరిష్టాన్ శీధుమాధవాన్. ౭౫
యథార్హమనుపానార్థం పిబేన్మాంసాని భక్షయన్,
స్రోతోవిబంధమోక్షార్థం బలౌజఃపుష్టయే చ తత్. ౭౬

క్షయరోగి మాంసములను భుజించుచు మీగడతోగూడియుండు సురయను మద్యము ద్రాక్షామద్యము అరిష్టమనుమద్యము శీధువనుమద్యము మాధవమనుమద్యము వీనిలో దేనినైనను అనుపానార్థము యుక్తానుసారముగ పానముచేయుచుండవలయును. ఇటుల చేసినచో వానికి స్రోతస్సులు శుద్ధంబులై బలము ఓజస్సు ధాతుపుష్టికలుగును.

### క్షయరోగికి మిశ్రకస్నేహాభ్యంగము.

స్నేహక్షీరాంబుకోష్ఠేషు స్వభ్యక్తమవగాహయేత్,

ఉత్తీర్ణం మిశ్రకైస్స్నేహైర్భూయోఽభ్యక్తం సుఖైః కరైః. ౭౭
మృద్నీయాత్సుఖమాసీనం సుఖం చోద్వర్తయేత్పరమ్,

క్షయరోగికి చక్కగా నభ్యంగముచేయించి నెయ్యి మొదలగు స్నేహములు ఆవుపాలు శుద్ధోదకము వీనిని పెద్దపాత్రలో నిండించి దానియందు వానిని కొంతసేపు మునుగునటుల చేయవలయును. పిదప రోగిని బైటికి రప్పించి గుల్మరోగచికిత్సితము నందు చెప్పబడియుండు మిశ్రకస్నేహముచే మరల అభ్యంగముచేయించి సుఖముగ కూర్చుండబెట్టి సౌఖ్యము కలుగునటుల చేతులతో శరీరమును పిసికి ఇక చెప్పబోయెడు ఔషధములతో నలుగుపెట్టవలయును.

## క్షయరోగికి ఉద్వర్తనౌషధము.

జీవంతీం శతపర్వాం చ వికసాం సపునర్నవామ్. ౭౮
అశ్వగంధామపామార్గం తర్కారీం మధుకం బలామ్,
విదారీం సర్షపాన్కుష్ఠం తండులానతసీఫలమ్. ౭౯
మాషాంస్తిలాంశ్చ కిణ్వం చ సర్వమేకత్ర చూర్ణయేత్,
యవచూర్ణం త్రిగుణితం దధ్నా యుక్తం సమాక్షికమ్. ౮౦
ఏతదుద్వర్తనం కార్యం పుష్టివర్ణబలప్రదమ్,

మనుబాల తెల్లగరికె మంజిష్ఠ గలిజేరు పెన్నేరుగడ్డ ఉత్తరేణి తక్కోల అతి మధురము బలామూలము నేలగుమ్మడు ఆవాలు చెంగల్వకోష్టు బియ్యము అగిసివిత్తులు మినుములు నువ్వులు మద్యమునుండు గట్టిపదార్థము (అడుగున మిగులు మడ్డి) వీటి నన్నిటిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి ఆచూర్ణమునకు మూడింతలు యవలచూర్ణముచేర్చి దానిని ఆవుపెరుగు తేనె వీనిలోకలిపి క్షయరోగి నలుగుపెట్టు కొనిన శరీపుష్టి బలము వర్ణము కాంతి గలుగును.

## క్షయరోగశమనోపచారములు.

గౌరసర్షపకల్కేన స్నానీయౌషధిభిశ్చ సః. ౮౧
స్నాయాదృతుసుఖైస్తోయైర్జీవనీయోపసాధితైః,
గంధమాల్యాదికం భూషామలక్ష్మీనాశనీం భజేత్. ౮౨
సుహృదాం దర్శనం గీతవాదిత్రోత్సవసంశ్రుతీః,
వస్తయః క్షీరసర్పీంషి మద్యమాంససుశీలతా. ౮౩
దైవవ్యపాశ్రయం తత్తదథర్వోక్తం చ పూజితమ్,

క్షయరోగి తెల్లావాలకల్కము చేతను స్నానార్హమైన గంధద్రవ్య కల్కము చేతను సహదేవి మొదలగు నోషధులకల్కము చేతను నలుగు పెట్టుకొని హేమంతాది ఋతువులయందు జీవనీయగణద్రవ్యములను సమభాగములుగ చేర్చి యుదకములో వైచి కాచి సుఖోష్ణముగనుండు ఆయుదకముచే స్నానము చేయవలయును. మంచిగంధము పుష్పములు అలక్ష్మిని పోగొట్టునట్టి యాభరణములు వీనిని ధరించవలయును. స్నేహితుల దర్శనము చేయుచుండవలయును. సంగీతము వాద్యములు సంతోషకరమైనమాటలు వీనిని వినుచుండవలయును. వస్తికర్మలను పలుమారు చేయించుకొనవలయును. ఆవు పాలు ఆవునెయ్యి బలకరమైనమద్యములు మాంసములు వీనిని సేవింపుచుండవలయును. మఱియు దేవతాప్రీతికరమగు బలి హోమము ప్రాయశ్చిత్తము (అధర్వవేదములో చెప్పియుండు యాగము మొదలగునవి) వీనిని చేయుచుండవలయును. ఇటుల చేసిన క్షయరోగికి హితము కలుగును.

పంచమాధ్యాయము ముగిసెను.

# షష్ఠాధ్యాయము

అవ: ఛర్ది హృద్రోగము తృష్ణా యివి రాజయక్ష్మరోగులకు తఱచుగా జనించును. కాబట్టి రాజయక్ష్మచికిత్సితాధ్యాయ నిరూపణానంతరము ఛర్దిహృద్రోగ తృష్ణా చికిత్సితాధ్యాయము చెప్పబడుచున్నయది.

## ఛర్ది హృద్రోగ తృష్ణా చికిత్సితాధ్యాయ ప్రారంభము.

అథాతశ్ఛర్ది హృద్రోగ తృష్ణా చికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

రాజయక్ష్మ చికిత్సితాధ్యాయ నిరూపణానంతరము వాంతి ఱొమ్మునొప్పి దప్పి వీనిచికిత్సలను బోధించునట్టి ఛర్ది హృద్రోగ తృష్ణా చికిత్సితమను నీయధ్యాయమును వివరించెదము.

## ఛర్దిరోగికి లంఘనము.

ఆమాశయోత్క్లేశభవాః ప్రాయశ్ఛర్ద్యో హితం తతః,
లంఘనం ప్రాగృతే వాయోర్వమనం తత్ర యోజయేత్. ౧
బలినో బహుదోషస్య వమతః ప్రతతం బహు,

ఛర్ది అనగా—వాంతి, ఇయ్యది ఆమాశయమునందు దోషములువృద్ధిజెందుట వలన తఱచుగ మనుజులకు జనించును. కావున వాతజఛర్దిరోగము తప్ప యితరములైన ఛర్దిరోగములయందు తొలుత లంఘనము చేయించవలయును. అటులచేసియు వాంతి శమించకుండిన రోగి బలిష్ఠుడుగనుండినచో వమనౌషధము నిప్పించవలయును. లేక దుర్బలుడుగనుండినను దోషాధిక్యముతో గూడి యెల్లపుడు వాంతి చేయుచుండినచో వమనౌషధము నిప్పించవలయును.

## ఛర్దిరోగికి విరేచనము.

తతో విరేకం క్రమశో హృద్యం మద్యైః ఫలాంబుభిః. ౨
క్షీరైర్వా సహ సహ్యూర్ధ్వం గతం దోషం నయత్యధః,
శమనం చౌషధం రూక్షదుర్బలస్య తదేవ తు. ౩

ఛర్దిరోగికి వమనముచేయించిన పిదప క్రమముగ ద్రాక్షామద్యము మొదలగు మద్యములలోగాని ద్రాక్ష మొదలగు ఫలములుజేర్చి కాచబడిన జలమునగాని ఆవుపాల

లోగాని మనఃప్రియముగనుండు విరేచనౌషధమును కలిపి యిప్పించవలయును. ఇటుల నిప్పించిన నది ఊర్ధ్వగతమును వాంతిని గలుగజేయునదియును నగు దోషమును అధో భాగమునకు త్రోయును. మఱియు శమనౌషధమునుకూడ నిప్పించవలయును. ఛర్ది రోగి రూక్షుడుగ దుర్బలుడుగ నుండినచో శమనౌషధమును మాత్ర మిప్పించ వలయును.

## ఛర్దిరోగ సామాన్యోపచారములు.

పరిశుష్కం ప్రియం సాత్మ్యమన్నం లఘు చ శస్యతే,
ఉపవాసస్తథా యూషా రసాః కాంబళికాః ఖలాః ౪
శాకాని లేహభోజ్యాని రాగఖాండవపానకాః,
భక్ష్యాశ్శుష్కా విచిత్రాశ్చ ఫలాని స్నానఘర్షణమ్. ౫
గంధాః సుగంధయో గంధఫలపుష్పాన్నపానజాః,
భుక్తమాత్రస్య సహసా ముఖే శీతాంబుసేచనమ్ ౬

ఆరినదిగను మనస్సుకు ప్రియముగను లఘువుగను సాత్మ్యముగనునుండు అన్నము; ఉపవాసము పెసలు మొదలగు వానికట్టులు మాంసరసములు కాంబలికము ఖలము శాకములు లేహము భోజ్యము సూత్రస్థానములో బుతుచర్యాధ్యాయమునందు చెప్ప బడియుండు రాగఖాండవములు, పానకము, ఎండినదిగ నానావిధములుగనుండు భక్ష్యములు, ఫలములు, స్నానము, సుగంధద్రవ్యములతో నలుగుపెట్టుకొనుట, గంధ ద్రవ్యములు ఫలములు పుష్పములు అన్నము పానము మొదలగువానియొక్క సువాసన, భుజించినతోడనే ముఖమునందు శీతోదకమునుచల్లుట, ఇవి సామాన్యముగ ఛర్దిరోగము లన్నిటియందును హితకరంబులుగ నుండును.

## వాతజఛర్దిచికిత్స.

హంతి మారుతజాం ఛర్దిం సర్పిః పీతం ససైంధవమ్,
కించిదుష్ణం విశేషేణ సకాసహృదయద్రవామ్. ౭
వ్యోషత్రిలవణాఢ్యం వా సిద్ధం వా దాడిమాంబునా,
సశుంఠీదధిధాన్యేన శృతం తుల్యాంబు వా పయః. ౮
వ్యక్తసైంధవసర్పిర్వా ఫలామ్లో విష్కిరో రసః,
స్నిగ్ధం చ భోజనం శుంఠీదధిదాడిమసాధితమ్. ౯
కోష్ణం సలవణం చాత్ర హితం స్నేహవిరేచనమ్,

ఆవునేతిలో సైంధవలవణమును చేర్చి కాచి కొంచెము వేడిగనుండు ఆవునెయ్యి నిగాని, త్రికటుకములు సైంధవలవణము సౌవర్చలవణము బిడాలవణము వీనిని అధికముగ చేర్చబడిన ఆవునెయ్యినిగాని, ఆవునేతిలో దానిమ్మపండురసము శుంఠి పెరుగు ధనియాలు వీనిని సమభాగములుగ చేర్చి పక్వముచేయబడిన ఘృతమునుగాని, ఉదకము సమముగా చేర్చి కాచబడిన ఆవుపాలనుగాని, దానిమ్మరసము మాదీఫలరసము వీనిని సమభాగములుగ చేర్చి పక్వము జేయబడిన కోడి మొదలగు విష్కిరజంతువులయొక్క మాంసరసములో సైంధవలవణము ఆవునెయ్యి కలిపి దానినిగాని పానము చేయించిన ఓకర కాసము నోటియందు నీరుకారుట వీనితో గూడిన వాతజ ఛర్దిరోగము హరించును; మఱియు నీరోగమునందు శుంఠి ఆవుపెరుగు దానిమ్మపండు వీనితో పక్వము చేసిన అన్నమును నెయ్యి మొదలగు స్నేహములతో డ నిప్పించవలయును. చిట్టాముదములో సైంధవలవణమును చేర్చి కాచి సుఖోష్ణముగ విరేచనార్థ మిప్పించిన మిక్కుటముగ హితము కలుగును.

## పిత్తజఛర్దిరోగచికిత్స.

పిత్తజాయాం విరేకార్థం ద్రాక్షేక్షుస్వరసై స్త్రివృత్. ౧౦
సర్పి ర్వా తైల్వకం యోజ్యం వృద్ధం చ శ్లేష్మధామగమ్,
ఊర్ధ్వమేవ హరేత్పిత్తం స్వాదుతిక్తై ర్విశుద్ధిమాన్. ౧౧
పిబేన్మంథం యవాగూం వా లాజై స్సమధుశర్కరామ్,
ముద్గజాంగలజై రద్యాద్వ్యంజనై శ్శాలిషష్టికమ్. ౧౨
మృద్భృష్టలోష్టప్రభవం సుశీతం సలిలం పిబేత్,
ముద్గోశీరకణాధాన్యై స్సహ వా సంస్థితం నిశామ్. ౧౩
ద్రాక్షారసం రసం వేక్షోః గుడూచ్యంబు పయోఽపి వా,

పిత్తమువలన జనించిన ఛర్దిరోగమునందు ద్రాక్షపండు చెఱుకు వీనిరసములలో తెల్లతెగడను చేర్చిగాని, లేక తైల్వకమును ఘృతమునుగాని విరేచనార్థము ఇప్పించవలయును. పైరోగము వృద్ధిజెందినదై శ్లేష్మస్థానమును జేరి యుండినచో పిత్తమును మధురముగ చేదుగనుండు వమనౌషధముల నిప్పించి ఊర్ధ్వమార్గముగ వెలిపరచవలయును. వమనవిరేచనరూపమైన శోధనౌషధములను భుజించియుండు ఛర్దిరోగి వరిపేలాలను చేర్చి పక్వముచేయబడిన మంథమునుగాని గెంజినిగాని, తేనె పంచదార వీనితోడ భుజింపవలయును. మఱియు పెసలు జాంగలమాంసము వీనిని చేర్చి పక్వముచేయబడిన వ్యంజనములతో సంబావుబియ్యపు అన్నము అరువది దినములకు ఫలించెడు సంభావుబియ్యపు

అన్నము వీనిని భుజింపజేయవలయును. మట్టిగెడ్డలను కాల్చి ఉష్ణోదకములో వేసి చల్లార్చి యాయుదకముగాని, లేక పెసలు వెట్టివేరు పిప్పళ్లు దనియాలు వీనిని ఉదకములో నొకరాత్రి నానబెట్టి యా యుదకమునుగాని, ద్రాక్షపండురసమునుగాని, చెఱకురసమునుగాని, తిప్పతీగె వేసి కాచినయుదకమునుగాని, ఆవుపాలనుగాని, ఆయా దోషాను గుణముగ పానముచేయించవలయును.

## ఛర్దిరోగహారకషాయము.

జంబ్వామ్రపల్లవోశీరవటశృంగావరోహజః. ౧౪
క్వాథః క్షౌద్రయుతః పీతశ్శీతో వా వినియచ్ఛతి,
ఛర్దిం జ్వరమతీసారం మూర్ఛాం తృష్ణాం చ దుర్జయామ్. ౧౫

నేరేడుచిగుళ్లు మామిడిచిగుళ్లు వట్టివేరు మఱ్ఱిచిగుళ్లు మఱ్ఱియూడలు అనువానిని చేర్చి కాచబడిన కషాయముగాని పై ద్రవ్యముల శీతకషాయమునుగాని తేనెతోడ పానముచేయించిన వాంతి జ్వరము అతిసారము మూర్ఛ దారుణమైన దప్పి ఇవి హరించును.

ధాత్రీరసేన వా శీతం పిబేన్ముద్గదళాంబు వా,
కోలమజ్జసితాలాజామక్షికావిట్కణాంజనమ్ ౧౬
లిహ్యాత్క్షౌద్రేణ పథ్యాం వా ద్రాక్షాం వా బదరాణి వా,

పొట్టుతీసిన పెసరపప్పును ఉదకములోవైచి చక్కగ కాచి దానిలో నుసిరికరసమును చేర్చి సుఖోష్ణముగ పానముచేయించినను, లేక పెసరపప్పును ఉదకములో నానబెట్టి యాయుదకమును పానముచేయించినను, లేక రేగుకాయ గింజలలోని పప్పు పంచదార వరిపేలపిండి తేనె యీగెల విష్ఠము స్రోతోంజనము వీటిచూర్ణమునుగాని కరక్కాయలబెరడుచూర్ణమునుగాని ద్రాక్షపండునుగాని రేగుగుజ్జునుగాని తేనెలోకలిపి నాకించినను పిత్తజఛర్దిరోగము హరించును.

## కఫజ ఛర్దిరోగచికిత్స.

కఫజాయాం వమేన్నింబకృష్ణాపీడితసర్షపైః. ౧౭
యుక్తేన కోష్ణతోయేన దుర్బలం చోపవాసయేత్,
ఆరగ్వధాదినిర్యూహం శీతం క్షౌద్రయుతం పిబేత్. ౧౮
మంథాన్యవైర్వా బహుశః ఛర్దిఘ్నౌషధభావితైః,
కఫఘ్నమన్నం హృద్యం చ రాగాస్సార్జకభూస్తృణాః ౧౯
లీఢం మనశ్శిలా కృష్ణా మరిచం బీజపూరకాత్,
స్వరసేన కపిత్థాచ్చ సక్షౌద్రేణ వమిం జయేత్. ౨౦

ఖాదేత్కపిత్థం సవ్యోషం మధునా వా దురాలభామ్,

కఫజఛర్దిరోగమునందు వేము పిప్పళ్లు ఆవాలు వీనిచూర్ణమును కొంచె ముష్ణము గనుండు నుదకములో కలిపి వమనము చేయించవలయును. ఆ ఛర్దిరోగి దుర్బలుడుగ నుండినచో లంఘనము చేయించవలయును. వమనము చేయించకూడదు. ఆరగ్వధాది గణములో చెప్పియుండు ద్రవ్యములను సమభాగములుగ గ్రహించి యుదకములోవైచి కషాయముకాచి చల్లార్చి అందులో తేనెకలిపి దానినిగాని వాంతిని పోగొట్టునట్టి యౌషధులను సమభాగములుగ గ్రహించి కాచబడిన కషాయములో పలుమారు భావన చేసిన యవలతో పక్వముజేయబడిన మంథమునుగాని పానము చేయించవలయును. మఱియు కఫహరములును మనఃప్రియములు నగు అన్నమును తెల్లగగ్గెర చిప్పగెడ్డి వీనిని సమముగచేర్చి పాకముచేయబడిన రాగము వీనిని భుజింపజేయవలయును. మణిశిల పిప్పళ్లు మిరియాలు వీనిని సమముగ గ్రహించి చూర్ణముజేసి యాచూర్ణమును దానిమ్మపండు రసములోగాని వెలగపండు రసములోగాని కలిపి తేనెతోడ నాకించ వలయును. లేక వెలగపండుగుజ్జులో త్రికటుకచూర్ణమును కలిపి తేనెతోడ భక్షించ వలయును. లేక దురదగొండి వేళ్ల చూర్ణమును తేనెలోకలిపి నాకించవలయును. ఇటుల జేసిన కఫజనిత ఛర్దిరోగము హరించును.

### అనిష్టవస్తుజఛర్దిచికిత్స.

అనుకూలోపచారేణ యాతి ద్విష్టార్థజా శమమ్. ౨౧

అనిష్టవస్తుసేవనచే జనించినఛర్దియందు మనస్సుకుప్రియమైన యుపచారముల చేయించిన నది శమించును.

### క్రిమిజఛర్దిచికిత్స.

క్రిమిజాం క్రిమిహృద్రోగవిహితైశ్చ భిషగ్జితైః,
యథాస్వం పరిశేషాశ్చ తత్కృతాశ్చ తథామయాః. ౨౨

క్రిములవలన జనించిన ఛర్దిరోగమునందు క్రిమిరోగ హృద్రోగములకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును. ఇటులజేసిన క్రిమిజఛర్దిరోగము శమించుటయే గాక క్రిమిహృద్రోగములచే జనించిన యుపద్రవములుకూడ శమించును.

### ఛర్దిరోగమున స్తంభనాది చికిత్స.

ఛర్దిప్రసంగేన హి మాతరిశ్వా ధాతుక్షయాత్కోపముపైత్యవశ్యమ్,
కుర్యాదతోఽస్మిన్వమనాతియోగప్రోక్తం విధిం స్తంభనబృంహణీయమ్.
సర్పిర్గుడా మాంసరసా ఘృతాని కల్యాణకత్ర్యూషణజీవనాని,

పయాంసి పథ్యోపహితాని లేహాశ్ఛర్ద్ధిం ప్రసక్తాం ప్రశమంనయంతి. ౨౪

మిక్కుటముగ వాంతి యగుటవలన రసాదిధాతువులు క్షయించును. దానివలన నవశ్యముగ వాతము ప్రకోపించును. కావున ఛర్దిరోగమునందు వమనాతియోగమునకు చెప్పియుండు స్తంభనబృంహణీయచికిత్సలను అవశ్యము చేయవలయును. మఱియు సర్పిర్గుడము మాంసరసములు ఘృతములు కల్యాణఘృతము త్ర్యూషణఘృతము జీవనీయఘృతము కరక్కాయలతో కాచబడిన ఆవుపాలు లేహములు వీనిని దోషదూష్యాద్యనుగుణముగ నిప్పించిన మిక్కుటముగనుండు ఛర్దిరోగము నివర్తించును. "అంజనం చందనోశీరమజ్జాసృక్ఛర్కరోదకమ్, లాజచూర్ణైః పిబేన్మంథమతియోగహరం పరమ్" చందనము వట్టివేరు మజ్జా రక్తము శర్కర వీనినికలిపిన యుదకము అంజనము పరిపేలాలపిండితో చేయబడిన మంథము యివి వమనాతియోగమును హరింపజేయునని తంత్రాంతరమునందు జెప్పబడియున్నది.

### వాతజ హృద్రోగచికిత్స.

హృద్రోగే వాతజే తైలం మస్తుసౌవీరతక్రవత్,
పిబేత్సుఖోష్ణం సబిడం గుల్మానాహార్తిజిచ్చ తత్. ౨౫

వాతమువలనజనించిన హృద్రోగమునందు పెరుగుమీదిమీగడ పులికడుగు మజ్జిగె బిడాలవణము వీనిని సమభాగములుగ నువ్వులనూనెలో కలిపికాచి యాతైలమును సుఖోష్ణముగ పానముచేయించవలయును. ఇది గుల్మము ఆనాహవాతము శూల వీనిని హరింపజేయును.

### హృద్రోగమునకు సైంధవాదితైలము.

తైలం చ లవణైస్సిద్ధం సమూత్రామ్లం తథాగుణమ్,

సైంధవలవణము సౌవర్చలవణము బిడాలవణము సాముద్రలవణము ఔద్భిదలవణము అను యీ యైదు లవణములను నువ్వులనూనెలో చేర్చి అందులో గోమూత్రముగాని పులికడుగుగాని పోసి పక్వముచేయబడిన తైలము గుల్మము ఆనాహవాతము వీనిని పోగొట్టును.

### బిల్వాదితైలము.

బిల్వం రాస్నాం యవాన్ కోలం దేవదారుం పునర్నవామ్.
కుళుత్థాన్ పంచమూలం చ పక్త్వా తస్మిన్ పచేజ్జలే,
తైలం తన్నావనే పానే వస్తౌ చ వినియోజయేత్. ౨౬

మారేడుపండు దుంపరాస్నము యవలు రేగుపండు దేవదారుచెక్క గలిజేరు ఉలవలు పంచమూలములు వీనిని సమభాగములుగ నుదకములో వైచి చక్కగ కాచి అందులో నువ్వులనూనెపోసి తైలపాకవిధిగ పక్వముచేసి దానిని నస్యము పానము అను వాసనవస్తి వీనియందుపయోగించుకొనిన గుల్మము ఆనాహవాతము మొదలగునవి హరించును.

### శుంఠ్యాది ఘృతము.

శుంఠీవయస్థాలవణకాయస్థాహింగుపౌష్కరైః,
పథ్యయా చ శృతం పార్శ్వహృద్రుజాగుల్మజిద్ఘృతమ్. ౨౮

శుంఠి ఉసిరిక సైంధవలవణము కాకోళి ఇంగువ పుష్కరమూలము కరక్కాయ వీనిని సమభాగములుగ గ్రహించి ఆవునేతిలో వైచి పక్వముచేయబడిన ఘృతము పార్శ్వశూల బొమ్మునొప్పి గుల్మరోగము వీనిని హరింపజేయును.

### సౌవర్చలాదిఘృతము.

సౌవర్చలస్య ద్విపలే పథ్యాపంచాశదన్వితే,
ఘృతస్య సాధితః ప్రస్థో హృద్రోగశ్వాసగుల్మజిత్. ౨౯

సౌవర్చలలవణము 2 పలములు, ఏబది కరక్కాయలబెరడు ఈరెంటి కల్కముచు ఒక ప్రస్థము ఘృతములో కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేసి సేవించిన హృద్రోగము శ్వాసము గుల్మము హరించును.

### పుష్కరమూలాదికషాయము.

పుష్కరాహ్వశఠీశుంఠీబీజపూరజటాభయాః,
పీతాః కల్కీకృతాః క్షారఘృతామ్లలవణైర్యుతాః. ౩౦
వికర్తికాశూలహరాః క్వాథః కోష్ణశ్చ తద్గుణః,
యవానీలవణక్షారవచాజాజ్యౌషధైః కృతః. ౩౧
సప్తాహ్వాదారుబీజాహ్వవిజయాశఠిపౌష్కరైః,

పుష్కరమూలము గంధకచోరములు శుంఠి మాదీఫలము జటామాంసి కరక్కాయలు వీనిని సమభాగములుగ గ్రహించి చక్కగనూరి, అందులో సర్జక్షారము ఆవునెయ్యి పుల్లప్రబ్బలి సైంధవలవణము వీనిని కలిపి పానముచేయించినను; ఓమము సైంధవలవణము సర్జక్షారము వస జీలకఱ్ఱ శుంఠి ఏడాకులపొన్న దేవదారు మాదీఫలము కరక్కాయ కచ్చూరములు పుష్కరమూలము వీనిని సమభాగములుగ చేర్చి కాచిన కషాయము పానముచేయించినను వికర్తికాశూలలు (అనగా—హృదయమును ఛేదించునటులనొప్పి) హరించును.

### పంచకోలాదికల్కము.

పంచకోలశఠీపథ్యాగుడబీజాహ్వపౌష్కరమ్. ౩౨
వారుణీకల్కితం భృష్టం యమకే లవణాన్వితమ్,
హృత్పార్శ్వయోనిశూలేషు ఖాదేద్గుల్మోదరేషు చ. ౩౩

పంచకోలములు కచ్చూరములు కరక్కాయలు బెల్లము మాదీఫలము వీనిని సమభాగములుగ గ్రహించి వారుణియను మద్యముతోనూరి కల్కముజేసి దానిని యమకస్నేహములో పక్వముచేసి అందులో కొంచెము సైంధవలవణముకలిపి సేవించిన ఱొమ్మునొప్పి పార్శ్వశూల యోనిశూల గుల్మము ఉదరరోగము హరించును.

### వాతజహృద్రోగమున స్వేదకర్మలు.

స్నిగ్ధాశ్చేహ హితాస్స్వేదాస్సంస్కృతాని ఘృతాని చ,

వాతజహృద్రోగమునందు స్నిగ్ధములైన స్వేదకర్మలు చక్కగ పక్వముచేయబడిన ఘృతములు మిక్కిలి హితకరంబులు.

### హృద్రోగమునం దుదకాదిపానము.

లఘునా పంచమూలేన శుంఠ్యా వా సాధితం జలమ్. ౩౪
వారుణీదధిమండం వా ధాన్యామ్లం వా పిబేత్తృషి,

హృద్రోగముగలవానికి దప్పిజనించినచో హ్రస్వపంచమూలములతోగాని శుంఠితోగాని కాచబడిన యుదకమును లేక వారుణియనుమద్యముయొక్క మీగడను లేక పెఱుగుమీది మీగడను లేక పులికడుగును పానము చేయించవలయును.

### మూర్ఛాదియుక్తహృద్రోగచికిత్స.

సాయామస్తంభశూలామే హృది మారుతదూషితే. ౩౫
క్రియైషా సద్రవాయామప్రమోహే తు హితా రసాః,
స్నేహాఢ్యాస్తిత్తిరిక్రౌంచశిఖివర్తకబుతుజాః. ౩౬

ఆక్షేపవాతము స్తబ్ధత్వము శూల ఆమాజీర్ణము వీనితోగూడి వాతముచే దూషింపబడియుండు హృద్రోగమున పైని చెప్పియుండు చికిత్సలను జేయవలయును. ద్రవత్వము ఆక్షేపవాతము మూర్ఛ వీనితోగూడి వాతముచే దూషింపబడియుండు హృద్రోగమునందు తిత్తిరిపక్షి క్రౌంచపక్షి నెమలి ఊరపిచ్చుక యెలుగుమంటి వీని మాంసరసములలో మిక్కుటముగ నెయ్యి మొదలగు స్నేహములను చేర్చి యిప్పించవలయును.

## హృద్రోగమున బలాతైలాదులు.

బలాతైలం సహృద్రోగః పిబేద్వా సుకుమారకం,
యష్ట్యాహ్వాశతపాకం వా మహాస్నేహం తథోత్తరమ్. ౩౭

హృద్రోగముగలవాడు బలాతైలముగాని, ప్రమేహచికిత్సాధ్యాయమునందు చెప్పబడియుండు సుకుమారక ఘృతముగాని, వాతశోణిత చికిత్సితమునందు చెప్పబడియుండు యష్ట్యాహ్వ శతపాకతైలముగాని, ఉత్తమమైన మహాస్నేహమును గాని పానము చేయించవలయును.

## మహాస్నేహము.

రాస్నాజీవకజీవంతీబలావ్యాఘ్రీపునర్నవైః,
భార్గీస్థిరావచావ్యోషైః మహాస్నేహం విపాచయేత్. ౩౮

దధిపాదం తథామ్లైశ్చ లాభతస్స నిషేవితః,
తర్పణో బృంహణో బల్యో వాతహృద్రోగనాశనః. ౩౯

ఆవునెయ్యి మజ్జవస నువ్వులనూనె అనునీ నాల్గుస్నేహములను సమభాగములుగ నొకటిగ గూర్చినయ్యది మహాస్నేహ మనబడును. అందులో దుంపరాస్నము జీవకము మనుబాల బలామూలము వ్యాకుడు గలిజేరు గంటుభారంగి ముయ్యాకుపొన్న వస త్రికటుకములు వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి కలిపి స్నేహమునకు నాల్గవభాగము ఆవుపెరుగును, పులికడుగు మొదలగు నమ్లరసములలో దొరకిన వరకును కూడ చేర్చి తైలపాకవిధిగ పక్వముచేసి యీమహాస్నేహమును సేవించినచో తృప్తి శరీరపుష్టి బలము వీనిని కలుగజేయును, వాతజహృద్రోగమును నశింపజేయును.

## వాతజహృద్రోగమున పథ్యకరద్రవ్యములు.

దీప్తేఽగ్నౌ సద్రవాయామే హృద్రోగే వాతికే హితం,
క్షీరం దధి గుడస్సర్పిరౌదకానూపమామిషమ్. ౪౦

జాఠరాగ్నికి దీపనముకలిగి ద్రవము ఆక్షేపవాతము వీనితోగూడియుండు వాతజహృద్రోగమునందు ఆవుపాలు ఆవుపెరుగు బెల్లము నెయ్యి ఔదకమాంసములు అనగా — మత్స్యములు మొదలగు జలజంతువుల మాంసములు, అనూపమాంసము అనగా — పంది మొదలగువాని మాంసములు హితకరంబులుగ నుండును.

## హృద్రోగమున వర్జ్యంబులు.

ఏతాన్యేవ చ వర్జ్యాని హృద్రోగేషు చతుర్ష్వపి,
శేషేషు స్తంభజాడ్యామ సంయుక్తేఽపి చ వాతికే. ౪౧

వాతజహృద్రోగమునందు తప్ప తక్కిన నాల్గు హృద్రోగములయందును, స్తంభము జడత్వము అజీర్ణము వీనితోఁగూడియుండు వాతజ హృద్రోగమునందును పూర్వశ్లోకములోఁ జెప్పియుండు పాలుమొదలగు వస్తువులను వర్జింపవలయును.

కఫయుక్తవాతహృద్రోగచికిత్స.

కఫానుబంధే తస్మింస్తు రూక్షోష్ణామాచరేత్క్రియామ్,

వాతజహృద్రోగము కఫముతోఁగూడియుండినచో రూక్షగ ఉష్ణముగనుండు చికిత్సలను జేయవలయును.

పిత్తజహృద్రోగచికిత్స.

పైత్తే ద్రాక్షేక్షునిర్యాససితాక్షౌద్రపరూషకైః. ౪౨
యుక్తో విరేకో హృద్యస్స్యాత్క్రమశ్శుద్ధే చ పిత్తహా,
క్షతపిత్తజ్వరోక్తం చ బాహ్యాంతః పరిమార్జనమ్. ౪౩
కట్వీమధుకకల్కం చ పిబేత్ససితమంభసా,

పిత్తజహృద్రోగమునందు ద్రాక్షపండు చెఱకురసము పంచదార తేనె పేరీతపండు వీనిలోఁ విరేకౌషధమును కలిపి యిచ్చి కోష్ఠము శుద్ధమైనపిదప పిత్తహరములైన గంజిమొదలగు పథ్యముల నిప్పించి క్షతరోగము పిత్తజ్వరము వీనికి చెప్పియుండు బాహ్యాభ్యంతరశుద్ధిక్రమములను చేయించవలయును. మఱియు ఉదకములోఁ కటుకరోహిణి కల్కము, యష్టిమధుక కల్కము, పంచదార ఈమూఁడిటిని కలిసి పానము చేయించవలయును.

శ్రేయస్యాదిఘృతము.

శ్రేయసీశర్కరాద్రాక్షాజీవకర్షభకోత్పలైః. ౪౪
బలాఖర్జూరకాకోలీమేదాయుగ్మైశ్చ సాధితమ్,
సక్షీరం మాహిషం సర్పిః పిత్తహృద్రోగనాశనమ్. ౪౫

ఏనుగుపిప్పళ్లు పంచదార ద్రాక్షపండు జీవకము ఋషభకము నల్లకలువ బలామూలము ఖర్జూరపుపండు కాకోళి మేద మహామేద వీనిని సమభాగములుగ గ్రహించి నూరి కల్కము చేసి అందులోఁ బఱ్ఱెనెయ్యి కలిపి నేతికిసమము బఱ్ఱెపాలు చేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి దానిని పానముచేయించిన పిత్తజహృద్రోగము హరించును.

ప్రపౌండరీకాదిఘృతము.

ప్రపౌండరీకమధుకబిసగ్రంథికసేరుకాః,
సశుంఠీశైవలాస్తాభిః సక్షీరం విపచేద్ఘృతమ్. ౪౬

శీతం సమధు తచ్ఛేష్టం స్వాదువర్గఘృతం చ యత్,
వస్తిం చ దద్యాత్సక్షౌద్రం తైలం మధుకసాధితమ్. ౪౭

ప్రపౌండరీకము, అతిమధురము, తామరగెడ్డలు, తుంగదుంప, శుంఠి, పాచి, వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముజేసి దానిని ఆవునేతిలోకలిపి ఆ నేతికి సమముగ ఆవుపాలుచేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి చల్లారిన పిదప అందులో తేనె కలిపి పానము చేయించవలయును. మఱియు మధురద్రవ్య వర్గములో చెప్పియుండు ద్రాక్షపండు మొదలగువానితో పక్వముజేయబడిన ఘృతము నిప్పించవలయును. అతిమధురముతో పక్వముజేయబడినదియు తేనె జేర్చబడినదియునైన తైలముచే వస్తికర్మను జేయించవలయును.

## కఫజహృద్రోగచికిత్స.

కఫోద్భవే వమేత్స్విన్నః పిచుమందవచాంబునా,
కులుత్థధన్వోత్థరసతీక్ష్ణమద్యయవాశనః. ౪౮

కఫమువలన జనించిన హృద్రోగమునందు స్వేదకర్మను జేయించి వేపాకు వస వీనితో కాచబడిన యుదకముచే వమనముజేయించి ఉలవకట్టు జాంగలమాంసరసము తీక్ష్ణమద్యము యవాన్నము వీనిని భుజింపజేయవలయును.

## వచాదిచూర్ణము.

పిబేచ్చూర్ణం వచాహింగులవణద్వయనాగరాత్,
సైలాయవానీకకణాయవక్షారాత్ సుఖాంబునా. ౪౯
ఫలధాన్యామ్లకౌలుత్థయూషమూత్రాసవైస్తథా,
పుష్కరాహ్వాభయాశుంఠీశఠీరాస్నావచాకణాః. ౫౦
క్వాథం తథాభయాశుంఠీమాద్రీపీతద్రుకట్ఫలాత్,

కఫజహృద్రోగమునందు వస, ఇంగువ, సైంధవలవణము, బిడాలవణము, శుంఠి ఏలకులు, ఓమము, పిప్పళ్లు, యవక్షారము, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముజేసి యాచూర్ణమునైనను, పుష్కరమూలము, కరక్కాయలు, శుంఠి, కచ్చూరములు, దుంపరాష్ట్రము, వస, పిప్పళ్లు వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి యాచూర్ణమునైనను, ఉష్ణోదకములోగాని, పులికడుగులోగాని, ఉలవకట్టులోగాని, ఆవుపంచితములోగాని, ఆసవమను మద్యములోగాని కలిపి పానము జేయించవలయును. మఱియు కరక్కాయ, శుంఠి, అతివస, మ్రానిపసుపు, గుమ్మడిరేగు, వీనిని సమభాగము

లుగ గ్రహించి యుదకములో వైచి కషాయముకాచి దానిని పానము చేయించ వలయును.

### వ్యోషాదిలేహము.

క్వాథే దాహితకాశ్వత్థఖదిరోదుంబరార్జునే. ౫౧
సపలాశవటే వ్యోషత్రివృచ్చూర్ణాన్వితే కృతః,
సుఖోదకానుపానస్య లేహః కఫవికారహా. ౫౨

ములుమోదుగ, రావి, చండ్ర, మేడి, మద్ది, మోదుగ, మఱ్ఱి, వీనిపట్టలను సమభాగములుగ గ్రహించి యుదకములో వైచి కషాయముకాచి అందులో శుంఠి, పిప్పలి, మిరియాలు, తెల్లతెగడ, వీని చూర్ణమును చేర్చి లేహపాకముగ వండి దాని నిప్పించి ఉష్ణోదకమును పానము చేయించిన కఫజహృద్రోగము హరించును.

శ్లేష్మగుల్మోదితాజ్యాని క్షారాంశ్చ వివిధాన్ పిబేత్,

కఫజహృద్రోగమునందు శ్లేష్మగుల్మరోగమునను చెప్పియుండు ఘృతములను నానావిధములగు క్షారములను ఇప్పించవలయును.

### కఫజహృద్రోగమునను శిలాజిత్వాదియోగము.

ప్రయోజయేచ్ఛిలాహ్వాం వా బ్రాహ్మం చాత్ర రసాయనమ్. ౫౩
తథామలకలేహం వా ప్రాశ్యం వాఽగస్తినిర్మితమ్,

కఫజహృద్రోగమునందు శిలాజిత్తు నిప్పించవలయును. రసాయనాధ్యాయము నందు చెప్పియుండు బ్రాహ్మ్యరసాయనమునుగాని, ఆమలకలేహమునుగాని, కాస చికిత్సితాధ్యాయమునందు చెప్పబడియుండు అగస్త్యలేహమునుగాని, యిప్పించవలయును.

### ఆహారకాలజహృద్రోగచికిత్స.

స్యాచ్ఛూలం యస్య భుక్తేఽన్నే జీర్యత్యల్పం జరాం గతే. ౫౪
శామ్యేత్సకుష్ఠకృమిజిల్లవణద్వయతిల్వకైః,
సదేవదార్వతివిషైశ్చూర్ణముష్ణాంబునా పిబేత్. ౫౫

ఏ హృద్రోగికి బొమ్మునొప్పి ఆహారమును భుజించునపుడు మిక్కుటముగను, భుజించిన యాహారము సగము జీర్ణమైయుండునపుడు స్వల్పముగను, చక్కగ జీర్ణమైన తోడనే శమించుచును ఉండునో, యట్టిహృద్రోగికి చంగల్వకోష్ఠు, వాయువిడంగములు, సైంధవలవణము, బిడాలవణము, తిల్వకమును గ్రంథ్యము, దేవదారు, అతివస, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముజేసి దాని నుష్ణోదకములో కలిపి పానము చేయించవలయును.

### జీర్ణానంతరజాత హృద్రోగాదిచికిత్స.

యస్య జీర్ణేఽధికం స్నేహైస్స విరేచ్యః ఫలైః పునః,
జీర్యత్యన్నే తథా మూలై స్తీక్ష్ణైశ్శూలే సదాధికే ౫౮

భుజించినయాహారము జీర్ణమైనతోడనే యేమనుజునికి ఱొమ్మునందు మిక్కుటముగ శూలగలిగెడినో యట్టిహృద్రోగికి విరేచనకరద్రవ్యములతో పక్వముచేయబడిన స్నేహములచేత విరేచనము చేయించవలయును. ఎవనికి భుజించినయాహారము జీర్ణంబగుచుండునపుడు ఱొమ్మునందు మిక్కుటముగ శూలగలుగునో యట్టిరోగికి ఫలములచే పక్వముచేయబడిన విరేచనౌషధములను విరేచనార్థము యివ్వించవలయును.

"మృద్వీకాథ విడంగాని ఖర్జూరాణి పరూషకమ్, ఆరగ్వధోఽథామలకం హారీతక్యో విభీతకమ్. కంపిల్లకోపచిత్రే చ త్రపుసంచ ముకూలకమ్,నీలికాకువలం పీలు భవేత్ఫలవిరేచనమ్." ద్రాక్షపండు, వాయువిడంగములు, ఖర్జూరపండు, పేరీతపండు, రేల, ఉసిరికపండు, కరకాయలు, తాడికాయ, కంపిల్లకము, ఎలుకచెవియాకు, ములుదోస, దంతి, నీలియాకు, గోగుపండు, రేగుపండు, వీనితోసిద్ధముజేయబడిన విరేచనౌషధము ఫలవిరేచనమనబడునని చరకాచార్యుడు చెప్పియున్నాడు.

ఏమనుజుని కెల్లపుడు ఱొమ్మునందు మిక్కుటముగ శూలగలిగి యుండెడినో యట్టివానికి తీక్ష్ణముగనుండు మూలవిరేచనౌషధములచే విరేచనముచేయించవలయును. "సప్తలాశంఖినీదంతీద్రవంతీగిరికర్ణికాః, త్రివృచ్ఛ్యామోదకీర్యా చ ప్రకీర్యా క్షీరిణీ తథా. ఛగలాండీ గవాక్షీ చ కుచాక్షీ గిరికర్ణికా, మసూరవిదళా చైవ భవేన్మూలవిరేచనమ్." విరజాజి, లేక సంబరేణు, కట్లెచెట్టు, దంతిచెట్టు, యెలుకచెవిచెట్టు, తెల్లగంటెన, తెల్లతెగడ, నల్లసుగంధిపాల, క్రానుగు, నెమలడుగు, పాలానుగు, బొద్ది, పిన్నపాపర, కుచాక్షి, నల్లదింటెన, నల్లతెగడ, వీనివేళ్లతో పక్వముచేయబడిన విరేచనౌషధము మూలవిరేచనమని చరకాచార్యుడు చెప్పియున్నాడు.

### వాతమున కనులోమగత్వావశ్యకత్వము.

ప్రాయోఽనిలో రుద్ధగతిః కుప్యత్యామాశయం గతః,
తస్యానులోమనం కార్యం శుద్ధిలంఘనపాచనైః. ౫౯

స్వమార్గమడ్డగింపబడుటవలన తఱుచుగ వాతము ఆమాశయమునుజేరి ప్రకోపముజెందును. అట్టి వాతమునకు వమనవిరేచనాది శుద్ధి లంఘనము పాచనౌషధము నన్నిటి వీనిసేవనలచే స్వమార్గగమనమును గలుగజేయవలయును.

### క్రిమిజహృద్రోగచికిత్స.

క్రిమిఘ్నమౌషధం సర్వం క్రిమిజే హృదయామయే,

క్రిములవలన జనించిన హృద్రోగమునందు క్రిమిహరములైన యౌషధముల నిప్పించవలయును.

### తృష్ణారోగ సామాన్యచికిత్స.

తృష్ణాసు వాతపిత్తఘ్నో విధిః ప్రాయేణ యుజ్యతే. ౫౮
సర్వాసు శీతో బాహ్యాంతస్తథా శమనశోధనమ్,
దివ్యాంబు శీతం సక్షౌద్రం తద్వద్భౌమం చ తద్గుణమ్. ౫౯
నిర్వాపితం తప్తలోష్టకపాలసికతాదిభిః,
సశర్కరం వా క్వథితం పంచమూలేన వా జలమ్. ౬౦
దర్భపూర్వేణ మంథశ్చ ప్రశస్తో లాజసక్తుభిః,
వాట్యశ్చామయవైశ్శీతశ్శర్కరామాక్షికాన్వితః. ౬౧
యవాగూశ్శాలిభిస్తద్వత్కోద్రవైశ్చ చిరంతనైః,
శీతేన శీతవీర్యైశ్చ ద్రవ్యైస్సిద్ధేన భోజనమ్. ౬౨
హిమాంబుపరిషిక్తస్య పయసా ససితామధు,
రసైశ్చానమ్లలవణైర్జాంగలైర్ఘృతభర్జితైః. ౬౩
ముద్గాదీనాం తథా యూషైర్జీవనీయరసాన్వితైః,
నస్యం క్షీరఘృతం సిద్ధం శీతైరిక్షో స్తథా రసః. ౬౪
నిర్వాపణాశ్చ గండూషాస్సూత్రస్థానోదితా హితాః,
దాహజ్వరోక్తా లేపాద్యా నిరీహత్వం మనోరతిః. ౬౫
మహాసరిద్ధ్రదాదీనాం దర్శనస్మరణాది చ,

తృష్ణారోగము లన్నిటియందును నానావిధములైన వాతపిత్తహరచికిత్సలు; బాహ్యాభ్యంతరములయందు శీతలోపచారము; శమనశోధనౌషధములు, ఇవి ప్రశస్తంబులు. మఱియు చల్లగనుండు అంతరిక్షోదకము అనగా— (భూమియందు పడకమునుపు గ్రహింపబడిన వర్షధారోదకము)లో తేనెకలిపి పానము చేయించినను, లేక సూత్రస్థానమునందు "శుచిపృథ్వసితశ్వేతే దేశే" పరిశుద్ధముగ గట్టిగ నల్లగ లేక తెల్లగనుండు ప్రదేశమునందలి యుదకము నిప్పించినను, లేక మట్టిగడ్డ చిల్లపెంకులు ఇసుక వీనిని నిప్పులో చక్కగ కాల్చి ఉదకములోవైచి చల్లార్చి యా యుదకము నిప్పించినను, లేక పై యుదకములో సమభాగము పంచదార కలిపి పానము చేయించినను, లేక తృణపంచ

మూలములతో కాచి చల్లార్చిన యుదకమును పానముచేయించినను, లేక పరిపేలాలపిం డితో పక్వముచేయబడిన మంథము నిప్పించినను, యవలచే వటకములుచేసి చల్లార్చి తేనె పంచదార వీనినిచేర్చి యిప్పించినను, పాతదియగు సంబావుబియ్యముచేగాని కొఱ్ఱలచే గాని పక్వముచేయబడిన యవాగును పానముచేయించినను, శీతవీర్యద్రవ్యములతో పక్వముచేయబడినదియు చల్లారినదియునైన భోజనము నిప్పించినను, శీతోదకములో స్నానముచేయించి తేనె పంచదారచేర్చబడిన ఆవుపాలతో అన్నము నిప్పించినను, కొంచెము పులుసు ఉప్పుచేర్చి పక్వముచేయబడి నేతిలోవేయించిన జాంగలజంతుమాంస రసములతో నన్నమునిప్పించినను, జీవనీయ ద్రవ్యములచేర్చి పక్వముచేయబడిన పెసలు మొదలగువానికట్టులతో భోజనముచేయించినను, లేక శీతవీర్యముగల చందనాదిద్రవ్య ములతోగాని చెఱుకురసముతోగాని ఆవుపాలను చక్కగా కాచి దానిలోనుండి తీయబడిన నేతితోగాని నస్యముచేయించినను, తృష్ణారోగము శమించును. మఱియు నీ రోగమునందు సూత్రస్థానములో చెప్పబడియుండు నిర్వాపణాది గండూషములును "దూర్వాదిభిర్వాతపిత్తఘ్నైః" ఇత్యాదిశ్లోకములచే దాహజ్వర చికిత్సలయందు చెప్పబడియుండు పట్టులును హితకరంబులుగనుండును. మఱియు నిర్వ్యాపారము మన స్సంతోషము గంగ మొదలగు గొప్పనదులు మడుగులు తటాకములు వీనిని చూడ డము స్మరించుట ఇవియును తృష్ణారోగమును శమింపజేయును. ఇచ్చట "మహాసర్ద్రదా దీనాం" అనుచోట "మహాసరిత్ + హ్రదాదీనాం" అనుపదముల సంధియని యెఱుం గునది.

## వాతజ తృష్ణారోగ చికిత్స.

తృష్ణాయాం పవనోత్థాయాం సగుడం దధి శస్యతే. ౬౬
రసాశ్చ బృంహణాః శీతాః విదార్యాదిగణాంబు వా,

వాతమువలన జనించిన దప్పియందు పాతబెల్లముకలిపిన ఆవుపెరుగును, పుష్టి కరమునునైన మాంసరసములను, పానముచేయించవలయును. లేక సూత్రస్థానములో 'విదారిపంచాంగులే" త్యాదిశ్లోకములలో చెప్పబడియుండు విదార్యాదిగణద్రవ్యము లతో కాచబడిన యుదకమును పానముచేయించవలయును.

## పిత్తజ తృష్ణారోగచికిత్స.

పిత్తజాయాం సితాయుక్తః పక్వోదుంబరజో రసః. ౬౭
తత్క్వాథో వా హిమస్తద్వత్సారివాదిగణాంబు వా,
తద్విధైశ్చ గణైశ్శీతకషాయాః ససితామధూః. ౬౮

మధురై రౌషధై స్తద్వత్క్షీరివృక్షైశ్చ కల్పితాన్,
బీజపూరకమృద్వీకావటవేతసపల్లవాన్. ౧౯
మూలాని కుశకాశానాం యష్ట్యాహ్వం చ జలే శృతమ్,
జ్వరోదితం వా ద్రాక్షాది పంచసారాంబు వా పిబేత్. ౨౦

పిత్తజతృష్ణారోగమునందు చక్కగపండిన మేడిపండ్లయొక్క కషాయమునుగాని రసమునుగాని పంచదార సహితముగ పానముచేయించినను; సూత్రస్థానములో "శారిబోశీరే" త్యాదిశ్లోకములలో చెప్పబడియుండు సారిబాది గణద్రవ్యములనుచేర్చి కాచబడిన జలమును పానముచేయించినను; లేక శీతవీర్యముగల ద్రవ్యములయొక్క శీతకషాయములో పంచదార తేనెకలిపి పానముచేయించినను; మధురరసముగల ద్రాక్షపండు మొదలగు ద్రవ్యములను సమముగచేర్చి కాచబడిన యుదకమును పానముచేయించినను; మఱ్ఱి జువ్వి రావి మొదలగు క్షీరివృక్షముల పట్టలను సమభాగములుగ గ్రహించి యుదకములోవైచి కాచబడిన కషాయములో పంచదార తేనెకలిపి పానముచేయించినను; మాదీఫలపుచెట్టు ద్రాక్షచెట్టు మఱ్ఱి ప్రబ్బలి వీనిచిగుళ్లు కుశగడ్డివేళ్లు కాశగడ్డివేళ్లు అతిమధురము వీనిని సమభాగములుగ నుదకములోవైచి చక్కగకాచి చల్లార్చి యా యుదకమును పానముచేయించినను; జ్వరచికిత్సలయందు చెప్పబడియుండు ద్రాక్షాదిశీతకషాయమునుగాని రక్తపిత్తచికిత్సితమునందు చెప్పియుండు పంచసారోదకమునుగాని పానముచేయించినను హితము కలుగును.

## కఫజతృష్ణారోగచికిత్స.

కఫోద్భవాయాం వమనం నింబప్రసవవారిణా,
బిల్వాఢకీపంచకోలదర్భపంచకసాధితమ్. ౨౧
జలం పిబేద్రజన్యా వా సిద్ధం సక్షౌద్రశర్కరమ్,
ముద్గయూషం చ సవ్యోషపటోలీనింబపల్లవమ్. ౨౨
యవాన్నం తీక్ష్ణకబళనస్యలేహాంశ్చ శీలయేత్,

కఫజతృష్ణారోగమునందు వేపచిగుళ్లను జలములోవైచికాచి దానిచే వమనము చేయించవలయును; లేక మారేడు కందులు పంచకోలములు తృణపంచమూలములు వీనిని సమభాగములుగ గ్రహించి యుదకములోవైచి కాచబడిన యుదకము పానము చేయించవలయును; లేక పసుపును జలములోవైచికాచి తేనె పంచదార కలిపి పానము చేయించవలయును; లేక త్రికటుకములు చేదుపొట్ల వేపచిగుళ్లు వీనిని చేర్చి పక్వము చేయబడిన పెసలకట్టును యవాన్నమును ఇప్పించవలయును. మఱియు తీక్ష్ణకబళములు తీక్ష్ణనస్యములు తీక్ష్ణలేహ్యములు వీనిని సేవింపుచుండవలయును.

### సన్నిపాత ఆమజతృష్ణారోగచికిత్స.

సర్వైర్వారామాచ్చ తద్ధంత్రీ క్రియేష్టా వమనం తథా. ౭౩
తూర్ణ్యషణారుష్కరవచాఫలామ్లోష్ణాంబుమస్తుభిః,

సన్నిపాతజ తృష్ణారోగమునందు సన్నిపాతహరములైన చికిత్సలును, ఆమజతృష్ణారోగమునందు ఆజీర్ణహరములైన చికిత్సలును చేయవలయును. మఱియు త్రికటుకములు జీడిగింజలు వస చింతపండు వీనిని సమముగ చేర్చి కాచబడిన యుదకముచేతగాని పెరుగుమీది మీగడతోగాని వమనము చేయించవలయును.

### అన్నాభావజతృష్ణాచికిత్స.

అన్నాత్యయాన్మండముష్ణం హిమం మంథం చ కాలవిత్. ౭౪

ఆహారములేకుండుటవలన జనించిన దప్పిరోగమునందు కొంచెముష్ణముగనుండు మండమను గంజినిగాని చల్లగనుండు మంథమునుగాని దేశకాలప్రకృతిసాత్మ్యబలాద్యనుగుణముగ పానముచేయించవలయును. వాతకఫప్రకృతి, పిత్తశ్లేష్మప్రకృతి, పిత్తప్రకృతి, యివి గలవారికి మంథమును, వాతాదిప్రకృతిగలవారికి కొంచెముష్ణముగనుండు గంజిని, పానముచేయించవలయును. ''సక్తవస్సర్పిషాభ్యక్తాశ్శీతోదకపరిప్లుతాః, నాతిద్రవో నాతిసాంద్రో మంథ ఇత్యభిధీయతే.'' వరిపేలాలపిండిని నేతితో తడిపి శీతోదకములోవైచి మిగుల చిక్కగ మిగుల తేటగ లేకుండునటుల కలిపిన నది మంథమనబడునని చరకాచార్యుడు చెప్పియున్నాడు.

### శ్రమజతృష్ణాచికిత్స.

తృషి శ్రమాన్మాంసరసం మద్యం వా ససితం పిబేత్,

ఆయాసకరమైన పనులను చేయుటవలన జనించిన దప్పిరోగమునందు సాధారణదేశజంతుమాంసరసములోగాని మద్యములోగాని పంచదారనుకలిపి పానముచేయించవలయును.

### ఆతపజతృష్ణాచికిత్స.

ఆతపాత్ససితం మంథం యవకోలాంబుసక్తుభిః. ౭౫
సర్వాణ్యంగాని లింపేచ్చ తిలపిణ్యాకకాంజికైః,

ఎండగొట్టువలన కలిగిన దప్పిరోగమునందు యవలు రేగుపండ్లు వీనిని సమభాగములుగ గ్రహించి చేయబడినపిండిని జలములోకలిపి అందులో పంచదారను చేర్చి యీమంథమును పానముచేయించవలయును. తెలికపిండిని గంజిలోకలిపి సర్వాంగములయందును లేపనము చేయించవలయును.

శీతస్నానజతృష్ణాచికిత్స.

శీతస్నానాత్తు మద్యాంబు పిబేత్తృష్ణార్తుడాంబు వా. ౭౬

శీతోదకములో స్నానము చేయుటవలన జనించిన దప్పిరోగముగలవానికి నాల్గవ భాగముదకము చేర్చబడిన మద్యమునుగాని పానకమునుగాని పానము చేయించవలయును.

మద్యజతృష్ణాచికిత్స.

మద్యాదర్ధజలం మద్యం స్నాతోఽమ్లలవణైర్యుతమ్,

విశేషముగ మద్యమును పానము చేయుటవలన జనించిన దప్పిరోగముగలవానికి స్నానము చేయించి మద్యమునం దర్ధభాగముదకము కలిపి అందు పులువు ఉప్పు చేర్చి దానిని పానము చేయించవలయును.

స్నేహజతృష్ణాచికిత్స.

స్నేహాతీక్ష్ణతరాగ్నిస్తు స్వభావశిశిరం జలమ్. ౭౭

నెయ్యి మొదలగు స్నేహపానమువలన మిక్కుటమైనజాఠరాగ్ని దీపనముగల వానికి దప్పి జనించినచో స్వభావముచే చల్లగనుండు జలమును పానము చేయించ వలయును.

అజీర్ణస్నేహజతృష్ణాచికిత్స.

స్నేహాదుష్ణాంబ్వజీర్ణాత్తు జీర్ణాన్మండం పిపాసితః,

నెయ్యి మొదలగు స్నేహములు జీర్ణముకాకుండుటవలన దప్పి జనించినచో నుష్ణోదకమును పానము జేయించవలయును. పై స్నేహములు జీర్ణమైనతోడనే దప్పి జనించినచో మండమను గంజిని పానము చేయించవలయును.

స్నిగ్ధాన్నజతృష్ణాచికిత్స.

పిబేత్స్నిగ్ధాన్నతృషితో హిమస్పర్శి గుడోదకమ్ ౭౮

స్నిగ్ధమైన యాహారములను భుజించుటవలన జనించిన దప్పియందు మిక్కిలి చల్లగనుండు గుడోదకమును (పానకమును) పానము చేయించవలయును.

గుర్వాహారజతృష్ణాచికిత్స.

గుర్వాద్యన్నేన తృషితః పీత్వోష్ణాంబు తదుల్లిఖేత్,

గురుత్వకరాహారములను భుజించుటవలన దప్పిజనించినచో నుష్ణోదకమును త్రాగి యా యన్నాదులను వమనము చేయవలయును.

క్షయజతృష్ణాచికిత్స

క్షయజాయాం క్షయహితం సర్వం బృంహణమౌషధమ్. ౭౯

రసాదిధాతువులు క్షయించుటవలన జనించిన దప్పియందు క్షయరోగమునకు చెప్పియుండు పుష్టికరౌషధముల నన్నిటిని సేవింపవలయును.

### కృశాదితృష్ణాచికిత్స.

కృశదుర్బలరూక్షాణాం క్షీరం ఛాగో రసోఽథవా,

శరీరము కృశించియుండువారు దుర్బలులు రూక్షతగలవారు వీరికి దప్పిజనించినచో ఆవుపాలనుగాని మేకమాంసరసమునుగాని యిప్పించవలయును.

### ఊర్ధ్వవాతజతృష్ణాచికిత్స.

క్షీరం చ సోర్ధ్వవాతాయాం క్షయకాసహరైశ్శృతమ్. ౮౦

ఊర్ధ్వవాతముతోగూడియుండు దప్పియందు క్షయహరములుగను కాసమును పోగొట్టునవిగ నుండు నౌషధములను సమభాగములుగచేర్చి కాచబడిన యావుపాలను మాంసరసమును యిప్పించవలయును.

### రోగజతృష్ణాచికిత్స.

రోగోపసర్గజాతాయాం ధాన్యాంబు ససితామధు,
పానే ప్రశస్తం సర్వా చ క్రియా రోగాద్యపేక్షయా. ౮౧

రోగోపద్రవమువలన జనించిన దప్పియందు దనియాలుచేర్చి కాచబడినయుదకములో తేనె పంచదారకలిపి పానముచేయించుటయేగాక ఆ యా రోగమునకు దగినటుల చికిత్సలను చేయవలయును.

### దప్పియందుదకపానావశ్యకత్వము.

తృష్యన్ పూర్వామయక్షీణో న లభేత జలం యది,
మరణం దీర్ఘరోగం వా ప్రాప్నుయాత్త్వరితం తతః. ౮౨
సాత్మ్యాన్నపానభైషజ్యైస్తృష్ణాం తస్య జయేత్పురః,
తస్యాం జితాయామన్యోఽపి శక్యో వ్యాధిశ్చికిత్సితుమ్. ౮౩

రోగములచే బలము క్షయించినవానికి దప్పిగలిగియుండునపుడు నాదప్పినివర్తించునట్టి యుదకాదుల నిప్పించకుండినయెడలనారోగికి మరణముగాని దారుణమైన రోగములనుగాని జెందును. కావున సాత్మ్యమైనయన్నపానౌషధములచే దప్పిని తొలుత శమింపజేయవలయును. దప్పి శమించినపిదప నితరరోగములన్నియుం సుఖముగ చికిత్స జేయుట కనుకూలముగనుండును.

షష్ఠాధ్యాయము, ముగిసెను.

# సప్తమాధ్యాయము.

అవ: తృష్ణారోగమునకును మదాత్యయరోగమునకును నిదానము సమముగనుండుటవలన ఛర్ది హృద్రోగ తృష్ణా చికిత్సితాధ్యాయానంతరము మదాత్యయ చికిత్సితాధ్యాయము చెప్పబడుచున్నయది. తృష్ణారోగమునకు వాతపిత్తములు కారణములు. ఆవాతపిత్తములే మదాత్యయంబునకును కారణములు. కావున నీ రెంటికిని సామాన్యహేతువులు సమములుగ నుండునని భావము.

## మదాత్యయ చికిత్సితాధ్యాయప్రారంభము.

సూ. అథాతో మదాత్యయచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

ఛర్ది హృద్రోగ తృష్ణా చికిత్సితాధ్యాయనిరూపణానంతరము మదాత్యయ రోగచికిత్సలను దెలియపరచునట్టి మదాత్యయ చికిత్సితమను నీ యధ్యాయమును వివరించెదము.

## మదాత్యయచికిత్స.

యం దోషమధికం పశ్యేత్తస్యాదౌ ప్రతికారయేత్,
కఫస్థానానుపూర్వ్యా వా తుల్యదోషే మదాత్యయే. ౧
పిత్తమారుతపర్యంతః ప్రాయేణ హి మదాత్యయః,

మదాత్యయము (అనగా—మద్యము నధికముగ పానముచేయుటవలనను తీక్ష్ణమైన మద్యమును పానముచేయుటవలనను జనించు రోగము) నందు వాతాదులలో యే దోషము మిక్కుటముగ ప్రకోపించియున్నదో దాని నెఱింగి యాదోషమునకు తొలుత చికిత్స జేయవలయును. మఱియు మదాత్యయరోగమునందు తొలుత కఫాధిక్యము పిదప వాతపిత్తాధిక్యము తఱుచుగ కలుగును. వాత పిత్త కఫములు సమముగ ప్రకోపించియుండు మదాత్యయరోగమునకు జ్వర చికిత్సితాధ్యాయములో జెప్పియుండు కఫస్థానాను పూర్వక్రమముగ చికిత్సలను చేయవలయును.

## హీనమిథ్యాతియోగజరోగచికిత్స.

హీనమిథ్యాతిపీతేన యో వ్యాధిరుపజాయతే. ౨

సమపీతేన తేనైవ స మద్యేనోపశామ్యతి,
మద్యస్య విషసాదృశ్యాత్

హీనయోగముగ నైనను, మిథ్యాయోగముగ నైనను, అతియోగముగ నైనను మద్యమును పానముచేయుటవలన జనించురోగము ఆ మద్యమును సమ్యగ్యోగముగ పానముచేసిన నివర్తించును. "యావద్దృష్టేర్నసంభ్రాంతిః యావన్న క్షోభ్యతే మనః, తావదేవ విరంతవ్యం మద్యాదాత్మవతా సదా." బుద్ధిమంతుడగుమనుజుడు యెంతప్రమాణముగల మద్యమును పానము జేసిన కండ్లు ఎఱ్ఱనై తిరుగకుండునో మనస్సు వికారమును జెందకుండునో యంత పరిమితిగల మద్యమును పానముచేయవలయునని మద్యపాన సమ్యగ్యోగలక్షణము తంత్రాంతరమునందు చెప్పబడియున్నది. మద్యము విషమువలె తీక్ష్ణత మొదలగు పది గుణములతో గూడియుండును. కావున యే మద్యమును హీన మిథ్యాతి యోగముగ పానముచేయుటచే రోగముజనించినదో యారోగము ఆ మద్యమును సమ్యగ్యోగముగ పానముచేసిన శమించును.

"యేవిషస్య గుణాఃప్రోక్తాః తేపిమద్యేవ్యవస్థితాః" అనువాక్యముచేత విషమునందలి తీక్ష్ణాదిగుణములు పదియుమద్యమునందు నుండును. అని తెలిసెడి 'విషస్య విషమౌషధం' అనునట్లు విషమునకు విషమే యౌషధము కాని వేరుచికిత్స పొసగదు. ఆవిధముగ నే తీక్ష్ణాది దశవిధగుణయుక్తమగు మద్యమున గల్గిన వ్యాధికిని అట్టి గుణములుకల మద్యమే తగిన యౌషధమగును గాని యితరములకు చికిత్సలు పొసగదని భావము).

విషం తూత్కర్షవృత్తిభిః. ౩
తీక్ష్ణాదిభిర్గుణైర్యోగా ద్విషాంతరమపేక్షతే,

విషము అధిక శక్తిగల తీక్ష్ణాదిగుణములతో గూడియుండినను యది మఱియొక విషముచే నివర్తించును. మద్యము స్వల్పశక్తిగల తీక్ష్ణాదిగుణములుగలదిగ నుండినను యితర మద్యసంబంధములేకయే మద్యజనితరోగము నివర్తించును.

తీక్ష్ణాదిగుణ మద్యజనితరోగ చికిత్స.

తీక్ష్ణోష్ణేనాతిమాత్రేణ పీతేనామ్లవిదాహినా. ౪
మద్యేనాన్నరసక్లేదో విదగ్ధః క్షారతాం గతః,
యాంతర్దాహజ్వరాంతర్దాహ విభ్రమాన్. ౫
మనోక్షోభిచేదోషేణ రుద్ధస్రోతస్సు మారుతః,
సుతీవ్రా వేదనా యాశ్చ శిరస్యస్థిషు సంధిషు. ౬
జీర్ణామద్యదోషస్య ప్రకాంక్షాలాఘవే సతి,
యౌగికం విధివద్యుక్తం మద్యమేవ నిహంతి తాన్. ౭

తీక్ష్ణముగను ఉష్ణముగను అమ్లరసముగలదిగను విదాహావస్థను గలుగ జేయునదిగను నుండు మద్యమును అధికముగ పానము చేయుటవలన భుజించిన యాహారరసము విదాహావస్థను జెంది క్షారరసముగ పరిణమించి మదము దప్పి చిత్తభ్రమము జ్వరము తాపము మొదలగువికారములను గలుగ జేయును. అటులనే ఆహారదోషమువలన మద్య దోషము ప్రకోపించి స్రోతోమార్గముల నడ్డగించి శిరము అస్థులు సంధులు వీనియందు తీవ్రమైన వేదనలను గలుగ జేయును. శరీరలఘుత్వము ఆకలిగలిగియుండునపుడు యుక్తిగ మద్యమును పానము చేసిన మదము చిత్తభ్రమము శిరోవేదన మొదలగు మద్య జోపద్రవములు మద్యము జీర్ణమునొందినపిదప నివర్తియగును.

క్షారో హి యాతి మాధుర్యం శీఘ్రమమ్లోపసంహితః,
మద్యమమ్లేషు చ శ్రేష్ఠం దోషవిష్యందనాదలమ్ ౮

క్షారరసము అమ్లరసముతో గూడినచో నతిశీఘ్రముగ మధురరసముగ పరిణమించును. అమ్లరసవస్తువులలో మద్యము కడు శ్రేష్ఠమైనది. కావున మద్యము సమస్త దోషములను పోగొట్టును.

మద్యమునకు ధాతుసామ్యకరత్వము.

తీక్ష్ణోష్ణాద్యైః పురా ప్రోక్తైర్దీపనాద్యైస్తథా గుణైః,
సాత్మ్యత్వాచ్చ తదేవాస్య ధాతుసామ్యకరం పరమ్. ౯

మద్యము మదాత్యయ నిదానాధ్యాయమునందు చెప్పబడియుండు తీక్ష్ణాది గుణములతోడను మద్యవర్గనిరూపణ ప్రకరణమునందు చెప్పబడియుండు దీపనాదిగుణములతోడను గూడియుండుటవలన నయ్యది ప్రకోపించియుండు వాతాదిధాతువులకు సామ్యావస్థను గలుగంజేయును.

మదాత్యయౌషధప్రయోగకాలనియమము.

సప్తాహమష్టరాత్రం వా కుర్యాత్పానాత్యయౌషధమ్,
జీర్యత్యేతావతా పానం కాలేన విపథా కృతమ్. ౧౦

మదాత్యయరోగము శమించుటకై 7 లేక 8 దినములు మద్యమును యుక్తిగ పానము చేయవలయును. ఇటుల జేసినచో విరుద్ధమార్గమును జెందియుండు నామద్య దోషము జీర్ణంబగును.

పరం తతోఽనుబధ్నాతి యో రోగస్తస్య భేషజమ్,
యథాయథం ప్రయుంజీత కృతపానాత్యయౌషధః. ౧౧

పై చెప్పిన నియమితకాలమువరకు మద్యమును పానముచేయించి పిమ్మట నేరోగము ఇంకను అనుసరించియుండునో అట్టిరోగమునకును అధిక మద్యపానజనిత వికారమునకును తగినట్లు చికిత్స జేయవలెను.

## వాతజమదాత్యయ చికిత్స.

తత్ర వాతోల్బణే మద్యం దద్యాత్పిష్టకృతం యుతమ్,
బీజపూరకవృక్షామ్లకోలదాడిమదీప్యకైః. ౧౨
యవానీహపుషాఽజాజీవ్యోషత్రిలవణార్ద్రకైః,
శూల్యైర్మాంసైర్హరితకైః స్నేహవద్భిశ్చ సక్తుభిః. ౧౩
ఉష్ణస్నిగ్ధామ్లలవణా మేద్యమాంసరసా హితాః,
ఆమ్రామ్రాతకపేశీభిస్సంస్కృతా రాగఖాండవాః. ౧౪
గోధూమమాషవికృతీర్మృదుచిత్రా ముఖప్రియాః,
ఆర్ద్రికార్ద్రికకుల్మాషసూక్తమాంసాదిగర్భిణీ. ౧౫
సురభిర్లవణా శీతా నిగదా వాచ్ఛవారుణీ,
స్వరసో దాడిమః క్వాథః పంచమూలాత్కనీయసః. ౧౬
శుంఠీధాన్యాత్తథా మస్తుసూక్తాంభోఽథామ్లకాంజికమ్,
అభ్యంగోద్వర్తనస్నానముష్ణం ప్రావరణం ఘనమ్. ౧౭
ఘనశ్చాగురుజో ధూపః పంకశ్చాగురుకుంకుమః,
కుచోరుశ్రోణిశాలిన్యో యౌవనోష్ణాంగయష్టయః. ౧౮
హర్షేణాలింగనైర్యుక్తాః ప్రియాస్సంవహనేషు చ,

వాతాధిక్యముతోగూడియుండు మదాత్యయరోగమునందు పిండిచే చేయబడినదియును, దేశసాత్మ్యాద్యనుగుణముగ మాదీఫలము చింతపండు రేగుపండు దానిమ్మపండు ఓమము కురాసానియోమము బోడతరము జీలకఱ్ఱ త్రికటుకములు సైంధవలవణము సౌవర్చలవణము బిడాలవణము అల్లము వీనిని సమభాగములుగ చేర్చి పక్వము చేయబడినదియునైన మద్యము నిప్పించవలయును. మఱియు శూలముతో పక్వము చేయబడిన మాంసము ఘృతాది స్నేహయుక్తముగనుండు సత్తువులు, శాకములు, ఉష్ణముగను స్నేహయుక్తముగను లవణామ్లరసములుగలవిగను మేదస్సుహితకరంబులునునగు మాంసరసములు, మామిడి అంబాళము వీటిగుజ్జుతో పక్వము చేయబడిన రాగము, ఖాండవము, మృదువుగను నోటికి రుచికరముగను నానావిధములుగనునుండు గోధుమపిండి మినుములు వీనిచే చేయబడిన భక్ష్యములు, ఆర్ద్రికా అల్లము ఉలవలు కడుగు మాంసము వీనితో

కూడినదియు,మంచివాసనగలదియు, లవణరసముగలదియు, పాతదిగ చల్లగనుండునదియు నైన అచ్ఛవారుణీయనుమద్యము, దానిమ్మపండురసము, లఘుపంచమూలములకషాయము శుంఠి, దనియాలకషాయము, పెరుగుమీఁదిమీఁగడ, పులికడుగు, పులిసినమద్యము, ఉష్ణకరమైన యభ్యంగము, నలుగుపెట్టికొనుట, స్నానముచేయుట, దుప్పటి కంబళము మొదలగువానిని కప్పుకొనుట, అగరుధూపము వేసికొనుట, కుంకుమపువ్వు చేర్చబడిన అగరుచందనము పూసికొనుట, స్తనములు పిఱుదులు వీనిచే ప్రకాశించువారును యౌవనముచే వేడిగనుండు శరీరముగలవారునైన స్త్రీలను ఆలింగనము చేసికొనుట, మఱియు అట్టి స్త్రీలచే శరీరమును మర్దించుకొనుట, ఇవి వాతాధిక్యముగల మదాత్యయరోగమునందు హితకరంబులు.

### పిత్తజమదాత్యయచికిత్స.

పిత్తోల్బణే బహుజలం శార్కరం మధు వా యుతమ్. ౧౯
రసైర్దాడిమఖర్జూరభవ్యద్రాక్షాపరూషకైః,
సుశీతం ససితాసక్తు యోజ్యం తాదృక్చ పానకమ్. ౨౦
స్వాదువర్గకషాయైర్వా యుక్తం మద్యం సమాక్షికమ్,

పిత్తాధిక్యముతోఁగూడియుండు మదాత్యయరోగమునందు శార్కరమను మద్యములో అధికముగ నుదకముకలిపి దానినిగాని, మాక్షికమనుమద్యములో తేనె తియ్యదానిమ్మపండురసము ఖర్జూరపండు తియ్యద్రాక్షపండు పేరీతపండు వీనిరసములును చేర్చి దానినిగాని, పంచదార, వరిపేలపిండి చేర్చబడినదియు చల్లగనుండునదియునైన పానకమునుగాని, మధురద్రవ్యవర్గములో చెప్పబడియుండు ద్రవ్యములకషాయములలో తేనె మద్యము కలిపి దానినిగాని ఇప్పించవలయును.

### పిత్తజమదాత్యయమునందు పథ్యము.

శాలిషష్టికమశ్నీయాచ్ఛాగైణకపింజలైః. ౨౧
సతీనముద్గామలకపటోలీదాడిమైరపి,

సంబావుధాన్యపు బియ్యముచే సిద్ధమైనయన్నమును లేక 60 దినములకు ఫలించెడు సంబాబియ్యపు అన్నమును కుందేలు మేక దుప్పి కపింజలపక్షి అనువాని మాంసరసములతోఁడను లంకలు పెసలు వీనికట్టులతోఁడను ఉసిరిక పొట్ల దానిమ్మ వీనిరసములతోఁడను భుజింపవలయును.

### తృడ్విదాహయుక్తమదాత్యయచికిత్స.

కఫపిత్తం సముత్క్లిష్టముల్లిఖేత్తృడ్విదాహవాన్. ౨౨

పీత్వాంబు శీతం మద్యం వా భూరీక్షురససంయుతమ్,
ద్రాక్షారసం వా సంసర్గీ తర్పణాది పరంహితః. ౨౩
తథాగ్నిర్దీప్యతే తస్య దోషశేషాన్నపాచనః,

దప్పి విదాహము ఇవిగల మదాత్యయరోగికి శీతోదకమునుగాని, మిక్కుటముగ చెరుకురసము చేర్చిన మద్యమునుగాని, ద్రాక్షపండు రసమునుగాని, పానము చేయించి స్వస్థానమునందుండి చలించియుండు కఫపిత్తములను వమనముచే వెడలింపవలయును. పిదప తృప్తిని గలుగజేయునట్టి పేయ మొదలగువానిని భుజింపజేయవలయును. ఇటులజేసిన వారోగికి దోషశేషమును అన్నమును పాకముజేయునట్టి జాఠరాగ్ని దీపనమునొందును.

రక్తనిష్ఠీవాదియుక్త మదాత్యయచికిత్స.

కాసే సరక్తనిష్ఠీవే పార్శ్వస్తనరుజాసు చ. ౨౪
తృష్ణాయాం సవిదాహాయాం సోత్ల్కేశే హృదయోరసి,
గుడూచీభద్రముస్తానాం పటోలస్యాథవా రసమ్. ౨౫
సశృంగబేరం యుంజీత తిత్తిరిప్రతిభోజనమ్,

మదాత్యయరోగమున రక్తమునుమియునట్టి కాసము పార్శ్వములు స్తనములు వీనియందునొప్పి విదాహముతోగూడినదప్పి హృదయము ఱొమ్ము వీనియందు దోషవృద్ధి కలిగియుండినచో తిప్పతీగె భద్రముస్తలు వీనిరసమునుగాని చేదుపొట్ల రసమునుగాని శుంఠిచూర్ణముతోడ నిప్పించి కౌంజు తిత్తిరిపక్షి మాంసముతోడ నన్నము నిప్పించవలయును.

దప్పిగలమదాత్యయరోగికి ద్రాక్షారసపానము.

తృష్యతే చాతిబలవద్వాతపిత్తే సముద్ధతే. ౨౬
దద్యాద్ద్రాక్షారసం పానం శీతం దోషానులోమనమ్,
జీర్ణేఽద్యాన్మధురామ్లేన ఛాగమాంసరసేన వా. ౨౭

మిక్కిలి దప్పిగల మదాత్యయరోగికి వాతపిత్తములు విశేషముగ ప్రకోపించియుండినయెడల చల్లగను వాతాదిదోషముల కనులోమగతిని గలుగజేయునదిగనుండు ద్రాక్షపండురసమును పానముచేయించి యదిజీర్ణమైన పిదప మధురామ్లరసములను చేర్చి పక్వముచేయబడిన మేకమాంసరసముతోడ నన్నము నిప్పించవలయును.

మదాత్యయరోగికి ఉదకపానము.

తృష్యన్నల్పశః పిబేన్మద్యం మేదం రక్షన్ బహూదకమ్,

ముస్తదాడిమలాజాంబుజలం వా పర్ణినీశృతమ్. ౨౮
పటోల్యుత్పలకందైర్వా స్వభావాదేవ వా హిమమ్,

మదాత్యయరోగికి దప్పిగలిగినచో మద్యములో నధికముగ నుదకముకలిపి కొంచెముగ పానముచేయించవలయును. లేక తుంగముస్తలు దానిమ్మపండు వరిపేలాలు వీనిని నానవేసి యా యుదకమునుగాని, కాఉమినుములు పిల్లిపెసర వీనితోడ కాచి చల్లార్చబడిన యుదకమునుగాని, చేదుపొట్ల నల్లకలువ వీనితో కాచి చల్లార్చబడిన యుదకమునుగాని స్వభావముగ చల్లగనుండు నుదకమునుగాని పానముచేయించవలయును.

—— మద్యాతిపాన చికిత్స. ——

మద్యాతిపానాదబ్ధాతౌ క్షీణే తేజసి చోద్ధతే. ౨౯
యశ్శుష్కగళతాల్వోష్ఠో జిహ్వాం నిష్కృష్య చేష్టతే,
పాయయేత్కామతోఽంభస్తం నిశీథపవనాహతమ్. ౩౦

మద్యము నధికముగ పానముచేయుటవలన నుదకధాతువు క్షయించి తేజస్సు వృద్ధిజెంది కుత్తుక, లోదౌడలు, పెదవులు యివి యెండి నాలుకను వెలికి జాచుకొని భూమిపై పొర్లాడుచుండు మదాత్యయరోగికి రాత్రియందు గాలిలోనుంచబడిన యుదకమును యథేష్టముగ పానము చేయించవలయును.

—— మద్యపానజతృష్ణాచికిత్స. ——

కోలదాడిమవృక్షామ్లచుక్రికాచుక్రికారసః,
పంచామ్లకో ముఖాలేపస్సద్యస్తృష్ణాం నియచ్ఛతి. ౩౧

రేగుపండ్లు పుల్లదానిమ్మపండు చింతపండు పులిచింత పులిచెంచలి వీనిని సమభాగములుగ గ్రహించి నూరి ముఖమునకు లేపనముచేసిన మద్యము నధికముగ పానము జేయుటవలన జనించిన దప్పి శీఘ్రముగ శమించును.

—— మద్యజతాపచికిత్స. ——

త్వచం ప్రాప్తశ్చ పానోష్మా పిత్తరక్తాభిమూర్ఛితః,
దాహం ప్రకురుతే ఘోరం తత్రాతిశిశిరో విధిః. ౩౨
అశామ్యతి రసైస్తృప్తే రోహిణీం వ్యథయేత్సిరామ్,

మద్యముయొక్కయుష్ణము చర్మమునాశ్రయించి పిత్తరక్తములతో కలసిదారుణమైన సర్వాంగతాపమును గలుగజేయును. దానియందు శీతోపచారములను విశేషముగ జేయవలయును. అటుల చేసియు తాపము శమింపకుండిన మాంసరసములు తృప్తియగువరకు పానముచేయించి రోహిణియను సిరను వేధింపవలయును.

శ్లేష్మాధికమదాత్యయచికిత్స.

ఉల్లేఖనోపవాసాభ్యాం జయేచ్ఛ్లేష్మోల్బణం పిబేత్. 33
శీతం శుంఠీస్థిరోదీచ్యదుస్పర్శాన్యతమోదకమ్,

శ్లేష్మాధిక్యముతో గూడియుండు మదాత్యయరోగమునందు వమనమును లంఘనమును జేయించి శుంఠి ముయ్యాకుపొన్న కురువేరు తీటకసింద వీనిలో దేనినైనను జలములోవైచి యొకరాత్రి నానబెట్టి యా శీతకషాయమును పానముచేయించవలయును.

కఫజమదాత్యయరోగికి శార్కరాదిమద్యపానము.

నిరామం క్షుధితం కాలే పాయయేద్బహుమాక్షికమ్. 34
శార్కరం మధు వా జీర్ణమరిష్టం శీధుమేవ చ,
రూక్షతర్పణసంయుక్తం యవానీనాగరాన్వితమ్. 35

శ్లేష్మజమదాత్యయరోగికి పైజెప్పిన వమనలంఘనములను జేయించుటవలన అజీర్ణము శమించి ఆకలిగలిగియుండగా యుక్తకాలములో పాతదియైన శార్కరమను మద్యమునుగాని, ద్రాక్షామద్యమునుగాని తేనెతోడ పానముచేయించవలయును. రూక్షమునను తృప్తినిగలుగజేయునదిగనునుండు నోషధులతోగూడినదియు, ఓమము శుంఠి ఈ రెంటిని చేర్చబడినదియునైన అరిష్టమను మద్యమునుగాని, శీధువను మద్యముగాని పానముచేయించవలయును.

కఫజమదాత్యయరోగికి భోజనక్రమము.

యూషేణ యవగోధూమం తనునాఽల్పేన భోజయేత్,
ఉష్ణామ్లకటుతిక్తేన కౌలుత్థేనాల్పసర్పిషా. 36
శుష్కమూలకజైశ్ఛాగైరసైర్వా ధన్వచారిణామ్,
సామ్లవేతసవృక్షామ్లపటోలీవ్యోషదాడిమైః. 37

శ్లేష్మజమదాత్యయరోగమునందు లేటగ వేడిగ కొంచెము నెయ్యిచేర్చబడినదిగ పులుసు కారము చేదుగలరసములు చేర్చబడినదిగనుండు ఉలవకట్టుతోగాని పుల్లప్రబ్బలి చింతపండు సైంధవలవణము పొట్లాకు త్రికటుకములు పుల్లదానిమ్మ వీనితో పక్వము చేయబడిన యెండినముల్లంగిరసముతోగాని మేకమాంసరసముతోగాని జాంగల జంతు మాంసరసముతోగాని గోధూమాన్నమునైనను యవాన్నమునైనను యిప్పించవలయును.

కఫజమదాత్యయరోగికి మాంసోపయోగము.

ప్రభూతశుంఠీమరిచహరితార్ద్రకపేశికమ్,

బీజపూరరసాద్యమ్లం భృష్టం పీరసవర్తితమ్. ౩౮
కరీరకరమర్దాది రోచిష్ణు బహుశాలనమ్,
ప్రవ్యక్తాష్టాంగలవణం వికల్పితనిమర్దకమ్. ౩౯
యథాగ్ని భక్షయన్మాంసం మాధవం నిగదం పిబేత్,

కఫజమదాత్యయరోగముగలవాఁడు శుంఠి మిరియాలు పసుపు అల్లము వీనిఅధికముగ చేర్చబడినదియుం అమ్లముగనుండు మాదీఫలరసము మొదలైనవి చేర్చబడినదియు వెదురుమొలక వాక మొదలగు రుచికరవస్తువులు ఇక చెప్పబడు అష్టాంగలవణము వీనిని చేర్చి వేయించబడినదియునైన మాంసమును జాఠరాగ్ని బలానుగుణముగ భుజించి పాతదిగనుండు మాధవమును మద్యమును పానముచేయవలయును.

## అష్టాంగలవణము.

సితాసౌవర్చలాజాజీతిత్తిడీకామ్లవేతసమ్. ౪౦
త్వగేలామరిచార్ధాంశమష్టాంగలవణం హితమ్,
స్రోతోవిశుధ్యగ్నికరం కఫప్రాయే మదాత్యయే. ౪౧

పంచదార, సౌవర్చలవణము, జీలకఱ్ఱ, చింతపండు, పుల్లప్రబ్బలి, లవంగపట్ట, ఏలకులు యివి సమభాగములు; వీనికన్నిటికి అర్ధ భాగము మిరియాలు, యిటుల వీనినన్నిటిని ఒకటిగచేర్చి చూర్ణముచేసిన నయ్యది అష్టాంగలవణ మనబడును. ఇది స్రోతోమార్గములకు శుద్ధి జాఠరాగ్నికి దీపనముగలుగజేయును. కఫజమదాత్యయరోగమునందు మిగుల హితకరంబుగనుండును.

## కఫాధికమదాత్యయశమనోపచారము.

రూక్షోష్ణోద్వర్తనోద్ధర్షస్నానభోజనలంఘనైః,
సకామాభిస్సహ స్త్రీభిర్యుక్త్యా జాగరణేన చ. ౪౨
మదాత్యయః కఫప్రాయః శీఘ్రం సముపశామ్యతి,

రూక్షముగను ఉష్ణముగను నుండునలుగుపిండిచే శరీరమును రుద్దుకొనుట, స్నానము, భోజనము, లంఘనముచేయుట, కామముగల స్త్రీలను దేశకాలాద్యనుగుణముగ నాలింగము మున్నగుకృత్యములచే రాత్రియందు జాగరణముచేయుట, ఇవి కఫాధిక్యముగల మదాత్యయరోగమును శీఘ్రముగ శమింపజేయును.

## మదాత్యయ సన్నిపాతచికిత్స.

యదిదం కర్మ నిర్దిష్టం పృథగ్దోషబలం ప్రతి. ౪౩

సన్నిపాతే దశవిధే తచ్ఛేషేఽపి వికల్పయేత్,

వాతాదిమదాత్యయరోగములకు ప్రత్యేకప్రత్యేకముగ చెప్పియుండు చికిత్సలను దశవిధసన్నిపాతమదాత్యయములయందు ఆయా దోషబలానుగుణముగ చేయవలయును. ఎట్లనగా—వాతాధిక్యమదాత్యయసన్నిపాతము పిత్తాధిక్యమదాత్యయ సన్నిపాతము వీనికి ప్రత్యేకముగ నే చికిత్సలు చెప్పబడియున్నవో యా చికిత్సలనన్నిటిని వాతపిత్తాధిక్యముగల మదాత్యయ సన్నిపాతమునందు చేయవలయును. ఇటులనే మదాత్యయ సన్నిపాతము లన్నిటియందును ప్రకోపించియుండు వాతాది దోషబలముల కనుగుణముగ చికిత్సలం జేయవలయును. "ఉత్కృష్టేణ యదా త్వేకో మధ్యేన ద్వౌ తదాదిమః, ఉత్కృష్టేణ యదా ద్వౌ తు మధ్యేనైకో ద్వితీయకః. ఏకో మధ్యేన దోషః స్యాద్ద్వావల్పేన తృతీయకః, ఉత్కృష్టేనైక ఏవ స్యాదల్పేన ద్వౌ చతుర్థకః. ఉత్కృష్టేణ యదా ద్వౌ తు అల్పేనైకశ్చ పంచమః,ఏకోఽల్పేన తు మధ్యేన ద్వౌ దోషావితి షష్ఠకః. ఉత్కృష్టైణస్సమస్తాస్స్యు రేవం భవతి సప్తమః, మధ్యేన సర్వేఽపి యదా తదా భవతి చాష్టమః. అల్పేన సర్వేఽపి యదా తదా తు నవమస్స్మృతః, అల్పేనైకో మధ్యేనైక స్తదా త్వంత్య ఇతి స్ఫుటాః.సన్నిపాతస్య మునినా దశభేదాః ప్రకీర్తితాః." వాతము అధికముగ పిత్తశ్లేష్మములు మధ్యమముగనుండు మదాత్యయసన్నిపాతము 1, వాతపిత్తములు అధికముగ శ్లేష్మము మధ్యమముగనుండు మదాత్యయసన్నిపాతము 2, వాతము మధ్యమముగ పిత్తకఫములు అల్పముగనుండు మదాత్యయసన్నిపాతము 3, వాతము అధికముగ పిత్తకఫములు స్వల్పముగనుండు మదాత్యయసన్నిపాతము 4, వాతపిత్తము లధికముగ కఫము స్వల్పముగనుండు మదాత్యయసన్నిపాతము 5, వాతము స్వల్పముగ పిత్తకఫములు మధ్యమముగనుండు మదాత్యయ సన్నిపాతము 6, వాతపిత్తకఫములు మూడును స్వప్రమాణమునకన్న అధికముగనుండు మదాత్యయసన్నిపాతము 7, వాతాది త్రిదోషములును మధ్యమముగనుండు మదాత్యయ సన్నిపాతము 8, వాతాదిత్రిదోషములును స్వల్పముగనుండు మదాత్యయసన్నిపాతము 9, వాతము అల్పముగ పిత్తము మధ్యమముగ కఫము అధికముగనుండు మదాత్యయసన్నిపాతము 10. ఇటుల సన్నిపాతమదాత్యయములు పదివిధములుగనుండునని తంత్రాంతరమునందు చెప్పబడియున్నది.

## మదాత్యయరోగ శమనపానకము.

త్వఙ్నాగపుష్పమగధామరీచాజాజిధాన్యకైః. ౪౮
పరూషకమధూకైలాసురాహ్వైశ్చ సితాన్వితైః,

సకపిత్థరసం హృద్యం పానకం శశిబోధితమ్. ౪౫
మదాత్యయేషు సర్వేషు పేయం రుచ్యగ్నిదీపనమ్,

లవంగపట్ట, నాగకేసరములు, పిప్పళ్లు, మిరియాలు, జీలకఱ్ఱ, దనియాలు, పేశీత, ఇప్పపువ్వు, ఏలకులు, దేవదారుపట్ట, పంచదార, వెలగగుజ్జు, వీనిని సమభాగములుగ చేర్చి చేయబడిన పానకములో పచ్చకర్పూరముకలిపి దానిని మదాత్యయరోగము లన్నిటియందును పానముచేయించవలయును. ఇది రుచిని అగ్నిదీపనమును గలుగ జేయును.

### మదాత్యయమునందు హర్షోత్పాదకచికిత్స.

నావిక్షోభ్య మనో మద్యం శరీరమవిహన్య వా. ౪౬
కుర్యాన్మదాత్యయం తస్మాదిష్యతే హర్షిణీ క్రియా,

మద్యము తొలుత మనస్సుకు వికారమునుగలుగజేసి పిమ్మట శరీరమును చెరచి మదాత్యయరోగమును జనింపజేయును. కావున దానియందు మనస్సుకు సంతోషమును గలుగజేయునట్టి చికిత్సలను తొలుత ముఖ్యముగ జేయవలయును.

### మద్యజరోగమున క్షీరోపయోగము,

సంశుద్ధిశమనాద్యేషు మదదోషః కృతేష్వపి. ౪౭
న చేచ్ఛామ్యేత్కఫే క్షీణే జాతే దౌర్బల్యలాఘవే,
తస్య మద్యవిదగ్ధస్య వాతపిత్తాధికస్య చ. ౪౮
గ్రీష్మోపతప్తస్య తరోర్యథా వర్షం తథా పయః,

వమన విరేచనరూపములైన శోధన శమన చికిత్సలజేసియు మద్యజనితరోగము నివర్తింపకయుండిన నారోగికి కఫము క్షయించిన శరీరమునకు బలహాని లఘుత్వము గలిగి వాతపిత్తము లధికముగ నుండునపుడు "గ్రీష్మకాలపు టెండచే తపింపబడిన వృక్షమునకు వర్షము హితకరముగనుండుమాడ్కి" పాలు హితకరముగనుండును.

మద్యక్షీణస్య హి క్షీణం క్షీరమాశ్వేవ పుష్యతి. ౪౯
ఓజస్తుల్యం గుణైస్సర్వైర్విపరీతం తు మద్యతః,

ఆవుపాలు ఓజస్సువలె గురుత్వాధి దశవిధగుణములతో గూడినదిగ నుండుట వలనను, మద్యమునకు విరుద్ధగుణములు గలదియగుటవలనను, అది యధిక మద్యపానముచే క్షీణించియుండు ఓజస్సును శీఘ్రముగ వృద్ధిజేయును. "స్వాదు శీతం మృదు స్నిగ్ధం బహుళం శ్లక్ష్ణపిచ్ఛిలమ్, గురు మందం ప్రసన్నం చ గవ్యం దశగుణం పయః, తదేవంగుణమే వౌజస్సామాన్యాదభివర్ధయేత్." ఆవుపాలు మధురమ్ముగను, శీతము

గను, మృదువుగను, స్నిగ్ధముగను, జిగటగను, శ్లక్ష్ణముగను, గురుత్వముగలదిగను, మాంద్యకరముగను, ప్రసన్నంబుగను నుండును. ఓజస్సునకు ఆవుపాలకు చెప్పియుండు మాధుర్యాది గుణములు గలిగియుండును. కావున నావుపాలు ఓజస్సును వృద్ధిజేయు నని చరకాచార్యుఁడుగూడ చెప్పియున్నాఁడు. ('వృద్ధిస్సమానైస్సర్వేషాం' అని సూత్రస్థానమునజెప్పినరీతిగ తనకు సమానగుణములు కలయావుపాలచేత ఓజస్సు వృద్ధినొందు నని యభిప్రాయము.

పయసా విజితే రోగే బలే జాతే నివర్తయేత్. ౫౦
క్షీరప్రయోగం మద్యం చ క్రమేణాల్పాల్పమాచరేత్,
న విట్క్షయధ్వంసకోత్థైః స్పృశ్యేతోపద్రవైర్యథా. ౫౧

ఆవుపాలను పానముచేయుటచే మదాత్యయరోగము నివర్తించి శరీరమునకు బలము కలిగినయెడల క్షీరపానమును వర్జింపవలయును. మద్యమును మాత్రము కొంచెము కొంచెముగను క్రమముగను మలక్షయమువలన జనించునట్టి తలనొప్పి మొదలగు నుపద్రవములు ధ్వంసకమువలన జనించునట్టి కఫాధిక్యము మొదలగు నుపద్రవములు ఇవి కలుగకుండునటుల పానము జేయుచుండవలయును.

### మలక్షయధ్వంసకచికిత్స.

తయోస్తు స్యాద్ఘృతం క్షీరం వస్తయో బృంహణాశ్చ వాః,
అభ్యంగోద్వర్తనస్నానమన్నపానం చ వాతజిత్. ౫౨

మదాత్యయరోగికి మలక్షయము ధ్వంసకరోగము యివి జనించినచో ఆవునెయ్యి ఆవుపాలు వీనిని యౌషధముగనిచ్చుటయేగాక శరీరపుష్టికరములగు వస్తికర్మలను చేయవలయును. మఱియు వాతహరములైన అభ్యంగము ఉద్వర్తనము స్నానము అన్నపానములు ఇవి హితకరములుగనుండును.

### సుఖకర మద్యపానయోగములు.

యుక్తమద్యస్య మద్యోత్థో న వ్యాధిరుపజాయతే,
అతోఽస్య వక్ష్యతే యోగో యస్సుఖాయైవ కేవలమ్. ౫౩

మద్యమును యుక్తముగ పానముజేయువానికి మద్యపానమువలన రోగము జనింపనేరదు; కావున మిక్కిలి సుఖమునుగలుగజేయు మద్యపానయోగంబుల నీ తంత్రకారుడిక చెప్పబోవుచున్నాడు.

### మద్యప్రభావము.

ఆశ్వినం యా మహాత్తేజో బలం సారస్వతం చ యా,

దధాత్యైంద్రం చ యా వీర్యం ప్రభావం వైష్ణవం చ యా.
అస్త్రం మకరకేతోర్యా పురుషార్థో బలస్య యా,
సౌత్రామణ్యాం ద్విజముఖే యా హుతాశే చ హూయతే. ౫౫
యా సర్వౌషధిసంపూర్ణాన్మథ్యమానాత్సురాసురైః,
మహోదధేస్సముద్భూతా శ్రీశశాంకామృతైస్సహ. ౫౬
మధుమాధవమైరేయశీధుగౌడాసవాదిభిః,
మదశక్తిమనుజ్ఝంతీ యా రూపైర్బహుభిస్థ్సితా. ౫౭
యామాసాద్య విలాసిన్యో యథార్థం నామ బిభ్రతి,
కులాంగనాఽపి యాం పీత్వా నయత్యుద్ధతమానసా. ౫౮
అనంగాలింగితైరంగైః క్వాపి చేతో మునేరపి,
తరంగభంగభ్రుకుటీతర్జనైర్మానినీ మనః. ౫౯
ఏకం ప్రసాద్య కురుతే యా ద్వయోరపి నిర్వృతిమ్,
యథాకామం భటా వాప్తి పరిహృష్టాప్సరోగణే. ౬౦
తృణవత్పురుషా యుద్ధే యామాసాద్య త్యజన్త్యసూన్,
యాం శీలయిత్వాఽపి చిరం బహుధా బహువిగ్రహామ్. ౬౧
నిత్యం హర్షాతివేగేన తత్పూర్వమివ సేవతే,
శోకోద్వేగారతిభయైర్యాం దృష్ట్వా నాభిభూయతే. ౬౨
గోష్ఠీమహోత్సవోద్యానం న యస్యాశ్శోభతే వినా,
స్మృత్వా స్మృత్వా చ బహుశో వియుక్తశ్శోచతే యయా.
అప్రసన్నాపి యా ప్రీత్యై ప్రసన్నా స్వర్గ ఏవ యా,
అపీంద్రం మన్యతే దుస్థం హృదయస్థితయా యయా. ౬౪
అనిర్దేశ్యసుఖాస్వాదా స్వయం వేద్యైవ యా పరమ్,
ఇతి చిత్రాస్వవస్థాసు ప్రియామనుకరోతి యా. ౬౫
ప్రియాతిప్రియతాం యాతి యత్ప్రియస్య విశేషతః,
యా ప్రీతిర్యా రతిర్యా వాగ్యా పుష్టిరితి చ స్తుతా. ౬౬
దేవదానవగంధర్వయక్షరాక్షసమానుషైః,
పానప్రవృత్తా సత్యాం తాం సురాం తు విధినా పిబేత్. ౬౭

ఏమద్య మశ్వినీదేవతలసంబంధమైన విశేష తేజస్సును, సరస్వతీసంబంధనమైన గొప్ప యుత్సాహమును, ఇంద్రసంబంధమైన గొప్ప శక్తిని, విష్ణుసంబంధమైనయధిక

మాహాత్మ్యమును, ఎల్లపుడు వహింపుచునుండునో; ఏది మన్మథునికి ముఖ్యాయుధము గను, బలరామునికి గొప్ప పురుషార్థముగను, ఉండునో; దేనిని సౌత్రామణి యాగమునందు బ్రాహ్మణముఖమునందును అగ్నియందును హోమము జేయుదురరో; ఏద్ది సకల మహౌషధీసంపూర్ణముగనుండు సముద్రమును దేవాసురులు మథించునపుడందుండి లక్ష్మీ చంద్రుడు అమృతము మొదలగువానితోడ జనించెనో; ఏది మధువు, మాధవము, మైరేయము, శీధువు, గౌడము, ఆసవము, అను అనేకములయిన యాకారములను వహించి మదమును గలుగజేయుచుండునో; దేనిని పానముచేయుటవలన స్త్రీలు విలాసవతులను సార్థకనామంబును వహింపుదురో, కులాంగనలు గూడ దేనిని పానముచేయుటవలన మదించినవారలై మన్మథోద్దీపనముగల యవయవములచే ఋషుల యొక్క మనస్సులనుగూడ చలింపజేయుదురో; ఏది ప్రణయకలహముచే కోపమును జెందియుండు స్త్రీ పురుషులమనస్సు నొక్కటిగజేర్చి మిక్కిలిసౌఖ్యమును గలుగజేయునో; దేనినిపానముచేసి శూరులు గొప్పయుద్ధమున తమప్రాణములనుకూడ తృణమువలె విడుతురో;మధువు మాధవము మొదలగు ననేక విధములుగనుండు నే మద్యమునుభోజనమునకుముందును భోజనమధ్యమునందును భోజనాంతమునందును ప్రతిదినము పానము చేయుచుండినను అపుడపుడు క్రొత్తగా పానముచేయుటవలె మిగుల సంతోషాతిశయముల కలుగజేయునో; దేనిని పానముచేసిన శోకము, భయము, అనుత్సాహము, ఉద్వేగము, కలుగకుండునో; గొప్పయుత్సవము, సభ, ఉద్యానవనము, మొదలగునవి యేదిలేకుండిన శోభింపకుండునో; ప్రతిదినము పానముచేయువాడు ఒక దినము పానము చేయకుండిన దేనిని పలుమారు స్మరింపుచు దుఃఖింపుచుండునో; ఏది కలకబారియుండినను మనుజులకు విశేషప్రీతిని గలుగజేయునో; ప్రసన్నంబుగనుండిన యేది స్వర్గతుల్యంబుగనుండునో; యేది హృదయమునందుండునపుడు మనుజుండు దేవేంద్రునికూడ సరకు చేయకుండునో; ఏది చెప్పుటకలవిగాని సుఖముగలదిగను, తన మనస్సుచే మాత్రము తెలిసికొనదగినదిగను, నానావిధావస్థలయందు నిష్టురాలివలె మహానందమును గలుగజేయునదిగను ఉండునో; మద్యపానమునందాసక్తిగలవాని కేద్ది మిక్కిలి ప్రియముగనుండునో; దేవాసుర గంధర్వ యక్ష రాక్షసమనుష్యులు దేనిని ప్రీతియనియు, రతియనియు, వాక్కు అనియు, పుష్టియనియు, శక్తియనియు, స్తుతింపుదురో; అట్టి సురయనుమద్యమును బుద్ధిమంతుడగు మనుజుడు పానసమయమునందు యుక్తిగా పానము చేయవలయును.

## మద్యమునకు రోగనివర్తకత్వము.

సంభవంతి చ యే రోగాః మేదోఽనిలకఫోద్భవాః,

విధియుక్తాదృతే మద్యాత్తేన సిధ్యంతి దారుణాః. ౬౮

సురయను మద్యమును విధిప్రకారము పానము చేయకుండిన మేదస్సు, వాతము, కఫము, వీనిదోషములవలన జనించు దారుణమైనరోగంబులు నివర్తించ నేరవు. అన గా—సురయనుమద్యమును శాస్త్రోక్తవిధి ననుసరించి పానము చేసిన మేదోవాతకఫముల వలన జనించిన దారుణరోగములు ఆక్షణముననే నివర్తించును.

మద్యమునకు సర్వకాలహితకరత్వము.

అస్తి దేహస్య సావస్థా యస్యాం పానం నివార్యతే,
అన్యత్ర మద్యాన్నిగదాద్వివిధౌషధసంభృతాత్. ౬౯

నానావిధములగు నోషధులతో పక్వము చేయబడినదియు, పాతదియునైన మద్యము సర్వకాలములయందును, శరీరమునకు హితకరముగనుండును.

మద్యమునకు జీర్ణకరత్వము

ఆనూపం జాంగలం మాంసం విధినాప్యుపకల్పితమ్,
మద్యం సహాయమప్రాప్య సమ్యక్పరిణమేత్కథమ్. ౭౦

జాంగలానూపాది జంతువులమాంసములను విధిప్రకారము చక్కగ పాకముజేసి భక్షించినను అవి మద్యసహాయము లేకుండినచో చక్కగ జీర్ణము కానేరదు.

మద్యప్రశంస.

సుతీవ్రమారుతవ్యాధిఘాతినో లశునస్య చ,
మద్యమాంసవియుక్తస్య ప్రయోగస్స్యాత్క్రియాగుణః. ౭౧

వెల్లుల్లి దారుణమైన వాతవ్యాధులను పోగొట్టు శక్తిగలదిగయుండినను మద్య మాంసములను భుజించకయుండువానికి విశేషగుణమును కలుగజేయ నేరదు.

నిగూఢశల్యాహరణే శస్త్రక్షారాగ్నికర్మణి,
పీతమద్యో విషహతే సుఖం వైద్యవికత్థనామ్. ౭౨

మనుజుడు మద్యపానముజేయనిచో శరీరములో గ్రుచ్చుకొనియుండు శల్యమును బైటికితీయుట, శస్త్రకర్మ, క్షారప్రయోగము, అగ్నిదాహము అనువానిని చేయునపుడు వైద్యులచే చేయబడిన దారుణమైన కృత్యములను సహింపనేరడు. కావున మద్యపానము మిక్కిలి హితకరమని భావము.

అనలోత్తేజనం రుచ్యం శోకశ్రమవినోదకమ్,
న చాతఃపరమస్త్యన్య దారోగ్యబలపుష్టికృత్. ౭3

మద్యము జాఠరాగ్నిదీపనమును గలుగజేయును. రుచిని పుట్టించును. శోకమును

శ్రమమును పోఁగడచును. శరీరమునకు ఆరోగ్యబలపుష్టులను గలుగఁజేయునట్టి యౌషధము, కావున మద్యమునకంటె వేఱేదియు లేదు.

రక్షతా జీవితం తస్మాత్ప్రేయమాత్మవతా సదా,
ఆశ్రితోపాశ్రితహితం పరమం ధర్మసాధనమ్. ౨౪

మద్యము పైఁజెప్పిన ఉత్కృష్టగుణములు కలదిగ నుండుటవలన నాయురారోగ్యబలమును కోరువాఁడును బుద్ధిమంతుఁడు నైనమనుజుఁడు ధర్మమునకు ముఖ్యోపాయముగ నుండు మద్యమును విధ్యుక్తప్రకారము పానము చేయవలయును.

మద్యపానవిధి.

స్నాతః ప్రణమ్య సురవిప్రగురూన్యథాస్వం
వృత్తిం విధాయ చ సమస్తపరిగ్రహస్య,
ఆపానభూమిమథ గంధజలాభిషిక్తా
మాహారమండపసమీపగతాం శ్రయేత. ౨౫

స్వాస్తృతేఽథ శయనే కమనీయే మిత్రభృత్యరమణీసముపేతః,
స్వం యశః కథకచారణసంఘైరుద్ధతం నిశమయన్నతిలోకమ్. ౨౬

విలాసినీనాం చ విలాసశోభి గీతం సనృత్యం కలతూర్యఘోషైః,
కాంచీకలాపైశ్చలకింకిణీకైః క్రీడావిహంగైశ్చ కృతానునాదమ్.
మణికనకసముత్థైరావనేయైర్విచిత్రైస్సుజలవివిధలేఖక్షౌమవస్త్రావృతాంగై
అపిమునిజనచిత్తక్షోభసంపాదినీభిశ్చకితహరిణలోలప్రేక్షణీభిః ప్రియాభిః
స్తననితంబకృతాదతిగౌరవాదలసమాకులమీశ్వరసంభ్రమాత్,
ఇతి గతం దధతీభిరసంస్థితం తరుణచిత్తవిలోభనకార్మణమ్. ౨౯

యౌవనాసవమత్తాభిర్విలాసాధిష్ఠితాత్మభిః,
సంచార్యమాణం యుగపత్తన్వంగిభిరితస్తతః. ౩౦

తాళవృంతనళినీదళానిలైశ్శీతలీకృతమతీవ శీతలైః,
దర్శనేఽపి విదధద్వశానుగం స్వాదితం కిముత చిత్తజన్మనః. ౩౧

చూతరసేందుమృగైః కృతవాసం మల్లికయోజ్జ్వలయా చ సనాథమ్,
స్ఫాటికశుక్తిగతం సతిరంగం కాంతమనంగమివోద్వహదంగమ్.
తాలీసాఢ్యం చూర్ణమేలాదికం వా హృద్యం ప్రాశ్యప్రాగ్వయస్థాపనం వా
తత్రాప్యర్థిభ్యోభూమిభాగేసుమృష్టే తోయోన్మిశ్రం దాపయిత్వా తతశ్చ.

ధృతిమాన్ స్మృతిమాన్ నిత్యమనూనాధికమాచరన్,
ఉచితేనోపచారేణ సర్వమేవోపపాదయన్. ౮౭
జితవికసితాసితసరోజనయనసంక్రాంతివర్ధితశ్రీకమ్,
కాంతాముఖమివ సౌరభహృతమధుపగణం పిబేన్మద్యమ్. ౮౮

మనుజుడు స్నానముజేసి; దేవబ్రాహ్మణ గురువులకు నమస్కరించి; నిజపరివార జనములకు తగినటుల ఆహారములనేర్పరచి; పచ్చకర్పూరము వట్టివేరు మొదలగువాసన ద్రవ్యములనుజేర్చి పరిమళముతో గూడియుండు శీతోదకముచే తడపబడినదియు; భోజనశాలకు సమీపమున నుండునదియునైన పానశాలనుజేరి; మృదువుగనుండు పట్టు వస్త్రములు పరచబడి మనోహరమైన శయనమునందాసీనుడై; స్నేహితభృత్యస్త్రీసమేతుండై, వందిబృందంబులచే గానముచేయబడిన తన యశస్సును ఆకర్ణింపుచు మధురమైన తూర్యవాద్యఘోషంబులచేతను, చిన్నగజ్జలతో గూడియుండు ఒడ్డ్యాణ శబ్దము చేతను, లీలార్థముంచబడిన సారసాదిపక్షినాదముచేతను, నృత్యముచేతను, విలాసము చేతను, శోభించుచుండు వనితామణుల సంగీతములను వినుచు; రత్నములు స్వర్ణము మొదలగువానిచే నిర్మింపబడినవియు, విచిత్రవర్ణములు గలవియు, నానావిధ రేఖలు గలవియునైన పట్టువస్త్రములనుధరించినవారును, తపోనిష్ఠాగరిష్ఠులైనమహర్షులమనస్సునందును కామోద్రేకమును గలుగజేయువారును, బెదరిన లేడిపిల్లకండ్లువలె మనోహరమైన చూపుగలవారును, స్తనములు పిరుదులు అనువానిబరువుచే యువజనచిత్తము నాకర్షింపుచు మందముగసంచరించువారును, యౌవనముచేతను మద్యపానముచేతను మదించిన వారును, శృంగార లీలావిలాసములతో వెలయువారును, కృశించిన యంగములుగల వారునైన స్త్రీలచే తేబడినదియు; మిక్కిలి చల్లగనుండు తామరాకుల విసనకఱ్ఱగాలిచే మిక్కిలి చల్లగ చేయబడినదియు, చూచుటచేతనే మనస్సును మన్మథ పరవశముగ జేయునదియు, మామిడిపండురసము పచ్చకర్పూరము కస్తూరి జాజిమొగ్గలు వీనినిచేర్చి పరిమళింపజేయబడినదియు, మన్మథునివలె నుండునదియు, నిర్మలమైన స్ఫటికపాత్రలోనుంచబడినదియు, వికసించియుండు నల్లకలువకు సమానమైన నేత్రములుగల ప్రియురాలిచే సాదరముగ చూడబడుటవలన ప్రకాశించునదియు, అధిక పరిమళముగలదిగ నుండుటవలన తుమ్మెదలతో గూడినదియునైనమద్యమును తొలుత దేవతాదులనుగుఱించి కొంచెముభూమిపైపోసి, మిత్రజనులకిప్పించి వయస్సును యౌవనమును స్థాపించునట్టి తాళీసాదిచూర్ణమునుగాని ఏలాదిచూర్ణమునుగాని భుజించి సంతోషముగలవాడై న్యూనాధిక్యములులేకుండ సమముగ ఉచితోపచారములతో పైమద్యమును పానము చేయవలయును.

పీత్వైవం చషకద్వయం పరిజనం సన్మాన్య సర్వం తతో
గత్వాహారభువం పురస్సుభిషజో భుంజీత భూయోఽత్ర చ,
మాంసాపూపఘృతార్ద్రికాదిహరితైర్యుక్తం ససౌవర్చలై
ర్ద్విస్త్రిర్వా నిశి చాల్పమేవ వనితాసంచాలనార్థం పిబేత్. ౮౬

పై జెప్పిన ప్రకారము మద్యమును రెండు చషకములు పానముచేసి, యా పానశాలలోనుండు దాసీ మొదలగు సర్వపరిజనులను సన్మానించి, భోజనశాలకు పోయి, సమర్థుడగు వైద్యునిముందట సౌవర్చలలవణసహితమగు మాంసము అపూపములు నెయ్యి హరితశాకములు వీనితోడ ఆహారమును చక్కగ భుజింపవలయును. సురతకాలమున స్త్రీలను సంతోషపరచుటకై రాత్రులయందు పై మద్యమును కొంచెము కొంచెముగ రెండు మూడు పర్యాయములు పానముచేయవలయును.

రహసి దయితామంకే కృత్వా భుజాంతరపీడనా
త్పులకితతనుం జాతస్వేదాం సకంపపయోధరామ్,
యది సరభసం శీధూద్గారంన పాయయతే కృతీ
కిమనుభవతి క్లేశప్రాయం తతో గృహతంత్రతామ్. ౮౭

యౌవనవంతురాలైన ప్రియురాలిని యేకాంతప్రదేశములో తన యొడిమీద గూర్చుండబెట్టుకొని, గాఢాలింగనము జేసి, అందువలన శరీరమున గగుర్పాటు చెమట స్తనములయందు కంపము అనునట్టి శృంగారసాత్వికభావములతో గూడియుండు ప్రియురాలికి ఆదరముతో సురయనుమద్యమును పానముచేయించువాడే కడుధన్యుండు. అటుల జేయజాలనివాడు మందభాగ్యుండని జెప్పబడును.

వరతనువక్త్రసంగతిసుగంధితరం సరకం ద్రుతమివ పద్మరాగమణి
మాసవరూపధరమ్, భవతి రతిశ్రమేణ చ మదః పిబతోఽల్ప
మపిక్షయమతనుజమోజసః పరిహరన్స శయీత పరమ్. ౮౮

కరిగించబడిన పద్మరాగమణివలె ప్రకాశించునదియు, ప్రియురాలి వక్త్రసంబంధమువలన సువాసనను జెందినదియునైన ఆసవమనుమద్యమును, యౌవనపురుషుడు సురతముచే శ్రమను జెందియుండునపుడు స్వల్పముగ పానముచేసి కొంతసేపు పరుండియుండినయెడల ఓజస్సు క్షయించక మదము వృద్ధిజెంది మరల స్త్రీసంభోగమునందు పటుత్వము గలుగును.

(పైకనినశ్లోకము నర్కుటమనువృత్తము. ఇది పదునేడవఛందంబగునత్యష్టియందు ఏబదియారువేల యిన్నూటముప్పదితొమ్మిదవవృత్తము. ఇందు ప్రతిపాదము

నకును న, జ, భ, జ, జ, గణంబులును ఒకలఘువును గురువును ఉండవలెను. పైశ్లోకమున మూడుపాదములు పైలక్షణమున నొప్పిదమైయున్నది. గాని నాల్గవపాదము ఈలక్షణమునకు విరుద్ధముగనున్నది. గణవ్యత్యాసమేకాక రెండక్షరము లధికముగనున్నది. సర్వాంగసుందరమున పైచెప్పినకుర్కుట వృత్తలక్షణమునుమాత్రము జూపి పైకనబరిచిన వైలక్షణ్యమును జూపలేదు. శ్లోకానుపూర్వి మాత్రము వ్యాఖ్యానమున గనబడుచున్నది.)

ఇత్థం యుక్త్యా పిబన్మద్యం న త్రివర్గాద్విహీయతే,
అసారసంసారసుఖం పరమేవాధిగచ్ఛతి. ౪౯
ఐశ్వర్యస్యోపభోగోఽయం స్పృహణీయస్సురైరపి,

పై చెప్పినప్రకారము యుక్తిచే సురయనుమద్యమును పానముజేయు మనుజునికి ధర్మార్థకామములనెడి త్రివర్గఫలము సిద్ధించును. మఱియు నైశ్వర్యము కలిగియుండిన సారములేని సంసారమునందు మద్యపానసుఖమే పరమసుఖము. ఇట్టియైశ్వర్యానుభవము దేవతలచేగూడ ప్రార్థింపతగినది.

అన్యథా హి విపత్సు స్యాత్పశ్చాత్తాపేంధనం ధనమ్. ౫౦
ఉపభోగేన రహితోఽభోగవానితి నింద్యతే,
నిర్మితోఽతికదర్యోఽయం విధినా నిధిపాలకః ౫౧
తస్మాద్వ్యవస్థయా పానం పానస్య సతతం హితమ్,
జిత్వా విషయలుబ్ధానామింద్రియాణాం స్వతంత్రతామ్. ౫౨

ధనవంతుడుగనుండు మనుజుడు పైచెప్పినప్రకారము మద్యపానసుఖము ననుభవించకపోయిన యొకానొకపుడు దైవవశంబున నాపత్తుకలిగినచో విశేష ధనముండియు సుఖము ననుభవించకపోయితినని మిక్కిలి పశ్చాత్తాపముకలుగుటయేగాక జనులుకూడవానింజూచి బ్రహ్మరక్షస్సువలె సిధినిగాపాడుటకు విధిచేసృజింపబడినవాడుగాని యతిలుబ్ధుడుగనుండు వీడు ధనముండియు సుఖానుభవములేనివాడని నిందింతురు. కావున బుద్ధిమంతుడు విషయేచ్ఛగల యింద్రియములను జయించి యుక్తిచే విధిప్రకారము మద్యపానముచేసిన హితముకలుగును.

విధిర్వసుమతామేష భవిష్యద్వసవస్తు యే,
యథోపపత్తి తైర్మద్యం పాతవ్యం మాత్రయా హితమ్. ౫౩

పైమద్యపానక్రమము ధనవంతులనుగుఱించి చెప్పబడియె. స్వల్పధనము గల

వారును తమధనమునకును శక్తికిని అనుగుణముగ స్వల్పముగ మద్యమును పానముచేసిన నాయుంరారోగ్యసుఖమును జెందుదురు.

## మద్యపానహీన మిథ్యాదియోగములు.

యావద్దృష్టేర్న సంభ్రాంతిర్యావన్న క్షోభతే మనః,
తావదేవ విరంతవ్యం మద్యాదాత్మవతా సదా. ౯౪

కండ్లుతిరుగుట, మనోవికారముకలుగుట, అనునవి జనించుటకుమును పే బుద్ధిమంతుడు మద్యపానమునువర్జింపవలయును. ఇదియ మద్యపానమునందు సమయోగము. మనోవికారము జనించిన పిదప మద్యపానముచేయుట అతియోగము. తక్కువగ పానముచేసిన నది హీనయోగము. కాలదేశదోషప్రకృత్యాదులకు విరుద్ధముగ పానముచేసిననది మిథ్యాయోగము. ఇవి అనేకరోగములకు కారణములుగ నుండును.

## వాతాధిక్యముగలవానికి మద్యపానక్రమము.

అభ్యంగోద్వర్తనస్నానవాసధూపానులేపనైః,
స్నిగ్ధోష్ణైర్భావితశ్చాన్నైః పానం వాతోత్తరః పిబేత్. ౯౫

వాతాధిక్యముగల మనుజుడు అభ్యంగముచేసికొనుట, నలుగుపెట్టుకొనుట, స్నానముచేయుట, వాసనగలధూపము నాఘ్రాణించుట, చందనాదుల నలదికొనుట, స్నిగ్ధోష్ణముగనుండు నాహారమును భుజించుట, వీనిని జేసి పిదప మద్యమును త్రాగవలయును.

## పిత్తాధిక్యముగలవానికి మద్యపానక్రమము.

శీతోపచారైర్వివిధైర్మధురస్నిగ్ధశీతలైః,
పైత్తికో భావితశ్చాన్నైః పిబేన్మద్యం న సీదతి. ౯౬

పిత్తాధిక్యముగలవాడు చందనానులేపనము మొదలగు నానావిధములైన శీతోపచారములుచేసుకొని మధురముగను స్నేహయుక్తముగను శీతలముగనునుండు భోజనముతోడ మద్యమును త్రాగవలయును.

## కఫాధిక్యముగలవానికి మద్యపానక్రమము.

ఉపచారైరశిశిరైర్యవగోధూమభుక్పిబేత్,
శ్లైష్మికో జాంగలైర్మాంసైర్మద్యం మరిచకైస్సహ. ౯౭

శ్లేష్మాధిక్యముగలవాడు ఉష్ణమైన యుపచారముల జేసికొని, యవలు గోధుమలు వీటియన్నమును భుజించి, మిరియాలతో పక్వముచేయబడిన జాంగలదేశజంతుమాంసముతోడ మద్యమును త్రాగవలయును.

### వాతాదిదోషములయందు హితకరమద్యములు.

తత్ర వాతే హితం మద్యం ప్రాయః పైష్టికగౌడికమ్,
పిత్తే సాంభో మధు కఫే మార్ద్వీకారిష్టమాధవమ్. ౯౮

వాతాధిక్యముగలవాడు పైష్టికము గౌడికము అనుమద్యములను పిత్తాధిక్యము గలవాడు ఉదకము తేనె కలిపినమద్యమును కఫాధిక్యముగలవాడు మార్ద్వీకము అరిష్టము మాధవము అను మద్యములను త్రాగవలయును.

### వాతాదిదోషముగలవారికి మద్యపానకాలము.

ప్రాక్పిబేచ్ఛ్లైష్మికో మద్యం భుక్తస్యోపరి పైత్తికః,
వాతికస్తు పిబేన్మధ్యే సమదోషో యథేచ్ఛయా. ౯౯

శ్లేష్మాధిక్యముగలవాడు భోజనాత్పూర్వమును, పిత్తాధిక్యముగలవాడుభోజనానంతరంబును, వాతాధిక్యముగలవాడు భోజనమధ్యకాలముననను, మద్యమును త్రాగవలయు. వాతాదిత్రిదోషములు సమముగనుండువాడు భోజనమునకు పూర్వముగాని మధ్యమునందుగాని అంతమునందుగాని తన యిష్టానుసారముగ మద్యపానము చేయం దగును.

### మద్యజనితమదములయందు వాతపిత్తహరచికిత్స.

మదేషు వాతపిత్తఘ్నం ప్రాయో మూర్ఛాసు చేష్యతే,
సర్వత్రాపి విశేషేణ పిత్తమేవోపలక్షయేత్. ౧౦౦

మదము మూర్ఛ వీనియందు తఱుచుగ వాతపిత్తహరచికిత్సలను జేయవలయును. మద్యపానమువలన జనించిన మదము మూర్ఛ వీనియందు పిత్తమొకటియే మిక్కుటముగ ప్రకోపించియుండునని తెలిసికొనవలయును.

### మద్యజనిత మదమూర్ఛలయందు చికిత్స.

శీతాః ప్రదేహా మణయః సేకా వ్యజనమారుతాః,
సితాద్రాక్షేక్షుఖర్జూరకాశ్మర్యస్వరసాః పయః. ౧౦౧
సిద్ధం మధురవర్గేణ రసా యూషాస్సదాడిమాః,
షష్టికాశ్శాలయో రక్తా యవాస్సర్పిశ్చ జీవనమ్. ౧౦౨
కల్యాణకం మహాతిక్తం షట్పలం పయసాగ్నికః,
పిప్పల్యో వా శిలాహ్వాం వా రసాయనవిధానతః. ౧౦౩
త్రిఫలా వా ప్రయోక్తవ్యా సఘృతక్షౌద్రశర్కరా,

మదము మూర్ఛ ఈరెంటియందును శీతలమైనలేపములు, పద్మరాగాదిమణులు,

శీతోదకముచే సేకము, విసనకఱ్ఱగాలి, పంచదార, ద్రాక్ష, చెరుకు, ఖర్జూరపండు, గుమ్ముడు వీనిరసములు, ద్రాక్షమొదలగు మధురవర్గద్రవ్యములతో కాచబడిన ఆవుపాలు, మాంసరసము, పుల్లదానిమ్మపండుతో పక్వముచేయబడినపప్పుకట్టులు అరువదిదినములకు ఫలించుధాన్యము, యెఱ్ఱసంబావుధాన్యము యవలు, యివి హితకరంబుగ నుండును. మఱియు దీనియందు ఉన్మాద ప్రతిషేధాధ్యాయములో చెప్పబడియుండు కల్యాణక ఘృతము, కుష్ఠచికిత్సితాధ్యాయమునందు చెప్పియుండు మహాతిక్తఘృతము రాజ యక్ష్మచికిత్సితాధ్యాయములో చెప్పబడియుండు షట్పలఘృతము, వీని నిప్పించవల యును. ఆవుపాలతోడ చిత్రమూలమునుగాని, పిప్పళ్ళనుగాని, శిలాజిత్తునుగాని, రసా యనాధ్యాయములో చెప్పియుండు విధిప్రకార మిప్పించవలయు. లేక నెయ్యి తేనె పంచదార వీనితోడ త్రిఫలముల నిప్పించవలయును.

మద్యవేగ శమనోపాయము.

ప్రసక్తవేగేషు హితం ముఖనాసావరోధనమ్. ౧౦౪
పిబేద్వా మానుషీక్షీరం తేన దద్యాచ్చ నావనమ్,
మృణాళబిసకృష్ణా వా లిహ్యాత్క్షౌద్రేణ సాభయాః. ౧౦౫
దురాలభాం వా ముస్తాం వా శీతేన సలిలేన వా,
పిబేన్మరిచకోలాస్థిమజ్జోశీరాతికేసరమ్. ౧౦౬
ధాత్రీఫలరసే సిద్ధం పథ్యాక్వాథేన వా ఘృతమ్,

మద్యము నధికముగ త్రాగుటచే మదము మూర్ఛ యివి మిక్కిలి యధికముగ నుండిన చేతులచే నోరును ముక్కును అడ్డగింపవలయును; లేక చనుపాలను పానము చేయించవలయును; లేక చనుపాలచే నస్యము చేయించవలయును; లేక తామరతూడు తామరగడ్డ పిప్పళ్లు అనువానిని నూరి అందులో కరక్కాయచూర్ణము తేనెకలిపి పానము చేయించవలయును; లేక తీటకసిందనుగాని తుంగముస్తలనుగానినూరి అందులో తేనెకలిపి నాకించవలయును; లేక మిరియాలు రేగువిత్తులు రేగుగుజ్జు వట్టివేరు నాగ కేసరములు వీనిని సమభాగములుగ గ్రహించి శీతోదకముతో నూరి పానము చేయించ వలయును; లేక ఉసిరికపండురసములోగాని కరక్కాయ కషాయములోగాని పక్వము చేయబడిన ఘృతమును పానము జేయించవలయును.

కుర్యాత్క్రియాం యథోక్తాం చ యథాదోషబలోదయమ్.

మదము మూర్ఛ వీనియందు ప్రకోపించియుండు వాతాది దోషబలానుగుణ ముగ పైని చెప్పినచికిత్సలను జేయవలయును.

మదాత్యయరోగమునందు పంచకర్మలు.

పంచకర్మాణి చేష్టాని సేచనం శోణితస్య చ,
సత్త్వస్యాలంబనం జ్ఞానమగృద్ధిర్విషయేషు చ ౧౦౮

మద్యపానజనితమదమూర్ఛానికారములయందు వమనము విరేచనము ఆస్థాపనము, అనువాసనవస్తి, నస్యము, రక్తమోక్షణము అను నీపంచకర్మల చేయవలయును. మఱియు ధైర్యమవలంబించునటుల చేయుట, పృథివ్యాది పంచతన్మాత్రలు మనస్సు బుద్ధి అహంకారము జీవుడు అనువానిస్వరూపజ్ఞానమును బోధించుట, శబ్దాది విషయములయందు ఇచ్ఛ లేకుండునటుల జేయుట ఇవి హితకరంబులగును.

ప్రవృద్ధ మదచికిత్స.

మదేష్వతిప్రవృద్ధేషు మూర్ఛాయేషు చ యోజయేత్,
తీక్ష్ణం సన్న్యాసవిహితం విషఘ్నం విషజేషు చ. ౧౦౯

మదము మూర్ఛ యివి మిక్కుటముగ వృద్ధిజెంది యుండినయెడల నికసన్న్యాసరోగమునకు చెప్పబోవు తీక్ష్ణనస్యాదులను ప్రయోగించవలయును. విషసంబంధమువలన జనించిన మదమునందు విషహారచికిత్సలను జేయవలయును.

సన్న్యాసరోగచికిత్స.

ఆశు ప్రయోజ్యం సన్న్యాసే సుతీక్ష్ణం నస్యమంజనమ్,
ధూమప్రధమనం తోదసూచీభిశ్చ నఖాంతరే. ౧౧౦
కేశానాం లుంఛనం దాహో దంశో దశనవృశ్చికైః,
కట్వమ్లగాలనం వక్త్రే కపికచ్ఛ్వవఘర్షణమ్. ౧౧౧
ఉత్థితో లబ్ధసంజ్ఞశ్చ లశునస్వరసం పిబేత్,
ఖాదేత్సవ్యోషలవణం బీజపూరకకేసరమ్. ౧౧౨
లఘ్వన్నం కటుతీక్ష్ణోష్ణమద్యాత్స్రోతోవిశుద్ధయే,

సన్న్యాసరోగమునందు తీక్ష్ణమైన నస్యము, తీక్ష్ణమైనయంజనము, ధూమప్రధమనము, సూదులచే శరీరమును పొడుచుట, వెండ్రుకలను పెరుకుట, అవయవమును నిప్పుచే కాల్చుట, పండ్లచే గొఱుకుట, తేలునుకరిపించుట, నోటియందును గోళ్ళలోభాగమునందును కారముగనుండు మిరియాలు మొదలగువానిరసములు పుల్లగనుండు మాదీఫలము మొదలగువానిరసములు పోయుట, శరీరమున దురదగొండియాకును రాచుట, ఈచికిత్సలను జేయవలయును. ఇటుల చేయుటవలన ఆ రోగికి ప్రజ్ఞవచ్చును.

పిదప వెల్లుల్లిస్వరసము పానముచేయించవలయును. మాదీఫల కేసరములలో త్రికటుక చూర్ణము సైంధవలవణము కలిపి దానిని భక్షింపజేయవలయును. స్రోతోమార్గము శుద్ధమటకై కారముగను తీక్ష్ణోష్ణముగనునుండు అన్నమును కొంచముగ భుజింపజేయవలయును.

మదమూర్ఛాహరోపచారములు.

విస్మాపనైస్సంస్మరణైః ప్రియశ్రవణదర్శనైః ౧౧౩
పటుభిర్గీతవాదిత్రశబ్దైర్వ్యాయామశీలనైః,

స్రంసనోల్లేఖనైర్ధూమైశ్శోణితస్యావసేచనైః. ౧౧౪
ఉపాచరేత్తం ప్రతత మనుబంధభయాత్పునః,

తస్య సంరక్షితవ్యం చ మనః ప్రళయహేతుతః. ౧౧౫

మదమూర్ఛారోగికి ఆశ్చర్యకరములైన విషయములను జ్ఞాపకపరచుట, మనోహరవస్తువులను చూపించుట, మనోహరమైన సంగీతవాద్యశబ్దములను, యిష్టమైన కథాదులను వినిపించుట, సంచారముచేయించుట, వమనవిరేచన ధూమపాన రక్తమోక్షణముల చేయించుట, అనునీయుపచారములను చేయుచుండవలయును. మఱియు ప్రజ్ఞాభంగము కాకుండునటుల కడుప్రయత్నముతో మనస్సును రక్షింపుచుండవలయును.

సప్తమాధ్యాయము ముగిసెను



# అష్టమాధ్యాయము.



అవ: "మదమానరోషతోష ప్రభృతిభిరరిభిర్నిజైః పరిష్వంగః,
అరివత్ప్రాణినోమాంసకీలకా విశసంతి యత్."

యుక్తిరహితముగ మద్యమును పానముచేయుటవలన మదము మానము కోపము మొదలగు సహజశత్రువులు జనించుననియు, శత్రువులవలె ప్రాణులను జంపుట వలన అర్శస్సని పేరుగలిగినదనియు చెప్పియుండుటచే మదాత్యయచికిత్సితాధ్యాయ నిరూపణానంతరము అర్శశ్చికిత్సితాధ్యాయము చెప్పబడుచున్నయది.

## అర్శశ్చికిత్సితాధ్యాయప్రారంభము.

సూ. అథాతోఽర్శసాం చికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహు రాత్రేయాదయో మహర్షయః.

మదాత్యయ చికిత్సితాధ్యాయ నిరూపణానంతరము అర్శోరోగ చికిత్సలను తెలియపరచునట్టి అర్శశ్చికిత్సితమను నీయధ్యాయమును వివరించెదము. అర్శస్సు అనగా—మూలరోగము.

(అర్శస్సు అనుదానియన్వర్థత మున్నగువిషయములు నిదానస్థానమున నర్శో నిదానమున వివరింపబడియె.)

## అర్శోరోగచికిత్సాక్రమము.

కాలే సాధారణే వ్యభ్రే నాతిదుర్బలమర్శసమ్,
విశుద్ధకోష్ఠం లఘ్వల్పమనులోమనమాశితమ్. ౧
శుచిం కృతస్వస్త్యయనం ముక్తవిణ్మూత్రమవ్యథమ్,
శయనే ఫలకే వాన్యనరోత్సంగే వ్యపాశ్రితమ్. ౨
పూర్వేణ కాయేనోత్తానం ప్రత్యాదిత్యగుదం సమమ్,
సమున్నతకటీదేశమథ యంత్రణవాససా. ౩
సక్థ్నోశ్శిరోధరాయాం చ పరిక్షిప్తమృజుస్థితమ్,
ఆలంబితం పరిచరైస్సర్పిషాభ్యక్తపాయవే ౪
తతోఽస్మై సర్పిషాభ్యక్తం నిదధ్యాదృజుయంత్రకం,
శనైరనుముఖం పాయౌ తతో దృష్ట్వా ప్రవాహణాత్. ౫

యంత్రేఽప్రవిష్టం దుర్నామస్రోతగుంఠితయానుచ,
శలాకయోత్పీడ్య భిషగ్యథోక్తవిధినా దహేత్. ౬
క్షారేణైవార్ద్రిమితరత్ క్షారేణ జ్వలనేన వా,
మహాద్వా బలినశ్ఛిత్వా వీతయంత్రమథాతురమ్. ౭
స్వభ్యక్తపాయుజఘనమవగాహే నిధాపయేత్,
నిర్వాతమందిరస్థస్య తతోఽస్యాచారమాదిశేత్. ౮
ఏకైకమితి సప్తాహాత్సప్తాహాత్సముపాచరేత్,

వైద్యుడు సమశీతోష్ణమైన శరత్కాల వసంతకాలములలో నాకసము మేఘరహితంబుగ నుండునపుడు, కొంచెము బలవంతుడును, వమనవిరేచనంబులు చేయించుకొని పరిశుద్ధతనొందినకోష్ఠముగలవాడును, మలమూత్రోత్సర్జనముల జేసినవాడును, వాతపురీషముల కనులోమగతిని జేయునదిగను లఘువుగనుండు ఆహారములను స్వల్పముగ భుజించినవాడును, అర్శోరోగముతప్ప యితరరోగములేనివాడును, దేవబ్రాహ్మణాశీర్వాదములను పొందినవాడును నైన అర్శోరోగిని, మంచమునందుగాని మంచి బల్లమీదగాని మనుజుని అంకతలంబునగాని పూర్వశరీరము పైకెత్తబడియుండునట్లును, సూర్యాభిముఖముగ గుదము నుంచబడినట్లును, నడుము పైకెత్తబడియుండునటులను, వెల్లకిల పరుండబెట్టి తొడలు మెడ వీనిని మృదువైన వస్త్రఖండముచే గట్టి, వానిని వంకరగనుండకుండునటులను కదలకుండునటులను పరిచారకులచే బట్టుకొనునటులం జేసి, యారోగియొక్క గుదద్వారములో నేతనిబూసి, నేతితో తడపబడినయంత్రమును గుదములో నర్శోంకురమునకు సరిగా మెల్లగ ప్రవేశింపజేసి, యంత్రమునందర్శోంకురము తగులుకొని యుండుటను తెలిసికొని, గుడ్డపేలికలతో చుట్టబడిన శలాకచే నాయర్శస్సు పైకివచ్చునట్లు అదిమి పట్టి అది తడిగానుండినచో క్షారముచే దహింపవలయును. ఎండియుండినచో క్షారముచేతగాని, అగ్నిచేతగాని, సూత్రస్థానములో చెప్పియుండు విధిప్రకారము దహింపవలయును. మఱియు అర్శస్సు పెద్దదిగనుండి రోగి బలిష్ఠుడైనచో నాయర్శస్సును శస్త్రముచే ఛేదించి క్షారముచేతగాని, అగ్నిచేతగాని, దహించవలయును. పిదప యంత్రమును తీసివేసి, గుదము జఘనము అనువానికి నేతిని చక్కగపూసి, గాలిలేని ప్రదేశమునందు రోగిని అవగాహమునందు (గాడియందు) కూర్చుండునటుల జేసి, "ఉష్ణోదకోపచారీ స్యాత్" అను సూత్రస్థానములో చెప్పబడియుండు ఉపచారములను జేయించవలయును. ఇటులనే యొక్కొక్కయర్శోంకురమును 7 దినముల కొకపర్యాయము చికిత్స జేయవలయును. అన్ని అర్శోం

కురములకొకేకాలములో చికిత్సంజేయజనదు. "అథ ఖలు బలవంతమర్శోభిరుపద్రుతం యథార్హ స్నేహోపస్నిగ్ధ స్విన్నమాభుక్తవంతం సమే శుచౌ వివిక్తే దేశే సాధారణే వ్యభ్రే కాలే సమే ఫలకే శయ్యాయాం వా ప్రత్యాదిత్యగుదమన్యస్యోత్సంగే నిష ణ్ణపూర్వకాయమున్నతకటికం యంత్రణశాటకేన పరిక్షిప్యగ్రీవాసక్థిసంధిదేశమలజ్జా హైరాప్తపరిచారకై స్సుపరిగృహీతం కృత్వా తతోఽస్తైఘృతాభ్యక్తం యంత్రకం నిదధ్యాత్." అని పై యర్థమే అష్టాంగసంగ్రహమునందును చెప్పబడియున్నది.

## అనేకార్శోంకురచికిత్సాక్రమము.

ప్రాగ్దక్షిణం తతో వామమర్శః పృష్ఠాగ్రజం తతః. ౯
బహ్వర్శసః

అనేకార్శోంకురములుగలరోగికి తొలుత కుడిప్రక్కనుండు అర్శస్సులను, పిదప నెడమప్రక్కనుండు అర్శస్సులను, తదనంతరము, పృష్ఠాగ్రమునందుండు అర్శస్సులను, చికిత్స చేయవలెను.

## సుదగ్ధార్శోలక్షణము.

సుదగ్ధస్య స్యాద్వాయోరనులోమతా,
రుచిరన్నేఽగ్నిపటుతా స్వాస్థ్యం వర్ణబలోదయః. ౧౦

అర్శోరోగికి అర్శోంకురములుక్షారాదులచే చక్కగదహింపబడినచో వాతమున కనులోమగతి అన్నమునందిచ్ఛ జాఠరాగ్నిదీపనము సౌఖ్యము బలము వర్ణము ఇవి కలుగును.

## వస్తిశూలహరలేపము.

వస్తిశూలే త్వధోనాభేర్లేపయేచ్ఛ్లక్ష్ణకల్కితైః,
వర్షాభూకుష్ఠసురభిమిసిలోహామరాహ్వయైః. ౧౧

అర్శోరోగికి పొత్తికడుపునందు శూల జనించిన గలిజేరు, చెంగల్వకోష్ఠు, కడిమి, సదాప, అగరు, దేవదారు, వీనిని సమభాగములుగ గ్రహించి చక్కగనూరి దానిని నాభికిక్రింద పట్టువేయవలయును.

## అర్శోరోగికి మలమూత్రప్రతిబంధచికిత్స.

శకృన్మూత్రప్రతీఘాతే పరిషేకావగాహయోః,
వరుణాలంబుసైరండగోకంటకపునర్నవైః. ౧౨
సుషవీసురభీభ్యాం చ క్వాథముష్ణం ప్రయోజయేత్,
సస్నేహమథ వా క్షీరం తైలం వా వాతనాశనమ్. ౧౩
యుంజీతాన్నం శకృద్భేది స్నేహాన్వాతఘ్నదీపనాన్,

అర్శోరోగికి మలమూత్రప్రతిబంధము గలిగియుండిన ఉలిమిడి, బోదతరము, ఆముదపుచెట్టు, పల్లేరు, గలిజేరు, అడవికాకర, అందుగు, అనువానిని సమభాగములుగ గ్రహించి, ఉదకములో వైచి, కషాయముకాచి, అందులో స్నేహమును జేర్చి, సుఖోష్ణముగ పరిషేకావగాహముల జేయించవలయును. లేక వాతహరద్రవ్యములతో కాచబడిన పాలనుగాని, బలాతైలమునుగాని, పరిషేకావగాహములయం దుపయోగించవలయును. మలబంధమును పోగొట్టునట్టి అన్నమును, వాతహరముగ దీపనకారిగనుండు స్నేహముల నిప్పించవలయును.

దాహకర్మానర్హ అర్శోరోగచికిత్స.

అథాప్రయోజ్యదాహస్య నిర్గతాన్ కఫవాతజాన్. ౧౪
సంస్తంభకండూరుక్ఛోభానభ్యజ్య గుదకీలకాన్,
బిల్వమూలాగ్నికక్షారకుష్ఠైస్సిద్ధేన సేచయేత్. ౧౫
తైలేనాహిబిడాలోష్ట్రవరాహావసయాథవా,
స్వేదయేదను పిండేన ద్రవస్వేదేన వా పునః. ౧౬
సక్తునా పిండికాభిర్వా స్నిగ్ధానాం తైలసర్పిషా,
రాస్నాయా హపుషాయా వా పిండైర్వా కార్ష్ణగంధికైః. ౧౭

అర్శోరోగి శస్త్రక్షారాదిదాహకర్మల కనర్హుడుగ నుండినచో కఫవాతమువలన జనించినవియు, వెలికివచ్చియుండునవియు, స్తబ్ధత్వము దురద నొప్పి వాపు అనునుపద్రవములతో గూడినవియునైన అర్శోంకురములకు నూనెను లేపనము జేసి; మారేడువేళ్లు, చిత్రమూలము, సర్జక్షారము, చెంగల్వకోష్ఠు, వీనిని సమముగ జేర్చి కాచిన తైలముచే గాని, పాము పిల్లి ఒంటె పందిఅనుజంతువులయొక్క క్రొవ్వుచేతగాని సేచనముచేయవలయును. (సేచనమనగా—అంకురములమీద తైలమును ధారగాబోయుట) పిదప సూత్రస్థానములో స్వేదవిధ్యధ్యాయమునందు జెప్పబడియుండు పిండస్వేదము ద్రవస్వేదము అనువానిని చేయవలయును. లేక నువ్వులనూనె నెయ్యి వీనినిచేర్చి స్నిగ్ధముగ నుండుసక్తు (పేలపిండి) ఉంటలచేతగాని, దుంపరాస్నచూర్ణపుఉంటల చేతగాని బోడతరచూర్ణపుఉంటలచేతగాని, కారుమునగచూర్ణపు ఉంటలచేతగాని, పిండస్వేదమును చేయించవలయును. "తిలమాషకులుత్థాన్న ఘృతతైలామిషోదనైః, పాయసైః కృసరైర్మాంసైః పిండస్వేదాన్ ప్రయోజయేత్." నువ్వులు ఉద్దులు ఉలవలు అన్నము నెయ్యి నువ్వులనూనె మాంసమిశ్రితముగనుండు అన్నము పాయసము మాంసమిశ్రిత

ముగనుండుకృసరము అనువానిచే పిండస్వేదమును ప్రయోగించవలయునని చరకాచార్యుడు చెప్పియున్నాడు.

### అర్శస్సులకు అర్కమూలాదిధూపము.

అర్కమూలం శమీపత్రం నృకేశాస్సర్పకంచుకమ్,
మార్జారచర్మ సర్పిశ్చ ధూపనం హితమర్శసామ్. ౧౮
తథాశ్వగంధా సురసా బృహతీ పిప్పలీ ఘృతమ్,

జిల్లేడువేళ్లు, జమ్మియాకు, మనుజునితలవెండ్రుకలు, పాముకూసము, పిల్లిచర్మము, నెయ్యి, వీనిచే అర్శస్సులకు ధూపము వేసినను; పెన్నేరుగడ్డ, తులసి, వాకుడు, పిప్పళ్లు, నెయ్యి, వీనిని వేర్వేరుగ అర్శస్సులకు ధూపము వేసినను, హితము కలుగును.

### అర్శోంకురహరవర్తి.

ధాన్యామ్లపిష్టైర్జీమూతబీజైస్సజ్జాలకం మృదు. ౧౯
లేపితం ఛాయయా శుష్కం వర్తిర్గుదజనాశినీ,

డావరడంగివిత్తులను పులికడుగుతో నూరి దానిని ఆ డావరడంగిపండ్లకు పైభాగమునందుండు బెరడునకుబూసి నీడనెండించి వర్తిచేసి దానిని గుదమునందు ప్రవేశింపజేసిన అర్శోంకురములు ఊడును.

### అర్శోంకురమునకు గుంజాదివర్తి.

సజాలమూలజీమూతస్నేహే వా క్షారసంయుతే. ౨౦
గుంజాసూరణకూష్మాండబీజైర్వర్తిస్తథాగుణా,

డావరడంగిపండుయొక్క బెరడు వేళ్లు విత్తులు వీనిని సమభాగములుగ చేర్చి పక్వముచేయబడిన తైలములో సర్జక్షారముకలిపి ధూపము వేసినను, గురిగింజలు కందగడ్డ గుమ్మడువిత్తులు వీనినినూగి వత్తిచేసి గుదములో ప్రయోగించినను, అర్శోంకురములు నశించును.

### అర్శోంకురములకు హరిద్రాది లేపము.

స్నుక్క్షీరార్ద్రనిశా లేపస్తథా గోమూత్రకల్కితైః ౨౧
కృకవాకుశకృత్కృష్ణానిశాగుంజాఫలైస్తథా,

జెముడుపాలలో పసుపును నానవేసి నూరి దానిని లేపనముచేసినను, కోడి విష్ఠము పిప్పళ్లు పసుపు గురిగింజలు వీనిని ఆవుపంచితముతో నూరి లేపనముచేసినను అర్శోంకురములు నశించును.

### అర్శోంకురములకు షడ్గ్రంథాదిలేపము.

స్నుక్క్షీరపిష్టైః షడ్గ్రంథాహాలినీవారణాస్థిభిః. ౨౨
కులీరశృంగివిజయాకుష్ఠారుష్కరతుత్థకైః,
శిగ్రుమూలకజైర్బీజైః పత్రైరశ్వఘ్ననింబజైః. ౨౩
పీలుమూలేన బిల్వేన హింగునా చ సమన్వితైః,

వస, చెన్నచర్లగడ్డ, ఉలిమిడిగుజ్జు, కర్కాటకశృంగి, కరకకాయలు, చెంగల్వకోష్ఠు, జీడివిత్తులు, మైలుతుత్తము, మునగవిత్తులు, ముల్లంగివిత్తులు, గన్నేరాకు, వేపాకు, వీనిని సమభాగములుగ గ్రహించి జెముడుపాలతోనూరి లేపనముజేసినను; పిన్నవరగోగువేళ్లు మారేడుగుజ్జు, ఇంగువ, వీనిని సమభాగములుగచేర్చి నూరి లేపనము చేసినను అర్శోంకురములు శమించును.

### అర్శోంకురములకు శిరీషబీజాదిలేపము.

కుష్ఠం శిరీషబీజాని పిప్పల్యస్సైంధవం గుడః. ౨౪
అర్కక్షీరం సుధాక్షీరం త్రిఫలా చ ప్రలేపనమ్,

చెంగల్వకోష్ఠు దిరిశనపువిత్తులు, పిప్పళ్లు, సైంధవలవణము, బెల్లము, జిల్లేడుపాలు, జెముడుపాలు, కరకతాండ్రయుసిరికలు వీనిని సమభాగములుగనూరి పట్టువేసిన అర్శోంకురములు హరించును.

### అర్శస్సుకు అర్కక్షీరాదిలేపము.

అర్కం పయః స్నుహీ కాండం కటుకాలాబుపల్లవాః. ౨౫
కరంజో బస్తమూత్రం చ లేపనం శ్రేష్ఠమర్శసామ్,

జిల్లేడుపాలు, జెముడుకాడలు, చేదుపుచ్చచిగుళ్లు, క్రానుగు, వీనిని గొఱ్ఱెమూత్రముతోనూరి లేపనముచేసిన అర్శస్సులు శమించును. ఇది అర్శోరోగమునకు శ్రేష్ఠమైన లేపనము.

### అర్శస్సునకు పిప్పల్యాదిలేపము.

అనువాసనికైర్లేపః పిప్పల్యాద్యైశ్చ పూజితః. ౨౬

ఇక అనువాసవస్తిప్రకరణమునందు జెప్పబోయెడు పిప్పళ్లు మొదలగు ద్రవ్యములను నూరి లేపనముజేసిన అర్శస్సులు హరించును.

### అర్శస్సునకు లేపనతైలము.

ఏభిరేవౌషధైః కుర్యాత్తైలాన్యభ్యంజనాని చ,

పైనిచెప్పినలేపనౌషధ ద్రవ్యములను చేర్చి కాచినతైలమును గుదమునకు లేపనము జేసిన అర్శస్సులు శమించును.

అర్శస్సునకు ధూపాదిజగుణము.

ధూపనాలేపనాభ్యంగైః ప్రస్రవంతి గుదాంకురాః. ౨౭
సంచితం దుష్టరుధిరం తతస్సంపద్యతే సుఖీ,

పైచెప్పిన ధూపములు లేపనములు అభ్యంగములు అనువానిని చేయించిన అర్శోంకురములయందు బహుకాలముగ చేరియుండు దుష్టరక్తము స్రవించి రోగికి సౌఖ్యము కలుగును.

అర్శోదుష్టరక్తమోక్షణము.

ఆవర్తమానముచ్చానకఠినేభ్యో హరేదసృక్.. ౨౮
అర్శోభ్యో జలజాశస్త్రసూచీకూర్చైః పునఃపునః,

పెద్దదిగను కఠినముగనునుండు అర్శోంకురములయందుండి స్రవించురక్తమును జలగలు శస్త్రము సూది కూర్చము అనువానిచే పలుమారుబైటికిదీయవలయును.

శీతోష్ణస్నిగ్ధరూక్షాద్యైర్న వ్యాధిరుపశామ్యతి. ౨౯
రక్తే దుష్టే భిషక్తస్మాద్రక్తమేవావసేచయేత్,

శీతలముగను ఉష్ణముగను స్నిగ్ధముగను రూక్షముగనునుండు చికిత్సలవలన అర్శో రోగము శమింపనేరదు, కావున రక్తము దుష్టమైయుండునపుడు పైచెప్పిన ప్రకారము జలగలు మొదలగువానిచే రక్తమోక్షణము చేయవలయును.

అర్శోహరతక్రము.

యో జాతో గోరసః క్షీరాద్వహ్నిచూర్ణావచూర్ణితాత్. ౩౦
పిబంస్తమేవ తేనైవ భుంజానో గుదజాన్ జయేత్,

చిత్రమూలపువేళ్లచూర్ణమును ఆవుపాలలోకలిపి కాచి దానిలోనుండితీయబడిన మజ్జిగను త్రాగుచు ఆ మజ్జిగతోడనే అన్నమును భుజింపుచుండిన గుదములో జనించియుండు అర్శోంకురములు నివర్తించును. ఈ శ్లోకమునందు "వహ్నిచూర్ణావచూర్ణితాత్" అనుస్థలమున "బహుమూలావచూర్ణితాత్" అని కొన్ని గ్రంథములలో కానబడుచున్నది. బహుమూలా అనగా—పిల్లిపీచర.

అర్శస్సునందు కోవిదారచూర్ణము.

కోవిదారస్య మూలానాం మధితేన రజః పిబేత్. ౩౧
అర్శాన్ జీర్ణే చ పథ్యాని ముచ్యతే హతనామభిః,

ఎఱ్ఱకాంచనపు వేళ్లను చూర్ణము చేసి దానిని నీళ్లు చేర్చకయే చిలికిన మజ్జిగలో కలిపి పానముజేసి యది జీర్ణమైన పిదప పథ్యకరమైన యాహారములను భుజించిన అర్శోంకురములు నివర్తించును.

### శూలయుక్తార్శస్సునకు హింగ్వాదిచూర్ణము.

గుదశ్వయథుశూలార్తో మందాగ్నిర్గౌల్మికాన్ పిబేత్. ౩౨
హింగ్వాదీనను తక్రం వా ఖాదేద్గుడహరీతకీమ్.
తక్రేణ వా పిబేత్పథ్యావేల్లాగ్నికుటజత్వచః. ౩౩
కళింగమగధాజ్యోతిస్సూరణాన్వాంశవర్ధితాన్,
కోష్ణాంబునా వా త్రికటు వ్యోషహింగ్వమ్లవేతసమ్. ౩౪

గుదమునందు వాపు శూల ఇవి గలిగియుండువాడును అగ్నిమాంద్యము గలవాడునైన అర్శోరోగికి గుల్మరోగ చికిత్సాధ్యాయమునందు చెప్పబడియుండు హింగ్వాది చూర్ణమును మజ్జిగలో కలిపి పానము చేయించవలయును. లేక గుడహరీతకి నిప్పించి మజ్జిగను అనుపానముగ నిప్పించవలయును. లేక కరక్కాయలు వాయువిడంగములు చిత్రమూలము కొడిసెపట్ట వీని చూర్ణముగాని, కొడిసెవిత్తులు 1 భాగము, పిప్పళ్లు 2 భాగములు, చిత్రమూలము 3 భాగములు, అడవికంద 4 భాగములు వీటినొకచేర్చి చేయబడిన చూర్ణమునుగాని, మజ్జిగలో కలిపి పానము చేయించవలయును. లేక పటుత్రయము అనగా—సైంధవలవణము సౌవర్చలవణము బిడాలవణము శొంఠి పిప్పలి మిరియాలు ఇంగువ పుల్లప్రబ్బలి వీని చూర్ణమును కొంచెముష్ణముగనుండు నుదకములో కలిపి పానము చేయించవలయును.

### అర్శోహరౌషధములు.

యుక్తం బిల్వకపిత్థాభ్యాం మహౌషధబిడేన వా,
అరుష్కరైర్యవాన్యా వా ప్రదద్యాత్తక్రతర్పణమ్. ౩౫
దద్యాద్వా హపుషాహింగుచిత్రకం తక్రసంయుతమ్,
మాసం తక్రానుపానాని ఖాదేత్పీలుఫలాని వా. ౩౬
పిబేదహరహస్తక్రం నిరన్నో వా ప్రకామతః,

తక్రతర్పణములో (అనగా మజ్జిగలో కలపబడిన యవసత్తువు) లో మారేడుగుజ్జు వెలగగుజ్జు వీనినిగాని, శుంఠి బిడాలవణము వీనినిగానిని జీడిగింజల చూర్ణమునుగాని, ఓమమునుగాని, కలిపి యిప్పించవలయును. లేక బోడతరము, ఇంగువ, చిత్రమూలము, వీనిని మజ్జిగలో కలిపి పానము చేయించవలయును. లేక యొకమాసమువరకు గోగు

పండ్లను మజ్జిగయనుపానముతో భక్షింపజేయవలయును; లేక ఆహారము భుజింపకయే యథేష్టముగ ప్రతిదినము మజ్జిగనుమాత్రము పానముచేయవలయును. ఇటుల జేసిన అర్శస్సు నివర్తియగును.

## అర్శోరోగమునందు తక్రపానము.

అత్యర్థం మందకాయాగ్నే స్తక్రమేవావచారయేత్. ౩౮
సప్తాహం వా దశాహం వా మాసార్ధం మాసమేవ వా,
బలకాలవికారజ్ఞో భిషక్తక్రం ప్రయోజయేత్. ౩౯
సాయం వా లాజసక్తూనాం దద్యాత్తక్రావలేహికామ్,
జీర్ణే తక్రే ప్రదద్యాద్వా తక్రపేయాం ససైంధవామ్. ౩౯
తక్రానుపానం సస్నేహం తక్రోదనమతః పరమ్,
యూషైరసైర్వా తక్రాఢ్యైశ్శాలీన్ భుంజీత మాత్రయా. ౪౦

మిక్కుటముగ అగ్నిమాంద్యముగల అర్శోరోగికి సాయంప్రాతఃకాలములయం దన్నములేకయే మజ్జిగను మాత్రము ఇప్పించవలయును. మఱియు దేశము కాలము బలము రోగము వీనిని చక్కగ నెఱింగిన వైద్యుడు అర్శోరోగికి 7 లేక 10 లేక 15 దినముల వరకుగాని, లేక 1 మాసమువరకుగాని, మజ్జిగను పానముచేయించవలయును. రోగి మజ్జిగను మాత్రము పానముచేయుట కశక్తుడుగ నుండినయెడల ప్రాతఃకాలమునందు మజ్జిగను పానముచేయించి, అది జీర్ణమైన పిదప సాయంకాలమునందు వరిపేలపిండిని మజ్జిగలోకలిపి దానినిగాని, మజ్జిగలో పక్వముచేయబడిన గంజినిగాని, సైంధవలవణ సహితముగ నిప్పించవలయును. పిదప మజ్జిగలో నన్నమును యిప్పించి అనుపానముగ మజ్జిగను పానముచేయించవలయును. లేక మజ్జిగ నధికముగ జేర్చి పక్వము చేయబడిన కట్టులు మాంసరసములు వీనితోడ సంబావుబియ్యపు అన్నమును కొంచెముగ భుజింపవలయును.

## అర్శోరోగమునందు త్రివిధతక్రప్రయోగము.

రూక్షమర్ధోద్ధృతస్నేహం యతశ్చానుద్ధృతం ఘృతమ్,
తక్రం దోషాగ్నిబలవత్త్రివిధం తత్ప్రయోజయేత్. ౪౧

రూక్షము అనగా—చిలికి చక్కగ వెన్నతీయబడిన మజ్జిగ, అర్ధోద్ధృత స్నేహమైన (అనగా—చిలికి సగము వెన్నతీయబడిన) మజ్జిగ, అనుద్ధృతఘృతం (అనగా—నీళ్లసంబంధములేకయే చిలికి వెన్నను తియ్యకుండునట్టి) మజ్జిగ, యీ 3 విధములగు మజ్జిగలను దోషాగ్నిబలముల ననుసరించి అర్శోరోగికి నొకపుడు రూక్షముగనుండు

మజ్జిగను మఱియొకప్పుడు అర్ధోద్ధృత స్నేహముగనుండు మజ్జిగను మఱియొకపుడు అనుద్ధృత ఘృతమను మజ్జిగను ఇప్పించవలయును.

### ఆర్శోరోగమున తక్రపానగుణము.

న విరోహంతి గుదజాః పునస్తక్రసమాహతాః,
నిషిక్తం తద్ధి దహతి భూమావపి తృణోలుపమ్. ४२
స్రోతస్సు తక్రశుద్ధేషు రసో ధాతూనుపైతి యః,
తేన పుష్టిర్బలం వర్ణః పరం తుష్టిశ్చ జాయతే. ४3
వాతశ్లేష్మవికారాణాం శతం చ వినివర్తతే,

మజ్జిగను భూమిపై పోసిన యచటనుండు పచ్చిక మొదలగునవి నిశ్శేషముగ నశించి మరల మొలవకుండును. ఇది యనుభవసిద్ధము. అటులనే ప్రతిదినము మజ్జిగను పానముచేయుచుండిన గుదమునందు జనించిన యర్శోంకురములు నశించి మరల జనింపకుండును. మఱియు మజ్జిగను పానముచేయుటవలన వాతశ్లేష్మములచే నడ్డగింపబడియుండు స్రోతోమార్గములు శుద్ధములై యాహారరసము ధాతువులయందు వ్యాపించును. దానిచేత అర్శోరోగికి శరీరమునపుష్టి బలము వర్ణము మిక్కిలి మనస్సంతోషము అనునవి జనించుటయేగాక పలువెరంగులైన వాతశ్లేష్మజరోగములుగూడ నిశ్శేషముగ నివర్తించును.

### అర్శోరోగమున మథితపానము.

మథితం భాజనే క్షుద్రబృహతీఫలలేపితే. ४४
నిశాం పర్యుషితం పేయమిచ్ఛద్భిర్గుదజక్షయమ్,

అర్శోరోగము శమింపవలయుననెడి యిచ్ఛగలవాడు వ్రకుడుపండును నూరి క్రొత్తకుండకులోపల లేపనముజేసి యెండ నెండించి అందులో మథితమనుమజ్జిగను పోసి యొకరాత్రి యునిచి ప్రాతఃకాలమున పానముచేయవలయును.

### అర్శోరోగమునకు తక్రారిష్టము.

ధాన్యోపకుంచికాజాజీహాపుషాపిప్పలీద్వయైః. ४५
కారవీగ్రంథికశఠీయవాన్యగ్నియవానకైః,
చూర్ణితైర్ఘృతపాత్రస్థం నాత్యమ్లం తక్రమాసుతం. ४६
తక్రారిష్టం పిబేజ్జాతం వ్యక్తామ్లకటుకామతః,
దీపనం రోచనం వర్ణ్యం కఫవాతానులోమనమ్. ४७
గుదశ్వయథుకండ్వార్తినాశనం బలవర్ధనమ్,

దనియాలు, నల్లజీలకఱ్ఱ,జీలకఱ్ఱ, బోడతరము, పిప్పళ్లు,ఏనుఁగుపిప్పళ్లు, ఇంగువ, వోడి, కచోరాలు, ఓమము, చిత్రమూలము, కురాసానియోమము, వీనిని ప్రత్యేకము ఒకపలము చొప్పున గ్రహించి చూర్ణముచేసి కొంచెము పుల్లగనుండు నూరుపలముల మజ్జిగలో చేర్చవలయును. పిదప ఆ మజ్జిగను నేలితో మాగినకుండలో బోసి బాగుగ పులియబెట్టిన నది కారముగను పుల్లగనునుండును. దానిని తృప్తియగువరకు పానము చేయించిన అగ్నిదీపనము, రుచి, శరీరవర్ణము, కఫవాతములకనులోమగతి, బలవృద్ధి కలుగును. గుదమున వాపు దురద శూల హరించును. ఇది తక్రారిష్ట మనబడును.

త్వచం చిత్రకమూలస్య పిష్ట్వా కుంభం ప్రలేపయేత్. ౪౯
తక్రం వా దధి వా తత్ర జాతమర్శోహరం పిబేత్,

చిత్రమూలపు వేళ్లపట్టను నీళ్లతోనూరి కుండకు లోభాగమునందు బూసి యెండ నెండించి అందులో మజ్జిగనుగాని పెరుగునుగాని పోసి కొంతసేపు ఆ కుండలో నునిచి పానముచేసిన అర్శోరోగము హరించును.

భార్గ్యాస్ఫోతామృతాపంచకోలేష్వప్యేష సంవిధిః ౪౯

గంటుభారంగి, ఎఱ్ఱకాంచనము, తిప్పతీగె, పంచకోలములు వీని బెరడును నూరి పైజెప్పినరీతిగ కొత్తకుండకు లోపల బూసి యెండ నెండించి అందులో మజ్జిగ బోసి కొంతసేపు ఆ కుండలో నినిచి పానముచేసినను అర్శోరోగము హరించును.

అర్శోరోగికి పేయాదులు.

పిప్పలీగజకణాపాఠాకారవీపంచకోలకైః,
తుంబుర్వజాజీధనికా బిల్వమధ్యైశ్చ కల్పయేత్. ౫౦
ఫలామ్లానర్యమకస్నేహాః పేయాయూషరసాదికాః,
ఏభిరేవౌషధైస్సాధ్యం వారి సర్పిశ్చ దీపనమ్. ౫౧

ఏనుగుపిప్పళ్లు, చిరుబొద్ది, నల్లజీలకఱ్ఱ, పంచకోలములు, తుంబురు, (అనగా— కొతిమెర్లాకు,) జీలకఱ్ఱ, దనియాలు, మారేడుగుజ్జు, వీనిని సమభాగములుగ గ్రహించి నూరి యొక్కటిగ కలిపి పక్వముచేయబడిన పేయ కట్టులు మాంసరసములు మొదలగువానిని పుల్లని దానిమ్మరసము యమకస్నేహము వీనితోడ అర్శోరోగి కిప్పించవలయును. మఱియు పైజెప్పిన ఏనుగుపిప్పళ్లు మొదలగువస్తువులను చేర్చి కాచబడినయుదక క్షీరఘృతముల నిప్పించిన అగ్నిదీపనము కలుగును.

క్రమో ఽయం భిన్నశకృతాం వక్ష్యతే గాఢవర్చసామ్,

పైనచెప్పిన చికిత్సలను మలబంధములేని అర్శోరోగికిమాత్రము చేయించవలయును. మలబంధముగల అర్శోరోగి కిక చెప్పబోయెడు చికిత్సలను జేయవలయును.

### మలబంధముగల అర్శోరోగికి చికిత్స.

స్నేహాఢ్యైస్సక్తుభిర్యుక్తాం లవణాం వారుణీం పిబేత్. ౫౨
లవణా ఏవ వా తక్రశీధుధాన్యామ్లవారుణీః,

నెయ్యి మొదలగు స్నేహములను అధికముగ చేర్చబడినదియు ఉప్పుసక్తువు వీనితోఁగూడినదియునైన వారుణియను మద్యమునుగాని; మజ్జిగ, శీధువను మద్యము, పులికడుగు వారుణియను మద్యము; వీనినిగాని మలబంధముగల అర్శోరోగి కిప్పించవలయును.

### అర్శోరోగికి కరంజపల్లవము.

ప్రాగ్భక్తం యమకే భృష్టాన్ సక్తుభిశ్చావచూర్ణితాన్. ౫౩
కరంజపల్లవాన్ ఖాదేద్వాతవర్చోఽనులోమనాన్,

క్రానుగుచిగుళ్లను యమకస్నేహములోవైచి పాకముజేసి అందులో సక్తువులను కలిపిభక్షించినతోడనే భోజనముచేసిన అపానవాతమలముల కనులోమగతి కలుగును.

### బద్ధమలార్శోరోగికి శుంఠ్యాదియోగము.

సగుడం నాగరం పాఠాం గుడక్షారఘృతాని వా. ౫౩
గోమూత్రాధ్యుషితాం మద్యాత్సగుడాం వా హరీతకీమ్,

మలబంధముగల అర్శోరోగికి శుంఠి, చిరుబొద్ది, బెల్లము, వీనినొకటిగచేర్చిగాని; లేక బెల్లము, యవక్షారము, నెయ్యి, వీనినొకటిగచేర్చిగాని గోమూత్రములో నానబెట్టిన కరక్కాయను బెల్లముతోడగాని యిప్పించవలయును.

### అర్శోరోగమునందు హరీతకీభక్షణము.

పథ్యాశతద్వయాన్మూత్రద్రోణేనామూత్రసంక్షయాత్. ౫౫
పక్వాన్ ఖాదేత్సమధునా ద్వే ద్వే హంతి కఫోద్భవాన్,
దుర్నామకుష్ఠశ్వయథు గుల్మమేహోదరక్రిమీన్. ౫౬
గ్రంథ్యర్బుదాపచీస్థౌల్యపాండురోగాఢ్యమారుతాన్,

ద్రోణప్రమాణముగల గోమూత్రములో రెండువందల కరక్కాయలను వైచి పొయిమీఁదబెట్టి యా గోమూత్రము యింకువరకు పాకము చేసి పూటకు రెండు కరక్కాయలను తేనెతోడ భక్షింపుచుండిన కఫాధిక్యమువలన జనించిన అర్శోరోగము, కుష్ఠువు, వాపు, గుల్మము, ప్రమేహము, ఉదరరోగము, క్రిమిరోగము, గ్రంథి, అర్బుదము, అపచి, స్థౌల్యరోగము, పాండురోగము, ఆఢ్యవాతము, ఇవియన్నియు హరించును.

## అర్శోరోగమునం దజశృంగీకల్కము.

అజశృంగీజటాకల్కమజామూత్రేణ యః పిబేత్. ౫౭
గుడవార్తాకభుక్తస్య నశ్యంత్యాశు గుదాంకురాః,

ఒద్దివేళ్లను మేకమూత్రముతో నూరి మేకమూత్రములో కలిపి పానముచేసి అన్నమును భక్షింపక బెల్లము చేర్చి పాకము చేయబడిన వంకాయలను మాత్రము భక్షించినయెడ అర్శోంకురములు శీఘ్రముగ హరించును.

## అర్శోరోగమునందు త్రివృతాదియోగము.

శ్రేష్ఠారసేన త్రివృతాం పథ్యాం తక్రేణ వా సహ. ౫౮
పథ్యాం వా పిప్పలీయుక్తాం ఘృతభృష్టాం గుడాన్వితామ్,
అథవా సత్రివృద్దంతీం భక్షయేదనులోమనీమ్. ౫౯
హతే గుదాశ్రయే దోషే గుదజా యాంతి సంక్షయమ్,

త్రిఫలకషాయముతో తెల్లతెగడనుగాని, మజ్జిగతో కరక్కాయనుగాని, కరక్కాయను పిప్పళ్లను నేతిలో వేయించిదానిని బెల్లముతోడగాని, కరక్కాయను తెల్లతెగడ దంతి వీనితోడగాని, భక్షించిన వాతాదుల కనులోమగతి కలుగుటయేగాక గుదములోనుండు దోషములు నివర్తించి అర్శోంకురములు నశించును.

## అర్శోరోగమునందు దాడిమతక్రాదిపానము.

దాడిమస్వరసాజాజీయవానీగుడనాగరైః. ౬౦
పాఠయా వా యుతం తక్రం వాతవర్చోనులోమనమ్,
శీధుం వా గౌడమథవా సచిత్రకమహౌషధమ్. ౬౧
పిబేత్సురాం వా హపుషాపాఠాసౌవర్చలాన్వితామ్,

దానిమ్మపండురసము, జీలకఱ్ఱ, ఓమము, బెల్లము, శుంఠి, ఇవిచేర్చబడిన మజ్జిగనుగాని; చిరుబొద్దిచేర్చబడిన మజ్జిగనుగాని, పానముజేసిన అపానవాత మలముల కనులోమగతి కలుగును. లేక శీధువను మద్యమునుగాని, గౌడమను మద్యమునుగాని, చిత్రమూలము శుంఠి వీనితోడను, లేక సురయనుమద్యమును బోడతరము చిరుబొద్ది సౌవర్చలవణము వీనితోడను, పానముచేయించిన అపానవాతమలములు సుఖముగ బైలువెడలును.

## అర్శోరోగమునందు పిప్పలీయోగము.

దశాదిదశకైర్వృద్ధాః పిప్పలీర్ద్విపిచుం తిలాః. ౬౨
పీత్వా క్షీరేణ లభతే బలం దేహానుతాశయోః,

అర్శోరోగి 10 పిప్పళ్లు, 2 కర్షములు నువ్వులు, వీనిని చేర్చి నూరి 3 పలముల యావుపాలలో కలిపి మొదటిదినము పానముచేయవలయును. రెండవ దినమునందు 20 పిప్పళ్లు, 2 కర్షములునువ్వులు వీనినిచేర్చి నూరి 3 పలముల యావుపాలలో కలిపి పానముచేయవలయును. ఇటుల నొక్కొకదినమునకు 10 పిప్పళ్లు చొప్పున హెచ్చించి ఆపిప్పళ్లను, 2 కర్షములు నువ్వులను, ఒకటిగ చేర్చి నూరి, 3 పలముల ఆవుపాలలో కలిపి శరీరమునకు బలము జాఠరాగ్ని దీపనము కలుగువరకు పానముచేయవలయును. ఇచ్చట నీ కల్పమును యథోత్తరదశకవృద్ధిగ నుపయోగింప కాలనియమము చెప్పకుండుటచే శరీరమున కల్గినబలము పూర్తిగ గల్గునందాక నుపయోగింపవలెనని యెరుంగునది.

అర్శోరోగమునందు పాఠాయోగము.

దుస్పర్శకేన బిల్వేన యవాన్యా నాగరేణ వా. ౬౩
ఏకైకేనాపి సంయుక్తా పాఠా హంత్యర్శసాం రుజమ్,

విషబొద్దిని తీటకసిందయాకుతోగాని, మారేడుపండ్లతోగాని, ఓమముతోగాని, శుంఠితోగాని, ప్రతిదినము సేవింపుచుండిన అర్శోరోగములు హరించును.

అభయారిష్టము.

సలిలస్య వహే పక్త్వా ప్రస్థార్థమభయాత్వచమ్, ౬౪
ప్రస్థం ధాత్ర్యా దశపలం కపిత్థానాం తతోఽర్థతః,
విశాలారోధ్రమరిచకృష్ణావేల్లైలవాలుకమ్. ౬౫
ద్విపలాంశం పృథక్వాద శేషే పూతే గుడాత్తులే,
దత్వా ప్రస్థం చ ధాతక్యాః స్థాపయేద్ఘృతభాజనే. ౬౬
పక్షాత్స శీలితోఽరిష్టః కరోత్యగ్నిం నిహంతి చ,
గుదజగ్రహణీపాండుకుష్ఠోదరగరజ్వరాన్. ౬౭
శ్వయథుప్లీహహృద్రోగగుల్మయక్ష్మవమిక్రిమీన్,

4 ద్రోణములయుదకములో కరక్కాయలబెరడు 8 పలములు, ఉసిరికపరుగు 16 పలములు, వెలగగుజ్జు 10 పలములు, పిన్నపాపర 5 పలములు, లొద్దుగు మిరియాలు పిప్పళ్లు వాయువిడంగములు నూగుదోస యివి దినుసు 1టికి 2పలములు, ఇటుల వీనినన్నిటినిచేర్చి పాదావశేషముగ కషాయముకాచివడియకట్టి అందులో రెండువందల పలములు పాతబెల్లమునుకలిపి, 16 పలములు, ఆరెపువ్వుచేర్చి; నేతితో మాగినకుండలో 15 దినములుంచవలయును. ఇది అభయారిష్టమనిపఱఁగు. దీనినిసేవించిన అగ్నిదీపనము కలుగును. అర్శాంకురములు గ్రహణి పాండువు కుష్టువు ఉదరరోగము విషము

జ్వరము వాపు ప్లీహము హృద్రోగము గుల్మము క్షయము వమనము క్రిమిరోగము ఇవి యన్నియు హరించును.

దంత్యరిష్టము.

జలద్రోణే పచేద్దంతీదశమూలవరాగ్నికాన్. ౬౮
పాలికాన్ పాదశేషే తు క్షిపేద్గుడతులాం పరమ్,
పూర్వవత్సర్వమస్య స్యాదానులోమితర స్త్వయమ్. ౬౯

దంత్యరిష్టము.

దంతి, దశమూలములు, త్రిఫలములు, చిత్రమూలము, వీనిని ప్రత్యేక మొక్కొకపలము చొప్పున గ్రహించి ద్రోణప్రమాణముదకములో వైచి పాదావశేషముగ కషాయముకాచి వడియగట్టి అందులో పాతబెల్లము నూరు పలములు, ఆరెపువ్వు 1 ప్రస్థము చేర్చి, నేతితో మాగిన కుండయందు పదునైదుదినము లుంచి, పిదప సేవించిన అపాన వాతమలబంధములు హరించును. పై అభయారిష్టమునకు చెప్పియుండుగుణములన్నియు నీదంత్యరిష్టమును సేవించుటచేతను కలుగును. ఇదియే దంత్యరిష్టమనబడును.

దురాలభారిష్టము.

పచేద్దురాలభాప్రస్థం ద్రోణేఽపాం ప్రాసృతైస్సహ,
దంతీపాఠాగ్నివిజయావాసామలకనాగరైః. ౭౦
తస్మిన్ సితాశతం దద్యాత్పాదస్థేఽ న్యచ్ఛ పూర్వవత్,
లింపేత్కుంభంతు ఫలినీ కృష్ణాచవ్యాజ్యమాక్షికైః. ౭౧

ద్రోణప్రమాణముదకములో దూలగొండి 1 ప్రస్థము, దంతి విషబొద్ది చిత్రమూలము కరక్కాయలు అడ్డసరము ఉసిరికవరుగు శుంఠి యివి ప్రత్యేకము రెండేసి పలములు ఇటుల వీనిని చేర్చి పాదావశేషముగ కషాయముకాచి వడియగట్టి అందులో పంచదార నూరు పలములు, ఆరెపువ్వు 1 ప్రస్థము. వీనిని చేర్చిన యది దురాలభారిష్టమనబడును. ప్రేంకణము పిప్పళ్లు చవ్యము నెయ్యి తేనె వీనినొకటిగచేర్చి నూరి క్రొత్తకుండకులోపల బూసి ఆ కుండయందు పై దురాలభారిష్టమును 15 దినములుంచి, పిదప సేవించిన అభయారిష్టమునకు చెప్పియుండు గుణము లన్నియుం కలుగును.

వాతాద్యనులోమన ఘృతయోగములు.

ప్రాగ్భక్తమానులోమ్యాయ ఫలామ్లం వా పిబేద్ఘృతమ్,
చవ్యచిత్రకసిద్ధం వా యవక్షారగుడాన్వితమ్. ౭౨
పిప్పలీమూలసిద్ధం వా సగుడక్షారనాగరమ్,

వాతాదుల కనులోమగతిని కలుగజేయునట్టి మాదీఫలము మొదలగు ద్రవ్య

ములతో పక్వము చేయబడిన ఘృతమునుగాని, చవ్యము చిత్రమూలము వీనిని సమభాగములుగ చేర్చి పక్వము చేయబడిన ఘృతములో యవక్షారము బెల్లము కలిపి దానినిగాని మోడిని చేర్చి పక్వము చేయబడిన ఘృతములో బెల్లము యవక్షారము శుంఠి వీనిని చేర్చి దానినిగాని, అర్శోరోగికి వాతమలముల కనులోమగతిగలుగుటకై భోజనమునకుముందు పానము చేయించవలయును.

పిప్పల్యాది ఘృతము.

పిప్పలీపిప్పలీమూలధానకాదాడిమైర్ఘృతమ్. 23
దధ్నా చ సాధితం వాతశకృన్మూత్రవిబంధహృత్,

పిప్పళ్లు, మోడి, దనియాలు, దానిమ్మపండు, వీనిని సమభాగములుగ గ్రహించి ఆవునేతిలోకలిపి నేతికి సమముగ ఆవుపెరుగు చేర్చి ఘృతపాకవిధిగ పక్వము చేసి యిప్పించిన అపానవాత మలమూత్ర ప్రతిబంధములు హరించును.

పలాశక్షారఘృతము.

పలాశక్షారతోయేన త్రిగుణేన పచేద్ఘృతమ్. 24
వత్సకాదిప్రతీవాపం అర్శోఘ్నం దీపనం పరమ్,

మోదుగుక్షారము కలిపినయుదకము 3 భాగములు, ఆవునెయ్యి 1 భాగము, వీనిని ఒకటిగకలిపి అందులో వత్సకాది గణద్రవ్య చూర్ణములను చేర్చి శాస్త్రోక్తవిధి ననుసరించి పక్వము చేసి యీఘృతము నిప్పించిన అర్శోరోగము హరించును. అగ్నిదీపనము కలుగును.

పంచకోలాదిఘృతము.

పంచకోలాభయాక్షీరయవానీబిడసైంధవైః 25
సపాఠాధాన్యమరిచైస్సబిల్వైర్దధిమద్ఘృతమ్,
సాధయేత్తజ్జయత్యాశు గుదవంక్షణవేదనామ్. 26
ప్రవాహికాం గుదభ్రంశం మూత్రకృచ్ఛ్రం పరిస్రవమ్,

పంచకోలములు, కరక్కాయలు, ఓమము, బిడాలవణము, సైంధవలవణము, చిరుబొద్ది, దనియాలు, మిరియాలు, మారేడు, వీనిని సమభాగములుగ గ్రహించి ఆవుపాలతో నూరి ఆవునేతిలోకలిపి నేతికిసమముగ ఆవుపెరుగుబోసి విధిప్రకారము పక్వము చేయబడిన ఘృతమునిప్పించిన గుదము గజ్జలు వీనియందలిశూల అతిసారము గుదభ్రంశము మూత్రకృచ్ఛ్రము పరిస్రవము అనునవి శీఘ్రముగ నివర్తించును ఇయ్యది పంచకోలాదిఘృతము.

—రక్తార్శోహర నవనీతము.—

శర్కరాంభోజకింజల్కసహితం సహ వా తిలైః,
అభ్యస్తం రక్తగుదజాన్నవనీతం నియచ్ఛతి. ౧౧౮

ఆవువెన్నను పంచదార తామరకేసరములు వీనితోగాని, నువ్వులతోగాని చిరకాలమువరకు భక్షింపుచుండిన రక్తార్శస్సులు హరించును.

—రక్తార్శస్సునందు పథ్యద్రవ్యములు.—

ఛాగాని నవనీతాజ్యక్షీరమాంసాని జాంగలః,
అనమ్లో వా కదమ్లో వా సవాస్తుకరసో రసః. ౧౧౯
రక్తశాలిస్సరో దధ్నః షష్టికస్తరుణీ సురా,
తరుణశ్చ సురామండశ్శోణితస్యౌషధం పరమ్. ౧౨౦

మేకవెన్న, మేకనెయ్యి, మేకపాలు, మేకమాంసము, చక్రవర్తికూరతో పక్వముచేయబడినదియు పులుసులేనిదియు లేక కొంచెముపులుసుగలదియునైన జాంగల మాంసరసము, యెఱ్ఱ సంబావుబియ్యము, పెరుగుమీదిమీగడ, 60 దినములకు ఫలించెడు ధాన్యపు బియ్యము, కొంచెము మాధుర్యముతో గూడియుండు సురయనుమద్యము, సురయను మద్యపు మీగడ, అనునవి రక్తార్శోరోగమునకు ముఖ్యౌషధములుగనుండును. కావున పై మేకవెన్న మొదలగువానిని రక్తార్శోరోగి కిప్పించవలయును.

—రక్తార్శస్సునకు పలాండుప్రయోగము.—

పేయాయూషరసాద్యేషు పలాండుః కేవలోఽపి వా,
స జయత్యుల్బణం రక్తం మారుతం చ ప్రయోజితః. ౧౨౧

పేయ, కట్టులు, మాంసరసములు, మొదలగువానిలో నీరుల్లిగడ్డనుచేర్చి గాని, లేక నీరుల్లిగడ్డను ప్రత్యేకముగ గాని, అర్శోరోగి కిప్పించిన అధికరక్తస్రావము వాతప్రకోపము హరించును.

వాతోల్బణాని ప్రాయేణ భవంత్యస్రేఽతినిస్సృతే,
అర్శాంసి తస్మాదధికం తజ్జయే యత్నమాచరేత్. ౧౨౨

రక్తార్శోరోగికి అధికముగ రక్తమువెడలుటవలన వాతాధిక్యముగల అర్శోంకురములు జనించును. కావున రక్తమధికముగ వెడలకుండునట్లు మిక్కిలి ప్రయత్నముతో చికిత్స చేయవలెను.

—రక్తార్శస్సునందు శీతోపచారము.—

దృష్ట్వాఽస్రపిత్తం ప్రబలమబలౌ చ కఫానిలౌ,
శీతోపచారః కర్తవ్యస్సర్వథా తత్ప్రశాంతయే. ౧౨౩

అర్శోరోగికి రక్తపిత్తము వృద్ధిజెంది కఫవాతములు దుర్బలములుగ నుండుటను తెలుసుకొని రక్తపిత్తము శమించుటకై శీతోపచారమును చేయవలయును.

తావదేవం సమస్తస్య స్నిగ్ధోష్ణైస్తర్పయేత్తతః,
రసైః కోష్ణైశ్చ సర్పిర్భిరవపీడకయోజితైః. ౧౨౪
సేచయేత్తం కవోష్ణైశ్చ కామం తైలపయోఘృతైః,

పై చెప్పిన ప్రకారము చికిత్సలుజేసియు రక్తార్శస్సు శమనమునొందకయుండిన ఆయర్శోరోగికి స్నిగ్ధోష్ణముగనుండు మాంసరసముల చేతను, రోగానుత్పాదనీయాధ్యాయమునందు జెప్పబడిన ప్రకారము కొంచెముష్ణముగనుండు ఘృతముచే అవపీడకమును ప్రయోగించుటచేతను, తృప్తిజేయవలయును. సుఖోష్ణముగనుండు తైలము పాలు ఘృతము వీనిచే సేచనము చేయించవలయును.

పిచ్ఛావస్తి.

యవాసకుశకాశానాం మూలపుష్పం చ శాల్మలేః. ౧౨౫
న్యగ్రోధోదుంబరాశ్వత్థ శుంగాశ్చ ద్విపలోన్మితాః,
త్రిప్రస్థే సలిలస్యైతత్క్షీరప్రస్థే చ సాధయేత్. ౧౨౬
క్షీరశేషే కషాయే చ తస్మిన్ పూతే విమిశ్రయేత్,
కల్కీకృతం మోచరసం సమంగాం చందనోత్పలమ్. ౧౨౭
ప్రియంగుం కౌటజం బీజం కమలస్య చ కేసరమ్,
పిచ్ఛావస్తిరయం సిద్ధస్సఘృతక్షౌద్రశర్కరః. ౧౨౮
ప్రవాహికాగుదభ్రంశరక్తస్రావజ్వరాపహాః,

తీటకసింప, దర్భగడ్డి, కాశగడ్డి. వీనివేళ్లు, బూరుగుపువ్వు, మఱ్ఱి, మేడి, రావి, వీనియూడలు, వీనిని ప్రత్యేకము రెండేసి పలములచొప్పున గ్రహించి, 3 ప్రస్థము లుదకముగోసి వైచి, 1 ప్రస్థమావుపాలుపోసి, పాలుమాత్రము మిగులునటుల కషాయము కాచి వడియగట్టి. అందులో బూరుగుబంక, మంజిష్ఠి, చందనము, నల్లకలువ, ప్రేంకణము, కొడిసెవిత్తులు, తామరకేసరములు, వీనిని ప్రత్యేకము కర్షప్రమాణము గ్రహించి, కల్కము చేసి కలిపి, వస్తిని చేయవలయును. పిమ్మట దీనికి నెయ్యి తేనె పంచదార వీనితోడ జేర్చి వస్తికర్మ చేయించవలెను. ఇది పిచ్ఛావస్తియనబడును. ఇది గ్రహిణి, గుదభ్రంశము, రక్తస్రావము, జ్వరము వీనిని హరించును. పిచ్ఛావస్తియనగా స్వల్పమాత్రగా ప్రయోగించెడు నిరూహావస్తి.

### రక్తార్శస్సునకు అనువాసనవస్తి.

యష్ట్యాహ్వపుండరీకేణ తథా మోచరసాదిభిః ౧౨౯
క్షీరద్విగుణితః పక్వో దేయస్స్నేహోఽనువాసనమ్,

అతిమధురము, ప్రపౌండరీకము, బూరుగుబంక, మంజిష్ఠి, చందనము, నల్లకలువ, ప్రేంకణము, కొడిసెవిత్తులు, వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి నూనెలోఁ కలిపి నూనెకు రెండింతలు ఆవుపాలుపోసి విధిప్రకారము పక్వముచేయబడిన తైలముచే రక్తార్శోరోగికి అనువాసవస్తిని చేయవలయును.

### మధుకాది ఘృతము.

మధుకోత్పలరోధ్రాంబు సమంగాం బిల్వచందనమ్. ౧౩౦
చవికాతివిషాముస్తం పాఠా క్షారో యవాగ్రజః,
దార్వీత్వఙ్నాగరం మాంసీ చిత్రకో దేవదారు చ. ౧౩౧
చాంగేరీస్వరసే సర్పిస్సాధితం తత్త్రిదోషజిత్,
అర్శోఽతిసారగ్రహణీ పాండురోగజ్వరారుచౌ. ౧౩౨
మూత్రకృచ్ఛ్రే గుదభ్రంశే వస్త్యానాహే ప్రవాహణే,
పిచ్ఛాస్రావేఽర్శసాం శూలే దేయం తత్పరమౌషధమ్. ౧౩౩

అతిమధురము, నల్లకలువ, లొద్దుగ, కురువేరు, మంజిష్ఠి, మారేడు, చందనము, చవ్యము, అతివస, తుంగముస్తలు, చిరుబొద్ది, యవక్షారము, మ్రానిపసపు, లవంగపట్ట, శుంఠి, జటామాంసి, చిత్రమూలము, దేవదారు, ఇవి ప్రత్యేక మొక్కొకభాగము, ఘృతము, 4 భాగములు, వీనిని ఘృతమునకంటె 4 గింతలధికముగనుండు పులిచింత రసములోఁ కలిపి ఘృతపాకవిధిగా పాకముచేసి యిప్పించిన త్రిదోషప్రకోపము అతిసారము గ్రహణి పాండురోగము జ్వరము అరుచి మూత్రకృచ్ఛ్రము గుదభ్రంశము పొత్తికడుపునందు శూల కడుపుబ్బరము ప్రవాహిక కర్తస్రావము అర్శస్సు యివి హరించును. ఇది మధుకాదిఘృతమనబడును. అర్శోరోగమునందు మిగుల శ్రేష్ఠమైనది.

వ్యత్యాసాన్మధురామ్లాని శీతోష్ణాని చ యోజయేత్,
నిత్యమగ్నిబలాపేక్షీ జయత్యర్శఃకృతాన్ గదాన్. ౧౩౪

జాఠరాగ్ని దీపనము నెల్లపుడు కోరునట్టి అర్శోరోగికి మధురామ్లద్రవ్యములు శీతోష్ణద్రవ్యములు, వీనిని వ్యత్యాసముగ (అనగా—తొలుత మధురరసము పిదప అమ్లరసము, తొలుత అమ్లరసము పిదప మధురరసము, తొలుత శీతద్రవ్యములు పిదప నుష్ణద్రవ్యములు, తొలుత నుష్ణద్రవ్యములు, పిదప శీతద్రవ్యములు, ఇటుల) ప్రయోగించిన జాఠరాగ్నికి బలముకలిగి అర్శోరోగములు హరించును.

### ఉదావర్తయుక్తార్శోహరవర్తి.

ఉదావర్తార్తమభ్యజ్య తైలైశ్శీతజ్వరాపహైః,
సుస్నిగ్ధస్స్వేదయేత్పిండైర్వర్తిమస్మై గుదే తతః. ౧౩౫

అభ్యక్తాం తత్కరాంగుష్ఠసన్నిభామనులోమనీమ్,
దద్యాచ్ఛ్యామాత్రివృద్దంతీపిప్పలీనీలినీఫలైః. ౧౩౬
విచూర్ణితైర్ద్విలవణైర్గుడగోమూత్రసంయుతైః,
తద్వన్మాగధికారాఠగృహధూమైస్ససర్షపైః. ౧౩౭

ఉదావర్తరోగముతోగూడిన అర్శోరోగికి శీతజ్వరహరములైన తైలములచే నభ్యంజనము చేయించి, మిగుల స్నిగ్ధములైన పిండస్వేదములను చేయించవలయును. పిదప నారోగియొక్క గుదమునకు నేతినిపూసి,నల్లసుగంధిపాల, తెల్లతెగడ,దంతి,పిప్పళ్లు నీలివిత్తులు, సైంధవలవణము, సౌవర్చలవణము, వీనిని సమభాగములుగచేర్చి చక్కగ చూర్ణముజేసి అందులో బెల్లముకలిపి గోమూత్రముపోసిపిసికి రోగియొక్క బొటనవ్రేలికి సమానముగచేయబడినదియు, నేతిలో తడపబడినదియు, అపానవాతమలముల కనులోమగతిని కలుగజేయునదియునైన వర్తినిగాని, పిప్పళ్లు మ్రంగకాయ కరదూపము, వీనిని చూర్ణముజేసి గోమూత్రములో కలిపి చేయబడిన వర్తినిగాని ప్రయోగించిన హితము కలుగును.

### ఉదావర్తాదిహరచూర్ణప్రయోగము.

ఏతేషామేవ వా చూర్ణం గుదే నాడ్యా వినిర్ధమేత్.

అర్శోరోగియొక్క గుదములో గొట్టమునునిచి అందులో పైన చెప్పియుండు తెల్లతెగడ మొదలగు ద్రవ్యములయొక్క చూర్ణమునుపోసి లోనికేగునటుల నోటిచే నూదవలయును.

### అర్శోరోగికి తీక్ష్ణవస్తిప్రయోగము.

తద్విఘాతే సుతీక్ష్ణం తు వస్తిం స్నిగ్ధం ప్రపీడయేత్. ౧౩౮
ఋజూకుర్యాద్గుదశిరో విణ్మూత్రమరుతో ఽస్య సః,
భూయోఽనుబంధే వాతఘ్నైర్విరేచ్యస్స్నేహరేచనైః. ౧౩౯
అనువాస్యశ్చ రౌక్ష్యాద్ధి సంగో మారుతవర్చసోః,

పైచెప్పినప్రకారము చికిత్సజేసినను అర్శోరోగము శమించకయుండిన తీక్ష్ణమైన స్నేహవస్తిని చేయించవలయును. ఆ స్నేహవస్తి మలమూత్రవాతములను చక్కగ బైలువెడలునటుల జేయును. పైరోగము మరల కలిగిన వాతహరములైన స్నేహవిరే

చనములను చేయించి వాతమలమూత్ర ప్రతిబంధము నివర్తించుటకై అనువాసనవస్తిని ప్రయోగించవలయును.

### కల్యాణకక్షారము.

త్రికటు త్రిపటు శ్రేష్ఠాదంత్యరుష్కరచిత్రకమ్. ౧౪౦
జర్జరం స్నేహమూత్రాక్తమంతర్ధూమం విపాచయేత్,
శరావసంధౌ మృల్లిప్తే క్షారః కల్యాణకాహ్వయః. ౧౪౧
సపీతస్సర్పిషా యుక్తో భక్తే వా స్నిగ్ధభోజనా,
ఉదావర్తవిబంధార్శోగుల్మపాండూదరక్రిమీన్. ౧౪౨
మూత్రసంగాశ్మరీశోఫహృద్రోగగ్రహణీగదాన్,
మేహప్లీహరుజానాహశ్వాసకాసాంశ్చ నాశయేత్.

త్రికటుకములు, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, త్రిఫలములు, దంతి, జీడివిత్తులు, చిత్రమూలము, వీనిని సమభాగములుగ గ్రహించి నలియగొట్టి ఘృతాదిస్నేహము, గోమూత్రము వీనిలో తడిపి దానిని మూకుడునం దునిచి, పైనమూకుడుమూసి, చీలమన్ను జేసి, అంతర్ధూమముగా పాకము చేయవలయును. ఇదియ కల్యాణకక్షారమనబడును. దీనిని నేతిలో కలిపి పానముచేసి స్నిగ్ధమైన యాహారమును, భుజించినను, లేక ఆహారములోకలిపి భుజించినను, ఉదావర్తరోగము, మలబంధము, అర్శస్సు, గుల్మము, ఉదరరోగము, క్రిమిరోగము, మూత్రప్రతిబంధము, అశ్మరీరోగము, వాపు, ఱొమ్మునొప్పి, గ్రహణి, మేహము, ప్లీహరోగము, కడుపుబ్బరము, పాండువు, శ్వాసకాసలు ఇవి హరించును.

### ఉదావర్తసామాన్యచికిత్స.

సర్వం చ కుర్యాద్యతోప్యుక్తమర్శసాం గాఢవర్చసామ్. ౧౪౩

మలబంధముతో గూడియుండు అర్శోరోగికి చెప్పియుండు చికిత్సలన్నిటిని ఉదావర్తరోగమునందును చేయవలయును.

### పూతీకరంజ సూక్తము.

ద్రోణేఽపాం పూతివల్కాద్ద్వితులమథ పచేత్పాదశేషే చ తస్మిన్
దేయాఽశీతిర్గుడస్య ప్రతనుకరజసో వ్యోషతోఽష్టౌ పలాని,
ఏతత్స్నానేన జాతం జనయతి పరమామూష్మణః పక్తిశక్తిం
శుక్తం కృత్వానులోమ్యం ప్రజయతి గుదజప్లీహగుల్మోదరాణి.

ద్రోణప్రమాణముదకములో 2 తులములు (రెండువందలపలములు) కలుగానుగపట్టను వైచి పాదావశేషముగ కషాయముకాచి వడియగట్టి, అందులో ఎనుబది

పలములు పాతబెల్లము, మెత్తగచూర్ణముచేయబడిన, త్రికటుకచూర్ణము, 8 పలములు వీనినిచేర్చి పాత్రలో నొక మాసమువరకు నుంచి, పుల్లగనైన పిదప దానిని సేవించిన మిక్కిలి జాఠరాగ్ని దీపనము అపానవాతాదుల కనులోమగతి కలుగును. అర్శో రోగము ప్లీహము గుల్మరోగము ఉదరరోగము హరించును.

పూతీకరంజ చుక్రము.

పచేత్తులాం పూతికరంజవల్కా ద్ద్వే మూలతశ్చిత్రకకంటకార్యోః,
ద్రోణత్రయేఽపాం చరణావశేషే పూతే శతంతత్ర గుడస్య దద్యాత్.
పలికం చ సుచూర్ణితం త్రిజాతత్రికటుగ్రంథికదాడిమాశ్మభేదమ్,
పురపుష్కరమూలధాన్యచవ్యం హపుషామార్ద్రకమమ్లవేతసం చ ౧౮౬
శీతీభూతం క్షౌద్రవింశత్యుపేతమార్ద్రద్రాక్షా బీజపూరార్ద్రకైశ్చ,
యుక్తంకామంగండికాభిస్తథేక్షోస్సర్పిఃపాత్రే మాసమాత్రేణ జాతమ్
చుక్రం క్రకచమివేదం దుర్నామ్నాం వహ్నిదీపనం పరమమ్,
పాండుగరోదరగుల్మప్లీహానాహాశ్మకృచ్ఛ్రఘ్నమ్. ౧౮౭

కలుగానుగపట్ట 1 తులము (నూరుపలములు), చిత్రమూలపు వేళ్లపట్ట 1 తులము, (నూరుపలములు), వాకుడు వేళ్లపట్ట 1 తులము (నూరుపలములు), వీనిని 3 ద్రోణములుదకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి వడియకట్టి అందులో నూరుపలములు పాతబెల్లముచేర్చి, త్రిజాతకములు, త్రికటుకములు, మోడి, దానిమ్మ విత్తులు, పాషాణభేది, చేమపొట్ల, పుష్కరమూలము, దనియాలు, చవ్యము, విత్తుబోడ తరము, లేక పెద్దసోపు, అల్లము, పుల్లప్రబ్బలి, వీనిని దినుసుకొక్కొకపలముచొప్పున గ్రహించి, చక్కగచూర్ణముచేసి కలిపి, పాకముచేసి చల్లారిన పిదప, తేనె 20 పలములు, పచ్చిద్రాక్షపండ్లు, మాదీఫలపుతునకలు, చెఱుకు తునకలు, వీనిని చేర్చి నేతితో మాగినకుండలో నొక మాసముంచి కొంచెము పులిసినపిదప దానిని సేవించినయెడ అగ్నిదీపనము, మిక్కుటముగగలుగును. పాండువు, విషము, ఉదరరోగము, గుల్మము, ప్లీహము, కడుపుబ్బరము, మూత్రకృచ్ఛ్రము హరించును. మఱియు నిది "ఱంపము వృక్షములకోయుచందంబున" అర్శోంకురములను కోసివేయును.

పీల్వాదిగుడము.

ద్రోణం పీలురసస్య వస్త్రగళితం న్యస్తం హవిర్భాజనే,
యుంజీత ద్విపలైర్మదామధుఫలాఖర్జూరధాత్రీఫలైః,
పాఠామాద్రి దురాలభామ్లవిదుళవ్యోషపత్వగేలోల్లకైః

స్పృక్కాకోలలవంగవేల్లచపలామూలాగ్నికైః పాలికైః. ౧౪౯
గుడపలశతయోజితం నివాతే నిహితమిదం ప్రపిబంశ్చపక్షమాత్రాత్,
నిశమయతి గుదాంకురాన్ సగుల్మానవలబలం ప్రబలం కరోతి చాశు.

పిన్నవరగోగురసము 1 ద్రోణము గ్రహించి వడియగట్టి నేతితోమాగిన కుండలో పోసి యందు ఆకెపువ్వు, ద్రాక్ష, ఖర్జూరపండు, ఉసిరికపండ్లు యివి దినుసునకు 2 పలములు, విషబొద్ది రేణుకలు దూలగొండి పుల్లప్రబ్బలి త్రికటుకములు లవంగపట్ట ఏలకులు స్పృక్కయను గంధద్రవ్యము రేగుపండ్లు లవంగములు వాయువిడంగములు మోడి చిత్రమూలము యివి దినుసుకొక్కకపలము, పాతబెల్లము 100 పలములు వీని నన్నిటినిచేర్చి గాలిలేని స్థలమునందు 15 దినములుంచి పిదప దానిని సేవించిన గుదాంకురములు గుల్మములు హరించును. జాఠరాగ్ని దీపనము మిక్కుటముగ కలుగును.

దశమూలాదిగుడము.

ఏకైకశో దశపలే దశమూలకుంభ
పాఠాద్వయార్కఘుణవల్లభకట్ఫలానాం,
దగ్ధే శృతే ను కలశేన జలేన పక్వే
పాదస్థితే గుడతులాం పలపంచకం చ ౧౫౧
దద్యాత్ప్రిత్యేకం వ్యోషచవ్యాభయానాం
వహ్నేర్ముష్టీ ద్వే యవక్షారతశ్చ,
దర్వీమాలింపన్ హంతి లీఢో గుడోఽయం
గుల్మప్లీహార్శఃకుష్ఠమేహాగ్నిసాదాన్. ౧౫౨

దశమూలములు, తెల్లతెగడ, చిరుబొద్ది, పాలచెట్టు, జిల్లేడు, అతివస, పెద్ద గుమ్ముడు వీనిని దినుసుకు 10 పలములచొప్పున గ్రహించి, నిప్పులో కాల్చి, దానిని ద్రోణప్రమాణ ముదకములోవైచి, పాదావశేషముగ కషాయముకాచి, అందులో పాత బెల్లము 100 పలములు, త్రికటుకములు చవ్యము కరక్కాయలు అనునవి దినుసుకు 5 పలములు, చిత్రమూలము యవక్షారము యివిదినుసుకు 2 పలములు, వీనినన్నిటిని చేర్చి గరిటె కంటువరకు పాకముచేసి, యీ గుడమును భక్షించినచో గుల్మము, ప్లీహము, అర్శోరోగము, కుష్ఠువు, ప్రమేహము, అగ్నిమాంద్యము, ఇవి నిశ్శేషముగ హరించును.

చిత్రమూలకలేహము.

తోయద్రోణే చిత్రకమూలతులార్ధం
సాధ్యం యావత్పాదజలస్థమపీదం,

అష్టౌ దత్వా జీర్ణగుడస్య పలాని
క్వాథస్యం భూయః సాంద్రతయా సమమేతత్. ౧౫౩
త్రికటుకమిసిపథ్యాకుష్ఠముస్తావరాంగ
క్రిమిరిపుదహనైలాచూర్ణకీర్ణోఽవలేహః,
జయతి గుదజకుష్ఠప్లీహగుల్మోదరాణి
ప్రబలయతి హుతాశం శశ్వదభ్యస్యమానః ౧౫౪

చిత్రమూలపువేళ్లు 50 పలములను ద్రోణప్రమాణ ముదకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి వడియగట్టి, అందులో పాతబెల్లము 8 పలములు చేర్చి గట్టిగనగువరకు పాకముచేసి దానిలో త్రికటుకములు, సదాప, కరక్కాయలు, చెంగల్వకోష్ఠు, తుంగముస్తలు, లవంగములు, వాయువిడంగములు, చిత్రమూలము, ఏలకులు వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి కలిపి సేవింపుచుండిన అర్శోంకురములు, కుష్ఠువు, ప్లీహము, గుల్మము, ఉదరరోగములు, హరించును. అగ్నిదీపనము కలుగును.

అర్శోహరగుడాదిగుటిక.

గుడవ్యోషవరావేల్లతిలారుష్కరచిత్రకైః,
అర్శాంసి హంతి గుటికా త్వగ్వికారం చ శీలితా. ౧౫౫

బెల్లము, త్రికటుకములు, త్రిఫలములు, వాయువిడంగములు, నువ్వులు జీడివిత్తులు, చిత్రమూలము వీనిని సమభాగములుగచేర్చి చేయబడిన గుటికలను ప్రతిదినము సేవింపుచుండిన అర్శోంకురములు, చర్మరోగము హరించును.

అర్శస్సునకు సూరణకందయోగము.

మృల్లిప్తం సౌరణం కందం పక్త్వాగ్నౌ పుటపాకవత్,
అద్యాత్సతైలలవణం దుర్నామవినివృత్తయే ౧౫౬

అడవికందగడ్డకు పైని మట్టినిపూసి పుటపాకవిధిగ పక్వముచేసి దానిని నువ్వులనూనె ఉప్పు వీనితోడ భక్షించిన అర్శోరోగము శమించును.

అర్శోహరమరీచాదిగుటికలు.

మరిచపిప్పలినాగరచిత్రకాః క్రమవివర్ధితభాగసమాహృతాః,
శిఖిచతుర్గుణసూరణయోజితాః కురు గుడేన గుడాః గుదజచ్ఛిదః.

మిరియాలు 1 భాగము, పిప్పళ్లు 2 భాగములు, శుంఠి 3 భాగములు, చిత్రమూలము 4 భాగములు, చిత్రమూలమునకు నాలుగింతలు అడవికందగడ్డ, వీనిని చేర్చి చూర్ణముచేసి అందులో బెల్లముకలిపి గుటికలుజేసి భుజించిన గుదాంకురములు నివర్తించును.

### అర్శోంకురములకు సూరణపిండము.

చూర్ణీకృతాః షోడశ సూరణస్య భాగాస్తతోఽర్ధేన చ చిత్రకస్య,
మహౌషధాద్ద్వౌ మరిచస్య చైకో గుడేన దుర్నామజయాయ పిండీ.

అడవికందగడ్డ చూర్ణము 16 భాగములు, చిత్రమూలపు చూర్ణము 8 భాగములు, శుంఠి చూర్ణము 2 భాగములు, మిరియాలచూర్ణము 1 భాగము, వీనినన్నిటిని చేర్చి అందులో బెల్లముకలిపి ఉంటజేసి భుజించిన అర్శోంకురములు నివర్తించును.

### పథ్యాదిచూర్ణము.

పథ్యానాగరకృష్ణాకరంజవేల్లాగ్నిభిస్సితాతుల్యైః,
బడబాముఖ ఇవ జరయతి బహుగుర్వపి భోజనం చూర్ణమ్.

కరక్కాయలు, శుంఠి, పిప్పళ్లు, క్రానుగు, వాయువిడంగములు చిత్రమూలము, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి దానికి సమముగ పంచదార గలిపి సేవించిన నది మిక్కిలి గురువుగనుండు ఆహారమునుగూడ జీర్ణముజేయును.

### కళింగాది గుటికలు.

కళింగలాంగలీకృష్ణావహ్నియవామార్గతండులైః,
భూనింబసైంధవగుడైర్గుడా గుదజనాశనాః. ౧౬౦

కొడిసెవిత్తులు, చన్నచర్లగడ్డ, పిప్పళ్లు, చిత్రమూలము, ఉత్తరేణి, బియ్యము, నేలవేము, సైంధవలవణము, బెల్లము వీనిని సమభాగములుగ గ్రహించి నూరి ఉంటలు జేసి జాఠరాగ్నిబలానుగుణముగ సేవించిన గుదాంకురములు హరించును.

### సైంధవాదిచూర్ణము.

లవణోత్తమవహ్నికళింగయవాంశ్చిరిబిల్వమహాపిచుమందయుతాన్,
పిబ సప్తదినం మథితాలులితాన్ యది మర్దితుమిచ్ఛసి పాయురుహాన్.

అర్శోరోగమును పోగొట్టుకొనుట కిచ్ఛయించువాడు సైంధవలవణము, చిత్రమూలము, కొడిసెవిత్తులు, క్రానుగు, పెద్దవేము వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి నీళ్లుకలుపక చిలికిన ఆవుమజ్జిగలో యేడు దినములు త్రాగవలయును.

### అర్శస్సునందు ముఖ్యౌషధములు.

శుష్కేషు భల్లాతకమగ్ర్యముక్తం భైషజ్యమార్ద్రేషు తువత్సకత్వక్,
సర్వేషు సర్వర్తుషు కాలశేయమర్శస్సు బల్యంచ మలాపహం చ ౧౬౧

తడిలేకయుండు అర్శోంకురములయందు నల్లజీడిగింజలును, తడిగనుండు అర్శోంకురములయందు కొడిసెపట్టయును, ముఖ్యౌషధములని మహర్షులచే వక్కాణింప

బడియె. తడిలేకయు తడిగనుండు అన్ని అర్శోంకురములయందును సర్వకాలముల యందు మజ్జిగ మిక్కిలి యుత్కృష్టమైన యౌషధము. ఇది దోషములను పోగొట్టును. బలమును వృద్ధిజేయును.

అర్శోరోగికి పథ్యాన్నపానములు.

భిత్వా విబంధాననులోమనాయ యన్మారుతస్యాగ్నిబలాయయచ్ఛ,
తదన్నపానౌషధమర్శసేన సేవ్యం వివర్జ్యం విపరీతమస్మాత్. ౧౬౩

అర్శోరోగముగలవాడు మలబంధమును కఫమును పోగొట్టునదియు, వాతమలాదుల కనులోమగతిని కలుగజేయునదియు, జాఠరాగ్నికి బలమును వృద్ధిపరచునదియునైన యన్నపానాదులను సేవించవలెను. ఇందుకువిపరీతముగ మలబంధమును కల్గించికఫమును వృద్ధిపరచునవియు, వాతమలాదులను ప్రతిలోమముగజేయునవియు, జాఠరాగ్నిని మందగింపజేయునవియు, నైనయన్నపానాదులను వర్జింపవలయును.

అర్శోరోగమునందగ్నిదీపనావశ్యకత్వము.

అర్శోఽతిసారగ్రహణీ వికారాః
ప్రాయేణ చాన్యోన్యనిదానభూతాః,
సన్నేఽనలే సంతి న సంతి దీప్తే
రక్షేదతస్తేషు విశేషతోఽగ్నిమ్. ౧౬౪

అర్శోరోగము, అతిసారము, గ్రహణి, ఈ రోగములు తఱుచుగ పరస్పరము హేతుభూతములుగ నుండును. (అనగా—అర్శోరోగమువలన అతిసారము, అతిసారమువలన గ్రహణీరోగము, గ్రహణీరోగమువలన అర్శోతిసారరోగములు జనించునని భావము.) మఱియు జాఠరాగ్ని దీపనములేకుండినచో పైరోగములు వృద్ధిజెందును. జాఠరాగ్ని దీపనముకలిగియుండిన పై రోగములు లేకుండును. కావున అర్శోతిసారగ్రహణీ రోగములయందు జాఠరాగ్నిని కడుప్రయత్నముతో రక్షింపుచుండవలయును.

అష్టమాధ్యాయము ముగిసెను.

---

# నవమాధ్యాయము.



వఅ: పైయధ్యాయాంతమున "అర్శో ఽతిసారగ్రహణీవికారాః ప్రాయేణ చాన్యోన్యనిదానభూతాః" అని చెప్పబడినవాక్యముచే నర్శోరోగంబును, అతిసారంబును, గ్రహణీరోగంబును ఒకదానికొకటి కారణములగునని తెలియుచున్నది. కావున అట్టి కార్య కారణసంబంధమునుబట్టి అర్శోరోగ చికిత్సను జెప్పినపిదపనీయధ్యాయమునం దతిసారచికిత్స చెప్పబడుచున్నయది.

అతిసార చికిత్సితాధ్యాయప్రారంభము.

**సూ. అథాతోఽతిసారచికిత్సితం వ్యాఖ్యాస్యామః,**
**ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.**

అర్శశ్చికిత్సితాధ్యాయ నిరూపణానంతరము అతిసారరోగచికిత్సలను తెలియపరచునట్టి అతిసారచికిత్సితమను నీ యధ్యాయమును వివరించెదము.

అతిసారచికిత్స.

**అతీసారో హి భూయిష్ఠం భవత్యామాశయాన్వయః,**
**హత్వాగ్నిం వాతజేఽప్యస్మాత్ప్రాక్తస్మిౕ లంఘనం హితమ్. ౧**

అతిసారరోగము తఱుచుగ జాఠరాగ్నిని చెఱచి ఆమాశయమునందు జనించును. కావున నీవ్యాధియందు తొలుత లంఘనము జేయించవలయును. వాతమువలన కలిగిన యతిసారమునందును లంఘనము జేయించిన హితకరముగనుండును. మూలమునందు "వాతజేఽపి" అనిచెప్పియుండుటవలన నొకానొకప్పుడు కఫమువలన జనించిన అతిసారమునందును లంఘనము జేయించవలయునని భావము.

ఇచ్చట "భూయిష్ఠం భవత్యామాశయాన్వయః" అని చెప్పుటచేత తరుచుగ నామాశయమునజనించుననియు,భయాదులచేగల్గినయతిసారముపక్వాశయాదులయందు నొకప్పుడు పుట్టుననియు భావము. మరియు "ప్రాక్తస్మిౕ లంఘనం హితం" అని చెప్పుటచేత అతిసారపూర్వరూపమునందే యుపవాసరూపమైన లంకణమును జేయవలెగాని వ్యాధి పూర్తిగ వ్యాపించినపుడు కూడదనిభావము. ఏలనన:—ఈవ్యాధి స్వభావముచేతనే ధాతువుల క్షీణింపజేయును. అట్టియెడ లంకణము జేసినచో మరింత ధాతుక్షయముకల్గును. కావున తొలుత లంకణము హితము.

అతిసారరోగికి వమనము.

శూలానాహప్రసేకార్తం వామయేదతిసారిణమ్,

శూల, కడుపుబ్బరము, నోటినుండి నీరుకారుట, ఈ యుపద్రవములతో గూడి యుండు అతిసారరోగికి తొలుత వమనము చేయించవలయును. పిత్తాదులవలనజనించిన అతిసారమునందుగూడ శూల మొదలగు నుపద్రవములు కలిగియుండినచో తొలుత వమనమునే చేయించవలెను.

ఆమాతిసారమునందు పాచనౌషధనిషేధము.

దోషాస్సన్నిచితా యే చ విదగ్ధాహారమూర్ఛితాః. ౨
అతిసారాయ కల్పంతే తేష్వావేక్షైవ భేషజమ్,
భృశోత్క్లేశప్రవృత్తేషు స్వయమేవ చలాత్మసు. 3
ప్రయోజ్యం న తు సంగ్రాహి పూర్వమామాతిసారిణే,

వాతాదిదోషములు విశేషముగ వృద్ధిజెంది విదగ్ధమైన (పక్వాపక్వరూపమైన) ఆహారములతో నైక్యముసుజెంది అతిసారరోగమును కలుగజేయును. మిక్కిలి ఉత్క్లేశ రూపమైన యుపద్రవమును గలుగజేయునదియు, స్వయముగనే చలించుచుండు నదియు నైన పై దోషములయందు, పథ్యమగు నాహారములను భుజింపవలయుగాని అట్టి యతిసారరోగికి పాచనాద్యౌషధముల నిప్పింపందగదు. మరియు నట్టి యామాతి సారరోగికి తొలుత సంగ్రాహి (మలప్రవృత్తిని బంధించు) ఔషధము నిప్పింపంజనదు. "పూర్వం నతుప్రయోజ్యం" అని మూలశ్లోకమునందు చెప్పియుండుటవలన ఆమాతిసా రము జనించిన 2, 3 దినములకు పిదప పాచనౌషధముల నిప్పించవలయునని భావం బగుచున్నది.

ఆమాతీసారమునందు హరీతకీయోగము.

అపి చాధ్మానగురుతాశూలస్తైమిత్యకారిణి. ౪
ప్రాణదా ప్రాణదా దోషే విబద్ధే సంప్రవర్తినీ.

మలము బంధింపబడి దోషము కొంచెముకొంచెముగ వెడలుచుండునదియు, కడుపుబ్బరము గురుత్వము శూలలు స్తబ్ధత్వము మొదలగు నుపద్రవములను కలుగజేయు నదియునైన ఆమాతిసారరోగమునందు సంగ్రహణౌషధ మపథ్యకరముగనుండినను కర క్కాయలు మిగుల హితకరముగనుండును. ప్రాణముల కాపాడును.

అతిసారికి భూతీకాది కల్కము.

పిబేత్ప్రతిక్వథితాంస్తోయే మధ్యదోషో విశోషయన్. ౫

భూతీకపిప్పలీశుంఠీవచాధాన్యహరీతకీః,
అథవా బిల్వధనికాముస్తానాగరవాలకమ్. ౬
బిడపాఠావచాపథ్యాక్రిమిజిన్నాగరాణి వా,
శుంఠీఘనవచామూర్వీ బిల్వవత్సకహింగు వా. ౭

దోషములు అధికముగ స్వల్పముగ లేకుండ మధ్యమావస్థను జెందియుండిన అతిసారరోగికి లంఘనముచేయించి; కామంచిగడ్డి, పిప్పళ్లు, శుంఠి, వస, దనియాలు, కరక్కాయ, వీనినిగాని; మారేడు, దనియాలు, తుంగముస్తలు, శుంఠి, కురువేరు, వీనినిగాని; బిడాలవణము, చిరుబొద్ది, వస, కరక్కాయలు, వాయువిడంగములు, శుంఠి, వీనినిగాని; శుంఠి, తుంగముస్తలు, వస, అతివస, మారేడు, కొడిసెవిత్తులు, ఇంగువ, వీనినిగాని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి ప్రమథ్యారూపముగ కాచి పానము జేయించవలయును.

"ప్రమథ్యా మధ్యదోషేభ్యో దద్యాద్దీపనపాచనమ్." దోషములు మధ్యమముగనుండు అతిసారరోగికి అగ్నిదీపనకారియు జీర్ణకారియునైన ప్రమథ్యయను ఔషధము నిప్పించవలయునని చరకాచార్యుడు చెప్పియున్నాడు. "శృతః కషాయో నిర్యూహః క్వాథో యూషో కృతశ్చ సః, కృతయూషః ప్రమథ్యా చ ద్రవ్యాత్కల్కీకృతాచ్ఛృతః." ద్రవ్యములను దంచి చేర్చికాచిన నది కషాయము నిర్యూహము క్వాథము అకృతయూషము అనబడును. ఔషధద్రవ్యములను చక్కగనూరి కాచిన నది ప్రమథ్యయనబడునని ప్రమథ్యాలక్షణము తంత్రాంతరమున చెప్పబడియున్నది.

## అతిసారరోగికి లంఘనావశ్యకత్వము.

శస్యతే త్వల్పదోషాణాముపవాసోఽతిసారిణామ్,

స్వల్పదోషముగల అతిసారరోగికి లంఘనము చేయించవలయును. మఱియు అతిసారరోగులకందఱికి దోషదేశబలాద్యనుగుణముగ లంఘనము జేయించవలయును.

## అతిసారరోగికి ఉదకపానము.

వచాప్రతివిషాభ్యాం వా ముస్తాపర్పటకేన వా. ౮
హ్రీబేరనాగరాభ్యాం వా విపక్వం పాయయేజ్జలమ్,

అతిసారరోగికి దప్పికలిగినయెడల వస అతివస వీనినిగాని; తుంగముస్తలు పర్పాటకము వీనినిగాని; కురువేరు శుంఠి వీనినిగాని సమభాగములుగ చేర్చి చక్కగ కాచబడిన యుదకమును దోషదేశాద్యనుగుణముగ పానము జేయించవలయును.

### అతిసారరోగికి పథ్యనియమము.

యుక్తేఽన్నకాలే క్షుత్క్షామం లఘ్వన్నం ప్రతి భోజయేత్. ౯
తథా స శీఘ్రం ప్రాప్నోతి రుచిమగ్నిబలం బలమ్,

అతిసారరోగికి పైనచెప్పిన ప్రకారము లంఘనము చేయించిన పిదప విశేషముగ నాకలికలిగినయెడల యుక్తకాలంబున లఘువుగనుండు అన్నమును స్వల్పముగ భుజింపజేయవలయును. ఇట్లుల జేసినయెడ నారోగికి స్వల్పకాలములో రుచి జాఠరాగ్ని దీపనము శరీరపటుత్వము కలుగును.

### అతిసారరోగికి తక్రాద్యుపయోగము.

తక్రేణావంతిసోమేన యవాగ్వా తర్పణేన వా. ౧౦
సురయా మధునా చాథ యథాసాత్మ్యముపాచరేత్,

పైజెప్పిన చొప్పున యాహారములను భుజియించియుండు అతిసారరోగికి మజ్జిగనుగాని, పులిశడుగునుగాని, గంజినిగాని, సుర, లేక మధు అను మద్యములనుగాని, దేశకాలసాత్మ్యానుగుణముగ పానము చేయించవలయును.

### అతిసారరోగికి అన్నపానాదికల్పన.

భోజ్యాని కల్పయేదూర్ధ్వం గ్రాహిదీపనపాచనైః. ౧౧
బాలబిల్వశఠీధాన్యహింగువృక్షామ్లదాడిమైః,
పలాశహపుషాఽజాజీయవానీబిడసైంధవైః. ౧౨
లఘునా పంచమూలేన పంచకోలేన పాఠయా,

అతిసారరోగికిమలమునుగట్టిపరచునదియు, అగ్నిదీపనమును కలుగజేయునదియు, భుజించిన యాహారములను జీర్ణముజేయునదియునైన లేత మారేడుకాయలు, కచోరములు, యింగువ, దనియాలు, చింతపండు, పుల్లదానిమ్మ, మోదుగ విత్తు, బోడతరము, లేక పెద్దసోపు, జీలకఱ్ఱ, ఓమము, బిడాలవణము, సైంధవలవణము, లఘుపంచమూలములు, పంచకోలములు, చిరుబొద్ది, వీనితో పక్వముచేయబడిన భక్ష్యాన్నపానాదుల నిప్పించవలయును.

### అతిసారరోగికి పేయాక్రమము.

శాలిపర్ణీబలాబిల్వైః పృశ్నిపర్ణ్యా చ సాధితా. ౧౩
దాడిమామ్లా హితా పేయా కఫపిత్తే సముల్బణే,
అభయాపిప్పలీమూలబిల్వైర్వాతానులోమనీ. ౧౪

కఫపిత్తము లధికముగనుండు అతిసారరోగికి ముయ్యాకుపొన్న, బలామూలము,

(చిట్టాముట్టి) మారేడుగుజ్జు, కోలపొన్న,వీనిని సమముగ జేర్చి కాచబడినదియు, దానిమ్మ పండురసముచే పుల్లగ చేయబడినదియునైన పేయయను గంజిని, యిప్పించవలయును. మఱియు కరక్కాయ, మోడి, మారేడు, వీనితో కాచబడిన పేయను ఇప్పించిన వాతమున కనులోమగతి కలుగును.

అధిక దోషాతిసారికి విరేచనము.

విబద్ధం దోషబహుళో దీప్తాగ్నిర్యోఽతిసార్యతే,
కృష్ణావిడంగత్రిఫలాకషాయైస్తం విరేచయేత్. ౧౫
పేయాం యుంజ్యాద్విరిక్తస్య వాతఘ్నైర్దీపనైః కృతామ్,

దోషాధిక్యముగలవాఁడును, జాఠరాగ్నిదీపనముకలవాఁడును నగు రోగికి బద్ధగించి కొంచెము కొంచెముగ అతిసారము వెడలుచుండిన పిప్పళ్లు వాయువిడంగములు త్రిఫలములు వీనికషాయములతో విరేచనముచేయించి చక్కగ విరేచనమైన పిదప వాతహరముగను దీపనకారిగనునుండు ద్రవ్యములతో పక్వముచేయబడిన పేయను ఇప్పించవలయును. (ఇది వ్యాధివిపర్యస్తార్థకారిచికిత్స.)

అగ్నిదీపనముగల అతిసారరోగికి అన్నాదులు.

ఆమే పరిణతే యస్తు దీప్తేఽగ్నావుపవేశ్యతే. ౧౬
సఫేనపిచ్ఛం సరుజం సవిబంధం పునఃపునః,
అల్పాల్పముల్బం సమలం నిర్వీడ్వా సప్రవాహికమ్. ౧౭
దధితైలఘృతక్షీరైస్సశుంఠీం సగుడాం పిబేత్,
స్విన్నాని గుడతైలేన భక్షయేద్బదరాణి వా. ౧౮
గాఢవిడ్విహితైశ్శాకైర్బహుస్నేహైస్తథా రసైః,
క్షుధితం భోజయేదేనం దధిదాడిమసాధితైః. ౧౯
శాల్యోదనం తిలైర్మాషైర్ముద్గైర్వా సాధు సాధితమ్,
శుంఠ్యా మూలకపోతాయాః పాఠాయాస్స్వస్తికస్య వా. ౨౦
సునిషణ్ణకవాసీకర్కారుక్షీరిణీచిర్భటస్య వా,
ఉపోదకాయా జీవంత్యా వాకుచ్యా వాస్తుకస్య వా ౨౧
సువర్చలాయాశ్చుంచోర్వా లోణికాయా రసైరపి,
కూర్మవర్తకలోపాకశిఖితిత్తిరికౌక్కుటైః. ౨౨

అతిసారరోగికి ఆమదోషము జీర్ణమునొంది జాఠరాగ్నికి దీపనము కలిగియుండియు నురుగుగలదిగ జిగటగ శూలయుక్తముగ మలబంధముతో గూడినదిగ మిక్కిలి

స్వల్పముగ స్వల్పమలముతో గూడినదిగ లేక మలరహితముగనుండు అతిసారము ప్రవాహికతోడ వెడలుచుండిన అట్టి అతిసారరోగికి; పెరుగు, నువ్వులనూనె, నెయ్యి. పాలు, వీనిని సమభాగములుగ గ్రహించి; అందులో శుంఠి, బెల్లము, చేర్చి పానము చేయించవలయును. లేక రేగుపండ్లను ఉడకబెట్టి అందులో బెల్లము నువ్వుల నూనె కలిపి భక్షింపునటుల జేయవలయును. ఇటుల నొకప్పుడు శుంఠి చేర్చిన దధి తైలాదిపానము, మఱియొకప్పుడు ఉడికించిన రేగుపండ్లభక్షణము, వీనిని దోషావ్యను గుణముగ చేయించుటవలన ఆ యతిసారరోగికి మిక్కిలి యాకలిగలుగును. అట్టిసమయము న మలబంధచికిత్సలో చెప్పియుండు చక్రవర్తికూర మొదలగు శాకములతోడను, పెరుగు, పుల్లదానిమ్మపండ్లు, వీనితోడ పక్వముచేయబడినవియును, ఘృతాదిస్నేహములు అధికముగ చేర్చబడినదియునైన మాంసరసములతోడను, సంబావుబియ్యపు అన్నమును భుజింపజేయవలయును. లేక నువ్వులతోగాని, ఉద్దులతోగాని, పెసలతోగాని, చక్కగ పాకముచేయబడిన సంబావుబియ్యపు అన్నముకు భుజింపజేయవలయును. లేక కచోరములు, లేతముల్లంగి చిరుబొద్దికూర, చెంచలికూర, జెముడు, ఓమము, గుమ్మడి, పాలానుగు, దుంపబచ్చలి, మనుబాలకూర, బావంచి, చక్రవర్తికూర, ఆదిత్యభక్త (అనగా— సూర్యకాంతిచెట్టు) యెలుకజెడి, పులిచింత, వీనిలో దేనితోడగాని తాబేలు,మీనవల్లంకిపిట్ట, గుంటనక్క, నెమలి, తిత్తిరిపక్షి, కోడి, వీని మాంసరసములతోడగాని సంబావు, బియ్యపు అన్నమును భుజింపజేయవలయును.

## పక్వాతిసారరోగికి పేయాక్రమము.

బిల్వముస్తాతిభైషజ్య ధాతకీపుష్పనాగరైః,
పక్వాతిసారజిత్తక్రే యవాగూర్దాధికీ తథా. ౨౩
కపిత్థకచ్ఛగాఘంజీ యూథికావటశైలుజైః,
దాడిమీశాణకార్పాసీ శాల్మలీమోచపల్లవైః. ౨౪

మారేడు, తుంగముస్తలు, తెల్లలొద్దుగు, ఆరెపువ్వు, శుంఠి, వీనిని సమభాగములుగ ఆవుమజ్జిగలో చేర్చి పక్వముచేయబడిన యవలగంజి నిప్పించినను; లేక వెలగ, పిన్నరేగటి దూలగోవెల, గంటుభారంగి, అడివిమొల్ల, మట్టి, విరిగి, దానిమ్మ, జనప, ప్రత్తి, బూరుగ, ములుబూరుగ, వీని చిగుళ్లను సమముగ ఆవుపెరుగులో చేర్చి పక్వము చేయబడిన యవలగంజి నిప్పించినను పక్వాతిసారము శమించును.

## అతిసారరోగికి ఖలోపయోగము.

కలోక్త బిల్వశలాటూనాం తిలకల్కశ్చ తత్సమః,

దధ్నస్సరోఽమ్లస్సస్నేహః ఖలో హన్తి ప్రవాహికామ్. ౨౫

లేతమారేడుకాయలకల్కము, నువ్వులకల్కము, వీనిని సమభాగములుగ చేర్చి, అందులో పుల్లని పెరుగుమీదనుండు మీగడ, దేశకాలాద్యనుగుణమైన ఘృతాది స్నేహములు, వీనిని జేర్చి పక్వముచేయబడినది ఖలమనబడును. దీనిని అతిసారరోగి కిప్పించిన ప్రవాహికారోగము నివర్తించును.

### అపరాజిత ఖలము.

మరిచం ధనికాజాజీతిన్తిడీకశఠీబిడమ్,
దాడిమం ధాతకీ పాఠా త్రిఫలా పంచకోలకమ్. ౨౬
యావశూకం కపిత్థామ్ర జంబూమధ్యం సదీప్యకమ్,
పిష్టైః షడ్గుణబిల్వైస్త్రైర్దధ్ని ముద్గరసే గుడే. ౨౭
స్నేహే చ యమకే సిద్ధః ఖలోఽయమపరాజితః,
దీపనః పాచనో గ్రాహీ రుచ్యో బింబిశినాశనః. ౨౮

మిరియాలు, దనియాలు, జీలకఱ్ఱ, చింతపండు, కచోరములు, బిడాలవణము, దానిమ్మపండు, ఆరె, చిరుబొద్ది, త్రిఫలములు, పంచకోలములు, యవక్షారము, వెలగగుజ్జు, మామిడిపప్పు, నేరేడుపప్పు, ఓమము, ఇవి సమభాగములు; వీనికన్నిటికి ఆఱింతలు మారేడుగుజ్జు, ఇటుల వీనినొకటిగ చేర్చి చక్కగనూరి ఆవుపెరుగు, పెసరకట్టు, బెల్లము, యమకస్నేహము, వీనిలో పాకముచేసిన నది అపరాజితఖలమనబడును. దీనిని అతిసార రోగి కిప్పించిన అగ్నిదీపనముకలుగును. భుజించినయాహారము శీఘ్రముగ జీర్ణంబగును. మలము గట్టిపడును. రుచికలుగును. ప్రవాహికారోగము శమించును.

### క్షీణమలాతిసారికి అన్నాదులు.

కోలానాం బాలబిల్వానాం కల్కైః శాలియవస్య చ,
ముద్గమాషతిలానాం చ ధాన్యయూషం ప్రకల్పయేత్. ౨౯
ఐకత్థ్యం యమకే భృష్టం దధి దాడిమసారికమ్,
వర్చఃక్షయే శుష్కముఖం శాల్యన్నం తేన భోజయేత్. ౩౦
దధ్నస్సరం వా యమకే భృష్టం సగుడనాగరమ్,
సురాం వా యమకే భృష్టాం వ్యంజనార్థం ప్రయోజయేత్. ౩౧
ఫలామ్లం యమకే భృష్టం యూషం గృంజనకస్య వా,
భృష్టాన్వా యమకే సక్తూన్ ఖాదేద్వ్యోషావచూర్ణితాన్. ౩౨
మాషాన్ సుసిద్ధాం స్తద్వద్వా ఘృతమండోపసేవనాన్,

రసం సుసిద్ధం ఘృతం వా ఛ్ఛాగమేషాంతరాధిజమ్. 33
పచేద్దాడిమసారామ్లం సధాన్యస్నేహనాగరమ్,
తప్తశాల్యోదనం తేన భుంజానః ప్రపిబంశ్చ తమ్. 34
వర్చఃక్షయకృతై రాశు వికారైః పరిముచ్యతే,

రేగుపండ్లకల్కము, లేతమారేడుకాయలకల్కము, సంబావుబియ్యపుకల్కము, యవలబియ్యపుకల్కము, పెసరపప్పుకల్కము, ఉద్దిపప్పుకల్కము, నువ్వులకల్కము, వీనిని సమభాగములుగ గ్రహించి యొకటిగ చేర్చి; అందులో ఆవుపెరుగు, పుల్లదానిమ్మ పండురసము, వీనినికలిపి యమకస్నేహములో వేయించిన నది ధాన్యయూష మన బడును. మలము క్షయించుట, ముఖము శుష్కించుట, మొదలగు నుపద్రవములతో గూడియుండు అతిసారరోగికి పై ధాన్యయూషముతో సంబావుబియ్యపు అన్నమును భుజింపజేయవలయును. లేక పెరుగుమీదిమీగడను యమకస్నేహములో పక్వము చేసి, అందులో బెల్లము, శుంఠి, చూర్ణముకలిపి దానినిగాని; యమకస్నేహములో పక్వము చేయబడిన సురయనుమద్యమునుగాని; వెల్లుల్లియొక్క కట్టులో పుల్లదానిమ్మ మొదలగు అమ్లరసములనుచేర్చి దానినిగాని; మేక గొఱ్ఱె మాంసరసమును పక్వము చేసి వడియ కట్టి అందులో పుల్లదానిమ్మపండ్లరసము దనియాలు శుంఠి ఘృతాదిస్నేహములు వీనిని చేర్చి దానినిగాని; అతిసారరోగికి వ్యంజనార్థ మిప్పించవలయును. (వ్యంజనమనగా— అన్నములోకలిపి భుజింపదగిన ముద్దపప్పు దప్పళము మొదలగునవి) లేక వరిపేలాల పిండిని యమకస్నేహములో వేయించి త్రికటుకచూర్ణము కలిపి యిప్పించవలయును. ఉద్దులను ఉడికించి నేతిమీదిమీగడతో భక్షింపజేయవలయును. లేక పైమాంసరసము తోడ ఎఱ్ఱవరిబియ్యపు అన్నమును భుజించి యీ మాంసరసమును పానము చేయించ వలయును. ఇటుల జేసిన మలక్షయమువలన జనించిన వికారములన్నియు నివర్తించును.

ప్రవాహికాశూలచికిత్స.

బాలబిల్వం గుడం తైలం పిప్పలీవిశ్వభేషజమ్. 35
లిహ్యాద్వాతే ప్రతిహతే సశూలస్సప్రవాహికః,

అతిసారరోగికి వాతము బంధింపబడి ప్రవాహికాశూలగలిగినచో లేతమారేడు కాయలు, పాతబెల్లము, నువ్వులు, పిప్పళ్లు, శుంఠి, వీని నొకటిగ చేర్చి నూరి యిప్పించ వలయును.

ప్రవాహికాశూలయందు శాబరకల్కము.

వల్కలం శాబరం పుష్పం ధాతక్యా బదరీదళమ్, 36

పిబేద్దధి సరక్షౌద్రకపిత్థస్వరసాప్లుతమ్,

ప్రవాహికాశూలగలవానికి తెల్లలొద్దుగుపట్ట, రేగుచిగుళ్లు, ఆరెపువ్వు, వీనిని నూరి దానిని పెరుగుమీదిమీగడ, తేనె, వెలగగుజ్జు, స్వరసము, వీనిలోకలిపి పానము చేయించవలయును.

మలబంధాదియుక్తాతిసారి కౌషధము.

విబద్ధవాతవర్చాస్తు బహుశూలప్రవాహికః. 3౭

సరక్తపిచ్ఛస్తృష్ణార్తః క్షీరసౌహిత్యమర్హతి,

యమకస్యోపరి క్షీరం ధారోష్ణం వా ప్రయోజయేత్. 3౮

శృతమేరండమూలేన బాలబిల్వేన వా పునః,

అపానవాతమలములబంధనము,మిక్కుటముగ ప్రవాహికాశూల రక్తస్రావము విశేషముగ దప్పి, వీనిచే పీడితుడైన అతిసారరోగికి తృప్తికల్గునంత ఆవుపాలను పానము చేయించవలయును. లేక యమకస్నేహమును పానముచేయించి తోడనే ధారోష్ణముగనుండు ఆవుపాలను, లేక ఆముదపువేళ్లతోగాని లేత మారేడుకాయతో గాని కాచబడిన ఆవుపాలను పానముచేయించవలయును.

ఆమాజీర్ణహర క్షీరపానము.

పయస్యుత్క్వాథ్య ముస్తానాం వింశతింత్రిగుణేఽంభసి. 3౯

క్షీరావశిష్టం తత్పీతం హన్యాదామం సవేదనమ్,

12 పలముల జలములో 4పలములు ఆవుపాలుపోసి అందులో 20తుంగముస్తలు వైచి పాలుమాత్రము మిగులునటుల కాచి వడియకట్టి అతిసారరోగికి పానముచేయించిన వేదనలతోగూడియుండు ఆమాజీర్ణము శీఘ్రముగ నివర్తియగును.

ప్రవాహికయందు పిప్పల్యాదిచూర్ణము.

పిప్పల్యాః పిబతస్సూక్ష్మం రజో మరిచజన్మ వా. ౪౦

చిరకాలానుషక్తాపి నశ్యత్యాశు ప్రవాహికా,

పిప్పళ్లనుగాని మిరియాలనుగాని మృదువుగ చూర్ణముజేసి, శీతోదకములో కలిపి పానముచేయించిన చిరకాలముగనుండు ప్రవాహికారోగము శీఘ్రముగ నివర్తించును.“స్రుతే రక్తే పురీషే చ వాయునా విడ్వివర్జితమ్, ప్రవాహికేతి విఖ్యాతం యత్ఫేనాభం ప్రవర్తతే.” అతి సారరోగికి రక్తముగాని మలముగాని వెడలినపిదప వాతప్రకోపముచే శూలతోగూడి నురుగుగ వెడలుమలము ప్రవాహిక యనబడునని ప్రవాహికారోగలక్షణము తంత్రాంతరమునందు చెప్పబడియున్నది.

### ఆమరహితాతిసారికి క్షారఘృతము.

నిరామరూపం శూలార్తం లంఘనాద్యైశ్చ కర్శితమ్. ౪౧
రూక్షకోష్ఠమపేక్ష్యాగ్నిం సక్షారం పాయయేద్ఘృతమ్,

ఆమాజీర్ణములేనివాడును, నొప్పిగలవాడును, లంఘనాదులచే కృశించినవాడును, రూక్షకోష్ఠముగలవాడును నగు అతిసారరోగికి, జాఠరాగ్నిబలానుగుణముగ ఆవునేతిలో సర్జక్షారమును కలిపి పానముచేయించవలయును.

### అతిసారశూలహర తైలము.

సిద్ధం దధిసురామండే దశమూలస్య చాంభసి. ౪౨
సింధూత్థపంచకోలాభ్యాం తైలం సద్యోఽర్తినాశనమ్,

పెరుగుమీదిమీగడ, సురయనుమద్యముమీది మీగడ, వీనిలోగాని, దశమూల కషాయములోగాని, సైంధవలవణము పంచకోలకల్కము వీనినికలిపి అందులో నువ్వులనూనెబోసి తైలపాకవిధిగ కాచి దానిని ప్రయోగించిన ప్రవాహికోపద్రవము తత్క్షణమే హరించును.

### అతిసారరోగమునకు శుంఠ్యాదితైలము.

షడ్భిః శుంఠ్యాః పలైర్ద్వాభ్యాం ద్వాభ్యాం గ్రంథ్యగ్నిసైంధవాత్.
తైలప్రస్థం పచేద్దధ్నా నిస్సారకరుజాపహమ్,

శుంఠి 6 పలములు, మోడి చిత్రమూలము సైంధవలవణము యివి దినుసుకు రెండేసి పలములు, వీటిని 2 ప్రస్థము తైలములో వైచి, ఆవుపెరుగును కలిపి తైలపాకవిధిగ కాచి ప్రయోగించిన ప్రవాహికరోగము శమించును.

### తైలమునకు మలబంధశూలవాతహరత్వము.

ఏకతో మాంసదుగ్ధాజ్యం పురీషగ్రహశూలజిత్. ౪౪
పానానువాసనాభ్యంగప్రయుక్తం తైలమేకతః,
తద్ధి వాతజితామగ్ర్యం శూలంచ విగుణోఽనిలః. ౪౫

మాంసము, ఆవుపాలు, నెయ్యి యివి మలబంధమును శూలను పోగొట్టును. తైలమునుమాత్రము పానానువాసనవస్త్యభ్యంగములయందు ప్రయోగించిన నది మలబంధమును శూలను పోగొట్టును. అయితే ప్రకోపించిన వాతము శూలను గలగజేయును. వాతప్రకోపమునుశమింపజేయునట్టి యౌషధములయందు తైలము మొదటిది. కావున మలబంధశూలలను పోగొట్టుటయందు మాంసము పాలు నెయ్యి అనువానికంటే తైలమే కడుశ్రేష్ఠంబుగ నుండును.

### తైలమునకు ప్రవాహికాహరత్వము.

ధాత్వంతరోపమర్దాద్ధి చలో వ్యాపీ స్వధామగః,
తైలం మందానలస్యాపి యుక్త్యా శర్కరం పరమ్,
వాయ్వాశయే సతైలేహి బింబిసీ నావతిష్ఠతే. ౪౬

వాతము చలనస్వభావముగుటంజేసి శరీరమంతటవ్యాపించునట్టి స్వభావముగలదిగ నుండినను పిత్తశ్లేష్మములు మొదలగు నితర ధాతువులయొక్క ప్రకోపమువలన నది స్వస్థానమైన పక్వాశయమునందే వృద్ధిజెందుచుండును. అట్టియవస్థయందు అతిసార రోగికి అగ్నిమాంద్యముగలిగినచో సమభాగము శర్కరయుకలిపిన తైలముయుక్తిచే ప్రయోగించిన సుఖముకలుగును. ఏలననగా—పక్వాశయము తైలముతోగూడియుండిన ప్రవాహికోపద్రవము లేకుండును.

### తైలమునకు కోష్ఠశూలహరత్వము.

క్షీణే మలే స్వాయతనచ్యుతేషు దోషాంతరేష్వీరణ ఏకవీరే,
కో నిష్టనన్ ప్రాణితి కోష్ఠశూలీ నాంతర్బహిస్తైలపరో యదిస్యాత్.

మలము క్షయించి పిత్తకఫంబులు స్వస్థానమును విడిచి వాతము మిక్కుటముగ వృద్ధిజెందియుండునపుడు మిక్కిలికడుపునొప్పితో మూల్గుచును యేడ్చుచునుండు అతిసారరోగికి బాహ్యాభ్యంతరములలో పానానువాసనాభ్యంగములయందు తైలమునుప యోగించవలయును. అటుల చేయకుండిన రోగి జీవింపనేరడు.

### గుదశూలాదులయందు కోలాదిఘృతము.

గుదరుగ్భ్రంశయోర్వ్యంజ్యాత్సక్షీరం సాధితం హవిః,
రసే కోలామ్లచాంగేర్యోర్దధ్ని పిష్టే చ నాగరే. ౪౭

గుదశూల, గుదభ్రంశము ఈరెండు రోగములయందు రేగు, పుల్లప్రబ్బలి, పులిచింత వీనిరసము ప్రత్యేకమొక్కొక్కభాగము, ఆవుపెరుగు 1 భాగము, ఇటుల వీని నొకటిగచేర్చి అందులో శుంఠికల్కముకలిసి దానిలో ఆవుపాలు ఆవునెయ్యి వీనిని సమభాగములుగ బోసి ఘృతపాకవిధిగ పక్వముచేసి పానముచేయించవలయును.

### గుదశూలహరఘృతము.

తైరేవ చామ్లైస్సంయోజ్య సిద్ధం సుశ్లక్ష్ణకల్కితైః,
ధాన్యోషణబిడాజాజీపాంచకోలకదాడిమైః ౪౮

దనియాలు, పిప్పళ్లు, బిడాలవణము, జీలకఱ్ఱ, పంచకోలములు, దానిమ్మ పండు, వీనిని సమభాగములుగ గ్రహించి చక్కగ చూర్ణముచేసి ఆవునేతిలో కలిపి,

అందులో రేగు, పుల్లప్రబ్బలి, పులిచింత వీనిరసములుచేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి యా ఘృతము నతిసారరోగి కిప్పించిన గుదభ్రంశము గుదశూల శమించును.

గుదశూలహరవస్తి.

యోజయేత్స్నేహవస్తిం వా దశమూలేన సాధితమ్,
శఠీశతాహ్వాకుష్ఠైర్వా వచయా చిత్రకేణ వా. ౫౦

గుదశూలయందు దశమూలముతోగాని, కచోరములు, పిల్లిపీచర, చెంగల్వకోష్ఠువు, వీనితోగాని, వసతోగాని, చిత్రమూలముతోగాని, కాచబడిన ఘృతముచే స్నేహవస్తిని ప్రయోగించవలయును.

ప్రవాహికాదులయం దనువాసనవస్తి.

ప్రవాహణే గుదభ్రంశే మూత్రాఘాతే కటిగ్రహే,
మధురామ్లైశ్శృతం తైలం ఘృతం వాప్యనువాసనమ్. ౫౧

ప్రవాహిక, గుదభ్రంశము, మూత్రప్రతిబంధము, నడుముపట్లు, వీనియందు మధురరసము, అమ్లరసముగల ద్రవ్యములతో కాచబడిన నువ్వులనూనెగాని, ఘృతముగాని, అనువాసనవస్తియందు ప్రయోగించవలయును.

గుదభ్రంశచికిత్స.

ప్రవేశయేద్గుదం ధ్వస్తమభ్యక్తం స్వేదితం మృదు,
కుర్యాచ్చ గోఫణాబంధం మధ్యచ్ఛిద్రేణ చర్మణా. ౫౨

గుదభ్రంశరోగమునందు గుదమునకు అభ్యంగ స్వేదకర్మలను చేయించి యది మృదువైనపిదప నాగుదముదు లోపలికి త్రోసి చర్మమునకు నడుమ ద్వారముచేసి దానిచే గోఫణాబంధ మనుకట్టును కట్టవలయును.

గుదభ్రంశహర తైలము.

పంచమూలస్య మహతః క్వాథం క్షీరే విపాచయేత్,
ఉందురుం చాంత్రరహితం తేన వాతఘ్నకల్కవత్. ౫3
తైలం పచేద్గుదభ్రంశం పానాభ్యంగేన తజ్జయేత్,

మహాపంచమూలములకషాయము, నువ్వులనూనె వీనిని సమభాగములుగ గ్రహించి యొకటిగచేర్చి అందులో ప్రేగులుయెత్తివేసిన యెలుకమాంసముతోడ కాచబడిన ఆవుపాలను నువ్వులనూనెకు నాలుగింతలుకలిపి వాతహారములైన దుంపరాష్ట్రము మొదలగు ద్రవ్యములయొక్క కల్కమును చేర్చి, విధిప్రకారము (స్నేహపాకపరిభాష

ననుసరించి) పాకముచేసి, యాతైలమును పానాభ్యంగములయందు ప్రయోగించిన గుదభ్రంశము హరించును.

## పిత్తాతిసారచికిత్స.

పైత్తే తు సామే తీక్ష్ణోష్ణవర్జం ప్రాగివ లంఘనమ్. ౫౪

ఆమముతో గూడియుండు పిత్తాతిసారమునందు పూర్వము వాతాతిసారమునకుచెప్పియుండు లంఘనాదిచికిత్సలు పేయాదిక్రమములు మొదలగువానిని చేయించవలయునేగాని తీక్ష్ణోష్ణచికిత్సలను చేయంజనదు.

## పిత్తాతిసారికి పేయాదిక్రమము.

తృడ్వాన్ పిబేత్షడంగాంబు సభూనింబం సశారిబమ్,
పేయాది క్షుధితస్యాన్నమగ్నిసంధుక్షణం హితమ్. ౫౫
బృహత్యాదిగణాభీరుద్విబలాశూర్పపర్ణిభిః,

పిత్తాతిసారరోగికి దప్పికగలిగినచో జ్వరచికిత్సయందు చెప్పియుండుషడంగోదకములో నేలవేము, నల్లసుగంధిపాల వీనిని చేర్చి కాచి యాయుదకము నిప్పించవలయును. చక్కగ నాకలికలిగినతోడనే జాఠరాగ్ని దీపనము కలుగజేయునదియు, బృహత్యాదిగణములో చెప్పియుండు ద్రవ్యములు, పిల్లిపీచర, బల, అతిబల, అడవిమినుములు, పిల్లిపెసర, అనువానితో పాకముచేయబడినదియునైన యన్నపేయాదులను ఇప్పించవలయును.

## పిత్తాతిసారమునకు పాఠాదికల్కము.

పాయయేదనుబంధే తు సక్షౌద్రం తండులాంభసా. ౫౬
పాఠావత్సకబీజత్వగ్దార్వీగ్రంథికశుంఠి వా,
వత్సకస్య ఫలం పిష్టం సవల్కం సఘుణప్రియమ్. ౫౭
క్వాథం చాతివిషాబిల్వవత్సకోదీచ్యముస్తజమ్,
అథ వాఽతివిషామూర్వానిశేంద్రయవతార్క్ష్యజమ్. ౫౮
సమధ్వతివిషాశుంఠీముస్తేంద్రయవకట్ఫలమ్,

పిత్తాతిసారరోగికి పైచెప్పినప్రకారము లంఘనాదిచికిత్సలను చేయించియు పేయాద్యాహారములను ఇప్పించియు పైరోగము శమింపకయుండినచో చిరుబొద్ది, కొడిసెవిత్తులు, కొడిసెపట్ట, మ్రానిపసుపు, మోడి, శుంఠి వీనినిగాని, కొడిసెవిత్తులు, కొడిసెపట్ట, నేలదంతి వీనినిగాని, బియ్యపుకడుగుతో నూరి తేనెతోడ పానము చేయించవలయును, లేక అతివస మారేడు కొడిసె కురువేరు తుంగముస్తలు వీనికషా

యముసుగాని, అతివస, చాగ, పసుపు, కొడిసెవిత్తులు, రసాంజనము, వీనికషాయమును గాని పానము చేయించవలయును. లేక అతివస, శుంఠి, తుంగముస్తలు, కొడిసెవిత్తులు, గుమ్మడు వీనికషాయమునుగాని, తేనెతోడ పానము చేయించవలయును.

పిత్తాతిసారమునకు వత్సకకషాయాదులు.

పలం వత్సకబీజస్య శ్రపయిత్వా రసం పిబేత్. ౭౯
యో రసాశీ జయేచ్ఛీఘ్రం స పైత్తం జఠరామయమ్,
ముస్తాకషాయమేవం వా పిబేన్మధుసమాయుతమ్. ౮౦
సక్షౌద్రం శాల్మలీవృంతకషాయం వా హిమాహ్వయమ్,

1 పలము కొడిసెవిత్తుల నుదకములో నుడికించి యారసమును పానము చేయించి, మాంసరసమునిప్పించిన పిత్తజాతిసారము నివర్తించును. ఇటులనే 1 పలము తుంగముస్తలను నుదకములోవైచి చక్కగ పాకముచేసి యారసము తేనెతోడగాని, లేక బూరుగపట్టను దంచి యుదకములో నానవేసి పడియకట్టి యా శీతకషాయము తేనెతోడగాని, పానము చేయించిన పిత్తజాతిసారము నివర్తించును.

పిత్తాతిసారమునకు కిరాతతిక్తాది యోగములు.

కిరాతతిక్తకం ముస్తం వత్సకం సురసాంజనమ్. ౮౧
కటంకటేరీ హ్రీబేరం బిల్వమధ్యం దురాలభామ్,
తిలాన్మోచరసం లోధ్రం సమంగాం కమలోత్పలమ్. ౮౨
నాగరం ధాతకీపుష్పం దాడిమస్య త్వగుత్పలమ్,
అర్ధశ్లోకైః స్మృతా యోగాస్సక్షౌద్రాస్తండులాంబునా. ౮౩

నేలవేము, తుంగముస్తలు, కొడిసెవిత్తులు రసాంజనము వీనిని సమభాగములుగ గ్రహించి నూరి బియ్యపుకడుగులో కలిపి కొంచెము తేనెజేర్చి పిత్తాతిసార రోగికి ఇప్పించవలయును. ఇటులనే మ్రానిపసుపు, కురువేరు, మారేడుగుజ్జు, దూలగొండిల, వీనిని సమభాగములుగ గ్రహించి నూరి బియ్యపుకడుగులో కలిపి తేనెసహితముగ నిప్పించవలయును. మఱియు నువ్వులు, బూరుగుబంక లొద్దుగు, మంజిష్ఠి, తామరపువ్వు, నల్లకలువ, వీనిని సమభాగములుగ గ్రహించి నూరి బియ్యపుకడుగులోకలిపి తేనెసహితముగ నిప్పించవలయును. శుంఠి, ఆరెపువ్వు, దానిమ్మబెరడు, నల్లకలువ, వీనినిసమభాగములుగ గ్రహించి నూరి బియ్యపుకడుగులోకలిపి తేనెసహితముగ నిప్పించవలయును. ఈ యోగంబులు పిత్తాతిసారంబున మిగుల శ్రేష్ఠంబుగ నుండును.

పక్వాతిసారచికిత్స.

నిశేంద్రయవరోధ్రైలాక్వాథః పక్వాతిసారనుత్,

రోధ్రాంబష్ఠాప్రియంగ్వాది గణాం స్తద్వత్పృథక్పిబేత్. ౬౪

పసపు, కోడిసెవిత్తులు, లొద్దుగ, ఏలకులు, వీనిని సమభాగములుగ గ్రహించి యుదకములోవైచి కషాయముకాచి యిప్పించిన పక్వాతిసారముహరించును. మఱియు లొద్దుగ, చిరుబొద్ది, రోధ్రాదిగణద్రవ్యములు, అంబష్ఠాదిగణద్రవ్యములు ప్రియంగ్వాదిగణములోచెప్పియుండు ద్రవ్యములు, వీనిని ప్రత్యేక ప్రత్యేకముగనూరి బియ్యపుకడుగులోకలిపి తేనెసహితముగ నిప్పించిన పక్వాతిసారము హరించును.

పక్వాతిసారరోగికి పేయాదులు.

కట్వంగవల్కయష్ట్యాహ్వాఫలినీదాడిమాంకురైః,
పేయావిలేపీఖలకాన్ కుర్యాత్సదధిదాడిమాన్, ౬౫
తద్వద్దధిత్థబిల్వామ్ర జంబుమధ్యైః ప్రకల్పయేత్,

దుండిలపుపట్ట అతిమధురము, ప్రేంకణము, దానిమ్మచిగుళ్లు, వీనితోపక్వముచేయబడిన పేయయును, విలేపి, ఖలము, వీనిని పెరుగు దాడిమరసము వీని సహితముగ పిత్తాతిసారికి ఇప్పించవలయును. ఇటులనే వెలగగుజ్జు, మారేడుగుజ్జు, మామిడివిత్తులు, నేరేడువిత్తులు, వీనితోడపై పేయాదులను పక్వముచేసి పెరుగుదానిమ్మపండురసము, వీనినిచేర్చి అతిసారరోగి కిప్పించవలయును.

పిత్తాతిసారరోగికి విరేచనము.

అజాపయః ప్రయోక్తవ్యం నిరామే తేన చేచ్ఛమః, ౬౬
దోషాధిక్యాన్న జాయేత బలినం తం విరేచయేత్,

పిత్తాతిసారరోగికి అజీర్ణములేకుండునపుడు మేకపాలను పథ్యముగ నిప్పించవలయును. మేకపాలను పానముచేయించియు దోషాధిక్యముచే అతిసారరోగము శమింపకయుండినచో బలిష్ఠుడుగనుండు నా రోగికి విరేచనమున కొసంగవలయును.

రక్తాతిసారమునకు పలాశాదికషాయము.

వ్యత్యాసేన శకృద్రక్తముపవేశ్యేత యోఽపి వా. ౬౭
పలాశఫలనిర్యూహం యుక్తం వా పయసా పిబేత్,
తతోఽను కోష్ణం పాతవ్యం క్షీరమేవ యథాబలమ్. ౬౮
ప్రవాహితే తేన మలే ప్రశామ్యత్యుదరామయః,
పలాశవత్ప్రయోజ్యా వా త్రాయమాణా విశోధనీ. ౬౯

అతిసారరోగికి మలము రక్తము ఇవి వ్యత్యాసముగ (అనగా—తొలుత మలము పిదప రక్తము, తొలుత రక్తము పిదప మలము) వెడలినచో మోదుగువిత్తులకషాయ

మునుగాని, లేక యా కషాయములో ఆవుపాలనుచేర్చిగాని, పానము జేయించి తోడనే సుఖోష్ణముగనుండు నావుపాలను రోగి బలానుగుణముగ పానముచేయించ వలయును. ఇటులచేసిన క్షీరపానముచే మలము బైలువెడలి కడుపునొప్పితోగూడ అతిసారము శమించును. లేక కలుక్రానుగ కషాయముగాని, లేక దానిలో యావు పాలుచేర్చిగాని, విరేచనార్థము పానముచేయించవలయును.

పక్వాతిసారరోగి కనువాసనవస్తి.

సంసర్గ్యాం క్రియమాణాయాం శూలం యద్యనువర్తతే,
స్రుతదోషస్య తం శీఘ్రం యథావహ్న్యనువాసయేత్. ౭౦

పైచెప్పిన ప్రకారము విరేచనౌషధసేవనముచే మలము చక్కగబైలువెడలి యుండు అతిసారరోగికి పేయ మొదలగు పథ్యాహారములను ఇప్పించవలయును. ఇటుల జేసియు మరల నతిసారోపద్రవము కలుగుచుండిన నారోగికి శీఘ్రముగ అనువాసన వస్తిని చేయించవలయును.

అనువాసన ఘృతము.

శతపుష్పావరీభ్యాం చ బిల్వేన మధుకేన చ,
తైలపాదం పయోయుక్తం పక్వమన్వాసనం ఘృతమ్. ౭౧

నువ్వులనూనె 1 భాగము, ఘృతము 1 భాగము, ఆవుపాలు 1 భాగము, వీని నొకటిగకలిపి; అందులో సదాప, పిల్లిపీచర, మారేడు, అతిమధురము అనువానిని సమభాగములుగజేర్చి విధిప్రకారము పక్వముచేయబడిన ఘృతముచే నతిసారరోగికి అనువాసనవస్తిని చేయించవలయును.

అతిసారరోగికిపిచ్ఛా వస్తి.

అశాంతావిత్యతీసారే పిచ్ఛావస్తిః పరం హితః,

పై చెప్పియుండు ప్రకారము అనువాసనవస్తిని చేయించినను అతిసారము నివర్తించకయుండిన ఉత్తరత్ర చెప్పంబడు పిచ్ఛావస్తిని చేయించవలయును. (పిచ్ఛావస్తి అనగా—అల్పమాత్రగా ప్రయోగింపబడు నిరూహవస్తి.)

పిచ్ఛావస్తి క్రమము.

పరివేష్ట్య కుశైరార్ద్రైరార్ద్రవృంతాని శాల్మలేః. ౭౨
కృష్ణమృత్తికయాఽఽలిప్య స్వేదయేద్గోమయాగ్నినా,
మృచ్ఛోషితాని సంక్షుద్య తత్పిండం ముష్టిసంమితమ్. ౭౩
మర్దయేత్పయసః ప్రస్థే పూతేనాస్థాపయేత్తతః,

నతయష్ట్యాహ్వకల్కాజ్య క్షౌద్రతైలవతా ఒను చ.
స్నాతో భుంజీత పయసా జాంగలేన రసేన వా. ౭౪
పిత్తాతిసారజ్వరశోఫగుల్మ సమీరణాస్రగ్రహణీవికారాన్,
జయత్యయం శీఘ్రమతి ప్రవృత్తిం విరేచనాస్థాపనయోశ్చ వస్తిః.

పచ్చివిగనుండు బూరుగు పువ్వులయొక్క కాడలను గ్రహించి యొకటిగజేర్చి దానిపైన పచ్చి దర్భగడ్డిని చక్కగచుట్టి పైని నల్లమట్టిని లేపనముచేసి యెరుపిడకలతో పుటమువేసి పైమన్ను యొండినతోడనే దానినియెత్తి లోపలనుండు కాడలనునలియ గొట్టి అందుండి పలప్రమాణము ఉంటనుయెత్తుకొని చక్కగనూరి దానిని 1 ప్రస్థమావు పాలలోకలిపి, వడియగట్టి అందులో గ్రంథితగరము, అతిమధురము, వీనిని సమభాగములుగ గ్రహించి చేయబడినకల్కము; నెయ్యి, తేనె, నువ్వులనూనె, వీనినికలిపి దానిచే అతిసారరోగికి పిచ్ఛావస్తిని చేయించవలయును. పిదప వానికి స్నానము చేయించి ఆవుపాలతోగాని జాంగలమాంసరసముతోగాని దేహసాత్మ్యానుగుణముగ నాహారమునిప్పించవలయును. ఈ వస్తిప్రయోగము పిత్తాతిసారము, వాపు, గుల్మము, వాతరక్తము, గ్రహణీరోగము, వీనిని హరింపజేయును. మఱియు విరేచనము ఆస్థాపన వస్తి వీనియందు అతియోగమువలనజనించు నుపద్రవములను శీఘ్రముగ హరింపజేయును.

## అతిసార సామాన్య చికిత్స.

ఫాణితం కుటజోత్థం చ సర్వాతీసారనాశనమ్,
వత్సకాదిసమాయుక్తం సాంబష్ఠాదిసమాతికమ్. ౭౬

కొడిసెవిత్తులచూర్ణము, వత్సకాదిగణచూర్ణము, అంబష్ఠాదిగణచూర్ణము, వీనిని సమభాగములుగ గ్రహించి అందులో ఖండశర్కరను కలిపి తేనెనుచేర్చి యిప్పించిన ఆమాతిసారపక్వాతిసారములు హరించును.

## అతిసారరోగమునందు పుటపాకము.

నిరుజ్జీరామం దీప్తాగ్నేరపి సాస్రం చిరోత్థితమ్,
నానావర్ణమతీసారం పుటపాకైరుపాచరేత్. ౭౭

అగ్నిదీపనముగల అతిసారరోగికి శూల, అజీర్ణము, రక్తస్రావము, ఇవి లేనిదియు; లేక రక్తస్రావముతోగూడినదియు, జనించి బహుకాలమైనదియు; నానావిధ వర్ణములు గలదియునైన అతిసారమును పుట పాకంబులచే చికిత్స చేయనగును.

## అతిసారరోగికి దీర్ఘవృంత రసము.

త్వక్పిండాద్దీర్ఘవృంతస్య శ్రీపర్ణీపత్రసంవృతాత్,

మృల్లిప్తాదగ్నినా స్విన్నాద్రసం నిష్పీడితం హిమమ్. ౨౮
అతీసారీ పిబేద్యుక్తం మధునా సితయాఽథవా,

దుందిలపుపట్టనునూరి ఉంటలుజేసి గుమ్మడియాకులోచుట్టి పైన నల్లమట్టిని బూసి యేరుపిడకలతో పుటము వేసియెత్తుకొని రసముపిండిచల్లార్చి దానిని తేనెతో గాని పంచదారతోగాని పానము చేయించిన నానావర్ణములుగల అతిసారము హరించును.

## క్షీరవృక్షత్వగాది రసము.

ఏవం క్షీరద్రుమత్వగ్భిస్తత్ప్ర రోహైశ్చ కల్పయేత్. ౨౯
కట్వంగత్వగ్ఘృతయుతా స్వేదితా సలిలోష్మణా,
సక్షౌద్రా హంత్యతీసారం బలవంతమపి ద్రుతమ్. ౩౦

మఱ్ఱిమొదలగు క్షీరి వృక్షములయొక్క పట్టలను, లేక చిగుళ్లను, లేక ఊడలను నూరి యుంటజేసి దానిపై గుమ్మడియాకుచుట్టి నల్లమట్టినిబూసి ఏరుపిడకలతో పుటమువేసి బైటికితీసి రసమునుపిండుకొని చల్లార్చి అందులో తేనెగాని పంచదారగాని కలిపి పానము చేయించిన అతిసారము హరించును. మఱియు దుందిలపు పట్టను నూరి యుంటజేసి నీటియావిరిలో పాకము జేసి దానిరసమును గ్రహించుకొని అందులో తేనె నెయ్యి కలిపి పానముచేయించిన దారుణమైన యతిసారములన్నియు శీఘ్రముగ హరించును.

## రక్తాతిసారహరాన్న పానాదులు.

పిత్తాతిసారీ సేవేత పిత్తలాన్యేవ వా పునః,
రక్తాతిసారం కురుతే తస్య పిత్తం సతృడ్జ్వరమ్. ౩౧
దారుణం గుదపాకం చ తత్ర చ్ఛాగం పయో హితమ్,
పద్మోత్పలసమంగాభిశ్శృతం మోచరసేన వా. ౩౨
సారిబాయష్టిలోధ్రైర్వా ప్రసవైర్వా వటాదిజైః,
సక్షౌద్రశర్కరం పానే భోజనే గుదసేచనే. ౩3

పిత్తాతిసారముగలవాడు పిత్తప్రకోపకరములైన యన్నపానాదులను సేవింపుచుండిన వానికి పిత్తము ప్రకోపించి దారుణమైనదప్పి జ్వరము వీనితోగూడియుండు రక్తాతిసారము, గుదపాకము, వీనినిగలుగజేయును. ఆ రక్తాతిసారమునందు తామరపువ్వు, నల్లకలువ, మంజిష్ఠి. వీనినిగాని; బూరుగుబంకనుగాని; నల్లసుగంధిపాల, అతిమధురము, లొద్దుగు, వీనినిగాని; మఱ్ఱిమొదలగు క్షీరివృక్షములయొక్క చిగుళ్లనుగాని, చేర్చికాచబడిన మేకపాలను, తేనె పంచదార అనుపానితోడ పానము భోజనము గుదసేకము మొదలగువానియం దుపయోగించిన హితముకలుగును.

## రక్తాతిసారమునందు మాంసరసాదులు.

తద్వద్రసాదయోఽనమ్లాస్స్నాజ్యాః పానాన్నయోర్హితాః,
కాశ్మర్యఫలయూషశ్చ కించిదమ్లస్సశర్కరః. ౧౪

పులుసులేని మాంసరసము కట్టులు వీనిని ఆవునేతితోడ నన్నపానాదులయందు ప్రయోగించిన పిత్తాతిసారికి హితముకలుగును. మఱియు కొంచముపుల్లగ పంచదార చేర్చబడినదిగనుండు గుమ్మిడిపండుచే జేయబడినకట్టుగూడ హితకరముగనుండును.

## రక్తాతిసారమునందు పేయాక్రమము.

పయస్యర్ధోదకే ఛాగే హ్రీబేరోత్పలనాగరైః,
పేయారక్తాతిసారఘ్నీ పృశ్నిపర్ణీరసాన్వితా. ౧౫
ప్రాగ్భక్తం నవనీతం వా లిహ్యాన్మధుసితాయుతమ్,

మేకపాలు 1 భాగము, నీళ్ళు $\frac{1}{2}$ భాగముపోసి, అందులో కురువేరు, నల్లకలువ, శొంఠి, వీనిని సమభాగములుగ చేర్చి పక్వము చేయబడిన గంజిని, ముయ్యాకుపొన్న కషాయముతో పానము చేయించినను; లేక భోజనాత్పూర్వము ఆవువెన్నలో పంచదార తేనె కలిపి నాకించినను రక్తాతిసారము హరించును.

## రక్తాతిసారమునం దజారక్తోపయోగము.

బలిన్యస్రే ప్రమేవాజం మార్గం వా ఘృతభర్జితమ్. ౧౬
క్షీరానుపానం క్షీరాశీ త్ర్యహం క్షీరోద్భవం ఘృతమ్,
కపింజలరసాశీ వా లిహన్నారోగ్యమశ్నుతే. ౧౭

రక్తాతిసారరోగికి రక్తము విశేషముగ వృద్ధిజెందుచుండినచో మేకరక్తమును గాని, జింకరక్తమునుగాని, ఆవునెయ్యిలో పక్వము చేసి, దానిని భుజింపజేసి, ఆవుపాలను అనుపానముగను ఆహారముగను ఇప్పించవలయును. లేక పాలనుండి తియ్యబడిన నెయ్యిని మూడు దినములునాకించుచు కపింజలపక్షిమాంసరసమును ఆహారముగ నిప్పించవలయును. ఇటుల జేసిన రక్తాతిసారరోగికి ఆరోగ్యము కలుగును.

## రక్తాతిసారమునందు శతావరీకల్కము.

పీత్వా శతావరీకల్కం క్షీరేణ క్షీరభోజనః,
రక్తాతిసారం హంత్యాశు తయా వా సాధితం ఘృతమ్. ౧౮

పిల్లిపీచరకల్కమును ఆవుపాలలో కలిపిగాని, లేక పిల్లిపీచరరసముతో పక్వము చేయబడినఘృతమునుగాని, పానముచేయించి, ఆవుపాలను ఆహారముగనిప్పించిన రక్తాతిసారము శీఘ్రముగ హరించును.

### రక్తాతిసారమున లాక్షాఘృతము.

లాక్షానాగర వైదేహీ కటుకాదార్వివల్కలైః,
సర్పిస్సేంద్రయవైస్సిద్ధం పేయామండావచారితమ్. ౮౯
అతిసారం జయేచ్ఛీఘ్రం త్రిదోషమపి దారుణమ్,

లక్క, శొంఠి, పిప్పళ్లు, కటుకరోహిణి, మ్రానిపసపుబెరడు, కొడిసెవిత్తులు, వీనిని సమభాగములుగ ఆవునేతిలో చేర్చి విధిప్రకారము పక్వముచేయబడిన ఘృతమును పేయామండము అనుగంజిలో కలిపి పానముచేయించిన దారుణమగు సన్నిపాతాతిసారము శీఘ్రముగ నివర్తించును.

### రక్తాతిసారమున కృష్ణమృత్తికాది చూర్ణము.

కృష్ణమృచ్ఛంఖయష్ట్యాహ్వాక్షౌద్రాసృక్తండులోదకమ్. ౯౦
జయత్యస్రం ప్రియంగుశ్చ తండులాంబు మధుప్లుతా,

నల్లమట్టి, శంఖము, అతిమధురము, వీని చూర్ణము, తేనె, రక్తము, వీనిని బియ్యపుకడుగులో కలిపి పానముచేయించినను; బియ్యపుకడుగు, తేనె, వీనిలో ప్రేంకణమును కలిపి పానముచేయించినను రక్తాతిసారము శమించును.

### రక్తాతిసారమునకు తిలకల్కము.

కల్కస్తిలానాం కృష్ణానాం శర్కరాపాంచభాగికః. ౯౧
ఆజేన పయసా పీతస్సద్యో రక్తం నియచ్ఛతి,

నల్లనువ్వులకల్కము 4 భాగములు, పంచదార 1 భాగము, వీనిని మేకపాలలో కలిపి పానముచేయించిన తత్క్షణమే రక్తాతిసారము నివర్తించును.

### రక్తాతిసారమున చందనకల్కము.

పీత్వా సశర్కరాక్షౌద్రం చందనం తండులాంబునా. ౯౨
దాహతృష్ణాప్రమేహేభ్యో రక్తస్రావాచ్చ ముచ్యతే,

బియ్యపుకడుగులో చందనమునునూరికలిపి పంచదార, తేనె, చేర్చి పానము చేయించిన సర్వాంగతాపము, దప్పి, ప్రమేహము, రక్తస్రావము, హరించును.

### రక్తాతిసారికి గుదదాహ చికిత్స.

గుదస్య దాహే పాకే వా సేకలేపా హితాహిమాః. ౯3

రక్తాతిసారరోగికి గుదమున మంటగాని పాకము (పుండు)గాని కలిగియుండిన చో శీతలమైన సేకము లేపము చేయించవలయును.

### శూలసహితరక్తాతిసారమునందు పిచ్ఛావస్తి.

అల్పాల్పం బహుశో రక్తం సశూలముపవేశ్యతే,
యదా విబద్ధో వాయుశ్చ కృచ్ఛ్రాచ్చరతి వా న వా. ౯౪
పిచ్ఛావస్తిం తదా తస్య పూర్వోక్తముపకల్పయేత్,

అతిసారరోగికి రక్తము కొంచెముకొంచెముగ పలుమారు శూలతోగూడి వెడలుచుండినను, అధికముగ రక్తము వెడలుచుండినను, అపానవాతము బంధింపబడి బహుకష్టముమీద వెడలినను, లేక వెడలకుండినను, అట్టి రోగికి పూర్వము చెప్పియుండు త్వక్పిండము పిచ్ఛావస్తి మొదలగువానిని ప్రయోగింపవలయును,

### గుదభ్రంశాదిహర పిచ్ఛావస్తి.

పల్లవాన్ జర్జరీకృత్య శింశుపాకోవిదారయోః. ౯౫
పచేద్యవాంశ్చ సక్వాథో ఘృతక్షీరసమన్వితః,
పిచ్ఛాస్రుతౌ గుదభ్రంశే ప్రవాహణరుజాసు చ. ౯౬
పిచ్ఛావస్తిః ప్రయోక్తవ్యః క్షతక్షీణబలావహః,

ఇరుగుడు, దేవకాంచనము, వీని చిగుళ్లను నలియగొట్టి యుదకములోవైచి యవలను చేర్చి కషాయము కాచివడియకట్టి అందులో ఆవుపాలు, నెయ్యి, వీనిని తగుమాత్రము చేర్చి యాకషాయము చేరక్తస్రావము గుదభ్రంశము ప్రవాహిక యీరోగములయందు పిచ్ఛావస్తిని చేయించవలయును. ఈ వస్తికర్మ క్షతక్షీణులకు మిక్కిలిబలమును కలుగజేయును.

### రక్తాతిసారికి అనువాసనవస్తి.

ప్రపౌండరీకసిద్ధేన సర్పిషా చానువాసనమ్. ౯౭

ప్రపౌండరీకముతో పక్వము చేయబడిన ఘృతముచే రక్తాతిసారరోగికి అనువాసనవస్తిని చేయించవలయును.

### రక్తాతిసారికి శతావరీఘృతోపయోగము.

రక్తం విట్సహితం పూర్వం పశ్చాద్వా యోఽతిసార్యతే,
శతావరీఘృతం తస్య లేహార్థముపకల్పయేత్. ౯౮

అతిసారరోగికి మలముతోడగాని, లేక మలము వెడలుటకుముందుగాని, లేక మలము వెడలిన వెనుకగాని, రక్తము వెడలుచుండినచో వానికి పిల్లిపీచరచేర్చి పక్వము చేయబడిన ఘృతమును నాకించవలయును.

### రక్తస్రావాతిసారికి నవనీతోపయోగము.

శర్కరార్ధాంశకం లీఢం నవనీతం నవోద్ధృతమ్,

క్షౌద్రపాదం జయేచ్ఛీఘ్రం తం వికారం హితాశినః. ౯౯

అప్పుడే చిలికితెయ్యబడిన ఆవువెన్న 1 భాగము, దానికి ½ భాగము పంచదార, దీనికి ¼ భాగము తేనె, ఇటుల వీనినన్నిటిని కలిపినాకించి హితాహారముచేయించిన రక్తస్రావోపద్రవములు శీఘ్రముగ హరించును.

రక్తాతిసారికి న్యగ్రోధాదిలేహము.

న్యగ్రోధోదుంబరాశ్వత్థ శృంగానాపోథ్య వాసయేత్,
అహోరాత్రం జలే తస్తే ఘృతం తేనాంభసా పచేత్. ౧౦౦
తదర్ధశర్కరాయుక్తం లేహయేత్క్షౌద్రపాదికమ్,
అధో వా యది వా ప్యూర్ధ్వం యస్య రక్తం ప్రవర్తతే. ౧౦౧

అధోమార్గముగగాని ఊర్ధ్వమార్గముగగాని రక్తము వెడలుచుండువానికి, మఱ్ఱి, మేడి, రావి, వీనిచిగుళ్లను నలియగొట్టి చక్కగకాచబడిన యుందకములో వేసి 1 అహోరాత్రము నానబెట్టి, ఆయుందకములో ఆవునెయ్యినిపోసి, ఘృతపాకవిధిగ పాకముచేసి, అందులో ½ భాగము పంచదార, 1 భాగము, తేనెకలిపి నాకించిన హితముకలుగును.

శ్లేష్మాతిసార చికిత్స.

శ్లేష్మాతిసారే వాతోక్తం విశేషాదామపాచనమ్,
కర్తవ్యమనుబంధేఽస్య పిబేత్పక్వాఽగ్నిదీపనమ్. ౧౦౨
బిల్వకర్కటికాముస్తాప్రాణదావిశ్వభేషజమ్,
వచావిడంగభూతీకధానకామరదారు వా. ౧౦౩
అథవా పిప్పలీమూలం పిప్పలీద్వయచిత్రకాః,

కఫజాతిసారమునందు వాతాతీసారమునకుచెప్పియుండు ఆమపాచనములైన చికిత్సలను పలుమారు చేయవలయును. అటుల చికిత్సజేసియునది శమింపకయుండిన లేతమారేడుకాయ, తుంగముస్తలు, కరక్కాయ, శొంఠి, వీనినిగాని; లేక వస, వాయువిడంగములు, కామంచిపూరి, ధనియాలు, దేవదారు, వీనినిగాని; లేక మోడి, పిప్పళ్లు, ఏనుగుపిప్పళ్లు, చిత్రమూలము, వీనినిగాని, సమభాగములుగ గ్రహించి కషాయము కాచి (అటుచేసిన జఠరాగ్నిదీప్తి కల్గును.) పానము చేయించవలయును.

కఫజాతిసారమునకు పాఠాదికషాయము.

పాఠాగ్నివత్సకగ్రంథి తిక్తాశుంఠీవచాభయాః ౧౦౪
క్వథితా యది వా పిష్టాః శ్లేష్మాతీసారభేషజమ్,

విషబొద్ది, చిత్రమూలము, కొడిసెవిత్తులు, మోడి, కటుకరోహిణి, శొంఠి, వస, కరక్కాయలు, వీనిని సమభాగములుగ గ్రహించి యుందకములోవైచి కషాయము

కాచిగాని; లేక పై విషబొద్ది మొదలగువానిని చూర్ణముజేసి యుష్ణోదకములో కలిపి గాని పానముచేయించిన కఫజాతీసారము హరించును.

కఫజాతిసారమునకు సౌవర్చలాదిచూర్ణము.

సౌవర్చలవచావ్యోషహింగుప్రతివిషాభయాః. ౧౦౫
పిబేచ్ఛ్లేష్మాతిసారార్తశ్చూర్ణితాః కోష్ణవారిణా,

సౌవర్చలలవణము, వస, త్రికటుకములు, ఇంగువ, అతివస, కరక్కాయలు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి కొంచెముష్ణముగనుండు నుదకములో కలిపి శ్లేష్మాతిసారరోగికి పానముచేయించవలయును.

కఫజాతిసారమునకు కపిత్థసేవనము.

మధ్యం లీఢ్వా కపిత్థస్య సవ్యోషక్షౌద్రశర్కరమ్. ౧౦౬
కట్ఫలం మధుయుక్తం వా ముచ్యతే జఠరామయాత్,

వెలగగుజ్జులో త్రికటుకములు, తేనె, పంచదార, వీనినికలిపిగాని, గుమ్మడు చూర్ణమును తేనెలోకలిపిగాని, నాకించిన శ్లేష్మాతిసారరోగికి కడుపునొప్పి శమించును.

ఉదరరోగమునకు పిప్పల్యాదిచూర్ణము.

కణాం మధుయుతాం లీఢ్వా తక్రం పీత్వా సచిత్రకమ్. ౧౦౭
భుక్త్వా వా బాలబిల్వాని వ్యపోహత్యుదరామయమ్,

కఫజాతిసారికి పిప్పళ్లచూర్ణములో తేనెకలిపినాకించినను, లేక మజ్జిగలో చిత్రమూలమునుచేర్చి దానిని పానముచేయించినను, లేక లేతమారేడుకాయను భుజింపజేసినను ఉదరరోగము హరించును.

అతిసారమునకు పాఠాదిచూర్ణము.

పాఠామోచరసాంభోదధాతకీబిల్వనాగరమ్. ౧౦౮
సుకృచ్ఛ్రమప్యతీసారం గుడతక్రేణ నాశయేత్,

చిరుబొద్ది, బూరుగుబంక, తుంగముస్తలు, ఆరెపువ్వు, మారేడు, శొంఠి, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి మజ్జిగలోకలిపి అందులో కొంచెము బెల్లము చేర్చి పానముచేయించిన దారుణములైన అతిసారములన్నియు హరించును.

కపిత్థాష్టకచూర్ణము.

యవానీపిప్పలీమూలచాతుర్జాతకనాగరైః. ౧౦౯
మరిచాగ్నిజలాజాజీధాన్యసౌవర్చలైస్సమైః,
వృక్షామ్లధాతకీకృష్ణాబిల్వదాడిమదీప్యకైః. ౧౧౦

త్రిగుణైః షడ్గుణసితైః కపిత్థాష్టగుణైః కృతః,
చూర్ణోఽతిసారగ్రహణీక్షయగుల్మోదరామయాన్. ౧౧౧
కాసశ్వాసాగ్నిసాదార్శఃపీనసారోచకాఞ్జయేత్,

ఓమము, మోడి, చాతుర్జాతకములు, శొంఠి, మిరియాలు, చిత్రమూలము, కురువేరు, జీలకఱ్ఱ, ధనియాలు, సౌవర్చలవణము, ఇవి సమభాగములు; చింతపండు, ఆరెపువ్వు, పిప్పళ్లు, మారేడు, దానిమ్మ, అజామోదము, ఇవి పైద్రవ్యములకంటె అధికముగ 3 భాగములు, వీనినన్నిటికధికము 6 భాగములు పంచదార, 8 భాగములధికముగ వెలగగుజ్జు, ఇటుల వీనినన్నిటిని చేర్చి చక్కగచూర్ణము చేయవలయును. ఇది అతిసారము, గ్రహణి, క్షయము, గుల్మము, ఉదరరోగము, కాసము, శ్వాసము, అగ్నిమాంద్యము, మూలరోగము, పీనసము, అరోచకము, వీనిని పోగొట్టును.

### దాడిమాష్టక చూర్ణము.

కర్షోన్మితా తవక్షీరీ చాతుర్జాతం ద్వికార్షికమ్. ౧౧౨
యవానీధాన్యకాజాజీగ్రంథివ్యోషం పలాంశకమ్,
పలాని దాడిమాదష్టౌ సితాయాశ్చైకతః కృతః. ౧౧౩
గుణైః కపిత్థాష్టకవచ్చూర్ణోఽయం దాడిమాష్టకః,
భోజ్యో వాతాతిసారార్తైర్యథావస్థం ఖలాదిభిః. ౧౧౪

తవక్షీరీ, చాతుర్జాతములు, ఇవిప్రత్యేక మొక్కొక్కకర్షము, వోమము, ధనియాలు, జీలకఱ్ఱ, ఇవిప్రత్యేకము మూడేసి కర్షములు, మోడి, త్రికటుకములు, ఇవిప్రత్యేక మొక్కొక్కపలము, దానిమ్మపండు 8 పలములు, పంచదార 8 పలములు ఇటులవీనినన్నిటినొక్కటిగకలిపి చక్కగచూర్ణముచేసిన నది దాడిమాష్టకచూర్ణమన బడును. దోషావ్యవస్థాగుణముగ పేయ, ఖలము, మొదలగువానిలో నీ చూర్ణమునుకలిపి వాతాతిసారరోగులకు పానముజేయించిన హితముకలుగును.

### విడంగాది ఖలము.

సవిడంగస్సమరిచః సకపిత్థస్సనాగరః,
చాఙ్గేరీతక్రకోలామ్లః ఖలః శ్లేష్మాతిసారజిత్. ౧౧౫

వాయువిడంగములు, మిరియాలు, వెలగగుజ్జు, శొంఠి, వీనితో పక్వము జేయబడి పులిచింత, మజ్జిగ, పుల్లనిరేగుపండు, అనువానిచే పుల్లగజేయబడిన ఖలముశ్లేష్మాతిసారమును హరింపజేయును.

క్షీణే శ్లేష్మణి పూర్వోక్తమమ్లం లాఘూది షట్పలమ్,

పురాణం వా ఘృతం దద్యాద్యవాగూం మండమిశ్రితామ్.

వాతశ్లేష్మరోగికి కఫము తగ్గియుండునపుడు పూర్వముచెప్పియుండు ఆమ్లఘృతము, లాక్షాదిఘృతము, రాజయక్ష్మచికిత్సయందు జెప్పబడియుండు షట్పలఘృతము, వీనినిప్పించుటయే గాక యవాగు, మండము, అనువానిలో పాతదిగనుండు ఆవునెయ్యిని కలిపి పానము జేయించవలయును.

## బద్ధవాతాద్యతిసారమునకు పిచ్ఛాబస్తి.

వాతశ్లేష్మవిబంధే చ స్రవత్యల్పకఫేఽపి వా,
శూలే ప్రవాహికాయాం వా పిచ్ఛాబస్తిః ప్రశస్యతే. ౧౧౭
వచాబిల్వకణాకుష్ఠశతాహ్వాలవణాన్వితః,

వాతము కఫము ఇవి బంధింపబడియుండిన, లేక మిక్కుటముగ కఫము వెడలుచుండిన, లేక శూలగలిగియుండిన, లేక ప్రవాహికోపద్రవములు జనించియుండిన, ముందుచెప్పియుండు పిచ్ఛాబస్తిని ప్రయోగించవలయును. అయితే ముందుచెప్పియుండు పిచ్ఛాబస్తియౌషధములో వస, మారేడు, పిప్పళ్లు, చెంగల్వకోష్ఠు, పెద్దసదాప, సైంధవలవణము, వీనిని సమభాగముగచేర్చి పక్వముచేయవలయును.

## కఫవాతాతిసారమునం దనువాసనవస్తి.

బిల్వతైలేన తైలేన వచాద్యైస్సాధితేన వా. ౧౧౮
బహుశః కఫవాతార్తే కోష్ణేనాన్వాసనం హితమ్,

మారేడుగుజ్జు తైలముచేతగాని, వచాదిగణములో చెప్పియుండు ఔషధములతో కాచబడిన తైలముచేతగాని, కఫవాతాతిసారరోగికి అనువాసనవస్తిని చేయించవలయును.

## అతిసారమునందు వాతాదిప్రకోప శమనావశ్యకత్వము.

క్షీణే కఫే గుదే దీర్ఘకాలాతీసారదుర్బలే. ౧౧౯
అనిలః ప్రబలోఽవశ్యం స్వస్థానస్థః ప్రజాయతే,
స బలీ సహసా హన్యాత్తస్మాత్తం త్వరయా జయేత్. ౧౨౦
వాయోరనంతరం పిత్తం పిత్తస్యానంతరం కఫమ్,
జయేత్పూర్వం త్రయాణాం వా భవేద్యో బలవత్తమః. ౧౨౧

అతిసారరోగికి కఫము క్షయించి చిరకాలముగనుండు అతిసారరోగముచే గుదము బలహీనతనుజెందియుండునపుడు స్వస్థానమైనగుదములో వాతము ప్రకోపించి బలిష్ఠమై అతిసారరోగిని జంపును. కావుననా వాతమునకు ప్రకోపావస్థ కలుగకుండ

నటుల తోడనే చికిత్సచేసి పిదప పిత్తమునకును, అనంతరము కఫమునకును, చికిత్స జేయవలయును. లేక త్రిదోషములలో నే దోషము మిక్కిలి బలిష్ఠముగనుండునో దానికి తొలుత చికిత్స చేయవలయును.

భయాద్యతిసార చికిత్స.

భీశోకాభ్యామపి చలః శీఘ్రం కుప్యత్యత స్తయోః,
కార్యా క్రియా వాతహరా హర్షణాశ్వాసనాని చ. ౧౨౨

భయము, శోకము, అనువానివలన వాతము ప్రకోపించి అతిసారరోగమును కలుగజేయును. కావున భయాతీసారము, శోకాతీసారము, వీనియందును వాతహారము లైన చికిత్సలను చేయవలయును. మఱియు మనస్సంతోషముగలిగించునట్టి శోకమును పోగొట్టునట్టియు క్రియలు వీనినిగూడ చేయవలయును.

నివృత్తాతిసార లక్షణము.

యస్యోచ్చారాద్వినా మూత్రం పవనో వా ప్రవర్తతే,
దీప్తాగ్నేర్లఘుకోష్ఠస్య శాంత స్తస్యోదరామయః. ౧౨౩

అతిసారరోగికి మలము వెడలకయే మూత్రముగాని, అపానవాతముగాని, వెడలుట, జాఠరాగ్ని దీపనము కలిగియుండుట, కోష్ఠము లఘువుగనుండుట, ఈ లక్షణములు కలిగియుండిన అతిసారరోగము నివర్తించినదని తెలిసికొనవలయును.

నవమాధ్యాయము ముగిసెను.

# దశమాధ్యాయము.



"అర్శో౽తిసారగ్రహణీవికారాః ప్రాయేణ చాన్యోన్యనిదానభూతాః" అను వచనప్రకారము అతిసార గ్రహణీరోగములు పరస్పర నిదానభూతములుగ నుండుట వలనను అతిసారమువలన గ్రహణీరోగముజనించుటవలనను అతిసారచికిత్సితాధ్యాయ నిరూపణానంతరము గ్రహణీరోగ చికిత్సితాధ్యాయము చెప్పబడుచున్నయది.

## గ్రహణీదోష చికిత్సితాధ్యాయ ప్రారంభము.

అథాతో గ్రహణీదోష చికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

అతిసారచికిత్సితాధ్యాయ నిరూపణానంతరము గ్రహణిని ఆశ్రయించియుండు దోషములయొక్క చికిత్సలను వివరించునట్టి గ్రహణీదోష చికిత్సితమను నీయధ్యాయమును వివరించెదము.

## గ్రహణీరోగ చికిత్స.

గ్రహణీమాశ్రితం దోషమజీర్ణవదుపాచరేత్,
అతీసారోక్తవిధినా తస్యామం చ విపాచయేత్. ౧

గ్రహణీయను నాళయమును ఆశ్రయించియుండుదోషమును అజీర్ణమునందు చెప్పియుండు ప్రకారము లంఘనాద్యుపచారములచే చికిత్స చేయనగును. మఱియు గ్రహణీరోగికి ఆమదోషము కలిగియుండినయెడ అతిసారరోగమునకు చెప్పియుండుచికిత్సలను చేసి జీర్ణశక్తికల్గునట్లుచేయవలెను.

## గ్రహణీరోగికి ఆహారక్రమము.

అన్నకాలే యవాగ్వాది పంచకోలాదిభిర్యుతమ్,
వితరేత్పటులఘ్వన్నం పునర్యోగాంశ్చ దీపనాన్. ౨

భోజనకాలమునందు చక్కగ ఆకలిజనించి శరీరము లఘువుగనుండినయెడల పంచకోలము మొదలగు దీపనద్రవ్యములతో పక్వముచేయబడినవియు, మాత్రాస్వభావములచే లఘువుగనుండునవియు, లవణరసముగలవియునైన యవాగు, విలేపి, అన్నము, అను ఆహారములను గ్రహణీరోగికి నియ్యవలయును. మఱియు అగ్నిదీపనకరములైన ఖాండవము మొదలగు యోగములనుగూడ నియ్యవలయును.

### గ్రహణీరోగమునందు పేయాపానాదులు.

దద్యాత్సాతివిషాం పేయామామే సామ్లాం సనాగరామ్;
పానేఽతిసారవిహితం వారి తక్రం సురాది చ. 3

గ్రహణీరోగికి ఆమదోషము కలిగినయుండిన శొంఠి, అతివస, వీనితో పక్వము చేయబడి కొంచెము పుల్లగనుండు పేయను ఇప్పించవలయును. అతిసార చికిత్సయందు చెప్పబడియుండు ఉదకము, మజ్జిగ, సురయనుమద్యము, మొదలగువానిని సాత్మ్యాద్యనుగుణముగ పానార్థము ఇప్పించవలయును.

### గ్రహణీరోగమునకు తక్రోపయోగము.

గ్రహణీదోషిణాం తక్రం దీపనం గ్రాహి లాఘవాత్,
పథ్యం మధురపాకిత్వాన్న చ పిత్తప్రదూషణమ్. ౪
కషాయోష్ణవికాసిత్వాద్రూక్షత్వాచ్చ కఫే హితమ్,
వాతే స్వాద్వమ్లసాంద్రత్వాత్సద్యస్కమవిదాహి తత్. ౫

మజ్జిగ దీపనకారిగను, మలమునుగట్టిపరచునదిగను, లఘువుగను, ఉండుటవలన గ్రహణీరోగులకు పథ్యకరముగనుండును. మఱియు మధురపాకముగలదిగనుండుటవలన పిత్తమును విశేషముగ ప్రకోపింపజేయదు. వగరుగను, ఉష్ణముగను, శరీరమంతట వ్యాపించునదిగను, రూక్షముగను ఉండుటవలన కఫమునందు హితకరముగనుండును. అప్పుడే చిలకబడినమజ్జిగ కొంచెము పుల్లగను చిక్కగను మధురముగను ఉండుటంజేసి వాతమునందు హితకరముగనుండును. విదాహమును గలుగజేయనేరదు.

### గ్రహణీరోగమునందు కోలదాడిమాది చూర్ణోపయోగము.

చతుర్ణాం ప్రస్థమమ్లానాం త్ర్యూషణాచ్చ పలత్రయమ్,
లవణానాం చ చత్వారి శర్కరాయాః పలాష్టకమ్. ౬
తచ్చూర్ణం శాకసూపాన్నరాగాదిష్వవచారయేత్,
కాసాజీర్ణారుచిశ్వాసహృత్పార్శ్వామయశూలనుత్. ౭

పుల్లనిరేగు, పుల్లదానిమ్మ, చింతపండు, పులిచింత, ఇవి 1 ప్రస్థము, త్రికటుకములు 3 పలములు, నాలుగువిధములైన లవణములు 4 పలములు, పంచదార 8 పలములు, ఇటుల వీనినన్నిటిని చేర్చి చక్కగచూర్ణముచేసి ఆ చూర్ణమును శాకములు, పప్పు, అన్నము, యూషము, మొదలగువానిలో జేర్చి యిప్పించిన కాసము, అజీర్ణము, అరుచి, శ్వాసము, బొమ్మునొప్పి, పార్శ్వశూల ఇవియన్నియు హరించును.

### గ్రహణీరోగమున నాగరాదికషాయము

నాగరాతివిషాముస్తం పాక్యమామహరం పిబేత్,

ఉష్ణాంబునా వా తత్కల్కం నాగరం వాథవాఽభయామ్. ౮
ససైంధవం వచాదిం వా తద్వన్మదిరయాఽథవా,

శొంఠి, అతివస, తుంగముస్తలు, వీనిని సమభాగములుగ గ్రహించి యుదక ములోవైచి కషాయము కాచిగాని; లేక పైజెప్పినశొంఠి మొదలగువానిని కల్కముచేసి ఉష్ణోదకములో కలిపిగాని, లేక శొంఠిమాత్రము ఉష్ణోదకములోకలిపిగాని, లేక కరక్కాయనుగాని, వచాదిగణద్రవ్యములనుగాని, కల్కముచేసి యుష్ణోదకములోకలిపి సైంధవలవణమునుచేర్చి దానినిగాని, లేక వచాదిగణద్రవ్యములను కల్కముచేసి మదిరయనుమద్యములో కలిపిగాని, పానముచేయించిన గ్రహణీరోగికి ఆమదోషము హరించును.

## గ్రహణీరోగమునకు బిల్వాదిచూర్ణము.

వర్చస్యామే సప్రవాహే పిబేద్వా దాడిమాంబునా. ౯
బిడేన లవణం పిష్టం బిల్వచిత్రకనాగరమ్,
సామే కఫానిలే కోష్ఠంరుక్కరే కోష్ణవారిణా. ౧౦

గ్రహణీరోగికి అజీర్ణము ప్రవాహికోపద్రవము వీనితోడమలము వెడలినబిడాలవణమును పొడిచేసి దానిమ్మరసములో కలిపి పానముచేయించవలయును. మఱియు వాతకఫములు ఆమముతోగూడి కోష్ఠమునందు నొప్పిని గలుగజేయుచుండిన మారేడు, చిత్రమూలము, శొంఠి, వీనిని సమభాగములుగ గ్రహించి కొంచముష్ణముగనుండు ఉదకములో కలిపి పానముజేయించవలయును.

## ఛర్ద్యాదియుక్తగ్రహణీరోగమునకు కళింగాదిచూర్ణము.

కలింగహింగ్వతివిషా వచాసౌవర్చలాభయమ్,
ఛర్దిహృద్రోగశూలేషు పేయముష్ణేన వారిణా. ౧౧
పథ్యాసౌవర్చలాఽజాజీ చూర్ణం మరిచసంయుతమ్,

గ్రహణీరోగికి వాంతి, ఱొమ్మునొప్పి, శూలలు ఇవికలిగియుండినచో కొడిసెవిత్తులు, ఇంగువ, అతివస, వస, సౌవర్చలవణము, వట్టివేరు, వీనిని సమభాగములుగ గ్రహించినూరి ఉష్ణోదకములోకలిపి పానముచేయించవలయును మఱియు కరక్కాయ సౌవర్చలవణము జీలకఱ్ఱ వీనిని సమముగ చూర్ణముచేసి యుష్ణోదకములోకలిపి కొంచము మిరియాలచూర్ణముచేర్చి పానముజేయించవలయును.

## కోష్ఠవాతహరపిప్పల్యాదిచూర్ణము.

పిప్పలీనాగరం పాఠాం శారిబాం బృహతీద్వయమ్ ౧౨
చిత్రకం కౌటజం క్షారం తథా లవణపంచకమ్,

చూర్ణీకృతం దధిసురాతన్మండోష్ణాంబుకాంజికైః. ౧౩
పిబేదగ్నివివృద్ధ్యర్థం కోష్ఠవాతహరం పరమ్,

పిప్పళ్లు, శొంఠి, పిప్పలమోడి, నల్లజీలకఱ్ఱ, తెల్లజీలకఱ్ఱ, పిప్పలికట్ట, ఏనుగుపిప్పలి, చిత్రమూలక్షారము, కొడిసెక్షారము, పంచలవణములు (అనగా—సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సాముద్రలవణము, ఔద్భిదలవణము) వీనిని సమభాగములుగ గ్రహించిచూర్ణముచేసి యాచూర్ణమును పెరుగు సురయనుమద్యము పెరుగుమీదిమీగడ సురామద్యముమీదిమీగడ, ఉష్ణోదకము, గంజి, అనువానిలో కలిపి పానముచేయించిన జాఠరాగ్నిదీపనముకలుగుటయేగాక కోష్ఠవాతముగూడ హరించును.

### గ్రహణీరోగమున పాచనాదిగుటికలు.

పటూని పంచ ద్వౌ క్షారౌ మరిచం పంచకోలకమ్. ౧౪
దీప్యకం హింగు గుళికా బీజపూరరసే కృతా,
కోలదాడిమతోయే వా పరం పాచనదీపనీ. ౧౫

పంచలవణములు, సర్జక్షారము, యవక్షారము, మిరియాలు, పంచకోలములు, ఓమము, ఇంగువ, అనువానిని సమభాగముగ గ్రహించి మాదీఫలరసములోగాని; రేగుపండు, దానిమ్మపండు, అనువానిరసములలో గానినూరి గుటికలు జేయవలయును. ఈగుటికలనుపయోగించినచో మిక్కుటముగ జీర్ణశక్తిని అగ్నిదీపనమును కలుగజేయును.

### గ్రహణీరోగమునకు తాళీసాదివటకములు.

తాళీసపత్రచవికామరిచానాం పలం పలమ్,
కృష్ణాతన్మూలయోర్ద్వే ద్వే పలే శుంఠీ పలత్రయమ్. ౧౬
చతుర్జాతముశీరం చ కర్షాంశం శ్లక్ష్ణచూర్ణితమ్,
గుడేన వటకాన్ కృత్వా త్రిగుణేన సదా భజేత్. ౧౭
మద్యయూషరసారిష్ట మస్తుపేయాపయోనుపః,
వాతశ్లేష్మాత్మనాం ఛర్ది గ్రహణీపార్శ్వహృద్రుజామ్ ౧౮
జ్వరశ్వయథుపాండుత్వగుల్మపానాత్యయార్శసామ్,
ప్రసేకపీనసశ్వాసకాసానాం చ నివృత్తయే. ౧౯
అభయాం నాగరస్థానే దద్యాదత్రైవ విడ్గ్రహే,
ఛర్ద్యాదిషు చ పైత్తేషు చతుర్గుణసితాన్వితాః. ౨౦
పక్వేన వటకాః కార్యాః గుడేన సితయాఽపి వా,
పరంహీవహ్నిసంపర్కా ల్లఘిమానంభజంతి తే. ౨౧

తాళిసపత్రి, చవ్యము, మిరియాలు, ఇవి ప్రత్యేకము ఒక్కొకపలము; పిప్పళ్లు, మోడి, ఇవి దినుసుకు రెండేసి పలములు; శుంఠి 3 పలములు, చాతుర్జాతకములు, వట్టివేరు, ఇవిదినుసుకు 1 కర్షము, వీనినన్నిటి నొకటిగచేర్చి చూర్ణముచేసి పైచూర్ణమునకు మూడింతలు పాతబెల్లమును పాకముపట్టి అందులోకలిపి వటకములుచేసి సేవించి, తోడసే మద్యము, కట్టులు, మాంసరసము, అరిష్టమనుమద్యము, పెరుగుమీఁదిమీగడ, పేయ, ఆవుపాలు వీనిని అనుపానముగ పానముచేయించవలయును. ఇదివాతశ్లేష్మమువలన జనించిన వాంతి, గ్రహణి, పార్శ్వశూల, హృద్రోగము, జ్వరము, వాపు, పాండురోగము చర్మరోగము, గుల్మము, మదాత్యయము, అర్శోరోగము, నోటియందు నీరూరుట, పీనసము, శ్వాసము, కాసము. వీనిని హరింపజేయును. మలబంధముకలిగియుండిన పైయౌషధులలో శుంఠికి బదులు కరక్కాయనుజేర్చి పక్వముచేసి యిప్పించవలయును. పిత్తమువలన జనించిన వాంతి మొదలగురోగములయందు పాతబెల్లమునకు బదులు నాలుగింతలు పంచదారను కలిపి వటకములుచేసి యిప్పించవలయును. బెల్లమునుగాని పంచదారనుగాని పాకముపట్టి అందులో పైచూర్ణమునుకలిపి వటకములుచేసిన యవి అగ్నిసంబంధమువలన లఘుత్వమునుపొంది మిక్కిలిగుణమును గలుగజేయును.

### వాతజగ్రహణీరోగచికిత్స.

అథైనం పరిపక్వామం మారుతగ్రహణీగదమ్,
దీపనీయయుతం సర్పిః పాయయేదల్పశో భిషక్. ౨౨
కించిత్సంధుక్షితే త్వగ్నౌ సక్తవిణ్మూత్రమారుతమ్,
ద్వ్యహం త్ర్యహం వా సంస్నేహ్య స్విన్నాభ్యక్తం నిరూహ
తత ఏరండతైలేన సర్పిషా తైల్వకేన వా, [యేత్. ౨౩
సక్షారేణానిలే శాంతే స్రస్తదోషం విరేచయేత్, ౨౪

ఆమదోషరహితమైన వాతజగ్రహణీరోగముగలవానికి పంచకోలము మొదలగు దీపనౌషధములతో పక్వముజేయబడిన ఘృతమును జాఠరాగ్నిదీపనముకలుగుటకై కొంచెముగ పానముచేయించవలయును. పిదప కొంచెమగ్నిదీపనముకలిగియుండగా అపానవాత మలమూత్ర ప్రతిబంధములుగల యారోగికి 2, 3 దినములు స్నేహకర్మను ప్రయోగించవలయును. పిదప స్వేదకర్మ, అభ్యంగము, వీనిని చేయించి నిరూహవస్తిని ప్రయోగించవలయు. అనంతరము వాతముకొంచెము శమించియుండగా ఆముదముతో గాని, తైల్వకఘృతముతోగాని, సర్జక్షారమునుకలిపియిచ్చివిరేచనము చేయించవలయును.

### మలబంధముగల గ్రహణీరోగికి చికిత్స.

శుద్ధరూక్షాశయం బద్ధవర్చస్కం చానువాసయేత్,

దీపనీయామ్లవాతఘ్నసిద్ధతైలేన తం తతః ౨౫
నిరూఢం చ విరిక్తం చ సమ్యక్చాప్యనువాసితమ్,
లఘ్వన్నప్రతిసంయుక్తం సర్పిరభ్యాసయేత్పునః. ౨౬

గ్రహణీరోగికి అమాశయము శుద్ధముగను, రూక్షముగను ఉండుటవలన మలబంధము కలిగినయెడల శుంఠి మొదలగు దీపనౌషధములు, చింతపండు, మాదీఫలము దానిమ్మపండు మొదలగు అమ్లరసముగల ద్రవ్యములు; దుంపరాష్ట్రము, ఆముదము, మొదలగు వాతహరద్రవ్యములు; వీనిని సమభాగములుగ గ్రహించి పక్వము జేయబడిన తైలముచే అనువాసవస్తిని జేయించి, పిదప విరేచనౌషధమిప్పించి లఘువుగ పథ్యముగనుండు నాహారంబుల నిప్పింపవలయును. మఱియు నిట్టిగ్రహణరోగి కికజెప్పబోయెడు ఘృతమును పానము జేయించుచుండవలయును.

మహాపంచమూలాదిఘృతము.

పంచమూలాభయావ్యోషపిప్పలీమూలసైంధవైః,
రాస్నాక్షారద్వయాజాజీవిడంగశటిభిర్ఘృతమ్. ౨౭
శుక్తేన మాతులుంగస్య స్వరసేనార్ద్రకస్య వా,
శుష్కమూలకకోలామ్లచుక్రికాదాడిమస్య చ. ౨౮
తక్రమస్తుసురామండసౌవీరకతుషోదకైః,
కాంజికేన చ తత్పక్వమగ్నిదీప్తికరం పరమ్. ౨౯
శూలగుల్మోదరశ్వాసకాసానిలకఫాపహమ్,
సబీజపూరకరసే సిద్ధం వా పాయయేద్ఘృతమ్. ౩౦

మహాపంచమూలములు, కరక్కాయలు, త్రికటుకములు, మోడి, సైంధవలవణము, దుంపరాష్ట్రము, సర్జక్షారము, యవక్షారము జీలకఱ్ఱ, వాయువిడంగములు, కచోరములు, వీనికల్కము ; శుక్తము (ఒకమట్టికుండలో తేనె, బెల్లము, కలి, ఈ మూటిని సమభాగములుగ గూర్చి వానెనగట్టి మూడు దినములు ధాన్యమధ్యమున నుంచబడిన పులిగంజి), మాదీఫలములరసము, అల్లపురసము, యెండినముల్లంగి పుల్లరేగు పండ్లు పులిచింత దానిమ్మపండు అనువానిరసము ; మజ్జిగ, పెరుగుమీదిమీగడ, సురయను మద్యముమీదిమీగడ, పులికడుగు, కడుగు గంజి, ఆవునెయ్యి ; వీనిని సమభాగములుగ చేర్చి విధిప్రకారము ఘృతమును పక్వముచేయవలయును. ఇది అగ్నిదీపనము విశేషముగ కలుగజేయును. శూలలు గుల్మము, ఉదరరోగము, శ్వాసము, కాసము, వాతకఫము, వీనిని బోగొట్టును. మఱియు మాదీఫలరసమును సమభాగముగ

ఆవునెయ్యిలోఁజేర్చి విధిప్రకారముగ పాకముజేసి యాఘృతమును గ్రహణీరోగికి పానముచేయించిన శూలమొదలగు నుపద్రవములు హరించును.

గ్రహణీరోగికి అభ్యంజనతైలము.

తైలమభ్యంజనార్థం చ సిద్ధమేభిశ్చలాపహమ్,

పూర్వశ్లోకంబునంజెప్పియుండు మహాపంచమూలాది యౌషధములనుజేర్చి తైలపాకవిధానంబున పక్వముజేయబడిన తైలముచే గ్రహణీరోగికి అభ్యంజనముజేయించిన వాతోపద్రవములు హరించును.

వాతజగ్రహణికి మహాపంచమూలాదిచూర్ణము.

ఏతేషామౌషధానాం వా పిబేచ్చూర్ణం సుఖాంబునా. ౩౧
వాతే శ్లేష్మావృతే సామే కఫే వా వాయునోద్ధతే,

గ్రహణీరోగికి వాతము శ్లేష్మముచే గప్పబడి ఆమాజీర్ణముతోఁగూడి యుండినను, కఫము ఆమాజీర్ణముతోఁగూడి వాతముతోఁ గలసియుండినను, ముందుజెప్పినమహాపంచమూలాద్యౌషధముల చూర్ణమును ఉష్ణోదకములోఁ కలిపి పానముజేయించవలయును.

గ్రహణీరోగికి అగ్నిదీపనకరములైన అన్నపానాదులు.

అగ్నేర్నిర్వాపకం పిత్తం రేకేణ వమనేన వా. ౩౨
హత్వా తిక్తలఘుగ్రాహి దీపనైరవిదాహిభిః,
అన్నైః సంధుక్షయేదగ్నిం చూర్ణైస్స్నేహైశ్చ తిక్తకైః. ౩౩

జాఠరాగ్ని పిత్తము ఈరెండును గ్రహణినాశ్రయించియుండుటంజేసి ద్రవరూపముగనుండు పిత్తము జాఠరాగ్నిని చెరచును. కావున ఆ పిత్తప్రకోపమును విరేచనౌషధముచేతగాని, వమనౌషధముచేతగాని శమింపంజేసి చేదుగను లఘువుగను మలమును గట్టిపరచునదిగను అగ్నిదీపనకారిగను విదాహావస్థను కలుగజేయనిదిగను ఉండు అన్నపానాదులచేతను; చేదురసముగల ద్రవ్యముల చూర్ణముచేతను; చేదురసముగల యౌషధులతోఁ పక్వముజేయంబడిన ఘృతములచేతను; గ్రహణీరోగముకలవారి జాఠరాగ్నికి దీపనమును కలుగజేయవలయును.

గ్రహణికి పటోలాదిచూర్ణము.

పటోలనింబత్రాయంతీతిక్తాతిక్తకపర్పటమ్,
కుటజత్వక్ఫలం మూర్వా మధుశిగ్రుఫలం వచా. ౩౪
దార్వీత్వక్పద్మకోశీరయవానీముస్తచందనమ్,
సౌరాష్ట్ర్యతివిషావ్యోషత్వగేలాపత్రదారు చ. ౩౫
చూర్ణితం మధునా లేహ్యం పేయం మద్యైర్జలేన వా,

హృత్పాండుగ్రహణీరోగగుల్మశూలారుచిజ్వరాన్. ౩౬
కామలాం సన్నిపాతం చ ముఖరోగాంశ్చ నాశయేత్,

చేదుపొట్ల, వేము, కలుక్రానుగు, కటుకరోహిణి, పర్పాటకము, కొడిసెపట్ట, కొడిసెవిత్తులు, చాగ, తెల్లమిరియాలు, వస, మ్రానిపసుపు, లవంగపట్ట, పద్మకము, వట్టివేరు, వోమను, తుంగముస్తలు, చందనము, సౌరాష్ట్రి, అతివస, త్రికటుకములు, లవంగపట్ట, ఏలకులు, జాపత్రి, దేవదారుపట్ట, వీనిని సమభాగములుగ గ్రహించి చక్కగ చూర్ణము జేసి దానిని తేనెలో కలిపి నాకించినను; లేక మద్యములో గాని యుదకములో గాని కలిపి పానము జేయించినను; హృద్రోగము పాండురోగము, గ్రహణీరోగము, గుల్మము, శూల, అరుచి, జ్వరము, కామల, సన్నిపాతము, ముఖరోగము, మొదలగునవి నివర్తి యగును.

గ్రహణికి భూనింబాదిచూర్ణము.

భూనింబకటుకాముస్తాత్రూషణేంద్రయవాన్సమాన్. ౩౭
ద్వౌ చిత్రకాద్వత్సకత్వగ్భాగాన్ షోడశ చూర్ణయేత్,
గుడశీతాంబునా పీతం గ్రహణీదోషగుల్మనుత్. ౩౮
కామలాజ్వరపాండుత్వమేహారుచ్యతిసారజిత్,

నేలవేము, కటుకరోహిణి, తుంగముస్తలు, త్రికటుకములు, కొడిసెవిత్తులు, ఇవి సమభాగములు; చిత్రమూలము 2 భాగములు; కొడిసెపట్ట 16 భాగములు; వీని నన్నిటిని ఒక్కటిగజేర్చి చక్కగచూర్ణముజేసి శీతోదకములో కలిపి యొకింత బెల్లము చేర్చి పానముజేయించిన గ్రహణిరోగము, గుల్మము, కామిల, జ్వరము, పాండువు, ప్రమేహము, అరుచి, అతిసారము, ఈ రోగములన్నియు హరించును.

పిత్తగ్రహణికి నాగరాదిచూర్ణము.

నాగరాతివిషాముస్తాపాఠాబిల్వం రసాంజనమ్. ౩౯
కుటజత్వక్ఫలం తిక్తా ధాతకీ చ కృతం రజః,
క్షౌద్రతండులవారిభ్యాం పైత్తికే గ్రహణీగదే. ౪౦
ప్రవాహికార్శోగుదరుగ్రక్తోత్థానేషు చేష్యతే,

శుంఠి, అతివస, తుంగముస్తలు, చిరుబొద్ది, మారేడు, రసాంజనము, కొడిసెపట్ట, కొడిసెవిత్తులు, కటుకరోహిణి, ఆరెపువ్వు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముజేసి బియ్యపుకడుగునీళ్లలో కలిపి అందులో కొంచెము తేనెనుజేర్చి పానము జేయించిన పైత్తికగ్రహణీరోగము, ప్రవాహిక, అర్శోరోగము, గుదశూల, రక్తస్రావము, ఇవియన్నియు హరించును.

### పిత్తజగ్రహణికి చందనాదిఘృతము.

చందనం పద్మకోశీరం పాఠాం మూర్వాం కుటంనటమ్. ౪౧
షడ్గ్రంథాసారిబాస్ఫోతాసప్తపర్ణాటరూషకాన్,
పటోలోదుంబరాశ్వత్థవటప్లక్షకపీతనమ్. ౪౨
కటుకాం రోహిణీం ముస్తాం నింబం చ ద్విపలాంశకాన్,
ద్రోణేఽపాం సాధయేత్తేన పచేత్సర్పిః పిచూన్మితైః. ౪౩
కిరాతతిక్తేంద్రయవవీరామాగధికోత్పలైః,
పిత్తగ్రహణ్యాం తత్పేయం కుష్ఠోక్తం తిక్తకం చ యత్. ౪౪

చందనము, పద్మకము, వట్టివేరు, చిరుబొద్ది, చాగ, దుంపిలము, వస, సుగంధిపాల, నల్లసుగంధిపాల, ఏడాకులపొన్న, అడ్డసరము, పొట్ల, మేడి, రావి, మఱ్ఱి, జువ్వి, కలుజువ్వి, కటుకరోహిణి, తుంగముస్తలు, వేము, వీనిని దినుసుకు 2 పలములు గ్రహించి; ద్రోణప్రమాణముగల యుదకములోవైచి, పాదావశేషముగ కషాయముగాచి, వడియకట్టుకొని, అందులో 32 పలములు ఆవునెయ్యినికలిపి, అందులో నేలవేము, కొడిసెవిత్తులు, కాకోళి,పిప్పళ్లు, నల్లకలువ వీనిని ప్రత్యేకము పిచు(కర్ష)ప్రమాణము, గ్రహించి కల్కముజేసి కలిపి ఘృతపాకవిధిగ పక్వముజేసి పిత్తగ్రహణిరోగికి పానముజేయించవలయును. మరియు కుష్ఠచికిత్సితాధ్యాయమునందు జెప్పియుండు తిక్తకఘృతమును, మహాతిక్తకఘృతమును, పానముజేయించిన హితముగలుగును.

### శ్లేష్మజగ్రహణీచికిత్స.

గ్రహణ్యాం శ్లేష్మదుష్టాయాం తీక్ష్ణైః ప్రచ్ఛర్దనే కృతే,
కట్వమ్లలవణక్షారైః క్రమాదగ్నిం వివర్ధయేత్. ౪౫

శ్లేష్మజ గ్రహణిరోగముగలవానికి తీక్ష్ణములైన వమనద్రవ్యములచే వమనముజేయించి క్రమముగ కారము, పులుసు, లవనము, క్షారము, ఈరసములుగల ద్రవ్యములచే జాఠరాగ్నికి దీపనమును కలుగజేయవలయును.

### శ్లేష్మజగ్రహణీరోగికి పేయాదులు.

పంచకోలాభయాధాన్యపాఠాగంధపలాశకైః,
బీజపూరప్రవాలైశ్చ సిద్ధైః పేయాది కల్పయేత్. ౪౬

పంచకోలములు, కరక్కాయలు, దనియాలు, చిరుబొద్ది, గంధపత్రి, మాదీఫలపుచెట్టుచిగుళ్లు, వీనికషాయముతోడ పేయమొదలగువానిని పక్వముజేసి శ్లేష్మజగ్రహణీరోగికి కిప్పించవలయును.

## మధూకపుష్పాసవము.

ద్రోణం మధూకపుష్పాణాం విడంగం చ తతోఽర్ధతః,
చిత్రకస్య తతోఽర్ధం చ తథా భల్లాతకాఢకమ్. ౪౭
మంజిష్ఠాష్టపలం చైతజ్జలద్రోణత్రయే పచేత్,
ద్రోణశేషం శృతం శీతం మధ్వర్ధాఢకసంయుతమ్. ౪౮
ఏలామృణాళాగురుభిశ్చందనేన చ రూషితే,
కుంభే మాసం స్థితం జాతమాసవం తం ప్రయోజయేత్. ౪౯
గ్రహణీం దీపయత్యేష బృంహణః పిత్తరక్తనుత్,
శోషకుష్ఠకిలాసానాం ప్రమేహాణాం చ నాశనః. ౫౦

1 ద్రోణప్రమాణము ఇప్పపువ్వులు, అర్ధ ద్రోణము వాయువిడంగములు, 1 ద్రోణము చిత్రమూలము, 1 ఆఢకము జీడిగింజలు, 3 పలములు మంజిష్ఠి, వీనినన్నిటిని, 3 ద్రోణప్రమాణముల జలములోవైచి 1 ద్రోణము మిగులునట్టుల కషాయముకాచి యది చల్లారినపిదప, అందులో అర్ధ ఆఢకము తేనెకలిపి, దానిని యేలకులు, తామరతూండ్లు, అగరుచెక్క, చందనము వీనిని సమభాగములుగ గ్రహించి చక్కగా నూరి కొత్తకుండలోపలబోసి నీడనెండించి ఆ కుండలో బోసి యొక మాసమువరకు నునిచి, కొంచెము పుల్లగనైనపిదప, దానిని శ్లేష్మగ్రహణీరోగికిప్పించిన గ్రహణీరోగము శమించును. అగ్నిదీపనము శరీరపుష్టి కలుగును. మఱియు నిది పిత్తరక్తము, శోష, కుష్ఠు, కిలాసము, ప్రమేహములు, వీనిని హరింపజేయును.

## ప్రకారాంతరమధూక పుష్పాసవము.

మధూకపుష్పస్వరసం శృతమర్ధక్షయీకృతమ్,
క్షౌద్రపాదయుతం శీతం పూర్వవత్సన్నిధాపయేత్. ౫౧
తత్పిబన్గ్రహణీదోషాఞ్జయేత్సర్వాన్ హితాశనః,
తద్వద్ద్రాక్షేక్షుఖర్జూరస్వరసానాసుతాన్ పిబేత్. ౫౨

1 కుడవప్రమాణము ఇప్పపువ్వుల రసమును గ్రహించి అర్ధకుడవము మిగులునటుల కషాయముకాచి యది చల్లారినపిదప దానికి నాల్గవభాగము తేనెను కలిపి చల్లారినపిదప యేలకులు, తామరతూండ్లు, అగరుచందనము, వీనిని సమభాగములుగ గ్రహించి నూరి, కుండకు లోభాగమునందుబూసి, నీడనెండించి, పైకుండయందుబోసి 1 మాసమువరకునిచి దానిని పానముజేయించిన గ్రహణీరోగములన్నియు నివర్తించును. ద్రాక్షపండు, చెఱుకు, ఖర్జూరపుపండు, వీని స్వరసమునుగాని, లేక కషాయమునుగాని, పైనజెప్పినమధూకాసవమువలె కాచియిప్పించిన గ్రహణీరోగములన్నియు హరించును.

హింగ్వాదిక్షారము.

హింగుతిక్తావచామాద్రీపాఠేంద్రయవగోక్షురమ్,
పంచకోలం చ కర్షాంశం పలాంశం పటుపంచకమ్. ౫౩
ఘృతతైలద్వికుడవే దధ్నః ప్రస్థద్వయే చ తత్,
ఆపోథ్య క్వాథయేదగ్నౌ మృదావనుగతే రసే. ౫౪
అంతర్ధూమం తతో దగ్ధ్వా చూర్ణీకృత్య ఘృతాప్లుతమ్,
పిబేత్పాణితలం తస్మిన్ జీర్ణే స్యాన్మధురాశనః ౫౫
వాతశ్లేష్మామయాన్సర్వాన్ హన్యాద్విషగరాంశ్చ సః,

ఇంగువ, కటుకరోహిణి, వస, అతివస, చిరుబొద్ది, కొండిసెనిత్తులు, చిన్నపల్లేరు, పంచకోలములు, ఇవి దినుసుకొక్కొక కర్షము; పంచలవణములు 5 పలములు వీనినన్నిటిని నలియగొట్టి 2 కుడవములు ఆవునెయ్యి, 2 కుడవములు నువ్వులనూనె, 2 ప్రస్థములు ఆవుపెరుగు, అనువానిలోఁ జేర్చి మృద్వగ్నిచే జక్కఁగ పాకము జేయవలయును. పైతైలాదులు ఇగిరిన తరువాత నా యౌషధులనెత్తి మూకుడులోఁ వేసి పైని యొకమూకుడును మూసి పొగ బైలువెడలకుండునటుల చీలమన్నుజేసి, నిప్పుమీదబెట్టి, లోపలనుండు ద్రవ్యములు భస్మంబైనపిదప, దానిని యెత్తి చూర్ణము జేసి, కర్షప్రమాణము ఘృతము లోఁగలిపి, పానము జేయించి, యా యౌషధము జీర్ణమైనతోడనే మధురరసముతో నాహారము నిప్పించవలయును. ఈ చూర్ణము వాతశ్లేష్మజనితంబులైన రోగములను విషోపద్రవములను హరింపజేయును.

అగ్నిదీపనకరభూనింబాదిక్షారము.

భూనింబరోహిణీం తిక్తాం పటోలం నింబపర్పటమ్. ౫౬
దగ్ధ్వా మాహిషమూత్రేణ పిబేదగ్నివివర్ధనమ్,

నేలవేము, కటుకరోహిణి, చేదుపొట్ల, వేము, పర్పాటకము, వీనిని సమభాగములుగ గ్రహించి, నిప్పులోఁ గాల్చి, బఱ్ఱెమూత్రములోఁ కలిపి, పానము జేయించిన శ్లేష్మజగ్రహణీరోగికి అగ్నిదీపనము కలుగును.

హారిద్రాదిక్షారము.

ద్వే హారిద్రే వచా కుష్ఠం చిత్రకః కటురోహిణీ. ౫౭
ముస్తా చ భాగమూత్రేణ సిద్ధః క్షారోఽగ్నివర్ధనః,

పసుపు, మ్రానిపసుపు, వస, చెంగల్వకోష్ఠు, చిత్రమూలము, కటుకరోహిణి, తుంగముస్తలు, వీనిని సమభాగములుగ గ్రహించి నిప్పులోఁ గాల్చి యా బూడిదెను మేకమూత్రములోఁగలిపి పానము జేయించిన శ్లేష్మగ్రహణీరోగి కగ్నిదీపనము కలుగును.

### సుధాకాండాది గుటిక.

చతుష్పలం సుధాకాండాత్త్రిపలం లవణత్రయాత్. ౫౮
వార్తాకకుడవం చార్కాదష్టౌ ద్వే చిత్రకాత్పలే,
దగ్ధ్వా రసేన వార్తాకా ద్గుటికా భోజనోత్తరాః. ౫౯
భుక్తమన్నం పచంత్యాశు కాసశ్వాసార్శసాం హితాః,
విషూచికాప్రతిశ్యాయహృద్రోగశమనాశ్చ తాః. ౬౦

బొంతజెముడుకాడలు 4 పలములు, లవణత్రయము 3 పలములు, చక్కగపండి యెండిన వంకాయ 4 కుడవములు, జిల్లేడువేరు 3 పలములు, చిత్రమూలము 2 పలములు, ఇటుల వీనినన్నిటి నొకటిగజేర్చి నిప్పులో కాల్చి యా బూడిదెను వంకాయ రసముతోనూరి గుటికలు చేసి, దానిని ఆహారమును భుజించినతోడనే యిప్పించినచో భుజించిన యాహారము కడుత్వరితంబుగ జీర్ణంబగును. ఈగుటికలు కాస శ్వాస అర్శో రోగములుగలవారికి మిక్కిలి హితకరంబులుగనుండును. విషూచిక పీనసము రొమ్ము నొప్పి వీనిని హరింపజేయును.

### మాతులుంగాది చూర్ణము.

మాతులుంగశఠీరాస్నాకటుత్రయహరీతకీ,
స్వర్జికాయావశూకాఖ్యౌ క్షారౌ పంచపటూని చ. ౬౧
సుఖాంబుపీతం తచ్చూర్ణం బలవర్ణాగ్నివర్ధనమ్,

మాదీఫలము, కచోరములు, దుంపరాస్నము, త్రికటుకములు, కరక్కాయలు, సర్జక్షారము, యవక్షారము, పంచలవణములు, వీనిని సమభాగములుగ గ్రహించి చక్కగ చూర్ణముజేసి దేహబలాద్యనుగుణముగ నుష్ణోదకములోగలిపి పానము జేయించిన బలము వర్ణము అగ్నిదీపనము ఇవి వృద్ధియగును.

### వాతశ్లేష్మగ్రహణ్యారోగమునందు ధాన్వంతరాది ఘృతము.

శ్లైష్మికే గ్రహణీదోషే సవాతే తైర్ఘృతం పచేత్. ౬౨
ధాన్వంతరం షట్పలం చ భల్లాతకఘృతాభయమ్,

శ్లేష్మజగ్రహణీరోగము వాతముతోడగూడియుండువానికి పూర్వశ్లోకములో జెప్పియుండు మాతులుంగాద్యౌషధములతో పక్వముజేయబడిన ఘృతమునుగాని ప్రమేహచికిత్సితాధ్యాయమునందు "దశమూలశఠీ" త్యాదిశ్లోకంబులచే జెప్పబడియుండు ధాన్వంతరఘృతమునుగాని, రాజయక్ష్మచికిత్సితాధ్యాయమున "పంచకోలయవక్షారే" త్యాదిశ్లోకంబులచే జెప్పబడియుండు షట్పలఘృతమునుగాని. గుల్మచికిత్సి

తాధ్యాయమున "భల్లాతకానాంద్విపల" మిత్యాదిశ్లోకంబులచే జెప్పబడియుండు భల్లాతకఘృతమునుగాని, ఉదరరోగచికిత్సితాధ్యాయమున "హరీతకీసూక్ష్మరజః" ఇత్యాదిశ్లోకములచే వచింపబడియుండు అభయాఘృతమునుగాని యిప్పించవలయును.

### అగ్నిదీపనకర బిడాదిఘృతము.

బిడం కాచోపలవణం స్వర్జికాయావశూకజాః. ౬౩
సప్తలాం కంటకారీం చ చిత్రకం చైకతో దహేత్,
సప్తకృత్వస్స్రుతస్యాస్య క్షారస్యార్ధాఢకే పచేత్. ౬౪
ఆఢకం సర్పిషః పేయం తదగ్నిబలవృద్ధయే,

బిడాలవణము, కాచలవణము, క్షారలవణము, స్వర్జికాక్షారము, యవక్షారము, సంబరేణు, వ్రాకుడు, చిత్రమూలము, వీనినన్నిటిని యొకటిగాజేర్చి నిప్పులోకాల్చి యాబూడిదె నుదకములోవైచి 7 పర్యాయములు వడియగట్టుకొని అర్ధాఢకప్రమాణము గ్రహించి అందులో 1 ఆఢకము ఆవునెయ్యిగలిపి ఘృతపాకవిధిగ పక్వముజేసి యాఘృతమును గ్రహణీరోగి కిప్పించిన జాఠరాగ్నికి బలముకలుగును.

### సన్నిపాతగ్రహణీ చికిత్స.

నిచయే పంచకర్మాణి యుంజ్యాచ్చైతద్యథా బలమ్ ౬౫

సన్నిపాతమువలన జనించిన గ్రహణీరోగమునందు వమన విరేచన ఆస్థాపన అనువాసన నస్యములను, రోగ దేశ కాల బలాద్యనుగుణముగ జేయించుటయేగాక వాతగ్రహణ్యాదులకు ప్రత్యేకంబుగ వచించియుండు చికిత్సలనుగూడ చేయవలయును.

### అగ్నిమాంద్య హరౌషధములు.

ప్రసేకే శ్లైష్మికే ఽల్పాగ్నేర్దీపనం రూక్షతిక్తకమ్,
యోజ్యం కృశస్య వ్యత్యాసాత్స్నిగ్ధరూక్షం కఫోదయే. ౬౬
క్షీణక్షామశరీరస్య దీపనం స్నేహసంయుతమ్,
దీపనం బహుపిత్తస్య తిక్తం మధురకైర్యుతమ్. ౬౭
స్నేహోఽమ్లలవణైర్యుక్తో బహువాతస్య శస్యతే,

అగ్నిమాంద్యముగల గ్రహణీరోగికి శ్లేష్మప్రకోపమువలన ప్రసేకము అనగా— నోటియందు నీరూరుట, కలిగిన అగ్నిదీపనకారిగ చేదుగనుండునదిగ రూక్షముగనుండు ద్రవ్యమును ప్రయోగించవలయును. మధురామ్లలవణాది రసములను ఘృతమును ప్రయోగింపంజనదు. శరీరకృశత్వ మందాగ్నులుగల గ్రహణీరోగికి కఫప్రకోపము గలిగిన స్నిగ్ధముగ రూక్షముగనుండు ద్రవ్యములను వ్యత్యాసముగా అనగా—(తొలుత

స్నిగ్ధద్రవ్యములనిప్పించి పదంపడి రూక్షద్రవ్యములను; తొలుత రూక్షద్రవ్యముల నిప్పించి పిదప స్నిగ్ధద్రవ్యములను) ప్రయోగించవలయును. దుర్బలంబుగ కృశంబుగ నుండు శరీరముగల గ్రహణీరోగికి కఫప్రకోపముగలిగినచో దీపనకరంబులైన పంచ కోలాదిద్రవ్యముల ఘృతాదిస్నేహములతోడ నిప్పించవలయును. పిత్తాధిక్యము అగ్ని మాంద్యముగల గ్రహణీరోగికి చేదురసముగలద్రవ్యములను మధురరసముగల ద్రవ్యములతోడ నిప్పింపవలయును. వాతాధిక్యాగ్నిమాంద్యములుగలరోగికి స్నేహమును అమ్ల లవణరసములతోడ నిప్పించిన హితముకలుగును.

### అగ్నిదీపనమునందు స్నేహాదులకు ముఖ్యత్వము.

స్నేహమేవ పరం విద్యాద్దుర్బలానలదీపనమ్. ౬౮
నాలం స్నేహసమిద్ధస్య శమాయాన్నం సుగుర్వపి,

స్నేహపానములచే జ్వలింపుచుండు జాఠరాగ్నిని మిక్కిలి గురుత్వముగల ఆహారాదులుగూడ శమింపజేయ నేరవు. కావునజాఠరాగ్ని మందతనుజెంది యుండు వారికి అగ్నిదీపనమును కలుగజేయుటకై స్నేహమొక్కటియే ముఖ్యౌషధంబుగ చెన్నంబడును.

### సైంధవాది ఘృతము.

యోఽల్పాగ్నిత్వాత్కఫే క్షీణే వర్చః పక్వమపి శ్లథమ్. ౬౯
ముంచేత్పట్వౌషధయుతం స పిబేదల్పశో ఘృతమ్,
తేన స్వమార్గమానీతః స్వకర్మణి నియోజితః. ౭౦
సమానో దీపయత్యగ్నిమగ్నేస్సంధుక్షకో హి సః,

గ్రహణీరోగికి జాఠరాగ్ని మాంద్యమువలన కఫము క్షయించి జీర్ణంబైనమలము గూడ శిథిలముగ (అనగా—పలచనగ) వెడలునో అట్టివానికిసైంధవలవణము, శొంఠి, వీనితోడ పక్వముజేయబడిన ఘృతమును కొంచముకొంచముగ పానముజేయించవల యును. ఇటులజేసినచో సమానవాతము స్వమార్గమునుజెంది అన్నపానాదులను పచింపజేయుచు జాఠరాగ్నిని జ్వలింపజేయును.

### మలబంధమునందు పంచలవణఘృతము.

పురీషం యశ్చ కృచ్ఛ్రేణ కఠినత్వాద్విముంచతి. ౭౧
సఘృతం లవణైర్యుక్తం నరోఽన్నావగ్రహం పిబేత్,

ఏ గ్రహణీరోగికి మలము మిగులకఠినముగనై కడుకష్టముతోడ వెడలుచుం డునో అట్టివానికి పంచలవణములచే పక్వముజేయబడిన ఘృతమును పానముచేయించి తోడనో యన్నమును భుజింపజేయవలయును.

—— రౌక్ష్యజాగ్నిమాంద్యౌషధము. ——

రౌక్ష్యాన్మందేఽనలే సర్పిస్తైలం వా దీపనైః పిబేత్. ౭౨

రూక్షతవలన అగ్నిమాంద్యము కలిగిన దీపనకరంబులైన శుంఠ్యాదిద్రవ్యములతో పక్వము జేయబడిన ఘృతమునుగాని, తైలమునుగాని, పానము జేయించవలయును.

—— స్నేహజాగ్నిమాంద్య చికిత్స. ——

క్షారచూర్ణాసవారిష్టాః మందే స్నేహాతిపానతః,

ఘృతాదిస్నేహములను అధికముగ పానము చేయుంటవలన అగ్నిమాంద్యముజనించినచో సర్జక్షారచూర్ణము, ఆసవము, అరిష్టము, అను మద్యములు, వీనిని యిప్పింపవలయును.

—— ఉదావర్తజాగ్నిమాంద్యచికిత్స. ——

ఉదావర్తాత్ప్రయోక్తవ్యా నిరూహస్నేహవస్తయః ౭౩

ఉదావర్తదోషమువలన అగ్నిమాంద్యము గలిగియుండినచో నిరూహస్నేహవస్తికర్మలను ప్రయోగించవలయును.

—— దోషవృద్ధిజాగ్నిమాంద్య చికిత్స. ——

దోషాతివృద్ధ్యా మందేఽగ్నౌ సంశుద్ధేఽన్నవిధిం చరేత్,

వాతాదిదోషములు మిక్కుటముగ వృద్ధిజెందుటచే అగ్నిమాంద్యముకలిగినయెడ వమనవిరేచనాద్యౌషధముల నిప్పించి దోషము బైలువెడలినపిదప పేయాదుల నాహారముగ నిప్పించవలయును.

—— రోగనివృత్తిజాగ్నిమాంద్య చికిత్స. ——

వ్యాధిముక్తస్య మందేఽగ్నౌ సర్పిరేవ తు దీపనమ్. ౭౪

చిరకాలము జ్వరాదిరోగములచే బీడింపబడి యా వ్యాధులు నివర్తించినపిదప వానికి అగ్నిమాంద్యము కలిగినయెడల ఘృతమునుమాత్రము పానము జేయించిన అగ్నిదీపనముకలుగును.

—— మార్గసంచారాదిజాగ్నిమాంద్య చికిత్స. ——

అధ్వోపవాసక్షామత్వైర్యవాగ్వా పాయయేద్ఘృతమ్,
అన్నావపీడితం బల్యం దీపనం బృంహణం చ తత్. ౭౫

మార్గమునడచుట, ఆహారములేకుండుట, బలముక్షయించుట, వీనిచే నగ్నిమాంద్యముకలిగినచో గంజి మొదలగు నాహారములలో ఆవునెయ్యిని చేర్చి యిప్పించినబలపుష్టి అగ్నిదీపనములు కలుగును. తొలుత నాహారముకొంచము భుజించినపిదప (భోజన

మధ్యమున) ఘృతమునుద్రావించి పిదప భుక్తిశేషమును పూర్తిచేయనగును. ఇదియే అన్నావపీడితము. ఇటుజేసినచో శరీరబలంబును, పుష్టియు, అగ్నిదీప్తియుంకలుగును).

### దీర్ఘకాలాగ్నిమాంద్య చికిత్స.

దీర్ఘకాల ప్రసఙ్గాత్తు క్షామక్షీణకృశాన్నరాన్,
ప్రసహానాం రసైస్సామ్లైర్భోజయేత్పిశితాశినామ్. ౭౬
లఘూష్ణకటుశోధిత్వాద్దీపయంత్యాశు తేఽనలమ్,
మాంసోపచితమాంసత్వాత్పరం చ బలవర్ధనమ్. ౭౭

చిరకాలంబుగ నగ్నిమాంద్యము కలిగియుండుటచే ఆహారరసములు చక్కగ జీర్ణముకాకుండుటవలన బలహీనత, ధాతుక్షయము, కృశత్వముగలిగియుండువారికి, మాంసములను భుజించునట్టి పెద్దపులిమొదలగు ప్రసహమృగముల మాంసరసములను, అమ్లరసముతోపక్వముజేసి యారసముతో నన్నాదులనుభుజింపజేయవలయును. పై ప్రసహమృగముల మాంసములు లఘువుగ ఉష్ణముగ కారముగదోషములనుశోధించునట్టి స్వభావముగలవిగనుండుటంజేసి యతిత్వరితంబుగ జాఠరాగ్నిని జ్వలింపజేయుటయేగాక యవి యితర జంతువులమాంసములచే పుష్టినిజెందియుండుట వలన విశేషముగ బలమును వృద్ధిపరచును.

### జాఠరాగ్నిదీపనస్నేహాది ప్రయోగములు.

స్నేహాసవసురారిష్ట చూర్ణక్వాథహితాశనైః,
సమ్యక్ప్రయుక్తైర్దేహస్య బలమగ్నేశ్చ వర్ధతే. ౭౮

ఘృతాదిస్నేహములు, ఆసవము, సుర, అరిష్టము, అను మద్యములు; చూర్ణములు, కషాయములు,హితాహారములు, వీనిని దేశ కాల బల సాత్మ్యాద్యవస్థానుగుణంబుగ నిప్పించిన శరీరబలము జాఠరాగ్నిదీపనము కలుగును.

### ఘృతాదిస్నేహపాన గుణము.

దీప్తో యథైవ స్థాణుశ్చ బాహ్యోఽగ్నిస్సారదారుభిః,
సస్నేహైర్జాయతే తద్వదాహారైః కోష్ఠగోఽనలః. ౭౯

సారముతో గూడియుండు జమ్మి, చండ్ర, మొదలగు కాష్ఠములచే నగ్నిజ్వలించి శమనముజెందక స్థిరముగనుండు చందంబున ఘృతాదిస్నేహములతోగూడియుండు హితాహారంబులచేజాఠరాగ్ని జ్వలించి మాంద్యమునుజెందక స్థిరముగనుండును.

### అధికాహారాదులచే అగ్నిమాంద్యము.

నాఽభోజనేన కాయాగ్నిర్దీప్యతే నాఽతిభోజనాత్,

యథా నిరింధనో వహ్నిరల్పో వాఽతీంధనాన్వితః. ౮౦

కట్టెలు లేకుండుటవలన, లేక విశేషముగ కట్టెలువేయుటవలనను, స్వల్పముగ నుండు అగ్నియెటులనశించునో; అటులనే మనుజులకు ఆహారములేకుండుటవలనను, విశేషముగ నాహారమును భుజించుటవలనను జాఠరాగ్నినశించును.

(సమిధలు బొత్తుగలేకున్నచో నగ్నినశించునుగాని వృద్ధినొందనేరదుకదా? ఆవిధముగనే ఆహారమునుబొత్తుగవదలుటచే జాఠరాగ్ని శనంశెచల్లారునుగాని వృద్ధినొంద జాలదు. మరియు ఇంధనములమిక్కుటముగ నగ్నిపైనియుంచినచో నగ్నిచల్లారును గాని వృద్ధినొంద నేరదుకదా? ఆవిధముగనే జాఠరాగ్నికి మిక్కుటముగనాహారమును భుజించినయెడ జాఠరానలముచల్లారునుగాని వృద్ధినొందదు. కావునజాఠరాగ్నిబలమును గమనించి తదనుసారముగ నాహారాములనిష్పింపవలెనని భావము.)

భస్మకాగ్ని లక్షణము.

యదా క్షీణే కఫే పిత్తం స్వస్థానే పవనాఽనుగమ్,
ప్రవృద్ధం వర్ధయత్యగ్నిం తదాఽసౌసానిలోఽనలః. ౮౧
పక్త్వాఽన్నమాశు ధాతూంశ్చ సర్వానోజశ్చ సంక్షిపన్,
మారయేత్సాశనాత్స్వస్థో భుక్తే జీర్ణే తు తామ్యతి ౮౨
తృట్కాసదాహమూర్ఛాద్యా వ్యాధయోఽత్యగ్నిసంభవాః,

మనుజులకెపుడు కఫము క్షయించి అందువలన పిత్తము వాతముతోగూడిస్వస్థానమైన ఆమాశయమునందు వృద్ధిజెందినదై జాఠరాగ్నిని జ్వలింపజేయునో, అట్టిసమయంబున వాతముతోగూడియుండు నా జాఠరాగ్నితొలుత భుజించిన యాహారములను, పిదప రసాధిధాతువులను, పాకముజేసి; ప్రాణాధారమైన ఓజస్సునునశింపజేసి, మనుజులనుజంపును. పైజెప్పినటుల విశేషముగ జాఠరాగ్ని వృద్ధిగలమనుజుడు ఆహారములను భుజించినయెడల స్వస్థతనుజెందును. భుజించినయాహారము జీర్ణమైనతోడనే తాపము, దప్పి, కాసము, సర్వాంగములయందు మంట, మూర్ఛ, మొదలగు నుపద్రవములనుజెందును. పైజాఠరాగ్నికి భస్మకమను పేరుగలదు.

భస్మకాగ్ని శమనోపాయము.

తమత్యగ్నిం గురుస్నిగ్ధమందసాంద్రహిమస్థిరైః. ౮౩
అన్నపానైర్నయేచ్ఛాంతిం దీప్తమగ్నిమివాంబుభిః,

విశేషముగ జ్వలింపుచుండు అగ్నిని యుదకముచే శమింపజేయునటుల, గురువుగ స్నిగ్ధముగ అగ్నిమాంద్యకరముగ మిక్కిలిశీతలముగ సారముగలదిగనుండుఅన్నపానాదులచే పై భస్మకమను నగ్నిని శమింపజేయవలయును.

(అగ్నిమిక్కిలి తీవ్రముగ ప్రజ్వలించుతరి జలమునుచల్లినచో తీవ్రజ్వాలతగ్గి సమస్థితికివచ్చును. అట్లేరంగుననే జాఠరాగ్ని తీవ్రమైయాహారములను భస్మముగావించుతరి స్నిగ్ధంబులును మందంబులును, చిరకాలమునకు జీర్ణించునవియు, గుణవీర్యములచే శీతంబులునగు నాహారములనుపయోగించిన జాఠరాగ్నిసమస్థితికి వచ్చునని భావము.)

### భస్మకాగ్ని శమనోపచారము.

ముహుర్ముహురజీర్ణేఽపి భోజ్యాన్యస్యోపహారయేత్. ౨౪
నిరింధనోఽన్తరం లబ్ధ్వా యథైనం న విపాదయేత్,
కృసరాం పాయసం స్నిగ్ధం పైష్టికం గుడవైకృతమ్. ౨౫
అశ్నీయాదౌదకానూపపిశితాని భృతాని చ,
మత్స్యాన్ విశేషతశ్శ్లక్ష్ణాన్ స్థిరతోయచరాశ్చ యే. ౨౬

పై భస్మకమను అగ్నిగలవానికి భుజించిన యాహారము జీర్ణముగాకుండునపుడును కృసరము, పాయసము, పిండితో చేయబడి స్నేహములో పక్వముజేసినభక్ష్యాదులు, బెల్లముతో పక్వముజేయబడిన భక్ష్యములు, ఉదకములో సదా సంచరించుస్వభావముగల తాబేలు మొదలగు జంతువులమాంసములు, పంది మొదలగు అనూపజంతువుల మాంసములు, బలిష్ఠములైన మత్స్యములు, ప్రవహింపక స్థిరముగ నొకటేస్థలంబుననిలచి అగాధమైన నీటిలోనుండు జంతువుల మాంసములు మొదలగు నాహారములనుపలుమారు భుజింపజేయవలయును. అటులజేయనిచో నా భస్మకాగ్ని జీర్ణముజేయుటకు తగిన యాహారము ఉదరములో లేకుండుసమయంబున రసాదిధాతువులనానాట జీర్ణింపజేసి తుదకు మనుజుని తప్పకచంపును.

### అత్యగ్నియందు మేకమాంసము.

ఆవికం సుభృతం మాంసమద్యాదత్యగ్నివారణమ్,

అత్యగ్నిగలవానికి మదించిన మేకమాంసమును భుజింపజేసిన అత్యగ్ని శమించును.

### అత్యగ్నియందుక్షీరాది పానము,

పయస్సహ మధూచ్ఛిష్టం ఘృతం వా తృషితః పిబేత్. ౨౭
గోధూమచూర్ణం పయసా బహుసర్పిఃపరిప్లుతమ్,
అనూపరసయుక్తాన్వా స్నేహాంస్తైలవివర్జితాన్. ౨౮
శ్యామాత్రివృద్ద్విపక్వం వా పయో దద్యాద్విరేచనమ్,
అసకృత్పిత్తహరణం పాయసం ప్రతిభోజనమ్. ౨౯

పైభస్మకాగ్ని గలవానికి దప్పిగలిగిన మైనముతో కాచబడిన ఆవుపాలనుగాని, ఘృతమునుగాని; లేక ఆవుపాలలో గోధుమనూకలనుజేర్చి కాచినపాయసములో అధి

కముగ నెయ్యి కలిపిగాని; అనూపదేశజంతువుల మాంసరసములో నెయ్యిని లేక క్రొవ్వును లేక మజ్జిగను కలిపిగాని, పానము చేయించవలయును. మఱియు నల్ల సుగంధిపాల తెల్లతెగడ వీనితో కాచబడిన ఆవుపాలను విరేచనార్థ మిప్పించి పిత్తహరమైన పాయసమును పలుమారు భుజింపజేయవలయును.

### భస్మకాగ్నిగలవారికి ఆహారము.

యత్కించిద్గురు మేధ్యం చ శ్లేష్మకారి చ భోజనమ్,
సర్వం తదత్యగ్నిహితం భుక్త్వా చ స్వపనం దివా. ౯౦
ఆహారమగ్నిః పచతి దోషానాహారవర్జితః,
ధాతూన్ క్షీణేషు దోషేషు జీవితం ధాతుసంక్షయే. ౯౧

భుజించిన యన్నాదులను జాఠరాగ్ని పాకము జేయును. ఆహార ముదరంబున లేకుండిన దోషములను పాకము జేయును. దోషములు లేకుండిన రసాదిసప్తధాతువులను పాకము జేయును. ధాతువులునశించినపిదప ప్రాణమునశించును. కావున అత్యగ్నిగలవారికి గురువుగ బలకరముగ కఫమును వృద్ధిజేయునదిగనుండు ఆహారములను భుజింపజేసి పగటియందు నిద్రించునటుల జేసిన హితముకలుగును.

### జాఠరాగ్ని రక్షణావశ్యకత్వము.

ఏతత్ప్రకృత్యైవ విరుద్ధమన్నం సంయోగసంస్కారవశేన చేదమ్,
ఇత్యాద్యవిజ్ఞాయ యథేష్టచేష్టాశ్చరంతి యత్సాగ్నిబలస్య శక్తిః.
తస్మాదగ్నింపాలయేత్సర్వయత్నైస్తస్మిన్నష్టే యాతి నా నాశమేవ,
దోషైర్గ్రస్తే గ్రస్యతే రోగసంఘైర్యుక్తే తు స్యాన్నీరుజో దీర్ఘజీవీ

స్వభావసంయోగపాక మాత్రా కాలాదులవలన అపథ్యకరంబులైన యన్నాదులను స్వేచ్ఛగభుజింపుచు రోగరహితులై సంచరింపుచుండుట, జాఠరాగ్ని సామర్థ్యము. కావున అట్టిజాఠరాగ్నిని మనుజులు సర్వప్రయత్నంబులచే రక్షింపుచుండవలయును. జాఠరాగ్ని నశించినచో మనుజులు నశింతురు. ఆయగ్నికిదోషములు కలిగినమనుజులు నానావిధరోగములచే పీడింపబడుదురు. ఆయగ్ని స్వచ్ఛముగనుండిన మానవులు రోగరహితులై సుఖముగ దీర్ఘకాలముపరకు జీవించియుందురు.

దశమాధ్యాయము ముగిసెను.

---

# ఏకాదశాధ్యాయము.

"వస్తివస్తిశిరోమేఢ్ర కటీవృషణపాయవః, ఏకసంబంధనాః ప్రోక్తా గుదాస్థివివరాశ్రయాః." అనువచనప్రకారము గ్రహణీరోగ-మూత్రాఘాతములు యొకటేస్థానమున జనించుటంజేసి గ్రహణీదోషచికిత్సితాధ్యాయ నిరూపణానంతరము మూత్రాఘాత చికిత్సతాధ్యాయము చెప్పబడుచున్నది.

## మూత్రాఘాతచికిత్సితాధ్యాయ ప్రారంభము.

అథాతో మూత్రాఘాతచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

గ్రహణీరోగ చికిత్సితాధ్యాయనిరూపణానంతరము మూత్రకృచ్ఛ్రచికిత్సలను తెలియపరచునట్టి మూత్రాఘాత చికిత్సితమను నీయధ్యాయమును వివరించెదము. మూత్రాఘాతమనగా—నొప్పితోగూడి కష్టముగా మూత్రము బైలువెడలునట్టి రోగము.

## వాతజమూత్రాఘాత చికిత్స.

కృచ్ఛ్రే వాతఘ్నతైలాక్తమధో నాభేస్సమీరజే,
సుస్నిగ్ధైస్స్వేదయేదంగం పిండసేకావగాహనైః. ౧

వాతప్రకోపముచే జనించిన మూత్రకృచ్ఛ్రమునందు రోగి శరీరమునకు బలాతైలము మొదలగు వాతహరములైన తైలములచే నభ్యంజనముచేయించి నాభికి క్రింది భాగంబున స్నిగ్ధముగనుండుపిండాదిస్వేదకర్మలు సేకము అవగాహనము వీనిని చేయించవలయును.

## మూత్రకృచ్ఛ్రహరదశమూలాదిఘృతము.

దశమూలబలైరండయవాభీరుపునర్నవైః,
కులుత్థకోలపత్తూరవృశ్చీవోపలభేదకైః. ౨
తైలసర్పిర్వరాహర్క్షవసాః క్వథితకల్కితైః,
సపంచలవణాస్సిద్ధాః పీతాశ్శూలహరాః పరమ్. 3

దశమూలములు, బలామూలము (చిట్టాముట్టి), ఆముదపువేళ్లు, యవలు, పిల్లిపీచర, గలిజేరు, ఉలవలు, రేగు, పత్తూరం (అనగా—మయూరశిఖ), తెల్లజిల్లేడు,

పాషాణభేది, వీనికషాయములో నువ్వులనూనె, ఆవునెయ్యి, పందిక్రొవ్వు, ఎలుగు మంటిక్రొవ్వు, పంచలవణములు, పైదశమూలాది ద్రవ్యములకల్కము, వీనినిచేర్చి ఘృతపాకవిధిగ పక్వముజేసి పానము చేయించిన మూత్రకృచ్ఛ్రశూలలు హరించును.

—॥ మూత్రకృచ్ఛ్రమునందు దశమూలాద్యుపయోగము. ॥—

ద్రవ్యాణ్యేతాని పానాన్నే తథా పిండోపనాహనే,
సహ తైలఫలై ర్యుంజ్యా త్సామ్లాని స్నేహవంతి చ. ౪

పులిమజ్జిగ, పుల్లనీళ్లు, వీనితో పైదశమూలాదులను పక్వముజేసి, అందులో అధికముగ స్నేహములను గలిపి, దానిని మూత్రకృచ్ఛ్రరోగికి పానము, భోజనము, పిండస్వేదము, ఉపనాహస్వేదము, అనువానియందుపయోగించిన హితముకలుగును.

—॥ వాతజమూత్రకృచ్ఛ్రమునందు మదిరాపానము. ॥—

సౌవర్చలాఢ్యాం మదిరాం పిబేన్మూత్రరుజాపహామ్,

మదిరయనుమద్యములో అధికముగ సౌవర్చలవణము కలిపి పానము జేయించిన వాతమువలన జనించిన మూత్రకృచ్ఛ్రరోగము హరించును.

—॥ పిత్తజ మూత్రకృచ్ఛ్ర చికిత్స. ॥—

పైత్తే యుంజీత శిశిరం సేకలేపావగాహనమ్. ౫

పిత్తమువలనకలిగిన మూత్రకృచ్ఛ్రరోగమునందు శీతలముగనుండు సేకలేపావగాహనములను చేయించవలయును.

—॥ పిత్తజమూత్రకృచ్ఛ్రమునందు శతావర్యాదికషాయము. ॥—

పిబేద్వరీం గోక్షురకం విదారీం సకసేరుకాం,
తృణాఖ్యం పంచమూలం చ పాక్యం సమధుశర్కరమ్. ౬

పిల్లిపీచర, సన్నపల్లేరు, నేలగుమ్మడుగడ్డ, సమ్మదుంప, తృణపంచమూలములు, అనువానిని సమభాగములుగ గ్రహించి యుదకములో పైటకషాయముకాచి; అందులో తేనె, పంచదారకలిపి, దానిని పానముజేయించినయెడ పిత్తమువలన జనించిన మూత్రకృచ్ఛ్రరోగము హరించును. (దర్భకుందురెల్లు, తిప్పరెల్లు, వెల్లు, కిక్కిసగడ్డి, అను నీ అయిదింటియొక్కకూటమి తృణపంచమూలములనబడును.)

—॥ పిత్తజమూత్రకృచ్ఛ్రమునందు వృషకాదికల్కము. ॥—

వృషకం త్రపుసై ర్వారు లట్వాబీజాని కుంకుమమ్,
ద్రాక్షాంభోభిః పిబేత్సర్వాణ్ మూత్రాఘాతానపోహతి. ౭

ద్రాక్షపండు నుదకములోవైచిపిసికి, ఆ ఉదకములో పాషాణభేది, ములుదోస,

నక్కదోస, కుసుంబావిత్తులు, కుంకుమపువ్వు అనువానిని సమభాగములు నూరి కలిపి పానము జేయించిన పిత్తమువలన జనించిన మూత్రకృచ్ఛ్రము :

### పిత్తజమూత్రకృచ్ఛ్రమునందు ఏర్వారుబీజకల్కము.

ఏర్వారుబీజయష్ట్యాహ్వ దార్వీర్వా తండులాంబునా,
తోయేన కల్కం ద్రాక్షాయాః పిబేత్పర్యుషితేన వా

నక్కదోసవిత్తులు యష్టిమధుకము మ్రానిపసపు వీనిని సమభాగములు నూరి బియ్యపుకడుగులోగలిపి పానము జేయించినను లేక ద్రాక్షపండు రాత్రి తెచ్చియుంచిన పాకనీళ్లలోకలిపి పానముచేయించినను పిత్తజమూత్ర రోగము నివర్తించును.

### కఫజమూత్రకృచ్ఛ్ర చికిత్స.

కఫజే వమనం స్వేదం తీక్ష్ణోష్ణకటుభోజనమ్,
యవానాం వికృతీః క్షారం కాలశేయం చ శీలయేత్.

కఫమువలనజనించిన మూత్రకృచ్ఛ్రరోగమునందువమనస్వేదకర్మలను తీక్ష్ణముగ ఉష్ణముగ క్షారముగనుండు నాహారములను ఇప్పించి, యవ బడిన భక్ష్యములు, యవక్షారము, ఆవుమజ్జిగ, అనువానిని ఉపయోగ వలయును.

### కఫజమూత్రకృచ్ఛ్రహార యోగములు.

పిబేన్మద్యేన సూక్ష్మైలాం ధాత్రీఫలరసేన వా,
సారసాస్థిశ్వదంష్ట్రైలావ్యోషం వా మధుమూత్రవత్
స్వరసం కంటకార్యా వా పాయయేన్మాక్షికాన్వితమ్,
శితివారకబీజం వా తక్రేణ శ్లక్ష్ణచూర్ణితమ్.
ధవసప్తాహ్వకుటజం గుడూచీచతురంగులమ్,
కటుకైలాకరంజం చ పాక్యం సమధుసాధితమ్.
త్రైర్వా పేయాం ప్రవాళం వా చూర్ణితం తండులాం
సతైలం పాటలాక్షారం సప్తకృత్వోఽథవా శ్రుతమ్.

కఫమువలనజనించిన మూత్రకృచ్ఛ్రరోగంబున పిన్నయేలకులనుచ మద్యములో గాని, ఉసిరికపండు రసములో గాని కలిపి; పానము జేయించవల తామరవిత్తులు, పెద్దపల్లేరు, ఏలకులు, త్రికటుకములు, అనువానిని చూర్ణ పంచితములోకలిపి, అందులో తేనెచేర్చి, పానముచేయించవలయును; లే

స్వరసములో తేనెగలిపి పానముజేయించవలయును; లేక క్రానుగువిత్తులను చక్కగనూరి, ఆవుమజ్జిగలోకలిపి, పానముజేయించవలయును: లేక ధవవృక్షపుపట్ట ఏడాకులపొన్న, కొడిసె, తిప్పతీగ, ఆముదపాకు, కటుకరోహిణి, ఏలకులు, క్రానుగు, అనువానిని సమభాగములుగ గ్రహించి యుదకములోవైచి చక్కగకాచిన కషాయమును, తేనెసహితముగ పానముచేయించవలయును; లేక పై యేడాకులపొన్న మొదలగువానిచిగుళ్లతో పక్వము చేయబడిన గంజిని యిప్పించవలయును. పగడపుభస్మమును బియ్యపుకడుగులో కలిపి పానముజేయించవలయును. కలిగొట్టుక్షారమును నీళ్లలోవైచి 7 పర్యాయములు కడిగి వడియగట్టుకొని అందులో నువ్వులనూనెకలిపి పానముజేయించవలయును.

పాటలీయావశూకాభ్యాం పారిభద్రాత్తిలాదపి,
క్షారోదకేన మదిరాం త్వగేలోషకసంయుతామ్. ౧౪
పిబేద్గుడోపదంశాన్వా లిహ్యాదేతాన్ పృథక్ పృథక్,

కలిగొట్టుక్షారము, యవక్షారము, వేపపట్టబూడిదె, నువ్వులక్షారము, అనువానిని నీళ్లలోకలిపి; అందులో మదిరయనుమద్యము, లవంగపట్ట, ఏలకులు, ఊషకము అనగా —జెముడు, అనువానిని చూర్ణముచేసికలిపి; పానముజేయించిన కఫమువలనజనించిన మూత్రకృచ్ఛ్రము హరించును. మఱియు పై కలిగొట్టుచూర్ణము మొదలగువానిని ప్రత్యేకప్రత్యేకముగ బెల్లములోగలిపి నాకించవలయును.

### సన్నిపాతజమూత్రకృచ్ఛ్రచికిత్స.

సన్నిపాతాత్మకే సర్వం యథావస్థమిదం హితమ్. ౧౫
అశ్మర్యథ చిరోత్థానే వాతవస్త్యాదికేషు చ,

సన్నిపాతమువలనజనించిన మూత్రకృచ్ఛ్రమునం దాయా యవస్థానుగుణముగ వాతజాదిమూత్రకృచ్ఛ్రములకు ప్రత్యేకముగ జెప్పియుండు చికిత్సలనన్నిటిని చేయవలయును. మఱియు నూతనముగ జనించియుండు అశ్మరీరోగమునందును, వాతవస్తి, వాతకుండలి, అనువాటియందును పై చికిత్సలనే చేయవలయును.

### అశ్మరీరోగ చికిత్స.

అశ్మరీదారుణో వ్యాధిరంతకప్రతిమో మతః. ౧౬
తరుణో భేషజైస్సాధ్యః ప్రవృద్ధశ్ఛేదమర్హతి,

అశ్మరీరోగము దారుణమైనది. ఇది శీఘ్రముగ మానవులనుజంపుటవలనయమునితోసమానమైనదిగనుండును. మఱియు నది జనించినతోడనే ఔషధప్రయోగములచే చికిత్సజేసిన నివర్తించును. వృద్ధిజెందినయెడల శస్త్రములచే ఛేదించి బయలుపరచవలయును. అశ్మరీరోగమనగా—మూత్ర శుక్రములు ఘనీభవించి రాయివలెనగుటయు,

మూత్రరోగమునందిట్టి తాయి మూత్రద్వారమును నిరోధించి కడుకష్టముమీద మూత్రమును వెడలింపంజేయునో యది అశ్మరీరోగమనంబడును.

అశ్మరీరోగమున స్నేహాదికర్మలు.

తస్య పూర్వేషు రూపేషు స్నేహాదిక్రమ ఇష్యతే. ౧౭

అశ్మరీరోగము జనించుటకుమునుపు ఆ వ్యాధికి పూర్వరూపంబులుజనించియుండినయెడల స్నేహస్వేదవమనకర్మలను చేయించవలయును.

వాతాశ్మరికి పాషాణభేదాది ఘృతము.

పాషాణభేదో వసుకో వశిరోఽశ్మంతకో వరీ,
కపోతవంకా తిబలా భల్లూకోశీరకం తకమ్. ౧౮
వృక్షాదనీ శాకఫలం వ్యాఘ్రీ గుంత్రత్రికంటకమ్,
యవాః కులుత్థాః కోలాని వరుణః కతకాత్ఫలమ్. ౧౯
ఊషకాదిప్రతీవాపమేషాం క్వాథే శృతం ఘృతమ్,
భినత్తి వాతసంభూతాం తత్పీతం శీఘ్రమశ్మరీమ్. ౨౦

పాషాణభేది, మోదన, లేక ఈశ్వరపల్లి, సాముద్రలవణము, ఆరెపువ్వు, పిల్లిపీచర, ఆదిత్యభక్తిచెట్టు, లేక మండూకబ్రహ్మి, అతిబల (పేరాముట్టి), దుందిలము, పట్టివేరు, కంకతము, బదనిక, శాకఫలము, వ్రాకుడు, గుంఠము (అనగా—తుంగగడ్డి), సన్నపల్లేరు, యవలు, ఉలవలు, రేగుపండ్లు, ఉలిమిడి, చిల్లవిత్తులు, అనువానిని సమభాగములుగ గ్రహించి ఉదకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి పడియగట్టుకొని; అందులో ఆవునెయ్యి, ఊషకాదిగణములో జెప్పియుండు ద్రవ్యముల కల్కము, వీనిని కలిపిఘృతపాకవిధిగ పక్వముజేసి, దానిని పానము చేయించిన, వాతము వలన జనించిన అశ్మరీరోగము శీఘ్రముగ నివర్తించును.

వాతాశ్మరికి గంధర్వహస్తాది కల్కము.

గంధర్వహస్తబృహతీవ్యాఘ్రీగోక్షురకేక్షురాత్,
మూలకల్కం పిబేద్దధ్నా మధురేణాశ్మభేదనమ్. ౨౧

ఆముదపుచెట్టు, ములక, వ్రాకుడు, సన్నపల్లేరు, నీరుగొబ్బి, వీని వేళ్లను సమభాగములుగ గ్రహించినూరి తియ్యని ఆవుపెరుగులో గలిపి పానముజేయించిన, వాతాశ్మరీరోగము హరించును.

పిత్తాశ్మరి చికిత్స.

కుశః కాశశ్శరో గుంఠ ఇత్కటో మోరటోఽశ్మభిత్,
దర్భో విదారీ వారాహీ శాలీమూలం త్రికంటకా. ౨౨

భల్లాతకః పాటలీ పాఠా పత్తూరస్సకురంటకః,
పునర్నవా శిరీషశ్చ తేషాం క్వాథే పచేద్ఘృతమ్. ౨౩
పిష్టేన త్రపుసాదీనాం బీజేనేందీవరేణ వా,
మధుకేన శిలాజేన తత్పిత్తాశ్మరిభేదనమ్. ౨౪

కుశగడ్డి, రెల్లు, కాకివెదురు, గుంతము (అనగా—తుంగగడ్డి), ఇక్కటము, చెఱుకువేరు, పాషాణభేదము, దర్భగడ్డి, నేలగుమ్ముడుగడ్డ, నేలతాటిగడ్డ, ఎఱ్ఱరాజనాలగడ్డి, సన్నపల్లేరు, దుందిలపుచెట్టు, కలిగొట్టు, చిరుబొద్ది, మయూరశిఖిచెట్టు, ఎఱ్ఱగోరింట, గలిజేరు, దిరిసనము, వీనిని సమభాగములుగ గ్రహించి ఉదములోవైచి పాదావశేషముగ కషాయముగాచి అందులో ఆవునెయ్యిజేర్చి; నక్కదోసవిత్తులు, దులుదోసవిత్తులు, నల్లకలువవిత్తులు, అతిమధురము, శిలాజిత్తు, అనువానిని సమభాగములుగ గ్రహించి చక్కగ నూరికలిపి ఘృతపాకవిధిగ పక్వముజేసి దానిని పానముజేయించిన పిత్తాశ్మరి హరించును.

కఫజాశ్మరీరోగమున వరుణాదిఘృతము.

వరుణాదిస్సమీరఘ్నో గణో వేలాహరేణుకా,
గుగ్గులుర్మరిచం కుష్ఠం చిత్రకస్సురాహ్వయః. ౨౫
తైః కల్కైతైః కృతావాపమూషకాదిగణేన చ,
భినత్తి కఫజామాశు సాధితం ఘృతమశ్మరీమ్. ౨౬

వరుణాదిగణములోజెప్పియుండుయోషధులు, వీరతర్వాదిగణములోజెప్పియుండుయోషధులు, విదార్యాదిగణములోజెప్పియుండుయోషధులు, ఏలకులు, రేణుకలు, గుగ్గిలము, మిరియాలు, చెంగల్వకోష్టు, చిత్రమూలము, దేవదారుపట్ట, వీనిని సమభాగములుగ గ్రహించినూరి, ఆవునెయ్యిలోగలిపి, అందులో ఊషకాదిగణద్రవ్యములచూర్ణమునుజేర్చి, ఘృతపాకవిధిగపక్వముజేసి, యాఘృతమును పానముజేయించిన కఫమువలన కలిగిన అశ్మరీరోగము నివర్తించును.

క్షారక్షీరయవాగ్వాది ద్రవ్యైస్సైస్సైశ్చ కల్పయేత్,

క్షారములు, పాలు, గంజి, మొదలగువానిని ఆయారోగహర ద్రవ్యములతో కాచి యిప్పించవలయును.

అశ్మరీరోగమున పిచుకాదిచూర్ణము.

పిచుకాం కోలకతక శాకేందీవరజైః ఫలైః. ౨౭
శీతముష్ణాంబు సగుడం శర్కరాపాతనం పరమ్,

గార, లేక గురుగు, ఊడుగు, చిల్లగింజలు, నల్లకలువ, అనువానివిత్తులను చూర్ణము జేసి యుష్ణోదకములోఁగలిపి అందులోఁ గొంచము బెల్లముచేర్చి, పానము జేయించిన మూత్రశర్కర హరించును.

### అశ్మరీరోగమున క్రౌంచాస్థ్యాదియోగము.

క్రౌంచోష్ట్రసారసాస్థీని శ్వదంష్ట్రాతాలపత్రికా. ౨౮
అజమోదాకదంబస్య మూలం బిల్వస్య చౌషధమ్,
పీతాని శర్కరాం భిన్ద్యుః సురయోష్ణోదకేన వా. ౨౯

జక్కువపక్షి, ఒంటె, హంస, వీనియెముకలు, సన్నపల్లేరు, ఎలుకచెవియాకు, ఓమము, కడిమి, మారేడు, వీనివేళ్ళు; కొంతి వీనిని నీటితోనూరి సురయను మద్యములోఁగాని, ఉష్ణోదకములోఁగాని, కలిపి పానముజేయించిన మూత్రశర్కర హరించును.

### అశ్మరీరోగమున తుంబుర్వాది చూర్ణము

నృత్యకుండలబీజానాం చూర్ణం మాక్షికసంయుతమ్,
అవిక్షీరేణ సప్తాహం పీతమశ్మరినాశనమ్. 30

తుంబురు (తుమికి) విత్తులను, చూర్ణముజేసి మేకపాలలోఁగలిపి అందులోఁ గొంచము తేనెబోసి 7 దినములు పానముజేయించిన, అశ్మరీరోగము నివర్తించును.

### అశ్మరీరోగమున శిగ్రుమూల కషాయము.

క్వాథశ్చ శిగ్రుమూలోత్థః కటూష్ణోఽశ్మరిపాతనః,

మునగవేళ్లకషాయమును సుఖోష్ణముగ పానముజేయించిన అశ్మరినివర్తించు.

### మూత్రశర్కరాదులయందు తిలాదిక్షారము.

తిలాపామార్గకదలీపలాశయవసంభవః. 3౧
క్షారః పేయోఽవిమూత్రేణ శర్కరాస్వశ్మరీషు చ,

నువ్వులు, ఉత్తరేణి, అరటి, మోదుగు, యవలు, వీనిని నిప్పులోఁ గాల్చియాబూడిదెను మేకపాలలోఁ కలిపి పానముజేయించిన మూత్రశర్కర, అశ్మరీరోగము, ఇవి హరించును.

### అశ్మరీరోగమున ఆదిత్యభక్త్యుపయోగము.

కపోతవంకామూలం వా పిబేదేకం సురాదిభిః. 3౨
తత్సిద్ధం వా పిబేత్క్షీరం వేదనాభిరుపద్రుతః,
హరితక్యస్థిసిద్ధం వా సాధితం వా పునర్నవైః. 33
క్షీరాన్నభుగ్బ్రహ్మశిఖామూలం వా తండులాంబునా,

మూత్రాఘాతేషు విభజేదతశ్శేషేష్వపి క్రియామ్. ౩౪

అనేకవిధోపద్రవములతో గూడియుండు అశ్మరీరోగికి ఆదిత్యభక్తిచెట్టువేళ్ళను, లేక మండూకబ్రహ్మివేళ్ళను, నూరి సురయనుమద్యములోగాని; ఉష్ణోదకములోగాని కలిపి; పానముచేయించవలయును; లేక ఆదిత్యభక్తివేళ్లతోగాని, కరక్కాయవిత్తులతోగాని, గలిజేరుతోగాని, కాచబడిన ఆవుపాలను, పానముజేయించవలయును. లేక మయూరశిఖవేళ్లనునూరి బియ్యపుకడుగులోకలిపి, పానముజేయించి, ఆవుపాలతో నన్నమును భుజింపజేయవలయును. తక్కిన మూత్రకృచ్ఛ్రరోగములయందును పైని వచించినచికిత్సలను ఆయా రోగానుగుణంబుగ జేయవలయును.

### మూత్రకృచ్ఛ్రమునందు బృహత్యాదిగణోపకారములు.

బృహత్యాదిగణే సిద్ధం ద్విగుణీకృతగోక్షురే,
తోయం పయో వా సర్పిర్వా సర్వమూత్రవికారనుత్. ౩౫

ఉదకములోగాని, ఆవుపాలలోగాని, ఆవునెయ్యిలోగాని, బృహత్యాది గణములోజెప్పియుండు ఓషధులు 1 భాగము, పల్లేరు 2 భాగములు, ఇటుల వీనిని చేర్చి కాచి దానిని పానముచేయించిన మూత్రరోగములన్నియు నివర్తించును.

### మూత్రకృచ్ఛ్రమునందు దేవదార్వాదికల్కము.

దేవదారుం ఘనం మూర్వాం యష్టీమధుహరీతకీమ్,
మూత్రాఘాతేషు సర్వేషు సురాక్షీరజలైః పిబేత్. ౩౬

దేవదారు, తుంగముస్తలు, చాగ, అతిమధురము, కరక్కాయ, అనువానిని సమభాగములుగ గ్రహించినూరి సురయనుమద్యము, ఆవుపాలు, నీళ్లు, వీనిలోనైనను కలిపి పానముజేయించిన మూత్రరోగములన్నియు నివర్తించును.

### మూత్రరోగమునందు ధన్వయాసాదిరసములు.

రసం వా ధన్వయాసస్య కషాయం కకుభస్య వా,
సుఖాంభసా వా త్రిఫలాం పిష్టాం సైంధవసంయుతామ్. ౩౭
వ్యాఘ్రీగోక్షురకక్వాథే యవాగూం వా సఫాణితామ్,
క్వాథే వీరతరాదేర్వా తామ్రచూడరసే పివా. ౩౮
అద్యాత్ వీరతరాద్యేన భావితం వా శిలాజతు,

మూత్రకృచ్ఛ్రరోగముగలవానికి, పిన్నరేగటి దూలగొండి స్వరసమునుగాని, మద్దికషాయమునుగాని, పానముచేయించవలయును. లేక త్రిఫలములనునూరి యుష్ణోదకములోకలిపి, అందులో సైంధవలవణముజేర్చి, దానిని పానముజేయించవలయును. లేక

ప్రాకుడు, సన్నపల్లేరు, వీనినికషాయములో యవలను చేర్చిపక్వముజేసి అందులో ఖండ శర్కరగలిపి యా గంజిని పానముజేయించవలయును. లేక వీరతరాదిగణద్రవ్య కషాయములో పక్వముజేయబడిన పేయను గాని, కోడిమాంసరసములో పక్వముజేయబడిన పేయనుగాని, పానముజేయించవలయును. లేక వీరతరాదిగణకషాయములో భావన జేసిన శిలాజిత్తును భక్షింపజేయవలయును.

## అశ్మరీపతనోపాయము.

మద్యం వా నిగదం పీత్వా రథేనాశ్వేన వా వ్రజేత్. ౩౯
శీఘ్రవేగేన సంక్షోభా త్తథాస్య చ్యవతేఽశ్మరీ,

పాతమద్యమును పానముజేయించి, మిక్కిలి వేగముగల గుఱ్ఱముమీద నైనను, బండిమీదనైనను, ఎక్కి వేగముగ తిరుగునటులం జేసిన శరీరమునకు విశేషమైన క్షోభగలిగి అశ్మరి క్రిందికి జారిపడును.

## మూత్రకృచ్ఛ్రమునందు వస్తికర్మాదులు.

సర్వథా చోపయోక్తవ్యో వర్గో వీరతరాదికః ౪౦
రేకార్థం తైల్వకం సర్పి ర్వస్తికర్మ చ శీలయేత్,
విశేషాదుత్తరాన్ వస్తీన్..............

మూత్రకృచ్ఛ్రరోగము లన్నిటియందును వీరతరాదిగణములో జెప్పి యుండుద్రవ్యములను కషాయము, గంజి, వేడినీళ్లు, మొదలగువానిలోచేర్చి యుపయోగించవలయును. మఱియు విరేచనార్థము తైల్వకఘృతము నిప్పించవలయును. వస్తికర్మలను విధిప్రకారము జేయించవలయును. ఉత్తరవస్తికర్మలను పలుమారు జేయుచుండవలయును.

## శుక్రాశ్మరీ చికిత్స.

................శుక్రాశ్మర్యాం చ శోధితే. ౪౧
తైర్మూత్రమార్గేణ బలవాన్ శుక్రాశయవిశుద్ధయే,
పుమాన్ సుతృప్తో వృష్యాణాం మాంసానాం కుక్కుటస్య చ.
కామం స కామాస్సేవేత ప్రమదా మదదాయినీః,

శుక్రాశ్మరీరోగముగలవాని మూత్రమార్గమును పూర్వశ్లోకములో జెప్పియుండు ఉత్తరవస్తికర్మలచే శుద్ధిజేయించి, ఇంద్రియ పుష్టికరములైన ద్రవ్యముల రసమును, కోడిమాంసరసమును, తృప్తియగువరకు భుజింపజేసి, బలవంతురాండ్రను కామపరవశురాండ్రునైన. స్త్రీలతోస్వచ్ఛంద వృత్తిసంభోగించునటుల చేయవలయును, ఇటుల జేసినచో శుక్రాశయము పరిశుద్ధమగును.

## ఆశ్మరీరోగికి శస్త్రచికిత్స.

సిద్ధై రుపక్రమై రేభి ర్న చేచ్ఛాంతి స్తదా భిషక్. ౪౩
ఇతి రాజానమాపృచ్ఛ్య శస్త్రం సాధ్వవచారయేత్,
అక్రియాయాం ధ్రువో మృత్యుః క్రియాయాం సంశయో భ
నిశ్చితస్యాపి వైద్యస్య బహుశస్సిద్ధకర్మణః, [వేత్. ౪౪

అనుభవసిద్ధంబులయిన పైచికిత్సలను జేసియు ఆశ్మరీరోగము నివర్తించకయుండి నపుడు వైద్యవరుండు రాజసమీపంబునకేగి "రాజా! ఈ అశ్మరీరోగికి చికిత్స జేయని యెడల నిశ్చయముగ మరణముకలుగును. శస్త్రచికిత్స జేసినచో నొకవేళ బ్రతికినను బ్రతుకును; లేక మరణము జెందినను జెందును. ఆయుర్వేదతంత్రములలో విశేష పాండిత్యము గలవాడును, పెక్కండ్రురోగులకుచికిత్సచేసి రోగములనుపోగొట్టి యనుభవముకలవాడునైన వైద్యశ్రేష్ఠునికిగూడ నశ్మరీరోగికి చికిత్సలచే నిస్సంశయంబుగ జీవించుననిజెప్పుటకలవికాదని రాజుతోడంజెప్పి, రాజాజ్ఞగొని శస్త్రచికిత్స కుపక్రమింపవలయును.

## అశ్మరీరోగమున శస్త్రచికిత్సాక్రమము.

అథాతురముపస్నిగ్ధం శుద్ధమీషచ్చ కర్శితమ్. ౪౫
అభ్యక్తస్విన్నవపుషమభుక్తం కృతమంగలమ్,
ఆజానుఫలకస్థస్య నరస్యాంకే వ్యపాశ్రితమ్. ౪౬
పూర్వేణ కాయేనోత్తానం నిషణ్ణం వస్త్రచుంభళే,
తతోఽస్య కుంచితే జానుకూర్పరే వాససా దృఢమ్. ౪౭
సహాశ్రయమనుష్యేణ బద్ధస్యాశ్వాసితస్య చ,
నాభేస్సమంతాదభ్యజ్యాదధస్తస్యాశ్చ వామతః. ౪౮
మృదిత్వా ముష్టినా కామం యావదశ్మర్యధోగతా,
తైలాక్తే వర్ధితనఖే తర్జనీమధ్యమే తతః ౪౯
అదక్షిణే గుదేఽంగుల్యౌ ప్రణిధాయానుసేవనీమ్,
ఆసాద్య వలయం నాభ్యాప్యశ్మరీం గుదమేఢ్రయోః. ౫౦
కృత్వాంతరే తథా వస్తిం నిర్వ్యలీకమనాయతమ్,
ఉత్పీడయేదంగులిభ్యాం యావద్గ్రంథిరివోన్నతం. ౫౧
శల్యం స్యాత్సేవనీం ముక్త్వా యవమాత్రేణ పాటయేత్,
అశ్మమానేన న యథా భిద్యతే సా తథా హరేత్. ౫౨
సమగ్రం సర్పవక్త్రేణ స్త్రీణాం వస్తిస్తు పార్శ్వగః,

గర్భాశయాశ్రయస్తాసాం శస్త్రముత్సంగవత్తతః. ౫౩
న్యసేదతోఽన్యథా హ్యాసాం మూత్రస్రావీ వ్రణో భవేత్,
మూత్రప్రసేకక్షరణాన్నరస్యాప్యపి చైకధా. ౫౪
వస్తిభేదోఽశ్మరీహేతుః సిద్ధిం యాతి న తు ద్విధా,

పైనజెప్పినప్రకారము రాజాజ్ఞనుపొందిన పిదప వైద్యవరుండు అశ్మరీరోగికి తొలుత స్నేహవస్తిప్రయోగముచే మూత్రవస్తినిశుద్ధిజేయించి పిదప అభ్యంగస్వేద కర్మలను యథావిధిగనొనరింపజేసి, శుభదినమునందు దేవతా నమస్కారాదుల నొనర్చినవాడుగను, నిరాహారుడుగనునుండు నారోగిమోకాలుప్రమాణము యెత్తుగల బల్లమీదగూర్చునియుండు ఒకమనుజుని యంకతలంబున వస్త్రముచే జుట్టంబడిన జుట్టుకుదురునుంచి, దానిపై యశ్మరీరోగిని శరీరపూర్వభాగముకొంచము పైకెత్తియుండు నటుల గూర్చుండబెట్టి, రోగిమోకాళ్లు మోచేతులను కొంచెముపంచుకొని యుండు నటులంజేసి, వస్త్రముచే వారిరువురిని బల్లసహితంబుగ నిటునటు కదలనియ్యకబంధించి శీతోపచార సాంత్వవచనంబులచే రోగిభీతిజెందక ధైర్యముగనుండునటులజేసి, రోగి పొత్తికడుపు నలుప్రక్కలను తైలలేపనముజేసి, దానికెడమవైపునచేతిచేబిసికి, యా యశ్మరియధోభాగము జేరునటులజేయవలయును. పిదపవైద్యుడు ఎడమచేతియందలి తర్జనీమధ్యమములనునట్టి వ్రేళ్లలోని నఖంబులను దీసివైచి, తైలములోదడిపి, యా వ్రేళ్లను గుదములోనికి బ్రవేశింపజేసి, గుదము మేఢ్రము ఈరెంటిమధ్యప్రదేశములో సేవనీనాడికిప్రక్కనముడివలె పొడవుగనుండు నాయశ్మరిని బట్టుకొని, సేవనీనాడి కెడమ పార్శ్వమున యవప్రమాణమువదలి, అశ్మరి పగలకుండునటుల శస్త్రముచేఛేదించి, నిశ్శేషముగ సర్పఫణమను యంత్రముచే బయటికి అశ్మరిని తేవలయును. పైప్రకారము అశ్మరిని శస్త్రముచేఛేదించి వెలిపుచ్చునపుడు అశ్మరి నిశ్శేషముగరానియెడల మరల నది వృద్ధిజెందును. స్త్రీలకు మాత్రాశయము గర్భాశయమునకు సమీపమునందుండుట వలన గర్భాలకుసమీపంబున శస్త్రప్రయోగంబుజేసి యశ్మరిని వెలిపుచ్చవలయును అటులజేయక తద్విరుద్ధంబుగజేసిన స్త్రీలకును పురుషులకును ఛేదించిన స్థలంబున యెల్లపుడును మూత్రమును స్రవింపజేయునట్టి వ్రణము జనించుటయేగాక అశ్మరిగూడ నివర్తించదు.

## శస్త్రచికిత్సానంతర కర్తవ్యము.

విశల్యముష్ణపానీయద్రోణ్యాం తమవగాహయేత్. ౫౫
తథా న పూర్యతేఽస్రేణ వస్తిః పూర్ణే తు పీడయేత్,
మేఢ్రాంతః క్షీరివృక్షాంబు..................

పైనజెప్పిన ప్రకారము అశ్మరిని వెలిపుచ్చియారోగిని సుఖోష్ణోదకముచే పూరితంబైన ద్రోణియందు అనగా—తొట్టియందు, కూర్చుండజేయవలయును. ఇటుల జేసినమూత్రాశయము రక్తముచేపూరితంబుగాకుండును. పైప్రకారముజేసియు దైవ వశముచే నొకవేళ మూత్రాశయమునందు రక్తముజేరినయెడల మఱ్ఱి మేడి రావి జువ్వి కలుజువ్వి యీవృక్షములయొక్కపట్టల నుదకములోవైచి కషాయముగాచి దానిచే ఉత్తరవస్తిని ప్రయోగింపవలయును.

అశ్మరీరోగికి శాల్యోదనాదులు.

..................మూత్రసంశుద్ధయే తతః. ౫౬
కుర్యాద్గుడస్య సౌహిత్యం మధ్వాజ్యాక్తవ్రణః పిబేత్,
ద్వౌ కాలౌ సఘృతాం కోష్ణాం యవాగూం మూత్రశోధనైః
త్ర్యహం దశాహం పయసా గుడాఢ్యేనాల్పమోదనమ్,
భుంజీతోర్ధ్వం ఫలామ్లైశ్చ రసైర్జాంగలచారిణామ్. ౫౭

పై చెప్పినప్రకారముత్తరవస్తిని చేయించినపిదప ఆరోగికి మూత్రము శుద్ధం బగుటకై గుడసౌహిత్యమును జేయించి, ఆవ్రణమునకు తేనె నెయ్యి లేపనముజేసి మూత్రమును శుద్ధిపరచునట్టి ములుదోస, నక్కదోస, పెద్దగుమ్ముడు, పల్లేరు, మొదలగు వానితో పక్వముజేయబడిన గంజిలో నెయ్యినిచేర్చి, దానిని సుఖోష్ణముగ మూడు దినములు సాయంప్రాతఃకాలములయందు పానముజేయించవలయును. తదనంతరము పది దినములవరకు అధికముగబెల్లముజేర్చబడిన ఆవుపాలతోడ అన్నమునుకొంచముగ భుజిం పజేయవలయును. పిదప పుల్లనిరేగు, దానిమ్మ, మొదలగు అమ్లద్రవ్యములనుచేర్చి పక్వముచేయబడిన జాంగలమాంసరసముతోడ అన్నమును భుజింపజేయవలయును.

అశ్మరీవ్రణమున కభ్యంజనాదులు.

క్షీరివృక్షకషాయేణ వ్రణం ప్రక్షాల్య లేపయేత్,
ప్రపౌండరీకమంజిష్ఠా యష్ట్యాహ్వానయనౌషధైః ౫౮
వ్రణాభ్యంగం పచేత్తైలమేభిరేవ నిశాన్వితైః,

క్షీరివృక్షపుపట్టలకషాయముచే వ్రణమునుకడిగి, ప్రపౌండరీకము, మంజిష్ఠి, అతిమధురము ఎఱ్ఱలొద్దుగు, వీనిని సమభాగములుగ గ్రహించి పైవ్రణమునకు పూయ వలయును. మఱియు ప్రపౌండరీకము, మంజిష్ఠి అతిమధురము ఎఱ్ఱలొద్దుగు, పసుపు వీనిని సమభాగములుగ గ్రహించి నువ్వులనూనెలోజేర్చి తైలపాకవిధిగ దానిని పైవ్రణమునకు అభ్యంగము చేయించవలయును.

### అశ్మరీవ్రణమునందు దాహోత్తర వస్తికర్మలు.

దశాహం స్వేదయేచ్చైవం స్వమార్గం సప్తరాత్రతః. ౬౦
మూత్రే త్వగచ్ఛతి దహేదశ్మరీవ్రణమగ్నినా,
స్వమార్గప్రతిపత్తౌ తు స్వాదుప్రాయైరుపాచరేత్. ౬౧

అశ్మరీవ్రణమునకు 10 దినములు స్వేదకర్మను జేయించి, పిదప 7 దినములలో మూత్రము స్వమార్గముచే బయలువెడలకుండినచో నా యశ్మరి వ్రణమును నిప్పుచే కాల్చవలయును. మూత్రము నిజమార్గముచే జక్కగ వెడలుచుండిన; ఆ రోగికి మధుర రసముగల ద్రవ్యములతో పక్వము జేయబడిన వస్త్యౌషధములచే నుత్తరవస్తి మొదలగు వస్తికర్మలను చేయవలయును.

### అశ్మరీరోగమునందు వర్జ్యంబులు.

తం వస్తిభిః నచారోహేద్వర్షం రూఢవ్రణోఽపి సః,
నగనాగాశ్వవృక్షస్త్రీరథాన్నాప్సు ప్లవేత సః. ౬౨

అశ్మరీరోగికి వ్రణము జక్కగమానియుండినను వాడొకసంవత్సరమువరకు పర్వతము, వృక్షము, ఏనుగు, గుఱ్ఱము, బండి, వీనినెక్కగూడదు. స్త్రీసంభోగము జేయగూడదు. నీటిలో నీదులాడంజనదు.

### అశ్మరీరోగమున శస్త్రకర్మకనర్హ స్థానములు.

మూత్రశుక్రవహా వస్తివృషణౌ సేవనీం గుదమ్,
మూత్రప్రసేకం యోనిం చ శస్త్రేణాష్టౌ వివర్జయేత్. ౬౩

వైద్యుడు అశ్మరీరోగమును శస్త్రముచే ఛేదించునపుడు మూత్రవహస్రోతస్సు, శుక్రవహస్రోతస్సు, మూత్రాశయము, వృషణము, సేవనీనాడి, గుదము, మూత్రప్రసేకము, యోని, ఈ యెనిమిది స్థానముల వర్జింపవలయును. మూత్రవహస్రోతస్సును ఛేదించుటవలన మూత్రాశయము మూత్రముచే పూరితంబై, తత్క్షణమే మరణము కలుగును. శుక్రవహస్రోతస్సు, వస్తి, గుదము వీనిని ఛేదించుటవలన తత్క్షణమే రోగికి మృతికలుగును. వృషణమును ఛేదించుటవలన పుంస్త్వమునకు హానికలుగును. సేవనీ యోనులను ఛేదించుటవలన దారుణరోగంబులు జనించును. మూత్రప్రసేకమును ఛేదించుటవలన సదా మూత్రము స్రవింపుచుండును. కావున వైద్యవరుండు పైజెప్పిన యెనిమిది మర్మస్థానములయందు గాయముతగలనియ్యక యశ్మరీరోగమును ఛేదింపవలయును.

ఏకాదశాధ్యాయము ముగిసెను.

# ద్వాదశాధ్యాయము.

"నిదానలక్షణై రూర్ధ్వం వక్ష్యంతే౽తిప్రవృత్తిజాః." అనునిదానవచన ప్రకారము ప్రమేహరోగములుమూత్రాతిప్రవృత్తివలనజనించును. కావున మూత్రాఘాత చికిత్సితాధ్యాయ నిరూపణానంతరము ప్రమేహ చికిత్సితాధ్యాయముచెప్పబడుచున్నయది.

ప్రమేహ చికిత్సితాధ్యాయ ప్రారంభము.

సూ. అథాతః ప్రమేహచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

మూత్రాఘాత చికిత్సితాధ్యాయ నిరూపణానంతరము మేహరోగచికిత్సలను దెలియపరచునట్టి ప్రమేహచికిత్సితమను నీ యధ్యాయమును వివరించెదము.

ప్రమేహచికిత్సా క్రమము.

మేహినో బలినః కుర్యాదాదౌ వమనరేచనే,
స్నిగ్ధస్య సర్షపారిష్టనికుంభాక్షకరంజజైః
తైలైస్త్రికంటకాద్యేన యథాస్వం సాధితేన వా,
స్నేహేన ముస్తదేవాహ్వనాగరప్రతివాపవత్.
సురసాదికషాయేణ దద్యాదాస్థాపనం తతః,
న్యగ్రోధాదేస్తు పిత్తార్తం రసైశ్శుద్ధం చ తర్పయేత్.

బలవంతుడుగనుండు ప్రమేహరోగికి దొలుత ఆవాలు, వేము, నాగదంతి, తాడి, క్రానుగు, వీని తైలముతోగాని, లేక నికజెప్పబోయెడు త్రికంటకాదితైలముతో గాని, లేక దోషసాత్మ్యాద్యనుగుణముగ ద్రవ్యములనుచేర్చి పక్వముచేయబడిన తైలముతోగాని, స్నేహకర్మమును జేయించి; వమనవిరేచనములను చేయించవలయును. పైవమనాదులచే; బలముతగ్గియుండువానికి, శరీరపటుత్వముగలిగిన పిదప, సురసాదిగణద్రవ్యకషాయములో, తుంగముస్తలు, దేవదారుపట్టశొంఠి, వీనికల్కమునుకలిపి అనువాసనవస్తిని చేయించవలయును. పిత్తాధిక్యముగల ప్రమేహరోగికి న్యగ్రోధాదిగణ ద్రవ్యకషాయములో పైకల్కమును జేర్చి, అనువాసనవస్తిని చేయించవలయును. అనంతరము శుద్ధిజెందియుండు నాప్రమేహరోగికి జాంగలదేశజంతువుల మాంసరసములను తృప్తి కలుగువరకు పానము చేయించవలయును.

### ప్రమేహరోగమునందు శమనచికిత్స.

మూత్రగ్రహరుజాగుల్మక్షయాద్యాస్త్వపతర్పణాత్,
తతో౽నుబంధరక్షార్థం శమనాని ప్రయోజయేత్. ౪

ప్రమేహరోగికి అపతర్పణచికిత్సవలన మూత్రప్రతిబంధము, శూలలు, గుల్మము, క్షయము, మొదలగు రోగములు జనించును. కావున మరల ప్రమేహరోగము జనింప కుండుటకై శమనౌషధమును ప్రయోగించవలయును. అటులచేయకుండిన ప్రమేహరోగము శమనముజెందియుండినను యేదైన నొకస్వల్పనిదాన (కారణ) ము వలన మరల జనించును.

### వమనవిరేచనానర్హులకు శమనచికిత్స.

అసంశోధ్యస్య తాన్యేవ సర్వమేహేషు పాయయేత్,

వమనవిరేచన రూపంబులగు శోధనక్రియల కనర్హులుగనుండు రోగులకు ప్రమేహరోగము లన్నిటియందును శమన చికిత్సలనే చేయవలయును.

### ప్రమేహరోగమునకు శమనౌషధములు.

ధాత్రీరసప్లుతాం ప్రాహ్ణే హరిద్రాం మాక్షికాన్వితామ్. ౫
దార్వీసురాహ్వత్రిఫలాముస్తా వా క్వథితా జలే,
చిత్రకత్రిఫలాదార్వీకళింగాన్వా సమాక్షికాః. ౬
మధుయుక్తం గుడూచ్యా వా రసమామలకస్య వా,

పసుపునూరి ఉసిరికరసములోకలిపి, అందులో కొంచెము తేనెచేర్చి, ప్రమేహరోగికి ప్రాతఃకాలమున పానముజేయించవలయును. లేక మ్రానిపసుపు, దేవదారు పట్ట, త్రిఫలములు, తుంగముస్తలు, వీనిని సమభాగములుగ నుదకములోవైచి చక్కగ కషాయముకాచి పానము చేయించవలయును. లేక చిత్రమూలము, త్రిఫలములు, మ్రానిపసపు, కొడిసెవిత్తులు, వీనిని సమభాగములుగ ఉదకములోవైచి కషాయముకాచి కొంచెము తేనెకలిపి పానముచేయించవలయును. లేక తిప్పతీగెరసమునుగాని ఉసిరిక రసమునుగాని తేనెగూర్చి పానముచేయించవలయును.

### కఫజప్రమేహమునకు రోధ్రాదికషాయములు.

రోధ్రాభయాతోయదకట్ఫలానాం
పాతావిడంగార్జునధాన్యకానామ్;
గాయత్రిదార్వీక్రిమిహృద్వచానాం
కఫే త్రయః క్షౌద్రయుతాః కషాయాః. ౭

కఫమువలనజనించిన ప్రమేహరోగమునందు లొద్దుగ, కరక్కాయలు, తుంగముస్తలు, గుమ్ముడు, వీనికషాయము; చిరుబొద్ది, వాయువిడంగములు, మద్దిపట్ట, ధనియాలు, వీనికషాయము; చంద్రపట్ట, మ్రానిపసపు, వాయువిడంగములు, వస, వీని కషాయము; ఈమూడు కషాయములలో నొకదానియందు కొంచెము తేనెగలిపి పానము చేయించిన హితముకలుగును.

పిత్తజప్రమేహమునకు ఉశీరాదికషాయములు

ఉశీరరోధ్రార్జున చందనానాం పటోలనింబామలకామృతానామ్; రోధ్రాంబుకాలీయకధాతకీనాం పిత్తేత్రయః క్షౌద్రయుతాః కషాయాః. ౮

వట్టివేరు, లొద్దుగు, మద్ది, చందనము, వీనికషాయము; చేదుపొట్ల, వేము, ఉసిరిక, తిప్పతీగె, వీనికషాయము; లొద్దుగు, కురువేరు, మ్రానిపసపు, ఆగెపువ్వు, వీని కషాయము; ఈమూడు కషాయములలో నొకదానియందు తేనెకలిపి, పిత్తజప్రమేహరోగమున పానముచేయించిన హితముకలుగును.

ప్రమేహరోగమునం దన్నపానాదులు.

యథాస్వమేభిః పానాన్నం యవగోధూమభావనమ్,

పైకషాయములకు చెప్పియుండు ద్రవ్యములతోడ అన్నపానాదులను పక్వము చేసి, ప్రమేహరోగి కిప్పించవలయును. మఱియు, యవలను, గోధుమలను, పైకషాయములలో భావనచేసి ప్రమేహరోగి కిప్పించవలయును.

వాతజప్రమేహమునందు తైలము.

వాతోల్బణేషు స్నేహాంశ్చ ప్రమేహేషు ప్రకల్పయేత్. ౯

వాతాధిక్యముతోకూడియుండు ప్రమేహరోగములయందు పై కషాయములకు చెప్పియుండు ద్రవ్యములతో తైలమును పక్వముచేసి యిప్పించవలయును.

ప్రమేహరోగమునందు పథ్యకరభక్ష్యాదులు.

అపూపసక్తువాట్యాదిర్యవానాం వికృతిర్హితా,
గవాశ్వగుదముక్తానామథవా వేణుజన్మనామ్. ౧౦
తృణధాన్యాని ముద్గాద్యాశ్శాలిర్జీర్ణస్సషష్టికః,
శ్రీకుక్కుటోఽమ్లః ఖలకస్తిలపర్ణపకిట్టజః, ౧౧
కపిత్థం తిందుకం జంబూస్తత్కృతా రాగఖాండవాః,
తిక్తం శాకంమధుశ్రేష్ఠా భక్ష్యాశ్శుష్కాస్ససక్తవః. ౧౨

ధన్వమాంసాని శూల్యాని పరిశుష్కాణ్యయస్కృతిః,
మధ్వరిష్టాసవా జీర్ణాశ్శీధుః పక్వరసో ద్భవః. ౧౩
తథాఽసనాదిసారాంబు దర్భాంభో మాక్షికోదకమ్,

యవలు, లేక వెదురుబియ్యము, వీనిచే జేయబడిన అపూపములు అనగా— భక్ష్యములు, సక్తువులు అనగా—వరిపేలపిండి మొదలగు పొడిపిండిదినుసులు, వాట్యము ఇవి మొదలగునవియును: యవలను, అవులకును గుఱ్ఱములకును పెట్టి వాని పేడతోడ వెడలిన నా యవలను గ్రహించి వానిచే చేయబడిన అపూపాదులు, నివ్వరి, చామలు, మొదలగు తృణధాన్యములు, పెసలు మొదలుగునవియును; పాతసంబావుబియ్యము: 60, దినములకు ఫలించెడు సంబాబియ్యము, తెలికపిండి, ఆవపిండి, వీనిచే చేయబడినదియు; పుల్లగనుండునదియు; శ్రీకుక్కుటమను పేరుగలదియునైన ఖలకము, వెలగపండు, తుమికిపండు, నేరేడుపండు, వీనిచే జేయబడిన రాగఖాండవములు, తిక్తశాకములు, తేనె, త్రిఫలములు, పిండితో జేయబడిన భక్ష్యములు, శూలముతో పక్వము చేయబడినవిగ శుష్కించినవిగనుండు జాంగల దేశజంతుమాంసములు, ఇక చెప్పబోయెడు అయస్కృతి, పాతదిగనుండు మధు అరిష్టము ఆసవము అనుమద్యములు, పక్వమైనరసముతో జేయబడిన శీధువను మద్యము, ఆసనాదిగణములో చెప్పియుండు వేగిస మొదలగువాని బంకలను చేర్చి నానబెట్టినయుదకము, దర్భగెడ్డి నానినయుదకము, తేనె కలిపినయుదకము, ఇవి ప్రమేహరోగములయందు హితకరములుగనుండును.

ప్రమేహరోగమున యవసక్తూపయోగము.

వాసితేషు వరాక్వాథే శర్వరీం శోషితేష్వహః. ౧౪
యవేషు సుకృతాన్ సక్తూన్ సక్షౌద్రాన్ శీధునా పిబేత్,

త్రిఫలకషాయములో రాత్రులయందు నానబెట్టినదియు, పగటియందు యెండనెండింపబడినదియునగు యవలపిండిని, శీధువనుమద్యములో చేర్చి కలియబెట్టి అందులో తేనెకలిపి ప్రమేహరోగికి పానముచేయించిన హితముకలుగును.

సాలసప్తాహ్వకంపిల్లవృక్షకాక్షకపిత్థజమ్. ౧౫
రోహీతకం చ కుసుమం మధునాద్యాత్సుచూర్ణితమ్,
కఫపిత్తప్రమేహేషు పిబేద్ధాత్రీరసేన వా. ౧౬

కఫపిత్తప్రమేహములయందు ఏపి, ఏడాకులపొన్న, కంపిల్లము, వృక్షకము. తాడి, వెలగ, ములుమోదుగు, వీనిపుష్పములను చూర్ణము జేసి, తేనెలో కలిపి, భక్షింపజేయవలయును. లేక పైపుష్పములచూర్ణమును ఉసిరికపండురసములో కలిపి పానము చేయించవలయును.

### త్రికంటకాది తైలము.

త్రికంటకనిశారోధ్రసోమవల్కవచార్జునైః,
పద్మకాశ్మంతకారిష్టచందనాగరుదీప్యకైః. ౧౭
పటోలముస్తమంజిష్ఠాపామాద్రీభల్లాతకైః పచేత్,
తైలం వాతకఫే పిత్తే ఘృతం మిశ్రేషు మిశ్రకమ్. ౧౮

పల్లేరు, పసుపు, లొద్దుగు, తెల్లచంద్ర, వస, మద్దిపట్ట, పద్మకము, ఆరె, వేము, చందనము, అగరు, ఓమము, చేదుపొట్ల, తుంగముస్తలు, మంజిష్ఠి, అతివస, జీడివిత్తులు, వీనిని సమభాగములుగ గ్రహించి కల్కము చేసి, నువ్వులనూనెలో కలిపి, విధిప్రకారము కాచి, యాతైలమును, వాతకఫజనిత ప్రమేహమున నుపయోగించవలయును. పిత్తప్రమేహమునందు పైపల్లేరు మొదలగు ద్రవ్యముల కల్కముతో పక్వము చేయబడిన ఘృతమునిప్పించవలయును. మిశ్రదోషమువలన జనించిన ప్రమేహమునందు పైపల్లేరు మొదలగువాని కల్కమును నువ్వులనూనె ఆవునెయ్యి ఈరెంటియందును కలిపి పక్వము చేయబడినమిశ్రకతైలము నుపయోగించవలయును.

### ధాన్వంతర ఘృతము.

దశమూలం శఠీ దంతీ సురాహ్వాం ద్విపునర్నవమ్,
మూలం స్నుగర్కయోః పథ్యాం భూకదంబమరుష్కరమ్ ౧౯
కరంజవరుణాన్మూలం పిప్పల్యాః పౌష్కరం చ యత్,
పృథగ్దశపలం ప్రస్థాన్యవకోలకులుత్థతః ౨౦
త్రింశ్చాష్టగుణితే తోయే విపచేత్పాదవర్తినా,
తేన ద్విపిప్పలీచవ్యవచానిచుళరోహిషైః ౨౧
త్రివృద్విడంగకంపిల్లభార్గీబిల్వైశ్చ సాధయేత్,
ప్రస్థం ఘృతాజ్జయేత్సర్వాం స్తన్మేహాన్ పిటికావిషమ్. ౨౨
పాండువిద్రధిగుల్మార్శశ్శోఫశోషగరోదరమ్,
శ్వాసం కాసం వమిం వృద్ధిం ప్లీహానం వాతశోణితమ్. ౨౩
కుష్ఠోన్మాదావపస్మారం ధాన్వంతరమిదం ఘృతమ్,

దశమూలములు, గంధకచోరములు, దంతివేళ్లు, దేవదారు, ఎఱ్ఱగలిజేరు, తెల్లగలిజేరు, జముడువేళ్లు, జిల్లేడువేళ్లు, కరక్కాయలు, నేలకడిమి, జీడివిత్తులు, క్రానుగువేళ్లు, ఉలిమిరివేళ్లు, మోడి, పుష్కరమూలము, ఇవి దినుసుకు 10 పలములు; యవలు, రేగుపండ్లు, ఉలవలు, ఇవిదినుసుకు 3 ప్రస్థములు; ఇటుల వీనినెల్లనొకటిగ జేర్చి 8 దింతలు

దకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి, అందులో పిప్పళ్లు, ఏనుగుపిప్పళ్లు చవ్యము, వస, నీరుప్రబ్బలి, కామంచిగడ్డి, తెల్లతెగడ, వాయువిడంగములు, కంపిల్లము, గంటుభారంగి, వెలగగుజ్జు, వీనినిసమభాగములుగ గ్రహించినూరి కలిపి; 1 ప్రస్థమావు నెయ్యిబోసి ఘృతపాకవిధిగ పక్వముచేసి, దానినిచ్చిన, ప్రమేహరోగములన్నియు నివర్తించును. మఱియు నిది పిటికలు, జంగమవిషము, పాండువు, విద్రధి, గుల్మము, అర్శస్సు, వాపు, క్షయము, విషోపద్రవములు, ఉదరరోగము, శ్వాసము, కాసము, వాంతి, వృద్ధి, ప్లీహము, వాతరక్తము, కుష్ఠువు, ఉన్మాదము, అపస్మారము, వీనిని పోగొట్టును. ఇది ధాన్వంతరఘృత మనబడును.

## రోధ్రాసవము.

రోధ్రమూర్వాశఠీవేల్లభార్గీవతనఖీస్తవాన్. ౨౪
కళింగకుష్ఠక్రముకప్రియంగ్వతివిషాగ్నికాన్,
ద్వే విశాలే చతుర్జాతం భూనింబకటురోహిణీమ్. ౨౫
యవానీం పౌష్కరం పాఠాం గ్రంథిం చవ్యం ఫలత్రయమ్.
కర్షాంశమంబుకలశే పాదశేషే స్రుతే హిమే. ౨౬
ద్వౌ ప్రస్థౌ మాక్షికాత్క్షిప్త్వా రక్షేత్పక్షముపేక్షయా,
రోధ్రాసవోఽయం మేహార్శశ్శ్విత్రకుష్ఠారుచిక్రిమీన్. ౨౭
* పాండుత్వగ్గ్రహణీదోషం స్థూలతాం చ నియచ్ఛతి,

లొద్దుగు, చాగ, గంధకచోరములు, వాయువిడంగములు, గంటుభారంగి, గ్రంథితగరము, నఖము (అనగా—వ్యాఘ్రనఖమను గంధద్రవ్యము) కలుజువ్వి, కొడిసె పాల, చంగల్వకోష్ఠు పోకలు, ఎఱ్ఱలొద్దుగు, ప్రేంకణము, అతివస, చిత్రమూలము, పిన్నపాపర, పెద్దపాపర, చాతుర్జాతకములు, నేలవేము, కటుకరోహిణి, ఓమము, పుష్కరమూలము, అగరుశొంఠి, మోడి, చవ్యము, త్రిఫలములు, వీనిని దినుసుకొక కర్షప్రమాణముచొప్పున గ్రహించి, ద్రోణప్రమాణ ముదకములోవైచి, పాదావశేషముగ కషాయముకాచి, పడియగట్టి, చల్లారినపిదప; అందులో 2. ప్రస్థములు తేనెగలిపి 15, దినములవరకు కదలకుండునటులనుంచిన నదిరోధ్రాసవమనబడును. దీనిని సేవించినయెడ మేహము, అర్శస్సు, శ్విత్రకుష్ఠము, అరుచి, క్రిమిరోగము, పాండువు, చర్మరోగము, గ్రహణి, స్థౌల్యరోగము, వీనినిపోగొట్టును.

## అయస్కృతి.

సాధయేదసనాదీనాం పలానాం వింశతిం పృథక్. ౨౮

---

* పాండుత్వం గ్రహణీదోషం. (అనిపా)

ద్వివహేఽపాం క్షిపేత్తత్ర పాదస్థే ద్వే శతే గుడాత్,
క్షౌద్రార్ధకార్ధం పలికం వత్సకాది చ కల్కితమ్. ౨౯
తత్క్షౌద్రపిప్పలీచూర్ణప్రదిగ్ధే ఘృతభాజనే,
స్థితం దృఢే జతుస్మృతే యవరాశౌ నిధాపయేత్. ౩౦
ఖదిరాంగారతప్తాని బహుశోఽత్ర నిమజ్జయేత్,
తనూని తీక్ష్ణలోహస్య పత్రాణ్యాలోహసంక్షయాత్. ౩౧
అయస్కృతిస్స్థితా పీతా పూర్వస్మాదధికా గుణైః,

అసనాదిగణములో చెప్పియుండు ద్రవ్యములను దినుసుకు ఇరువదేసి పలముల చొప్పున గ్రహించి; 8 ద్రోణములజలములోవైచి, పాదావశేషముగ కషాయముకాచి అందులో పాతబెల్లము రెండువందల పలములు, తేనె అర్ధాఢకము వత్సకాదిగణద్రవ్యములను దినుసుకొకపలముచొప్పున గ్రహించి చేయబడినకల్కము, వీనిని కలుపవలయును. తేనెలో పిప్పలిచూర్ణము కలిపి నేతితో మాగినకుండలోపలబూసి, పిదప ఆ కుండకు మరల లక్కనుబూసి, ఆకుండలో పైకషాయమునుబోసి, యవధాన్యములరాశిలో నొక మాసముపరకుంచవలయును. పిదప 16 పలములు ఉక్కును ఆకువలె సన్నని రేకులు జేసి చండ్రనిప్పులోకాల్చి ఆ కషాయములోముంచవలయును. ఇటుల ఉక్కురేకులు నిశ్శేషముగ కఱగువరకు పలుమారుకాల్చి పై కషాయములో ముంచవలయును. ఇది అయస్కృతియనబడును. ఇయ్యది రోధ్రాసవమునకంటె మిక్కిలి శ్రేష్ఠమైనది.

### ప్రమేహరోగమునం దుద్వర్తనాదులు.

రూక్షముద్వర్తనం గాఢం వ్యాయామో నిశి జాగరః. ౩౨
యచ్చాన్యచ్ఛ్లేష్మమేదోఘ్నం బహిరంతశ్చ తద్ధితమ్,

జిడ్డులేక రూక్షమైన నలుగుచు బెట్టికొనుట, శరీరాయాసకరమగుపనులను చేయుట, రాత్రులయందు నిద్రించక జాగరణముచేయుట, శ్లేష్మము మేదస్సు వీనిని పోగొట్టునట్టి ఆహారవిహారములనుజేయుట, ఇవి యన్నియు ప్రమేహరోగమునందు హితకరంబులుగ నుండును.

### అసనఖదిరాది రసాయనము.

సుభావితాం సారజలైస్తులాం పీత్వా శిలోద్భవాత్. ౩౩
సారాంబునైవ భుంజానః శాలిజాంగలజై రసైః,
సర్వానభిభవేన్మేహాన్ సుబహూనాపద్రవానపి. ౩౪
గండమాలార్బుదగ్రంథి స్థౌల్యకుష్ఠభగందరాన్,

క్రిమిశ్లీపదశోథాంశ్చ పరం చైత్రద్రసాయనమ్. 3౫

ఆసనాదిగణములో చెప్పియుండు వేగిస, చంద్ర మొదలవాని బంకలతో కాచిన కషాయములో నూరుపలములు శిలాజిత్తును వైచి, నానబెట్టి, యా కషాయమును పానము చేయుచు; దానితో పక్వము చేయబడిన జాంగలమాంసరసము, సంబాబియ్యపు అన్నము, వీనిని భుజింపుచుండిన అనేకములగునుపద్రవములతో గూడియుండు ప్రమేహ రోగములు, గండమాల, అర్బుదము, గ్రంధులు, స్థౌల్యము, కుష్ఠువు, భగందరము, క్రిమిరోగము, శ్లీపదము, శోఫ, ఇవియన్నియు నివర్తించును. ఇది ఉత్కృష్టమైన రసాయనము.

బీదవానికి ప్రమేహముగల్గినపుడు చేయదగినవిధానము.

అధనశ్ఛత్రపాదత్ర రహితో మునివర్తనః,
యోజనానాం శతం యాయా త్ఖనేద్వా సలిలాశయాన్. 3౬
గోశకృన్మూత్రవర్తిర్వా గోభిరేవ సహ భ్రమేత్,

నిర్ధనుడై చికిత్స జేసికొనదగిన యుపపత్తిలేని ప్రమేహరోగి ఋషివలె కంద మూలములనుభుజింపుచు, పాదరక్షలు ఛత్రము ఇవిలేక 100 యోజనములదూరము నడువవలయును. లేక పెద్దతటాకమును త్రవ్వవలయును. లేక ఆవుపంచితము ఆవు పేడ, వీనినిభక్షింపుచు ఆవులతోడనే సంచారము చేయుచుండవలయును. ఇటుల జేసిన ప్రమేహరోగము నివర్తించును.

కృశించిన ప్రమేహరోగికి యౌషధము.

బృంహయేదౌషధాహారైరమేదోమూత్రలైః కృశమ్. 3౭

కృశించియుండు ప్రమేహరోగికి మేదస్సు, మూత్రము, వీనిని వృద్ధినొందించని యౌషధాహారముల చే పుష్టిని కలుగజేయవలయును.

ప్రమేహ పిటికాచికిత్స.

శరావికాద్యాః పిటికాశ్శోఫవత్సముపాచరేత్,
అపక్వావ్రణవత్పక్వాః

శరావిక కచ్ఛపిక మొదలైన ప్రమేహపిటికలు పక్వముజెందకుండినయెడల శోఫ రోగమునకు చెప్పియుండుచికిత్సలను చేయవలయును. పక్వములుగాని ప్రమేహపిటి కలకు వ్రణములకుజేయు చికిత్సలజేయవలెను.

ప్రమేహపిటికలయందు క్షీరివృక్షోదకాదిపానము.

తాసాం ప్రాగ్రూప ఏవ చ. 3౮

క్షీరివృక్షాంబుపానాయ బస్తమూత్రం చ శస్యతే,
తీక్ష్ణం చ శోధనం ప్రాయో దుర్విరేచ్యాహి మేహినః. ౩౯

ప్రమేహపిటికలయొక్క పూర్వరూపమునందు ఆ రోగికి క్షీరవృక్షముల పట్టలకషాయము, గొఱ్ఱెమూత్రము, వీనివి పానము చేయించవలయును. ప్రమేహ రోగులకు విరేచనమగుటను కడుకష్టంబగుటవలన, వారికి తీక్ష్ణమైన, విరేచనౌషధము తఱుచుగ నిప్పించవలయును.

### ప్రమేహపిటికలయందు దేహాది తైలోపయోగము.

తైలమేలాదినా కుర్యాద్గణేన వ్రణరోపణమ్,
ఉద్వర్తనే కషాయం తు వర్గేణారగ్వధాదినా. ౪౦
పరిషేకోఽసనాద్యేన పానాన్నే వత్సకాదినా,

ప్రమేహరోగికి వ్రణశమనార్థంబై ఏలాదిగణద్రవ్యములతో పక్వముచేయబడిన తైలమును వ్రణమునకు పూయవలయును. ఆరగ్వధాది గణద్రవ్యములతో కాచబడిన కషాయముచే నలుగు పెట్టించుకొనవలయును. అసనాది గణద్రవ్యములతో కాచబడిన ఉదకముచే స్నానము చేయించవలయును. వత్సకాది గణద్రవ్యములతో కాచబడిన కషాయముచే చేయబడిన యన్నపానాదుల నిప్పించవలయును.

### ప్రమేహరోగమునందు పాఠాదిచూర్ణము.

పాఠా చిత్రకశార్ఙ్గేష్టా సారిబా కంటకారికా. ౪౧
సప్తాహ్వం కౌటజం మూలం సోమవల్కం నృపద్రుమమ్,
సంచూర్ణ్య మధునా లిహ్యా త్తద్వచ్చూర్ణం సమాయసమ్. ౪౨

చిరుబొద్ది, చిత్రమూలము, తీగెక్రానుగు, సుగంధిపాల, ప్రాకుడు, ఏడాకుల పొన్న, కొడిసెపళ్లు, రేల్లచంద్రపట్ట, రేలపట్ట, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి, తేనెలోకలిపి, నాకించవలయును. లేక అయశ్చూర్ణమును తేనెలోకలిపి నాకించవలయును.

### మధుమేహచికిత్స.

మధుమేహిత్వమాపన్నో భిషగ్భిః పరివర్జితః.
శిలాజతుతులామద్యాత్ప్రమేహార్తః పునర్నవః. ౪౩

మధుమేహరోగ మసాధ్యంబగుటవలన నారోగికి వైద్యులు చికిత్సజేయం జనదు. అయినను మధుమేహరోగిని నూరు పలములు శిలాజతువును క్రమముగ భుజించునటుల జేసిన రోగము శమించును. శరీరమునకు బలవర్ణములుకలుగును, "అశ్వత్థ చందనాగరుపాఠాక్వథః కాలాభమేహే తు. ఇక్షురసాభే పాఠా క్రిమిహంతృసం

బంధనః క్వాథః! సాంద్రాకారే మేహే హితాధకీ కర్ణికారో వా, క్వాథస్తథార్జునస్య పాతవ్యో వారుణీమేహే। పిష్టేన సితారజనీ పాతవ్యా శిశిరతోయేన, నింబశ్చ శుక్రమేహే తప్తజలేనాథవా సురయా, సికతామేహే చిత్రక బాహ్లీకకుష్ఠానిః క్వాథః, శీతళమేహే క్వాథః పిచుమందకృతశ్చ పాతవ్యః, పాషాణభిత్తు సురయా క్వథితశ్శస్తశ్శనైర్మేహే, గోక్షురకస్య కషాయో లాలామేహే ఫలత్రికేన సహ, సల్లక్యుశీరసైంధవవచా హితాః క్షారమేహినః పిష్టాః, క్వథితాశ్చ నీలమేహే రోధ్రసమంగాకదంబాస్స్యుః, క్వాథో విభీతకస్య తు కల్కో వా కాలమేహినాంశస్తః, ధాతకిపద్మకవికసాక్వాథః కల్కోఽపి వా నిశామేహే, మాంజిష్ఠేస్యుస్త్రిఫలా జలదం జలపద్మకం చరోధ్రమ్, లోహితమేహే యుంజ్యాత్త్రిఫలాక్వాథేన సంయుతం గిరిజమ్, బాలకం త్రివృతా ధాత్రీ ముస్తం చ సరసాంజనం, కటుకాతివిషారోధ్రం ఖాదిరేణాంభసా పిబేత్, ప్రాయశ్శోధనమేతద్ధి ప్రధానం సముదాహృతమ్.'' ఉదకమేహమునందు రావిపట్ట, చందనపుచెక్క, అగరుచెక్క, చిరుబొద్ది, వీనికషాయము; ఇక్షుమేహమునందు చిరుబొద్ది, వాయువిడంగములు, వీనికషాయము; సాంద్రమేహమునందు ఓట్టివేళ్ళకషాయము, లేక రేలకషాయము; సురామేహమునందు మద్దిపట్ట కషాయము; పిష్టమేహమునందు పసుపు తేనె చేర్చబడిన శీతోదకము; శుక్రమేహమునందు చక్కగ కాచబడిన యుదకములోగాని, సురయను మద్యములోగాని కలుపబడిన వేపపట్టచూర్ణము; సికతామేహమునందు చిత్రమూలము, హింగుపత్రి చెంగల్వకోష్టు, వీనికషాయము; శీతలమేహమునందు వేపాకుకషాయము; శనైర్మేహమునందు కొండపిండివేళ్లతో కాచబడిన సురయను మద్యము; లాలమేహమునందు త్రిఫలములు, పల్లేరు, వీనికషాయము; క్షారమేహమునందు అందుగు, వట్టివేరు, సైంధవలవణము, వస, వీనినినూరి చేయపడిన స్వరసము; నీలమేహమునందు లొద్దుగు, మంజిష్ఠి మద్దిపట్ట, వీనికషాయము; కాలమేహమునందు తాడికాయకషాయము, లేక తాడికాయ కల్కము; నిశా హారిద మేహమునందు ఆరెపువ్వు, పద్మకము, మంజిష్ఠి, వీనికషాయము లేక వీని కల్కము; మంజిష్ఠమేహమునందు త్రిఫలములు, తుంగముస్తలు, వట్టివేరు, పద్మకము, లొద్దుగు, వీనికషాయము; రక్తమేహమునందు శిలాజిత్తును, కలిపిన త్రిఫలా కషాయము హితకరంబులుగనుండును. మఱియు కురువేరు, తెల్లతెగడ, ఉసిరిక, తుంగముస్తలు, రసాంజనము, కటుకరోహిణి, అతివస, లొద్దుగు, అనువానిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి చంద్రకషాయములోకలిపి దానిని పానముచేయించవలయును. ఇది శోధనౌషధములలో ప్రధానముగనుండును. అని ఖరనాదతంత్రమునందు ప్రమేహరోగమునకు విశేషచికిత్సలు వేరువేరు చెప్పబడినవి.

ద్వాదశాధ్యాయము ముగిసెను.



# త్రయోదశాధ్యాయము.

" ప్రమేహస్యోపద్రవోవిద్రధిః " అను చరకవచన ప్రకారము విద్రధిరోగము ప్రమేహరోగోపద్రవములలో చేరినది. కావున ప్రమేహచికిత్సితాధ్యాయ నిరూపణానంతరము విద్రధివృద్ధిచికిత్సితాధ్యాయము చెప్పబడుచున్నయది

## విద్రధివృద్ధి చికిత్సితాధ్యాయ ప్రారంభము.

సూ. అథాతో విద్రధివృద్ధిచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహు రాత్రేయాదయో మహర్షయః.

ప్రమేహ చికిత్సితాధ్యాయ నిరూపణానంతరము విద్రధి వృద్ధిరోగముల యొక్క చికిత్సలను దెలియపరచునట్టి విద్రధివృద్ధి చికిత్సితమను నీయధ్యాయమును వివరించెదము. విద్రధిరోగమనగా—ప్రమేహపిటికలు.

## విద్రధిరోగ చికిత్సాక్రమము.

విద్రధిం సర్వమేవామం శోఫవత్సముపాచరేత్.
ప్రతతం చ హరేద్రక్తం పక్వే తు వ్రణవత్క్రియా. ౧

అపక్వముగనుండు విద్రధి రోగములన్నిటికి శోఫరోగమునకు జెప్పియుండు నటుల చికిత్సలను జేసి పిదప రక్తమోక్షణము చేయవలయును. విద్రధి పక్వముగనుండిన దానికి వ్రణమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

## వాతవిద్రధి చికిత్స.

పంచమూలజలైర్ధౌతం వాతికం లవణోత్తరైః,
భద్రాదివర్గయష్ట్యాహ్వాతిలై రాలేపయేద్వ్రణమ్. ౨

వాతమువలన జనించిన విద్రధి వ్రణముచు పంచమూల కషాయముతో కడిగిసూత్రస్థానమునందు శోధనాది గణసంగ్రహాధ్యాయమున "భద్రదారునతే" త్యాది శ్లోకములలో చెప్పియుండు వాతహరద్రవ్యములు, అతిమధురము, నువ్వులు, వీనినిసమ భాగములుగగ్రహించినూరి అందులో సైంధవలవణముకలిపి పైవ్రణమునకులేపనము చేయవలయును.

## వాతజవిద్రధికి విదార్యాదితైలము.

వైరేచనికయుక్తేన త్రైవృతేన విశోధ్య చ,

విదారీవర్గసిద్ధేన త్రైవృతేనైవ రోపయేత్. 3

సూత్రస్థానమునందు శోధనాదిగణ సంగ్రహాధ్యాయములో నికుంభకుంభేత్యాది వర్గములో చెప్పియుండు త్రైవృతఘృతముచే శోధించి, పిదప విదారివర్గములోచెప్పి యుండు ద్రవ్యములతో పక్వముచేయబడిన త్రైవృతతైలమును లేపనముచేసి, వాతవిద్రధివ్రణమును శమింపజేయవలయును.

## పిత్తవిద్రధి చికిత్స.

క్షాళితం క్షీరితోయేన లింపేద్యష్ట్యమృతాతిలైః,
పైత్తం ఘృతేన సిద్ధేన మంజిష్ఠోశీరపద్మకైః. ౪
పయస్యాద్వినిశాశ్రేష్ఠాయష్టీదుగ్ధైశ్చ రోపయేత్,
న్యగ్రోధాదిప్రవాళత్వక్ఫలై ర్వాకఫజం పునః. ౫

పిత్తమువలనజనించిన విద్రధివ్రణమును క్షీరివృక్షములయొక్క పట్టలకషాయముచేకడిగి అతిమధురము, తిప్పతీగె, నువ్వులు, వీనిని సమభాగములుగ గ్రహించి చక్కగనూరి లేపనము చేయవలయును. పిదప మంజిష్ఠి, వట్టివేరు, పద్మకము, పిన్నమనుబాల, పసుపు, మ్రానిపసుపు, త్రిఫలములు, అతిమధురము, వీనిని సమభాగములుగ గ్రహించినూరి ఆవునేతిలోకలిపి, అందులో ఆవునేతికిసమముగ ఆవుపాలు, ఉదకము చేర్చి, ఘృతపాక విధిగపక్వముచేసి, యాఘృతముచేతగాని; మఱ్ఱిమొదలగు క్షీరివృక్షముల చిగుళ్ళు, పట్టలు, పండ్లు, వీనితోపక్వము చేయబడిన ఘృతముచేతగాని, లేపనము జేసిన వ్రణముశమించును.

## కఫజవిద్రధి చికిత్స.

ఆరగ్వధాంబునా ధౌతం సక్తుకుంభనిశాతిలైః,
లింపేత్కుష్ఠిగాదంతీత్రివృచ్ఛ్యామాగ్నితిల్వకైః. ౬
ససైంధవైస్సగోమూత్రైః తైలం కుర్వీత రోపణమ్,

కఫమువలనజనించిన విద్రధివ్రణమును, రేలకషాయముతోగడిగి సక్తువు, తెల్లతెగడ, పసుపు, నువ్వులు, వీనిని సమభాగములుగగ్రహించినూరి పై వ్రణమునకు లేపనముజేసి, పిదప అడవినువ్వులవలు, దంతి, తెల్లతెగడ, నల్లసుగంధిపాల, లేక నల్లతెగడ, చిత్రమూలము, తిల్వకము, లేక యెఱ్ఱలొద్దుగు, సైంధవలవణము, గోమూత్రము వీనితోపక్వముజేయబడిన తైలమును లేపనముజేసిన పైవ్రణము శమించును.

## రక్తజ, ఆగంతుజ విద్రధి చికిత్స.

రక్తాగంతూద్భవే కార్యా పిత్తవిద్రధివత్క్రియా. ౭

రక్తదోషమువలన జనించిన విద్రధి ఆగంతుజ(అనగా—క్షతాద్యాగంతురూపముతైన కారణములచేగల్గిన) విద్రధి, వీనియందు పిత్తవిద్రధికి చెప్పియుండు చికిత్సలనే చేయవలయును.

## అంతర్విద్రధి చికిత్స.

వరుణాదిగణక్వాథమపక్వేఽభ్యంతరోత్థితే,
ఊషకాదిప్రతీవాపం పూర్వాహ్ణే విద్రధౌ పిబేత్.

అంతర్విద్రధి పక్వముకాకుండినయెడ వరుణాదిగణ ద్రవ్యములను సమభాగములుగచేర్చి కాచిన కషాయములో ఊషకాదిగణ ద్రవ్యములను సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి కలిపి పూర్వాహ్ణకాలమునందు పానము చేయించవలయును.

## అంతర్విద్రధియందు నిరూహాదివస్తి.

ఘృతం విరేచనద్రవ్యైస్సిద్ధం తాభ్యాం చ పాయయేత్,
నిరూహం స్నేహవస్తిం చ తాభ్యామేవ ప్రకల్పయేత్.

అంతర్విద్రధియందు ఆయా దోషబలానుగుణముగ విరేచనకరద్రవ్యములతో పక్వముచేయబడిన ఘృతమును సూత్రస్థానమునందు శోధనాదిగణ సంగ్రహాధ్యాయములో చెప్పియుండు వరుణాదిగణ, ఊషకాదిగణ ద్రవ్యములతో పక్వము చేయబడిన ఘృతమును పానము చేయించుటయేగాక పై ఊషకవరుణాదిగణ ద్రవ్యములతో కాచబడిన కషాయాదులచే నిరూహాను వాసనవస్తువును చేయించవలయును.

## అపక్వాంతర్విద్రధియందు మధుశిగ్రుప్రయోగము.

పానభోజనలేపేషు మధుశిగ్రుః ప్రయోజితః,
దత్తావాపో యథాదోషమపక్వం హంతి విద్రధిమ్. ౧౦

పానము, భోజనము, లేపనము, వీనియందు ఎఱ్ఱమునుగనుపయోగించినను, ఎఱ్ఱమునుగ కషాయములో వాతాదిదోషహరములుగనుండు ద్రవ్యములననూరి కలిపి పానము చేయించినను, అపక్వముగనుండు అంతర్విద్రధిహరించును.

## త్రాయంత్యాది కషాయము.

త్రాయంతీత్రిఫలానింబకటుకామధుకం సమమ్,
త్రివృత్పటోలమూలాభ్యాం చత్వారోఽంశాః పృథక్పృథక్.
మసూరాన్నిస్తుషాదష్టౌ తత్క్వాథస్సఘృతో జయేత్,
విద్రధిం గుల్మవీసర్పదాహమోహమదజ్వరాన్. ౧౨
తృణ్మూర్ఛాఛర్దిహృద్రోగపిత్తాసృక్కుష్ఠకామలాః,

కలుక్రానుగు, త్రిఫలములు, వేము, కటుకరోహిణీ, అతిమధురము, ఇవి సమ భాగములు; తెల్లతెగడ, చేదుపొట్లవేళ్లు, ఇవి ప్రత్యేకము 4 భాగములు, పొట్టుతీసిన చిరుసెనగలు 8 భాగములు, వీనినన్నిటిని చేర్చి చక్కగ కాచబడిన కషాయములో ఆవునెయ్యికలిపి పానముచేయించిన విద్రధి, గుల్మము, విసర్పము, సర్వాంగతాపము, మోహము, మదము, జ్వరము, దప్పి, మూర్ఛ, వాంతి, హృద్రోగము, రక్తపిత్తము, కుష్ఠువు, కామిల, ఇవి హరించును.

## త్రాయమాణాఘృతము.

కుడవం త్రాయమాణాయాః సాధ్యమష్టగుణేఽంభసి ౧౩
కుడవం తద్రసాద్ధాత్రీ స్వరసాత్క్షీరతో ఘృతాత్,
కర్షాంశం కల్కితం తిక్తా త్రాయంతీ ధన్వయాసకమ్. ౧౪
ముస్తాతామలకీవీరా జీవంతీచందనోత్పలమ్,
పచేదేకత్ర సంయోజ్య తద్ఘృతం పూర్వవద్గుణైః. ౧౫

8 కుడవములయుదకములో 1 కుడవము కలుక్రానుగువైచి చక్కగకాచి ఆకషాయము 1 కుడవము ఉసిరికెపండురసము, ఆవుపాలు, ఆవునెయ్యి ఇవి ప్రత్యేకము ఒక్కొకకుడవము, ఇటుల వీని నొకటిగజేర్చి; అందులో చేదుపొట్లు, కలుక్రానుగు, రేగటి దూలగోవిల, తుంగముస్తలు, నేలయుసిరిక, కాకోళి, మనుబాల, చందనము, నల్లకలువ, వీనిని దినుసుకొక కర్షముచొప్పున గ్రహించినూరి కలిపి; ఘృతపాకవిధిగపక్వము చేసి, ఆ ఘృతమును పానముచేయించిన విద్రధి, గుల్మము, మొదలగురోగములు హరించును.

## ద్రాక్షాది ఘృతము.

ద్రాక్షామధూకం ఖర్జూరం విదారీ చ శతావరీ,
పరూషకాణి త్రిఫలా తత్క్వాథే పాచయేద్ఘృతమ్. ౧౬
శ్రీ రేక్షుధాత్రీనిర్యాసే ప్రాణదాకల్కసంయుతమ్,
తచ్ఛీతం శర్కరాక్షౌద్రపాదికం పూర్వవద్గుణైః. ౧౭

ద్రాక్షపండు, అతిమధురము ఖర్జూరము, నేలగుమ్ముడుగడ్డ, పిల్లిపీచర, పేరీతపండు, త్రిఫలములు, వీనినిసమభాగములుగగ్రహించి యుదకములోవైచి పాదావశేషముగ కషాయము కాచి; అందులో ఆవుపాలు, ఆవునెయ్యి, చెఱుకురసము, ఉసిరికరసము, కరక్కాయలకల్కము వీనిని సమభాగములుగ చేర్చి విధిప్రకారము పాకము జేసిదించుకొని, చల్లారినపిదప, పంచదార తేనె వీనిని పాతికెభాగముకలిపి, ఆఘృతమును పానముచేయించినచో విద్రధి, గుల్మము మొదలగురోగములు హరించును.

### విద్రధియందు రక్తమోక్షణము.

హారేచ్ఛృంగాదిభిరసృక్సిరయా వా యథాంతికమ్,

కొమ్ము మొదలగువానిచేగాని, సిరావేధనముచేగాని, విద్రధికి సమీపముననుండు రక్తమును పైటికితీయవలయును.

### కోష్ఠగతవిద్రధి చికిత్స.

విద్రధిం పచ్యమానం చ కోష్ఠస్థం బహిరున్నతమ్. ౧౮

జ్ఞాత్వోపనాహయేత్

కోష్ఠగతమైన విద్రధి వెలుపల నెత్తుగనుండిన పాకము జెందుచున్నదని తెలిసికొని దానికి ఉపనాహస్వేదము చేయించవలయును.

### పక్వవిద్రధి లక్షణము.

శూలే స్థిరే తత్రైవ పిండితే,

తత్పార్శ్వపీడనాత్సుప్తౌ దాహాదిష్వల్పకేషు చ. ౧౯

పక్వస్స్యాద్విద్రధిం భిత్త్వా వ్రణవత్తముపాచరేత్.

అంతర్భాగస్య చాప్యేతచ్చిహ్నం పక్వస్య విద్రధేః. ౨౦

విద్రధివ్రణము పిండాకారముగనుండి స్వల్పశూల, మంట, యివి కలదిగనుండి, దానికిప్రక్కన బిసికిన నొప్పిలేక యుండిన, అపుడది పక్వంబైనదని తెలిసికొని శస్త్రముచే ఛేదించి వ్రణమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును. మఱియు పక్వంబైన అంతర్గత విద్రధికిని పైచెప్పిన లక్షణములే గలిగియుండును.

### పక్వవిద్రధి చికిత్స.

పక్వస్స్రోతాంసి సంపూర్య స యాత్యూర్ధ్వమధోఽథవా

స్వయం ప్రవృత్తం తం దోషముపేక్షేత హితాశినః. ౨౧

దశాహం ద్వాదశాహం వా రక్షన్ భిషగుపద్రవాన్,

అసమ్యగ్వహతి క్లేదే వరణాదిం సుఖాంభసా. ౨౨

పాయయేన్మధుశిగ్రుం వా యవాగూం తేన వా కృతామ్,

విద్రధి పక్వమైన స్రోతోమార్గములనుచెరచి ఊర్ధ్వమార్గముగగాని, అధోమార్గముగగాని, దోషము బైలువెడలును. స్వయముగ విద్రధిదోషములు వెడలుచుండిన దానివి చికిత్సజేయక యా రోగికి హితాహారములమాత్ర మిప్పించుచు 10 లేక 12, దినములవరకు ఉపద్రవము కలుగనీయక రక్షింపుచుండవలయును. మఱియు విద్రధినుండి క్లేదము (చీమ మొదలగు ద్రవము) చక్కగ బైలువెడలకుండినవరుణాదిగణద్రవ్య

ములఁజేర్చి కాచఁబడినయుదకమును సుఖోష్ణముగ పానము చేయించవలయును. లేక యెఱ్ఱమునగను చేర్చి కాచినయుదకమునుగాని, లేక యెఱ్ఱమునగతో పక్వముచే యఁబడిన గంజినిగాని, పానము చేయించవలయును.

### విద్రధిరోగమునం దాహారము.

యవకోలకుళుత్థోత్థ యూషైరన్నం చ శస్యతే. ౨౩

విద్రధియందు యవలు, రేగు, ఉలవలు, వీని కట్టులతో అన్నము నిప్పించ వలయును.

### విద్రధిరోగమునందు విరేచనము.

ఊర్ధ్వం దశాహాత్త్రాయంతీ సర్పిషా తైల్వకేన వా,
శోధయేద్బలతశ్శుద్ధస్సక్షౌద్రం తిక్తకం పిబేత్. ౨౪
సర్వశో గుల్మవచ్చైనం యథాదోషముపాచరేత్,

10 దినములకుపిదప త్రాయమాణాఘృతముచేతగాని, తైల్వకఘృతముచేతగాని, శరీరబలానుగుణముగ విద్రధిరోగికి, విరేచనము చేయించి; పిదప తిక్తకఘృతమును తేనె లోకలిపి పానము చేయించవలయును, మఱియు విద్రధిరోగమునందు ఆయాదోష బలానుగుణముగ, గుల్మరోగమునకు చెప్పియుండు చికిత్సలనన్నిటిని చేయవలయును.

### విద్రధియందు గుగ్గుల్వాదిప్రయోగము.

సర్వావస్థాసు సర్వాసు గుగ్గులుం విద్రధీషు చ. ౨౫
కాషాయైర్యౌగికైర్యుంజ్యాత్తైస్తైస్తద్వచ్ఛిలాజతు,

అన్ని విద్రధులయందును యౌగికకషాయములో గుగ్గిలమును, లేక శిలాజతును చేర్చి యిప్పించవలయును.

### విద్రధిపాక నిషేధము.

పాకం చ వారయేద్యత్నాత్సిద్ధిః పక్వే హి దైవికీ. ౨౬
అపి చాఽఽశు విదాహిత్వా ద్విద్రధిస్సోఽభిధీయతే,
సతి చాలోచయేన్మేహే ప్రమేహాణాం చికిత్సితమ్. ౨౭

విద్రధిరోగము కడుత్వరలో విదాహమును కలుగఁజేయును. కావున దీనికి విద్రధియను పేరుకలిగినది. మఱియునిది పాకమును జెందినచో దైవవశముచే నివర్తించ వలయునే కాని మనుష్యప్రయత్నముచే నివర్తింపనేరదు. కావున నిది పాకమును జెంద కుండునటుల మిక్కిలి ప్రయత్నము చేయవలయును. విద్రధిరోగమున మేహరోగము జనించినచో మేహరోగ చికిత్సలను చేయవలయును.

### స్తనజవిద్రధి చికిత్స.

స్తనజే వ్రణవత్సర్వం న త్వేవముపనాహయేత్,
పాటయేత్పాలయన్ స్తన్యవాహినీః కృష్ణచూచుకౌ. ౨౮
సర్వాస్వామాద్యవస్థాసు నిర్దుహీత చ తత్ స్తనమ్,

స్తనములో జనించియుండు విద్రధిరోగమునందు ఉపనాహస్వేదకర్మలు తప్ప తదితరములైన వ్రణచికిత్సలనన్నిటిని చేయవలయును. స్తన్యవాహిసిరలు, చనుమొనలు, వీటియందు గాయము తగలనీయక విద్రధిని ఛేదింపవలయును. ఆమపచ్యమాన పాకావస్థలయందు విద్రధితోగూడియుండు స్తనములలోనుండు పాలను పితికి బైట దీయవలెను.

### వృద్ధిచికిత్స.

శోధయేత్త్రివృతా స్నిగ్ధం వృద్ధౌ స్నేహైశ్చలాత్మకే. ౨౯
కోశామ్రతిల్వకైరండసుకుమారకమిశ్రకైః,

వాతజవృద్ధిరోగమునందు త్రివృత్తైలముచే నా రోగికి స్నేహకర్మను చేయించి అడవిమామిడి, తిల్వకము, ఆముదము, వీనితో పక్వముచేయబడిన స్నేహము, ఇక చెప్పబోయెడు సుకుమారకస్నేహము, గుల్మరోగ చికిత్సితాధ్యాయమునందు చెప్పబడియుండు మిశ్రకస్నేహము, వీనిని విరేచనమున కిప్పించవలయును.

### వృద్ధిరోగమున నిరూహానువాసన వస్తికర్మలు.

తతోఽనిలఘ్ననిర్యూహకల్కస్నేహైర్నిరూహయేత్. ౩౦
రసేనభోజితం యష్టితైలేనాన్వాసయేదను,
స్వేదప్రలేపా వాతఘ్నాః పక్వే భిత్వా వ్రణక్రియాః. ౩౧

వాతజవృద్ధిరోగమునందు పై చెప్పిన ప్రకారము స్నేహములచే శోధన కర్మలను చేయించి పిదప వాతహర కషాయకల్కస్నేహములచే నిరూహవస్తిని చేయించవలయును. పిదప మాంసరసముతో భోజనముచేయించి యష్టిమధుక తైలముచే అనువాసన వస్తిని చేయించవలయును. మఱియు వాతహరములైన స్వేదకర్మలు ప్రలేపములు వీనిని చేయించవలయును. వృద్ధిరోగము పక్వమైయుండిన దానిని ఛేదించి వ్రణమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

### పిత్తరక్తజవృద్ధిచికిత్స.

పిత్తరక్తోద్భవే వృద్ధా వామపక్వే యథాయథమ్,
శోఫవ్రణక్రియాం కుర్యాత్ప్రతతం చ హరేదసృక్. ౩౨

పిత్తరక్తమువలన జనించిన వృద్ధిరోగము పక్వముగాకుండునపుడు శోఫ రోగమునకు చెప్పియుండు చికిత్సలును, పక్వముగనుండునపుడు వ్రణచికిత్సలును, చేయువలయును. ఎల్లపుడు రక్తమోక్షణము చేయించవలయును.

### కఫజవృద్ధిరోగచికిత్స.

గోమూత్రేణ పిబేత్కల్కం శ్లైష్మికే పీతదారుజమ్,
విమ్లాపనాదృతే చాత్ర శ్లేష్మగ్రంథిక్రమో హితః. ౩౩
పక్వే చ పాటితే తైలమిష్యతే వ్రణశోధనమ్,
సుమనోరుష్కరాంకోలసప్తవర్ణేషు సాధితమ్, ౩౪
పటోలనింబరజనీవిడంగకుటజేషు చ,

శ్లేష్మజ వృద్ధిరోగమునందు మ్రానిపసుపుకల్కమును గోమూత్రములో కలిపి పానము చేయించవలయును. విమ్లాపనము (అనగా—మర్దించుట), తప్ప ఇతరములైన శ్లేష్మగ్రంథి చికిత్సలను జేయవలయును. పైరోగముపక్వమైయుండిన శస్త్రముచే ఛేదించి జాజి, జీడిగింజలు, ఊడుగ, ఏడాకులపొన్న, చేదుపొట్ల, వేము, పసుపు, వాయువిడంగములు, కొడిసె, వీనితో పక్వముచేయబడిన తైలముచే లేపనముచేసిన వ్రణము శుద్ధమై శమించును.

### మేదోజవృద్ధి చికిత్స.

మేదోజం మూత్రపిష్టేన సుస్విన్నం సురసాదినా. ౩౫
శిరోవిరేక ద్రవ్యైర్వా వర్జయన్ఫలసేవనీమ్,
దారయేద్వృద్ధిపత్రేణ సమ్యక్ఛేదసి సూద్ధృతే. ౩౬
వ్రణం మాక్షికకాసీససైంధవప్రతిసారితమ్,
సీవ్యేదభ్యంజనం చాస్య యోజ్యం మేదోవిశుద్ధయే ౩౭
మనశ్శిలైలాసుమనోగ్రంథిభల్లాతకైః కృతమ్,
తైలమావ్రణసంధానాత్స్నేహస్వేదౌ చ శీలయేత్. ౩౮

మేదస్సువలనజనించిన వృద్ధిరోగమునందు సురసాది గణద్రవ్యములనుగోమూత్రముతోనూరి దానిచేగాని, శిరోవిరేచనకరద్రవ్యములచేగాని, చక్కగ స్వేదకర్మను చేయించి; వృషణములు, సేవనీనాడి, ఈరెంటికిగాయముతగలనియ్యక వృద్ధిరోగమును వృద్ధిపత్రమను శస్త్రముచే ఛేదించి, మేదస్సును చక్కగబైటకితీసి, తేనె, కాసీసము, సైంధవలవణము, వీనినొకటిగ చేర్చి,యావ్రణమునకు పూసి, సూదిచేకుట్టి, మేదస్సుశుద్ధ

యుగుటకై మణిశిల, ఏలకులు, జాజి; మోడి, జీడిగింజలు, వీనిలో పక్వము చేయబడిన తైలమును లేపనము చేయుచుండవలయును. మఱియు పైవ్రణము శమించువరకు స్నేహస్వేదకర్మలను చేయుచుండవలయును.

మూత్రజవృద్ధి చికిత్స.

**మూత్రజం స్వేదితం స్నిగ్ధైర్వస్త్రపట్టేన వేష్టితమ్,**
విధ్యేదధస్తాత్సేవన్యాస్స్రావయేచ్ఛ యథోదరమ్. ౩౯
వ్రణం చ స్థగికాబద్ధం రోపయేత్

మూత్రదోషమువలనజనించిన వృద్ధిరోగమునకు స్నిగ్ధద్రవ్యములచే స్వేదకర్మను చేయించి, దానిని వస్త్రఖండముచేచుట్టి, సేవనీనాడికి క్రిందిభాగమున వేధించి, జలోదరరోగమునకు చెప్పియుండునటుల నాడికాయంత్రముచే దోషమును బైట స్రవింపజేసి, యా వ్రణమునకు సూత్రస్థానములో శస్త్రకర్మవిధ్యధ్యాయమునందుచెప్పియుండు స్థగికాబంధమను కట్టుకట్టి వ్రణమునుమాన్పనగును.

ఆంత్రజవృద్ధి చికిత్స.

ఆంత్రహేతుకే,
ఫలకోశమసం ప్రాప్తేచికిత్సా వాతవృద్ధివత్. ౪౦

ఆంత్రజవృద్ధిరోగము వృషణకోశములను జేరకుండినపుడు వాతవృద్ధిరోగమునకు చెప్పియుండునటుల చికిత్సలను చేయవలయును.

సుకుమార ఘృతము.

పచేత్పునర్నవతులాం తథా దశపలాః పృథక్,
దశమూలపయస్యాశ్వగంధై రండశతావరీః. ౪౧
ద్విదర్భశరకాశేక్షుమూలపోటగళాన్వితాః,
వహేఽపామష్టభాగస్థే తత్ర త్రింశత్పలం గుడాత్. ౪౨
ప్రస్థమేరండతైలస్య ద్వౌ ఘృతాత్పయసస్తథా,
ఆవపేద్విపలాంశం చ కృష్ణాతన్మూలసైంధవమ్. ౪౩
యష్టీమధుకమృద్వీకాయవానీనాగరాణి చ,
తత్సిద్ధం సుకుమారాఖ్యం సుకుమారం రసాయనమ్. ౪౪
వాతాతపాధ్వయానాది పరిహార్యేష్వయంత్రణమ్,
ప్రయోజ్యం సుకుమారాణామీశ్వరాణాం సుఖాత్మనామ్. ౪౫
నృణాం స్త్రీబృందభర్తౄణామలక్ష్మీకలినాశనమ్,

సర్వకాలోపయోగేన కాంతిలావణ్యపుష్టిదమ్. ౪౬
వర్ధవిద్రధిగుల్మార్శోయోనిమేఢ్రానిలార్తిషు,
శోఫోదరఖుడప్లీహవిడ్విబంధేషు చోత్తమమ్. ౪౭

గలిజేరు 100. పలములు; దశమూలములు, చిన్నమునుబాల, పెన్నేరుగడ్డ ఆముదపువేళ్లు, పిల్లిపీచర, కుశగడ్డి, దర్భ, రెల్లు, కాచగడ్డి, చెఱుకువేళ్లు, కిక్కిసగడ్డి, ఇవి ప్రత్యేకము 10 పలములు; ఇటుల వీనిని 4 ద్రోణముల యుదకములోవైచి, 8 వ భాగము మిగులునటుల కషాయము కాచి, వడియగట్టి; అందులో చిట్టాముదము 1 ప్రస్థము, ఆవునెయ్యి 2 ప్రస్థములు, ఆవుపాలు 2 ప్రస్థములు, పాతబెల్లము 30 పలములు, వీనిని చేర్చి; పిప్పళ్లు, మోడి, సైంధవలవణము, అతిమధురము, ద్రాక్ష, ఓమము, శొంఠి, వీనిని దినుసుకు రెండేసి పలములచొప్పున గ్రహించి, కల్కముజేసి, కలిపి; రసాయనవిధిగ పక్వము చేయవలయును. దీనిని సుకుమార ఘృతమని వచింపుదురు. అత్యుత్తమమైన రసాయనము, సుకుమారశరీరులు, సుఖజీవులు, నయిన రాజులకుపయోగార్హంబుగనుండును. మఱియు గాలి, ఎండ, మార్గసంచారము, అనేక స్త్రీ సంభోగము, మొదలగువానిచే శ్రమనొందినవారికి హితకరంబుగనుండును. మరియు నీఘృతమును సేవించునపుడు పైజెప్పినగాలి, ఎండ, త్రోవనడుచుట, వాహనములపై సవారిచేయుటమున్నగు విషయములయందు నిషేధములేక సేవింపనగును. పెక్కుస్త్రీలకు భర్తగానుండుమనుజులకు మిక్కిలి మేలునుగలుగజేయును. దీనినెల్ల కాలములయందుపయోగించినచో దారిద్ర్యము, పాపము, ఇవి నివర్తించుటయేగాక, శరీరమునకు కాంతి, సౌందర్యము, పుష్టికలుగును. వృద్ధి, విద్రధి, గుల్మము, అర్శస్సు, యోనిశూల, మేఢ్రశూల, వాతోపద్రవములు, శోఫ, ఉదరరోగము, ఖుడము, ప్లీహము, మలబంధము, ఈ రోగములయందు మిక్కిలి శ్రేష్ఠౌషధంబుగనుండును.

వృద్ధిరోగమునందు దాహకర్మ.

యాయాద్వృద్ధిర్న చేచ్ఛాంతిం స్నేహరేకానువాసనైః,
వస్తికర్మ పురఃకృత్వా వంక్షణస్థం తతో దహేత్. ౪౮
అగ్నినా మార్గరోధార్థం మరుతః..............

పైనజెప్పిన ప్రకారము స్నేహవిరేచన అనువాసన వస్తిమొదలగు చికిత్సలను జేసియు వృద్ధిరోగము శమింపకయుండిన తోలుత వస్తికర్మను చేయించి వాతమార్గము నడ్డగించుటకై గజ్జలలోనుండు నరమును నిప్పుచె కాల్పవలయును.

—— దాహకర్మ క్రమము. ——

అర్ధేందువక్త్రయా,
అంగుష్ఠస్యోపరి స్నావపీతం తంతుసమం చ యత్. ౪౯
ఉత్క్షిప్య సూచ్యా తత్తిర్యగ్దహేచ్ఛిత్వా యతో గదః,
తతోఽన్యపార్శ్వేఽన్యే త్వాహుర్దహేద్వాఽనామికాంగులేః.
గుల్మేఽన్యైర్వాతకఫజే ప్లీహ్ని చాయం విధిః స్మృతః,
కనిష్ఠికానామికయోర్విశ్వాచ్యాం చ యతో గదః ౫౧

మనుజునికేపార్శ్వమున వృద్ధిరోగమున్నదో యాపార్శ్వముయొక్క కాలిబొటనవ్రేలికి పైభాగమునందు పసుపు పచ్చనివర్ణముగలదై నూలుదారముతో సమానముగ నుండునరమును సూదిచేపొడిచి పైకెత్తి అర్ధేందువక్త్రమను శస్త్రముచే అడ్డముగ కోసి నిప్పుచే కాల్చవలయును. మఱియు కొందఱాచార్యులు వృద్ధిరోగముగల పార్శ్వమును వదలి తదితరపార్శ్వముయొక్క బొటనవ్రేలినరమును పైప్రకారము ఛేదించి దహింపవలయునని వచించెదరు. మఱి కొందరాచార్యులు అనామికవ్రేలి పై భాగమున పైప్రకారము చేయవలయునని చెప్పుచున్నారు. ఇంకకొందరు వాతకఫజనితములైనగుల్మప్లీహరోగములయందును, విశ్వాచియను వాతవ్యాధియందును, కనిష్ఠికానామికల పైభాగమున నరమును పైప్రకారము ఛేదించి, దహింపవలయునని వక్కాణింపుచున్నారు.

త్రయోదశాధ్యాయము ముగిసెను.



# చతుర్దశాధ్యాయము.

అవ: విద్రధిగుల్మరోగములు వాతమువలన జనించినదగుటంజేసి విద్రధివృద్ధి చికిత్సితాధ్యాయనిరూపణానంతరము గుల్మరోగచికిత్సితాధ్యాయము చెప్పబడు చున్నయది.

## గుల్మరోగచికిత్సితాధ్యాయప్రారంభము.

సూ. అథాతో గుల్మచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

విద్రధివృద్ధిచికిత్సితాధ్యాయనిరూపణానంతరము గుల్మరోగచికిత్సలను తెలియ పరచునట్టి గుల్మచికిత్సితమను నీయధ్యాయమును వివరించెదము.

## వాతికగుల్మరోగచికిత్స.

గుల్మం బద్ధశకృద్వాతం వాతికం తీవ్రవేదనమ్,
రూక్షశీతోద్భవం తైలైస్సాధయేద్వాతరోగికైః. ౧
పానాన్నాన్వాసనాభ్యంగైస్స్నిగ్ధస్య స్వేదమాచరేత్,
ఆనాహ వేదనా స్తంభవిబంధేషు విశేషతః. ౨
స్రోతసాం మార్దవం కృత్వా జిత్వా మారుతముల్బణమ్,
భిత్వా విబంధం స్నిగ్ధస్య స్వేదో గుల్మమపోహతి. ౩

తీవ్రవేదనగలదియు, అపానవాతమలముల బంధించియుండునదియు రూక్షము శీతలము వీనివలన జనించినదియునగు వాతజగుల్మమును వాతరోగచికిత్సయందు చెప్పి యుండుతైలములచే చికిత్స చేయవలయును. మఱియు ఆహారము, స్నేహపానము, అనువాసనవస్తి, అభ్యంగము, వీనిచే స్నిగ్ధుడుగనుండుగుల్మరోగికి స్వేదకర్మను చేయించ వలయును. కడుపుబ్బరము, శూల, స్తబ్ధత్వము, మలబంధము, అనునుపద్రవములతో గూడియుండు గుల్మరోగికి స్వేదకర్మను ముఖ్యముగ చేయించవలయును. పానాదులచే, స్నిగ్ధుడుగనుండురోగికి స్వేదకర్మను చేయించిననది స్రోతస్సులకు మృదుత్వమును కలుగ జేసి, వాతప్రకోపమును శమింపజేసి, మలబంధమును పోగొట్టిగుల్మమునుపోకడచును.

## నాభ్యూర్ధ్వగగుల్మచికిత్స.

స్నేహపానం హితం గుల్మే విశేషేణోర్ధ్వనాభిజే,
పక్వాశయగతే వస్తిరుభయం జఠరాశ్రయే. ౪

గుల్మరోగమునందు స్నేహపానము హితకరము. నాభికి పైభాగమున జనించిన గుల్మమునందు స్నేహపానము విశేషముగ హితమును కలుగజేయును. పక్వాశయము నందు జనించిన గుల్మమునందు వస్తికర్మయు ఉదరములో జనించిన గుల్మమునందు స్నేహపాన వస్తికర్మలురెండును హితకరంబులు.

వాతజగుల్మమునం దన్నపానాదులు.

దీప్తేఽగ్నౌ వాతికే గుల్మే విబంధేఽనిలవర్చసోః,
బృంహణాన్యన్నపానాని స్నిగ్ధోష్ణాని ప్రదాపయేత్. ౫
పునఃపునః స్నేహపానం

వాతజగుల్మమునందు జాఠరాగ్నిదీపనముగలిగి, అపానవాతమలబంధమునుజనించి యుండిన, శరీరమునకు పుష్టిని కలుగజేయునదిగ స్నిగ్ధముగ ఉష్ణముగనుండు అన్నపానముల నిప్పించవలయును. స్నేహపానమును పలుమారు చేయించవలయును.

వాతజగుల్మమునందు నిరూహాదివస్తికర్మలు.

నిరూహాస్సానువాసనాః,
ప్రయోజ్యా వాతజే గుల్మే కఫపిత్తానురక్షిణః. ౬

కఫపిత్తములతోగూడియుండు వాతజగుల్మమునందు నిరూహానువాసన వస్తికర్మలను చేయవలయును.

గుల్మమునందు వస్తికర్మావశ్యకత్వము.

వస్తికర్మపరం విద్యాద్గుల్మఘ్నం తద్ధి మారుతమ్,
స్వస్థానే ప్రథమం జిత్వా సద్యోగుల్మమపోహతి. ౭
తస్మాదభీక్ష్ణశో గుల్మా నిరూహైస్సానువాసనైః, ౮
ప్రయుజ్యమానైశ్శామ్యంతి వాతపిత్తకఫాత్మకాః. ౯

గుల్మరోగమును పోగొట్టుటయందు వస్తికర్మ కడుశ్రేష్ఠమైనది. వస్తికర్మపక్వాశయమునందలి వాతప్రకోపమును తొలుత శమింపజేసి, తత్క్షణమే గుల్మమును పోగొట్టును. కావున నెల్లపుడు నిరూహానువాసనవస్తులను పలుమారు చేయుచుండిన వాతపిత్తకఫములవలన జనించినగుల్మములు హరించును.

హింగ్వాదిఘృతము.

హింగుసౌవర్చలవ్యోషబిడదాడిమదీప్యకైః,
పుష్కరాజాజిధాన్యామ్లవేతసక్షారచిత్రకైః. ౧౦
శఠీవచాజగంధైలాసురసైర్దధిసంయుతైః,

శూలానాహాహరం సర్పిస్సాధయేద్వాతగుల్మినామ్. ౧౦

ఇంగువ, సౌవర్చలలవణము, త్రికటుకములు, బిడాలవణము, దానిమ్మపండు, ఓమము, పుష్కరమూలము, జీలకఱ్ఱ, దనియాలు, పుల్లప్రబ్బలి, సర్జక్షారము, చిత్రమూలము, కచోరములు, వస, వాయింట, ఏలకులు, తులసి, ఇవి సమభాగములు, వీనికన్నిటికి నాల్గింతలు ఆవునెయ్యి, నేతికిసమభాగము ఆవుపెరుగు, నేతికి 4 గింతలుదకము, వీనినన్నిటిని ఒకటిగచేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేయవలయును. దీనిని వాతగుల్మరోగికిప్పించిన శూల కడుపుబ్బరము హరించును.

## హపుషాది ఘృతము.

హపుషోషణపృథ్వీకాపంచకోలకదీప్యకైః,
సాజాజీసైంధవైర్దధ్నా దుగ్ధేన చ రసేన చ. ౧౧
దాడిమాన్మూలకాత్కోలాత్పచేత్సర్పిర్నిహంతి తత్,
వాతగుల్మోదరానాహపార్శ్వహృత్కోష్ఠవేదనాః. ౧౨
యోన్యర్శోగ్రహణీదోషకాసశ్వాసారుచిజ్వరాన్,

విత్తుబోడతరము, మిరియాలు, హింగుపత్రి, (ఇంగువచెట్టుయొక్కఆకు) పంచకోలములు, ఓమము, జీలకఱ్ఱ, సైంధవలవణము, ఇవి సమభాగములు; వీనికి 4 గింతలు ఆవునెయ్యి; ఆవుపెరుగు, ఆవుపాలు, దానిమ్మపండురసము, ముల్లంగిరసము, రేగుపండ్లరసము, ఇవి ప్రత్యేకము నేతికిసమభాగములు; ఇటుల వీనినన్నిటిని చేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేయవలయును. ఇది గుల్మము, శూల కడుపుబ్బరము, పార్శ్వశూల, రొమ్మునొప్పి, కోష్ఠరోగము, యోనిరోగము, అర్శోరోగము, గ్రహణీరోగము, కాసము, శ్వాసము, అరుచి, జ్వరము, వీనినన్నిటిని పోగొట్టును.

## దాధిక ఘృతము.

దశమూలం బలాం కాలాం సుషవీం ద్వౌ పునర్నవౌ. ౧౩
పౌష్కరైరండరాస్నాశ్వగంధాభార్గ్యమృతాశఠీః,
పచేద్గంధపలాశం చ ద్రోణేఽపాం ద్విపలోన్మితమ్. ౧౪
యవైః కోలైః కులత్థైశ్చ మాషైశ్చ ప్రాస్థికైస్సహ,
క్వాథేఽస్మిన్ దధిపాత్రే చ ఘృతప్రస్థం విపాచయేత్. ౧౫
స్వరసైర్దాడిమామ్రాతమాతులుంగోద్భవైర్యుతమ్,
తథా తుషాంబుధాన్యామ్లయుక్తైశ్శ్లక్ష్ణైశ్చ కల్కితైః. ౧౬

భార్గీతుంబురుషడ్గ్రంథాగ్రంథిరాస్నాగ్నిధాన్యకైః,
యవానకయవాన్యమ్లవేతసా సితజీరకైః. ౧౭
అజాజీహింగుహపుషాకారవీవృషకోషకైః,
నికుంభకుంభమూర్వేభపిప్పలీవేల్లదాడిమైః ౧౮
శ్వదంష్ట్రాత్రపుసేర్వారుబీజహింస్రాశ్మభేదకైః,
మిసిద్విక్షారసురససారిబానీలినీఫలైః ౧౯
త్రికటుత్రిపటూపేతైర్దాధికం తద్వ్యపోహతి,
రోగానాశుతరాన్ పూర్వాన్కష్టానపి చ శీలితమ్. ౨౦
అపస్మారగరోన్మాదమూత్రాఘాతానిలామయాన్,

దశమూలములు, బలామూలము, (చిట్టాముట్టి), సిలి, పెద్దజీలకఱ్ఱ, ఎఱ్ఱగలిజేరు, తెల్లగలిజేరు, పుష్కరమూలము, ఆముదపువేళ్లు, దుంపరాస్నము, పెన్నేరుగడ్డ, గంటుభారంగి, తిప్పతీగె, కచోరములు, గంధపత్రి, ఇవి దినుసు ఒకటికిరెండేసి పలములు; యవలు, రేగుపండ్లు, ఉలవలు, మినుములు, ఇవి దినుసుకు 1 ప్రస్థము; వీనిని ద్రోణప్రమాణ ముదకములో వైచి, పాదావశేషముగ కషాయముకాచి; అందులో 1 ఆఢకము ఆవుపెరుగు, 1 ప్రస్థము ఆవునెయ్యి, 1 ప్రస్థము, దానిమ్మపండురసము 1 ప్రస్థము అంబాళపుపండ్లరసము 1 ప్రస్థము, మాదీఫలరసము 1 ప్రస్థము, తుషోదకము అనగా—పొట్టుతోగూడియుండు పచ్చియవలను కడిగిననీరు 1 ప్రస్థము, పులికడుగునీరు ఒకప్రస్థము, వీనినన్నిటిని నొకటిగ జేర్చి; యందు గంటుభారంగి, తుంబురు, వస, మోడి, సన్నరాస్నము, చిత్రమూలము, దనియాలు, అజామోదము, కురాసానివామము, పుల్లప్రబ్బలి, నల్లజీలకఱ్ఱ, జీలకఱ్ఱ, ఇంగువ, విత్తుబోడతరము, ఓమము, అడ్డసరము, జెముడు, నాగదంతి, తెగడ, చాగ, గజపిప్పలి, వాయువిడంగములు, దానిమ్మపండు, పల్లేరు, ములుదోసవిత్తులు, నక్కదోసవిత్తులు, జటామాంసి, పాషాణభేది, పెద్దసదాప, సర్జక్షారము, యవక్షారము, తులసి, నల్లసుగంధిపాల, నీలివిత్తులు, త్రికటుకములు, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, వీనిని సమభాగములుగ గ్రహించి నూరి కలిపి ఘృతపాకవిధిగ పక్వముచేయవలయును. ఇది దాధికఘృత మనబడును. దీనిని సేవింపుచుండిన వాతగుల్మము, ఉదరరోగము, కడుపుబ్బరము, పార్శ్వశూల, బోదమునొప్పి, యోనిరోగము, అర్శోరోగము, గ్రహిణి, కాసశ్వాసములు, అరుచి, జ్వరము, అపస్మారము, విషదోషము, ఉన్మాదము, మూత్రకృచ్ఛ్రము, వాతరోగములు, ఈరోగములనన్నిటిని శీఘ్రముగహరించును. దానిమ్మపండు మొదలగువాని

రసములు దొరకనియెడల పైదాడిమాది ద్రవ్యములను 1 ప్రస్థము గ్రహించి, నలియగొట్టి 1 ప్రస్థముదకములో వైచి ఒకపేయుంబవలు నానబెట్టివడియగట్టి యారసమును గ్రహించుకొనవలయును. "ప్రస్థం గృహీత్వా చూర్ణస్య తోయస్య ప్రస్థమావపేత్, అహోరాత్రం స్థితం పూతం తత్స్యాత్స్వరసవద్గుణైః. స్వరసానామలాభే త్వయంవిధిః. చూర్ణానామాఢకమాఢకముదకస్యాహోరాత్రస్థితం మృదితపూతమావపేత్తత్స్వరసవత్ప్రయోజ్యమ్." ఏద్రవ్యముయొక్క స్వరసముదొరకదో యాద్రవ్యమును 1 ప్రస్థము, గ్రహించి నలియగొట్టి 1 ప్రస్థముదకములో వైచి ఒక యహోరాత్రము నానబెట్టి వడియగట్టిన నది పచ్చిరసముతో తుల్యగుణముగలవి యగునని తంత్రాంతరమునందును చరకమునందును చెప్పబడియున్నది.

## త్ర్యూషణాదిఘృతము.

త్ర్యూషణత్రిఫలాధాన్యాచపికావేల్లచిత్రకైః. ౨౧
కల్కీకృతైర్ఘృతం పక్వం సక్షీరం వాతగుల్మనుత్,

ఆవునెయ్యి ఆవుపాలు వీనిని సమభాగములుగ గ్రహించి అందులో త్రికటుకములు, త్రిఫలములు, దనియాలు, చవ్యము, వాయువిడంగములు, చిత్రమూలము, వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి కలిపి; నేతికి 4 గింతలుదకముబోసి, ఘృతపాకవిధిగపక్వము చేయవలయును. దీనినుపయోగించిన, వాతగుల్మమునుపోగొట్టును.

## లశునాదిఘృతము.

తులాం లశునకందానాం పృథక్పంచపలాంశకమ్. ౨౨
పంచమూలం మహచ్చాంబు భారార్ధే తద్విపాచయేత్,
పాదశేషం తదర్ధేన దాడిమస్వరసం సురామ్. ౨౩
ధాన్యామ్లం దధి చాదాయ పిష్టాంశ్చార్ధపలాంశకాన్,
త్ర్యూషణత్రిఫలాహింగుయవానీచవ్యదీప్యకాన్. ౨౪
సామ్లవేతససింధూత్థదేవదారూన్పచేద్ఘృతాత్,
తైః ప్రస్థం తత్పరం సర్వవాతగుల్మవికారజిత్. ౨౫

వెల్లుల్లిగడ్డలు నూరు పలములు, మహాపంచమూలములు దినుసుకు ఐదుపలములు వీనిని వేయిపలములయుదకములో వైచి, పాదావశేషముగ కషాయముకాచి, అందులో దానిమ్మపండురసము, సురయనుమద్యము, పులికడుగు, ఆవుపెరుగు, వీనిని వేర్వేరుగ పైకషాయప్రమాణమునకు అర్ధాంశము చేర్చి; అందులో త్రికటుకములు, త్రిఫలములు, ఇంగువ, కురాసానియోమము, చవ్యము, అజామోదము, పుల్లప్రబ్బలి, సైంధవలవణము,

నారు, వీనిని దినుసుకు రెండు కర్షముల చొప్పునగ్రహించి కల్కముచేసి కలిపి, ప్రస్థము ఆవునెయ్యిపోసి విధిప్రకారము పక్వముచేసి యిప్పించిన వాతగుల్మరోగము యం హరించును.

వాతగుల్మమునందు షట్పలఘృతోపయోగము.

షట్పలం వా పిబేత్సర్పిర్యదుక్తం రాజయక్ష్మణి,
ప్రసన్నయా వా క్షీరార్థస్సురయా దాడిమేన వా. ౧౬
ఘృతే మారుతగుల్మఘ్నః కార్యో దధ్నస్సరేణ వా,

వాతగుల్మమునందు రాజయక్ష్మ చికిత్సితాధ్యాయమున చెప్పియుండుషట్పల ము నిప్పించవలయును. దానిని పక్వముచేయునపుడు ఆవుపాలనువర్జించి, దానికి ౦ ప్రసన్నయనుమద్యమునుగాని, సురయనుమద్యమునుగాని, దానిమ్మరసమునుగాని, ౦మీది తేటనీరునుగానిచేర్చి పక్వముచేసి యాఘృతము నిప్పించిన వాతగుల్మము చును.

వాతగుల్మమునందు వమనము.

వాతగుల్మే కఫో వృద్ధో హత్వాగ్నిమరుచిం యది. ౧౭
హృల్లాసం గౌరవం తంద్రాం జనయేదుల్లిఖేత్తు తమ్,

వాతగుల్మరోగికి కఫమువృద్ధిజెంది జాఠరాగ్నినిచెరచి, అరుచి హృల్లాసము గురు తంద్ర వీనిని గలుగజేసిన నట్టికఫము శమించుటకై వమనము చేయించవల

వాతగుల్మమునందు కషాయ - చూర్ణ - గుటికలు.

శూలానాహవిబంధేషు జ్ఞాత్వా సస్నేహమాశయమ్. ౧౮
నిర్యూహచూర్ణవటకాః ప్రయోజ్యా ఘృతభేషజైః,

వాతగుల్మరోగికి శూల, కడుపుబ్బరము, మలబంధము, ఇవి కలిగియుండినచో యము దుష్టమైయున్నదని తెలిసికొని పైజెప్పబడిన హింగ్వాదిఘృతము మున్న ముల యందలి యౌషధములను కషాయము, చూర్ణము, గుటికలు అనువానిరూ నుపయోగింపందగును.

ఔషధచూర్ణోపయోగకాలము.

కోలదాడిమఘర్మాంబుతక్రమద్యామ్లకాంజికైః. ౧౯
మండేన వా పిబేత్ప్రాతశ్చూర్ణాన్యన్నస్య వా పురః,

ఘృతిఘృతములను చెప్పియుండు ద్రవ్యములచూర్ణమును రేగుపండ్లరసము, దాని సము, ఉష్ణోదకము, మజ్జిగ, మద్యము, కలి, పుల్లనిగంజి, మండము, వీనిలో

దేనియందైన కలిపి ప్రాతఃకాలమునందుగాని, ఆహారమునకు పూర్వముగాని, పానము చేయించవలయును.

### కఫవాతగుల్మహరవటకములు.

చూర్ణాని మాతులుంగస్య భావితాన్యసకృద్రసే,
కుర్వీత కార్ముకతరాన్ వటకాన్ కఫవాతయోః. 30

కఫవాతములవలన జనించిన గుల్మమునందు పైద్రవ్యముల చూర్ణమును మాదీఫలరసములో పలుమారు భావనజేసి గుటికలు చేయించి యిప్పించవలయును.

### హింగ్వాది చూర్ణము.

హింగువచావిజయాపశుగంధాదాడిమదీప్యకధాన్యకపాఠాః,
పుష్కరమూలశఠీహపుషాగ్ని క్షారయుగత్రిపటుత్రికటూని.
సాజాజిచవ్యంసహతింత్రిడీకం సవేతసామ్లం వినిహంతిచూర్ణమ్,
హృత్పార్శ్వవస్తిత్రికయోనిపాయుశూలాని వాయ్వామకఫోద్భవాని.
కృచ్ఛ్రాన్ గుల్మాన్వాతవిణ్మూత్రసంగం
కంఠే బంధంహృద్గ్రహం పాండురోగమ్,
అన్నాశ్రద్ధాప్లీహదుర్నామహిధ్మా
వర్ధ్మాధ్మానశ్వాసకాసాగ్నిసాదాన్. 33

ఇంగువ, వస, కరక్కాయలు, కుక్కవాయింట, దానిమ్మ, ఓమము, దనియాలు, చిరుబొద్ది, పుష్కరమూలము, కచోరములు, విత్తుబోడతరము, చిత్రమూలము, సర్జక్షారము, యవక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, శుంఠి, పిప్పలి, మిరియాలు, జీలకఱ్ఱ, చవ్యము, చింతపండు, పుల్లప్రబ్బలి, వీనిని సమభాగములుగ గ్రహించి,చక్కగ చూర్ణముచేసిన, నది హింగ్వాదిచూర్ణమనబడును. ఇది ఱొమ్మునొప్పి, పార్శ్వశూల, పొత్తికడుపునొప్పి, ముడ్డిపూసయందునొప్పి,యోనిశూల, గుదశూల, దారుణమైన గుల్మరోగములు, అపానవాత మలమూత్రప్రతిబంధము, కంఠము, ఱొమ్మువీనియందుపట్టు, పాండురోగము, అన్నమునందిచ్ఛలేకుండుట, ప్లీహము, అర్శస్సు, హిధ్మరోగము (ఎక్కిళ్లు), వృద్ధిరోగము, కడుపుబ్బరము, శ్వాసకాసలు, అగ్నిమాంద్యము, వీనిని పోగొట్టును.

### వైశ్వానరచూర్ణము.

లవణయవానీదీప్యకకణనాగరముత్తరోత్తరం వృద్ధమ్,
సర్వసమాంశహరీతకీచూర్ణం వైశ్వానరస్సాక్షాత్. 38

సైంధవలవణము 1 భాగము, కురాసానియోమము 2 భాగములు, అజామోదము 3 భాగములు, పిప్పళ్లు 4 భాగములు, శుంఠి 5 భాగములు వీనికన్నిటికిసమము

కరక్కాయలు, ఇటులచేర్చి చక్కగచూర్ణముచేయవలయును. ఇది వైశ్వానరచూర్ణమనబడును. మిక్కుటముగ అగ్నిదీపనమును కలుగజేయును.

## ౼౼ త్రికటుకాది చూర్ణము. ౼౼

త్రికటుకమజమోదా సైంధవం జీరకే ద్వే సమధరణధృతానా
మష్టమో హింగుభాగః, ప్రథమకబళభోజ్యస్సర్పిషాచూర్ణ
కోయం జనయతి భృశమగ్నిం వాతగుల్మం నిహంతి. 31

త్రికటుకములు, అజామోదము (ఓమము), సైంధవలవణము, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ ఇవిసమభాగములు; వీనికన్నిటికి 8వ భాగము ఇంగువ యిటుల వీనినన్నిటిని చేర్చి చూర్ణముచేసి యాచూర్ణమును భోజనకాలమునందు మొదటికబళమునకలిపి నెయ్యితోడభుజించిన మిక్కుటముగ జాఠరాగ్నిదీపనముకలుగుటయేగాక వాతగుల్మరోగము హరించును.

## ౼౼ శార్దూల చూర్ణము. ౼౼

హింగూగ్రాబిడశుంఠ్యజాజి విజయావాట్యాభిధానామయై
శ్చూర్ణైః కుంభనికుంభమూలసహితై ర్భాగోత్తరం వర్ధితైః.
పీతః కోష్ణజలేన కోష్ఠజరుజో గుల్మోదరాదీనయం
శార్దూలః ప్రసభంప్రమథ్య హరతి వ్యాధీ న్మృగౌఘానివ.

ఇంగువ 1 భాగము, నల్లవస 2 భాగములు, బిడాలవణము 3 భాగములు, శొంఠి 4 భాగములు, జీలకఱ్ఱ 5 భాగములు, కరక్కాయలు 6 భాగములు, మహాబలామూలము (పేరాముట్టి) 7 భాగములు, చెంగల్వకోష్ఠు 8 భాగములు, తెగడ 9 భాగములు, దంతివేళ్లు 10 భాగములు యిటుల వీనినన్నిటి నొకటిగజేర్చి, చూర్ణముచేసి కొంచెముగనుండు నుదకములో కలిపి పానముచేయించిన "పెద్దపులి జింకలను సంహరించుభంగి" కోష్ఠశూల, గుల్మరోగము, ఉదరరోగము, మొదలగువానిని నిర్మూలముచేయును.

## ౼౼ సైంధవాది చూర్ణము. ౼౼

సింధూత్థపథ్యాకణదీప్యకానాం చూర్ణాని తోయైః పిబతాం
కవోష్ణైః, ప్రయాతి నాశం కఫవాతజన్మా నారాచనిర్భిన్న ఇవా
మయౌఘః. 32

సైంధవలవణము, కరక్కాయలు, పిప్పళ్లు, ఓమము, వీనిని సమభాగములుగ

గ్రహించి చూర్ణముచేసి కొంచెముష్ణముగనుండు ఉదకములోకలిపి పానముచేయించిన "బాణముచే గొట్టబడినటుల" కఫవాతముల వలనజనించిన రోగములన్నియుశమించును.

పూతీక చూర్ణము.

పూతీకపత్రగజచిర్భటచవ్యవహ్ని
వ్యోషం చ సంస్తరచితం లవణోపధానం
దగ్ధ్వా విచూర్ణ్య దధిమస్తుయుతం ప్రయోజ్యం
గుల్మోదరశ్వయథుపాండుగదోద్భవేషు. ౩౭

నెమలడుగాకు, పెద్దపాపర, చవ్యము, చిత్రమూలము, త్రికటుకములు, వీనిని క్రమముగ నొకదానిపైనొకటియునిచి, కాల్చి దానిపై సైంధవలవణమునుంచి, నిప్పులో చూర్ణముచేసి దానిని పెరుగుమీది తేటనీటిలో కలిపి పానముచేయించిన; గుల్మము, ఉదరరోగము, వాపు, పాండురోగము, ఇవియన్నియు హరించును.

హింగుసైంధవాది యోగము.

హింగు త్రిగుణం సైంధవమస్మాత్త్రిగుణం తు తైలమైరండమ్,
తత్త్రిగుణరసోనరసం గుల్మోదరవర్ధ్మశూలఘ్నమ్. ౩౮

ఇంగువచూర్ణము 1 భాగము, దానికి 3 డింతలు సైంధవలవణచూర్ణము, దీనికి 3 డింతలు ఆముదము, ఆముదమునకు 3 డింతలు వెల్లుల్లిరసము, ఇటుల వీనినన్నిటినొకటిగచేర్చి పానముచేయించిన; గుల్మము, ఉదరరోగము, వృద్ధి, శూలలు ఇవిహరించును.

మాతులుంగాది యోగము.

మాతులుంగరసో హింగు దాడిమం బిడసైంధవమ్,
సురామండేన పాతవ్యం వాతగుల్మరుజాపహమ్. ౪౦

మాదీఫలరసము, ఇంగువ, దానిమ్మపండు, బిడాలవణము, సైంధవలవణము, వీనిని సమభాగములుగ గ్రహించి, సురయనుమద్యపుమీగడలో కలిపి, పానముచేయించిన వాతగుల్మ శూలలు హరించును.

శుంఠ్యాది చూర్ణము.

శుంఠ్యాః కర్షం గుడస్య ద్వౌ ధౌతాత్కృష్ణతిలాత్పలమ్,
ఖాదన్నేకత్ర సంచూర్ణ్య కోష్ణక్షీరానుపో జయేత్. ౪౧
వాతహృద్రోగగుల్మార్శోయోనిశూలశకృద్గ్రహాన్,

శొంఠి 1 కర్షము, బెల్లము 2 కర్షములు, చక్కగపొట్టుతీసిన నల్లనువ్వులు 1 పలము వీని నొకటిగచేర్చి చూర్ణముచేసి యిప్పించి, కొంచెముష్ణముగనుండు ఆవు

పాలను పానముచేయించిన; వాతహృద్రోగము, గుల్మము, అర్శస్సు యోనిశూల, మలబంధము, ఇవి హరించును.

### వాతగుల్మమునందేరండ తైలపానము.

పిబేదేరండతైలం తు వాతగుల్మీ ప్రసన్నయా. ౪౨
శ్లేష్మణ్యనుబలే వాయౌ పిత్తే తు పయసా సహ,

వాతకఫములతోఁగూడియుండు గుల్మరోగమునందు ప్రసన్నయను మద్యములో ఆముదముకలిపి పానముచేయించవలయును వాతము పిత్తముతోఁగూడియుండిన ఆవుపాలలో ఆముదము కలిపి పానముచేయించవలయును.

### వాతగుల్మమునందు రక్తమోక్షణము.

వివృద్ధం యది వా పిత్తం సంతాపం వాతగుల్మినః. ౪౩
కుర్యాద్విరేచనీయో సౌ సస్నేహైరానులోమికైః,
తాపానువృత్తావేవం చ రక్తం తస్యావసేచయేత్. ౪౪

వాతగుల్మరోగికి పిత్తము వృద్ధిజెంది శరీరమునకు తాపముగలుగజేసినయెడ నట్టివానికి విరేచనకరద్రవ్యములను స్నేహములోఁకలిపి విరేచనార్థమిప్పించవలయును. ఇటులచేసినను తాపము నివర్తించకయుండిన రక్తమోక్షణము చేయించవలయును.

### వాతగుల్మమునందు లశునక్షీరము.

సాధయేచ్ఛుద్ధశుష్కస్య లశునస్య చతుష్పలమ్,
క్షీరోదకేఽష్టగుణితే క్షీరశేషం చ పాచయేత్. ౪౫
వాతగుల్మముదావర్తం గృధ్రసీం విషమజ్వరం,
హృద్రోగం విద్రధిం శోషం సాధయత్యాశుతత్పయః. ౪౬

పొట్టుతీసినదిగ ఎండినదిగనుండు వెల్లుల్లిపాయలు 4 పలములను 8 దింతల క్షీరోదకములోఁకలిపి క్షీరము మిగులునటుల చక్కగ పాకముచేసి యాపాలనిప్పించిన; వాతగుల్మము, ఉదావర్తము, గృధ్రసి, విషమజ్వరము, హృద్రోగము, విద్రధి, శోఫ, ఇవి నివర్తించును.

### వాతగుల్మమునందు తైలాదిపానము.

తైలం ప్రసన్నాగోమూత్రమారనాళం యవాగ్రజః,
గుల్మం జఠరమానాహం పీతమేకత్ర సాధయేత్. ౪౭

నువ్వులనూనె, ప్రసన్నయనుమద్యము, గోమూత్రము, కలి, యవక్షారము, వీనిని సమభాగములుగ గ్రహించి యొకటిగ చేర్చి, పానముచేయించిన; గుల్మరోగము, ఉదరరోగము, కడుపుబ్బరము, హరించును.

### వాతగుల్మమునందు చిత్రమూలాది కషాయము.

చిత్రకగ్రంథికైరండ శుంఠీక్వాథః పరం హితః,
శూలానాహవిబంధేషు సహింగుబిడసైంధవః. ४८

చిత్రమూలము, మోడి, శొంఠి, ఆముదపువేళ్లు, వీనిని సమభాగములుగ గ్రహించి, కాచిన కషాయములో; ఇంగువ, బిడాలవణము, సైంధవలవణము, వీనిని చేర్చి గుల్మరోగికి పానము చేయించిన; శూలలు, కడుపుబ్బరము, మలబంధము, ఇవి శమించును.

### వాతజగుల్మమునందు పుష్కరమూలాది కషాయము.

పుష్కరైరండయోర్మూలం యవధన్వయవాసకమ్,
జలేన క్వథితం పీతం కోష్ఠదాహరుజాపహమ్. ४९

పుష్కరమూలము, ఆముదపువేళ్లు, యవలు, శేగటి దూలగోవిల, వీనిని సమభాగములుగ గ్రహించి యుదకములోవైచి చక్కగ కాచి యీ కషాయమును పానము చేయించిన; కోష్ఠశూల, దాహము హరించును.

### గుల్మమునందు వాట్యాహ్వాది కషాయము.

వాట్యాహ్వైరండదర్భాణాం మూలం దారు మహౌషధమ్,
పీతం నిఃక్వాథ్య తోయేన కోష్ఠపృష్ఠాంసశూలజిత్. ५०

వాట్యాహ్వము(అనగా—బలామూలము)లేక పుష్కరమూలము, ఆముదపువేళ్లు, దర్భగడ్డివేళ్లు, దేవదారుచెక్క, శొంఠి, వీనిని సమభాగములుగ గ్రహించి ఉదకములోవైచి కషాయముకాచి దానిని పానము చేయించిన, కోష్ఠము, వీపు భుజశిరములు వీనియందలి శూలలు హరించును.

### వాతజగుల్మమునందు శిలాజత్వాది యోగము.

శిలాజం పయసా నల్పపంచమూలశృతేన వా,
వాతగుల్మీ పిబేద్వాట్యముదావర్తే తు భోజయేత్. ५१
స్నిగ్ధం పిప్పలికైర్యూషైః మూలకానాం రసేన వా,
బద్ధవిణ్మారుతోఽశ్నీయాత్క్షీరేణోష్ణేన యావకమ్. ५२
కుల్మాషాన్వా బహుస్నేహాన్ భక్షయేల్లవణోత్తరాన్,

ఆవుపాలలో మహాపంచమూలము వైచికాచి అందులో శిలాజతునుకలిపి వాతగుల్మరోగికి పానము చేయించవలయును, వైగుల్మరోగికి ఉదావర్తవాతముగలిగి యుండినచో బలామూలము, లేకపుష్కరమూలమును, పిప్పలికట్టులోగాని, ముల్లంగి

రసముతోగాని, భుజింపఁజేయవలయును. మఱియు అపానవాతమలములు బంధింపబడి యుండిన, ఉష్ణముగనుండు ఆవుపాలతోడ యవాన్నమునుగాని అధికముగ లవణము చేర్చి పక్వముచేయబడినదియు, ఘృతాదిస్నేహము లధికముగ చేర్చబడినదియునైన ఉలవలనుగాని, భక్షింపజేయవలయును.

నీలిన్యాది ఘృతము.

నీలినీత్రివృతాదంతీపథ్యాకంపిల్లకైస్సహ. ౫౩
సమలాయ ఘృతం దేయం సబిడక్షారనాగరమ్,

పెద్దనీలి, తెగడ, దంతి, కరక్కాయలు, కంపిల్లకము, వీనితో పక్వముచేయబడిన ఘృతములో బిడాలవణము, యవక్షారము శొంఠి వీనిని కలిపి అధికదోషముగల గుల్మరోగి కిప్పించవలయును.

నీలినీ ఘృతము.

నీలినీం త్రిఫలాం రాస్నాం బలాం కటుకరోహిణీమ్. ౫౪
పచేద్విడంగం వ్యాఘ్రీం చ పాలికాని జలాఢకే,
రసేఽష్టభాగశేషే తు ఘృతప్రస్థం విపాచయేత్, ౫౫
దధ్నః ప్రస్థేన సంయోజ్య సుధాక్షీరపలేన చ.
తతో ఘృతపలం దద్యాద్యవాగూమండమిశ్రితమ్. ౫౬
జీర్ణే సమ్యగ్విరిక్తం చ భోజయేద్రసభోజనమ్,
గుల్మకుష్ఠోదరవ్యంగశోఫపాండ్వామయజ్వరాన్. ౫౭
శ్విత్రం ప్లీహానమున్మాదం హంత్యేతన్నీలినీఘృతమ్,

పెద్దనీలి, త్రిఫలములు, దుంపరాస్నము, బలామూలము, కటుకరోహిణి, వాయువిడంగములు, ములక, వీనిని దినుసొక్క పలముచొప్పున గ్రహించి, 1 ఆఢక ప్రమాణజలములోవైచి, 8 వ భాగము మిగులునటుల కషాయముకాచి, అందులో ఆవునెయ్యి 1 ప్రస్థము, ఆవుపెరుగు 1 ప్రస్థము, జెముడుపాలు 1 పలము చేర్చి ఘృతపాకవిధిగ పాకము చేయవలయును. ఇది నీలినీఘృతమనబడును, దీనిని యవాగువనుగంజిలోకలిపి యిప్పించి యది జీర్ణమై చక్కగ విరేచనమైన పిదప, మాంసరసముతో భోజనమిప్పించినచో గుల్మము, కుష్ఠువు, ఉదరరోగము, వ్యంగము, వాపు, పాండువు, జ్వరము శ్విత్రము, ప్లీహరోగము, ఉన్మాదము, ఇవి హరించును.

వాతజగుల్మమునందు హితకరవస్తువులు

కుక్కుటాశ్చ మయూరాశ్చ తిత్తిరిక్రౌంచవర్తకాః ౫౮
శాలయో మదిరాస్సర్పి ర్వాతగుల్మచికిత్సితమ్,

కోడి, నెమలి, తిత్తిరి, సారసము, వర్తకము అను పక్షులమాంసము సంబాబియ్యపు అన్నము, మదిరయనుమద్యము, ఆవునెయ్యి, ఇవి వాతగుల్మరోగమునందు హితకరములుగ నుండును.

వాతగుల్మమునం దాహారపానములు.

మితముష్ణం ద్రవం స్నిగ్ధం భోజనం వాతగుల్మినామ్. ౫౯
సమండా వారుణీపానం తప్తం వా ధాన్యకైర్జలమ్.

ఉష్ణముగ ద్రవముగ స్నేహయుక్తముగనుండు నాహారమును మితముగ భుజించుట మీగడతోడ వారుణీమద్యమును త్రాగుట, ధనియాలతో కాచబడినయుదకమును పానమును జేయుట. ఇవి వాతగుల్మరోగులకు హితకరంబులు.

పిత్తగుల్మచికిత్స.

స్నిగ్ధోష్ణేనోదితే గుల్మే పైత్తికే స్రంసనం హితమ్. ౬౦
ద్రాక్షాభయాగుడరసం కంపిల్లం వా మధుద్రుతమ్,
కల్పోక్తం రక్తపిత్తోక్తం

స్నిగ్ధోష్ణములైన పదార్థసేవనచే జనించిన పిత్తగుల్మరోగమునందు ద్రాక్షపండు కరక్కాయలు, వీనిరసములో బెల్లముచేర్చిగాని; లేక తేనెలో కంపిల్లమును చేర్చిగాని కల్పస్థానములో చెప్పియుండు విరేచనౌషధమునుగాని, రక్తపిత్తచికిత్సలో చెప్పియుండు త్రివృత్ ఘృతమునుగాని; విరేచనార్థము ఇప్పించవలయును.

రూక్షోష్ణపిత్తగుల్మమునకు తిక్తక ఘృతాదులు.

................గుల్మే రూక్షోష్ణజే పునః. ౬౧
పరం సంశమనం సర్పిస్తిక్తం వాసాఘృతం శృతమ్,
తృణాఖ్యపంచకక్వాథే జీవనీయగణేన వా. ౬౨
శృతం తేనైవ వాక్షీరం న్యగ్రోధాదిగణేన వా,

రూక్షోష్ణపదార్థసేవనవలన జనించిన పైత్తిక గుల్మమునకు కుష్ఠ చికిత్సితమునందు చెప్పియుండు తిక్తకఘృతమునుగాని; వాసాఘృతమునుగాని; ఇప్పించిన హితముకలుగును. మఱియు తృణపంచమూలముల కషాయముతో పక్వముచేయబడిన ఘృతమునుగాని; జీవనీయగణ ద్రవ్యములలో పక్వముచేయబడిన, ఘృతమునుగాని; పైగణములతో కాచిన ఆవుపాలనుగాని; న్యగ్రోధాదిగణములతో కాచబడిన ఆవుపాలనుగాని; యిప్పించవలయును.

పైత్తికగుల్మమునందు విరేచనము.

తత్రాపి స్రంసనం యుంజ్యాచ్ఛీఘ్రమాత్యయికే భిషక్. ౬౩

వైరేచనికసిద్ధేన సర్పిషా పయసాఽపి వా,

పైత్తికగుల్మము దారుణముగనుండినచో విరేచనమునకు చెప్పియుండు ద్రవ్యములతో పక్వము చేయబడిన ఘృతమునుగాని; పైద్రవ్యములను వైచికాచిన ఆవుపాలనుగాని; విరేచనార్థము ఇప్పింపవలయును.

పిత్తగల్మమున ఆమలకఘృతము.

రసేనామలకేక్షూణాం ఘృతప్రస్థం విపాచయేత్. ౬౪
పథ్యాపాదం పిబేత్సర్పి స్తత్సిద్ధం పిత్తగుల్మనుత్,
పిబేద్వా తైల్వకం సర్పిర్యచ్చోక్తం పిత్తవిద్రధౌ. ౬౫

ఉసిరికపండురసము, చెఱుకురసము, ఇవి 4 ప్రస్థములు, ఆవునెయ్యి 1 ప్రస్థము వీనినొకటిగ చేర్చి అందులో కరక్కాయబెరడు పావుసేరు ప్రస్థమునుసూరి కలిపి విధిప్రకారము పక్వముచేసి యాఘృతము నిప్పించినను; లేక విద్రధిచికిత్సయందు చెప్పబడియుండు తైల్వకఘృతము నిప్పించినను, పైత్తికగుల్మము హరించును.

పిత్తగుల్మమునందు ద్రాక్షాపయస్యాదిపానము.

ద్రాక్షాం పయస్యాం మధుకం చందనం పద్మకం మధు,
పిబేత్తండులతోయేన పిత్తగుల్మోపశాంతయే. ౬౬

ద్రాక్షపండు, పిన్నమనుబాల, అతిమధురము, రక్తచందనము, పద్మచందనము, తేనె, వీనినిబియ్యపు కడుగులో కలిపి పానము చేయించిన పిత్తగుల్మముశమించును.

పిత్తగుల్మమునందు త్రాయమాణాక్షీరము.

ద్విపలం త్రాయమాణాయా జలద్విప్రస్థసాధితమ్,
అష్టభాగస్థితం పూతం కోష్ణం క్షీరసమం పిబేత్. ౬౭
పిబేదుపరి తస్యోష్ణం క్షీరమేవ యథాబలమ్,
తేన నిర్హృతదోషస్య గుల్మశ్శామ్యతి పైత్తికః. ౬౮

2 ప్రస్థము లుదకములో కలుత్రాసుగు 2 పలములువైచి, 8 వ భాగముమిగులునటుల కషాయముకాచి వడియగట్టి; అందులో సుఖోష్ణముగనుండు ఆవుపాలను సమముగ చేర్చి, పిత్తగుల్మరోగికి పానము చేయించి, పిదప సుఖోష్ణముగనుండు నావుపాలను శక్తికొలది రోగికిపానము చేయింపవలయును. ఇటుల చేసిన దోషములుబైలువెడలి పిత్తగుల్మము నివర్తించును.

పైత్తికగుల్మతాపమునందు శీతోపచారము.

ధాహేఽభ్యంగో ఘృతైశ్శీతైస్సాజ్యైర్లేపో హిమౌషధైః

స్పర్శస్సరోరుహాం పత్రైః పాత్రైశ్చ ప్రచలజ్జలైః. ౧౯

పైత్తిక గుల్మరోగమునందు సర్వాంగతాపము గలిగియుండిన, శీతవీర్యముగల యౌషధులతో కాచి, చల్లార్చియుండు ఘృతము నభ్యంజనము చేయుట; శీతవీర్యద్రవ్యములనునూరి నేతిలో కలిపి శరీరమునకు లేపనము చేయుట; తామరాకులను శరీరముపైన కప్పుట; ఉదకముచేనిండిన కంచు మొదలగు పాత్రలను శరీరముపైనుంచుట, ఇవి హితకరంబులు.

## పైత్తికగుల్మమునందు రక్తమోక్షణము.

విదాహపూర్వరూపేషు శూలే వహ్నేశ్చ మార్దవే,
బహుశోఽపహరేద్రక్తం పిత్తగుల్మే విశేషతః. ౨౦
ఛిన్నమూలా విదహ్యంతే న గుల్మా యాంతి చ క్షయమ్,
రక్తం హి వ్యమ్లతాం యాతి తచ్చ నాస్తి న చాస్తి రుక్. ౨౧

పిత్తగుల్మరోగమునందు విదాహపూర్వరూపములు శూల అగ్నిమాంద్యముయివి కలిగియుండిన పలుమారు రక్తమోక్షణము చేయవలయును. మఱియుగుల్మములయొక్క మూలమును ఛేదించిన యాగుల్మములు పాకము జెందకనే శమనమునొందును. లోన నుండురక్తము పులిసి గుల్మరోగమునుగలుగజేయును. అట్టిరక్తములేకుండుటవలన గుల్మ శూల లేకుండును.

## గుల్మరోగికి ఘృతపానము.

హృతదోషం పరిమ్లానం జాంగలైస్తర్పితం రసైః,
సమాశ్వస్తం సశేషార్తిం సర్పిరభ్యాసయేత్పునః. ౨౨

దోషము హరింపబడియుండువాడును, బడలికను జెందియుండువాడును నగు గుల్మరోగికి, తృప్తికలుగువరకు జాంగలమాంసరసమిప్పించి, శరీరమునకు కొంచెముశక్తికలిగినపిదప, శేషించియుండు గుల్మరోగము శమించుటకై మరల ఘృతపానము చేయించవలయును.

## పాకోన్ముఖ పిత్తగుల్మచికిత్స.

రక్తపిత్తాతివృద్ధత్వాత్క్రియామనుపలభ్య వా,
గుల్మే పాకోన్ముఖే సర్వా పిత్తవిద్రధివత్క్రియా. ౨౩

రక్తపిత్తము మిక్కుటముగ వృద్ధిజెందియుండుటవలన ప్రయోగింపబడినయౌషధము నిష్ఫలంబగును. అపుడు గుల్మరోగము పాకమునకభిముఖమైనదని తెలిసికొని పిత్తవిద్రధికి చెప్పియుండునటుల చికిత్స చేయవలెను.

### పిత్తగుల్మరోగికి పథ్యవస్తువులు.

శాలిర్గవ్యాజపయసా పటోలీజాంగలం ఘృతమ్,
ధాత్రీ పరూషకం ద్రాక్షా ఖర్జూరం దాడిమం సితా. ౭౪
భోజ్యం పానేఽంబుపలయా బృహత్యాద్యైశ్చ సాధితమ్,

ఆవుపాలు, మేకపాలు, వీనితోడ సంబావుబియ్యపుఅన్నము, పొట్ల, జాంగల మాంసము, నెయ్యి, ఉసిరిక ఈతపండు, ద్రాక్షపండు, ఖర్జూరపండు, దానిమ్మపండు, పంచదార, ఇవి పిత్తగుల్మరోగికి భోజనార్థంబుగనుండును; మఱియు బలామూలముతో గాని, బృహత్యాదిగణద్రవ్యములతో గాని, కాచబడిన ఉదకము పానార్థంబగును.

### శ్లేష్మజగుల్మచికిత్స.

శ్లేష్మజే వామయేత్పూర్వమవమ్యముపవాసయేత్. ౭౫
తిక్తోష్ణకటుసంసర్గ్యా వహ్నిం సంధుక్షయేత్తతః,
హింగ్వాదిభిశ్చ ద్విగుణక్షారహింగ్వమ్లవేతసైః. ౭౬

శ్లేష్మజగుల్మరోగికి తొలుత వమనముచేయించవలయును. ఆ రోగి వమనకర్మ కనర్హుడుగనుండినచో లంఘనముచేయించి; చేదుగ, ఉష్ణముగ, కారముగ, నుండుద్రవ్యములతో పక్వముజేయబడిన గంజి మొదలగు పథ్యములను ఇప్పించవలయును. మఱియు పూర్వముచెప్పిన హింగ్వాదిచూర్ణములో చెప్పియుండు ద్రవ్యములకంటె సర్జక్షారము, ఇంగువ, పుల్లప్రబ్బలి, వీనినిరెండింతలు చేర్చిచేయబడిన హింగ్వాదిచూర్ణము నిప్పించిన అగ్నిదీపనము కలుగును.

### ఉపద్రవయుక్తకఫగుల్మమునందు ఘృతపానము.

నిగూఢం యది వోన్నద్ధం స్తిమితం కఠినం స్థిరమ్,
ఆనాహాదియుతం గుల్మం సంశోధ్య వినయేదను. ౭౭
ఘృతం సక్షారకటుకం పాతవ్యం కఫగుల్మినామ్,

కఫజగుల్మము నిగూఢముగ అనగా—లోపలనే అణగియుండునదిగ లేక పైకి ఉబికియుండునదిగ స్తబ్ధముగకఠినముగ కదలకుండునదిగ కడుపుబ్బరము మొదలగునుపద్రవములతో గూడినదిగనుండిన, దానని చక్కగ శోధించి, శాంతిజెందునటులజేసి, రోగికి సర్జక్షారము, కటుకరోహిణి, వీనిని నేతిలోకలిపి పానము చేయించవలయును.

### కఫజగుల్మమునకు దశమూలఘృతము.

సవ్యోషక్షారలవణం సహింగుబిడదాడిమమ్. ౭౮
కఫగుల్మం జయత్యాశు దశమూలశ్రృతం ఘృతమ్,

త్రికటుకములు, సర్జక్షారము, సముద్రలవణము, ఇంగువ, బిడాలవణము, దానిమ్మపండు, దశమూలములు వీనిని చేర్చి పక్వము చేయబడిన ఘృతమునిప్పించిన కఫజగుల్మము శీఘ్రముగ శమించును.

## భల్లాతకఘృతము.

భల్లాతకానాం ద్విపలం పంచమూలం పలోన్మితమ్. ౭౯
అల్పం తోయాఢకే సాధ్యం పాదశేషేణ తేన చ,
తుల్యం ఘృతం తుల్యపయో విపచేదక్షసమ్మితైః. ౮౦
విడంగహింగుసింధూత్థయావశూకశటీబిడైః,
సదీప్యకాస్నాయష్ట్యాహ్వపథ్యగ్రింధాకణనాగరైః ౮౧
ఏతద్భల్లాతకఘృతం కఫగుల్మహరం పరమ్.
ప్లీహపాండ్వామయశ్వాసగ్రహణీరోగకాసనుత్. ౮౨

జీడివిత్తులు 2 పలములు, హ్రస్వపంచమూలములు దినుసుకు 1 పలము, వీనిని ఆఢకప్రమాణ ముదకములోవైచి పాదావశేషముగకాచి, యా కషాయమునకు సమభాగము ఆవునెయ్యి, దానికిసమభాగము ఆవుపాలుకలిపి; అందులో వాయువిడంగములు, ఇంగువ, సైంధవలవణము, యవక్షారము, కచోరములు, బిడాలవణము, చిత్రమూలము, దుంపరాస్నము, అతిమధురము వస, పిప్పళ్లు, శుంఠి, వీనిని దినుసుకు కర్షప్రమాణము చొప్పున గ్రహించి కల్కముచేసి కలిపి, విధిప్రకారము పక్వము చేయవలయును. ఇదిభల్లాతకఘృత మనబడును. కఫగుల్మము పోగొట్టుటయందు మిగుల శ్రేష్ఠమైనది. ప్లీహము, పాండువు, శ్వాసకాసములు, గ్రహణీరోగము, వీనినిపోగొట్టును.

## గుల్మమునందు స్వేదకర్మ.

తతోఽస్య గుల్మే దేహే చ సమస్తే స్వేదమాచరేత్,

శ్లేష్మజగుల్మమునందు ఘృతపానము చేయించిన పిదప గుల్మమునకును శరీరమునకును స్వేదకర్మను చేయించవలయును.

## గుల్మమునందు స్వేదకర్మగుణము.

సర్వత్ర గుల్మే ప్రథమం స్నేహస్వేదోపపాదితే. ౮౩
యా క్రియా క్రియతే యాతి సా సిద్ధిం న విరూక్షితే,

8 విధములైన గుల్మరోగములయందు తొలుత స్నేహస్వేదకర్మలను చేయించి పిదప చికిత్సజేసినచో నా చికిత్స సఫలంబగును. అటులలేక రూక్షశరీరము గలవానికి చేయించినచికిత్సలు నిష్ఫలంబులగును.

### కఫజగుల్మమున శస్త్రప్రయోగము.

స్నిగ్ధస్విన్నశరీరస్య గుల్మే శైథిల్యమాగతే. ౮౪
యథోక్తాం ఘటికాం న్యస్యేద్గృహీతేఽపనయేచ్చ తామ్,
వస్త్రాంతరం తతః కృత్వా ఛింద్యాద్గుల్మం ప్రమాణవిత్. ౮౫
విమార్గాజపదాదర్శైర్యథాలాభం ప్రపీడయేత్,
ప్రమృజ్యాద్గుల్మమేవైకం న త్వంత్రహృదయం స్పృశేత్. ౮౬

కఫజగుల్మరోగముగలవానికి, స్నేహస్వేదకర్మలను జేయించి, గుల్మము శిథిలతను జెందియుండునపుడు, యంత్రవిధ్యధ్యాయములో చెప్పియుండు ఘటియనుయంత్రమును గుల్మముపై నునిచి యాగుల్మమును పట్టుకొనిన పిమ్మట నాఘటీయంత్రమును దీసి వైచి, గుల్మముపై వస్త్రముచుట్టి; వైద్యశ్రేష్ఠుండు విమార్గము, అజపదము, ఆదర్శము, అను శస్త్రములలో దేనిచేత నైనను అంత్రమున (ప్రేగు)నను, హృదయముననును గాయము తగలకుండునట్లు గుల్మమును మాత్రము ఛేదించి వెలిపరచవలయును.

ఘటీయంత్రమనునది అలాబుయంత్రమును బోలె పండ్రెండంగుళముల నిడువును, పదునెనిమిది యంగుళముల వెడలుపును కల్గినాలుగంగుళములు గుండ్రముగనుండునట్లు చేయబడిన కుండ, ఇయ్యదిగుల్మమును పొడవుగనెత్తుట కనుకూలమైన సన్నివేశము కల్గియుండును. విమార్గమనుశస్త్రము కొయ్యచే శస్త్రాకారముగ జేయబడిన సాధనము. ఇది చర్మములో పని చేయువారియొద్ద నుండును. అజపదమనునది మేక కాలిగిట్టవంటి యాకారంబుతో ఛేదింపననుకూలముగ వాడికల్గియుండును. ఆదర్శమన అద్దపుపెంకు. వీటిలో నొకదానిచేత (పైజెప్పినరీతిగ ఘటీయంత్రముచే పైకెత్తబడిన) గుల్మమును ఛేదింపవలెనని భావము.

### కఫజగుల్మమునకు తిలాదిలేపస్వేదములు.

తిలైరండాతసీబీజసర్షపైః పరిలిప్య చ,
శ్లేష్మగుల్మమయస్పాత్రైస్సుఖోష్ణైస్స్వేదయేత్తతః. ౮౭

నువ్వులు, ఆముదపువిత్తులు, అగిసివిత్తులు, ఆవాలు, అనువానిని నూరి, శ్లేష్మగుల్మముపై లేపనము చేసి, యినుపపాత్రను నిప్పులోకాల్చి దానిచే సుఖోష్ణముగ స్వేదకర్మను (ఒత్తడమును) చేయించవలయును.

### కఫజగుల్మమునందు శోధనము.

ఏవం చ విసృతం స్థానాత్కఫగుల్మం విరేచనైః,
సస్నేహైర్వస్తిభిశ్చైనం శోధయేద్దశమూలకైః. ౮౮

పైచెప్పినటుల స్వేదకర్మను చేయుటచే స్వస్థానమునందుండి చలించి యుండు కఫగుల్మమును స్నేహములతోగూడియుండు, విరేచనౌషధములచేతను, దశమూల కషాయముచేచేయబడిన వస్తికర్మలచేతను, శోధించవలయును.

## మిశ్రకస్నేహము.

పిప్పల్యామలకద్రాక్షా శ్యామాద్యైః పాలికైః పచేత్,
ఏరండతైలహవిషోః ప్రస్థౌ పయసి షడ్గుణే,
సిద్ధో యం మిశ్రకస్నేహో గుల్మినాం స్రంసనం హితమ్,
వృద్ధివిద్రధిశూలేషు వాతవ్యాధిషు చామృతమ్. ౯౦

ఆముదము 1 ప్రస్థము, ఆవునెయ్యి 1 ప్రస్థము, ఈరెంటికి ఆరింతలు ఆవుపాలు, ఇటులవీనినన్నిటి నొకటిగ జేర్చి అందులో పిప్పళ్లు, ఉసిరిక, ద్రాక్షపండు, శ్యామాదిగణద్రవ్యములు, వీనిని దినుసుకొక్కొక్కపలముచొప్పున గ్రహించి కల్కము చేసికలిపి, విధిప్రకారము పాకముజేయవలయును. ఇదియు మిశ్రకస్నేహమనబడును. ఇయ్యది గుల్మరోగులకు మిక్కిలి హితముజేయును. వృద్ధి, విద్రధి, శూల, వాతవ్యాధులు, వీనియందు అమృతమువలె హితకరముగ నుండును.

## గుల్మరోగమున నీలిన్యాదిఘృతపానము.

పిబేద్వా నీలినీసర్పిర్మాత్రయా ద్విపలీకయా,
తథైవ సుకుమారాఖ్యం ఘృతాన్యాదరికాణి వా. ౯౧

కఫజగుల్మమునందు పూర్వముచెప్పియుండు నీలినీఘృతమునుగాని, విద్రధిచికిత్స యందు చెప్పియుండు సుకుమారఘృతమునుగాని, ఉదరచికిత్సితమునందు చెప్పియుండు ఘృతములనుగాని 2 పలములను విరేచనార్థము పానముచేయించవలయును.

## దంతీహరీతకి.

ద్రోణేఽంభసః పచేద్దంత్యాః పలానాం పంచవింశతిమ్,
చిత్రకస్య తథా పథ్యాస్తావతీస్తద్రసే స్రుతే. ౯౨
ద్విప్రస్థే సాధయేత్పూతే క్షిపేద్దంతీసమం గుడమ్,
తైలాత్పలాని చత్వారి త్రివృతాయాశ్చ చూర్ణతః. ౯౩
కణాకర్షౌ తథా శుంఠ్యాస్సిద్ధే లేహే తు శీతలే,
మధు తైలసమం దద్యాచ్చతుర్జాతాచ్చతుర్థికామ్. ౯౪
అతో హరీతకీమేకాం సావలేహపలామదన్,
సుఖం విరిచ్యతే స్నిగ్ధో దోషప్రస్థమనామయః. ౯౫
గుల్మహృద్రోగదుర్నామశోఫానాహగరోదరాన్,

కుష్ఠోత్క్లేశారుచిప్లీహగ్రహణీ విషమజ్వరాన్. ౯౬.
ఘ్నంతి దంతీహరీతక్యః పాండుతాం చ సకామలామ్,

దంతివేళ్లు 25 పలములు, చిత్రమూలము 25 పలములు, కరక్కాయలుఇరువదియైదు, వీనిని ద్రోణప్రమాణ ముదకములోవైచి పాదావశేషముగ కషాయము కాచి, వడియకట్టి, 2 ప్రస్థముల కషాయములో పై 25 కరక్కాయలు, 25 పలములు పాతబెల్లము, 4 పలములు నువ్వులనూనె, 4 పలములు తెగడచూర్ణము, 2 కర్షములు పిప్పళ్లు, 2 కర్షములు శుంఠి, వీనిని చేర్చి లేహపాకవిధిగ పక్వముచేసి దించుకొని చల్లారిన పిదప; దానియందు తేనె 4 పలములు, చతుర్జాతకము 1 పలముచేర్చి, యుంచవలయును. ఇదియ దంతీహరీతకి యనబడును. గుల్మరోగిప్రాతఃకాలము ఈలేహమునందొకపలమును, అంథుండొకకరక్కాయనుగూర్చి సేవించినచో స్నిగ్ధశరీరుడై శరీరమునందలి యొక ప్రస్థపరిమితమైన దోషమును విరేచనము గావించును. ఇత్తెరంగున అనాయాసముగ విరేచనంబై రోగము శమించును. మఱియు నిది గుల్మము, హృద్రోగము, అర్శస్సు, వాపు, కడుపుబ్బరము, విషోపద్రవము, ఉదరరోగము, కుష్ఠువు, ఉత్క్లేశము, అరుచి, ప్లీహము, గ్రహణి, విషమజ్వరము, పాండువు, కామిల, అనునీవ్యాధుల హరింపజేయును.

## గుల్మమున త్రివృద్విరేచనము.

సుధాక్షీరద్రవం చూర్ణం త్రివృతాయాస్సుభావితమ్. ౯౭
కార్షికం మధుసర్పిర్భ్యాం లీఢ్వా సాధు విరిచ్యతే,

గుల్మరోగికి జెముడుపాలలో తెల్లతెగడ చూర్ణమును భావనచేసి, దానిని 1 కర్షప్రమాణము జెముడుపాలలో కలిపి, అందులో తేనె నెయ్యిచేర్చి, నాకించిన చక్కగ విరేచనంబగును.

## గుల్మమునకు కుష్ఠాదిచూర్ణము.

కుష్ఠశ్యామాత్రివృద్దంతీవిజయాక్షారగుగ్గులూన్. ౯౮
గోమూత్రేణ పిబేదేకం తేన గుగ్గులుమేవ వా,

గుల్మరోగికి, చెంగల్వకోష్టు, నల్లతెగడ, దంతి, కరక్కాయలు, సర్జక్షారము, గుగ్గిలము, అనువానినిగాని; లేక గుగ్గిలముకు మాత్రముగాని గోమూత్రములోకలిపి పానముచేయించిన చక్కగ విరేచనగబగును.

## గుల్మమునకు నిరూహవస్తి.

నిరూహాన్ కల్పసిద్ధ్యుక్తాన్ యోజయేద్గుల్మనాశనాన్. ౯౯

కల్పస్థానములో చెప్పియుండు గుల్మహారములైన నిరూహవస్తులను గుల్మరోగికి చేయించవలయును.

### గుల్మమున క్షారకర్మాదులు.

కృతమూలం మహావాస్తుం కఠినం స్తిమితం గురుమ్,
గూఢమాంసం జయేద్గుల్మం క్షారారిష్టాగ్నికర్మభిః. ౧౦౦
ఏకాంతరం ద్వ్యంతరం వా విశ్రమయ్యాథ వా త్ర్యహమ్,
శరీరదోషబలయోర్వర్ధనక్షపణోద్యతః. ౧౦౧

చిరకాలముగ అనువర్తింపుచుండునదిగ, బలిష్ఠముగ, కఠినముగ, స్తబ్ధముగ, పెద్దదిగ, మాంసముచే కప్పబడినదిగనుండు గుల్మమును; శరీరదోషబలాదుల కనుగుణముగ క్షార అరిష్ట అగ్నికర్మలచే చికిత్స జేయవలయును. అట్టిచికిత్స జేయునపుడు 1 లేక 2 లేక 3 దినములు వదలివిశ్రమించి రోగికి శక్తికలిగినపిదప మరల పైక్షారకర్మాదులను చేయవలయును. అట్టిచికిత్సలచే రోగికి శరీరబలము వృద్ధినొంది దోషబలము నానాటి హరించును.

### కఫజగుల్మరోగమున క్షారోపయోగము.

అర్శోశ్మరీగ్రహణ్యుక్తాః క్షారాః యోజ్యాః కఫోల్బణే,

కఫాధిక్యముతోగూడియుండు గుల్మరోగమున అర్శస్సు, అశ్మరి, గ్రహణి ఈరోగములకు చెప్పియుండు క్షారములను ప్రయోగించవలయును.

### దేవదార్వాదిక్షారము.

దేవదారుత్రివృద్దంతీకటుకాపంచకోలకమ్. ౧౦౨
స్వర్జికాయావశూకాఖ్యౌ శ్రేష్ఠాపాఠోపకుంచికాః,
కుష్ఠం సర్పసుగంధాం చ ద్వ్యక్షాంశం పటుపంచకమ్. ౧౦౩
పాలికం చూర్ణితం తైల వసాదధిఘృతాప్లుతమ్,
ఘటస్యాంతః పచేత్పక్వమగ్నివర్ణే ఘటే చ తమ్. ౧౦౪
క్షారం గృహీత్వా తు పేయాజ్యతక్రమద్యాదిభిః పిబేత్,
గుల్మోదావర్తవర్ధ్మార్శోజఠరగ్రహణీక్రిమీన్. ౧౦౫
అపస్మారగరోన్మాదయోనిశుక్రామయాశ్మరీః,
క్షారోఽగదోయం శమయేద్విషం చాఖుభుజంగమమ్. ౧౦౬

దేవదారు, తెగడ, దంతి, కటుకరోహిణి, పంచకోలములు, సర్జక్షారము, యవక్షారము, త్రిఫలములు, చిరుబొద్ది, నల్లజీలకఱ్ఱ, చెంగల్వకోష్టు, సర్పాక్షి, ఇవి దినుసుకు

2 కర్షములు; పంచలవణములు దినుసుకు ఒక్కొక్కపలము; వీనినొకటిగఁజేర్చి చక్కఁగ చూర్ణముచేసి; దంచిని నువ్వులనూనె, క్రొవ్వు, పెరుగు, నెయ్యి, అనువానిలోకలిపి; కుండలోవేసి, పైనిమూతవేసి పొయిమీదపెట్టి, యానుండి యెఱ్ఱగ నిప్పువలె కాలువఱకు పాకముచేసి దించుకొని, యాక్షారమును ఆయాదోషానుగుణముగ ఆవుపాలు, ఆవునెయ్యి ఆవుమజ్జిగ, మద్యము మొదలగువానిలోకలిపి పానముచేయించిన; గుల్మము, ఉదావర్తము, వృద్ధి, అర్శస్సు, ఉదరరోగము, గ్రహణి, క్రిమిరోగము, అపస్మారము, ఉన్మాదము, కృత్రిమవిషము, యోనిరోగము, శుక్రదోషము, అశ్మరీరోగము, యెలుకవిషము, సర్పవిషము, ఇవియన్నియును నివర్తించును.

### క్షారగుణము.

శ్లేష్మాణం మధురం స్నిగ్ధం రసక్షీరఘృతాశినః,
ఛిత్వా భిత్వాశయం క్షారః క్షారత్వాత్ క్షారయత్యధః. ౧౦౭

మాంసరసము, ఆవుపాలు, నెయ్యి, వీనినెల్లపుడు విశేషముగ భుజించువారికి పైక్షారము నిప్పించినచో నది మధురముగ జిగటగనుండు కఫమును ఛేదించి అధోమార్గముగ త్రోసివేయును.

### గుల్మరోగమున ఆసవారిష్టపానము.

మందేఽగ్నావరుచౌ సాత్మ్యైర్మద్యైస్సస్నేహమశ్నతామ్,
యోజయేదాసవారిష్టాన్నిగదాన్మార్గశుద్ధయే. ౧౦౮

గుల్మరోగికి అగ్నిమాంద్యము, అరుచి, గలిగియుండినయెడ సాత్మ్యములగనుండు మద్యములతో, స్నేహయుక్తముగనుండు ఆహారమును భుజించువారికి, స్రోతోమార్గము శుద్ధమగుటకై పాతదిగనుండు ఆసవము, అరిష్టము, అనుమద్యముల నిప్పించవలయును.

### గుల్మరోగమున పథ్యాన్నపానములు.

శాలయష్షష్టికా జీర్ణాః కులత్థా జాంగలం పలమ్,
చిరిబిల్వాగ్నితర్కారీయవానీవరణాంకురాః. ౧౦౯
శిగ్రుస్తరుణబిల్వాని బాలం శుష్కం చ మూలకమ్,
బీజపూరకహింగ్వమ్లవేతసక్షారదాడిమమ్ ౧౧౦
వ్యోషం తక్రం ఘృతం తైలం భక్తం పానం తు వారుణీ,
ధాన్యామ్లం మస్తు తక్రం చ యవానీబిడచూర్ణితమ్. ౧౧౧
పంచమూలశృతం వారి జీర్ణం మార్ద్వీకమేవ వా,

పాతదిగనుండు సంబావుధాన్యము, 60 దినములకు ఫలించెడు ధాన్యము, ఉలవలు, జాంగలదేశజంతువులమాంసము, క్రానుగు, చిత్రమూలము, తక్కిలి, ఉలిమిరి, ధీని

చిగుళ్లు; మునగ, మారేడుపిందెలు, లేతవియు ఎండినవియునైన ముల్లంగి, మాదీఫలము, ఇంగువ, పుల్లప్రబ్బలి, యవక్షారము, దానిమ్మ, త్రికటుకములు, మజ్జిగ, నెయ్యి, నువ్వుల నూనె, అన్నము, వీనిని భోజనముగను; వారుణీయనుమద్యము, పులికడుగు, పెరుగు మీదిమీగడ, ఓమము, బిడాలవణము వీనిచూర్ణము చేర్చబడిన మజ్జిగ, పంచమూల ములలో కాచబడిన యుదకము, పాతదిగనుండు ద్రాక్షమద్యము, అనుపానిని పాన ముగను గుల్మరోగి కిప్పించవలయును.

గుల్మహర సురాపానము.

పిప్పలీపిప్పలీమూలచిత్రకాజాజిసైంధవైః. ౧౧౨
సురా గుల్మం జయత్యాశు జాంగలశ్చ విమిశ్రితః,

పిప్పళ్లు, మోడి, చిత్రమూలము, జీలకఱ్ఱ, సైంధవలవణము, వీనిని సమభాగము లుగ సురయను మద్యములోకలిపి పానముచేయించినను; జాంగలమాంసమునందు పై ద్రవ్యములనుచేర్చి యిప్పించిన; గుల్మము శీఘ్రముగ హరించును.

కఫజగుల్మమున దాహకర్మ.

వమనైర్లంఘనైస్స్వేదైస్సర్పిఃపానైర్విరేచనైః. ౧౧౩
వస్తిక్షారాసవారిష్టగుల్మికాపథ్యభోజనైః,
శ్లైష్మికో బద్ధమూలత్వాద్యది గుల్మో న శామ్యతి. ౧౧౪
తస్య దాహం హృతే రక్తే కుర్యాదంతే శరాదిభిః,

వమనము, లంఘనము స్వేదకర్మలు, ఘృతపానములు, విరేచనములు, వస్తికర్మ, క్షారము, ఆసవము, అరిష్టము అను మద్యపానము, గుల్మరోగమునకుజెప్పిన పథ్యాహార ములు, వీనిని చేయించియు కఫమువలన జనించిన గుల్మరోగము దృఢమూలముగ నుండుటచే శమింపక యుండినచో దానియందు రక్తమోక్షణము చేయించి శరాదులచే దాహకర్మను చేయించవలయును.

గుల్మదాహక్రమము.

అథ గుల్మం సపద్యంతం వాససాంతరితం భిషక్. ౧౧౫
నాభివస్త్యంత్రహృదయం రోమరాజీం చ వర్జయేత్,
నాతిగాఢం పరిమృశేచ్ఛరేణ జ్వలతాఽథవా. ౧౧౬
లోహేనారణికోత్థేన దారుణా తైందుకేన వా,
తతోఽగ్నివేగే శమితే శీతే వ్రణ ఇవ క్రియా. ౧౧౭

సమర్థుడగు వైద్యుడు గుల్మమును వస్త్రముచేమూసి, నాభి, పొత్తికడుపు, ప్రేగులు, హృదయము, నూగారు, వీనినివర్జించి, యెఱ్ఱగకాల్చబడి జ్వలింపుచుండు

బాణముచేగాని, ఇనుముచేగాని, తుమికికట్టెచేగాని, ఆగుల్మమును కాల్చి, నిప్పువేగము శమించిన పిదప, శీతలముగనుండుపట్టు మొదలగువానిచే వ్రణమునకు చెప్పియుండు నటుల చికిత్స చేయవలయును.

## ద్వంద్వదోషగుల్మచికిత్స.

ఆమాన్వయే తు పేయాద్యైస్సంధుక్ష్యాగ్నిం విలంఘితే,
స్వం స్వం కుర్యాత్క్రియం మిశ్రం మిశ్రదోషే చ కాలవిత్.

శ్లేష్మజగుల్మరోగికి అజీర్ణముకలిగియుండినచో పేయాదిమొదలగువానిచే జాఠరాగ్నికి దీపనమును కలుగజేసి, ఆమాదోషమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును. ద్వంద్వదోషమువలన జనించిన గుల్మరోగమునకు ఆయాదోషములకు వేరు వేరుగజెప్పిన చికిత్సలను మిశ్రముగ చేయవలయును.

## రక్తగుల్మచికిత్స.

గతప్రసవకాలాయై నార్యై గుల్మేఽస్రసంభవే,
స్నిగ్ధస్విన్నశరీరాయై దద్యాత్స్నేహవిరేచనమ్.　　　౧౧౯

స్త్రీలకు రక్తదోషమువలనజనించినగుల్మరోగమున గర్భిణీస్త్రీలకు నిర్ణీతమైన ప్రసవ (పదిపండ్రెండు) మాసముల కాలము కడచినపిదప శరీరమునకు స్నేహస్వేదకర్మలను చేయించి, స్నేహవిరేచనము నిప్పించవలయును.

ఇచ్చటనీవిషయము నెరుంగునది:—రక్తగుల్మనిదానమున వాగ్భటాచార్యులు "రక్తగుల్మస్తు స్త్రీయా ఏవతు కేవలమ్...కుక్షిం కరోతి తద్గర్భలింగమావిష్కరోతిచ" అని చెప్పెను. "చిరాత్సశూలస్సమగర్భలిఙ్గః. సరాధిరస్త్రీభవఏవగుల్మో మాసే వ్యతీతేదశమే చికిత్స్యః." అనిమాధవకరుడు చెప్పెను. పైవాక్యములచేత రక్తగుల్మము స్త్రీలకు మాత్రము సంభవించుననియు, అందునది గర్భమునకు చెప్పియుండు లక్షణములన్నిటిని కల్గియుండుననియు, గర్భమునకును గుల్మమునకు భేదము తెలియకుండుటంజేసి, ప్రసవమునకు నియతకాలమైన పదిమాసములు కడచిన పిదప రక్తగుల్మమని నిర్ణయించి చికిత్స జేయవలెననియు తెలియుచున్నయది.

ఈవిషయమును జ్ఞప్తికిదెచ్చుటకై ఈశ్లోకమున మూలకారుడు "గతప్రసవకాలాయై, నార్యై గుల్మేఽస్రసంభవే" అని చికిత్సాయోగ్యకాలమును నిర్దేశించి వాగ్భటాచార్యులు నుడివిరి.

మరియు రక్తగుల్మమునకును గర్భమునకును ప్రాయికముగ లక్షణములు సమాన

ములైనను వైలక్షణ్యము గన్పట్టును. మరియు రక్తగుల్మమున రక్తము వాతముచే విరుద్ధమై గర్భాశయముననే యుండును. పదిమాసములు కడచినపిదప నయ్యది ఘనీభవించియుండును గాన చికిత్సకు సౌకర్యముగ నుండును. ఈయభిప్రాయముచేతనే పదిమాసముల కాలనియమము చికిత్సకు జెప్పబడినది. ఈ విషయమునే "రక్తగుల్మే పురాణత్వం సుఖసాధ్యస్యలక్షణం" అని తంత్రాన్తరమునను కంఠోక్తిగ జెప్పబడినది. మరియు నీవిషయమై మాచే విరచితమగు వాగ్భట నిదానవ్యాఖ్యానమున రక్తగుల్మనిదానమున విశేషముగ విమర్శింపబడియె గాన నట జూచునది.

### రక్తగుల్మమున నువ్వులకషాయము.

తిలక్వాథో ఘృతగుడవ్యోషభార్గీరజో న్వితః,
పానం రక్తభవే గుల్మే నష్టే పుష్పే చ యోషితః. ౧౨౦

రక్తజనిత గుల్మరోగమున నువ్వుల కషాయములో త్రికటుకచూర్ణము, గంటుభారంగిచూర్ణము, బెల్లము, నెయ్యి, వీనినిచేర్చి దానిని పానము చేయించవలయును. మరియు స్త్రీలకు ఆర్తవము నష్టంబైయుండిన నీకషాయమును పానము చేయించవలయును.

### భార్గ్యాదిచూర్ణము.

భార్గీకృష్ణాకరంజత్వగ్గ్రంథికామరదారుజమ్,
చూర్ణం తిలానాంక్వాథేన పీతం గుల్మరుజాపహమ్. ౧౨౧

గంటుభారంగి, పిప్పళ్లు, కానుగుపట్ట, మోడి, దేవదారుపట్ట, వీనిచూర్ణమును నువ్వులకషాయములో కలిపి పానముచేయించిన గుల్మరోగము శమించును.

### పలాశక్షారతైలము.

పలాశక్షారపాత్రే ద్వే ద్వే పాత్రే తైలసర్పిషోః,
గుల్మశైథిల్యజననీం పక్త్వా మాత్రాం ప్రయోజయేత్. ౧౨౨

మోదుగక్షారము 2 ఆఢకములు, నువ్వులనూనె 1 ఆఢకము, ఆవునెయ్యి 1 ఆఢకము, ఉదకము 4 ఆఢకములు, ఇటుల నన్నిటిని యొకటిగచేర్చి తైలపాకవిధిగ పక్వముచేసి మాత్రగా నిప్పించిన గుల్మము శిథిలమై శమించును.

### యోని విరేచనము.

న ప్రభిద్యేత యద్యేవం దద్యాద్యోనివిరేచనమ్,

పైచెప్పిన ప్రకారము చికిత్స జేసియు రక్తగుల్మము పగలకయుండినయెడల యోనివిరేచనమును ప్రయోగించవలయు.

## యోనివిరేచనౌషధయోగములు.

క్షారేణ యుక్తం పలలం సుధాక్షీరేణ వా తతః ౧౨౩
తాభ్యాం వా భావితాం దద్యాద్యోనౌ కటుకమత్స్యకాన్,
వరాహమత్స్యపిత్తాభ్యాం నక్తకాన్వా సుభావితాన్. ౧౨౪
కిణ్వం వా సగుడక్షారం దద్యాద్యోనౌ విశుద్ధయే,
రక్తపిత్తహరం క్షారం లేహయేన్మధుసర్పిషా ౧౨౫
లశునం మదిరాం తీక్ష్ణాం మత్స్యాంశ్చాస్యై ప్రయోజయేత్,
వస్తిం సక్షీరగోమూత్రం సక్షారం దాశమూలికమ్. ౧౨౬

నువ్వులను వేయించి చూర్ణముచేసి, అందులో సర్జక్షారముకలిపి దానినిగాని; బొంతజెముడుపాలలో కలపబడిన పైనువ్వులచూర్ణమునుగాని, సర్జక్షారము, జెముడుపాలు వీనిలో భావనచేయబడినకటుమత్స్యములుగాని; పంది చేప వీనియొక్క పేదు(పిత్తము)లలో భావనచేయబడినకటుమత్స్యములుగాని; బెల్లము క్షారము అనువానితో కిణ్వమును గాని; రక్తగుల్మముగల స్త్రీయొక్క యోనిశుద్ధమగుటకై యోనియందు ప్రయోగించవలయును. మఱియు రక్తపిత్తహరమైన క్షారమును తేనె నెయ్యి వీనిలోకలిపి నాకి చవలయును. వెల్లుల్లి, తీక్ష్ణమద్యము, మత్స్యములు, అనువాని నిప్పించవలయును. కల్పస్థానములో చెప్పియుండు దశమూల వస్త్యౌషధములో పాలు, గోమూత్రము, సర్జక్షారము, వీనినికలిపి వస్తికర్మను చేయించవలయును.

## గుల్మభేదనము.

అవర్తమానే రుధిరే హితం గుల్మప్రభేదనమ్,

రక్తగుల్మరోగమునందు రక్తము బైలువెడలకయుండిన ఆగుల్మమును ఛేదించిన హితముకలుగును.

## రక్తగుల్మమునందు రక్తశమనౌషధనిషేధము.

యమకాభ్యక్తదేహాయాః ప్రవృత్తే సముపేక్షణమ్. ౧౨౭
రసౌదనస్తథాహారః పానం చ తరుణీ సురా,

రక్తజ గుల్మరోగముగల స్త్రీకి రక్తము వెడలుచుండినచో శరీరమునకు యమకస్నేహముచే నభ్యంజనముచేయించి, మాంసరసముతో నాహారము నిప్పించి, సురయను మద్యమును పానముచేయించవలయును. రక్తమునిలుచుటకై చికిత్స చేయంజనదు.

## రక్తాతిప్రవృత్తి చికిత్స.

రుధిరేఽతిప్రవృత్తే తు రక్తపిత్తహరాః క్రియాః. ౧౨౮
కార్యా వాతరుగార్తాయాః స్సర్వా వాతహరాః పునః,
ఆనాహేదావుదావర్తబలాసఘ్న్యశ్చ యథాయథమ్. ౧౨౯

రక్తజగుల్మరోగమున అధికముగ రక్తము బైలువెడలుచుండినచో రక్తపిత్తహరచికిత్సలను జేయవలయును. మఱియు నాస్త్రీకి వాతోపద్రవముకలిగినయెడ వాతహరములైన చికిత్సలనన్నిటిని చేయవలయును. కడుపుబ్బరము మొదలగునవి కలిగియుండిన ఉదావర్తము, కఫరోగము, వీనికి చెప్పియుండు చికిత్సలను ఆయా దోషానుగుణముగ చేయవలయును.

చతుర్దశాధ్యాయము ముగిసెను.

# పంచదశాధ్యాయము.

అవ: గుల్మరోగమునకును ఉదరరోగమునకును తఱుచుగ వాతమే ముఖ్యకారణముగ నుండుటంజేసి గుల్మరోగ చికిత్సితాధ్యాయ నిరూపణానంతరము ఉదరచికిత్సితాధ్యాయము చెప్పబడుచున్నయది.

ఉదరచికిత్సితాధ్యాయ ప్రారంభము.

అథాత ఉదరచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహు రాత్రేయాదయో మహర్షయః.

గుల్మరోగ చికిత్సితాధ్యాయ నిరూపణానంతరము ఉదరరోగములయొక్క చికిత్సలను తెలియపరచునట్టి ఉదరచికిత్సితమను నీయధ్యాయమును వివరించెదము.

ఉదరరోగమునందు విరేచనము.

దోషాతిమాత్రోపచయాత్స్రోతోమార్గనిరోధనాత్,
సంభవత్యుదరం తస్మాన్నిత్యమేనం విరేచయేత్. ౧

దోషములు మిక్కుటముగ వృద్ధిజెంది రసరక్తాదిధాతువులను వహించునట్టి స్రోతస్సులయొక్క ద్వారముల నడ్డగించుటవలన ఉదరరోగము కలుగును. కావున ఉదరరోగికి పలుమారు విరేచనమును కొసంగవలయును.

ఉదరరోగమునందు విరేచనౌషధములు.

పాయయేత్తైలమేరండం సమూత్రం సపయోఽపి వా,
మాసం ద్వౌ వాథ వా గవ్యం మూత్రం మాహిషమేవ వా
పిబేద్గోక్షీరభుక్స్యాద్వా కరభీక్షీరవర్తనః,
దాహానాహాతితృణ్మూర్ఛాపరీతస్తు విశేషతః. 3

ఉదరరోగికి ఆముదములో గోమూత్రమునుగాని, ఆవుపాలనుగాని, కలిపి 1 లేక 2 మాసములు పానము చేయించవలయును. లేక దోషాదుల కనుగుణముగ గోమూత్రమునుగాని, బఱ్ఱెమూత్రమునుగాని, పానము చేయించవలయును. లేక అన్నమును భుజింపజేయనియ్యక ఆవుపాలనుగాని, ఒంటెపాలనుగాని, పానము చేయించవలయును. సర్వాంగతాపము, కడుపుబ్బరము, విశేషముగదప్పి, మూర్ఛ, వీనితోగూడియుండు ఉదరరోగికి ఒంటెపాలను మిక్కుటముగ నిప్పించవలయును.

వాతాదికోదరులకు ఘృతములు.

రూక్షాణాం బహువాతానాం దోషసంశుద్ధికాంక్షిణామ్,
స్నేహనిత్యాని సర్పింషి జఠరఘ్నాని యోజయేత్. ౬

వాతప్రకోపము, రూక్షత ఇవిగలవారును, దోషమును పోగొట్టుకొనుట కిచ్ఛయించువారునగు ఉదరరోగులకు, స్నేహనకారిగను, ఉదరరోగమును హరించునవి నుండుఘృతముల నిప్పించవలయును.

ఉదరరోగికి షట్పలఘృతము.

షట్పలం దశమూలాంబు మస్తు ద్వ్యాఢకసాధితమ్,

దశమూలకషాయము 1 ఆఢకము, పెరుగుమీదిమీగడ 2 ఆఢకములు, ఆవునెయ్యి 1 ప్రస్థము, వీనినొకటిగచేర్చి అందులో పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శుంఠి, యవక్షారము, వీనిని దినుసు కొకపలముచొప్పున గ్రహించి, నూరికలిపి విధిప్రకారము పాకముచేసి, యాఘృతమును ఉదరరోగికి నిప్పించవలయును.

నాగరాదిఘృతము.

నాగరం త్రిపలం ప్రస్థం ఘృతతైలా త్తథాఢకమ్.
మస్తునస్సాధయిత్తైతత్ పిబేత్సర్వోదరాపహామ్,
కఫమారుతసంభూతే గుల్మే చ పరమం హితమ్. ౬

శుంఠి 3 పలములు, ఆవునెయ్యి 1 ప్రస్థము, నువ్వులనూనె 1 ప్రస్థము, పెరుగుమీదిమీగడ 1 ఆఢకము, వీని నొకటిగచేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి యిప్పించిన ఉదరరోగములన్నియు శమించును. ఈ ఘృతము కఫవాత జనితగుల్మ రోగము మిక్కిలి హితముజేయును.

చిత్రమూలఘృతము.

చతుర్గుణే జలే మూత్రే ద్విగుణే చిత్రకాత్పలే,
కల్కే సిద్ధం ఘృతప్రస్థం సక్షారం జఠరీ పిబేత్.

ఉదరరోగికి ఆవునెయ్యి 1 ప్రస్థము, గోమూత్రము రెండుప్రస్థములు, ఉదకము నాలుప్రస్థములు, వీనినొకటిగచేర్చి అందులో ఒక పలము చిత్రమూలము నూరి కల్కముచేసి కలిపి ఘృతపాకవిధిగ పాకముచేసి, యాఘృతములో యవక్షారవ చేర్చి పానముచేయించవలయును.

యవకోలాదిఘృతము.

యవకోలకుళుత్థానాం పంచమూలస్య చాంభసా,
సురాసౌవీరకాభ్యాం చ సిద్ధం వా పాయయేద్ఘృతమ్.

యవలు, రేగు, ఉలవలు, పంచమూలములు, వీనికషాయములు; సుర, కలి ఆవునెయ్యి; వీనిని సమభాగములుగ గ్రహించి విధిప్రకారము పక్వముచేసి యాఘృతమును ఉదరరోగికి పానము చేయించవలయును.

ఉదరరోగమున విరేచనము.

ఏభిస్స్నిగ్ధాయ సంజాతే బలే శాంతే చ మారుతే,
స్రస్తే దోషాశయే దద్యాత్కల్పదృష్టం విరేచనమ్. ౯

పైస్నేహములచేత స్నిగ్ధశరీరుడుగనుండు రోగికి బలముకలిగి, వాతప్రకోపము శాంతమై, దోషాశయమునందు దోషము చలించియుండునపుడు, కల్పస్థానములో చెప్పియుండు విరేచనౌషధము నిప్పించవలయును.

పటోలమూలాదిచూర్ణము.

పటోలమూలం త్రిఫలాం నిశాం వేల్లం చ కార్షికమ్,
కంపిల్లనీలినీకుంభభాగాన్ ద్విత్రిచతుర్గుణాన్. ౧౦
పిబేత్సంచూర్ణ్య మూత్రేణ పేయాం పూర్వం తతో రసైః,
విరిక్తో జాంగలైరద్యాత్తతష్షడ్దివసం పయః. ౧౧
శృతం పిబేద్వ్యోషయుతం పీతమేవం పునఃపునః,
హంతి సర్వోదరాణ్యేతచ్చూర్ణం జాతోదకాన్యపి. ౧౨

చేదుపొట్లవేళ్లు, త్రిఫలములు, పసుపు, వాయువిడంగములు, ఇవి దినుసుకు 1 కర్షము, కంపిల్లము 2 భాగములు, నీలి 3 భాగములు, తెగడ 4 భాగము - ఇటుల వీనినన్నిటి నొకటిగ చేర్చి చూర్ణముచేసి, దానిని గోమూత్రములో కలిపి, ఉదరరోగికి పానముచేయించి, విరేచనమైన పిదప, పేయయను గంజిని త్రాగించి, జాంగల మాంస రసముతో సంబావుబియ్యపు అన్నము మొదలగువానిని భుజింపజేయువలయును. పిదప చక్కగ కాచిన ఆవుపాలలో త్రికటుక చూర్ణముకలిపి 6 దినములు పానముచేయించవలయును. ఇటుల పలుమారు చేయించిన దారుణమైన ఉదరరోగములు, ఉదకోదరము ఇవి హరించును.

గవాక్ష్యాదిచూర్ణము.

గవాక్షీం శంఖినీం దంతీం తిల్వకస్య త్వచం వచామ్,
పిబేత్కర్కంధుమృద్వీకాకోలాంభోమూత్రశీధుభిః. ౧౩

పాపర, కట్లచెట్టు, దంతి, తెల్లలొద్దుగు బెరడు, వస, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి, దానిని రేగుపండ్లు, ద్రాక్ష, రేగు, వీనికషాయము గోమూత్రము మద్యము అనువానిలో దేనిలోనైన కలిపి పానముచేయించవలయును,

నారాయణచూర్ణము.

యవానీహపుషాధాన్యం శతపుష్పోపకుంచికా,
కారవీపిప్పలీమూలమజగంధాశఠీ వచా. ౧౪
చిత్రకాజాజికం వ్యోషం స్వర్ణక్షీరీ ఫలత్రయమ్,
ద్వౌ క్షారౌ పౌష్కరం మూలం కుష్ఠం లవణపంచకమ్. ౧౫
విడంగం చ సమాంశాని దంత్యాభాగత్రయం తథా,
త్రివృద్విశాలే ద్విగుణే సాతలా చ చతుర్గుణా. ౧౬
ఏష నారాయణో నామచూర్ణో రోగగణాపహః,
నైనం ప్రాప్యాభివర్ధంతే రోగా విష్ణుమివాసురాః. ౧౭
తక్రేణోదరిభిః పేయో గుల్మిభిర్బదరాంబునా,
ఆనాహవాతే సురయా వాతరోగే ప్రసన్నయా. ౧౮
దధిమండేన విట్సంగే దాడిమాంభోభిరర్శసైః,
పరికర్తే సవృక్షామ్లైరుష్ణాంబుభిరజీర్ణకే. ౧౯
భగందరే పాండురోగే కాసే శ్వాసే గళగ్రహే,
హృద్రోగే గ్రహణీదోషే కుష్ఠే మందేఽనలే జ్వరే. ౨౦
దంష్ట్రావిషే మూలవిషే సగరే కృత్రిమే విషే,
యథార్హం స్నిగ్ధకోష్ఠేన పేయమేతద్విరేచనమ్. ౨౧

ఓమము, బోడతరము, ధనియాలు, సదాప, పెద్దజీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, మోడి, వాయింట, కచోరములు, వస, చిత్రమూలము, జీలకఱ్ఱ, త్రికటుకములు, స్వర్ణక్షీరి, త్రిఫలములు, సర్జక్షారము, యవక్షారము, పుష్కరమూలము, చంగల్వకోష్ఠు, పంచలవణములు, వాయువిడంగములు ఇవి సమభాగములు; దంతివేళ్లు మూడు భాగములు; తెల్లతెగడ, పెద్దపాపర ఇవి ప్రత్యేకము రెండేసి భాగములు; సంబరేణు నాల్గు భాగములు; ఇటుల వీనినన్నిటిని చేర్చి చక్కగ చూర్ణము జేయవలయును. ఇది నారాయణచూర్ణమనబడును. అనేకరోగములను బోగొట్టును. "విష్ణుదేవుని దర్శనముచే నసురకులము నశించు చందంబున" ఈ చూర్ణమును సేవించుటచే సర్వరోగములు నశించును. దీనిని యుదరరోగమునందు మజ్జిగతోడను; గుల్మరోగమునందు రేగపండ్లరసముతోడను: అనాహవాతమునందు సురయను మద్యముతోడను; వాతరోగమునందు ప్రసన్నయను మద్యముతోడను; మలబంధమునందు పెరుగుమీఁది మీగడతోడను; అర్శోరోగమునందు దానిమ్మపండు రసముతోడను; పరికర్తరోగమునందు చింతపండు తోడను; పానముచేయించవలయును, మఱియు అజీర్ణము, భగందరము, పాండురో

గము, కాసము, శ్వాసము, గళగ్రహము, హృద్రోగము, గ్రహణీరోగము, కుష్ఠువు, అగ్నిమాంద్యము, జ్వరము, జంగమవిషము, మూలవిషము, కృత్రిమవిషము, వీనియందు ఆయారోగానుగుణముగ ఉష్ణోదకములోకలిపి విరేచనార్థము పానము చేయించవలయును.

## హపుషాది చూర్ణము.

హపుషాం కాంచనక్షీరీం త్రిఫలాం నీలినీఫలమ్,
త్రాయంతీం రోహిణీం తిక్తాం సాతలాం త్రివృతాం వచామ్.
సైంధవం కాలలవణం పిప్పలీం చేతి చూర్ణయేత్,
దాడిమత్రిఫలామాంసరసమూత్రసుఖోదకైః. ౧౩
వేయోఽయం సర్వగుల్మేషు ప్లీహ్ని సర్వోదరేషు చ,
శ్విత్రే కుష్ఠేష్వజరకే సదనే విషమేఽనలే. ౧౪
శోఫార్శఃపాండురోగేషు కామలాయాం హలీమకే,
వాతపిత్తకఫాంశ్చాశు విరేకేణ ప్రసాధయేత్. ౧౫

విత్తుబోడతగము, చిరుపాల, త్రిఫలములు, నీలివిత్తులు, కలుక్రానుగు, కటుకరోహిణి, సంబరేణు, తెల్లతెగడ, వస, సైంధవలవణము, కృష్ణలవణము, పిప్పళ్లు, వీనిని సమభాగములుగగ్రహించి, చూర్ణచేయవలయును. దీనిని గుల్మరోగము, ప్లీహవృద్ధి రోగము,ఉదరరోగము, శ్విత్రకుష్ఠువు, అజీర్ణము, అగ్నిమాంద్యము, విషమాగ్ని, వాపు అర్శస్సు, పాండురోగము, కామిల, హలీమకము, ఈ రోగములయందు, దానిమ్మపండు రసము, త్రిఫలరసము, మాంసరసము, గోమూత్రము, ఉష్ణోదకము, అనువానిలోకలిపి పానము చేయించవలయును. మఱియు ఈ చూర్ణమును విరేచనమునకై యిప్పించిన వాతపిత్తకఫములవలన జనించిన రోగములన్నియు కడుశీఘ్రముగ హరించును.

## నీలిన్యాది చూర్ణము.

నీలినీం నిచుళం వ్యోషం క్షారౌ లవణపంచకమ్,
చిత్రకం చ పిబేచ్చూర్ణం సర్పిషోదరగుల్మనుత్. ౧౬

నీలివిత్తులు, నీరుప్రబ్బలి, త్రికటుకములు, సర్జక్షారము, యవక్షారము పంచ లవణములు, చిత్రమూలము, వీనిని సమభాగములుగగ్రహించి చూర్ణముజేసి ఆవు నేతిలోకలిపి పానముచేయించిన గుల్మరోగములు నివర్తించును.

## దుర్బలోదరరోగికి క్షీరపానము.

పూర్వవచ్చ పిబేద్దుగ్ధం క్షామశ్శుద్ధోఽంతరాంతరా,
కారభం గవ్యమాజం వా దద్యాద్దాత్య్రయికే గదే. ౧౭

స్నేహమేవ విరేకార్థే దుర్బలేభ్యో విశేషతః,

కృశించిన శరీరముగల యుదరరోగికి విరేచనమునకిప్పించి, పూర్వము చెప్పి యుండునటుల పటోలమూలాదిద్రవ్యచూర్ణమును చేర్చిన ఒంటెపాలనుగాని, ఆవుపాలనుగాని, మేకపాలనుగాని, పానముచేయించవలయును. జాంగలమాంసరసమును ఇప్పించవలయును. మఱియు ఉదరరోగము దారుణమైయుండినను లేక రోగి దుర్బలుడుగనుండినను విరేచనమునకై స్నేహమునే యిప్పించవలయును.

## హరీతకీ ఘృతము.

హరీతకీసూక్ష్మరజః ప్రస్థయుక్తం ఘృతాఢకమ్. ౨౮
అగ్నౌ విలాప్య మథితం ఖజేన యవపల్లకే,
నిధాపయేత్తతోమాసా దుద్ధృతం గాలితం పచేత్. ౨౯
హరీతకీనాం క్వాథేన దధ్నా చామ్లేన సంయుతమ్,
ఉదరం గరమష్ఠీలామానాహం గుల్మవిద్రధిమ్. ౩౦
హంత్యేతత్కుష్ఠమున్మాదమపస్మారం చ పానతః,

కరక్కాయబెరడును చక్కగచూర్ణముచేసి దానిలో నొక ప్రస్థముగ్రహించి 1 ఆఢకము ఆవునేతిలోకలిపి, నిప్పుమీదబెట్టి కరిగించి, గరిటతో చక్కగ కలియబెట్టి యవధాన్యరాశిలో 1 మాసమువరకు పూడ్చిబెట్టి, పిదప దానినెత్తి వడియగట్టుకొని, అందులో కరక్కాయలకషాయము, పుల్లని ఆవుపెరుగు, వీనిని సమభాగములుగచేర్చి విధిప్రకారము పాకముజేసి యా ఘృతమును పానముచేయించిన, ఉదరరోగము, విషము, అష్ఠీల, కడుపుబ్బరము, గుల్మము, విద్రధి, కుష్ఠువు, ఉన్మాదము, అపస్మారము ఈరోగములన్నియు హరించును.

## స్నుహీక్షీర ఘృతము.

స్నుక్క్షీరయుక్తాద్గోక్షీరాచ్ఛృతశీతాత్ఖజాహతాత్. ౩౧
యజ్జాతమాజ్యం స్నుక్క్షీరసిద్ధం తచ్చ తథాగుణమ్,
క్షీరద్రోణే సుధాక్షీరప్రస్థార్ధేన యుతం దధి. ౩౨
జాతం మథిత్వా తత్సర్పిస్త్రివృత్సిద్ధం చ తద్గుణమ్,
తథా సిద్ధం ఘృతప్రస్థం పయస్యష్టగుణే పిబేత్. ౩౩
స్నుక్క్షీరపలకల్కేన త్రివృతా షట్పలేన చ,

ఆవుపాలలో జెముడుపాలనుచేర్చి చక్కగకాచి చల్లారినపిదప కవ్వముతో చిలికి వెన్నదీసి నెయ్యికాచి; అందులో 4 వ భాగము, జెముడుపాలనుచేర్చి, ఘృత

పాకవిధిగ పక్వముజేసి, పానముచేయించినను, ద్రోణప్రమాణము ఆవుపాలలో నర్ధ ప్రస్థము జెముడుపాలుచేర్చి యది పెరుగైన పిదప దానిని చిలికి వెన్నదీసి నెయ్యికాచి అందులో తెల్లతెగడనుచేర్చి ఘృతపాకవిధిగ పక్వముజేసి యీ ఘృతమునిప్పించినను; పైని చెప్పియుండుప్రకారము వెన్నతీసి కాచిననెయ్యి 1 ప్రస్థమును, 8 దింతల ఆవుపాలలోకలిపి అందులో 1 పలము జెముడుపాలు, 6 పలములు తెల్లతెగడ చూర్ణము చేర్చి రోగదోషబలానుగుణముగ ఉదరరోగికి పానముచేయించినను; ఉదరరోగ గుల్మ రోగాదులు హరించును.

ఘృతపానానంతరము పేయాదిపానము.

ఏషాం చానుపిబేత్పేయాం సరం స్వాదు పయోఽథవా. 3౪
ఘృతే జీర్ణే విరిక్తశ్చ కోష్ణం నాగరసాధితమ్,
పిబేదంబు తతః పేయాం తతో యూషం కుళుత్థజమ్. 3౫

ఉదరరోగికి పైనిజెప్పినఘృతములను పానముచేయించినతోడనే పేయయను గంజినిగాని, మధురముగనుండు మాంసరసమునుగాని, ఆవుపాలనుగాని, పానముచేయించవలయును. మఱియు పైఘృతము జీర్ణమై విరేచనమైన పిదప, శొంఠినిచేర్చి కాచినదిగ సుఖోష్ణముగనుండు నుదకమును, పిదపగంజిని, పిదపఉలవకట్టును, త్రాగించవలయును.

ఘృతపాన క్రమము.

పిబేద్రూక్షస్త్ర్యహం త్వేవం భూయో వా ప్రతిభోజితః,
పునఃపునః పిబేత్సర్పిరానుపూర్వ్యాఽనయైవ చ. 3౬

రూక్షశరీరుడుగనుండు ఉదరరోగికి పైనిచెప్పియుండు ప్రకారము ఘృతమును 3 దినములు, పానముచేయించి పిదప 3 దినములవరకు మాంసరసాదులనుమాత్రము పానము చేయించవలయును. ఈప్రకారము ఉదరరోగికి పలుమారు పానము చేయించవలయును.

ఘృతాన్యేతాని సిద్ధాని విదధ్యాత్కుశలో భిషక్,
గుల్మానాం గరదోషాణాముదరాణాం చ శాంతయే. 3౭

సమర్థుడైన వైద్యుడు గుల్మము, విషదోషము, ఉదరరోగము, ఇవిహరింప జేయుటకై పై వచించినఘృతములను విధిప్రకారము పక్వముజేయించుకొనవలయును.

అనాహాహర ఘృతము.

పీలుకల్కోపసిద్ధం వా ఘృతమానాహభేదనమ్,

త్రైల్వకం నీలినీసర్పిః స్నేహం వా మిశ్రకం పిబేత్. ౩౮

గోగువిత్తుల కల్కముతో పక్వముచేయబడిన ఘృతమునుగాని. త్రైల్వక ఘృతమునుగాని, నీలినీఘృతమునుగాని, మిశ్రకస్నేహమునుగాని, పానముచేయించిన ఉదరరోగికి కడుపుబ్బరము హరించును.

### ఉదరరోగి కాహారము.

హృతదోషః క్రమాదశ్నీ లఘుశాల్యోదనం ప్రతి,

పైనిచెప్పియుండు ఘృతపానములచే ఉదరరోగికి దోషములు హరించిన పిదప, సంబావుబియ్యపు అన్నమును స్వల్పముగ అహారార్థముగ నిప్పించవలయును.

### ఉదరరోగికి హరీతక్యాద్యుపయోగము.

ఉపయుంజీత జఠరీ దోషశేషనివృత్తయే. ౩౯
హారీతకీసహస్రం వా గోమూత్రేణ పయోఽనుపః,
సహస్రం పిప్పలీనాం వా స్నుక్ క్షీరేణ సుభావితమ్. ౪౦
పిప్పలీం వర్ధమానాం వా క్షీరాశీ వా శిలాజతు,
తద్వద్వా గుగ్గులుం క్షీరం తుల్యార్ద్రకరసం తథా. ౪౧

ఉదరరోగముకలవాడు కడుపులో శేషించియుండు దోషములు నివర్తించుటకై వేయి (1000) కరక్కాయలను, గోమూత్రములో పలుమారు భావనజేసి, యా కరక్కాయలను, ఆవుపాల యనుపానముతో భక్షింపవలయును. లేక జెముడుపాలలో పలుమారు భావనజేసిన వేయి (1000) పిప్పళ్లనుగాని, రసాయన ప్రకరణములో జెప్పియుండు వర్ధమాన పిప్పళ్లనుగాని భుజింపవలయును. శుద్ధిజేసిన శిలాజతువునుగాని; గుగ్గిలమునుగాని; భుజించి ఆవుపాలను ఆహారముగ పానముచేయవలయును. లేక ఆవుపాలలో సమభాగముగ అల్లపురసమునుకలిపి పానముచేయవలయును.

### ఉదరరోగమునందు చిత్రకాదికల్కము.

చిత్రకామరదారుభ్యాం కల్కం క్షీరేణ వా పిబేత్,
మాసంయుక్తస్తథాహస్తి పిప్పలీవిశ్వభేషజమ్. ౪౨

ఉదరరోగికి చిత్రమూలము, దేవదారుచెక్క, అనువాని కల్కమునుగాని; ఏనుగుపిప్పళ్లు, శుంఠి, అనువాని కల్కముగాని, ఆవుపాలతోడ నొకమాసము పానముచేయించుచు పథ్యమైన ఆహారమును యిప్పించవలయును.

### విడంగాది కల్కము.

విడంగం చిత్రకో దంతీ చవ్యం వ్యోషం చ తైః పయః,

కల్కైః కోలసమైః పీత్వా ప్రవృద్ధముదరం జయేత్. ౪౩

వాయువిడంగములు, చిత్రమూలము, దంతివేళ్లు, చవ్యము, త్రికటుకములు, వీనిని సమభాగములుగ గ్రహించినూరి, కోలప్రమాణము ఆవుపాలలోకలిపి పానముచేయించిన వృద్ధిజెందియుండు ఉదరరోగము హరించును.

### ఉదరరోగమునందు ఉత్కారికాది.

భోజ్యం భుంజీత వా మాసం స్నుహీక్షీరఘృతాన్వితమ్,
ఉత్కారికాం వా స్నుక్‌క్షీరపీతపథ్యాకణాకృతామ్. ౪౪

ఉదరరోగికి జెముడుపాలతో పక్వముచేయబడిన ఘృతముతోడ అన్నమునుగాని; జెముడుపాలలో భావనచేయబడిన కరకకాయలను పిప్పళ్లనుచేర్చి చేయబడిన ఉత్కారియను భక్ష్యముగాని యొక మాసమువరకును సేవింపవలెను.

### ఉదరరోగికి తైలపానము.

పార్శ్వశూలముపస్తంభం హృద్గ్రహం చ సమీరణః,
యది కుర్యాత్తతస్తైలం బిల్వక్షారాన్వితం పిబేత్. ౪౫
పక్వం వా టింటుకబలా పలాశతిలనాలజైః,
క్షారైః కదళ్యపామార్గ తర్కారీజైః పృథక్కృతైః. ౪౬

ఉదరరోగికి వాతముప్రకోపించి పార్శ్వశూల, స్తబ్ధత్వము, ఱొమ్ముపట్టు, అనునీయుపద్రవములు కలిగినయెడల నువ్వులనూనెలో మారేడు క్షారముకలిపి, పానముచేయించవలయును. లేక దుందిలము, బలామూలము, మోదుగు, నువ్వులపొల్లు అనువాని క్షారముతోగాని; అరటి, ఉత్తరేణు, తక్కలి, అనువానిక్షారముతోగాని; వెవ్వేరుగ పక్వముచేయబడిన నువ్వులనూనెను పానముచేయించవలయును.

### ఉదరరోగమున కేరండతైలము.

కఫే వాతేన పిత్తేవా తాభ్యాం వా ప్యావృతేఽనిలే,
బలినః స్వౌషధం యుక్తం తైలమైరండజం హితమ్. ౪౭

ఉదరరోగికి కఫముగాని, పిత్తముగాని, వాతముతోగూడియుండినను, లేక వాతము పిత్తకఫములతోగూడియుండిన నాయాదోషహరౌషధములతో పక్వముచేయబడిన ఆముదమును పానముచేయించిన హితముకలుగును.

### ఉదరరోగమున దేవదార్వాదిలేపము.

దేవదారుపలాశార్కహస్తిపిప్పలిశిగ్రుకైః,

సాశ్వకర్ణైస్సగోమూత్రైః ప్రదిహ్యాదుదరం బహిః. ౪౮

దేవదారు, మోదుగు, జిల్లేడు, ఏనుగుపిప్పళ్లు, మునగ, ఏపి, వీనిని గోమూత్రముతో నూరి ఉదరరోగియొక్క కడుపు పైభాగమునకు పట్టువేసిన హితముకలుగును.

### ఉదరరోగమున సేచనము.

వృశ్చీకాలీవచాశుంఠీపంచమూలపునర్నవాత్,
వర్షాభూధాన్యకుష్ఠాచ్చ క్వాథైర్మూత్రైశ్చ సేచయేత్. ౪౯

తేలుమణిచెట్టు, వస, శొంఠి, పంచమూలములు, గలిజేరు, పల్లేరు, ధనియాలు, చంగల్వకోష్ఠు, వీనిని సమభాగములుగ గ్రహించి యుదకములోవైచి కషాయముకాచి యాకషాయముచేతను; గోమూత్రముచేతను, ఉదరరోగియొక్క కడుపునకుపైన సేచనము చేయవలయును.

### ఉదరరోగమున సాల్వలాదిస్వేదకర్మ

విరిక్తం మ్లానముదరం స్వేదితం సాల్వలాదిభిః,
వాససా వేష్టయేదేవం వాయుర్నాఽఽధ్మాపయేత్పునః. ౫౦

ఉదరరోగికి విరేచనమై కృశించియుండు ఉదరమునకు సాల్వలాదిస్వేద కర్మను చేయించి దానిని వస్త్రముచే చుట్టవలయును. ఇటులజేసిన వాతము కడుపుబ్బరమును కలుగజేయదు.

### ఉదరరోగమున నిరూహవస్తి.

సువిరిక్తస్య యస్య స్యా దాధ్మానం పునరేవ తమ్,
సుస్నిగ్ధైరమ్లలవణైర్నిరూహైస్సముపాచరేత్. ౫౧

చక్కగవిరేచనమైయుండు ఉదరరోగికి మరల కడుపుబ్బరము కలిగిన స్నేహయుక్తముగ పులుసు ఉప్పు వీనితోగూడినదిగనుండు ద్రవములతో నిరూహవస్తికర్మలను చేయించవలయును.

### ఉదరరోగికి తీక్ష్ణవస్తికర్మ.

సోపస్తంభోఽపి వా వాయురాధ్మాపయతి యం నరమ్,
తీక్ష్ణాస్సక్షారగోమూత్రాశ్శస్యంతే తస్య వస్తయః. ౫౨

కఫాధిక్యముతో గూడియుండు వాతము కడుపుబ్బరమును గలుగజేసిన ఆయుదరరోగికి క్షారము, గోమూత్రము, వీనితోగూడినవిగను, తీక్ష్ణముగనునుండు వస్తికర్మలను చేయించవలయును.

ఇతి సామాన్యతః ప్రోక్తా స్సిద్ధా జఠరిణాం క్రియాః,

ఇటుల ఉదరరోగులకు అనుభవసిద్ధములైన చికిత్సలు సామాన్యముగ చెప్పబడినవి. ఇక వాతాద్యుదరరోగములకు ప్రత్యేకముగ చికిత్సలు చెప్పబడుచున్నవి.

### వాతోదర చికిత్స.

వాతోదరేఽథ బలినం విదార్యాదిశృతం ఘృతమ్. ౫౩
పాయయేత్తు తతస్స్నిగ్ధం స్వేదితాంగం విరేచయేత్,
బహుశస్తైల్వకేనైనం సర్పిషా మిశ్రకేణ వా. ౫౪

వాతమువలన జనించిన ఉదరరోగమునందు ఆరోగి బలిష్ఠుడుగ నుండిన, వానికి విదార్యాదిగణ ద్రవ్యములతో పక్వముచేయబడిన ఘృతమును తొలుత పానముచేయించి; పిదప స్నేహస్వేదకర్మలనుచేయించి; తైల్వకఘృతమునుగాని, మిశ్రకఘృతమునుగాని, విరేచనార్థముగ నొసంగవలయును.

### వాతోదరమున క్షీరపానము.

కృతే సంసర్జనే క్షీరం బలార్థ మవచారయేత్,
ప్రాయోత్క్లేశాన్నివర్తేత బలే లబ్ధే క్రమాత్పయః. ౫౫

పైచెప్పిన ప్రకారము విరేచనౌషధమునిప్పించి చక్కగ విరేచనమైన పిదప, పథ్యాదిక్రమంబులనుచేయించి, రోగికి శరీరబలము కలుగుటకై ఆవుపాలనిప్పించుచుండవలయును. శరీరమునకు కొంచెము బలముకలిగినయెడల కఫము స్వస్థానమునందుండి చలించును. కావున నది చలించుటకు పూర్వమే క్షీరపానమును క్రమముగ నిలుపవలయును.

### వాతోదరమున నిరూహవస్తి.

యూషైః రసైర్వా మందామ్లలవణై రేధితానలమ్,
సోదావర్తం పునస్స్నిగ్ధం స్విన్నమాస్థాపయేత్తతః ౫౬
తీక్ష్ణాధోభాగయుక్తేన దాశమూలికవస్తినా,

ఉదరరోగికి కొంచము పులుసు ఉప్పు వీనితోగూడియుండుమాంసరసములనుగాని, కట్టులనుగాని, ఇప్పించి, జాఠరాగ్నిని జ్వలింపజేయవలయును. ఉదావర్తముతో గూడియుండు ఉదరరోగికి స్నేహస్వేదకర్మలను చేయించి "ద్విపంచమూలత్రివృ" దిత్యాదికల్పములోచెప్పబడియుండు దశమూలవస్తిచే నధోభాగమున తీక్ష్ణమైన నిరూహవస్తిని ప్రయోగించవలయును.

ఉదరరోగమున అనువాసనవస్త్యాదులు.

తిలోరుబూకతైలేన వాతఘ్నామ్లశృతేన చ. ౫౭
స్ఫురణాక్షేపసంధ్యస్థిపార్శ్వపృష్ఠత్రికార్తిషు,
రూక్షం బద్ధశకృద్వాతం దీప్తాగ్నిమనువాసయేత్. ౫౮
అవిరేచ్యస్య శమనా వస్తిక్షీరఘృతాదయః,

రూక్షతకలవాడును, మలము అపానవాతము బంధింపబడినవాడును, అగ్నిదీపనముగలవాడునునైన, ఉదరరోగికి, స్ఫురణవాతము, ఆక్షేపవాతము, సంధులు ఎముకలు పార్శ్వములు వీపు ముడ్డిపూస వీనియందు శూల, యివి కలిగియుండినచో వాతహారములుగ అమ్లరసముగలవిగనుండు ద్రవ్యములతో కాచబడిన నువ్వులనూనెచేతను, ఆముదముచేతను, అనువాసవస్తిని చేయించవలయును. విరేచనకర్మ కనర్హుడైన యుదరరోగికి శమనకరంబులైన వస్తికర్మలు, క్షీరము, ఘృతము, ఆనువానిని ప్రయోగించవలయును.

పిత్తోదర చికిత్స.

బలినం స్వాదుసిద్ధేన పిత్తే సంస్నేహ్య సర్పిషా. ౫౯
శ్యామాత్రిభండీ త్రిఫలావిపక్వేన విరేచయేత్,
సితామధుఘృతాఢ్యేన నిరూహోఽస్య తతో హితః ౬౦
న్యగ్రోధాదికషాయేణ స్నేహవస్తిశ్చ తచ్ఛృతః,

పిత్తోదరరోగముకలవాడు బలవంతుడుగ నుండినచో మధురవర్గ ద్రవ్యములతో పక్వముచేయబడిన ఘృతముచే స్నేహకర్మనుచేయించి; నల్లతెగడ; తెల్లతెగడ, త్రిఫలములు, అనువానితో పక్వముచేయబడిన ఘృతముచే విరేచనము చేయించవలయును. పిదప పంచదార, తేనె, ఆవునెయ్యి, అనునవి అధికముగచేర్చబడిన న్యగ్రోధాది ద్రవ్యకషాయముచే నిరూహవస్తిని; న్యగ్రోధాది ద్రవ్యములతో పక్వముచేయబడిన ఘృతముచే అనువాసనవస్తిని, చేయించిన హితముకలుగును.

పిత్తోదరమున శోధనవస్త్యాదులు.

దుర్బలం త్వనువాస్యాదౌ శోధయేత్క్షీరవస్తిభిః. ౬౧
జాతే త్వగ్నిబలే స్నిగ్ధం భూయో భూయో విరేచయేత్,
క్షీరేణ సత్రివృత్కల్కేనోరుబూకశృతేన తమ్. ౬౨
సాతలాత్రాయమాణాభ్యాం శృతేనారగ్వధేన వా,

సకఫే వా సమూత్రేణ సతిక్తాజ్యేన సానిలే ౬౩
పయసాన్యతమేనైషాం విదార్యాదిశృతేన వా,
భుంజీత జఠరం చాస్య పాయసేనోపనాహయేత్. ౬౪

పిత్తోదరరోగముకలవాఁడు దుర్బలుఁడుగనుండినచో తొలుత వానికి అనువాసన వస్తిని చేయించి, క్షీరవస్తికర్మలచే శుద్ధిచేయవలయును. జాఠరాగ్నికి బలముకలిగిన పిదప, స్నేహకర్మను చేయించి; తెల్లతెగడచూర్ణము, ఆముదము, వీనిని చేర్చి కాచినఆవుపాలచేగాని; సంబరేణు, కలుక్రానుగు, అనువానితో కాచబడిన ఆవుపాలచేగాని; రేలతో కాచబడిన ఆవుపాలతోగాని; విరేచనము చేయించవలయును. పిత్తము కఫయుక్తముగ నుండినచో గోమూత్రముచేర్చబడిన ఆవుపాలను విరేచనార్థ మిప్పించవలయును. పిత్తము వాతసహితముగనుండినయెడల తిక్తకఘృతమును గాని; పైచెప్పిన ఆవుపాలు మొదలగువానిలో దేనినిగాని; విరేచనార్థమిప్పించవలయును. విదార్యాదిగణ ద్రవ్యములను చేర్చి కాచిన ఆవుపాలతో అన్నమును భుజింపజేయవలయును. పాయసముచే ఉదరమునకు ఉపనాహస్వేదమును చేయించవలయును.

### పిత్తోదరమున క్షీరపానవస్త్యాదులు.

పునః క్షీరం పునర్వస్తిం పునరేవ విరేచనమ్,
క్రమేణ ధ్రువమాతిష్ఠన్యతః పిత్తోదరం జయేత్. ౬౫

తొలుత క్షీరపానము, పిదప విరేచనము, యిటుల వీనిని పలుమారు వరుస క్రమముగ చేయించిన పిత్తోదరరోగము హరించును.

### కఫోదరచికిత్స.

వత్సకాదివిపక్వేన కఫే సంస్నేహ్య సర్పిషా,
స్విన్నం స్నుక్క్షీరసిద్ధేన బలవంతం విరేచితమ్. ౬౬
సంసర్జయేత్కటుక్షారయుక్తైరన్నైః కఫాపహైః,

కఫోదరరోగమునందు రోగి బలిష్ఠుఁడుగనుండిన వత్సకాదిగణద్రవ్యములతో పక్వముచేయబడినఘృతముచే స్నేహకర్మను చేయించి, జెముడుపాలతో పక్వము చేయబడిన ఘృతమును విరేచనార్థము పానముచేయించవలయును. చక్కఁగ విరేచనమైనపిదప కారము ఉప్పుగలద్రవ్యములు చేర్చబడినవిగ, కఫహరములుగనుండు పేయాద్యాహారములను భుజింపజేయవలయును.

### కఫోదరరోగమున నిరూహవస్త్యాదులు.

మూత్రత్ర్యూషణతైలాఢ్యో నిరూహోఽస్య తతో హితః ౬౭

ముష్కకాదికషాయేణ స్నేహవస్తిశ్చ తచ్ఛృతః,
భోజనం వ్యోషదుగ్ధేన కౌలుత్థేన రసేన వా. ౬౭

పైచెప్పినప్రకారము కఫోదరరోగికి పథ్యాదులనిప్పించిన పిదప గోమూత్రము, త్రికటుకములు, నువ్వులనూనె, అనునవి అధికముగ చేర్చిన ముష్కకాదిగణద్రవ్యకషాయముచే నిరూహవస్తిని చేయించి, పైకషాయముచేతనే అనువాసనవస్తిని గూడ చేయించి, త్రికటుకములు చేర్చి కాచబడిన ఆవుపాలతోగాని, ఉలవలకట్టుతోగాని, అన్నము నొసంగవలయును.

కఫోదరరోగమున అరిష్టాద్యుపయోగము.

స్తైమిత్యారుచిహృల్లాసైర్మందేఽగ్నౌ మద్యపాయ చ,
దద్యాదరిష్టాన్ క్షారాంశ్చ కఫస్త్యానస్థిరోదరే. ౬౮

స్తైమిత్యము, అరుచి, హృల్లాసము, అనునుపద్రవములచే పీడింపబడియుండువాడు, అగ్నిమాంద్యముగలవాడు, మద్యపానము చేయువాడు, కఫము ఘనీభవించుట వలన ఉదరము కఠినముగనుండువాడు, ఇట్టియుదరరోగులకు అరిష్టమనుమద్యము క్షారములు అనువాని నిప్పించవలయును.

కఫోదరమున హింగ్వాదిక్షారము.

హింగూపకుల్యే త్రిఫలాం దేవదారు నిశాద్వయమ్,
భల్లాతకం శిగ్రుఫలం కటుకాం తిక్తకం వచామ్. ౭౦
శుంఠీం మాద్రీం ఘనం కుష్ఠం సరళం పటుపంచకమ్,
దాహయేజ్జర్జరీకృత్య దధిస్నేహచతుష్కవత్. ౭౧
అంతర్ధూమం తతః క్షారాద్బిడాలపదకం పిబేత్,
మదిరాదధిమండోష్ణజలారిష్టసురాసవైః. ౭౨
ఉదరం గుల్మమష్ఠీలాం తూన్యౌ శోఫం విషూచికామ్,
ప్లీహహృద్రోగగుదజానుదావర్తం చ నాశయేత్. ౭౩

ఇంగువ, పిప్పళ్లు, త్రిఫలములు, దేవదారుపట్ట, పసుపు, మ్రానిపసుపు, జీడివిత్తులు, మునగవిత్తులు, కటుకరోహిణి, పర్పాటకము, వస, శుంఠి, అతివస, తుంగముస్తలు, చెంగల్వకోష్టు, సరళదేవదారుపట్ట, లవణపంచకము, అనువానిని సమభాగములుగ గ్రహించి నలియగొట్టి ఆవుపెరుగు స్నేహచతుష్టయము (అనగా—నువ్వులనూనె, మజ్జ, క్రొవ్వు, నెయ్యి) వీనిలోకలిపి కుండలోపోసి, పైనమూసి, పొయిమీద పెట్టి, కుండ యెఱ్ఱగ కాలువరకు పాకము చేయవలయును. పిదప నాక్షారమును బిడాలపదక

ప్రమాణము గ్రహించి పెరుగుమీదిమీగడ, యుష్ణోదకము, మదిర, అరిష్టము, సుర, ఆసవము, అనుమద్యములు; వీనిలో దేనియందైనను కలిపి పానము చేయించిన; ఉదర రోగము, గుల్మము, అష్ఠీల, తూని, ప్రతూని, వాపు, విషూచిక, ప్లీహము, హృద్రోగము, అర్శస్సు, ఉదావర్తము, ఈరోగములు హరించును.

దుర్బల కఫోదరచికిత్స.

జయేదరిష్టగోమూత్రచూర్ణాయస్కృతిపానతః,
సక్షారతైలపానైశ్చ దుర్బలస్య కఫోదరమ్. ౭౪

దుర్బలుడుగనుండు కఫోదరరోగికి అరిష్టమనుమద్యము, గోమూత్రము, చూర్ణములు, ప్రమేహచికిత్సయందు చెప్పబడియుండు అయస్కృతి, క్షారయుక్తముగనుండు తైలపానము, వీనిచే చికిత్స చేయవలయును

కఫోదరమున ఉపనాహస్వేదము.

ఉపనాహ్యం ససిద్ధార్థకిణ్వైర్బీజైశ్చ మూలకాత్,
కల్కైరుదరస్వేదమభీక్ష్ణం చాత్ర యోజయేత్. ౭౫

దుర్బలుడుగనుండు ఉదరరోగికి తెల్లావాలు, మద్యసాధనద్రవ్యములు, ముల్లంగి విత్తులు, వీనినికల్కము చేసి దానిచేనుదరమున నుపనాహస్వేదమును చేయించవలయును.

సన్నిపాతోదరచికిత్స.

సన్నిపాతోదరే కుర్యాన్నాతిక్షీణబలానలే,
దోషోద్రేకానురోధేన ప్రత్యాఖ్యాయ క్రియామిమామ్. ౭౬
దంతీద్రవంతీఫలజం తైలం పానే చ శస్యతే,

శరీరబల జాఠరాగ్నిబలములు మిక్కుటముగ క్షయింపకుండు సన్నిపాతోదర రోగికి ఆ యా దోషప్రకోపానుగుణముగ నిక చెప్పబోయెడు చికిత్సలను చేయవలయును. చికిత్సచేయుట కారంభించునపుడు ఈరోగము అసాధ్యముగ నున్నదని చికిత్సచేయక యుపేక్షించిన రోగి నిస్సంశయముగ మృతిజెందును. చికిత్సించిన నొకానొకపుడు జీవించినను జీవించు. అని యారోగి బంధువులకుచెప్పి, యా సన్నిపాతోదరరోగికి దంతివేళ్లు, ఎలుకచెవిచెట్టు, అనువాని ఫలములతో పక్వముచేయబడిన తైలమును పానము చేయించవలయును.

సన్నిపాతోదరమున కాకాదన్యాదికల్కము.

క్రియానివృత్తే జఠరే త్రిదోషే తు విశేషతః. ౭౭
దద్యాదాపృచ్ఛ్య తజ్జాతీః పాతుం మద్యేన కల్కితమ్,

మూలం కాకాదనీగుంజాకరవీరకసంభవమ్. ౭౮
పానభోజనసంయుక్తం దద్యాద్వా స్థావరం విషమ్,
యస్మిన్ వా కుపితస్సర్పో విముంచతి ఫలే విషమ్. ౭౯
తేనాస్య దోషసంఘాతః స్థిరో లీనో విమార్గగః,
బహిః ప్రవర్తతే భిన్నో విషేణాశు ప్రమాథినా. ౮౦
తథా వ్రజత్యగదతాం శరీరాంతరమేవ వా,

అసాధ్యముగనుండు సన్నిపాతోదరరోగమునందు విషసంబంధము గల దారుణమైనయౌషధమును ప్రయోగించుచున్నాననియు, దీనిచే రోగి జీవించునో లేక మృతిజెందునో తెలియదనియు, వైద్యుడు రోగియొక్కబంధువులతో చెప్పి; బండిగురివింద, పూసగురివింద, గన్నేరు, వీని వేళ్లనునూరి మద్యములో కలిపి పానముచేయించవలయును. మఱియు పానభోజనములయందు స్థావరవిషమును కలిపి యిప్పించవలయును. లేక సర్పము మిగుల కోపముతో నేపండులో విషముచు గ్రక్కియుంచునో, అట్టి పండునుగాని యిప్పించవలయును. ఇటులజేసిన రసరక్తాదిధాతువులలో జేరి విరుద్ధమార్గమునసంచరించి యట లీనములై స్థిరముగనుండు దోషములు పైవిషములచే భేదింపబడి ఊర్ధ్వముఖముగగాని, అధోముఖముగగాని, బైలువెడలి రోగి స్వస్థశరీరుడుగ నగును. లేక మరణమునుగాని జెందును.

సన్నిపాతోదరరోగమున క్షీరశాకాద్యుపయోగము.

హృతదోషం తు శీతాంబుస్నాతం తం పాయయేత్పయః. ౮౧
పేయాం వా త్రివృతశ్శాకం మండూక్యా వాస్తుకస్య వా,
కాలశాకం యవాఖ్యం వా ఖాదేత్స్వరససాధితమ్. ౮౨
నిరమ్లలవణస్నేహం స్విన్నాస్విన్నమనన్నభుక్,
మాసమేకం తతశ్చైవం తృషితస్స్వరసం పిబేత్. ౮౩
ఏవం వినిర్హృతే శాకైర్దోషే మాసాత్పరం తతః,
దుర్బలాయ ప్రయుంజీత ప్రాణభృత్కారభం పయః. ౮౪

పైచెప్పిన యౌషధములచే ఉదరరోగికి దోషములు నివర్తించినచో, వానికి శీతోదకములో స్నానముచేయించి, ఆవుపాలనుగాని, పేయనుగాని పానముజేయించవలయును. లేక తెగడకూర, మండూకబ్రహ్మి (సరస్వతియాకు)కూర, చక్రవర్తికూర, కాలశాకము, యవశాకము, వీనిని వానివానిరసములో, ఉప్పు, పులుసు, నూనె మొదలగుస్నేహద్రవ్యములు, వీనినిచేర్పక పాకముచేసి, చక్కగనుడికించినదైనను, ఉడికించక

త్తైనను, దానినిమాత్ర మొకమాసమువరకు భుజింపజేయవలయును. అన్నము నిప్పింపం జనదు. దప్పిగలిగినచో పైశాకముల రసమును పానముచేయించవలయును. పైచెప్పిన ప్రకారము తెగడ మొదలగుకూరలను భక్షించుటచే దోషములు బైలువెడలి, శరీరము నందు దుర్బలము కలుగును. కావున నొకమాసమునకు పిదప అట్టి ఉదరరోగికి బలము కలుగుటకై ఒంటెపాలను పానము చేయించవలయును.

## ప్లీహోదరచికిత్స.

ప్లీహోదరే యథాదోషం స్నిగ్ధస్య స్వేదితస్య చ,
సిరాం భుక్తవతో దధ్నా వామబాహౌ విమోక్షయేత్. ౮౫
లబ్ధే బలే చ భూయోఽపి స్నేహపీతం విశోధితమ్,
సముద్రశుక్తిజం క్షారం పయసా పాయయేత్తథా. ౮౬
అమ్లైశ్శృతం బిడకణాచూర్ణాఢ్యం నక్తమాలజమ్,
శోభాంజనస్య వా క్వాథం సైంధవాగ్నికణాన్వితమ్. ౮౭
హింగ్వాదిచూర్ణం క్షారాజ్యం యుంజీత చ యథాబలమ్,

ప్లీహోదరరోగమునందు దోషానుగుణముగ స్నేహస్వేదకర్మలను చేయించి పెరుగన్నమును భుజింపజేసి యెడమ భుజమునందు సిరావేధము చేయించవలయును. మఱియు శరీరమునకు ఔషధమును సహింపదగిన బలముకలిగిన పిదప మరల స్నేహ పానమును చేయించి శరీరము శుద్ధమైనతోడనే సముద్రపు ముత్యపుచిప్పల క్షారమును ఆవుపాలలోకలిపి పానము చేయించవలయును. క్రానుగక్షారమును, పుల్లనిగంజి మొదలగు వానిలోకలిపి చక్కగకాచి, అందులో బిడాలవణము, పిప్పళ్లచూర్ణము, వీనినధికముగ జేర్చి పానము చేయించవలయును. లేక మునగపట్టకషాయములో సైంధవలవణము, చిత్రమూలము, పిప్పళ్లు, వీనిని చేర్చి పానముచేయించవలయును. హింగ్వాదిచూర్ణము, షట్పలాది ఘృతములు, క్షారములు, వీనినిదోషబలానుగుణముగ రోగికిప్పించవలయును.

## ప్లీహోదరమునకు పిప్పల్యాదిచూర్ణము.

పిప్పలీ నాగరం దంతీ సమాంశం ద్విగుణాభయమ్. ౮౮
బిడార్ధాంశయుతం చూర్ణమిదముష్ణాంబునా పిబేత్,

పిప్పళ్లు 1 భాగము, శుంఠి 1 భాగము, దంతి 2 భాగములు, కరక్కాయలు 4 భాగములు, వీనికన్నిటికి అర్ధభాగము బిడాలవణము, వీనినన్నిటిని చేర్చి చక్కగ చూర్ణముచేసి ఉష్ణోదకములోకలిపి పానముచేయించిన ప్లీహోదరము హరించును.

ప్లీహరోగమున విడంగాదిచూర్ణము.

విడంగం చిత్రకం సక్తూన్ సఘృతాన్ సైంధవం వచామ్. ౮౯
దగ్ధ్వా కపాలే పయసా గుల్మప్లీహాపహం పిబేత్,

వాయువిడంగములు, చిత్రమూలము, నేతిలో తడిపిన సక్తువులు, సైంధవలవణము, వస, వీనిని సమభాగములుగ కుండపెంకులో నుంచి భస్మముచేసి, దానిని ఆవుపాలలో కలిపి, పానముచేయించిన; గుల్మము, ప్లీహరోగము, హరించును.

ప్లీహోదరశమనోపాయము.

తైలోన్మిశ్రైర్జ్వదరకపత్రైస్సమ్మర్దితైస్సముపనద్ధః, ౯౦
ముసలేన పీడితోఽనుయాతి ప్లీహా పయోభుజో నాశమ్,

రేగాకులను నువ్వులనూనెలో చేర్చి చక్కగమర్దించి, ఉదరముపై పెట్టి, గుడ్డతో కట్టి, దానిపై రోకలిని మెల్లగ దొర్లించి, ఆవుపాలను పానముచేయించిన, ప్లీహోదర రోగము శమించును.

ప్లీహరోగమునకు ములుమోదుగుకషాయము.

రోహీతకలతాః క్షుణ్ణాః ఖండశస్సాభయా జలే, ౯౧
మూత్రే వా సునుయాత్తత్తు సప్తరాత్రస్థితం పిబేత్,
కామలాప్లీహగుల్మార్శః క్రిమిమేహోదరాపహమ్. ౯౨

ములుమోదుగుతీగెలను తునకలుగచేసి నలియగొట్టి కరక్కాయల కషాయములోగాని గోమూత్రములోగాని యేడు అహోరాత్రములు నానబెట్టి, దానిని పానము చేయించిన కామిల ప్లీహోదరము గుల్మము, అర్శస్సు, క్రిమిరోగము, ప్రమేహము, ఉదరరోగము, ఇవి హరించును.

ప్లీహరోగమున రోహీతకఘృతము.

రోహీతకత్వచః క్షుణ్ణ్వా పలానాం పంచవింశతిమ్,
కోలద్విప్రస్థసంయుక్తం కషాయముపకల్పయేత్. ౯3
పాలికైః పంచకోలైస్తు తైస్సమస్తైశ్చ తుల్యయా,
హరీతకత్వచా పిష్టైర్ఘృతప్రస్థం విపాచయేత్. ౯౪
ప్లీహాభివృద్ధిం శమయత్యేతదాశు ప్రయోజితమ్,

ములుమోదుగుపట్ట 25 పలములు, రేగుపండ్లు 2 ప్రస్థములు, వీనిని యుదకములో వైచి పాదావశేషముగ కషాయము కాచి అందులో పంచకోలములు ప్రత్యేక

మొక్క కపలము వీనికన్నిటికి సమము కరకాయల బెరడు, యిటుల నన్నిటిని చేర్చి నూరి కల్కముచేసి కలిపి 1 ప్రస్థము, ఆవునెయ్యిపోసి ఘృతపాకవిధిగ పక్వముచేయ వలయును. దీని నిప్పించిన ప్లీహరోగము అతిశీఘ్రముగ నివర్తించును.

కఫవాతప్లీహమునందు క్షారతైలము.

కదల్యాస్తిలనాలానాం క్షారేణ క్షురకస్య చ ౯౫
తైలం పక్వం జయేత్పానాత్ప్లీహానం కఫవాతజమ్,

అరటియాకు, నువ్వులదంటు, పినుగుపల్లేరు, వీనిక్షారములను నువ్వులనూనెలో కలిపి విధిప్రకారము పక్వముచేసి పానముచేయించిన కఫవాతమువలన జనించిన ప్లీహరోగము హరించును.

ప్లీహోదరమున అగ్నికర్మ.

అశాంతౌ గుల్మవిధినా యోజయేదగ్నికర్మ చ. ౯౬
అప్రాప్తపిచ్ఛాసలిలే ప్లీహ్ని వాతకఫోల్బణే,

పైనచెప్పిన ప్రకారము చికిత్సజేసినను కఫవాతమువలన జనించిన ప్లీహరోగము శమించకుండినచో గుల్మరోగమునకు చెప్పియుండు విధిప్రకారము అగ్నికర్మను చేయ వలయును.

ప్లీహోదరమున వస్తికర్మాదులు.

పైత్తికే జీవనీయాని సర్పింషి క్షీరవస్తయః. ౯౭
రక్తావసేకస్సంశుద్ధిః క్షీరపానం చ శస్యతే,

పిత్తాధిక్యమువలన జనించిన ప్లీహరోగమునందు జీవనీయగణద్రవ్యములతో పక్వముచేయబడిన ఘృతమును పానముజేయుట క్షీరవస్తికర్మలు, రక్తమోక్షణము, వమనవిరేచనరూపమైన శుద్ధికర్మ, గోక్షీరపానము ఇవి హితకరంబులు.

యకృద్రోగచికిత్స.

యకృతి ప్లీహవత్కర్మ దక్షిణే తు భుజే సిరామ్. ౯౮

యకృద్రోగమునందు ప్లీహరోగమునకుచెప్పియుండు చికిత్సలను చేయవలయును. దక్షిణ భుజమునందుండు సిరను వేధించవలయును.

బద్ధోదరచికిత్స.

స్విన్నాయ బద్ధోదరిణే మూత్రతీక్ష్ణౌషధాన్వితమ్,
సతైలం లవణం దద్యాన్నిరూహం సానువాసనమ్. ౯౯

పరిస్రంసీని చాన్నాని తీక్ష్ణం చాస్మై విరేచనమ్,
ఉదావర్తహరం కర్మ కార్యం యచ్చానిలాపహమ్. ౧౦౦

బద్ధోదరరోగముకలవానికి స్వేదకర్మను చేయించి; గోమూత్రము, తీక్ష్ణౌషధములు, సైంధవలవణము, వీనిని నువ్వులనూనెతో కలిపి నిరూహానువాసన వస్తికర్మలను చేయించవలయును. మఱియు వాతానులోమకరమైన అన్నములను, తీక్ష్ణవిరేచనౌషధములను, ఇప్పించవలయును. ఉదావర్తహరముగ వాతమును పోగొట్టునదిగనుండు చికిత్సలను చేయవలయును.

## ఛిద్రోదర చికిత్స.

ఛిద్రోదరమృతే స్వేదాచ్ఛ్లేష్మోదరవదాచరేత్,
జాతం జాతం జలం స్రావ్యమేవం తద్యాపయేద్భిషక్. ౧౦౧

ఛిద్రోదర రోగమునందు స్వేదకర్మను వర్జించి శ్లేష్మోదరమునకు చెప్పియుండు తక్కిన చికిత్సలనన్నిటిని చేయవలయును. మఱియు నుదరములో జలము వృద్ధిజెంది యుండిన దానిని పలుమారు వెలిపరచుచు చికిత్స చేయవలయును,

## ఉదకోదరచికిత్స.

అపాం దోషహరాణ్యాదౌ యోజయేదుదకోదరే,
మూత్రయుక్తాని తీక్ష్ణాని వివిధక్షారవంతి చ. ౧౦౨
దీపనీయైః కఫఘ్నైశ్చ తమాహారైరుపాచరేత్,

ఉదకోదర రోగమునందు ఉదరమునంగలయుదకమునందలి దోషమును పోగొట్టునవిగ, గోమూత్రసహితముగ, నానావిధక్షారములు చేర్చబడినవిగ, తీక్ష్ణములుగనుండు నౌషధములను తొలుత నిప్పించి; అగ్నిదీపనకారిగ, కఫమును పోగొట్టునవిగనుండు నాహారములను ఇప్పించవలయును.

## ఉదకోదరమున క్షారగుటికలు.

క్షారం ఛాగకరీషాణాం శ్రుతం మూత్రేఽగ్నినా పచేత్. ౧౦౩
ఘనీభవతి తస్మింశ్చ కర్షాంశం చూర్ణితం క్షిపేత్,
పిప్పలీ పిప్పలీమూలం శుంఠీ లవణపంచకమ్. ౧౦౪
నికుంభకుంభత్రిఫలాస్వర్ణక్షీరీవిషాణికాః,
స్వర్జికాక్షారషడ్గ్రంథాసాతలాయవశూకజమ్. ౧౦౫
కోలాభా గుటికాః కృత్వా తతస్సౌవీరకాప్లుతాః,
పిబేదజరకే శోథే ప్రవృద్ధే చోదకోదరే. ౧౦౬

మేకపెంటికలను నిప్పులో కాల్చి యాక్షారమును గోమూత్రములో కలిపి, పొయిమీఁదబెట్టి, పాకము చేయుచు, నది యుడుకుచున్నపుడు; పిప్పళ్లు, మోడి, శుంఠి, లవణపంచకము, నాగదంతి, తెల్లతెగడ, త్రిఫలములు, స్వర్ణక్షీరి, ఒద్ది, సర్జక్షారము, వస, సంబరేణు, యవక్షారము, వీనిని దినుసుకు కర్షప్రమాణము చొప్పున గ్రహించి చూర్ణము చేసి, కలిపి; రేగుపండంత గుటికలు చేసి, దానిని గంజిలో, లేక కలిలో కలిపి, పానము చేయించిన, అజీర్ణము, శోఫ, వృద్ధిజెందియుండు ఉదకోదరరోగము, ఇవి నివర్తించును.

## ఉదకోదరాదులయందు శస్త్రకర్మ.

ఇత్యౌషధైరప్రశమే త్రిషు బద్ధోదరాదిషు,
ప్రయుంజీత భిషక్ఛస్త్రమార్తబంధునృపార్థితః. ౧౦౭

పైచెప్పిన ప్రకారము చికిత్సించియు బద్ధోదర, ఛిద్రోదర, ఉదకోదర, రోగములు నివర్తించకయుండినచో సమర్థుడగు వైద్యుడు రోగియొక్క యిష్టబంధువులు, రాజు, వీరల యనుమతిపడసి శస్త్రకర్మ చేయవలయును.

## ఉదకోదరాదులయందు శస్త్రకర్మక్రమము.

స్నిగ్ధస్విన్నతనోర్నాభేరధో బద్ధక్షతాంత్రయోః,
పాటయేదుదరం ముక్త్వా వామతశ్చతురంగులాత్. ౧౦౮
చతురంగులమానం తు నిష్కాస్యాంత్రాణి తేన చ,
నిరీక్ష్యాపనయేద్వాలమలలేపోపలాదికమ్. ౧౦౯
ఛిద్రే తు శల్యముద్ధృత్య విశోధ్యాంత్రం పరిస్రవమ్,
మర్కోటైర్దంశయేచ్ఛిద్రం తేషు లగ్నేషు చాహరేత్. ౧౧౦
కాయం మూర్ధ్నోఽనుచాంత్రాణి యథాస్థానం నివేశయేత్,
అక్తాని మధుసర్పిర్భ్యామథ సీవ్యేద్బహిర్వ్రణమ్. ౧౧౧
తతః కృష్ణమృదాలిప్య బధ్నీయాద్యష్టిమిశ్రయా,
నివాతస్థః ప్రయోపవృత్తిస్స్నేహద్రోణ్యాం వసేత్తతః ౧౧౨

బద్ధోదరరోగికిని ఛిద్రోదరరోగికిని తొలుత స్నేహస్వేదకర్మలను చేయించి నాభికి క్రింద కడుపును 4 అంగులముల ప్రమాణము వదలి యెడమప్రక్కను 4 అంగులముల ప్రమాణము ఛేదించి, అంత్రములను బైటికి తొలగించి, అందులోనుండు వెండ్రుకలు, మలము, రాయి, మొదలగువానిని బైటికి తీయవలయును. ఛిద్రోదరరోగమునందు శల్యమును బైటికితీసి అంత్రములను కడిగి చిద్రములను గండుచీమలచే, కరపించి బాగుగ కరచుకొనిన పిమ్మట చీమలయొక్క తలలను విడచి తక్కినభాగములను కత్తిరించి బైటికి తీయవలయును.

పిదప అంత్రములను ముందువలె వానివానిస్థానములోనుంచి వానికితేనెను ఆవునెయ్యిని పూసి కుట్టి బైటివ్రణమునకు అతిమధురము, నల్లమన్ను, ఒకటిగచేర్చి నూరి లేపనము చేసి, గుడ్డచేకట్టి, గాలిలేని ప్రదేశములో నొకతొట్టియందు నువ్వులనూనె బోసి, అందులో కూర్చుండబెట్టి, ఆవుపాలను, ఆహారముగ నిప్పించుచుండవలయును.

## ఉదకోదరమునందు శస్త్రకర్మక్రమము.

సజలే జఠరే తైలైరభ్యక్తస్యానిలాపహైః,
స్విన్నస్యోష్ణాంబునాఽఽకక్షముదరే పరివేష్టితే. ౧౧౩
బద్ధచ్ఛిద్రోదరస్థానే విధ్యేదంగుళమాత్రకమ్,
నిధాయ తస్మిన్నాడీం చ స్రావయేదర్ధమంభసః ౧౧౪
అథాస్య నాడీమాకృష్య తైలేన లవణేన చ,
వ్రణమభ్యజ్య బధ్వా చ వేష్టయేద్వాససోదరమ్. ౧౧౫
తృతీయేఽహ్ని చతుర్థే వా యావదాషోడశం దినమ్,
తస్య విశ్రమ్య విశ్రమ్య స్రావయేదల్పశో జలమ్. ౧౧౬
వివేష్టయేద్గాఢతరం జఠరం చ శ్లథాశ్లథమ్,
నిస్సృతే లంఘితః పేయామస్నేహలవణాం పిబేత్. ౧౧౭

జలోదర రోగముగలవానికి ఉదకమునిండియుండు నుదరముపై వాతహరములైన నువ్వులనూనె, ఆవనూనె, ఆముదము, మొదలగునానిని చక్కగ బూసి ఉష్ణోదకముచే స్వేదకర్మనుచేయించి, కడుపుమొదలు చంకలవరకు వస్త్రమునుచుట్టి బద్ధ ఛిద్రోదరరోగములకు చెప్పియుండు స్థానములో నొక యంగుళ ప్రమాణము వేధించి, ఆద్వారములో నాడీయంత్రమునునిచి కడుపులోనుండు జలమును సగము స్రవింపజేసి, పిదప నాడీయంత్రమును తీసివేసి, యావ్రణమునకు లవణముచేర్చబడిన నువ్వులనూనెపూసి, వస్త్రముచేకట్టి, ఉదరమునంతయు వస్త్రముచేచుట్టవలయును. పిదప మూడవదినమునందుగాని,నాల్గవ దినమునందుగాని, రోగి శరీరబలము, దోషము, వీనిననుసరించి 16 దినములలోపల కొంచెముకొంచెముగ ఉదరములోనుండు ఉదకమునునాడీయంత్రముచే బైటికి తీసి ఆయుదరముపై వస్త్రమును మిక్కిలి సడలక మిక్కిలిబిగియక సమస్థితి నుండునట్లు గట్టిగచుట్టవలయును. ఉదకమంతయు బైటికి స్రవించిన పిదప లంఘనముచేయించి, స్నేహలవణములను కొంచెముగ జేర్చి పేయయనుగంజిని కొంచెముగ పానముచేయించవలయును.

"అస్నేహలవణాం" అనుచోట నఞ్ ఈషదర్థకము, కావున కొంచెముస్నేహమును, కొంచెములవణమును చేర్చిన పేయను త్రాగింపవలెనని భావము. అటుజేసిన ఛో మరల జఠరమున నీరూరకయు, వాతము ప్రకోపించకయు నుండును.

### జలోదరమున ఆహారక్రమము.

స్యాత్క్షీరవృత్తిష్షణ్మాసాంస్త్రీన్ పేయాం పయసా పిబేత్,
త్రీంశ్చాన్యాన్ పయసైవాద్యాత్ఫలాహ్వేన రసేన వా. ౧౧౮
అల్పశః స్నేహలవణం జీర్ణం శ్యామాకకోద్రవమ్,
ప్రయతో వత్సరేణైవం విజయేత్తజ్జలోదరమ్. ౧౧౯

పైచెప్పిన ప్రకారము చికిత్సచేసినపిదప, జలోదరరోగికి, ౬ మాసములవరకు ఆవుపాలను, పిదప 3 మాసములవరకు ఆవుపాలతో పక్వముచేయబడిన పేయయను గంజిని, పిదప 3 మాసములవరకు, పాతదిగనుండు చామలు కొఱ్ఱలు అనువాని యన్నమును ఆవుపాలతోగాని మాంసరసముతోగాని స్వల్పస్నేహ లవణములతోడ ఆహారార్థ మిప్పించుచుండవలయును. ఇటుల నొక సంవత్సరమువరకు, పథ్యాహారమును భుజింపజేయుచుండిన జలోదరరోగము నివర్తించును.

### ఉదరరోగమునందు వర్జ్యావర్జ్యాదులు.

వర్జ్యేషు యంత్రితో దిష్టే నాత్యదిష్టే జితేంద్రియః,

ఉదరరోగి వర్జింపదగిన ఆహారవిహారాదులను అవశ్యము వర్జింపవలయును, ఇచట చెప్పియుండు అన్నపానాదులను స్వల్పముగ భుజింపవలయును. చెప్పబడకయుండు అన్నపానాదులను కొంచెమైన అపేక్షింపకూడదు.

### ఉదరరోగమున వాతాదిహరచికిత్స.

సర్వమేవోదరం ప్రాయో దోషసంఘాతజం యతః. ౧౨౦
అతో వాతాదిశమనీ క్రియా సర్వా ప్రశస్యతే,

ఉదరరోగములన్నియును తఱుచుగ వాతాదిత్రిదోషసంబంధమువలన జనించును. కావున అన్నియుదరరోగములయందును, వాతపిత్తకఫహరములైన చికిత్సలనన్నిటిని చేయవలయును.

### ఉదరరోగమున భోజ్యవస్తువులు.

వహ్నిర్మందత్వమాయాతి దోషైః కుక్షౌ ప్రపూరితే. ౧౨౧
తస్మాద్భోజ్యాని భోజ్యాని దీపనాని లఘూని చ,
సపంచమూలాన్యల్పాప్లుపటుస్నేహకటూని చ, ౧౨౨

దోషములు కడుపునందు వృద్ధిజెందినచో జాఠరాగ్ని మందగించును; కాబట్టి ఉదరరోగి అగ్నిదీపనకారిగ లఘువుగ పంచమూలములతో పక్వముచేసి పులుసు, ఉప్పు, ఘృతాది స్నేహములు, కారము, ఇవి కొంచెముగ చేర్చబడిన అన్నాదులను భుజింపవలయును.

ఉదరరోగమున యవాగ్వాదిపానము.

భావితానాం గవాం మూత్రే షష్టికానాం చ తండులైః,
యవాగూం పయసా సిద్ధాం ప్రకామం భోజయేన్నరమ్. ౧౨౩
పిబేదిక్షురసం చాను జఠరాణాం నివృత్తయే,
స్వంస్వం స్థానం వ్రజంత్యేషాం వాతపిత్తకఫాస్తథా. ౧౨౪

అరువది దినములకు ఫలించెడు సంబావుధాన్యమును గోమూత్రములో పలుమారు భావనచేసి, ఆధాన్యపు బియ్యమును, ఆవుపాలలో జేర్చి, పక్వము చేయబడిన గంజిని, ఉదరరోగికి యథేష్టముగ పానముచేయించి, పిదప ఉదరరోగము నివర్తించుటకై చెఱుకురసమును పానము చేయించవలయును. ఇటుల చేసిన ఉదరరోగులకు వాత పిత్తకఫములు తమతమ స్థానమును జెందును.

ఉదరరోగికి పర్జ్యాహారవిహారాదులు.

అత్యర్థోష్ణామ్లలవణం రూక్షం గ్రాహి హిమం గురు,
గుడం తైలకృతం శాకం వారి పానావగాహయోః ౧౨౫
ఆయాసాధ్వదివాస్వప్నయానాని చ పరిత్యజేత్,

మిక్కిలి ఉష్ణముగ పుల్లగ ఉప్పగ రూక్షముగ మలబంధకారిగ శీతముగ గురువుగనుండు వస్తువులు, బెల్లము, నువ్వులనూనెతో పక్వము చేయబడిన శాకములు, స్నానపానములయందుదకము, శ్రమకరములైనపనులు, మార్గముననడుచుట, పగటినిద్ర వాహనములపై నెక్కుట, వీనిని యుదరరోగి వర్జింపవలయును.

ఉదరరోగమునందు తక్రోపయోగము.

నాత్యర్థసాంద్రం మధురం తక్రం పానే ప్రశస్యతే. ౧౨౬
సకణాలవణం వాతే పిత్తే సోషణశర్కరమ్,
యవానీసైంధవాజాజీ మధువ్యోషైః కఫోదరే. ౧౨౭
త్ర్యూషణక్షారలవణైస్సంయుతం నిచయోదరే,
మధుతైలవచాశుంఠీశతాహ్వాకుష్ఠసైంధవైః. ౧౨౮
ప్లీహ్ని బద్ధే తు హపుషా యవానీచవ్యజాజిభిః,
సకృష్ణామాక్షికం ఛిద్రే వ్యోషవత్సలిలోదరే. ౧౨౯

ఉదరరోగికి కొంచెము చిక్కగను తియ్యగనునుండు ఆవుమజ్జిగను పానము చేయించిన హితముకలుగును. వాతోదరరోగమునందు పిప్పళ్లు, సైంధవలవణము, చేర్చబడిన మజ్జిగ; పిత్తోదరరోగమునందు మిరియాలు పంచదార చేర్చబడిన మజ్జిగ; కఫోదరమునందు ఓమము, సైంధవలవణము, జీలకఱ్ఱ, తేనె, త్రికటుకములు చేర్చబడిన

మజ్జిగ; సన్నిపాతోదరమునందు త్రికటుకములు, సర్జక్షారము, సైంధవలవణము చేర్చబడినమజ్జిగ; ప్లీహోదరమునందు తేనె, నువ్వులనూనె, వస, శుంఠి, సదాప, చెంగల్వకోష్టు, సైంధవలవణము, చేర్చబడిన మజ్జిగ; బద్ధోదరమునందు బోడతరము, ఓమము, సైంధవలవణము, జీలకఱ్ఱ చేర్చబడినమజ్జిగ; ఛిద్రోదరమునందు పిప్పళ్లు, తేనె, చేర్చబడిన మజ్జిగ; జలోదరమునందు త్రికటుకములు, చేర్చబడిన మజ్జిగ; ఇవి పానమునందు మిగుల హితకరములు.

గురుత్వారోచకాదులయందు తక్రమునకు ప్రాశస్త్యము.

గౌరవారోచకానాహమందవహ్న్యతిసారిణామ్,
తక్రం వాతకఫార్తానామమృతత్వాయ కల్పతే. ౧౩౦

గురుత్వము, అరోచకము, కడుపుబ్బరము, అగ్నిమాంద్యము, అతిసారము యివి గలవారికిని; వాతకఫములచే పీడింపబడినవారికిని; ఆవుమజ్జిగ అమృతమువలె మిక్కిలి హితమును గలుగజేయును.

ఉదరరోగమున క్షీరతక్రప్రాశస్త్యము.

ప్రయోగాణాం చ సర్వేషామను క్షీరం ప్రయోజయేత్,
స్థైర్యకృత్సర్వధాతూనాం బల్యం దోషానుబంధహృత్,
భేషజాఽపచితాంగానాం క్షీరమేవాఽమృతాయతే ౧౩౧

పై చెప్పిన ఔషధప్రయోగములన్నిటియందును ఆవుపాలు, ఆవుమజ్జిగ, వీనిని అనుపానముగ నిప్పింపవలయును. ఆవుపాలు, ఆవుమజ్జిగ, ఇవి సర్వధాతువులకు ధృఢత్వమును శరీరబలమును కలుగజేయుటయేగాక దోషములను నివర్తింపజేయును. ఔషధసేవనచే కృశించిన శరీరముగలవారికి ఆవుపాలు అమృతమువలె ఆరోగ్యాదులను గలుగజేయును.

పంచదశాధ్యాయము ముగిసెను.

# షోడశాధ్యాయము

---

అవ: పాండురోగము ఉదరరోగమువలెనే సన్నిపాతమువలన జనించును. కావున ఉదరరోగచికిత్సితాధ్యాయ నిరూపణానంతరము పాండురోగచికిత్సితాధ్యాయము చెప్పబడుచున్నయది.

పాండురోగచికిత్సితాధ్యాయప్రారంభము.

సూ. అథాతః పాండురోగచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

ఉదరచికిత్సితాధ్యాయ నిరూపణానంతరము పాండురోగచికిత్సలను తెలియపరచునట్టి పాండురోగచికిత్సితమను నీయధ్యాయమును వివరించెదము.

పాండురోగ సామాన్యచికిత్స.

పాండ్వామయీ పిబేత్సర్పిరాదౌ కల్యాణకాహ్వయమ్,
పంచగవ్యం మహాతిక్తం శృతం వా రగ్వధాదినా. ౧

"పిత్తప్రధానాః కుపితాః" అను నిదానవచనానుసారముగ పాండురోగమునకు పిత్తమే ప్రధానకారణంబుగనుండుటంజేసి తొలుత పిత్తమునకు చికిత్సజేసి, పిదప వాతకఫములకు చికిత్సజేయవలయును. కావున పిత్తము శమించుటకై పాండురోగికి తొలుతకల్యాణకఘృతము, అపస్మారప్రతిషేధాధ్యాయమునందు చెప్పబడియుండు పంచగవ్యఘృతము, కుష్ఠచికిత్సితాధ్యాయమున చెప్పబడియుండు మహాతిక్తక ఘృతము, లేక ఆరగ్వధాదిగణ ద్రవ్యములతో పక్వముచేయబడిన ఘృతము, వీనిని యిప్పించవలయును.

దాడిమాదిఘృతము.

దాడిమాత్కుడవో ధాన్యాత్కుడవార్ధం పలం పలమ్,
చిత్రకాచ్ఛృంగబేరాచ్చ పిప్పల్యర్ధపలం చ తైః. ౨
కల్కైస్త్రైర్వింశతిపలం ఘృతస్య సలిలాఢకే,
సిద్ధం హృత్పాండుగుల్మార్శఃప్లీహవాతకఫార్తినుత్. ౩
దీపనం శ్వాసకాసఘ్నం మూఢవాతానులోమనం,
దుఃఖప్రసవినీనాం చ వంధ్యానాం చ ప్రశస్యతే. ౪

దానిమ్మపండు 1 కుడవము, దనియాలు అర్ధకుడవము, చిత్రమూలము 1 పలము, అల్లము 1 పలము, పిప్పళ్లు అర్ధ పలము, వీనినొకటిగ చేర్చి కల్కము చేసి 20 పలముల ఆవు నేతిలోకలిపి, అందులో 1 ఆఢకము ఉదకముబోసి ఘృతపాకవిధిగ పక్వముచేయ వలయును. దీని నిచ్చిన హృద్రోగము, పాండువు, గుల్మము, అర్శస్సు, ప్లీహము, వాతకఫోపద్రవములు, శ్వాసకాసలు ఇవి నిశ్శేషముగ హరించును. అగ్నిదీపనమును, మూఢవాతమునకు అనులోమగతియును కలుగును. మఱియునీఘృతము కష్టప్రయాసచే ప్రసవించునట్టి స్త్రీలకును, గొడ్రాలికిని, మిక్కిలి మేలుజేయును

## పాండురోగికి వమనాదికర్మలు.

స్నేహితం వామయేత్తీక్ష్ణైః పునస్స్నిగ్ధం చ శోధయేత్,
పయసా మూత్రయుక్తేన బహుశః కేవలేన వా. ౫

పాండురోగికి తొలుత స్నేహకర్మను చేయించి, తీక్ష్ణౌషధములచే వమనము చేయించవలయును. మరలస్నేహకర్మను చేయించి, ఆవుపాలలో గోమూత్రముకలిపిగాని, లేక ఆవుపాలనుమాత్రముగాని, విరేచనమునకై యివ్వించవలయును.

## పాండురోగమున దంతీఫలరసాది పానము.

దంతీఫలరసే కోష్ణే కాశ్మర్యాంజలిమాసుతమ్,
ద్రాక్షాంజలిం వా మృదితం తత్పిబేత్పాండురోగజిత్. ౬
మూత్రేణ పిష్టాం పథ్యాం వా తత్సిద్ధం వా ఫలత్రయమ్,

దంతిరసమును కాచి, అది సుఖోష్ణముగ నుండునపుడు అందులో 1 అంజలి ప్రమాణము పెద్దగుమ్ముడు రసమును కలిపిగాని, లేక 1 అంజలి ప్రమాణము ద్రాక్షపండు పిసికిగాని పానముచేయించినచో పాండురోగము నివర్తించును; లేక కరక్కాయను గోమూత్రముతో నూరి, గోమూత్రములోకలిపి, పానముచేయించినను; లేకగోమూత్రములో త్రిఫలములను చేర్చి చక్కగకాచి పానముచేయించినను; పాండురోగము శమించును.

## పాండురోగమున స్వర్ణక్షీర్యాదియోగము.

స్వర్ణక్షీరీత్రివృచ్ఛ్యామా భద్రదారుమహౌషధమ్. ౭
గోమూత్రాంజలినా పిష్టం శ్రుతం తేనైవ వా పిబేత్,
సాధితం క్షీరమేభిర్వా పిబేద్దోషానులోమనమ్. ౮

స్వర్ణక్షీరి, తెల్లతెగడ, నల్లతెగడ, దేవదారు, శుంఠి, వీనిని సమభాగములుగ గ్రహించి 1 అంజలిప్రమాణము గోమూత్రముతో నూరి, పానముచేయించినను; లేక

పైన్వర్ణక్షీరి మొదలగువానిని గోమూత్రములో కలిపిబాగుగకాచి పానముచేయించినను; లేక పైద్రవ్యములతో కాచబడిన ఆవుపాలను పానముచేయించినను వాతాది దోషముల కనులోమగతి కలుగును.

పాండురోగమున లోహచూర్ణయోగము.

మూత్రే స్థితం వా సప్తాహం పయసాఽయోరజః పిబేత్,
జీర్ణే క్షీరేణ భుంజీత రసేన మధురేణ వా, ౯

లోహచూర్ణమును గోమూత్రములో వైచి 7 దినములు నానబెట్టి, పిదప ఆవుపాలలో కలిపి పాండురోగికి పానముచేయించి యది జీర్ణమైన పిదప ఆవుపాలతోగాని, తియ్యగనుండు మాంసరసముతోగాని, అన్నమును భుజింపజేయవలయును.

పాండురోగికి పథ్యాచూర్ణము

శుద్ధశ్చోభయతో లిహ్యాత్పథ్యాం మధుఘృతద్రుతామ్,

పాండురోగికి వమనవిరేచనములను చేయించి శుద్ధశరీరముగల యారోగికి కరక్కాయలచూర్ణమును తేనె ఆవునెయ్యి వీనిలో కలిపి నాకించవలయును.

విశాలాదిచూర్ణము.

విశాలాం కటుకాం ముస్తాం కుష్ఠం దారు కళింగకః ౧౦
కర్షాంశాద్విపిచుర్మూర్వా కర్షార్ధాంశా ఘుణప్రియా,
పీత్వా తచ్చూర్ణముంభోభిస్సుఖైర్లిహ్యాత్తతో మధు. ౧౧
పాండురోగం జ్వరం దాహం కాసం శ్వాసమరోచకమ్,
గుల్మానాహామవాతాంశ్చ రక్తపిత్తం చ తజ్జయేత్. ౧౨

పెద్దపాపర, కటుకరోహిణి, తుంగముస్తలు, చెంగల్వకోష్టు, దేవదారు, కొడిసెవిత్తులు, ఇవి ప్రత్యేకము కర్షప్రమాణము; చాగ 2 కర్షములు, అతివస అర్ధకర్షము, వీనిని చక్కగచూర్ణముచేసి, సుఖోష్ణముగనుండు నుదకములో కలిపి, పానముచేయించి, తేనెను నాకించిన; పాండురోగము, జ్వరము, సర్వాంగతాపము, కాసము, శ్వాసము, అరోచకము, గుల్మము, కడుపుబ్బరము, ఆమవాతము, రక్తపిత్తము, ఇవి నివర్తించును.

పాండురోగమునకు వాసాదికషాయము

వాసాగుడూచీత్రిఫలాకట్వీభూనింబనింబజః,
క్వాథః క్షౌద్రయుతో హంతి పాండుపిత్తాస్రకామలాః ౧౩

అడ్డసరము, తిప్పతీగె, త్రిఫలములు, కటుకరోహిణి, నేలవేము, వేము, వీనిని సమభాగములుగ గ్రహించి ఉదకములోవైచి, చక్కగకాచి, యాకషాయములో

తేనెకలిపి, పానముచేయించిన; పాండువు, రక్తపిత్తము, కామిల ఈరోగములు హరించును.

### వ్యోషాది చూర్ణము.

వ్యోషాగ్ని వేల్లత్రిఫలా ముస్తైస్తుల్యమయోరజః,
చూర్ణితం తక్రమధ్వాజ్యకోష్ణాంభోభిః ప్రయోజితమ్. ౧౪
కామలాపాండుహృద్రోగకుష్ఠార్శోమేహనాశనమ్,

త్రికటుకములు, చిత్రమూలము, వాయువిడంగములు, త్రిఫలములు, తుంగముస్తలు, ఇవి సమభాగములు; వీనికి సమము లోహచూర్ణము, వీనినన్నిటిని ఒకటిగ చేర్చి చక్కగ చూర్ణముచేసి ఆవుమజ్జిగ, తేనె, ఆవునెయ్యి, ఉష్ణోదకము, అనువానిలోకలిపి పానముచేయించినచో, కామిల, పాండువు, హృద్రోగము, కుష్ఠువు, అర్శస్సు, ప్రమేహము, ఇవి నివర్తించును.

### గుడనాగరాది గుటికలు.

గుడనాగరమండూరతిలాంశాన్సానతస్సమాన్. ౧౫
పిప్పలీద్విగుణాన్దద్యాద్గుటికాం పాండురోగిణే,

బెల్లము, శుంఠి, మండూరము, నువ్వులు, అనునవి సమభాగములు; వీనికన్నిటికిని రెండింతలు పిప్పళ్లు, వీనినొకటిగ చేర్చినూరి గుటికలుచేసి పాండురోగికిప్పించవలయును.

### మండూరవటకములు.

తాప్యం దార్వీత్వచంచవ్యం గ్రంథికం దేవదారు చ. ౧౬
వ్యోషాది నవకం చైతచ్చూర్ణయేద్విగుణం తతః,
మండూరం చాంజననిభం సర్వతోఽష్టగుణేఽథ తత్. ౧౭
పృథగ్విపక్వే గోమూత్రే వటకీకరణక్షమే,
ప్రక్షిప్య వటకాన్ కుర్యాత్తాన్ ఖాదేత్తక్రభోజనః. ౧౮
ఏతే మండూరవటకాః ప్రాణాదాః పాండురోగిణామ్,
కుష్ఠాన్యజరకం శోఫమూరుస్తంభమరోచకమ్. ౧౯
అర్శాంసి కామలాం మేహాన్ ప్లీహానం శమయంతి చ,

స్వర్ణమాక్షికము, మ్రానిపసుపు, బెరడు, చవ్యము, మోడి, దేవదారు, త్రికటుకములు, చిత్రమూలము, వాయువిడంగములు, త్రిఫలములు, తుంగముస్తలు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేయవలయును. పిదప దానికి రెండింతలు కాటుక

వలె మెత్తగపొడిచేయబడిన మండూరచూర్ణమును గ్రహించి; వీనినన్నిటిని 8 దింతల ప్రమాణముగల గోమూత్రములో వైచి చక్కగ పాకముచేసి, గట్టిగనగుసమయములో, పైస్వర్ణమాక్షికాది చూర్ణమును చేర్చి వటకములు చేయవలయును. ఇవియ మండూరవటకము లనబడును. ఇవి పాండురోగులకు ప్రాణమిచ్చును. దీనిని భుజించి అవుమజ్జిగతో అన్నమును భుజింపుచుండిన, కుష్ఠువులు, అజీర్ణము, వాపు, ఊరుస్తంభము, అరోచకము, అర్శస్సు, కామిల, ప్రమేహము, ప్లీహరోగము ఇవి హరించును.

## తాప్యాది చూర్ణము.

తాప్యాద్రిజతురౌప్యాయోమలాః పంచపలాః పృథక్. ౨౦
చిత్రకత్రిఫలావ్యోషవిడంగైః పాలకైస్సహ,
శర్కరాష్టపలోన్మిశ్రాశ్చూర్ణితా మధునా ద్రుతాః. ౨౧
పాండురోగం విషం కాసం యక్ష్మాణం విషమం జ్వరమ్,
కుష్ఠాన్యజరకం మేహం శోఫం శ్వాసమరోచకమ్. ౨౨
విశేషాద్ధంత్యపస్మారం కామలాం గుదజాని చ,

స్వర్ణమాక్షికము, శిలాజతు, వెండికిట్టము, ఇనుపకిట్టము, ఇవి ప్రత్యేకము ఐదేసి పలములు; చిత్రమూలము, త్రిఫలములు, త్రికటుకములు, వాయువిడంగములు, ఇవి దినుసు కొక్కొక్కఫలము; పంచదార 8 పలములు; వీనినొకటిగ జేర్చి చక్కగ చూర్ణముచేసి తేనెలో కలిపిభక్షించిన; పాండురోగము, విషము, కాసము, క్షయరోగము, విషమజ్వరము, కుష్ఠువు, అజీర్ణము, ప్రమేహము, వాపు, శ్వాసము, అరుచి, ఇవి నివర్తించును. మఱియు నీ చూర్ణము అపస్మారము, కామిల, అర్శోరోగము, వీనిని విశేషముగ నివర్తింపజేయును.

## కుటజాదిగుటికలు.

కౌటజత్రిఫలానింబపటోలఘనవాగరైః. ౨౩
భావితాని దశాహాని రసైర్ద్విత్రిగుణాని వా,
శిలాజతుపలాన్యష్టౌ తావతీ సితశర్కరా. ౨౪
త్వక్క్షీరీపిప్పలీధాత్రీకర్కటాఖ్యాః పలోన్మితాః,
నిదిగ్ధ్యాః ఫలమూలాభ్యాం పలం యుక్త్వా త్రిజాతకమ్. ౨౫
మధుత్రిఫలసంయుక్తాన్ కుర్యాదక్షసమాన్ గుడాన్,
దాడిమాంబుపయః పక్షీరసతోయసురాసవాన్. ౨౬
తాన్ భక్షయిత్వాఽనుపిబేన్నిరన్నో భుక్త ఏవ వా,

పాండుకుష్ఠజ్వరప్లీహతమకార్శోభగందరమ్. ౨౭
హృద్రోగమూత్రకృచ్ఛ్రపూతిశుక్రాగ్నిదోషశోషగరోదరమ్,
కాసాసృగ్దరపిత్తాసృక్శోఫగుల్మగళామయాన్. ౨౮
మేహావర్ధ్మభ్రమాన్ హన్త్యస్సర్వదోషహరాశ్శివాః,

కొడిసెపాల, త్రిఫలములు, వేము, పొట్ల, తుంగముస్తలు, శుంఠి, వీనిని దినుసుకు 1 పలముచొప్పున గ్రహించి, 64 పలముల యుదకములోవైచి 8 వ భాగము మిగులునటుల కషాయముకాచి అందులో 10 లేక 20 లేక 30 పర్యాయములు భావన చేసిన శిలాజతు 8 పలములు, పంచదార 8 పలములు, తవాక్షీరి, పిప్పళ్లు, ఉసిరిక అనునవి ప్రత్యేకము ఒక్కొక్కపలము, సమూలముగా నిప్పులోకాల్చినములక 1 పలము, త్రిజాతకములు 1 పలము, తేనె 3 పలములు, యిటుల వీనినన్నిటిని ఒకటిగచేర్చి నూరి తానికాయలంతేసి గుటికలుజేయవలయును. ఆ గుటికలను దోషానుగుణముగ భోజనమునకుముందుగాని, వెనుకగాని, భక్షించి; దానిమ్మపండురసము, ఆవుపాలు, పక్షిమాంసరసము, మంచియుదకము, సురయనుమద్యము, ఆసవమనుమద్యము, అనువానిలో దేనినైననుపానముచేసినచో పాండువు, కుష్ఠువు, జ్వరము, ప్లీహము,తమకము, అర్శస్సు, భగందరము, హృద్రోగము, మూత్రకృచ్ఛ్రము, పూతిశుక్రము, అగ్నిమాంద్యము శోష, విషదోషము, ఉదరరోగము,కాసము, అసృగ్దరము, రక్తపిత్తము, శోఫ, గుల్మము గళరోగము, ప్రమేహము, వృద్ధి, భ్రమము, ఇవి నివర్తించును. మఱియు నీగుటికలు సర్వదోషముల హరించుటయేగాక మిక్కిలి హితమును జేయును.

## ద్రాక్షాదిలేహము.

ద్రాక్షాప్రస్థం కణాప్రస్థం శర్కరార్ధతులాం తథా. ౨౯
ద్విపలం మధుకం శుంఠీ త్వక్ క్షీరీం చ విచూర్ణితం,
ధాత్రీఫలరసే ద్రోణే తత్క్షిప్త్వా లేహవత్పచేత్. ౩౦
శీతాన్మధుప్రస్థయుతాన్ లిహ్యాత్పాణితలం తతః,
హలీమకం పాండురోగం కామలాం చ నియచ్ఛతి. ౩౧

ద్రాక్షపండు 16 పలములు, పిప్పళ్లు 16 పలములు, పంచదార 50 పలములు, అతిమధురము, శుంఠి, తవాక్షీరి, వీని చూర్ణము 2 పలములు; వీనినన్నిటిని ద్రోణప్రమాణముగల ఉసిరికపండురసములోవైచి లేహమువలె పాకముచేసి, చల్లారినపిదప, అందులో 16 పలములు తేనెకలిపి, కర్షప్రమాణము యిచ్చినచో హలీమకము పాండురోగము, కామిల, ఇవి హరించును.

పాండురోగికి పంచమూలోదకము.

కనీయః పంచమూలాంబు శస్యతే పానభోజనే,
పాండూనాం కామలార్తానాం మృద్వీకామలకాద్రసః. 32

హ్రస్వపంచమూలముల కషాయము, ద్రాక్షపండురసము, ఉసిరికపండురసము, ఇవి పాండురోగులకును, కామిలారోగులకును, పానభోజనములయందు దిప్పించిన మేలు కలుగును.

ఇతి సామాన్యతః ప్రోక్తం పాండురోగభిషగ్జితమ్,
వికల్ప్య యోజ్యం విదుషా పృథగ్దోషబలం ప్రతి. 33

ఇటుల పాండురోగమునకు ఔషధములు సామాన్యముగ చెప్పబడినవి. బుద్ధిమంతుడగు వైద్యుడు ప్రత్యేకము వాతాదిదోషమువలన జనించిన పాండురోగములకు ఆయాదోషానుగుణముగ పర్యాలోచించి పైఔషధముల నిప్పించవలయును.

వాతజాది పాండురోగచికిత్స.

స్నేహప్రాయం పవనజే తిక్తశీతం తు పైత్తికే,
శ్లైష్మికే కటురూక్షోష్ణం విమిశ్రం సాన్నిపాతికే. 34

వైద్యుడు వాతజ పాండురోగమునందు ఘృతాదిస్నేహములను; పైత్తిక పాండురోగమునందు చేదుగ శీతముగనుండు నౌషధములను, కఫజపాండురోగమునందు కటువుగ రూక్షముగ ఉష్ణముగనుండు నౌషధములను ఇప్పించవలయును. సన్నిపాతపాండురోగమునందు పైవాతాదులకు చెప్పియుండు ఔషధములను ప్రకోపానుగుణముగ మిశ్రముచేసి యిప్పించవలయును.

మృద్భక్షణజనిత పాండురోగచికిత్స.

మృదం నిర్వాపయేత్కాయాత్తీక్ష్ణైస్సంశోధనైః పురః,
బలాధానాని సర్పింషి శుద్ధే కోష్ఠే తు యోజయేత్. 35

మృద్భక్షణమువలన జనించిన పాండురోగమునకు తొలుత తీక్ష్ణములైన జెముడుపాలు, మొదలగు విరేచనౌషధములచే కడుపులోనుండు మట్టిని బైలుపరచి; కోష్ఠము శుద్ధమైనపిదప, నిక చెప్పబోయెడు బలకరములైన ఘృతముల నిప్పించవలయును.

వ్యోషాదిఘృతము.

వ్యోషబిల్వద్విరజనీత్రిఫలాద్విపునర్నవమ్,
ముస్తాన్యయోరజః పాఠా విడంగం దేవదారు చ. 36
వృశ్చికాలీ చ భార్గీ చ సక్షీరైస్తైశ్శృతం ఘృతమ్,

సర్వాన్ ప్రశమయత్యాశు వికారాన్ మృత్తికాకృతాన్. ౩౭
తద్వత్కేసరయష్ట్యాహ్వ పిప్పలీక్షీరశాడ్వలైః,

త్రికటుకములు, మారేడు, పసుపు, మ్రానిపసుపు, త్రిఫలములు, తెల్లగలిజేరు, గలిజేరు, తుంగముస్తలు, లోహచూర్ణము, చిరుబొద్ది, వాయువిడంగములు, దేవదారు, తేలుమణి, గంటుభారంగి, వీనిని నొకటిగ చేర్చినకల్కము పాతికెభాగము; పాలు 1 భాగము, ఆవునెయ్యి 1 భాగము, నేతికి 4 గింత లుదకము, యిటుల వీనినొకటిగ చేర్చి విధిప్రకారము పక్వముచేసి, యాఘృతమును నిప్పించినచో మట్టిని తినుటవలన జనించిన వికారములన్నియు కడుశీఘ్రముగ నివర్తించును. నాగకేసరములు, అతిమధురము, పిప్పళ్లు, గరికె, ఆవుపాలు, వీనిని చేర్చిపైనిచెప్పిన ప్రకారము పక్వముచేయబడిన ఘృతము మృత్పాండురోగమును పోగొట్టును.

## మన్నిర్హరణౌషధము.

మృద్భక్షణాయ తల్లౌల్యే వితరేద్భావితాం మృదమ్. ౩౮
వేల్లాగ్నినింబప్రసవైః పాఠయా మూర్వయాఽథవా,
మృద్భేదభిన్నదోషానుగమాద్యోజ్యం చ భేషజమ్. ౩౯

మృద్భక్షణమునందిచ్ఛగల పాండురోగికి కడుపులోనుండి యామృత్తికపైలువెడలుటకై వాయువిడంగములు, చిత్రమూలము, వేపపూలు, వీని కషాయములోగాని; చిరుబొద్దికషాయములోగాని; చాగకషాయములోగాని భావనచేయబడిన మృత్తిక నిప్పించవలయును. మఱియు వర్ణరసములచే పలువిధములుగనుండు మట్టిని భక్షించుటవలన జనించిన పాండురోగమునం దాయామృత్తికాదోషమున కనుగుణమైన యౌషధము నిప్పించవలయును.

## కామిలాచికిత్స.

కామలాయాం తు పిత్తఘ్నం పాండురోగావిరోధి యత్,

కామిలారోగమునందు పిత్తహారముగ పాండురోగమునకు విరుద్ధము కాకుండునదిగనుండు నౌషధము నిప్పించవలయును.

## పథ్యాఘృతము.

పథ్యాశతరసే పథ్యావృంతార్ధశతకల్కితః. ౪౦
ప్రస్థస్సిద్ధో ఘృతాద్గుల్మకామలాపాండురోగనుత్,

నూరు కరక్కాయలను ఉదకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి వడియగట్టి అందులో 50 కరక్కాయకాడలను నూరి కల్కముచేసి కలిపి, 1 ప్రస్థము,

ఆవునెయ్యి పోసి విధిప్రకారము పక్వముచేయబడిన ఘృతము నిప్పించిన గుల్మము, కామిల, పాండురోగము, ఇవి హరించును.

కామిలారోగమునందు ఆరగ్వధకల్కాదియోగము.

ఆరగ్వధం రసేనేక్షోర్విదార్యామలకస్య వా. ౪౧
సత్ర్యూషణం బిల్వమాత్రం పాయయేత్కామలాపహమ్,
పిబేన్నికుంభకల్కం వా ద్విగుణం శీతవారిణా. ౪౨
కుంభస్య చూర్ణం సక్షౌద్రం త్రైఫలేన రసేన వా,

రేగుచిగుళ్లు, త్రికటుకములు, వీనిని నూరి నేలగుమ్ముడుగడ్డ రసములోగాని, చెఱకురసములోగాని, ఉసిరికపండురసములోగాని కలిపి, 1 పల ప్రమాణము ఇప్పించినను; 2 పలముల దంతివేళ్లనునూరి శీతోదకములో కలిపిగాని, తెల్లతెగడ చూర్ణమును తేనెలోగాని, త్రిఫలకషాయములోగాని కలిపి; పానముచేయించినను, కామిలారోగము హరించును.

కామిలారోగమున త్రిఫలరసాదులు.

త్రిఫలాయా గుడూచ్యా వా దార్వ్యా నింబస్య వా రసమ్.
ప్రాతః ప్రాతర్మధుయుతం కామలార్తాయ యోజయేత్,

త్రిఫలములరసముగాని, తిప్పతీగెరసమునుగాని, మ్రానిపసుపు రసమునుగాని; వేముదరసమునుగాని, తేనెసహితముగ ప్రతిదినము ప్రాతఃకాలమునందు కామిలారోగికిప్పించవలయును.

కామలాహరమైన అంజనము.

నిశాగైరికధాత్రీభిః కామలాపహమంజనమ్. ౪౪

పసుపు, జేగురుతాయి, ఉసిరిక వీనితో అంజనముచేయించిన కామిలారోగము నివర్తించును.

కఫాధిక కామలారోగచికిత్స.

తిలపిష్టనిభం యస్తు కామలావాన్ సృజేన్మలమ్,
కఫరుద్ధపథం తస్య పిత్తం కఫహరైర్జయేత్. ౪౫

కామిలారోగికి తెలికపిండితో తుల్యముగ మలమువెడలినచో నట్టివానికి పిత్తము కఫముచే నడ్డగింపబడి యున్నదని తెలిసికొని కఫహరౌషధములచే చికిత్స చేయవలెను.

## కఫవాతాధిక కామిలారోగచికిత్స.

రూక్షశీతగురుస్వాదువ్యాయామబలనిగ్రహైః,
కఫస్సమ్మూర్ఛితో వాయుర్యథాపిత్తం బహిః క్షిపేత్. ౪౬
హారిద్రనేత్రమూత్రత్వక్ శ్వేతవర్చాస్తదా నరః,
భవేత్సాటోపవిష్టంభో గురుణా హృదయేన చ. ౪౭
దౌర్బల్యాల్పాగ్నిపార్శ్వార్తి హిధ్మాశ్వాసారుచిజ్వరైః,
క్రమేణాల్పేఽనుషజ్యేత పిత్తే శాఖాసమాశ్రితే. ౪౮
రసైస్తం రూక్షకట్వమ్లైశ్శిఖితిత్తిరిదక్షజైః,
శుష్కమూలకజైర్యూషైః కుళుత్థోత్థైశ్చ భోజయేత్. ౪౯
భృశామ్లతీక్ష్ణకటుకలవణోష్ణం చ శస్యతే,
సబీజపూరకరసం లిహ్యాద్వ్యోషం తథాశయమ్. ౫౦
స్వం పిత్తమేతి తేనాస్య శకృదప్యనురజ్యతే,
వాయుశ్చ యాతి ప్రశమం సహాటోపాద్యుపద్రవైః. ౫౧
నివృత్తోపద్రవస్యాస్య కార్యః కామలికో విధిః,

రూక్షముగ, శీతలముగ, గురువుగ, మధురముగనుండు ఆహారాదులనుభుజించుట; శరీరమునకు ఆయాసమునుబుట్టించు పనులను చేయుట, మలమూత్రవేగముల నడ్డగించుట, ఇవిమొదలగు కారణములచే వాతము ప్రకోపించి కఫముతోగూడి పిత్తమును బైటికి త్రోయును. అపుడు మనుజునికి నేత్రములు, మూత్రము, చర్మము, యివి పసుపువర్ణముగ నగును. మలము తెల్లగనుండును. ప్రేగులఱచుట, మలబంధము, హృదయమునందు గురుత్వము, ఇవికలుగును. మఱియు ఆ పిత్తము స్వల్పముగ హస్తపాదాదుల నాశ్రయించును. అపుడు బలహాని, అగ్నిమాంద్యము, పార్శ్వశూల, ఎక్కిళ్లు, శ్వాసము, అరుచి, జ్వరము, ఇవి క్రమముగ జనించును. అట్టివానికి రూక్షముగను, కారముగను పులుసుగనునుండు నెమలి తిత్తిరిపక్షి కోడి వీనిమాంసరసములతోడను; ఎండిన ముల్లంగి కట్టుతోడను, ఉలవకట్టుతోడను, అన్నము భుజింపజేయవలయును. మఱియు మిక్కిలి పుల్లగ కారముగ ఉప్పగ ఉష్ణముగనుండు అన్నాదులను ఇప్పించవలయును. త్రికటుకచూర్ణమును మాదీఫలరసముతో కలిపి నాకించవలయును. ఇటులజేసిన పిత్తము స్వస్థానమును జేరును. అందువలన మలము స్వభావవర్ణముతో వెడలును. వాతప్రకోపము శమించును. ప్రేగులఱచుట, కడుపుబ్బరము మొదలగునుపద్రవములు నివర్తించును.

పైయుపద్రవములు శమించినపిదప నారోగికి కామిలారోగమునకు చెప్పియుండుచికిత్సలను చేయవలయును.

కుంభకామలాచికిత్స.

గోమూత్రేణ పిబేత్కుంభ కామలాయాం శిలాజతు. ౫౨
మాసం మాక్షికధాతుం వా కిట్టం రూప్యహిరణ్యజమ్,

కుంభకామలారోగమునందు శిలాజిత్తునుగాని, ధాతుమాక్షికమునుగాని, వెండికిట్టమునుగాని, గోమూత్రములోకలిపి 1 మాసము పానము చేయించవలయును.

హాలీమకచికిత్స.

గుడూచీస్వరసక్షీరసాధితేన హాలీమకీ. ౫౩
మహిషీహవిషా స్నిగ్ధః పిబేద్ధాత్రీరసేన తు,
త్రివృతాం తద్విరిక్తోద్యాత్స్వాదుపిత్తానిలాపహమ్. ౫౪
ద్రాక్షాలేహం చ పూర్వోక్తం సర్పీంషి మధురాణి చ,
యాపనాన్ క్షీరవస్తీంశ్చ శీలయేత్సానువాసనాన్. ౫౫
మార్ద్వీకారిష్టయోగాంశ్చ పిబేద్యుక్త్యాఽగ్నివృద్ధయే,
కాసికం వాఽభయాలేహం పిప్పలీమధుకం బలామ్. ౫౬
పయసా చ ప్రయుంజీత యథాదోషం యథాబలమ్,

హాలీమకరోగముగలవానికి ఆవుపాలు, బఱ్ఱెనెయ్యి, వీనిని సమభాగములుగనేకముచేసి, నేతికి 4 గింతలు తిప్పతీగెరసముకలిపి, ఘృతపాకవిధిగపక్వముచేసి, యాఘృతముచే స్నేహకర్మను చేయించి, ఉసిరికపండురసములో తెల్లతెగడ చూర్ణముకలిపి, విరేచనార్థము పానముచేయించవలయును. చక్కగ విరేచనంబైన పిదప, మధురముగ వాతపిత్తహరములుగనుండు ఆహారములను భుజింపజేయవలయును. పూర్వోక్తద్రాక్షాలేహమును, మధురద్రవ్యములతో పక్వముచేయబడిన ఘృతములను ఇప్పించవలయును. బలకరముగనుండు క్షీరవస్తికర్మలను అనువాసన వస్తికర్మలను పలుమారు చేయుచుండవలెను. జాఠరాగ్ని వృద్ధిజెందుటకై ద్రాక్షమద్యమును అరిష్టమను మద్యమును తగినటుల పానముచేయించవలయును. కాసచికిత్సలోచెప్పియుండు అభయాలేహమును భక్షింపజేయుటయేగాక పిప్పళ్లు అతిమధురమును చిట్టాముట్టిని ఆవుపాలతోడ శరీరబలదోషాదుల కనుగుణముగ నిప్పించవలయును.

పాండురోగేషు కుశలః శోఫోక్తం చ క్రియాక్రమమ్. ౫౭

బుద్ధిమంతుడగు వైద్యుడు పాండురోగములయందుకూడ శోఫరోగమునకు చెప్పియుండు చికిత్సలనే చేయువలయును.

షోడశాధ్యాయము ముగిసెను.

# సప్తదశాధ్యాయము.

అవ: "తేషాం పూర్వముపద్రవాః, శోఫప్రధానాః కథితాస్స ఏవాతో నిగద్యతే." అనునిదాన వచనప్రకారముశ్వయథురోగము పాండురోగోపద్రవములయందు మొదటిదిగ నుండుటంజేసి, పాండురోగ చికిత్సితాధ్యాయ నిరూపణానంతరము శ్వయథు చికిత్సితాధ్యాయము చెప్పబడుచున్నయది.

## శ్వయథుచికిత్సితాధ్యాయప్రారంభము.

సూ. అథాతశ్శ్వయథుచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః

పాండురోగ చికిత్సితాధ్యాయ నిరూపణానంతరము శోఫరోగచికిత్సలను తెలియపరచునట్టి శ్వయథు చికిత్సితమను నీయధ్యాయమును వివరించెదము. శ్వయథు అనగా—వాపు.

## శ్వయథు చికిత్సాక్రమము.

సర్వత్ర సర్వాంగసరే దోషజే శ్వయథౌ పురా,
సామే విశోషితో భుక్త్వా లఘుకోష్ణాంభసా పిబేత్. ౧
నాగరాతివిషాదారువిడంగేంద్రయవోషణమ్,
అథవా విజయాశుంఠీదేవదారుపునర్నవమ్. ౨
నవాయసం వా దోషాఢ్యశ్శుద్ధ్యై మూత్రహరీతకీః,
వరాక్వాథేన కటుకా కుంభాయస్త్ర్యూషణాని వా. ౩
అథవా గుగ్గులుం తద్వజ్జతు వా శైలసంభవమ్,

వాతాదిదోషములవలన జనించినదియు, సర్వాంగములయందు వ్యాపించియుండునదియునైన శ్వయథు రోగమునందు, ఆమముతోగూడియుండు శ్వయథురోగమునందును, రోగికి లంఘనము చేయించి, లఘువైన ఆహారమును భుజింపజేసి, శుంఠి అతివస, దేవదారుచెక్క, వాయువిడంగములు, కొడిసెవిత్తులు, మిరియాలు, వీనిచూర్ణమునుగాని; లేక కరక్కాయ, శుంఠి, దేవదారు, గలిజేరు, వీనిచూర్ణమునుగాని; ఉష్ణోదకములోకలిపి పానముచేయించవలయును. దోషమధికముగ నుండినయెడల పాండు

రోగచికిత్సలో చెప్పియుండు నవాయసచూర్ణమును ఇప్పించవలయును. రోధ్రము శుద్ధమగుటకై గోమూత్రములో నానబెట్టిన కరక్కాయలను ప్రతిదినమున సేవింపుచుండవలయును. మఱియు కటుకరోహిణి, తెల్లతెగడ, లోహచూర్ణము, త్రికటుకములు, వీనినిగాని, గుగ్గిలమునుగాని; శిలాజతువునుగాని; త్రిఫలకషాయముతో పానము జేయింపవలయును.

అగ్నిమాంద్యముగల శ్వయథురోగికి గుడాభయాది

మందాగ్నిశ్శూలయేదామగురుభిన్నవిబద్ధవిట్. ౪
తక్రం సౌవర్చలవ్యోషక్షౌద్రయుక్తం గుడాభయామ్,
తక్రానుపానామథవా తద్వద్వా గుడనాగరమ్. ౫

అగ్నిమాంద్యము, అజీర్ణము, గురుత్వము, మలబంధము, ఈ యుపద్రవములుగల శ్వయథురోగికి సౌవర్చలవణము, త్రికటుకములు, తేనె, వీనిని ఆవుమజ్జిగలోకలిపి పానము చేయించుచుండవలయును. లేక బెల్లముతోడ కరక్కాయనుగాని; శుంఠినిగాని; భుజింపజేసి ఆవుమజ్జిగను పానము చేయించవలయును.

శ్వయథురోగమున ఆర్ద్రికప్రయోగము.

ఆర్ద్రికం వా సమగుడం ప్రకుంచార్ధవివర్ధితమ్,
పరం పంచపలం మాసం యూషక్షీరరసాశనః. ౬
గుల్మోదరార్శశ్శ్వయథు ప్రమేహాన్
శ్వాసప్రతిశ్యాలసకావిపాకాన్,
సకామలాశోషమనోవికారాన్
కాసం కఫం చైవ జయేత్ప్రయోగః. ౭

అల్లము, బెల్లము, వీనిని సమముగచేర్చి ప్రతిదినము అర పలముచొప్పున 5 పలములవరకు హెచ్చింపుచుభుజింపజేసి మరల అర పలముచొప్పున తగ్గింపుచు భుజింపజేయవలయును. ఈ యోగమును దోషబలానుగుణముగ 1 మాసమువరకు, ప్రయోగించి; కట్టులు, ఆవుపాలు, మాంసరసము, వీనితో అన్నము భుజింపజేయుచుండిన; గుల్మము, ఉదరరోగము, అర్శస్సు, వాపు, ప్రమేహము, శ్వాసము, పీనస, అలసకము, అజీర్ణము, కామిల, శోష, భ్రమ, కాసము, కఫము, ఇవియన్నియు హరించును.

ఆర్ద్రిక ఘృతము.

ఘృతమార్ద్రికనాగరస్య కల్కస్వరసాభ్యాంపయసాచ సాధయిత్వా,
శ్వయథుక్షవథూదరాగ్నిసాదైరభిభూతోఽపి పిబన్భవత్యరోగః.

ఆవుపాలలో అల్లపుకల్కము, అల్లపుస్వరసము, వీనిని చేర్చి, అందులో ఆవు

నెయ్యిపోసి, ఘృతపాకవిధిగ పక్వముచేసి, దానిని పానముచేయించిన; వాపు, దగ్గు, ఉదరరోగము, అగ్నిమాంద్యము, ఇవి నిశ్శేషముగ హరించును.

### శ్వయథురోగ చికిత్స.

నిరామో బద్ధశమలః పిబేచ్ఛ్వయథుపీడితః,
త్రికటుత్రివృతాదంతీచిత్రకైస్సాధితం పయః.
మూత్రం గోర్వా మహిష్యా వా సక్షీరం క్షీరభోజనః,
సప్తాహం మాసమథవా స్యాదుష్ట్రీక్షీరవర్తనః ౧౦

శ్వయథురోగికి అజీర్ణములేకుండి, మలబంధముమాత్రము గలిగియుండిన, నట్టి వానికి త్రికటుకములు, తెల్లతెగడ, దంతి, చిత్రమూలము, వీనిని సమభాగములుగ చేర్చి కాచినయావుపాలను పానముచేయించవలయును. లేక గోమూత్రముగాని బఱ్ఱె మూత్రముగాని ఆవుపాలలోకలిపి పానముచేయించి, ఆవుపాలనే ఆహారముగనిచ్చించ వలయును. లేక 7 దినములులేక 1 మాసముపరకు ఒంటెపాలను మాత్రము ఆహార పానములయం దుపయోగించవలయును.

### శోఫరోగమున యవానకాదిఘృతము.

యవానకం యవక్షారం యవానీం పంచకోలకమ్,
మరిచం దాడిమం పాఠాం ధానకామమ్లవేతసమ్. ౧౧
బాలబిల్వం చ కర్షాంశం సాధయేత్సలిలాఢకే,
తేన పక్వో ఘృతప్రస్థః శోఫార్శోగుల్మమేహహా. ౧౨

ఖరాసానియోమము, యవక్షారము, ఓమము, పంచకోలములు, మిరియాలు, దానిమ్మ, చిరుబొద్ది, దనియాలు, పుల్లప్రబ్బలి, మారేడుపిందెలు, వీనిని దినుసుకొక కర్షము చొప్పున గ్రహించి ఆఢకప్రమాణముదకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి వడియకట్టి, అందులో 1 ప్రస్థము ఆవునెయ్యికలిపి, ఘృతపాకవిధిగపక్వము చేసి, యాఘృతము నిప్పించిన; శోఫరోగము, అర్శస్సు, గుల్మము, ప్రమేహము, ఇవి నివర్తించును.

### శోఫరోగమున ధాన్వంతరాది ఘృతోపయోగము.

దధ్నశ్చిత్రకగర్భాద్వా ఘృతం తత్రక్రసంయుతమ్,
పక్వం సచిత్రకం తద్వద్గుణైర్వ్యంజాచ్చ కాలవిత్. ౧౩
ధాన్వంతరం మహాతిక్తం కల్యాణమభయాఘృతమ్,

ఆవుపాలలో చిత్రమూలచూర్ణము కలిపి చక్కగ కాచి పెరుగుచేసి చిలికి వెన్న

తీసికాచి ఆనెయ్యిని మజ్జిగలో కలిపి విధిప్రకారము పక్వముచేసి యిప్పించిన శోఫ గుల్మ ప్రమేహ అర్శోరోగములు హరించును. మఱియు కాలావస్థాదులను తెలిసి వైద్యుడు, ధాన్వంతరఘృతమును, మహాతిక్తకఘృతమును, కల్యాణకఘృతమును, అభయాఘృతమును శ్వయథురోగికి దోషాద్యనుగుణముగ నిప్పించవలయును.

## దశమూలాభయాలేహము.

దశమూలకషాయస్య కంసే పథ్యాశతం పచేత్. ౧౪
దత్వా గుడతులాం తస్మిన్ లేహే దద్యాద్విచూర్ణితమ్,
త్రిజాతకం త్రికటుకం కించిచ్చ యవశూకజమ్. ౧౫
ప్రస్థార్ధం చ హిమే క్షౌద్రాత్తన్నిహంత్యుపయోజితమ్,
ప్రవృద్ధశోఫజ్వరమేహగుల్మకార్శ్యామవాతాస్లకరక్తపిత్తం,
వైవర్ణ్యమూత్రానిలశుక్రదోషశ్వాసారుచిప్లీహగరోదరం చ

నూరుపలములు దశమూలములను గ్రహించి, ఆఢకప్రమాణముదకములో వైచి, పాదావశేషముగ కషాయముకాచి, వడియకట్టి, అందులో నూరు కరక్కాయలను వైచి, చక్కగాపాకముచేసి 100 పలములు పాతబెల్లముచేర్చి, లేహపాకవిధిగ వండి, త్రిజాతకములు, త్రికటుకములు, ఇవిదిచుసుకొక్కకపలము, యవక్షారము $\frac{1}{2}$ పలము, వీనిని చూర్ణముచేసి కలిపి, యదిచల్లారినపిదప, తేనె 1 ప్రస్థముచేర్చిఇప్పించినదారుణమైన శోఫ, జ్వరము, ప్రమేహము, గుల్మము, కార్శ్యము, ఆమవాతము, రక్తపిత్తము, వికారవర్ణము, మూత్రకృచ్ఛ్రము, శుక్రదోషము, శ్వాసము, అరుచి, ప్లీహము, విషదోషము, ఉదరరోగము, ఇవియన్నియును నిశ్శేషముగ హరించును.

## శ్వయథురోగమునం దన్నపానాదులు.

పురాణయవశాల్యన్నం దశమూలాంబుసాధితమ్,
అల్పమల్పం పటుస్నేహం భోజనం శ్వయథోర్హితమ్ ౧౬
క్షారవ్యోషాన్వితైః కౌలత్థైస్సకణై రసైః,
తథా జాంగలజైః కూర్మగోధాశల్యకజైరపి. ౧౭
అనమ్లం మథితం పానే మద్యాన్యల్పధవంతి చ,

శ్వయథురోగముగలవానికి దశమూలకషాయములో పాకముచేయబడిన పాతసంబావుబియ్యపు అన్నమును ఘృతాదిస్నేహము, సైంధవలవణము, వీనితోడను; సర్జక్షారము, త్రికటుకములు, వీనితో పక్వముచేయబడిన పెసల కట్టుతోడను; పిప్పళ్లచూర్ణముతో పక్వముచేయబడిన ఉలవకట్టుతోడను; జాంగల మాంసరసముతోడను;

తాబేలు, ఉడుము, ముండ్లపంది, వీనిమాంసరసములతోడను; కొంచెముకొంచెముగ భుజింపజేసిన హితముకలుగును. మఱియు పులుసులేనిదిగ నీళ్లు చేర్చక చిలికినదిగనుండు ఆవుమజ్జిగను ఔషధములతో పక్వముచేయబడిన మద్యములను పానార్థము ఇప్పించవలయును.

## శ్వయథురోగమునందు పేయాదికల్పనము.

అజాజీశఠిజీవంతీకారవీపౌష్కరాగ్నికైః. ౧౯
బిల్వమధ్యయవక్షారవృక్షామ్లైర్బదరోన్మితైః,
కృతా పేయాఽఽజ్యతైలాభ్యాం యుక్తిభృష్టా పరం హితా.
శోఫాతిసారహృద్రోగగుల్మార్శోఽల్పాగ్నిమేహినామ్,
గుడైస్తద్వచ్చ పాఠాయాః పంచకోలేన సాధితా. ౨౦

జీలకఱ్ఱ, కచోరములు, మరుబాల, పెద్దజీలకఱ్ఱ, పుష్కరమూలము, చిత్రమూలము, మారేడుగుజ్జు, యవక్షారము, చింతపండు, వీనిని ప్రత్యేకము కోలప్రమాణము చొప్పున చేర్చి పక్వముచేసి; నువ్వులనూనె ఆవునెయ్యి యిడి చేర్చబడిన పేయయను గంజిని యిప్పించిన; శోఫ, అతిసారము, హృద్రోగము, గుల్మము, అర్శస్సు, అగ్నిమాంద్యము, ప్రమేహము, ఈ రోగములుగలవారికి మిక్కిలి హితకరంబుగ నుండును. లేక కోల ప్రమాణము పంచకోలములను చేర్చి పాకముచేయబడిన పేయయనుగంజినిగాని, లేక చిరుబొద్దితో పాకముచేయబడిన పేయయనుగంజిగాని యిప్పించిన పైరోగులకు మిక్కిలి హితకరముగ నుండును.

## శ్వయథురోగికి అభ్యంగస్నానము.

శైలేయకుష్ఠస్థౌణేయరేణుకాగురుపద్మకైః,
శ్రీవేష్టకనఖస్పృక్కాదేవదారుప్రియంగుభిః. ౨౨
మాంసీమాగధికాధాన్యధ్యామకవాలకైః,
చతుర్జాతకతాలీసముస్తాగంధపలాంశకైః. ౨౩
కుర్యాదభ్యంజనం తైలం లేపం స్నానాయ తూదకమ్,
స్నానం వా నింబవర్షాభూనక్తమాలార్కవారిణా. ౨౪

శ్వయథురోగికి శిలాజిత్తు, చెంగల్వకోష్ఠు, మాదిపత్రి, రేణుకలు, అగరుచెక్క, పద్మకము, శ్రీవేష్టకము, నఖము, స్పృక్కయను గంధద్రవ్యము, దేవదారు, ప్రేంకణము, జటామాంసి, పిప్పళ్లు, దనియాలు, కామంచిపూరి, కురువేరు, చతుర్జాతకములు, తాళీసపత్రి, తుంగముస్తలు, చందనము, గంధపత్రి, వీనిని సమభాగములుగ

గ్రహించి నువ్వుల నూనెతో చేర్చి పక్వము చేయబడిన తైలముచే అభ్యంజన లేపనములను చేయించి పైశిలాజతువు మొదలగు ద్రవ్యములను వైచి కాచిన యుదకముచేగాని; వేము, గలిజేరు, క్రాగు, జిల్లేడు, వీనియాకులను వైచి కాచినయుదకముచేగాని, స్నానము చేయించవలయును.

ఏకాంగశోఫహరలేపనము

ఏకాంగశోఫే వర్షాభూకరవీరకకింశుకైః,
విశాలాత్రిఫలాలోధ్ర నలికాదేవదారుభిః. ౨౫
హింస్రాకోశాతకీమూర్వాత్రితాలపర్ణీజయంతిభిః,
స్థూలకాకాదనీసాలనాకులీవృషపర్ణిభిః. ౨౬
వృద్ధిర్ద్విహాస్తికర్ణైశ్చ సుఖోష్ణైర్లేపనం హితమ్,

గలిజేరు, గన్నేరు, మోదుగు, పెద్దపాపర, త్రిఫలములు, లొద్దుగు, నళికయను గంధద్రవ్యము, దేవదారు, జటామాంసి, చేదుబీర, అతివస, సదాప, తక్కెల, పెద్ద గురువింద, ఏపి, సర్పాక్షి, యెలుకచెవియాకు, బుద్ధి, వృద్ధి, ఎఱ్ఱాముదపాకు, వీనిని యుదకముతో నూరి సుఖోష్ణముగ లేపనము చేసిన, ఏకాంగ (శరీరమునం దెచ్చటనైన నొకచోట కల్గిన) శోఫ హరించును.

వాతికశ్వయథుచికిత్స.

అథానిలోత్థే శ్వయథౌ మాసార్ధం త్రివృతం పిబేత్. ౨౭
తైలమేరండజం వాతవిడ్బంధే తదేవ తు,
ప్రాగ్భక్తం పయసా యుక్తం రసైర్వా కారయేత్తథా. ౨౮
స్వేదాభ్యంగాః సమీరఘ్నా లేపమేకాంగగే పునః,
మాతులుంగాగ్నిమంథౌ చ శుంఠీహింస్రామరాహ్వయైః. ౨౯

వాతమువలన జనించిన శ్వయథురోగమునందు, త్రివృత్తైలమును, ఆముదమును, పదునైదు దినములవరకును పానము చేయించవలయును. శ్వయథురోగికి వాతమలములు బంధింపబడియుండినచో భోజనాత్పూర్వము పైత్రివృత్తైలము, ఆముదము, వీనిని ఆవుపాలతోగాని, మాంసరసముతోగాని, పానము చేయించి; వాతహరములగు స్వేదాభ్యంగములను చేయించవలయును. వాతమువలనజనించిన యేకాంగశోథరోగమునందు మాదీఫలము, తక్కెల, శుంఠి, ములక, దేవదారు, అనువానిని నూరి లేపనము చేయవలయును.

### పిత్తజశ్వయథు చికిత్స.

పైత్తే తిక్తం పిబేత్సర్పిర్న్యగ్రోధాద్యేన వా శృతమ్,
క్షీరం తృడ్దాహమోహేషు లేపాభ్యంగాశ్చ శీతలాః.　　30

పిత్తమువలన జనించిన శ్వయథురోగమున తిక్తకఘృతమునుగాని, న్యగ్రోధాది గణద్రవ్యములతో పక్వముచేయబడిన ఘృతమునుగాని, ఇప్పించవలయును. పైశ్వయథురోగికి దప్పి, సర్వాంగతాపము, మూర్ఛ, కలిగియుండిన ఆవుపాల నొసంగి శీతలముగనుండు లేపాభ్యంగములను చేయించవలయును.

### పిత్తశోఫమునకు పటోలమూలాదికషాయము.

పటోలమూలత్రాయంతీ యష్ట్యాహ్వాకటుకాభయాః,
దారుదార్వీ హిమం దంతీ విశాలా నిచుళం కణా.　　3౧
తైః క్వాథస్సఘృతః పీతో హంత్యంతస్తాపతృడ్భ్రమూన్,
ససన్నిపాతవీసర్పశోఫదాహవిషజ్వరాన్.　　3౨

పొట్లవేరు, కిలుక్రాయుగు, అతిమధురము, కటుకరోహిణి, కరక్కాయలు, దేవదారు, మ్రానిపసుపు, రక్తచందనము, దంతి, పెద్దపాపర, నీరుప్రబ్బలి, పిప్పళ్లు, వీనిని సమభాగములుగ గ్రహించి ఉదకములోవైచి కషాయముకాచి, అందులో నెయ్యి జేర్చి పానముచేయించిన శరీరమునలోభాగమునందలి తాపము, దప్పి, మూర్ఛ, సన్నిపాతము, విసర్పరోగము, శోఫ సర్వాంగతాపము, విషదోషము, జ్వరము ఇవియన్నిగను హరించును.

### శ్లేష్మజశ్వయథుచికిత్స.

ఆరగ్వధాదినా సిద్ధం తైలం శ్లేష్మోద్భవే పిబేత్,

శ్లేష్మజనిత శోఫరోగమునకు ఆరగ్వధాది గణద్రవ్యములతో పక్వముచేయబడిన తైలమును పానముచేయించవలయును.

### కఫజశోఫరోగమున క్షారచూర్ణాదులు.

స్రోతోవిబంధే మందేఽగ్నావరుచౌ స్తిమితాశయః.　　33
క్షారచూర్ణాసవారిష్టమూత్రతక్రాణి శీలయేత్,

శ్లేష్మజ శోఫరోగికి స్రోతోబంధము, అగ్నిమాంద్యము, అరుచి కలిగినచో క్షారచూర్ణము, ఆసవము, అరిష్టము అనుమద్యములు, గోమూత్రము, మజ్జిగ, వీనిని పానము చేయించుచుండవలయును.

### కఫజశ్వయథురోగమున పిప్పల్యాదిలేపము.

కృష్ణాపురాణపిణ్యాకశిగ్రుత్వక్సికతాఽతసీః. ౩౪
ప్రలేపోన్మర్దనే యుంజ్యాత్సుఖోష్ణా మూత్రకల్కితాః,

శ్లేష్మజశ్వయథురోగముగమున పిప్పళ్లు, పాతదిగనుండు తెలికపిండి, మునగపట్ట, ఖండశర్కర, అగసివిత్తులు, వీనిని సమభాగములుగ గ్రహించి గోమూత్రముతో నూరి కల్కముచేసి దానిని సుఖోష్ణముగ పట్టువేయవలయును.

### శ్వయథురోగమున స్నానలేపనములు.

స్నానం మూత్రాంభసీ సిద్ధే కుష్ఠతర్కారిచిత్రకైః. ౩౫
కుళుత్థనాగరాభ్యాం వా చందాగరు విలేపనే,

శ్లేష్మజశ్వయథురోగికి చెంగల్వకోష్టు, తక్కాల, చిత్రమూలము, వీనితోగాని; ఉలవలు, శుంఠి, వీనితోగాని, కాచబడినగోమూత్రముచేనైనను జలముచేనైనను స్నానముచేయించవలయును. చందయుద్రవ్యము, అగరుచెక్క, వీనినినూరి పట్టువేయ వలయును.

### ఏకాంగశోఫమున సీల్యాదిలేపనము.

కాలాజశృంగిసరళబస్తగంధాహయాహ్వయాః. ౩౬
ఏకైషికా చ లేపః స్యాచ్ఛ్వయథావేకగాత్రజే,

శ్లేష్మజనితమైన ఏకాంగ శోఫరోగమున నీలి, ఒడ్డి, సరళదేవదారు, వాయింట, పెన్నేరుగడ్డ, తెల్లతెగడ, వీనిని నూరి సుఖోష్ణముగ లేపనము చేయవలయును.

### మిశ్రదోషజ శ్వయథు చికిత్స.

యథాదోషం యథాసన్నం శుద్ధిం రక్తావసేచనమ్. ౩౭
కుర్వీత మిశ్రదోషే తు దోషోద్రేకబలాత్క్రియామ్,

ద్వంద్వదోషమువలన జనించిన శ్వయథురోగమున దోషానుసారముగ వమన విరేచనరూపమైన శుద్ధికర్మలు, రక్తమోక్షణము, వీనిని చేయించటయేగాక వృద్ధిజెందిన దోషమున కనుగుణమైన చికిత్స చేయవలయును.

### సన్నిపాతజ శ్వయథు చికిత్స.

అజాజిపాఠాఘనపంచకోలవ్యాఘ్రీరజన్యః సుఖతోయపీతాః,
శోఫం త్రిదోషం చిరజం ప్రవృద్ధం విఘ్నంతి భూనింబమహౌషధేచ.

జీలకఱ్ఱ, చిరుబొద్ది, తుంగముస్తలు, పంచకోలములు, వాకుడు, పసుపు, వీనిని

నూరి ఉష్ణోదకములో కలిపి త్రాగించిన త్రిదోషములవలన జనించినదియు, చిరకాలము నువర్తింపుచుండునదియు, వృద్ధిజెందుచుండునదియునైన, శోఫరోగము, హరించును. మఱియు నేలవేము, శుంఠి, వీనిని నూరి సుఖోష్ణమైన యుదకములో కలిపి పానము చేయించిన శ్వయథురోగము హరించును.

శ్వయథురోగమున అమృతాదికల్కము.

అమృతాద్వితయం శివాటికా సురకాష్ఠం సపురం సగోజలమ్,
శ్వయథూదరకుష్ఠపాండుతాక్రిమిమేహోర్ధ్వకఫానిలాపహమ్.

తిప్పతీగె, కరక్కాయలు, పెద్దహింగుపత్రి, దేవదారుచెక్క, మహిసాక్షి గుగ్గిలము, వీనిని గోమూత్రముతో నూరి స్నానము చేయించినచో శోఫ, ఉదరరోగము, కుష్ఠువు, పాండువు, క్రిమిరోగము, ప్రమేహము, కఫము, వాతము, ఇవి హరించును.

క్షతజశోఫ చికిత్స.

ఇతి నిజమధికృత్య పథ్యముక్తం క్షతజనితే క్షతజంవిశోధనీయమ్,
స్రుతిహిమఘృతలేపసేకరేకైర్విషజనితే విషజిచ్చ శోఫ ఇష్టమ్.

ఇటుల వాతాదిదోషములవలన జనించిన శ్వయథురోగమునకు చికిత్సలు చెప్పబడియె. గాయమువలన జనించిన శోఫయందు రక్తస్రావము, శీతలమయిన ఘృతలేపము, విరేచనము, వీనిచే రక్తమును శుద్ధిచేయవలయును. విషమువలన జనించిన శోఫయందు విషహారములైన చికిత్సలను చేయవలయును.

శ్వయథురోగమున వర్జనీయములు.

గ్రామ్యానూపం పిశితమబలం శుష్కశాకం తిలాన్నం
గౌడం పిష్టాన్నం దధి సలవణం విజ్జలం మద్యమమ్లమ్,
ధానా వల్లూరమశనమథోగుర్వసాత్మ్యం విదాహి
స్వప్నం రాత్రౌ శ్వయథుగదవాన్ వర్జయేన్మైథునం చ. ౪౧

గ్రామ్యానూపదేశజంతువుల మాంసము, ఎండినశాకములు, నువ్వులయన్నము బెల్లము చేర్చినయన్నము, పిండియన్నము, పెరుగు, ఉప్పు, నీళ్ళు, పుల్లనిమద్యము అటుకులు, తియ్యనిమాంసరసము, గురువుగ, అసాత్మ్యముగ విదాహిగనుండు అన్నము, రాత్రియందు నిద్ర, స్త్రీసంభోగము, వీనిని శ్వయథురోగముగలవారు వర్జింపవలయును.

సప్తదశాధ్యాయము ముగిసెను.

# అష్టాదశాధ్యాయము.

అవ: విసర్ప రోగమునందును వాపు ప్రధానము కావున శ్వయథురోగమునకు సమానాకారమైయుండుటవలనను, ఈ రోగముల రెంటికిని చికిత్స లొకటేవిధముగ నుండుటవలనను, శ్వయథురోగచికిత్సితాధ్యాయ నిరూపణానంతరము, విసర్పచికిత్సితాధ్యాయము చెప్పబడుచున్నయది.

### విసర్పచికిత్సితాధ్యాయప్రారంభము.

సూ. అథాతో విసర్పచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః,

శ్వయథు చికిత్సితాధ్యాయ నిరూపణానంతరము విసర్పచికిత్సలను తెలియపర చునట్టి విసర్పచికిత్సమను నీయధ్యాయమును వివరించెదము.

### విసర్పరోగమున లంఘనాదులు.

ఆదావేవ విసర్పేషు హితం లంఘనరూక్షణమ్,
రక్తావసేకో వమనం విరేకస్స్నేహనం న తు. ౧

విసర్పరోగములకు తొలుత లంఘనము, రూక్షచికిత్స, రక్తమోక్షణము, వమన విరేచనకర్మలు, వీనిని చేయించవలయును. స్నేహకర్మ చేయంజనదు.

### విసర్పమున వమనౌషధము.

ప్రచ్ఛర్దనం విసర్పఘ్నం సయష్టీంద్రయవం ఫలమ్,
పటోలపిప్పలీనింబపల్లవైర్వా సమన్వితమ్. ౨

విసర్పరోగికి అతిమధురము, కొడిసెవిత్తులు, మ్రంగపండు, వీని నేకముచేసి గాని; చేదుపొట్లు, పిప్పళ్ళు, వేపచిగుళ్ళు, మ్రంగపండు, వీని నేకముచేసిగాని, యుప యోగించి వమనముచేయించిన విసర్పరోగము హరించును.

### విసర్పమున విరేచనౌషధము.

రసేన యుక్తం త్రాయంత్యా ద్రాక్షాయాస్త్రైఫలేన వా,
విరేచనం త్రివృచ్చూర్ణం పయసా సర్పిషాఽథ వా. 3
యోజ్యం కోష్ఠగతే దోషే విశేషేణ విశోధనమ్,

విసర్పరోగికి తెల్లతెగడ చూర్ణమును కలుత్రాణుగురసములోగాని, ద్రాక్ష

పండురసములోగాని, త్రిఫలముల రసములోగాని, ఆవుపాలలోగాని, ఆవునేతిలోగాని, కలిపి విరేచనమున కిప్పించవలయును. దోషము కోష్ఠము నాశ్రయించియుండునపుడు మిక్కుటముగ విరేచనౌషధమును ఇప్పించవలయును.

### శుద్ధికర్మానర్హవిసర్పమున శమనకషాయము.

అవిశోధ్యస్య దోషేఽల్పే శమనం చందనోత్పలమ్. ౪
ముస్తనింబపటోలం వా పటోలాదికమేవ వా,
సారిబామలకోశీరముస్తం వా క్వథితం జలే. ౫

వమనవిరేచనరూపమగు శోధనకర్మ జేయుటకర్హుడుకాని విసర్పరోగికి దోషము స్వల్పముగనుండినచో చందనము, నల్లకలువ, అనువానిని గాని తుంగముస్తె మీగడ, వేము, చేదుపొట్ల, అనువానినిగాని, పటోలాదిగణ ద్రవ్యములనుగాని, సుగంధిపాల, ఉసిరిక, వట్టివేరు, తుంగముస్తలు, అనువానిని గాని సమభాగములుగ గ్రహించి ఉదకములోవైచి చక్కగకాచి యాకషాయము నిప్పించవలయును.

### విసర్పరోగికి దురాలభాదికషాయము.

దురాలభాం పర్పటకం గుడూచీం విశ్వభేషజమ్,
పాక్యం శీతకషాయం వా తృష్ణావీసర్పవాన్ పిబేత్. ౬

దప్పి, విసర్పము, ఈరోగములుగలవానికి రేగటిదూలగోవిల, పర్పాటకము, తిప్పతీగె, శుంఠి, అనువానినిచేర్చి కాచబడిన కషాయమునుగాని; లేక పైద్రవ్యములు చేర్చి చేసిన శీతకషాయమునుగాని పానము చేయించవలయును.

### విసర్పరోగమున దార్వ్యాదికషాయము.

దార్వీపటోలకటుకా మసూరత్రిఫలా స్తథా,
సనింబయష్టిత్రాయంతీః క్వథితా ఘృతమూర్ఛితాః. ౭

మ్రానిపసుపు, చేదుపొట్ల, కటుకరోహిణి, చిరుసెనగలు, త్రిఫలములు, వేము, అతిమధురము, కలుత్రాసుగు, అనువానిని సమభాగముగ నుదకములోవైచి చక్కగ కాచి, అందులో ఆవునెయ్యికలిపి, విసర్పరోగికి పానము చేయించవలయును.

### విసర్పరోగమున రక్తమోక్షణము.

శాఖాదుష్టే తు రుధిరే రక్తమేవాదితో హరేత్,
త్వఙ్మాంసస్నాయుసంక్లేదో రక్తక్లేదాద్ధి జాయతే. ౮

రక్తదోషమువలన చర్మము, మాంసము, స్నాయువులు, ఇవి దూషింపబడును.

కావున విసర్పరోగికి రక్తము శాఖలయందు దుష్టంబై యుండిన, నారక్తమును తొలుత వెలిపరచవలయును.

విసర్పరోగమునకు తిక్తకాదిఘృతోపయోగము.

నిరామే శ్లేష్మణి క్షీణే వాతపిత్తోత్తరే హితమ్,
ఘృతం తిక్తం మహాతిక్తం శృతం వా త్రాయమాణయా. ౯

అజీర్ణములేనివాఁడుగ, కఫముక్షయించియుండువాఁడుగ, వాతపిత్తాధిక్యముగలవాఁడుగనుండు విసర్పరోగికి, తిక్తకఘృతము, మహాతిక్తకఘృతము, లేక కలుక్రానుగుతో కాచబడినఘృతము, వీనిని యిప్పించవలయును.

విసర్పమునకు ప్రలేపాదులు.

నిర్హృతేఽస్రే విశుద్ధేఽన్తర్దోషే త్వఙ్మాంససంధిగే,
బహిః క్రియాః ప్రదేహాద్యాస్సద్యో వీసర్పశాంతయే. ౧౦

విసర్పరోగికి రక్తమోక్షణము చేయుటవలన శరీరములోభాగము శుద్ధంబైపైదోషములు చర్మమాంససంధుల నాశ్రయించియుండిన నా దోషము శమించుటకై వెలుపలిభాగమున లేపము మొదలగు చికిత్సలను శీఘ్రముగ చేయవలయును.

వాతవిసర్పమునకు శతాహ్వాదిప్రలేపము.

శతాహ్వాముస్తవారాహీ వంశార్ద్రగళధాన్యకమ్,
సురాహ్వా కృష్ణగంధా చ కుష్ఠం వా లేపనం చలే. ౧౧

వాతవిసర్పరోగమునకు పెద్దసదాప, తుంగముస్తలు, నేలతాడి, వెదురు మొలక, నల్లగోరింట, దనియాలు, దేవదారుచెక్క, ఎఱ్ఱమునుగ, వీనినిగాని; చెంగల్వకోష్టును గాని, నూరిపట్టువేయవలయును.

పిత్తవిసర్పచికిత్స.

న్యగ్రోధాదిగణః పిత్తే తథా పద్మోత్పలాదికమ్,

పిత్తవిసర్పరోగమున న్యగ్రోధాది గణద్రవ్యములనుగాని; తామర, నల్లకలువ మొదలగు షట్చరణయోగములనుగాని నూరి, లేపనము చేయవలయును. "పద్మోత్పలశైవాల పంకదూర్వామృణాళ శృంగాటకకశేరుక శర్కరాహ్రీబేర చందనముక్తామణి గైరికపయస్యాప్రపౌండరీక మధుకపద్మకఘృతక్షీరాణి" తామరపువ్వు, నల్లకలువ, పాచి, బురద, గరికె, తామరతూండ్లు, పరికెగడ్డ, తుంగదుంప, పంచదార, కురువేరు, చందనము, ముత్యములు, మాణిక్యము, జేగురురాయి, పెన్నవుచుబాల,

ప్రపౌండరీకము, యష్టిమధుకము, పద్మకము, ఆవునెయ్యి, ఆవుపాలు, ఇవి షట్చరణ యోగమనబడునని అష్టాంగ సంగ్రహమున చెప్పబడియున్నది.

## పిత్తవిసర్పహరలేపము.

న్యగ్రోధపాదా స్తరుణాః కదలీగర్భసంయుతాః ౧౨
బిసగ్రంథిశ్చ లేపస్స్యాచ్ఛతధౌతఘృతాప్లుతః,
పద్మినీకర్దమశ్శీతః పిష్టం మౌక్తికమేవ వా. ౧౩
శంఖః ప్రవాళం శుక్తిర్వా గైరికం వా ఘృతాన్వితమ్,

పిత్తవిసర్పమున లేత మఱ్ఱియూడలు, అరటిదుంపలు, తామరగెడ్డలు, వీనిని నూరి, నూరుపర్యాయములు కడిగినఘృతములో కలిపి, లేపనము చేయవలయును. తామర కొలనులోనుండు బురదనుగాని, ముత్తియములనుగాని, శంఖమునుగాని, పగడమునుగాని, ముత్తియముల చిప్పలనుగాని, జేగురురాయినిగాని, ఉదకముతో నూరి, అందులో నెయ్యి కలిపి, లేపనము చేయవలయును.

## శ్లేష్మవిసర్పచికిత్స.

త్రిఫలాపద్మకోశీరసమంగాకరవీరకమ్. ౧౪
నలమూలాన్యనంతా చ లేపః శ్లేష్మవిసర్పహా,

త్రిఫలములు, పద్మకము, వట్టివేరు, మంజిష్ఠి, గన్నేరు, కిక్కిసగడ్డివేరు, గరికె, అనువానిని నూరి లేపనము చేసిన శ్లేష్మజ విసర్పరోగము హరించును.

## కఫజవిసర్పమునకు ధవాదిలేపము.

ధవసప్తాహ్వఖదిరదేవదారుకురంటకమ్. ౧౫
సముస్తారగ్వధం లేపో వర్గో వా వరుణాదికః,
ఆరగ్వధస్య పత్రాణి త్వచః శ్లేష్మాంతకోద్భవాః ౧౬
ఇంద్రాణీశాకం కాకాహ్వ శిరీషకుసుమాని చ,

ధవము (వెలిచంద్ర) ఏడాకులపొన్న, చండ్ర, దేవదారు, గోరింట, తుంగముస్తలు, రేలచిగుళ్లు, వీనిని నూరిగాని; వరుణాదిగణములో చెప్పియుండు ద్రవ్యములను నూరిగాని; రేలచిగుళ్లను మాత్రము నూరిగాని; విరిగిపట్టను నూరిగాని; వావిలి, కాకి, గురువింద, దిరిశనపువ్వు, అనువానిని నూరిగాని; లేపనము చేసిన కఫజవిసర్పము హరించును.

## విసర్పమున సేకాభ్యంగాదులు.

సేకప్రణాభ్యంగహావిశ్లేపమార్గాన్యథాయథమ్. ౧౭

ఏతైరేవౌషధైః కుర్యాద్వాయౌ లేపా ఘృతాధికాః,

శ్లేష్మవిసర్పరోగమునకు చెప్పియుండు ధవము మొదలగు ఔషధములచే అన్నివిసర్పరోగములయందును సేకము, ఘృతము, లేపము, చూర్ణము, వీనిని ఆ దోషానుగుణముగ ప్రయోగించవలయును. వాతవిసర్పరోగమునకు పై యౌషధము ఘృతము నధికముగ చేర్చి లేపనము చేయించవలయును.

విసర్పమునకు లేపము.

కఫస్థానగతే సామే పిత్తస్థానగతేఽథవా.
అశీతోష్ణా హితా రూక్షా రక్తపిత్తే ఘృతాన్వితాః,
అత్యర్థశీతా_స్తనవ_స్తనువస్త్రాంతరాస్థితాః
యోజ్యా క్షణే క్షణేఽన్యేఽన్యే మందవీర్యా_స్త ఏవ చ,

అజీర్ణముతోఁగూడియుండు వాతము కఫస్థానమును జెందియుండినచో ము శీతముగను ఉష్ణముగను రూక్షముగనుండు ద్రవ్యములనునూరి పట్టువేయ యును. రక్తపిత్తము పిత్తస్థానమును జెందియుండునపుడు పైనిచెప్పిన ధవాదిద్రవ్య నూరి చల్లగనుండుదానిని సన్నగనుండు వస్త్రమునకు పట్టించి విసర్పముపై పట్టు వలయును. ఇది స్వల్పవీర్యముగలది యగుటంజేసి దీనినే పై చెప్పిన ప్రకారము రుగ పలుమారు పట్టువేయవలయును.

(ఒకసారి యుపయోగించినదానిని మరల నుపయోగించక అప్పుడప క్రొత్తదిగ మార్చుచు పలుమారు పట్టువేయవలెనని భావము.)

ద్వంద్వదోష విసర్పచికిత్స.

సంసృష్టదోషే సంసృష్టమేతత్కర్మ ప్రశస్యతే.

ద్వంద్వదోషమువలన జనించిన విసర్పమునందును, సన్నిపాత విసర్పమున వాతాదిదోషములకు వేరువేర పైజెప్పినయౌషధముల ఆయాదోషసంసర్గమ రించి సంసర్గమున రెండేసియోగములను, సన్నిపాతమున మూడుయోగములను ముగజేసి లేపాదుల కుపయోగించునది.

అగ్నివిసర్పమునకు ప్రలేపాదులు.

శతధౌతఘృతేనాగ్నిం ప్రదిహ్యాత్కేవలేన వా,
సేచయేద్ఘృతమండేన శీతేన మధుకాంబునా.
శీతాంభసాంభోజజలైః క్షీరేణేక్షురసేన వా,

పానలేపనసేకేషు మహాతిక్తం పరం హితమ్. ౨౨

అగ్నివిసర్పమునకు ఆవునెయ్యినిగాని, 100 పర్యాయములుకడిగిన ఆవునెయ్యిని గాని, లేపనము చేయవలయును. మఱియు చల్లగనుండు నేతిమీగడచేగాని, యష్టిమధుకోదకముచేగాని, శర్కరోదకముచేగాని, చల్లనియుదకముచేగాని, తుంగముస్తలయుదకముచేగాని, ఆవుపాలచేగాని, చెఱకురసముచేగాని, సేచనము చేయించుచుండవలయును. మఱియు మహాతిక్తఘృతము పానలేపనసేకములయందు మిక్కిలి హితకరముగ నుండును.

### గ్రంథివిసర్పచికిత్స.

గ్రంథ్యాఖ్యే రక్తపిత్తఘ్నం కృత్వా సమ్యగ్యథోదితమ్,
కఫానిలఘ్నం కర్తవ్యం పిండస్వేదోపనాహనమ్. ౨౩

గ్రంథి విసర్పమునందు తొలుత రక్తపిత్తహరములుగనుండు చికిత్సలనుజేసి పిదప కఫవాతహరముగనుండు పిండస్వేద, ఉపనాహస్వేదములను చేయించవలయును.

### గ్రంథివిసర్పశూల హరౌషధము.

గ్రంథివీసర్పశూలే తు తైలేనోష్ణేన సేచయేత్,
దశమూలవిపక్వేన తద్వన్మూత్రేణ జలేన వా. ౨౪

గ్రంథి విసర్పరోగమునందు శూల గలిగినచో దశమూలములు చేర్చి కాచబడి ఉష్ణముగనుండు నువ్వులనూనెచేగాని, పైదశమూలములుచేర్చి కాచిన గోమూత్రముచేగాని, దశమూలములుచేర్చి కాచినయుదకముచేగాని, సేచనము చేయించవలయును.

### గ్రంథివిసర్పమునకు కృష్ణగంధాదిలేపము.

సుఖోష్ణయా ప్రదిహ్యాద్వా పిష్టయా కృష్ణగంధయా,
నక్తమాలత్వచా శుష్కమూలకైః కలినాథవా. ౨౫

ఎఱ్ఱమునగపట్టనుగాని, కానుగుపట్టనుగాని, ఎండిన ముల్లంగినిగాని, తాడికాయలనుగాని, ఉదకముతోనూరి యుడికించి సుఖోష్ణముగ పట్టువేయవలయును.

### కఫజగ్రంథికి దంత్యాదిలేపము.

దంతీచిత్రకమూలత్వక్సౌధార్కపయసీ గుడః,
భల్లాతకాస్థి కాసీసలేపో భింద్యాచ్ఛిలామపి. ౨౬
బహిర్మార్గాశ్రితం గ్రంథిం కిం పునః కఫసంభవమ్,
దీర్ఘకాలస్థితం గ్రంథిమేభిర్భింద్యాచ్చ భేషజైః. ౨౭

దంతివేళ్లు, చిత్రమూలపువేరుపట్ట, జెముడుపాలు, జిల్లేడుపాలు, బెల్లము, జీడి

పప్పు, కాసీసము, వీనిని నూరి పట్టువేసిన నది రాయినిగూడ భేదించును. కావున నిది కఫమువలన శరీరమునకు వెలుపలిభాగమున జనించిన గ్రంథినిపోకడచుననుటకు సంది యములేదు. చిరకాలమనువర్తించుచుండు గ్రంథిని యీ యౌషధముచేతనే వైద్యు వరుండు భేదింపవలయును.

**విసర్పగ్రంథిహరపానాహారాదులు.**

మూలకానాం కుళుత్థానాం యూషైస్సక్షారదాడిమైః,
గోధూమాన్నైర్యవాన్నైశ్చ సశీధుమధుశర్కరైః. ౨౮
సక్షౌద్రైర్వారుణీమండైర్మాతులుంగరసాన్వితైః,
త్రిఫలాయాః ప్రయోగైశ్చ పిప్పల్యాః క్షౌద్రసంయుతైః. ౨౯
దేవదారుగుడూచ్యోశ్చ ప్రయోగైర్గిరిజస్య చ,
ముస్తభల్లాతసక్తూనాం ప్రయోగైర్మాక్షికస్య చ. 30
ధూమైర్విరేకైశ్శిరసః ప్రారోఽక్తైర్గుల్మభేదనైః,
తప్తాయోహేమలవణపాషాణాదిప్రపీడనైః. 3౧

సర్జక్షారము, దానిమ్మపండు, వీనితో పక్వముచేయబడిన ముల్లంగికట్టుతోడను, ఉలవలకట్టుతోడను, గోధుమాన్నమును, యవాన్నమును, భుజింపజేయవలయును. పంచదార, తేనె, చేర్చబడిన శీధువనుమద్యమును, తేనె, మాదీఫలరసము, యివి చేర్చబడిన వారుణియనుమద్యపుమీగడ, వీనిని పానము చేయించవలయును. త్రిఫలములు, పిప్పళ్లు వీనిని తేనెతో నిప్పించవలయును. దేవదారు, తిప్పతీగె, శిలాజత్తు, తుంగముస్తలు, జీడిగింజలసత్తు, స్వర్ణమాక్షికము, వీనిని ప్రయోగించవలయును. శిరమునకు ధూమ ప్రయోగము, విరేచనము, ఈ రెంటిని చేయించవలయును. గుల్మచికిత్సయందు చెప్పి యుండు గుల్మభేదనద్రవ్యములచే ప్రలేపాదులను చేయించవలయును. ఇనుము, బంగారు, ఉప్పు, రాయి, మొదలగువానినినిప్పులో కాల్చిదాని చేనొత్తడము వేయవలయును. ఇట్టి చికిత్సలచేత బహుకాలమనువర్తింపుచుండు విసర్పగ్రంథిరోగమునుపోగొట్టవలయును.

**విసర్పగ్రంథియందు దాహకర్మాదులు.**

ఆభిః క్రియాభిస్సిద్ధాభిర్వివిధాభిర్బలే స్థితిః,
గ్రంథిః పాషాణకఠినో యది నైవోపశామ్యతి. 3౨
అథాస్య దాహః క్షారేణ శరైర్హేమ్నాపి వా హితః,
పాకిభిః పాచయిత్వా తు పాటయిత్వా తముద్ధరేత్. 33

అనుభవసిద్ధంబుగ నానావిధములుగనుండు పైచికిత్సలనన్నిటిని జేసినను గ్రంథి రాయివలె కఠినంబై నివర్తించకయుండినయెడ నట్టిదానిని క్షారముచేతగాని, ఇనుము చేతగాని, బంగారుచేతగాని కాల్చవలయును. లేక గ్రంథిని పాకముచేయునట్టి

ఔషధములను బాహ్యాభ్యంతరములయందు ప్రయోగించి గ్రంథి పాకంబగునటుల జేసినదప దానిని పగులంజీసి దోషమును బైలుపరచవలయును.

విసర్పగ్రంథియందు రక్తమోక్షణము.

మోక్షయేద్బహుశశ్చాస్య రక్తముత్క్లేశమాగతమ్,
పునశ్చాపహృతే రక్తే వాతశ్లేష్మజిదౌషధమ్. ౩౪

విసర్పగ్రంథి జనించియుండువానికి దుష్టరక్తమును పలుమారు బైటకితీసి, వాతశ్లేష్మహరములైన యౌషధములను ఇప్పించవలయును.

విసర్పవ్రణహర తైలాదులు.

ప్రక్లిన్నే దాహపాకాభ్యాం బాహ్యాంతర్వ్రణవత్క్రియా,
దార్వీవిడంగకంపిల్లైః సిద్ధం తైలం వ్రణే హితమ్. ౩౫
దూర్వాస్వరససిద్ధం తు కఫపిత్తోత్తరే ఘృతమ్,

దాహపాకములతో గూడియుండు విసర్పవ్రణమునందు బాహ్యాంతర్వ్రణములకు చెప్పియుండునటుల చికిత్సలను చేయవలయును. మఱియు మ్రానిపసపు, వాయువిడంగములు, కంపిల్లము, అనువానిని సమభాగములుగ చేర్చి కాచిన తైలమును పైవ్రణమునకు లేపనము చేసిన హితము కలుగును. కఫపిత్తాధిక్యముగల విసర్పరోగమునకు గరికెరసముతో సిద్ధముచేయబడిన ఘృతము నిప్పించవలయును.

విసర్పరోగమున రక్తమోక్షణావశ్యకత్వము

ఏకతస్సర్వకర్మాణి రక్తమోక్షణమేకతః. ౩౬
విసర్పో న హ్యసంసృష్టః సోఽస్రపిత్తేన జాయతే,
రక్తమేవాశ్రయశ్చాస్య బహుశోఽస్రం హరేదితః. ౩౭

విసర్పరోగమునందు ముందుచెప్పినచికిత్సలన్నిటికంటె రక్తమోక్షణము కడుశ్రేష్ఠముగనుండును. విసర్పము రక్తపిత్తసంబంధములేక జనింపనేరదగుటంజేసియు, ఆరోగమునకు రక్తమే ముఖ్యస్థానముగనుండుటంజేసియు, ఆరోగికి రక్తమోక్షణము పలుమారు చేయవలయును.

విసర్పరోగమున విరేచనఘృతము.

న ఘృతం బహుదోషాయ దేయం యన్న విరేచనమ్,
తేన దోషో హ్యుపస్తబ్ధస్త్వగ్రక్తపిశితం పచేత్. ౩౮

దోషమధికముగనుండువిసర్పరోగికి విరేచనముకలుగజేయునట్టిఘృతము నిప్పింపజనదు అటుల నిప్పించినచో దోషములు స్తంభించి చర్మము రక్తము మాంసము వీనిని పాకమునుగలుగజేయును. కావున విరేచనకారిగనుండుఘృతము నే యిప్పించవలయును.

అష్టాదశాధ్యాయము ముగిసెను

# ఏకోనవింశాధ్యాయము.

అవ: విసర్పమునకును కుష్ఠమునకును నిదానాదులు ప్రాయికముగ సమానములై యుండుటచే కావున విసర్పచికిత్సితాధ్యాయ నిరూపణానంతరము కుష్ఠచికిత్సితాధ్యాయము చెప్పబడుచున్నయది.

## కుష్ఠచికిత్సితాధ్యాయప్రారంభము.

సూ. అథాతః కుష్ఠచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహ భగవా నాత్రేయాదయో మహర్షయః

విసర్పచికిత్సితాధ్యాయ నిరూపణానంతరము కుష్ఠరోగచికిత్సలను తెలియపరచునట్టి కుష్ఠచికిత్సితమను నీ యధ్యాయమును వివరించెదము.

## కుష్ఠరోగమునందు స్నేహపానము.

కుష్ఠినం స్నేహపానేన పూర్వం సర్వముపాచరేత్,

కుష్ఠరోగముగలవారి కెల్లరికిని తొలుత స్నేహపానము చేయించవలయును. కుష్ఠరోగమునందు చర్మరక్త మాంసాదిధాతువులు దూషింపబడుటవలనను పై రక్తాదులు స్రవించుటవలనను, రోగస్వభావమువలనను, రోగి శరీరము తఱుచుగ కృశించి మిక్కిలి దౌర్బల్యమును జెందును. కావున వాతాదులవలనజనించిన నానావిధకుష్ఠరోగములయందును తొలుత ఘృతాదిస్నేహపానములను జేయించి శరీరమునకు పుష్టికరంబులైన చికిత్సలను చేయవలయును.

## వాతకుష్ఠమునకు దశమూలాది ఘృతము.

తత్ర వాతోత్తరే తైలం ఘృతం వా సాధితం హితమ్. ౧
దశమూలామృతైరండశార్ఙ్గేష్టామేషశృంగిభిః,

వాతాధికకుష్ఠరోగమునకు దశమూలములు, తిప్పతీగె, ఆముదము, కాకిదొండ, ఒద్ది, వీనిని సమభాగములుగ చేర్చి పక్వము చేయబడిన తైలమునుగాని, ఘృతమునుగాని, పానము చేయించవలయును.

## తిక్తకఘృతము.

పటోలనింబకటుకాదార్వీపాఠాదురాలభాః. ౨
పర్పటం త్రాయమాణాం చ పలాంశం పాచయేదపామ్,

ద్వావ్యథకేఽష్టాంశశేషేణ తేన కర్షోన్మితై స్తథా. 3
త్రాయంతీము స్తభూనింబకలింగకణచందనైః,
సర్పిషో ద్వాదశపలం పచేత్తత్తిక్తకం జయేత్. ౪
పిత్తకుష్ఠపరీసర్పపిటికాదాహతృడ్భ్రమాన్,
కండుపాండ్వామయాన్ గండాన్ దుష్టనాడీవ్రణాపచీః. ౫
విస్ఫోటవిద్రధీగుల్మశోఫోన్మాదమదానపి,
హృద్రోగతిమిరవ్యంగగ్రహణీశ్విత్రకామలాః ౬
భగందరమపస్మార ముదరం ప్రదరం గరమ్,
అర్శోఽస్రపిత్తమన్యాంశ్చ సకృచ్ఛ్రాన్ పిత్తజాన్ గదాన్ ౭

చేదుపొట్లు, వేము, కటుకరోహిణి, మ్రానిపసుపు, చిరుబొద్ది, దురదగొండి, పర్పాటకము, కలుక్రానుగు, వీనిని దినుసుకొకపలము చొప్పున గ్రహించి, రెండాఢకముల యుదకములోవైచి, ౮ వ భాగము మిగులునటుల కషాయముకాచి, వడియకట్టి అందులో, కలుక్రానుగు, తుంగముస్తలు, నేలవేము, కొడిసెవిత్తులు, పిప్పళ్లు, చందనము, వీనిని దినుసుకు కర్షప్రమాణముచొప్పున గ్రహించి, కల్కముచేసికలిపి, 12 పలములు ఆవునెయ్యిపోసి, ఘృతపాకవిధిగ పక్వముచేయవలయును. ఇది తిక్తకఘృతమనబడును. దీనిని సేవించినయెడపిత్తకుష్ఠువు, విసర్పము, పిటికలు, సర్వాంగతాపము, దప్పి, భ్రమ, దురద, పాండువు, గళగండము, దుష్టనాడీవ్రణము, అపచి, విస్ఫోటము, విద్రధి, గుల్మము, శోఫ, ఉన్మాదము, మదాత్యయము, హృద్రోగము, వ్యంగము, తిమిరము, గ్రహణి, శ్విత్రకుష్ఠువు, కామిల, భగందరము, అపస్మారము, ఉదరరోగము, ప్రదరము,విషోపద్రవము, అర్శస్సు, రక్తపిత్తము, మూత్రకృచ్ఛ్రము, పిత్తమువలనజనించిన పలువిధరోగములు, వీనినినన్నిటిని నశింపజేయును.

## మహాతిక్తకఘృతము.

సప్తచ్ఛదః పర్పటకః శమ్యాకః కటుకా వచా,
త్రిఫలా పద్మకం పాఠా రజన్యౌ సారిబే కణే. ౮
నింబచందనయష్ట్యాహ్వవిశాలేంద్రయవామృతాః,
కిరాతతిక్తకం సేవ్యం వృషో మూర్వా శతావరీ. ౯
పటోలాతివిషాముస్తా త్రాయంతీధన్వయాసకమ్,
త్రైజలేఽష్టగుణే సర్పిర్ద్విగుణామలకీరసే. ౧౦
సిద్ధం తిక్తాన్మహాతిక్తం గుణైరభ్యధికం మతమ్,

ఏడాకులపొన్న, పర్పాటకము, ఏల, కటుకరోహిణి, వస, త్రిఫలములు, పద్మకము, చిరుబొద్ది, పసుపు, మ్రానిపసుపు, సుగంధిపాల, నల్లసుగంధిపాల, పిప్పళ్లు, ఏనుగుపిప్పళ్లు, వేము, చందనము, అతిమధురము, పాపర, కొడిసెవిత్తులు, తిప్పతీగె, నేలవేము, వట్టివేరు, అడ్డసరము, చాగ, పిల్లిపీచర, చేదుపొట్ల, అతివస, తుంగముస్తలు, కలుత్రానుగు, రేగటిదూలగోవిల, వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి ఆవునేతిలో కలిపి; అందులో నేతికి 8 దింత లుదకము, 2 డింతలు ఉసిరికపండ్లరసము చేర్చి, ఘృతపాకవిధిగ పక్వముచేయవలయును. ఇది మహాతిక్తకఘృతమనబడును. పై చెప్పిన తిక్తకఘృతమునకంటె అధికగుణముకలదని మహర్షులచే చెప్పబడియున్నది.

### కఫకుష్ఠమునందు నింబాదిఘృతము.

కఫోత్తరే ఘృతం సిద్ధం నింబసప్తాహ్వచిత్రకైః ౧౧
కుష్ఠోషణవచాసాలప్రియాళచతురంగులైః,

కఫాధిక్యముచేసంభవించినకుష్ఠరోగమునకు వేము, ఏడాకులపొన్న, చిత్రమూలము, చెంగల్వకోష్టు, మిరియాలు, వస, ఏపి, ప్రేంకణము, రేల, వీనినిసమభాగములుగ గ్రహించి కల్కముచేసి, ఆవునేతిలో కలిపి, ఘృతపాకవిధిగ వండి, యా ఘృతమును పానముచేయించవలయును.

### కుష్ఠరోగములకు అరుష్కరాది తైలములు

సర్వేషు చారుష్కరజం తౌవరం సార్షపం పిబేత్. ౧౨
స్నేహం ఘృతం వా కృమిజిత్పథ్యాభల్లాతకైశ్శృతమ్,

కుష్ఠరోగములన్నిటియందును జీడిగింజల తైలమునుగాని, తువరక తైలమునుగాని, ఆవాలతైలమునుగాని, వాయువిడంగములు, కరక్కాయలు, జీడిగింజలు వీనితో పక్వముచేయబడిన ఘృతమునుగాని పానముచేయించవలయును.

### కుష్ఠమునకు ఆరగ్వధమూలఘృతము.

ఆరగ్వధస్య మూలేన శతకృత్వశ్శృతం ఘృతమ్ ౧౩
పిబేత్కుష్ఠం జయత్యాశు భజన్ సఖదిరం జలమ్,

రేలవేళ్లతో నూరు పర్యాయములు కాచినఘృతమును తొలుత పానము చేయించి; పిదప చంద్రకషాయమును పానముచేయించినచో కుష్ఠరోగ మతిశీఘ్రముగ నివర్తించును.

### కుష్ఠరోగమున అభ్యంజనవిరేచనములు.

ఏభిరేవ యథాస్వం చ స్నేహైరభ్యంజనం హితమ్. ౧౪

స్నిగ్ధస్య శోధనం యోజ్యం విసర్పే యదుదాహృతమ్,

కుష్ఠరోగికి పూర్వోక్తతైలముల చేతనే ఆయా దోషానుగుణముగ నభ్యంజనము చేయించవలయును. మఱియు స్నిగ్ధుడుగనుండు నారోగికి విసర్పరోగమునందు "రసేన యుక్తం త్రాయంత్యా" అను శ్లోకములో చెప్పియుండు శోధనౌషధముచు విరేచనము నకై యొసంగవలయును.

## కుష్ఠరోగమున సిరావేధము.

లలాటహస్తపాదేషు సిరాశ్చాస్య విమోక్షయేత్. ౧౫

ప్రచ్ఛానమల్పకే కుష్ఠే శృంగాద్యాశ్చ యథాయథమ్,

కుష్ఠరోగికి రోగముస్వల్పముగనుండినచో శస్త్రముచేఛేదించి సిరామోక్షణము చేయించవలెను. రోగమధికముగనుండినచో శృంగాదియంత్రముల చేతను నుదురు హస్తములు పాదములు వీనియందలి సిరలను వేధించి రక్తమును పీల్చవలెను. అట్టిరక్తమోక్షముచు చేయించవలయును.

## కుష్ఠరోగికి కుష్ఠహర తైలపానము.

స్నేహైరాపాయయేచ్చైనం కుష్ఠఘ్నైరంతరాంతరా. ౧౬

ముక్తరక్తవిరిక్తస్య రిక్తకోష్ఠస్య కుష్ఠినః,

ప్రభంజనస్తథా హ్యస్య న స్యాద్దేహప్రభంజనః. ౧౭

రక్తమోక్షణవిరేచనములను పలుమారుచేయించుటవలన కోష్ఠము రిక్తముగనుండును. దానంజేసిబలహీనమై వాతముప్రకోపించును, కావున ఆ కుష్ఠరోగికి కుష్ఠహరములైన ఘృతాదిస్నేహములను పలుమారు పానముచేయించవలయును. అటులచేసినచో రక్తమోక్షణవిరేకములచే కోష్ఠమునందుసారములేకుండునట్టి ఆరోగికి వాతముప్రకోపించి శరీరమున కపాయమును గలుగజేయకుండును.

## వజ్రక ఘృతము.

వాసామృతానింబవరాపటోలవ్యాఘ్రీకరంజోదకకల్కపక్వమ్,

సర్పిర్విసర్పజ్వరకామలాస్రకుష్ఠాపహం వజ్రకమామనంతి. ౧౮

అడ్డసరము, తిప్పతీగె, వేము త్రిఫలములు, చేదుపొట్ల, వాకుడు, కానుగు, అనువానిని సమభాగములుగగ్రహించి, ఉదకములోవైచి, పాదావశేషముగకషాయము కాచి, వడియకట్టి, అందులో; పై అడ్డసరము మొదలగుద్రవ్యములను సమభాగములుగ గ్రహించి కల్కము చేసికలిపి; ఆవునేతినిపోసి, ఘృతపాకవిధిగ పక్వము చేయవలయును.

దీనిని వజ్రకఘృతమని మహర్షులు చెప్పెదరు. ఇది విసర్పము, జ్వరము, కామిల, రక్తదోషము, కుష్ఠువు, వీనిని పోకడచును.

## మహావజ్రకఘృతము.

త్రిఫలాత్రికటుద్వికంటకారీ కటుకాకుంభనికుమ్భరాజవృక్షైః,
సవచాతివిషాగ్నికైస్సపాఠైః పిచుభాగైర్నవవజ్రదుగ్ధముష్ట్యై
పిష్టైస్సిద్ధం సర్పిషః ప్రస్థమేభిః క్రూరే కోష్ఠే స్నేహనం రేచనం చ,
కుష్ఠశ్విత్రప్లీహవర్ధ్మాశ్మగుల్మాన్ హన్యాత్కృచ్ఛ్రాంస్తన్మహావజ్రకాఖ్యం.

త్రిఫలములు, త్రికటుకములు, పెద్దములక చిన్నములక, కటుకరోహిణి, తెల్లతెగడ, దంతి, రేల, వస, అతివస, చిత్రమూలము, చిరుబొద్ది, అనువానినిదినుసుకు కర్షప్రమాణముచొప్పున గ్రహించి, అపుడే తీయబడిన జెముడుపాలతో నూరి, 1 ప్రస్థము ఘృతములో కలిపి, అందులో నాల్గు ప్రస్థములు శుద్ధోదకము చేర్చి, ఘృతపాకవిధిగ పాకము చేయవలయును. ఇది మహావజ్రకఘృతమనబడును. క్రూరకోష్ఠముగలవారికి స్నేహవిరేచనకర్మలయందు ప్రశస్తమైనది. దీనియుపయోగముచేత కుష్టము, శ్విత్రము, ప్లీహము, వృద్ధి, అశ్మరి, గుల్మము, మూత్రకృచ్ఛ్రము, వీనిని పోగొట్టును.

## కుష్ఠమునకు దంతీఘృతము.

దంత్యాఢకకషాయం ద్రోణే పక్త్వా తేన ఘృతం పచేత్,
ధామార్గవఫలే పీతం తమూర్ధ్వాధో విశుద్ధికృత్. ౨౧

దంతివేళ్లు 16 పలములను ద్రోణప్రమాణముదకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి, వడియకట్టి; అందులో 1 ప్రస్థము ఘృతము, 1 పలము చేదుబీరకల్కము, వీనినిచేర్చి ఘృతపాకవిధిగ పక్వము చేయవలయును. దీనిని పానము చేసిన వమనవిరేచనంబులై ఊర్ధ్వాధోభాగములు శుద్ధియగును.

## ఆవర్తకీ ఘృతము.

ఆవర్తకీతులాం ద్రోణే పచేదష్టాంశశేషితమ్,
తస్మాలైస్తత్ర నిర్వ్యూహే ఘృతప్రస్థం విపాచయేత్. ౨౨
పీత్వా తదేకదివసాంతరితం సుజీర్ణం
భుంజీత కోద్రవసుసంస్కృతకాంజికేన,
కుష్ఠం కిలాసమపచీం చ విజేతుమిచ్ఛ
న్నిచ్ఛన్ ప్రజాం చ విపులాం గ్రహణం స్మృతిం చ. ౨౩

1 తులము (నూరుపలములు) నులిదడను ద్రోణప్రమాణముదకములోవైచి, 8 వ

భాగము మిగులునటుల కషాయము కాచి వడియకట్టి, అందులో నలిదడవేళ్లకల్కము 1 ప్రస్థము, ఆవునెయ్యి 1 ప్రస్థము కలిపి, ఘృతపాకవిధిగ పక్వముచేయవలయును. ఈ ఘృతమును దినముఏడచి దినము పానముచేయించి, అది జీర్ణమైనపిదప ఆరికెబియ్యపు గంజినిప్పించిన, కుష్ఠము, కిలాసము, అపచి, ఈరోగములు నివర్తించును. సంతానము గ్రహణశక్తి స్మృతి ఇవి విశేషముగ వృద్ధియగును.

### కుష్ఠమునకు సౌవర్చలలవణతైలము.

యత్తైలే లీఢకవసా క్షౌద్రజాతీరసాన్వితా,
కుష్ఠఘ్నీ సమసర్పిర్వా సగాయత్రీత్రిఫలోదకా. ౨౪

స్త్రీసంభోగము చేయకుండునట్టి కుష్ఠరోగికి సౌవర్చలలవణతైలములో తేనె, బోడతరము, కలిపిగాని, లేక పై తైలమునకు సమము ఆవునెయ్యి చేర్చి, అందులో చండ్ర, వేగిస, ఈ 2 ద్రవ్యములతో సిద్ధము చేయబడినకషాయమును కలిపిగాని పానము చేయించిన కుష్ఠరోగము నివర్తించును.

### కుష్ఠరోగికి పథ్యాపథ్యవస్తువులు.

శాలయో యవగోధూమాః కోరదూషాః ప్రియంగవః,
ముద్గా మసూరాస్తువరీతిక్తశాకాని జాంగలమ్. ౨౫
వరాపటోలఖదిరనింబారుష్కరయోజితమ్,
మద్యాన్యౌషధగర్భాణి మథితం చేందురాజిమత్. ౨౬
అన్నపానం హితం కుష్ఠే న త్వమ్లలవణోషణమ్,
దధిదుగ్ధగుడానూపతిలమాషాంస్త్యజేత్తరామ్ ౨౭

సంబావుబియ్యము, యవలు, గోధుమలు, ఆరుకలు కొఱ్ఱలు, పెసలు, చిరుసెనగలు, కందులు, చేదురసముగల శాకములు, జాంగలమాంసము, వీనికి; త్రిఫలములు, చేదుపొట్ల, చండ్ర, వేము, జీడి, అనువానితో చేర్చి పక్వముచేసి యిప్పించిన కుష్ఠరోగికి పథ్యముగనుండును. మఱియు ఔషధములతో పక్వముచేయబడిన మద్యములు, కాలుగచ్చ, చేర్చి బాగుగ చిలకబడినమజ్జిగ, ఇవియన్నియును హితకరములు. పులుసు, ఉప్పు, కారము, అను రసములతో గూడియుండు అన్నపానాదులు కుష్ఠమునందు హితకరములు కానేరవు. కుష్ఠరోగి పెరుగు, పాలు, బెల్లము, అనూపదేశజంతుమాంసము, నువ్వులు, ఉద్దులు, వీనినెల్లపుడును వర్జింపవలయును.

### పటోలమూలాదికషాయము.

పటోలమూలత్రిఫలా విశాలా పృథక్త్రిభాగా పచితత్రిశాణాః,
స్యుస్త్రాయమాణా కటురోహిణీచ భాగార్ధకేనాగరపాదయుక్తే.

ఏతత్ఫలం జర్జరితం విపక్వం జలే పిబేద్దోషవిశోధనాయ,
జీర్ణే రసైర్ధన్వమృగద్విజానాం పురాణశాల్యోదనమాదదీత ౨౯
కుష్ఠంకిలాసం గ్రహణీప్రదోషమర్శాంసికృచ్ఛ్రాణిహలీమకంచ,
షడ్రాత్రియోగేననిహంతి చైతద్ధృద్వస్తిశూలం విషమజ్వరంచ.

చేదుపొట్లపెల్లు, కరక్కాయలు, తానికాయలు, ఉసిరికెపరుగు, పెద్దపాపర ఇవి దినుసుకు 16 ధానకములు, కలుక్రానుగు 6 ధానకములు, కటుకరోహిణి 6 ధానకములు, శుంఠి 3 ధానకములు, యిటుల వీనినన్నిటిని చేర్చి నలియగొట్టి యుదకములో వైచి చక్కగక షాయముకాచి, దోషము శుద్ధంబగుటకై పానము చేయించవలయును. అది జీర్ణమైన పిదప జాంగలదేశమృగపక్షులమాంసరసములతో పాతసంబావుబియ్యపు అన్నముసు భుజింపజేయవలయును. ఇటుల 6 దినములు చేసిన కుష్ఠువు, కిలాసము, గ్రహణీదోషము, అర్శోరోగము, మూత్రకృచ్ఛ్రము, హలీమకము, ఱొమ్మునొప్పి, పొత్తికడుపు శూల, విషమజ్వరము, ఇవి నిశ్శేషముగ నివర్తించును.

## విడంగసారాది సిద్ధయోగము.

విడంగసారామలకాభయానాం పలత్రయం త్రీణి ఫలాని కుంభాత్,
గుడస్యచద్వాదశ మాసమేష జితాత్మనాం హంత్యుపయుజ్యమానః.
కుష్ఠం శ్విత్రం శ్వాసకాసోదరార్శో
మేహప్లీహగ్రంథ్యరుగ్జంతుగుల్మాన్
సిద్ధం యోగం ప్రాహ యక్షోర్ముముక్షో
ర్భిక్షోః ప్రాణాన్మాణిభద్రః కిలేమమ్. ౩౨

వాయువిడంగములసారము 1 పలము, ఉసిరికవరుగు 1 పలము, కరక్కాయలు 1 పలము, తెల్లతెగడ 3 పలములు, పాతబెల్లము 12 పలములు, ఇటుల వీనినన్నిటిని ఒకటిగజేర్చి, యొకదినమునకు $\frac{1}{3}$ పలము, 9 ధానకములు, 3 రక్తులు చొప్పున 1 మాసమువరకు సేవింపుచు స్త్రీసంభోగము చేయకుండిన; కుష్ఠువు, శ్విత్రము, శ్వాసము, కాసము, ఉదరరోగము, అర్శస్సు. ప్రమేహము, ప్లీహను, గ్రంథి, క్రిమిరోగము, గుల్మము, యివి నిశ్శేషముగ నివర్తించును. ఉపద్రవములను సహింపజాలక ప్రాణములను విడుచుటకు యత్నింపుచుండు ఒకానొక సన్యాసికి మాణిభద్రుడను పేరంబరంగు యక్షరాజు ఈ సిద్ధయోగము నుపదేశించెను.

## భూనింబాదిమార్గము.

భూనింబనింబత్రిఫలాపద్మకాతివిషాకణాః,
ధూర్వ్యాపటోలీఘ్వవిశాపాఠాతిక్తేంద్రవారుణీః. ౩౩

సకళింగవచాస్తుల్యా ద్విగుణాశ్చ యథోత్తరమ్,
లిహ్యాద్దంతీత్రివృద్బ్రాహ్మీశ్చూర్ణితా మధుసర్పిషా. 34
కుష్ఠమేహప్రసుప్తీనాం పరమం స్యాత్తదౌషధమ్,

నేలవేము, వేము, త్రిఫలములు, పద్మకము, అతివస, పిప్పళ్లు, చాగ, చేదుపొట్ల, పసుపు, మ్రానిపసుపు, చిరుబొద్ది, కటుకరోహిణి, పెద్దపాపర, కొడిసెవిత్తులు, వస, ఇవి, సమభాగములు; దంతి 1 భాగము, తెల్లతెగడ 2 భాగములు, మండూకబ్రహ్మి 4 భాగములు, ఇటుల వీనినన్నిటి నేకముజేసి చక్కగ చూర్ణముచేసి; తేనె ఆవు నెయ్యి వీనిలోకలిపి నాకించవలయును. ఇది కుష్ఠువు ప్రమేహము ప్రసుప్తివాతము ఈ రోగములకు శ్రేష్ఠమైన యౌషధము.

### కుష్ఠరోగమున త్రిఫలాదిచూర్ణము.

వరావిడంగకృష్ణా వా లిహ్యాత్తైలాజ్యమాక్షికైః. 35

త్రిఫలములు, వాయువిడంగములు, పిప్పళ్లు, వీనిని సమభాగములుగ గ్రహించి, చక్కగ చూర్ణముచేసి; నువ్వులనూనె, ఆవునెయ్యి, తేనె, వీనిలోకలిపి నాకించిన, కుష్ఠరోగము హరించును.

### కాకోదుంబరికాది కషాయము.

కాకోదుంబరికావేల్లనింబాబ్దవ్యోషకల్కవాన్,
హంతి వృక్షకనిర్యూహః పానాత్సర్వాం స్త్వగామయాన్. 36

బ్రహ్మమేడి, వాయువిడంగములు, వేము, తుంగముస్తలు, త్రికటుకములు, వీని కల్కమును కొడిసెపాలకషాయములో కలిపి, పానముచేయించినచో చర్మరోగము లన్నియు నివర్తించును.

### కుష్ఠహర హారీతకీ.

కుటజాగ్నినింబనృపతరుఖదిరాసనసప్తపర్ణనిర్యూహే,
సిద్ధా మధుఘృతయుక్తాః కుష్ఠఘ్న్యో భక్ష్యేదభయాః.

కొడిసె, చిత్రమూలము, వేము, రేల, చండ్ర, వేగిస, ఏడాకులపొన్న, వీని కషాయములో కరక్కాయల నుడికించి, వానిని తేనె, ఆవునెయ్యి, వీనితో భక్షించిన కుష్ఠరోగములు హరించును.

### కుష్ఠహరదార్వ్యాది కషాయము.

దార్వీఖదిరనింబానాం త్వక్క్వాథః కుష్ఠసూదనః, 37

మ్రానిపసపు, చంద్ర, వేము, వీని పట్టలను సమభాగములుగ నుదకములో వైచి కాచబడిన కషాయమును పానముచేయించిన కుష్ఠరోగము హరించును.

## వాతకుష్ఠమునకు నిశాది కషాయము.

నిశోత్తమానింబపటోలమూలతిక్తావచాలోహితయష్టికాభిః,
కృతః కషాయః కఫపిత్తకుష్ఠం సుసేవితో ధర్మ ఇవోచ్ఛినత్తి. ౩౮
ఏభిరేవ చ శృతం ఘృతముఖ్యం భేషజైర్జయతి మారుతకుష్ఠమ్,
కల్పయేత్ఖదిరనింబగుడూచీదేవదారురజనీః పృథగేవమ్. ౩౯

పసుపు, త్రిఫలము , వేము, చేదుపొట్లవేళ్లు, కటుకరోహిణి, వస, మంజిష్ఠి, వీనిని సమభాగములుగ గ్రహించి యుదకములోవైచి కాచబడినకషాయమును సేవించి నచో కఫపిత్త కుష్ఠవులు హరించును. మఱియు పై చెప్పిన పసుపు మొదలగుద్రవ్య కషాయకల్కములతో కాచబడిన ఘృతము వాతకుష్ఠమును పోగొట్టును. చంద్ర, వేము, తిప్పతీగె, దేవదారు, పసుపు, వీనిని వేర్వేరుగ ఆవునేతిలో వైచి ఘృతపాకవిధిగ కాచబడిన ఘృతము కుష్ఠరోగమును పోగొట్టును.

## పాఠాది చూర్ణము.

పాఠాదార్వీవహ్నిగుణేష్టాకటుకాభి
ర్మూత్రం యుక్తం శక్రయవైశ్చోష్ణజలం చ,
కుష్ఠీ పీత్వా మాసమరుక్స్యాద్గుదకీలీ
మేహీ శోఫీ పాండురజీర్ణీ క్రిమిమాంశ్చ. ౪౦

చిరుబొద్ది, మ్రానిపసుపు, చిత్రమూలము, అతివస, కటుకరోహిణి, కొడిసె విత్తులు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి;గోమూత్రములోగాని, ఉష్ణో దకములోగాని, కలిపి 1 మాసమువరకు పానముచేయించిన; కుష్ఠువు, గుదకీలము, ప్రమేహము, వాపు, పాండువు, అజీర్ణము, కృమిరోగము, ఇవి నివర్తించును.

## కుష్ఠరోగమున లాక్షాదిచూర్ణము.

లాక్షాదంతీమధురసవరాద్వీపిపాఠావిడంగం
ప్రత్యక్పుష్పీత్రికటురజనీసప్తపర్ణాటరూషమ్,
రక్తా నింబం సురతరుకృతం పంచమూల్యౌ చ చూర్ణం
పీత్వా మాసం జయతి హితభుగ్గవ్యమూత్రేణ కుష్ఠమ్. ౪౧

లక్క, దంతి, చాగ, త్రిఫలములు, చిత్రమూలము, చిరుబొద్ది, వాయువిడంగ ములు, ఉత్తరేణు, త్రికటుకములు, పసుపు, ఏడాకులపొన్న, అడ్డసరము, మంజిష్ఠి,

మూలములు, వీనిని సమభాగములుగ గ్రహించి చక్కగ చూర్ణ లోకలిపి 1 మాసము పానముచేయించిన కుష్ఠరోగము హరించును.

## కుష్ఠమునకు సిశాదిచూర్ణము

రవేల్లతౌవరం సవహ్నితాప్యం క్రమశో వివర్ధితమ్,
వటకీకృతం తథా నిహంతి కుష్ఠాని సుదారుణాన్యపి.

స్వ, శుంఠి, వాయువిడంగములు, సీరుడువిత్తులు, చిత్రమూలము, క్రమముగ నొకదానికంటె నొకటిని హెచ్చించి గ్రహించి ముచేసి గోమూత్రములోకలిపి పానముచేయించినను; లేక పైద్ర జేసి సేవించినను; దారుణమైన కుష్ఠరోగములన్నియు హరించును.

## సప్తసమాగుటికలు.

ాతిలారుష్కరాజ్యమాక్షికసితోపలా విహితా
మనం స్యాత్కుష్ఠజిచ్చ వృష్యా చ సప్తసమా. ౭౩

, త్రిఫలములు, నువ్వులు, జీడిగింజలు, ఆవునెయ్యి, తేనె, పంచ ములుగ గ్రహించినూరి గుటికలుజేయవలయును. ఇది సప్తసమ కుష్ఠములను పోకడచును. వీర్యవృద్ధిని గలుగజేయును. రసాయన ణముకలది.

## కుష్ఠమునకు వాకుచ్యాదివటకములు.

లాగ్నిరజనీవిడంగ తువరాస్థ్యరుష్కరత్రిఫలాభిః,
ండాంశక్లృప్తాస్సమస్తకుష్ఠాని నాశయంత్యభ్యస్తాః ౭౪

చిత్రమూలము, పసుపు, వాయువిడంగములు, తువరాస్థి (సీరుడు త్రిఫలములు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి ర్చి వటకములుచేసి ప్రతిదినము సేవింపుచుండిన కుష్ఠరోము, ను.

## కుష్ఠమునకు విడంగాది మోదకములు.

ాతకవాకుచీనాం సద్వీపిపాఠాహిహారీతకీనామ్,
కృష్ణతిలోపకుల్యా గుడేన పిండీ వినిహంతి కుష్ఠమ్. ౭౫

ములు, జీడిగింజలు, కాలుగచ్చ, చిత్రమూలము, నేలతాడిగడ్డగ చర్లగడ్డ, నల్లచర్లగడ్డ, నల్లనువ్వులు, పిప్పళ్లు, వీనిని సమభాగము ముచేసి; అందులో బెల్లముకలిపి యుండలు చేయవలయును. దీని రోగమును పోకడచును.

### కుష్ఠమునకు వాకుచ్యాదిచూర్ణము.

శశాంకలేఖా సవిడంగమూలా సపిప్పలీకాసహుతాశమూలా,
సాయోమలాసామలకాస తైలా కుష్ఠాని కృచ్ఛ్రాణినిహంతిలీఢా.

కాలుగచ్చ, వాయువిడంగముల వేళ్లు, పిప్పళ్లు, చిత్రమూలపు వేళ్లు, ఇనుప చిట్టెము, ఉసిరికపరుగు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణము చేసి నువ్వులనూనె లోకలిపి నాకించిన దారుణమైన కుష్ఠువులన్నియు నివర్తించును.

### పథ్యాది గుటికలు.

పథ్యాతిలగుడైః పిండీ కుష్ఠం సారుష్కరైర్జయేత్,
గుడారుష్కరజంతుఘ్నసోమరాజీకృతాథవా. ౪౭

కరకాకాయలు, నువ్వులు, బెల్లము, జీడిగింజలు, వీనినిగాని; బెల్లము, జీడిగింజలు, వాయువిడంగములు, కాలుగచ్చ, వీనినిగాని; సమభాగములుగ గ్రహించి నూరి గుటికలుచేసి సేవించిన కుష్ఠువులు హరించును.

### కుష్ఠమున విడంగాదిచూర్ణము.

విడంగాద్రిజతు క్షౌద్రం సర్పిష్షాదిరం రజః,
కిటిభశ్విత్రదద్రుఘ్నం ఖాదేన్మితహితాశనః. ౪౮

వాయువిడంగములు, శిలాజిత్తు, చంద్ర, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణము చేసి; తేనె, ఆవునెయ్యి, వీనిలోకలిపి యిప్పించి పథ్యముగనుండు యాహారము మితముగ భుజింపజేసిన, కిటిభ శ్విత్ర దద్రు కుష్ఠువులు మానును.

### సితాదిచూర్ణము.

సితాత్రైలకృమిఘ్నాని ధాత్ర్యయోమలపిప్పలీః,
లిహానస్సర్వకుష్ఠాని జయత్యతిగురూణ్యపి. ౪౯

వాయువిడంగములు, ఉసిరికపరుగు, మండూరము, పిప్పళ్లు, పంచదార, వీనిని చూర్ణము చేసి, నువ్వుల నూనెలోకలిపి నాకించిన; దారుణములగు కుష్ఠరోగములన్నియు నశించును.

### కుష్ఠమునకు ముస్తాదిచూర్ణము.

ముస్తం వ్యోషం త్రిఫలా మంజిష్ఠా దారు పంచమూలే ద్వే,
సప్తచ్ఛదనింబత్వక్సవిశాలా చిత్రకో మూర్వా. ౫౦
చూర్ణం తర్పణభాగైర్నవభిస్సంయోజితం సమధ్వంశమ్,
నిత్యం కుష్ఠనిబర్హణమేతత్ప్రాయోగికం ఖాదేత్. ౫౧

శ్వయథుం సపాండురోగం శ్విత్రం గ్రహణీప్రదోషమర్శాంసి,
వర్ధ్మభగందరపిటికాకండూకోఠాపచీర్హ్నంతి ౫౨

తుంగముస్తలు, త్రికటుకములు, త్రిఫలములు, మంజిష్ఠ దేవదారు, దశమూలములు, ఏడాకులపొన్న, వేపచెక్క, పెద్దపాపర, చిత్రమూలము, చాగ వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి, అందులో 9 భాగములు సక్తువులనుచేర్చి తేనెతో ప్రతిదినము సేవింపుచుండినయెడ కుష్ఠువు, వాపు, పాండురోగము, శ్విత్రము, గ్రహణీరోగము, అర్శోరోగము, వృద్ధి, భగందరము, పిటికలు, దురద, కోఠరోగము, అపచీరోగము, ఇవి నిశ్శేషముగ నివర్తించును.

### తువరాస్థ్యాది యోగములు.

రసాయనప్రయోగేణ తువరాస్థీని శీలయేత్,
భల్లాతకం వాకుచికాం వహ్నిమూలం శిలాహ్వయమ్. ౫3

తువరాస్థినిగాని, జీడిగింజలనుగాని, కాలుగచ్చలనుగాని, చిత్రమూలమునుగాని, శిలాజిత్తునుగాని, రసాయనకల్పములో చెప్పియుండు విధిప్రకారము సేవించిన కుష్ఠరోగములు హరించును.

### కుష్ఠువునకు లేపము.

ఇతి దోషే విజితేం తస్త్వక్స్థే శమనం బహిః ప్రలేపాది హితమ్,
తీక్ష్ణాలేపోత్క్లిష్టం కుష్ఠం హి వివృద్ధిమేతి మలినే దేహే. ౫౪

ఇప్పుగిది చికిత్సచేయుటచేత శరీరమునకు లోభాగమునందుండు దోషములుశమించినపిదప, శరీరము వెలుపటనుండు కుష్ఠరోగము శమించుటకై ప్రలేపము ఇక చెప్పబోయెడు కషాయాదులచే స్నానము మొదలగు చికిత్సలు, వీనిని చేయించవలయును. దోషములతోగూడియుండు శరీరమునందు ప్రథమమున తీక్ష్ణమైన ప్రలేపము మొదలగు చికిత్సలనుజేసిన కుష్ఠువు వృద్ధిజెందును. కావున తొలుత శరీరములోపలనుండు దోషములకు చికిత్సచేయవలయును.

### స్థిర-కఠిన-మండలకుష్ఠ చికిత్స

స్థిరకఠినమండలానాం కుష్ఠానాం పోట్టలైర్హితస్స్వేదః,
స్విన్నోత్సన్నం కుష్ఠం శస్త్రైర్లిఖితం ప్రలేపనైర్లింపేత్. ౫౫

స్థిరముగ కఠినముగనుండు మండలములుగల కుష్ఠరోగమునకు తొలుత పోటల స్వేదమును (పొట్లములుకట్టివానిచే కాపడముబెట్టుట). చేయించవలయును. స్వేదకర్మ

చేయుటచే కొంచెము మృదుత్వమును జెందియుండు కుష్ఠవ్రణమును శస్త్రముచే లేఖనముచేసి పిదప ఔషధ లేపనాదులచే చికిత్స చేయవలెను.

కుష్ఠమునకు రక్తమోక్షణ క్షారకర్మలు

యేషు న శస్త్రం క్రమతే స్పర్శేంద్రియనాశనేషు కుష్ఠేషు,
తేషు నిపాత్యః క్షారో రక్తం దోషం చ విస్రావ్యమ్. ౫౮

స్పర్శేంద్రియమును నశింపజేయునదియు, శస్త్రకర్మ చేయదగినదియునైన కుష్ఠరోగములయందు దుష్టరక్తమును వెలిపుచ్చి, క్షారకర్మను చేయించవలయును.

కుష్ఠమునకు ఔషధలేపము.

లేపోఽతికఠినే పరుషే సుప్తే కుష్ఠే స్థిరే పురాణే చ,
పీతాగదస్య కార్యో విషైస్సమంత్రోగదైశ్చాను. ౫౭

తాయివలె కఠినముగనుండునదియును, లేక స్పర్శజ్ఞాన రహితంబుగనుండునదియును, స్థిరముగ బహుకాలమనువర్తింపుచుండునదియు నైన కుష్ఠరోగమునందు, లోనికి ఔషధము నిప్పించి, వెలుపల ఔషధనమును దట్టముగ లేపనము చేయవలయును. మఱియు విషమువలన జనించిన కుష్ఠమునందు మంత్రములచే నభిమంత్రించి ఔషధములచే లేపనము చేయవలయును.

స్తబ్ధమండలకుష్ఠ చికిత్స.

స్తబ్ధాతిసుప్తసుప్తాన్యస్వేదనకండలాని కుష్ఠాని,
ఘృష్టాని శుష్కగోమయఫేనకశస్త్రైః ప్రదేహ్యాని. ౫౮

స్తబ్ధముగను, స్పర్శజ్ఞానశూన్యముగను, స్వేదకర్మ చేయతగనిదిగను, కొంచెము స్పర్శజ్ఞానముగలదిగను, దురదతోగూడినదిగనుండు కుష్ఠములను యెండిన యేరుపిడకలచేగాని, సముద్రపునురుగుచేగాని, శస్త్రములచేగాని, రాచి ఔషధములను లేపనము చేయవలయును.

కుష్ఠమునందు స్నానాదులు.

ముస్తాత్రిఫలా మదనం కరంజ ఆరగ్వధకలింగయవాః,
సప్తాహ్వాకుష్ఠఫలినీదార్వీసిద్ధార్థకం స్నానమ్. ౫౯
ఏష కషాయో వమనం విరేచనం వర్ణకస్తథోద్ధర్షః,
త్వగ్దోషకుష్ఠశోఫప్రబోధనః పాండురోగఘ్నః. ౬౦

తుంగముస్తలు, త్రిఫలములు, మంగపండు, కానుగు, రేల, కొడిసెవిత్తులు, ఏడాకులపొన్న, చెంగల్వకోష్టు, ప్రేంకణము, మానిపసుపు, తెల్లఆవాలు, వీనిని చేరి

-చిన యుదకముచే కుష్ఠరోగికి స్నానము చేయించవలయును. మఱియు పై ముస్తాది
, వ్య కషాయమును ఇప్పించిన వమనవిరేచనంబులగును. పై ముస్తాది ద్రవ్యములను
=రి నలుగు పెట్టుకొనిన శరీరమునకు మంచివర్ణము కలుగును. చర్మదోషము, కుష్ఠువు,
ఫ, పాండురోగము, ఇవి హరించును.

## కుష్ఠమునకు కరవీరాది లేపము.

కరవీరనింబకుటజాచ్ఛమ్యాకాచ్చిత్రకాచ్చ మూలానామ్,
మూత్రే దర్వీలేపీ క్వాథో లేపేన కుష్ఠఘ్నః. ౬౧

గన్నేరు, వేము, కొడిసెపాల, రేల, చిత్రమూలము, వీనివేళ్లనునూరి 4 గింతల
మూత్రములో కలిపి గరిటెకంటువరకు పాకముజేసి శరీరమునకు లేపనముచేసిన
ష్ఠరోగము హరించును.

## కుష్ఠమునకు శ్వేతకరవీరాది లేపము.

శ్వేతకరవీరమూలం కుటజకరంజాత్ఫలం త్వచో దార్వ్యాః,
సుమనః ప్రవాళయుక్తో లేపః కుష్ఠాపహస్సిద్ధః. ౬౨

తెల్లగన్నేరువేరు, కొడిసెపాలవిత్తులు, కానుగువిత్తులు, మ్రానిపసుపుబెరడు, విర
జాజిచిగుళ్లు, వీనిని యొక్కటిగా నూరి లేపనముచేసిన కుష్ఠరోగము హరించును.

## శ్విత్రకుష్ఠమునకు శిరీషత్వగాది లేపము.

శైరీషీత్వక్పుష్పం కార్పాస్యా రాజవృక్షపత్రాణి,
పిష్ట్వా చ కాకమాచీ చతుర్విధః కుష్ఠహా లేపః ౬౩
వ్యోషసర్షపనిశాగృహధూమైర్యావశూకపటుచిత్రకకుష్ఠైః,
కోలమాత్రగుటికార్ధవిషాంశైః శ్విత్రకుష్ఠహరణో వరలేపః ౬౪

దిరిశనపుపట్ట, ప్రత్తిపువ్వు, రేలచిగుళ్లు, కాచిమూర, వీనిని వేరువేరుగ నూరి
రమునకు లేపనముచేసికొనిన, కుష్ఠువు నివర్తించును. మఱియు త్రికటుకములు,
వాలు, పసుపు, కరుధూపము, యవక్షారము, సైంధవలవణము, చిత్రమూలము, చెం
ఙ్గకోష్ఠు,వీనిని సమభాగములుగ గ్రహించి నూరి అందులో అర్ధభాగము వత్సనాభి
పి రేగుపండంత గుటికలుచేసి చాది శరీరమునకు లేపనముచేసిన శ్విత్రమును, కుష్ఠమును
రించును.

## కుష్ఠరోగహరోద్వర్తనము.

నింబం హరిద్రే సురసం పటోలం కుష్ఠాశ్వగంధే సురదారు శిగ్రుః,
ససర్షపం తుంబురుధాన్యవన్యం చండావచూర్ణాని సమాని కుర్యాత్.

తైలైస్తక్రపిష్టైః ప్రథమం శరీరం తైలాక్తముద్వర్తయితుం యతేత,
తేనాస్య కండూపిటికాస్సకోఠాః కుష్ఠాని శోభాశ్చ శమం ప్రజంతి.

కుష్ఠరోగి శరీరమునకు నువ్వులనూనెను లేపనముజేసికొని; వేము, పసుపు, మ్రానిపసుపు, తులసి, చేదుపొట్ల, చెంగల్వకోష్టు, పెన్నేరుగడ్డ, దేవదారు, మునగ, ఆవాలు, తుమికి, కొతిమర్లు, వట్టివేరు, లింగిదొండ, వీనినన్నిటిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి ఆవు మజ్జిగలోకలిపి దానిచే నలుగుపెట్టికొని ఉష్ణోదకములో స్నానముచేసిన యెడ దురద, పిటికలు, కోఠరోగము, కుష్ఠువులు, వాపు, ఇవి నిశ్శేషముగ హరించును.

కుష్ఠమునకు ముస్తాదిచూర్ణోద్వర్తనము.

ముస్తామృతాసంఘుకటంకశేరీకాసీసకంపిల్లకకుష్ఠరోధ్రాః,
గంధోపలస్సర్జరసో విడంగం మనశ్శిలాలే కరవీరకత్వక్. ౬౭
తైలాక్తగాత్రస్య కృతానిచూర్ణాన్యేతాని దద్యాదవచూర్ణనార్థమ్
దద్రుస్సకండూః కిటిభాని పామా విచర్చికా చేతి తథా న సంతి ౬౮

కుష్ఠరోగికి తొలుత నువ్వులనూనెను శరీరమునకు బూసి తుంగముస్తలు, తిప్పతీగె, ఆసంఘము, మ్రానిపసుపు, కాసీసము, కంపిల్లకము, చెంగల్వకోష్టు, లొద్దుగు, గంధకము, సర్జరసము, వాయువిడంగములు, మణిశిల, హారిదళము, గన్నేరుపట్ట, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి యాచూర్ణమునే నలుగు పెట్టించిన దద్రుకుష్ఠువు, దురద, కిటిభకుష్ఠువు, గజ్జి, విచర్చిక, ఇవి నివర్తించును.

కుష్ఠువునకు సర్షపాదిలేపనము.

స్నుగ్దండే సర్షపాత్కల్కః కుకూలానలపాచితః,
లేపాద్విచర్చికాం హంతి రాగవేగ ఇవ త్రపామ్. ౬౯
మనశ్శిలాలేమరిచాని తైలమార్కం పయఃకుష్ఠహరః ప్రదేహః,
తథా కరంజప్రపునాటబీజం కుష్ఠాన్వితం గోసలిలేన పిష్టమ్. ౭౦

జముడుకాడలు, ఆవాలు, వీనినినూరి కల్కముచేసి ఊకనిప్పులో నుడికించి, లేపనముచేసిన నయ్యది "లజ్జను ఆశ నశింపజేయుభంగి" విచర్చికా కుష్ఠువును నశింపజేయును. మఱియు మనశ్శిల, హారిదళము మిరియాలు, వీనినినూరి నువ్వులనూనెలో కలిపి అందులో జిల్లేడుపాలను చేర్చి శరీరమునకు లేపనముచేసినను; లేక క్రానుగవిత్తులు, తగరిసెవిత్తులు, చెంగల్వకోష్టు, వీనిని సమభాగములుగ గ్రహించి గోమూత్రముతో నూరి లేపనముచేసినను కుష్ఠువు హరించును.

### కుష్ఠమునకు గుగ్గుల్వాదిచూర్ణము.

గుగ్గులుమరిచవిడంగైస్సక్షపకాసీససర్జరసముస్తైః,
శ్రీవేష్టకాలగంధైర్మనశ్శిలాకుష్ఠకంపిల్లైః. ౭౧
ఉభయహరిద్రాపహితైశ్చాక్రికతైలేన మిశ్రితైరేభిః,
దినకరకరాభితప్తైః కుష్ఠం ఘృష్టం చ నష్టం చ. ౭౨

గుగ్గిలము, మిరియాలు, వాయువిడంగములు, ఆవాలు, కాసీసము, సర్జరసము తుంగముస్తలు, శ్రీవేష్టకము, హరిదళము, గంధకము, మణిశిల, చెంగల్వకోష్టు, కంపిల్లము, పసుపు, మ్రానిపసుపు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణము చేసి చక్రజతైలములో కలిపి యెండలోనుంచి దానిని లేపనము చేసికొనిన, కుష్ఠరోగము తత్క్షణమే నశించును. చక్రజతైలమనగా—గానుగలోనుండి అపుడేతీయబడి యుష్ణముగనుండు నువ్వులనూనె.

### కుష్ఠమునకు మరిచాదితైలము.

మరిచం తమాలపత్రం కుష్ఠం సమనశ్శిలం సకాసీసమ్,
తైలేన యుక్తముషితం సప్తాహం భాజనే తామ్రే. ౭౩
తేనాలిప్తం సిధ్మం సప్తాహాద్ఘర్మసేవినోఽపైతి,
మాసాన్నవం కిలాసం స్నానేన వినా విశుద్ధస్య. ౭౪

రాగిపాత్రలో నువ్వులనూనెనుబోసి అందులో మిరియాలు, తమాలపత్రము, చెంగల్వకోష్టు, మణిశిల, కాసీసము, వీనిని సమభాగములుగచేర్చి 7 దినములు నానబెట్టి, యానూనెను 7 దినములు, శరీరమునకు లేపనము చేసికొని గాలిలేని చోటనుండిన, సిధ్మకుష్ఠము నివర్తించును. పైతైలము నొక మాసము లేపనముజేసికొని స్నానము చేయకుండిన కిలాసకుష్ఠము హరించును.

### సిధ్మకుష్ఠమునకు మయూరకక్షారతైలము.

మయూరకక్షారజలే సప్తకృత్వః పరిస్రుతే,
సిద్ధం జ్యోతిష్మతీతైలమభ్యంగాత్సిధ్మనాశనమ్, ౭౫

ఉత్తరేణిక్షారమును ఉదకములోవైచి,7 పర్యాయములు వడియకట్టి, అందులో వెకుడుతీగె, నువ్వులనూనె, ఈరెంటిని కలిపి విధిప్రకారము పక్వముచేసి అభ్యంజనముచేసిన సిధ్మకుష్ఠము నశించును.

### సిధ్మకుష్ఠమునకు వాయసజంఘాదికల్కము.

వాయసజంఘామూలం వమనీపత్రాణి మూలకాద్బీజమ్,
తక్రేణ భౌమవారే లేపస్సిధ్మాపహస్సిద్ధః. ౭౬

కాకిదొండవేళ్లు, పత్తియాకు, ముల్లంగివిత్తులు, వీనినినూరి ఆవుమజ్జిగలో కలిపి మంగళవారమున లేపనము చేసికొనిన సిధ్మకుష్ఠువు హరించును.

### విపాదికాహార తైలము.

జీవంతీ మంజిష్ఠా దార్వీ కంపిల్లకం పయస్తుత్థమ్,
ఏష ఘృతతైలపాకస్సిద్ధస్సిద్ధే చ సర్జరసః ౭౭
దేయస్సమధూచ్ఛిష్టో విపాదికా తేన నశ్యతి హ్యక్తా,
చర్మైకకుష్ఠకిటిభం కుష్ఠం శామ్యత్యలసకం చ. ౭౮

పిన్నమనుబాల, మంజిష్ఠి, మ్రానిపసుపు, కంపిల్లకము, జిల్లేడుపాలు, మైలుతుత్తము, వీనినినూరి; ఆవునెయ్యి, నువ్వులనూనె, వీనిలోకలిపి; పాకము చేసి, అందులో సర్జరసము, మైనము, వీనినికలిపి దానిచే కాలిపగుళ్లకు లేపనముచేసిన నది శీఘ్రముగ నివర్తించును. మఱియు దీనిని చర్మకుష్ఠము, కిటిభము, అలసకము, ఈరోగములకు లేపనము చేసిన నవి నశించును.

### వజ్రకతైలము.

మూలం సప్తాహ్వాత్త్వక్షీరీషాశ్వమారా
దర్కాన్మాలత్యాశ్చిత్రకాస్ఫోతనింబాత్,
బీజం కారంజం సార్షపం ప్రాపునాటం
శ్రేష్ఠా జంతుఘ్నం త్ర్యూషణం ద్వే హరిద్రే. ౭౯
తిలతైలం సాధితం తైస్సమూత్రైః
త్వగ్దోషాణాం దుష్టనాడీవ్రణానామ్,
అభ్యంగేన శ్లేష్మవాతోద్భవానాం
నాశాయాలం వజ్రకం వజ్రతుల్యం. ౮౦

ఏడాకులపొన్నవేళ్లు, దిరిసెనము, గన్నేరు, జిల్లేడు, జాజి, చిత్రమూలము, తెల్లజిల్లేడు, వేము, వీనిపట్టలు; కానుగవిత్తులు, ఆవాలు; తగరిసవిత్తులు, త్రిఫలములు, వాయువిడంగములు, త్రికటుకములు, పసుపు, మ్రానిపసుపు, వీనిని సమభాగములుగ గ్రహించి నూరి నువ్వులనూనెలో కలిపి, దానికి సమముగ గోమూత్రముబోసి, విధిప్రకారము పక్వము చేయవలయును. ఇది వజ్రకతైలమనబడును. దీనిచే నభ్యంగము చేసికొనిన వాతకఫములవలన జనించిన చర్మదోషములు, దుష్టనాడీవ్రణములు హరించును.

### మహావజ్రకతైలము.

ఏరండతార్క్ష్యఘననీపకదంబభార్గీకంపిల్లవేల్లఫలినీసురవారుణీభిః,[విశ్వైః.
నిర్గుండ్యరుష్కర సురాహ్వసువర్ణదుగ్ధాశ్రీవేష్టగుగ్గులుశిలాపటుతాల

తుల్యస్నుగర్కదుగ్ధం సిద్ధం తైలం స్మృతం మహావజ్రమ్,
అతిశయితవజ్రకగుణం శ్విత్రార్శో గ్రంథిమాలాఘ్నమ్. ౮౨

ఆముదపుచెట్టు, రసాంజనము, తుంగముస్తలు, మద్ది, కడిమి, గంటుభారంగి, కంపిల్లము, వాయువిడంగములు, ప్రేంకణము, పిన్నపాపర, వావిలి, జీడి, దేవదారు, సువర్ణదుగ్ధ, (స్వర్ణక్షీరి), శ్రీవేష్టకము, గుగ్గిలము, మణిశిల, సైంధవలవణము, హారిదళము, శుంఠి, వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి నువ్వుల నూనెలో కలిపి నువ్వులనూనెకు సమభాగము జిల్లేడుపాలు, జెముడుపాలు, చేర్చి విధిప్రకారము తైలమును పాకముచేసిన నది మహావజ్రక తైలమనబడును. శ్విత్రము, అర్శస్సు, గ్రంథి, వీనిని పోగొట్టును. పైనిచెప్పిన వజ్రకతైలమునకంటె విశేషగుణముగలది.

కుష్ఠాదితైలము.

కుష్ఠాశ్వమారభృంగార్కమూత్రస్నుక్క్షీరసైంధవైః,
తైలం సిద్ధం విషావాపమభ్యంగాత్కుష్ఠజిత్పరమ్. ౮౩

చెంగల్వకోష్టు, గన్నేరు, గుంటకలగర, జిల్లేడు, గోమూత్రము, జెముడు పాలు, సైంధవలవణము,వీనిని సమభాగములుగ నువ్వులనూనెలో కలిపి విధిప్రకారము పక్వముచేసి, అందులో కొంచెము విషము (వసనాభిని) కలిపి, అభ్యంగము చేయించిన, కుష్ఠరోగము హరించును.

కటుతైలము.

సిద్ధం సిక్థకసిందూరపురతుత్థకతార్క్ష్యజైః,
కచ్ఛూం విచర్చికాం వాశు కటుతైలం సియచ్ఛతి. ౮౪

మైనము, సిందూరము, గుగ్గిలము, మైలుతుత్తము, రసాంజనము, వీనిని సమభాగములుగ గ్రహించి, ఆవనూనెలోకలిపి కాచి, దానిని దురద, విచర్చికాకుష్ఠుపు, వీని యందు చరిమిన నని శమించును.

లాక్షాదిలేపము.

లాక్షావ్యోషం ప్రపునాటం చ బీజం సశ్రీవేష్టం కుష్ఠసిద్ధార్థకాశ్చ,
తక్రోన్మిశ్రస్స్యాద్దరిద్రా చ లేపో దద్రూఘ్నాక్తో మూలకోత్థం చ బీజమ్.

లక్క, త్రికటుకములు, తగరిసవిత్తులు, శ్రీవేష్టకము (మడ్డిపాలు), చెంగల్వకోష్టు, తెల్లావాలు, పసుపు, వీనినిమారి ఆవుమజ్జిగలో కలిపి శరీరమునకు లేపనముజేసి

ను; ముల్లంగివిత్తులనునూరి ఆవుమజ్జిగలో కలిపి లేపనముచేసినను దద్రుకుష్ఠవులు రించును.

వాతశ్లేష్మకుష్ఠహరలేపనము.

చిత్రకశోభాంజనకౌ గుడూచ్యపామార్గదేవదారూణి,
ఖదిరో ధవశ్చ లేపః శ్యామా దంతీ ద్రవంతీ చ ౮౬
లాక్షారసాంజనైలా పునర్నవా చేతి కుష్ఠినాం లేపాః,
దధిమండయుతాః పాదైష్టాః ప్రోక్తా మారుతకఫకుష్ఠఘ్నాః. ౮౭.

చిత్రమూలము, మునగవిత్తులు, వీనినిగాని; తిప్పతీగె, ఉత్తరేణి, దేవదారు, వీనినిగాని; చంద్ర, వెలిచంద్ర, వీనినిగాని; నల్లసుగంధిపాల,లేక తెగడ, దంతి, ఎలుక చెవియాకు, అనువానినిగాని; లక్క, రసాంజనము, వీనినిగాని; ఏలకులు, గలిజేరు, వీనినిగాని; నూరి పెరుగుమీదిమీగడలో కలిపి లేపనముచేసిన వాతకఫములవలన జనించిన కుష్ఠరోగములన్నియు హరించును.

పిత్తకఫకుష్ఠహరలేపనము.

జలవాప్యలోహకేసరపత్రప్లవచందనమృణాళాని,
భాగోత్తరాణి సిద్ధం ప్రలేపనం పిత్తకఫకుష్ఠే. ౮౮

కురువేరు 1 భాగము, చెంగల్వకోష్టు 2 భాగములు, కృష్ణాగరు 3 భాగములు, నాగకేసరములు 4 భాగములు, ఆకుపత్రి 5 భాగములు, కైవర్తముస్తలు 6 భాగములు, చందనము 7 భాగములు, తామరతూడు 8 భాగములు, ఇటుల వీనినెల్ల నొకటిగచేర్చి నూరి లేపనముచేసిన పిత్తకఫకుష్ఠములు హరించును.

దహ్యమాన కుష్ఠచికిత్స.

తిక్తఘృతైర్ధౌతఘృతైరభ్యంగో దహ్యమానకుష్ఠేషు,
తైలైశ్చందనమధుకప్రపౌండరీకోత్పలయుతైశ్చ. ౮౯
క్లేదే ప్రపతతి చాంగే దాహే విస్ఫోటకే చ చర్మదళే,
శీతాః ప్రదేహసేకా వ్యధనవిరేకౌ ఘృతం తిక్తమ్. ౯౦

మంటతోగూడియుండు కుష్ఠములయందు చేదురసముగల ద్రవ్యములను చేర్చి పక్వముచేసిన ఘృతముచేతను; ఉదకముతో పలుమారు కడగబడినఘృతముచేతను, అభ్యంగము చేయవలయును. మఱియు శరీరమున క్లేదముకలిగి అంగములు రాలిపడుచుండిన, చందనము, అతిమధురము, ప్రపౌండరీకము, చెంగల్వకోష్ఠు, వీనిని సమముగ చేర్చి పక్వముచేయబడిన తైలముచే నభ్యంగము చేయవలయును. సర్వాంగతాపము, పొక్కలు, చర్మముపగుల్చుట యివి కలిగియుండిన, శీతముగనుండు పట్లు, సేకము, వీనిని చేయుటయేగాక, సిరలను వేధించి,విరేచనమున కిప్పించి, పూర్వముచెప్పియుండు మహాతిక్తకఘృతమును పానము చేయించవలయును.

### క్రిమికుష్ఠచికిత్స.

ఖదిరవృషనింబకుటజాశ్శ్లేష్మాః క్రిమిజిత్పటోలమధుపర్ణ్యః,
అంతర్బహిః ప్రయుక్తాః క్రిమికుష్ఠనుదస్సగోమూత్రాః. ౯౧

చంద్ర. అడ్డసరము, వేము, కొడిసెపాల, త్రిఫలములు, వాయువిడంగములు; వేదుపాట్లు, తిప్పతీగె, వీనిని గోమూత్రముతోనూరి, గోమూత్రముఃలోకలిపి, పాన లేపనములు చేయించిన, క్రిమికుష్ఠరోగములు హరించును.

### వాతపిత్తకఫాధిక కుష్ఠచికిత్స.

వాతోత్తరేషు సర్పిర్వమనం శ్లేష్మోత్తరేషు కుష్ఠేషు,
పిత్తోత్తరేషు మోక్షో రక్తస్య విరేచనం చాగ్ర్యమ్. ౯౨

వాతాధిక్యముగల కుష్ఠములయందు తొలుత ఘృతపానమును, శ్లేష్మాధిక్యముగల కుష్ఠములయందు తొలుత వమనమును, పిత్తాధిక్యకుష్ఠములయందు తొలుత రక్తమోక్షణ, విరేచనములను, చేయించవలయును.

### కుష్ఠమునకు ఔషధలేపప్రయోగక్రమము.

యే లేపాః కుష్ఠానాం యుజ్యంతే నిర్హృతాస్రదోషాణామ్,
సంశోధితాశయానాం సద్యస్సిద్ధిర్భవతి తేషామ్. ౯3

కుష్ఠరోగులకు రక్తమోక్షణాదులచే దుష్టరక్తమును వెలిపరచి, వమనవిరేచనంబుచే ఆశయములను శుద్ధిచేసి, పిదప పైచెప్పిన లేపనములను చేయించవలయును. ఇటు చేసిన పైభాగమునందలి (చర్మగతమైన) కుష్ఠదోషము శీఘ్రముగ నివర్తించును.

### కుష్ఠశమనోపాయము.

దోషే హృతేఽపనీతే రక్తే బాహ్యాంతరే కృతే శమనే,
స్నేహే చ కాలయుక్తే న కుష్ఠమతివర్తతే సాధ్యమ్. ౯౪

వాతాది ప్రకోపమువలన జనించినదోషమును శమింపజేసి, రక్తమోక్షణమును చేయించి, బాహ్యాభ్యంతరములయందు శమనౌషధముల ప్రయోగింపుచు, స్నేహము యాకాలమునందిప్పించుచుండిన, కుష్ఠము వృద్ధిజెందక సాధింపందగి యుండును.

### రక్తమోక్షణక్రమము.

బహుదోషస్సంశోధ్యః కుష్ఠీ బహుశోనురక్షతా ప్రాణాన్,
దోషే హ్యతిమాత్రహృతే వాయుర్హన్యాదబలమాశు. ౯౫

దోషాధిక్యముగల కుష్ఠరోగికి ప్రాణమునకపాయము గలుగనియ్యాక రక్షింపుచు పలుమారు వమనవిరేచనముల కిప్పించవలయును. రోగికి ఏకకాలమున దోషములన్నిటిని వమనవిరేచనాదులచే బైలుపరచినచో వాతము ప్రకోపించి దుర్బలుడుగనుండు నారో

గిని అతిశీఘ్రముగ జంపును.(కావున మెలమెల్లగ నానాట వమనవిరేచనముల చే కొంచెము కొంచెముగ వెడలించవలెను).

## కుష్ఠరోగికి వమనాది నియమము.

పక్షాత్పక్షాచ్ఛర్దనాన్యభ్యుపేయాన్మాసాన్మాసా చ్ఛోధనాన్య ప్యధస్తాత్,
శుద్ధిర్మూర్ధ్ని స్యాత్త్రిరాత్రాత్త్రిరాత్రాత్షష్ఠే షష్ఠే మాస్యసృఙ్మోక్షణాని.

బహుదోషముగల కుష్ఠరోగికి 15 దినముల కొకపర్యాయము వమనంబును, మాసమున కొకపర్యాయము విరేచనంబును, 3 దినముల కొకపర్యాయము నస్యాదులచే శిరశ్శోధనమును, 6 మాసముల కొకపర్యాయము రక్తమోక్షణమును చేయించవలయును.

## కుష్ఠమున దోషనిర్హరణావశ్యకత్వము.

యో దుర్వాంతో దుర్విరిక్తోఽథవాస్యా
త్కుష్ఠీ దోషై రుద్ధతై ర్వ్యాప్యతేఽసౌ,
నిస్సందేహం యాత్యసాధ్యత్వమేవం
తస్మాత్కృత్స్నాన్నిర్హరేదస్య దోషాన్. ౯౭

కుష్ఠరోగికి వమనవిరేచనౌషధముల నిప్పించియు చక్కగ వమనవిరేచనములు కాకుండిన, అట్టివానికి దోషములు ప్రకోపించి సర్వశరీరమునందును వ్యాపించి కుష్ఠము అసాధ్యతనుజెందును. కావున కుష్ఠరోగికి కడుప్రయత్నములచే సకల దోషములను నిశ్శేషముగ బైలుపరచవలయును.

## పాపకర్మజనితకుష్ఠహరోపాయము.

వ్రతదమయమసేవాత్యాగశీలాభియోగో
ద్విజసురగురుపూజా సర్వసత్త్వేషు మైత్రీ,
శివశివసుతతారాభాస్కరారాధనాని
ప్రకటితమలపాపం కుష్ఠమున్మూలయంతి. ౯౮

వ్రతములు, ఇంద్రియనిగ్రహము, తపస్సు, దానము, బ్రాహ్మణదేవ గురుపూజ, వీనిని సలుపుట; సర్వభూతములతో మైత్రి, పరమేశ్వరుడు, సుబ్రహ్మణ్యుడు, నక్షత్రములు, సూర్యుడు, వీరల నారాధించుట; యివి పూర్వజన్మ కృతపాపమువలన జనించిన కుష్ఠరోగములను నిశ్శేషముగ నివర్తింపజేయును.

ఏకోనవింశాధ్యాయము ముగిసెను.

# ఏంశాధ్యాయము.

అవ: "కుష్ఠైకసంభవం శ్విత్రం" అనువచన ప్రకారము కుష్ఠరోగ శ్విత్రరోగములకు కారణ మొకటిగనుండుటవలన కుష్ఠచికిత్సి తాధ్యాయ నిరూపణానంతరము శ్విత్ర క్రిమిచికిత్సి తాధ్యాయము చెప్పబడుచున్న యది.

## శ్విత్ర క్రిమి చికిత్సి తాధ్యాయప్రారంభము.

సూ. అథాతశ్శ్విత్రకృమిచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

కుష్ఠచికిత్సి తాధ్యాయ నిరూపణానంతరము శ్విత్ర క్రిమిరోగముల చికిత్సలను దెలియపరచునట్టి శ్విత్ర క్రిమి చికిత్సితమను నీ యధ్యాయమును వివరించెదము.

## శ్విత్రరోగ చికిత్సా వశ్యకత్వము.

కుష్ఠాదపి బీభత్సం యచ్ఛీఘ్రతరం చ యాత్యసాధ్యత్వమ్,
శ్విత్రమతస్తచ్ఛాంత్యై యతేత దీప్తే యథా భవనే ౧

శ్విత్రరోగము కుష్ఠరోగమునకంటె మిక్కిలి నింద్యంబుగనుండును. కడుశీఘ్రముగనే అసాధ్యతను జెందును. కావున "గృహమునకు నిప్పు అంటుకొనిన దానిని త్వరపడియార్చుచందంబున" శ్విత్రరోగముజనించినతోడ నేతగిన చికిత్స జేయవలయును.

## శ్విత్రరోగమున విరేచనము.

సంశోధనం విశేషాత్ప్రయోజయేత్పూర్వమేవ దేహస్య,
శ్విత్రే స్రంసనమగ్ర్యం మలయూరస ఇష్యతే సగుడః. ౨
తం పీత్వాభ్యక్తతనుర్యథా బలం సూర్యపాదసంతాపమ్,
సేవేత విరిక్తతనుస్త్ర్యహం పిపాసుః పిబేత్పేయామ్ 3

శ్విత్రరోగమున తొలుత విరేచనమునకై బ్రహ్మమేడికాయల రసమునందు బెల్లము పాలను చేర్చి యిప్పించవలయును. ఆరసము నిప్పించి, శరీరమున కభ్యంజనము చేయించి, శరీరముయొక్క శక్తికొలది యెండలోనుండునటుల చేయవలయును. విరేచనమైన పిదప పేయను 3 దినములు పానము చేయించవలయును.

## శ్విత్రమునకు మలయూది కషాయము.

శ్విత్రేఽంగే యే స్ఫోటా జాయంతే కంటకేన తాన్భింద్యాత్

స్ఫోటేషు నిఃస్రుతేషు తు ప్రాతః ప్రాతః పిబేత్త్రిపేసమ్. ౪
మలయూమసనం ప్రియంగూం శతపుష్పాం చాంభసా సముత్క్వా
పాలాశం వా క్షారం యథాబలం ఫాణితోపేతమ్. [థ్య,

శ్విత్రరోగికి అభ్యంజనము చేయించుటవలన శరీరమున పిటికలు జనించును. కావున ఆ పిటికలను ముండ్లతోపొడిచి వానిలోనుండు దోషములను నిశ్శేషముగ బైలు వెడలించి, పిష్మట బ్రహ్మమేడి, వేగిస, ప్రేంకణము, సదాప, వీనిని సమభాగములుగ నుదకములోవైచి చక్కగ కాచి యాకషాయమును ౩ దినములు ప్రాతః కాలములయందు పానము చేయించవలయును. లేక మోదుగక్షారమును ఖండశర్కర పాకము (జీరా) లో కలిపి రోగి బలానుగుణముగ పానము చేయించవలయును.

—॥ శ్విత్రస్ఫోటమునకు వాకుచీకల్కము. ॥—

ఫల్గ్వక్షవృక్షవల్కల నిర్యూహేణేందు రాజికాకల్కమ్,
పీత్వోష్ణస్థితస్య జాతే స్ఫోటే తక్రేణ భోజనం నిర్లవణమ్. ౫

బ్రహ్మమేడి, తాడి, యీ వృక్షముల పట్టలను గ్రహించి, యుదకములో వైచి చక్కగ కషాయముకాచి, అందులో కాలుగచ్చ కల్కమునుకలిపి, పానము చేయించి, యెండలోనుండునటుల జేయవలయును. పిటికలుజనించినచో ఆవుమజ్జిగతో ఉప్పులేని యన్నమును భుజింపజేయవలయును.

—॥ శ్విత్రకుష్ఠమునకు గోమూత్రపానము. ॥—

గవ్యం మూత్రం చిత్రకవ్యోషయుక్తం
సర్పిః కుంభే స్థాపితం క్షౌద్రమిశ్రమ్,
పక్షాదూర్ధ్వం శ్విత్రిభిః పేయమేత
త్కార్యంచాస్మై కుష్ఠదృష్టం విధానమ్. ౬

పాతనేతికుండలో గోమూత్రము పోసి యందు చిత్రమూలము, త్రికటుకములు, తేనె, వీనినికలిపి 15 దినములవరకుంచి, పిదప దానిని శ్విత్రరోగికి పానము చేయించుటయేగాక కుష్ఠరోగమునకు జెప్పియుండు చికిత్సలనుగూడ చేయవలయును.

—॥ శ్విత్రమునకు మార్కవ యోగము. ॥—

మార్కవమథవా ఖాదేద్భృష్టం తైలేన లోహపాత్రస్థమ్,
బీజకశృతం చ దుగ్ధం తదను పిబేచ్ఛ్విత్రనాశాయ. ౭

గుంటగలగరను నువ్వులనూనెతో వేయించి, యినుపపాత్రములో నుంచుకొని భక్షించి, వేగిసపట్టతో కాచబడిన ఆవుపాల ననుపానముగ నిచ్చినచో శ్విత్రరోగము శమించును.

శ్విత్రమునకు పూతీకాదిలేపము.

పూతీకార్కవ్యాధిఘాతస్నుహీనాం మూత్రే పిష్టాః పల్లవా జాతిజాశ్చ,
ఘ్నంత్యాలేపాచ్ఛ్విత్రదుర్నామదద్రూపామాకుష్ఠాన్దుష్టనాడీవ్రణాంశ్చ

సెమలడుగుమ్రాను, జిల్లేడు, రేల, జెముడు, వీనిచిగుళ్లనుగాని; జాజిచిగుళ్లను గాని, గోమూత్రముతో నూరి లేపనము చేసిన, శ్విత్రకుష్ఠువు, అర్శస్సు, దద్రుకుష్ఠువు, గజ్జి, కుష్ఠువు, దుష్టనాడీవ్రణములు వీనినన్నిటిని హరించును.

శ్విత్రమునకు ద్వైపచర్మాదిలేపము.

ద్వైపం దగ్ధం చర్మ మాతంగజం వా శ్విత్రే లేపస్తైలయుక్తోవరిష్ఠః,
పూతిః కీటో రాజవృక్షోద్భవేన క్షారేణాక్తశ్శ్విత్ర మేకోఽపి హంతి.

పెద్దపులిచర్మమునుగాని, ఏనుగుచర్మమునుగాని, కాల్చి నువ్వులనూనెలో లేపనము చేసిన, శ్విత్రకుష్ఠము హరించును. మఱియు రేల క్షారము, ఇంద్రగోపపురుగు, వీని నొకటిగచేర్చి నూరి, లేపనముచేసిన శ్విత్రకుష్ఠువు నిశ్శేషముగ నివర్తించును.

శ్విత్రమునకు భల్లాతకలేపము.

రాత్రౌ గోమూత్రే చాసితాన్ జర్జరాంగా
నహ్నిచ్ఛాయాయాం శోషయేత్స్ఫోటహేతూన్,
ఏవం వారాంస్త్రీంస్తైస్తతః శ్లక్ష్ణపిష్టై
స్స్నుహ్యాః క్షీరేణ శ్విత్రనాశాయ లేపః. ౧౧

జీడిగింజలను నలియగొట్టి గోమూత్రములో 1 రాత్రి నానబెట్టి, మరుదినము వానినెత్తి నీడలో నెండించి, ఇటుల ౩ పర్యాయములు ఎండినపిదప జెముడుపాలతో చక్కగనూరి లేపనముచేసిన, శ్విత్రము నిశ్శేషముగ హరించును.

శ్విత్రమునకు పాముకూసమషీలేపము.

అక్షతైలకృతో లేపః కృష్ణసర్పోద్భవా మషీ,
శిఖిపిత్తం తథా దగ్ధం హ్రీబేరం వా తథాప్లుతమ్. ౧౨

కృష్ణసర్ప కూసమునుగాని, నెమలి పిత్తమునుగాని, వట్టివేరునుగాని, కాల్చి యామసిని తాడినూనెలో కలిపి లేపనముచేసిన, శ్విత్రకుష్ఠము హరించును.

శ్విత్రకుష్ఠమునకు వాకుచీబీజాదిలేపము.

కుడవో వల్గుజబీజాద్ధరితాళచతుర్థభాగసమ్మిశ్రః,
మూత్రేణ గవాం పిష్టస్సవర్ణకరణం వరం శ్విత్రే. ౧౩

కాలుగచ్చ (బావంచి) విత్తులు 5 పలములు, హారిదళము 1 పలము, వీని నేకము జేసి గోమూత్రములో నూరి లేపనముచేసిన శ్విత్రకుష్ఠువు నశించి సహజమైన శరీర వర్ణము కలుగును.

శ్విత్రమునకు గజవిష్ఠామషీలేపము.

క్షారే సుదగ్ధే గజలిండజే చ
గజస్య మూత్రేణ పరిస్రుతే చ,
ద్రోణప్రమాణే దశభాగయుక్తం
దత్వా పచేద్బీజమవల్గుజానామ్. ౧౪
శ్విత్రం జయేచ్చిక్కణతాం గతేన
తేన ప్రలింపన్ బహుశః ప్రఘృష్టం,
కుష్ఠం మషీ వా తిలకాలకం వా
యద్వా వ్రణే స్యాదధిమాంసజాతమ్. ౧౫

ఏనుగువిష్ఠను నిప్పులో కాల్చి, యాబూడిదెను ద్రోణప్రమాణము ఏనుగుమూత్రములో కలిపి, క్షారవిధిప్రకారము వడియకట్టి, అందులో 10 భాగములు కాలుగచ్చ (బావంచి) విత్తులను చేర్చి చిక్కగ కాచి దానిని లేపనముచేసి, రుద్దుచుండిన; శ్విత్రకుష్ఠువు, తిలకాలకము, అధికమాంసమువలన జనించిన వ్రణములు, ఇవియన్నియు హరించును.

శ్విత్రమునకు భల్లాతకమూలాదిలేపము.

భల్లాతకద్వీపిసుధార్కమూలం
గుంజాఫలత్ర్యూషణశంఖచూర్ణమ్,
తుత్థం సకుష్ఠం లవణాని పంచ
క్షారద్వయం లాంగలికాం చ పక్త్వా. ౧౬
స్నుగర్కదుగ్ధం ఘనమాయసస్థం శలాకయా తద్విదధీత లేపమ్,
కుష్ఠే కిలాసే తిలకాలకేషు మాంసేషు దుర్నామసు చర్మకీలే. ౧౭

జీడివేళ్లు, చిత్రమూలపువేళ్లు, జెముడువేళ్లు, జిల్లేడువేళ్లు, గురిగింజలు, త్రికటుకములు, శంఖచూర్ణము, మైలుతుత్థము, చెంగల్వకోష్టు, పంచలవణములు, సర్జక్షార యవక్షారములు, చన్నచర్లగడ్డ, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి; జెముడు, జిల్లేడు వీనిపాలతో చిక్కగవండి యినుపపాత్రలో నుంచుకొని శలాకచే పూసినచో కుష్ఠము, కిలాసము, తిలకాలకము, మాంసదోషము, అర్శస్సు, చర్మకీలము, అనునీవ్యాధులు నివర్తించును.

### శ్విత్రసాధ్యాసాధ్యత్వము.

శుద్ధ్యా శోణితమోక్షైర్విరూక్షణైర్భక్షణైశ్చ సక్తూనామ్,
శ్విత్రం కస్యచిదేవ ప్రశామ్యతి క్షీణపాపస్య. ౧౮

శ్విత్రరోగము జన్మాంతరకృతపాపము క్షయించియుండు నొకానొకనికిమాత్రము వమనవిరేచన రూప శుద్ధి కర్మలు, రక్తమోక్షణము, రూక్షచికిత్సలు, సక్తుభక్షణము, మొదలగుచికిత్సలచే నివర్తించును.

(ఇయ్యది శ్విత్రచికిత్స, ఇక క్రిమిచికిత్స యీక్రింద చెప్పంబడును).

### క్రిమిసామాన్యచికిత్స.

స్నిగ్ధస్విన్నే గుడక్షీరమత్స్యాద్యైః క్రిమిణోదరే,
ఉత్క్లేశితక్రిమికఫే శర్వరీం తాం సుఖోషితే. ౧౯
సురసాదిగణం మూత్రే క్వాథయిత్వార్ధవారిణి,
తం కషాయం కణాగాలకృమిజిత్కల్కయోజితమ్, ౨౦
సతైలస్వర్జికాక్షారం యుంజ్యాద్వస్తిం తతోఽహని,
తస్మిన్నేవ నిరూఢం తం పాయయేత విరేచనమ్. ౨౧
త్రివృత్కల్కం ఫలకణాకషాయాలోడితం తతః,
ఊర్ధ్వాధశ్శోధితే కుర్యాత్పంచకోలయుతం క్రమమ్. ౨౨
కటుతిక్తకషాయాణాం కషాయైః పరిషేచనమ్,
కాలే విడంగతైలేన తతస్తమనువాసయేత్. ౨౩

క్రిములతోఁగూడియుండు ఉదరముగలవానికి స్నేహస్వేదకర్మలను చేయించి; బెల్లము, పాలు, మత్స్యములు, మొదలగు వస్తువులను భక్షింపజేయవలయును. ఇటులజేసిన నా రోగికి క్రిములు కఫము ఇవి తమస్థానములోనుండి చలించును. అపుడు వానికి స్వల్పముగ నాహారము నొసగి 1 రాత్రి సుఖముగనుండ జేయవలయును. పిదప గోమూత్రము 1 భాగము, ఉదకము అర్ధభాగము, ఈరెంటినేకముజేసి అందులో సురసాదిగణద్రవ్యములనుచేర్చి చక్కగ కషాయముకాచి; యీ కషాయములో పిప్పళ్లు, మ్రంగపండు, వాయువిడంగములు, వీనికల్కము; నువ్వులనూనె, సర్జక్షారము, వీనినిచేర్చి, దానిచే నిరూహవస్తికర్మను చేయించవలయును. ఆ దినమునందే మ్రంగ పండు, పిప్పళ్లు, వీనికషాయములో తెల్లతెగడ, కల్కమును కలిపి విరేచనమును కిప్పించ వలయును. ఊర్ధ్వాధోభాగములవలన చక్కగ విరేచనమైన పిదప, పంచకోలములతో పక్వముచేయబడిన పేయాదుల నిప్పించవలయును. కారముగ చేదుగ వగరుగనుండు ద్రవ్యముల కషాయముచే సేచనముచేయించి, అగ్నిదీపనముకలిగిన పిమ్మట, వాయువిడంగతైలముచే అనువాసనవస్తిని ప్రయోగించవలయును.

### శిరోగతక్రిమిరోగచికిత్స.

శిరోరోగనిషేధోక్తమాచరేన్మూర్ధగేష్వను,
ఉద్రిక్తతిక్తకటుకమల్పస్నేహం చ భోజనమ్. ౨౪

శిరమునందు క్రిములుగలవానికి శిరోరోగనిషేధాధ్యాయమున జెప్పియుండు చికిత్సలను జేసి, చేదు కారము ఇవి అధికముగ, కొంచెము ఘృతాదిస్నేహములు చేర్చబడినదిగనుండు భోజనము నిప్పించవలయును.

### క్రిమిరోగులకు పేయ.

విడంగకృష్ణామరిచపిప్పలీమూలశిగ్రుభిః,
పిబేత్సస్వర్జికాక్షారం యవాగూం తక్రసాధితామ్. ౨౫

వాయువిడంగములు, నల్లజీలకఱ్ఱ, మిరియాలు, మోడి, మునగవిత్తులు, సర్జక్షారము, వీనిని చేర్చి ఆవుమజ్జిగతో పక్వముచేయబడిన యవాగును శిరోగతక్రిమిరోగులకు ఇప్పించవలయును.

### క్రిమిరోగమునకు శిరీషరసాది పానము.

రసం శిరీషాకిణిహీపారిభద్రకకేంబుకాత్,
పలాశబీజసత్తూరపూతికాద్వా పృథక్పిబేత్. ౨౬
సక్షౌద్రం సురసాదీన్వా లిహ్యాత్క్షౌద్రయుతాన్ పృథక్,

దిరిసనము, తెల్లగంటెన, వేము, పోకలు, అనువాని రసములనుగాని; మోదుగువిత్తులు, కుచందనము, నెమలిముగుమ్రాను, అనువానిరసములు ప్రత్యేకముగగాని, సురసాదిగణద్రవ్యరసములనుగాని, తేనెతోగూర్చి పానముచేయించవలయును.

### క్రిమిరోగమున అశ్వవిట్చూర్ణయోగము.

శతకృత్వోశ్వవిట్చూర్ణం విడంగక్వాథభావితమ్. ౨౭
క్రిమిమాన్మధునా లిహ్యాద్భావితం వా వరారసైః,

గుఱ్ఱపుపెంటను ఎండించి, చక్కగచూర్ణముచేసి, వాయువిడంగకషాయములోగాని, త్రిఫలములకషాయములోగాని, అనేకపర్యాయములు భావనచేసి, తేనెలోకలిపి క్రిమిరోగముగలవారికి నాకించవలయును.

### శిరోగతక్రిమిరోగమున నస్యాదులు.

శిరోగతేషు క్రిమిషు చూర్ణం ప్రధమనం చ తత్. ౨౮

శిరస్సునందు జనించు క్రిమిరోగమునకు శిరోరోగనిషేధాధ్యాయమున చెప్పబడియుండు చూర్ణముచే ప్రధమనమనునస్యమును చేయించవలయును. ప్రధమనమన:—
(దినుసులను మెత్తగచూర్ణముచేసి నాసారంధ్రములనుండి పీల్చుటయని యర్థము.)

## క్రిమిరోగమున పూపలికాదియోగము.

ఆఖుకర్ణీకిసలయైస్సుపిష్టైః పిష్టమిశ్రితైః,
పక్త్వా పూపలికాం ఖాదేద్ధాన్యామ్లం చ పిబేదను. ౨౯
సపంచకోలలవణమసాంద్రం తక్రమేవ వా,
నీపమార్కవనిర్గుండీపల్లవేష్వప్యయం విధిః. ౩౦
విడంగచూర్ణమిశ్రైర్వా పిష్టైర్భక్ష్యాన్ ప్రకల్పయేత్,

ఎలుకచెవి చిగుళ్లను చక్కగనూరి అందులో బియ్యపుపిండికలిపి రొట్టెచేసి దానిని క్రిమిరోగికిప్పించి, పులికడుగునుగాని, పంచకోలములు లవణముచేర్చబడిన మజ్జిగనుగాని, యిప్పింపవలయును. కడిమి, గుంటకలగర, వావిలి, అనువాని చిగుళ్లనునూరి అందులోగాని; వాయువిడంగములచూర్ణములోగాని, బియ్యపుపిండిని కలిపి రొట్టెజేసి యిప్పించి పైచెప్పినప్రకార మనుపానము చేయించవలయును.

## క్రిమిరోగులకు పానవస్త్యాదులు.

విడంగతండులైర్యుక్తమర్ధాంశైరాతపస్థితమ్. ౩౧
దినమారుష్కరం తైలం పానే వస్తౌ చ యోజయేత్,
సురాహ్వసరళస్నేహం పృథగేవం ప్రకల్పయేత్. ౩౨

జీడిగింజలనూనెలోగాని, దేవదారు తైలములోగాని, సరళదేవదారు తైలములోగాని, వాయువిడంగముల బియ్యము 1 భాగముచేర్చి 1 దినమంతయు యెండలో యెండించి దానిని క్రిమిరోగికి పానవస్తికర్మలయందు ప్రయోగించవలయును.

## మలజక్రిమిరోగులకు వస్తివిరేచనములు.

పురీషజేషు సుతరాం దద్యాద్వస్తివిరేచనే,

మలమువలన జనించిన క్రిమిరోగముగలవానికి వస్తికర్మ, విరేచనము, వీనిని ముఖ్యముగ చేయించవలయును.

## కఫజక్రిమిరోగ చికిత్స.

శిరోవిరేకం వమనం శమనం కఫజన్మసు. ౩౩

కఫమువలన జనించిన క్రిమిరోగమున నస్యము వమనము వీనిని చేయించవలయును.

—— రక్తజాదిక్రిమిరోగ చికిత్స. ——

రక్తజానాం ప్రతీకారం కుర్యాత్కుష్ఠచికిత్సితాత్,
ఇంద్రలుప్తవిధిశ్చాత్ర విధేయో రోమభోజిషు. 38

రక్తదోషమువలన జనించిన క్రిమిరోగమునకు కుష్ఠరోగచికిత్సలను చేయవలయును. వెండ్రుకలను నశింపజేసెడి క్రిమిరోగమునకు ఇంద్రలుప్తరోగమునకు చెప్పంబడు చికిత్సలను చేయవలయును.

—— క్రిమిరోగమునందు వర్జనీయంబులు. ——

క్షీరాణి మాంసాని ఘృతం గుడం చ
దధీని శాకాని చ పర్ణవంతి,
సమాసతోఽమ్లాన్మధురాన్రసాంశ్చ
క్రిమీన్ జిహాసుః పరివర్జయేచ్చ. 39

క్రిమిరోగి పాలు మాంసము, నెయ్యి, బెల్లము, పెరుగు, ఆకుకూరలు, పుల్లగ మధురముగనుండు రసములు, వీనిని వర్జింపవలయును.

వింశాధ్యాయము ముగిసెను.

# ఏకవింశాధ్యాయము.



అవ: వాతరోగములు కుష్ఠరోగమువలెనే పలుతెఱంగులుగ నానావిధోపద్రవములను కలుగఁజేయునవిగనుండుటచే కుష్ఠరోగచికిత్సితాధ్యాయనిరూపణానంతరము వాత వ్యాధి చికిత్సితాధ్యాయము చెప్పబడుచున్నయది.

॥ వాతవ్యాధి చికిత్సితాధ్యాయ ప్రారంభము. ॥

సూ. అథాతో వాతవ్యాధిచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః

శ్విత్రక్రిమిరోగ చికిత్సితాధ్యాయనిరూపణానంతరము వాతరోగములయొక్క చికిత్సలను తెలియపరచునట్టి వాతవ్యాధి చికిత్సితమను నీయధ్యాయమును వివరించెదము.

॥ వాతరోగసామాన్య చికిత్స. ॥

కేవలం నిరుపస్తంభమాదౌ స్నేహైరుపాచరేత్,
వాయుం సర్పిర్వసామజ్జా తైలపానైర్నరం తతః. ౧
స్నేహక్లాంతం సమాశ్వాస్య పయోభిస్స్నేహయేత్పునః.
యూషైర్గ్రామ్యౌదకానూపరసైర్వా స్నేహసంయుతైః. ౨
పాయసైః కృసరైస్సామ్లలవణైస్సానువాసనైః,
వాతఘ్నైస్సుస్తర్పణైశ్చాన్నైస్స్నిగ్ధైస్స్నేహయేత్తతః. ౩
స్వభ్యక్తం స్నేహసంయుక్తైస్సంకరాద్యైః పునః పునః,

శుద్ధముగ నితర దోషసంబంధము లేనిదిగనుండు వాతమునందు తొలుత స్నేహపానము చేయించవలయును. ఎట్లనిన:— వాతరోగము కలవానికి తొలుత తైలము, వస, మజ్జ ఘృతము, అను వానిని పానము చేయించవలయును. పైతైలాదులను పానము చేయుటచే బలహీనతను జెందియుండు నారోగికి ఆవుపాలను పానము చేయించి; శరీరమున కొంచెము బలముకలిగిన పిదప కట్టులచేతను; గ్రామ్యము ఔదకము అనూపము మొదలగు జంతువుల మాంసములలో ఘృతాది స్నేహములను చేర్చి వాని చేతను; పాయసము, కృసరము, పుల్లగ నుప్పగనుండు రసములతోఁగూడిన అనువాసన వస్తికర్మలు వీనిచేతను; వాతహరములుగ తృప్తిని గలుగఁజేయునవిగ ఘృతాది స్నేహములధికముగ చేర్చబడినవిగనుండు అన్నములచేతను; పుష్టిని గలుగఁజేయవలయును.

పిదప వానికి చక్కగ నభ్యంజనముచేయించి స్వేదవిధ్యధ్యాయమునందు చెప్పబడిన ప్రకారము ఘృతాదిస్నేహము లధికముగ చేర్చిన సంకరాది స్వేదకర్మలను పలుమారు చేయించవలయును.

ఇచ్చటనీవిషయము నెఱుంగునది:—వాతమును హరించుటకు స్నేహద్రవ్యములలో తైలము ప్రధానము; కావున స్నేహముల నిర్దేశించుతరి తొలుత తైలమును జెప్పుట యుక్తము; అయినను పుట్టుకమొదలు నెయ్యి అలవాటుతోనుండుటం జేసి నిరుపాధికముగనుండును కావున దానిని ప్రధానముగ జేసి "వాయుం సర్పిర్వసామజ్జాతైలపానైః" అని ఘృతముతొలుతనిర్దేశింపబడెనని యెఱుంగునది.

## స్నేహస్వేదకర్మగుణము.

స్నేహాక్తం స్విన్నమంగం తు వక్రస్తబ్ధం సవేదనమ్. ౪
యథేష్టమానామయితుం సుఖమేవ హి శక్యతే,
శుష్కాణ్యపి హి కాష్ఠాని స్నేహస్వేదోపపాదనైః. ౫
శక్యం కర్మణ్యతాం నేతుం కిము గాత్రాణిజీవతామ్,

ఎండినవిగ వంకరగనుండు కఱ్ఱలకు స్నేహస్వేదకర్మలను (ఆముదము మొదలగు వానిబూసి నిప్పనకాచిన) చేయించిన యవి కృత్యములయం దుపయోగించుచుండగా ప్రాణములతోగూడియుండు మనుజులయొక్క అవయవములకు స్నేహస్వేదకర్మలను చేయించిన ఆయంగములు కృత్యములయం దుపయోగించుననుటకు సందేహములేదు. కావున వాతదోషముచే వంకరగ, స్తబ్ధముగ, వేదనలతో గూడినవిగనుండు యంగములకు స్నేహస్వేదకర్మలనుచేయించిన నవి స్వేచ్ఛగ వంచుటకును చాచుటముడుచుట మొదలగు సాంగిక కృత్యముల జేయుటకును స్వాధీనముగ నుండును.

## స్వేదకర్మగుణము.

హర్షతోదరుగాయామశోఫస్తంభగ్రహాదయః. ౬
స్విన్నస్యాశు ప్రశామ్యంతి మార్దవం చోపజాయతే,

వాతరోగికి స్వేదకర్మను చేయించుటవలన గగుర్పాటు, పోట్లు, శూల, ఆయామవాతము, శోఫ, స్తబ్ధత్వము, శరీరమునందుపట్లు మొదలగునుపద్రవములు, ఇవియన్నియు శీఘ్రముగ శమించి అవయవములకు మృదుత్వము కలుగును.

## స్నేహకర్మగుణము.

స్నేహశ్చ ధాతూన్ సంశుష్కాన్ పుష్ణాత్యాశు ప్రయోజితః ౭
బలమగ్నిబలం పుష్టిం ప్రాణం చాస్యాభివర్ధయేత్,

వాతరోగికి స్నేహకర్మను చేయించుటవలన శుష్కించియుండు రసాదిధాతువులకు పుష్టి, శరీరమునకు బలము, జాఠరాగ్నికి దీపనము, కృత్యములయందు సమర్థత, ఇవి శీఘ్రముగ గలుగును.

స్నేహస్వేదకర్మలకు వాతహరత్వము.

అసకృత్తం పునస్స్నేహైస్స్వేదైశ్చ ప్రతిపాదయేత్. ౮
తథా స్నేహమృదౌ కోష్ఠే న తిష్ఠంత్యనిలామయాః,

వాతరోగికి స్నేహస్వేదకర్మలను పలుమారు చేయించవలయును. అటుల చేయుటచే మృదుత్వమును జెందియుండు కోష్ఠమునందలి వాతరోగములన్నియు నశించును.

వాతరోగమునకు విరేచనము.

యద్యేతేన సదోషత్వాత్కర్మణా న ప్రశామ్యతి. ౯
మృదుభిస్స్నేహసంయుక్తైర్భేషజైస్తం విశోధయేత్,

దోషము అధికముగనుండుటచే పైచెప్పిన ప్రకారము చికిత్సలను జేసినను వాతరోగము శమింపకయుండినచో మృదువుగ ఘృతాదిస్నేహ సహితముగనుండు కొండగోగువేళ్లు మొదలగు ద్రవ్యములచే విరేచనము చేయించవలయును.

అధికదోషముగల వాతరోగికి తిల్వకఘృతాదిపానము.

ఘృతం తిల్వకసిద్ధం వా సాతలాసిద్ధమేవ వా. ౧౦
పయసైరండతైలం వా పిబేద్దోషహరం శివమ్,

ఎఱ్ఱలొద్దుగుచేర్చి కాచిన ఘృతమునుగాని; సంభరేణుతో కాచబడిన ఆముదమునుగాని; ఆవుపాలుచేర్చిన ఆముదమునుగాని, పానముచేయించిన విరేచనమై దోషములు హరించి వాతమునకనులోమగతికల్గి శరీరమునకు సుఖముకలుగును.

వాతరోగికి వాతానులోమనము.

స్నిగ్ధామ్లలవణోష్ణాద్యైరాహారైర్హి మలశ్చితః. ౧౧
స్రోతో రుద్ధ్వాఽనిలం రుంధ్యాత్తస్మాత్తమనులోమయేత్,

స్నిగ్ధముగ పులుసుగ ఉప్పగ ఉష్ణముగనుండు అన్నపానములచే మలము వృద్ధిజెంది, స్రోతోమార్గముల నడ్డగించి, పిదప వాతము నడ్డగించును. కావున అట్టి వాతమునకు అనులోమగతిని కలుగజేయవలయును.

దుర్బలవాతరోగికి స్నేహస్వేదకర్మలు.

దుర్బలో యోఽవిరేచ్యస్స్యాత్తం నిరూహైరుపాచరేత్. 12
దీపనైః పాచనీయైర్వా భోజ్యైర్వా తద్యుతైర్నరమ్,

సంశుద్ధస్యోత్థితే చాగ్నౌ స్నేహస్వేదౌ పునర్హితౌ. ౧౩

రోగి బలహీనుడై విరేచనము జేయింపనర్హుడు కాకయున్నచో నట్టివాతరోగికి అగ్నిని దీపింపజేసి యాకలిబుట్టించునవియు, ఆహారమును జీర్ణింప జేయునవియునగు ద్రవ్యములచే నిరూహవస్తిని జేయింపనగును. లేక దీపనపాచనౌషధములతో గూడియుండు ఆహారముల నిప్పించవలయును. కోష్ఠము శుద్ధమై జాఠరాగ్నికి దీపనము కలిగిన పిదప మరల స్నేహస్వేదకర్మలను చేయించవలయును.

## ఆమాశయగతవాతచికిత్స.

ఆమాశయగతే వాయౌ వమితప్రతిభోజితే,
సుఖాంబునా షట్చరణం వచాదిం వా ప్రయోజయేత్. ౧౪
సంధుక్షితేఽగ్నౌ పరతో విధిః కేవలవాతికః,
మత్స్యాన్నాభిప్రదేశస్థే సిద్ధాన్ బిల్వశలాటుభిః. ౧౫

వాతము ఆమాశయమును చేరియుండునపుడు, ఆవాతరోగికి తొలుత వమనము చేయించి, పేయాదులను భుజింపజేసి, షట్చరణయోగమునుగాని, వచాదిగణములో చెప్పియుండు ద్రవ్యముల చూర్ణమునుగాని, ఉష్ణోదకములో కలిపి యిప్పించవలయును. జాఠరాగ్నికి దీపనము కలిగినపిదప, వాతరోగమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును. వాతము నాభిప్రదేశమున జేరియుండినచో మారేడుకాయలతో పక్వము చేయుబడిన మత్స్యముల నిప్పించవలయును.

"దార్వీకళింగకటుకాలివిషాగ్ని పాఠామాత్రేణ సూక్ష్మరజసా ధరణప్రమాణాః, పీతా జయంతి గుదజోదర కుష్ఠమేహాకోష్ఠానిలాఢ్యపవన గ్రహణీప్రదోషాన్." మ్రానిపసుపు, కొడిసెవిత్తులు, కటుకరోహిణి, అతివస, చిత్రమూలము, చిరుబొద్ది, అనువానిని దినుసుకు ధరణప్రమాణముచొప్పున గ్రహించి, చక్కగ చూర్ణముచేసి, గోమూత్రములో కలిపి, పానము చేయించినచో; అర్శోరోగము, ఉదరరోగము, కుష్ఠువు, ప్రమేహము, కోష్ఠవాతము, ఆఢ్యవాతము, గ్రహణి, ఇవి హరించును. ఇది షట్చరణయోగమనబడునని అష్టాంగసంగ్రహమునందు షట్చరణయోగము చెప్పబడియున్నది.

## అధోనాభిగతవాతచికిత్స.

వస్తికర్మ త్వధోనాభేశ్శస్యతే చావపీడకః,

వాతము నాభికిక్రిందిభాగము (పొత్తికడుపు)న జేరియుండినచో అవపీడకమును చేయించవలయును.

## కోష్ఠగతవాతచికిత్స.

కోష్ఠగే క్షారచూర్ణాద్యాః హితాః పాచనదీపనాః. ౧౬

వాతము కోష్ఠమును జేరియుండినచో పాచనదీపనకరములుగనుండు క్షారములు చూర్ణములు మొదలగువాని నిప్పించవలయును.

## హృదయశిరోగతవాతచికిత్స.

హృత్స్థే పయస్స్థిరాసిద్ధం శిరోవస్తిశ్శిరోగతే,
స్నైహికం నావనం ధూమశ్శ్రోత్రాదీనాం చ తర్పణమ్. ౧౭

వాతము హృదయమును జేరియుండినచో, మయ్యాకుపొన్నతో కాచబడిన ఆవుపాలను, పానముచేయించవలయును. వాతము శిరమున జేరియుండినచో శిరోవస్తి, స్నైహిక (స్నేహద్రవ్యములచేసిద్ధమైన) నస్యము, ధూమపానము, శ్రోత్రాదులకు తర్పణచికిత్స, వీనిని చేయించవలయును.

## చర్మరక్తాదిగతవాతచికిత్స.

స్వేదాభ్యంగాని వా తాని హృద్యం చాన్నం త్వగాశ్రితే,
శీతాః ప్రదేహా రక్తస్థే విరేకో రక్తమోక్షణమ్. ౧౮
విరేకో మాంసమేదస్స్థే నిరూహాశ్శమనాని చ,
బాహ్యాభ్యంతరతః స్నేహైరస్థిమజ్జాగతం జయేత్. ౧౯
ప్రహర్షోఽన్నం చ శుక్రస్థే బలశుక్రకరం హితమ్,
విబద్ధమార్గం దృష్ట్వా తు శుక్రం దద్యాద్విరేచనమ్. ౨౦
విరిక్తం ప్రతిభుక్తం చ పూర్వోక్తాం కారయేత్క్రియామ్,

వాతము చర్మము నాశ్రయించి యుండినచో స్వేదకర్మను, అభ్యంజనమును, చేయించి; మనసుకిష్టమైన యన్నము నిప్పించవలయును. వాతము రక్తాశ్రితంబై యుండిన శీతలేపనములు, రక్తమోక్షణము, విరేచనము, వీనిని చేయించవలయును. వాతము మాంసమేదస్సుల నాశ్రయించియుండినచో విరేచన, నిరూహవస్తి, శమనౌషధములు, వీనిని ప్రయోగించవలయును. వాతము అస్థిమజ్జ వీనిని ఆశ్రయించి యుండినచో బాహ్యాభ్యంతరములయందు స్నేహమును ప్రయోగించవలయును. వాతము శుక్రము నాశ్రయించియుండినచో బలము, శుక్రము, వీనిని వర్ధిల్లజేయు అన్నము నిప్పించుటయేగాక మనస్సంతోషమును కలుగజేయవలయును. వాతముచే శుక్రమార్గము అడ్డగింపబడినచో విరేచనము నిప్పించి, విరేచనమైన పిదప స్వల్పమైన పథ్యాహారములను భుజింపజేసి, పూర్వోక్త చికిత్సలను చేయవలయును.

## వాతశుష్కగర్భ చికిత్స.

గర్భే శుష్కే తు వాతేన బాలానాం చ విశుష్యతామ్. ౨౧
సితాకాశ్మర్యమధుకైస్సిద్ధముత్థాపనే పయః,

వాతదోషములచే గర్భముశుష్కించియుండినను, బాలుఁరు కృశించినను, పంచదార, పెద్దగుమ్ముడు, అతిమధురము, వీనిని సమభాగములుగ గ్రహించి ఆవుపాలలో చేర్చి కాచి యిప్పించవలయును.

### స్నాయ్వాదిగతవాతచికిత్స.

స్నాయుసంధిసిరాప్రాప్తే స్నేహదాహోపనాహనమ్. ౨౨

స్నాయువులు సంధులు సిరలు వీనియందు వాతము జేరియుండినచో స్నేహకర్మ, దాహకర్మ, ఉపనాహస్వేదకర్మలు చేయించవలయును.

### సంకుచితవాతచికిత్స.

తైలం సంకుచితే ఽభ్యంగో మాషసైంధవసాధితమ్,

వాతము ప్రకోపమునొంది అవయవములలో జేరి ముడుచుకొనియుండునటుల జేసినచో మినుములు, సైంధవలవణము, వీనిని సమభాగములుగ చేర్చి తైలములో వైచి కాచి దానిని లేపనముచేసి రుద్దవలయును.

### సుప్తవాతచికిత్స.

అగారధూమలవణతైలైర్లేపస్స్రుతేఽసృజి. ౨౩
సుప్తేఽంగే వేష్టయుక్తే తు కర్తవ్యముపనాహనమ్,

వాతదోషముచే రక్తస్రావము గలిగినయెడల కరుధూపము, సైంధవలవణము, నువ్వులనూనె, వీనినొకటిగచేర్చి లేపనముచేయవలయును. అంగము సుప్తమై (అనగా—స్పర్శజ్ఞానరహితమై) యుండినచో ఉపనాహస్వేదకర్మను చేయించవలయును.

### అపతానకవాత చికిత్స.

అథాపతానకే నార్త మస్రస్తాక్షమవేపనమ్. ౨౪
అస్తబ్ధమేఢ్రమస్వేదం బహిరాయామవర్జితమ్,
అఖట్వాఘాతినం చైనం త్వరితం సముపాచరేత్. ౨౫

నేత్రములు జారిపోవుట, శరీరము వణకుట, మేఢ్రము స్తబ్ధముగనగుట, చమట బాహ్యాయామవాతము కలుగుట, హస్తపాదములచే మంచముమొదలగు శయనములను కొట్టుట, ఇవిలేకుండునట్టి అపతానక వాతరోగికి శీఘ్రముగ చికిత్సచేయవలయును. పైయుపద్రవములు జనించిన నది అసాధ్యంబగును.

(అపతానకవాతమున దినములుగడచుకొలది నానాట పైజెప్పినయుపద్రవములు కల్గి దుస్సాధమగును. కావున అట్టి యుపద్రవములు కలుగకమునుపే ప్రారంభదశయందు చికిత్స జేయ నుద్యమించవలెనని భావము).

### అపతానకవాతమునందు తీక్ష్ణనస్యాదులు.

తత్ర ప్రాగేవ సుస్నిగ్ధస్విన్నాంగే తీక్ష్ణనావనమ్,
స్రోతోవిశుద్ధయే యుంజ్యాదచ్ఛపానం తతో ఘృతమ్. ౨౬
విదార్యాదిగణక్వాథదధిక్షీరరసైశ్శృతమ్,
నాఽతిమాత్రం తథా వాయుర్వ్యాప్నోతి సహసైన వా. ౨౭

అపతానక వాతరోగముగలవానికి లోలుత చక్కగ స్నేహస్వేదకర్మలను చేయించి, స్రోతోమార్గములు శుద్ధములగుటకై త్రికటుకములుమున్నగు తీక్ష్ణద్రవ్యములతో తీక్ష్ణనస్యమును ప్రయోగించవలయును. పిదప ఆవునెయ్యి 1 భాగము, విదార్యాదిగణద్రవ్యములు 4 భాగములు, పెరుగు, ఆవుపాలు, మాంసరసము, ఇవి ఘృతమునకు సమభాగములు, ఇటుల వీనినొకటిగ చేర్చి ఘృతపాకవిధిగ పక్వము చేసి యాఘృతమును పానము చేయించిన వాతము కఠింశీఘ్రముగ శరీరమంతట వ్యాపించకుండును.

### మహాస్నేహము.

కులత్థయవకోలాని భద్రదార్వాదికం గణమ్,
నిఃక్వాథ్యానూపమాంసం చ తేనాప్తైః పయసాపి చ. ౨౮
స్వాదుస్కంధప్రతీవాపం మహాస్నేహం విపాచయేత్,
స్నేహాభ్యంగావగాహాన్నపానసస్యానువాసనైః. ౨౯
స హంతి వాతం తే తే చ స్నేహస్వేదాస్సుయోజితాః,

ఉలవలు, యవలు, రేగుపండ్లు, దేవదార్వాది ద్రవ్యములు, అనూపజంతు మాంసము, వీనిని సమభాగములుగ నుదకములోవైచి చక్కగకాచిన కషాయము; పులి కడుగు, ఆవుపాలు, ఆవునెయ్యి, మజ్జ, వస, నువ్వులనూనె, వీనిని సమభాగములుగ కలిపి, అందులో మధురగణద్రవ్య కల్కముఁ చేర్చి, పాకముచెసిన నది మహాస్నేహమన బడును. ఈమహాస్నేహము సేకము, అభ్యంజనము, ఆవగాహనము, అన్నపానములు, నస్యము, అనువాసన, వస్తికర్మ, వీనియందు ప్రయోగించిన వాతరోగములనన్నిటిని హరించును. మఱియు పూర్వోక్తస్నేహస్వేదములను చక్కగ చేయించిన వాతము హరించును.

### అపతానకవాతమున శిరోవిరేచనము.

వేగాంతరేషు మూర్ధానమసకృచ్చాస్య రేచయేత్. ౩౦
అవపీడైః ప్రధమనైస్తీక్ష్ణైశ్శ్లేష్మనిబర్హణైః,
శ్వసనాసు విముక్తాసు తథా సంజ్ఞాం స విందతి. ౩౧

అపతానక వాతరోగికి వేగాంతరములయందు శ్లేష్మమును, పోగొట్టునవియు, తీక్ష్ణద్రవ్యములచే చేయబడినవియు నైనకల్కములచేతను, ప్రధమనముచేతను, శిరమునకు పలుమారు విరేచనములను చేయించవలయును. ఇటుల చేయించుటవలన హృదయము నాశ్రయించియుండు ప్రాణనాడులు శ్లేష్మసంబంధరహితంబులై రోగికి ప్రజ్ఞను కలుగ చేయును.

ఇచ్చట "శ్వసనాసు ప్రముక్తాసు," అనుచోట శ్వసనాశబ్దమునకు హృదయము నాశ్రయించిన వాతవహనాడులనియర్థము. నాడీవాచకమగుటంజేసియే వాయుసామాన్య వాచకమైన శ్వసనశబ్దము పుల్లింగమైనదని యెరుంగునది.

వాతవృద్ధకి సౌవర్చలాది ఘృతము.

సౌవర్చలాఽభయావ్యోషసిద్ధం సర్పిశ్చలేఽధికే.

వాతము మిక్కుటముగ వృద్ధిజెందియుండినయెడల, సౌవర్చలలవణము, కరక్కాయలు, త్రికటుకములు, వీనిని సమభాగములుగ గ్రహించి ఆవునేతిలో కలిపి ఘృతపాక విధిగ పక్వముచేసి యిప్పించవలయును.

తిల్వకఘృతము.

పలాష్టకం తిల్వకతో వరాయాః
ప్రస్థం పలాంశం గురుపంచమూలమ్,
సైరండసింహీత్రివృతం ఘటేఽపాం
పక్వా పచేత్పాదశృతేన తేన. 32
దధ్నః పాత్రే యావశూకాత్త్రిబిల్వైః
సర్పిః ప్రస్థం హంతి తత్సేవ్యమానమ్,
దుష్టాన్వాతానేకసర్వాంగసంస్థా
న్యోనివ్యాపద్గుల్మవృద్ధ్యుదరం చ. 33
విధిస్తిల్వకవత్ జ్ఞేయః శమ్యాకాశోకయోరపి,

ఎఱ్ఱలొద్దుగ 8 పలములు, త్రిఫలములు 1 ప్రస్థము, మహాపంచమూలములు దినుసుకు 1 పలము, ఆముదము వ్రాకుడు తెల్లతెగడ ఇవి దినుసుకొక్కకపలము, వీనినన్నిటిని ద్రోణప్రమాణము జలములో వైచి పాదావశేషముగ కషాయముకాచి; అందులో ఆవుపెరుగు 1 ఆఢకము, యవక్షారము 3 పలములు, ఘృతము 1 ప్రస్థము, వీనినికలిపి ఘృతపాకవిధిగ పక్వముచేయవలయును. ఈఘృతమును సేవించినచో దుష్టవాతములు, ఏకాంగవాతము, సర్వాంగవాతము, యోనిశూల, గుల్మము, వృద్ధి, ఉదరరోగము ఇవి హరించును. మఱియు పైతిల్వకఘృతమునకు చెప్పియుండునటుల రేల ఆశోకము ఈరెంటిచేఘృతమును పక్వముచేసి యిప్పించినను పైరోగములు హరించును.

### ద్వంద్వదోష జాపతానకవాతచికిత్స.

చికిత్సితమిదం కుర్యాత్ శుద్ధవాతాపతానకే. 3౪
సంసృష్టదోషే సంసృష్టం

ఇతరదోష సంబంధములేక శుద్ధవాతమువలన జనించిన అపతానకరోగమునకు పైచెప్పిన చికిత్సలను చేయవలయును, ద్వంద్వ దోషము (రెండేసి దోషములసంసర్గము) వలన జనించిన అపతానకరోగమునందు ఆయాదోషమునకు వేరువేర చెప్పియుండు చికిత్సలను మిశ్రముగా చేయవలయును.

### కఫయుక్త అపతానకవాత చికిత్స.

చూర్ణయిత్వా కఫాన్వితే,
తుంబురూణ్యభయా హింగుపౌష్కరం లవణత్రయమ్. 3౫
యవక్వాథాంబునా పేయం హృత్పార్శ్వగ్రహతంత్రకే,
హింగు సౌవర్చలం శుంఠీ దాడిమం సామ్లవేతసమ్. 3౬
పిబేద్వా శ్లేష్మపవనహృద్రోగోక్తం చ శస్యతే,

కఫముతోగూడియుండు అపతానకవాతమునందు, తుమికిగింజలు, కరక్కాయలు, ఇంగువ, పుష్కరమూలము, లవణత్రయము,వీనిని చక్కగచూర్ణము చేసి,యవల కషాయములో కలిపి, పానము చేయించవలయును. రొమ్మునొప్పి, పార్శ్వశూల, వీనితో గూడియుండు అపతంత్రకవాతమునందు, ఇంగువ, సౌవర్చలవణము, శుంఠి, దానిమ్మ, పుల్లప్రబ్బలి, వీనిని యవలకషాయములో కలిపి పానము చేయించవలయును. లేక శ్లేష్మ వాతమువలనజనించిన హృద్రోగమునకు పైని చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

### ఆయామవాత చికిత్స

ఆయామయోరర్దితవద్బాహ్యాభ్యంతరయోః క్రియాః. 3౭
తైలద్రోణ్యాం చ శయనమాంతరోఽత్ర సుదుస్తరః,

బాహ్యాయామము అంతరాయామము అనిద్వివిధములైన ఆయామవాతములకును అర్దితవాతరోగమున చెప్పియుండు చికిత్సలను చేయవలయును. మఱియు ఆవాతరోగిని తైలద్రోణియందు పరుండపెట్టవలయును. అంతరాయామము మిగుల కష్టసాధ్యము.

### అసాధ్య ధనుర్వాతము.

వివర్ణదంతవదనః స్రస్తాంగో నష్టచేతనః 3౮
ప్రస్విద్యంశ్చ ధనుష్కమ్భో దశరాత్రం న జీవతి,
వేగేష్వతోఽన్యథా జీవేన్మందేషు వినతో జడః. 3౯

ఖంజః కుణిః పక్షహతః పంగులో వికలోఽథవా,

దంతములును ముఖంబును వివర్ణంబగుట, అవయవములు సడలుట, శరీరము ప్రజ్ఞ లేకుండుట, చమటగారుట, ఈయుపద్రవములుగల ధనుర్వాతరోగి 10 దినములకు పైన జీవించ నేరడు. పైదంతముఖాది వైవర్ణ్యములులేకుండి, వాతవేగము స్వల్పముగ నుండినయెడల ఆరోగి జీవించును. అటుల జీవించినను శరీరమువంచుకొనుట, జడత్వము, కాలికిఁకుంటితనము, చేతులీచబోవుట, ఒక పార్శ్వమీడ్చికొనుట, కుంటితనము, అంగ వైకల్యము, వీనిలో నేదైనను కలుగును.

హనుస్రంసాదివాతచికిత్స.

హనుస్రంసే హనూ స్నిగ్ధ స్విన్నౌ స్వస్థానమానయేత్. ౪౦
ఉన్నామయేచ్చ కుశలశ్చిబుకం వివృతే ముఖే,
నామయేత్సంవృతే శేషమేకాయామవదాచరేత్. ౪౧
జిహ్వాస్తంభే యథావస్థం కార్యం వాతచికిత్సితమ్,

హనుస్రంసవాతమునందు దవడలకు స్నేహస్వేదకర్మలను చేయించి, దానిని స్వస్థానమునందు చేర్చవలయును. వాతరోగమువలన నోరు తెరవబడియుండినచో బుద్ధిమంతుడగు వైద్యుడు చుబుకమును పైకి త్రోయవలయును. నోరుమూయబడియుండినచో ఏకాయామవాతమునకు చెప్పియుండునటుల చికిత్సలను చేయవలయును. జిహ్వాస్తంభవాతమున ఆయా యవస్థానుగుణముగ స్నేహస్వేద కర్మలను చేయించి వాతరోగమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

అర్దితవాతచికిత్స.

అర్దితే నావనం మూర్ధ్ని తైలం శ్రోత్రాక్షితర్పణమ్. ౪౨
సశోఫే వమనం దాహరాగయుక్తే సిరావ్యధః,

అర్దితవాతమున నస్యము, శిరమునకు తైలాభ్యంగము, చెవులు నేత్రములు వీనిలో తైలము విశేషముగ పోసికొనుట వీనిని చేయవలయును. అర్దితవాతము వాపుతో గూడియుండినయెడల వమనమును, మంట, యెఱుపువర్ణము, వీనితో గూడియుండినచో సిరావేధనమును చేయవలయును.

పక్షాఘాతవాతచికిత్స.

స్వేదనం స్నేహసంయుక్తం పక్షఘాతే విరేచనమ్. ౪౩

పక్షాఘాతవాతమున చెమటబుట్టించుట, ఘృతాదిస్నేహ సహితముగనుండు విరేచనము, వీనిని చేయించవలయును.

### అపబాహుకవాతచికిత్స.

అపబాహుకే హితం నస్యం స్నేహశ్చోత్తరభక్తికః,

అపబాహుక వాతమునందు నస్యము, ఉత్తరభక్తికము (అనగా—ఆహారమును భుజించినతోడనే) సేవించతగిన స్నేహప్రయోగము, వీనిని చేయించిన హితముకలుగును. పైవాతరోగము ఆమముతోగూడియుండినయెడల లంఘనము చేయించవలయునని సంగ్రహకారుడు చెప్పియున్నవాడు.

### ఊరుస్తంభాదివాతచికిత్స.

ఊరుస్తంభే న చ స్నేహో న చ సంశోధనం హితమ్. ౪౪
శ్లేష్మామమేదోబాహుళ్యాద్యుక్త్యాతత్క్షపణాన్యతః,
కుర్యాద్రూక్షోపచారశ్చ యవశ్యామాకకోద్రవాః. ౪౫
శాకైరలవణైశ్శస్తాః కించిత్తైలైర్జలైశ్శృతైః,
జాంగలైరఘృతైర్మాంసైర్మధ్వంభోరిష్టపాయినః. ౪౬
వత్సకాదిర్హరిద్రాదిర్వచాదిర్వా ససైంధవైః,
ఆమవాతే సుఖాంభోభిః పేయష్షట్చరణోఽథ వా. ౪౭
లిహ్యాత్క్షౌద్రేణ వా శ్రేష్ఠా చవ్యతిక్తాకణాఘనాన్,
కల్కం సమధు వా చవ్యపథ్యాగ్నిసురదారుజమ్. ౪౮
మూత్రైర్వా శీలయేత్పథ్యాం గుగ్గులుం గిరిసంభవమ్,

ఊరుస్తంభవాతమునకు స్నేహకర్మ, వమనవిరేచన రూపమైన శోధనౌషధము, ఇవి హితకరములు కానేరవు, పైవాతరోగమునకు కఫము, ఆమము, మేదస్సు, యివి అధికముగ నుండుటవలన నాకఫాదులను పోగొట్టునట్టి ఔషధాన్నాదులను యుక్తిచే నిప్పించవలయును. రూక్షోపచారమును చేయవలయును. కొంచెముదకము తైలముచేర్చి యుప్పుచేర్చక పాకముజేయబడిన శాకములు, ఘృతరహిత జాంగలదేశజంతు మాంసము, వీనితోడ యవలు, చామలు, ఆరికెలు, వీనియన్నమును భుజింపజేయవలయును. తేనెచేర్చిన యుదకము, అరిష్టమును, మద్యము, వీనిని పానము చేయించవలయును. వత్సకాది గణద్రవ్యములనుగాని, హరిద్రాదిగణద్రవ్యములనుగాని, వచాదిగణద్రవ్యములనుగాని, చూర్ణముచేసి ఉష్ణోదకములో కలిపి కొంచెము సైంధవలవణము చేర్చి ఆమవాతమునకు పానము చేయించవలయును. లేక షట్చరణ యోగమునుగాని యిప్పించవలయును. ఊరుస్తంభవాతమునకు త్రిఫలములు, చవ్యము, కటుకరోహిణి, పిప్పళ్లు, తుంగముస్తలు, వీనినిగాని, చవ్యము, కరక్కాయలు, చిత్రమూలము, దేవదారు, వీనినిగాని

సమభాగములుగ గ్రహించి నూరి కల్కముచేసి, అందులో తేనెకలిపి, నాకించవలయును. లేక కరకాయనుగాని, లేక గుగ్గిలమునుగాని, లేక శిలాజతువునుగాని గోమూత్రములోకలిపి ప్రతిదినము భక్షింపజేయవలయును.

శ్లేష్మామవాతరోగమునందు వ్యోషాదిచూర్ణము.

వ్యోషాగ్నిముస్తత్రిఫలా విడంగైర్గుగ్గులుం సమమ్. ౪౯
ఖాదన్ సర్వాన్ జయేద్వ్యాధీన్మేదశ్శ్లేష్మామవాతజాన్,

శుంఠి, పిప్పళ్లు, మిరియాలు, చిత్రమూలము, తుంగముస్తలు, కరకతాండ్రయుసిరికెలు, వాయువిడంగములు, ఈతొమ్మిదిద్రవ్యములును సమభాగములు; వీనికన్నిటిని సమము గుగ్గిలము, వీనినెల్ల నొకటిగచేర్చి చూర్ణముచేసి భక్షించిన మేదస్సు, కఫము, ఆమవాతము, వీనివలన జనించిన రోగములన్నియు హరించును.

శామ్యత్యేవం కఫాక్రాంతః సమేదస్కః ప్రభంజనః. ౫౦
క్షారమూత్రాన్వితాన్ స్వేదాన్ సేకానుద్వర్తనాని చ,
కుర్యాల్లిహ్యాచ్చ మూత్రాఢ్యైః కరంజఫలసర్షపైః. ౫౧
మూలైర్వాప్యర్కతర్కారీనింబజైస్ససురాహ్వయైః,
సక్షౌద్రసర్షపాపక్వలోష్టవల్మీకమృత్తికైః. ౫౨

పైచెప్పిన చికిత్సలను చేసినచో మేదస్సు కఫము వీనితోగూడియుండువాతరోగము శమించును. మఱియు మేదస్సు, కఫము, ఆమవాతము, వీనియందు సర్జక్షార, యవక్షారములు, గోమూత్రము, వీనితో స్వేదములు, సేకములు చేయించి,నలుగుపెట్టించవలయును. మఱియు కానుగవిత్తులు, ఆవాలు వీనిని గోమూత్రముతో నూరిగాని, జిల్లేడు వేళ్లు, తక్కలివేళ్లు, వేపవేళ్లు, దేవదారువేళ్లు, ఆవాలు, మంటిగెడ్డ, పుట్టమన్ను వీనినినూరి అందులో తేనెకలిపిగాని లేపనము చేయవలయును.

ఊరుస్తంభరోగికి వ్యాయామాది ప్రవర్తనము.

కఫక్షయార్థం వ్యాయామే సహ్యే చైనం ప్రవర్తయేత్,
స్థలాన్యుల్లంఘయేన్నారీశ్శక్తితః పరిశీలయేత్. ౫౩
స్థిరతోయం సరః క్షేమం ప్రతిస్రోతో నదీం తరేత్,
శ్లేష్మమేదఃక్షయే చాత్ర స్నేహాదీనవచారయేత్. ౫౪

కఫము క్షయించుటకై ఊరుస్తంభరోగిచే శక్త్యనుసారముగ ఓరుపశక్యమైనంత శ్రమకరములైన పనులను చేయించవలయును, పల్లమునుదాటింపవలయును. యథాశక్తి స్త్రీసంభోగమును చేయించవలయును. మొసలి, పాము మొదలగు దుష్టజంతువులు లేనిది

యు, ప్రవహించక నిల్కడగనుండు జలముగలదియు నైన తటాకమునందీదునటుల చేయవలయును. ప్రవహించునట్టి నదిలో ప్రవాహమున కెదుట నీదునటుల చేయవలయును. ఇటుల జేసిన కఫము, మేదస్సు, ఇవి క్షయించును. పిదప స్నేహాదుల నిప్పించవలయును.

స్థానదూష్యాది చాలోచ్య కార్యా శేషేష్వపి క్రియా,

తక్కిన వాతరోగము లన్నిటియందును స్థానదూష్యబలాదుల నాలోచించి వానికనుగుణముగ చికిత్సలను చేయవలయును.

### వాతపీడితునికి సహచరాదికషాయము.

సహాచరం సురదారు సనాగరం క్వథితమంభసి తైల విమిశ్రితమ్,
పవనపీడితదేహగతిః పిబేద్ద్రుతవిళంబితగో భవతీచ్ఛయా. ౫౫

పచ్చముల్లుగోరింట, దేవదారు, శుంఠి, వీనిని సమభాగములుగ నుదకములో వైచి చక్కగ కాచి వడియకట్టి; అందులో నువ్వులనూనె కలిపి, వాతముచే పీడింపబడిన శరీరముగలవానికి పానము చేయించిన, వాతమువలనకలిగిన పట్టువదలి స్వేచ్ఛగ వేగముతో సంచరించునట్టిశక్తి కలుగును.

### వాతరోగములకు రాస్నాదిఘృతము.

రాస్నామహౌషధద్వీపిపిప్పలీశటిపౌష్కరమ్,
పిష్ట్వా విపాచయేత్సర్పిర్వాతరోగహరం పరమ్. ౫౬

సన్నరాష్ట్రము, శుంఠి, చిత్రమూలము, పిప్పళ్ళు, కచోరములు, పుష్కరమూలము, వీనిని సమభాగములుగ గ్రహించి, చక్కగనూరి కల్కము చేసి, ఆవునేతిలో కలిపి, ఘృతపాకవిధిగ పక్వము చేయవలయును. ఈఘృతమును, పానము చేయించిన సర్వవాతరోగములు హరించును.

### నింబాదితైలము.

నింబామృతావృషపటోలనిదిగ్ధికానాం
భాగాన్పృథక్ దశపలాన్ విపచేద్ఘటేఽపామ్,
అష్టాంశశేషితరసేన పునశ్చ తేన
ప్రస్థం ఘృతస్య విపచేత్పిచుభాగకల్కైః. ౫౭
పాఠావిడంగసురదారుగజోపకుల్యా
ద్విక్షారనాగరనిశామిసిచవ్యకుష్ఠైః,
తేజోవతీమరిచవత్సకదీప్యకాగ్ని
రోహిణ్యరుష్కరవచాకణమూలయుక్తైః. ౫౮

మంజిష్ఠయాతివిషయా యవాన్యా
సంశుద్ధగుగ్గులుపలైరపి పంచసంఖ్యైః,
తత్సేవితం ప్రథమతి ప్రబలం సమీరం
సంధ్యస్థిమజ్జగతమప్యథ కుష్ఠమీదృక్. ౫౯
నాడీవ్రణార్బుదభగందరగండమాలా
జత్రూర్ధ్వసర్వగదగుల్మగుదోత్థమేహాః,
యక్ష్మారుచిశ్వసనపీనసకాసశోఫ
హృత్పాండురోగమదవిద్రధివాతరక్తమ్. ౬౦

వేము, తిప్పతీగె, అడ్డసరము, చేదుపొట్ల, వ్రాకుడు, వీనిని దినుసుకు 10 పలముల చొప్పున గ్రహించి; ద్రోణప్రమాణ ముదకములోవైచి, 8 వ భాగము మిగులునటుల కషాయముకాచి, వడియకట్టి; అందులో చిరుబొద్ది, వాయువిడంగములు, దేవదారు, ఏనుగపిప్పళ్ళు, సర్జక్షారయవక్షారములు, శుంఠి, పసువు, పిన్నసదాప, చవ్యము, చెంగల్వ కోష్టు, వెక్కుడుతీగె, మిరియాలు, కొడిసె, ఓమము, చిత్రమూలము, కటుకరోహిణి, జీడిగింజలు, వస, మోడి, మంజిష్ఠి, తెల్లఅతివస, నల్లఅతివస, ఓమము, వీనిని దినుసుకు కర్షప్రమాణముచొప్పున గ్రహించి, కల్కముచేసి, కలిపి, శుద్ధిచేసిన గుగ్గిలము 5 పలములు, ప్రస్థమావునెయ్యి, వీనిని చేర్చి కలియబెట్టి, ఘృతపాకవిధిగ పక్వముచేయవలయును. ఈఘృతమును, పానముచేయుచుండిన; సంధి అస్థులు మజ్జ వీటిని జేరి వృద్ధి జెందియుండు దారుణమైన వాతము, కుష్ఠువులు, నాడీవ్రణము, అర్బుదము, భంగదరము, గండమాల, మెడకొంకులపైన జనించు, సకల రోగములు, గుల్మము, అర్శాంకురములు, ప్రమేహములు, క్షయము, అరుచి, శ్వాసము, పీనసము, కాసము, వాపు, బొమ్మునొప్పి, పాండురోగము, మదాత్యయము, విద్రధి, వాతరక్తము, ఇవి యన్నియు నిశ్శేషముగ నివర్తించును.

## శిరోగతవాతమునకు నస్యము.

బలాబిల్వశృతే క్షీరే ఘృతమండం విపాచయేత్,
తస్య శుక్తిః ప్రకుంచో వా నస్యం వాతే శిరోగతే. ౬౧
తద్వత్సిద్ధా వసా నక్రమత్స్యకూర్మచులూకజా,
విశేషేణ ప్రయోక్తవ్యా కేవలే మాతరిశ్వని. ౬౨

శిరోగత వాతమునందు బలామూలము, మారేడు, వీనిని చేర్చి కాచబడిన పాలలో నేతిమీగడను చేర్చి, చక్కగ పాకముచేసి, దానిని 2 కర్షములు, లేక 1 పలము, గ్రహించి, దానిచే నస్యము చేయించవలయును. మఱియు వాతము మాత్రము

మిక్కుటముగ ప్రకోపించియుండినచో మొసలి, తాబేలు, చులూకమను మత్స్యము, అనువాని క్రొవ్వును ముందువలె బలామూలము,మారేడు, వీనితో కాచబడిన పాలలో చేర్చి పాకము జేసి, దానిని నస్యమునందు ప్రయోగించవలయును.

### వాతరోగమునకు జీర్ణపిణ్యాకాది తైలము.

జీర్ణం పిణ్యాకం పంచమూలం పృథక్చ
క్వాథ్యం క్వాథాభ్యామేకతస్తైలమాభ్యామ్,
క్షీరాదష్టాంశం పాచయేత్తేన పానా
ద్వాతా నశ్యేయుః శ్లేష్మయుక్తా విశేషాత్. ౬౩

ప్రాతదిగనుండు తెలికపిండి, పంచమూలములు, వీనిని వేర్వేరుగ కషాయము కాచి, పిదప నీరెండుకషాయముల నేకముచేసి, అందులో నువ్వులనూనె కలిపి, దానికి 8 వ భాగమావుపాలను చేర్చి, చక్కగ పాకముచేసి, పానముచేయించిన, వాతరోగములును శ్లేష్మవాతములును, శీఘ్రముగ శమించును.

### వాతరోగమునకు ప్రసారిణీతైలము.

ప్రసారణీతులాక్వాథే తైలప్రస్థం పయస్సమమ్,
ద్విమేదామిసిమంజిష్ఠాకుష్ఠరాస్నాకుచందనైః. ౬౪
జీవకర్షభకాకోలీయుగళామరదారుభిః,
కల్కైర్విపచేత్సర్వమారుతామయనాశనమ్. ౬౫

1 తులము (నూరుపలములు) గొంతెమగొమరును ఉదకములో వైచి కషాయము కాచి అందులో నువ్వులనూనె 1 ప్రస్థము, ఆవుపాలు 1 ప్రస్థముచేర్చి; మేద, మహామేద, పిన్నసదాప, మంజిష్ఠి, చెంగల్వకోష్టు, దుంపరాష్ట్రము,కుచందము, జీవకము,ఋషభకము,కాకోళి,క్షీరకాకోళి, దేవదారు, వీనిని సమభాగములుగ గ్రహించి, కల్కముచేసి కలిపి తైలపాకవిధిగపక్వము చేయవలయును. ఇది వాతరోగము లన్నిటిని పోగొట్టును.

### సహచరాది తైలము.

సమూలశాఖస్య సహచరస్య తులాం సమేతాం దశమూలతశ్చ,
పలాని పంచాశదభీరుతశ్చ పాదావశేషం విపచేద్వహే౽పామ్. ౬౬
తత్ర సేవ్యనఖకుష్ఠహిమైలాస్పృక్ప్రియంగునలికాంబుశిలాజైః,
లోహితానలదలోహసురాహ్వైః కోపనామిశితురుష్కనతైశ్చ ౬౭
తుల్యం క్షీరం పాలికైస్తైలపాత్రం
సిద్ధం కృచ్ఛ్రాన్ శీలితం హంతి వాతాన్
కంపాక్షేపస్తంభశోషాదియుక్తాన్
గుల్మోన్మాదౌ పీనసం యోనిరోగాన్. ౬౮

సమూలముగనుండు పచ్చములుగోరింట 1 తులము (నూరుపలములు) దశమూలములు 1 తులము (నూరుపలములు) పిల్లిపీచర 50 పలములు, వీనిని 4 ద్రోణములుదకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి వడియకట్టి, అందులో వట్టివేరు, వ్యాఘ్రనఖము, చెంగల్వకోష్టు, చందనము, ఏలకులు, స్పృక్కయను గంధద్రవ్యము, ప్రేంకణము, రేణుకలు, కురువేరు, శిలాజిత్, మంజిష్ఠి, తెల్లవట్టివేరు, కృష్ణాగరు, దేవదారు, కోపనా, పిన్నసదాప, తురుష్కమనెడు గంధద్రవ్యము, గ్రంథితగరము, అనువానిని ప్రత్యేకము 1 పలము, చొప్పుననూరికల్కముచేసి కలిపి, అందులో నువ్వులనూనె 1 ఆఢకము, ఆవుపాలు 1 ఆఢకము పోసి, తైలపాకవిధిగ పక్వము చేయవలయును. దీనిని సేవించిన, కంపవాతము, ఆక్షేపము, స్తబ్ధత్వము, శోష, అను, నుపద్రవములతోగూడియుండు దారుణ వాతరోగములు; గుల్మము, ఉన్మాదము, పీనసము, యోనిరోగము ఇవి నివర్తించును.

### భేదసమ్మత సహాచరతైలము.

సహాచరతులాయాస్తు రసే తైలాఢకం పచేత్,
మూలకల్కాద్దశపలం పయో దత్వా చతుర్గుణమ్. ౬౯
అథవా నతషడ్గ్రంథా స్థిరాకుష్ఠసురాహ్వయైః,
సైలానలదశైలేయశతాహ్వారక్తచందనైః. ౭౦
సిద్ధే౽స్మిన్ శర్కరాచూర్ణాదష్టాదశపలం క్షిపేత్,
భేదస్య సమ్మతం తైలం తత్కృచ్ఛ్రానినిలామయాన్. ౭౧
వాతకుండలికోన్మాదగుల్మవర్ధ్మాదికాన్ జయేత్,

1తులము (నూరుపలములు) పచ్చములుగోరింటను ఉదకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి వడియకట్టి, అందులో ముల్లంగికల్కము 10 పలములు, నువ్వులనూనె 1 ఆఢకము, ఆవుపాలు 4 ఆఢకములు, వీనినికలిపి తైలపాకవిధిగ పక్వముచేయవలయును. లేక పైములుగోరింట కషాయములో గ్రంథితగరము, వస, ముయ్యాకుపొన్న, చెంగల్వకోష్టు, దేవదారు,ఏలకులు, వట్టివేరు,శిలాజిత్తు, సదాపరక్తచందనము వీనిని సమభాగములుగచేర్చి 1 ఆఢకము,నువ్వులనూనె కలిసి తైలపాకవిధిగ పక్వముచేసిఅందులో పంచదార 10 పలములు, చక్కగ చూర్ణముచేసి కలసవలయును. ఇది భేదమహర్షిచే నిర్మించబడిన సహచర తైలము. దారుణమైన వాతరోగములు వాతకుండలి ఉన్మాదము గుల్మము వృద్ధి మొదలగు రోగములను పోగొట్టును.

### బలాతైలము.

బలాశతం ఛిన్నరుహాపాదం రాస్నాష్టభాగికమ్. ౭౨

జలాఢకశతే పక్త్వా శతభాగస్థితే రసే,
దధిమస్త్విక్షునిర్యాసశుక్తైస్తైలాఢకం సమైః. ౭౩
పచేత్సాజపయోర్ధాంశం కల్కైరేభిః పలోన్మితైః,
శటీసరళదార్వేలామంజిష్ఠాగురుచందనైః. ౭౪
పద్మకాఽతిబలాముస్తాశూర్పపర్ణీహరేణుభిః,
యష్ట్యాహ్వసురసవ్యాఘ్రనఖర్షభకజీవకైః. ౭౫
పలాశరసకస్తూరీనలికాజాతికోశకైః,
స్పృక్కాకుంకుమశైలేయజాతికాకట్ఫలాంబుభిః. ౭౬
త్వక్కుందురుష్కకర్పూరతురుష్కశ్రీనివాసకైః,
లవంగనఖకంకోలకుష్ఠమాంసీప్రియంగుభిః ౭౭
స్థౌణేయతగరధ్యామవచామదనకప్లవైః,
సనాగకేసరైస్సిద్ధే దద్యాచ్చాత్రావతారితే. ౭౮
పత్రకల్కం తతః పూతం విధినా తత్ప్రయోజితమ్,
కాసశ్వాసజ్వరచ్ఛర్దిమూర్ఛాగుల్మక్షతక్షయాన్. ౭౯
ప్లీహశోషమపస్మారమలక్ష్మీం చ ప్రణాశయేత్,
బలాతైలమిదం శ్రేష్ఠం వాతవ్యాధివినాశనమ్. ౮౦

బలామూలము (చిట్టాముట్టివేళ్లు) 100పలములు, తిప్పతీగె 25 పలములు,సన్నరాష్ట్రము,12½ పలములు, ఇటుల వీనిని 100 ఆఢకముల ఉదకములో వైచి, 1 ఆఢకము మిగులునటుల కషాయము కాచి, అందులో పెరుగుమీఁదిమీఁగడ,చెఱకురసము,శుక్తమను పులిగంజి,నువ్వులనూనె, ఇవి దినుసుకు 1 ఆఢకము, మేకపాలు ½ ఆఢకము,వీనినిపోసి, కచోరములు, సరళదేవదారు, ఏలకులు, మంజిష్ఠి, అగరుచెక్క, చందనము, పద్మకము, పెరాముట్టి, తుంగముస్తలు,పిల్లిపెసర, రేణుకలు,అతిమధురము, తులసి,వ్యాఘ్రనఖము, జీవకము, ఋషభకము, మోదుగురసము, (మోదుగుజిగురు,) కస్తూరి, పెద్దనీలి, జాజికాయ, స్పృక్కయను గంధద్రవ్యము, కుంకుమపువ్వు, శిలాజిత్తు, జాపత్రి, పెద్దటేకు, కురువేరు, లవంగపట్ట, కుందురుష్కము, కర్పూరము, తురుష్కమను గంధద్రవ్యము, శ్రీనివాసకమను గంధద్రవ్యము, లవంగములు, నఖము చిప్పలు, తక్కోలము, చెంగల్వకోష్టు, జటామాంసి, ప్రేంకణము, మాచిపత్రి, గ్రంథితగరము, ధ్యామకము, వస, మ్రంగ, దుందిలము, నాగకేసరములు, వీనిని దినుసుకొకపలముచొప్పున చేర్చి, తైలపాకవిధిగ పక్వముచేసి, దించుకొని, అందులో ఆకుపత్రికల్కమును చేర్చి, వడియకట్టి, విధిప్రకారము సేవించిన; కాసము, శ్వాసము, జ్వరము, వాంతి, మూర్ఛ, గుల్మము, ఉరః

క్షతము, క్షయము, ప్లీహము, శోష, అలక్ష్మి, అపస్మారము. ఇవి హరించును. ఇది బలాతైలమనబడును. వాతవ్యాధులనన్నిటిని పోగొట్టును. వాతహరతైలములలో నీబలాతైలము శ్రేష్ఠము. మరియు గర్భవ్యాపత్తునకు జెప్పినబలాతైలమునకన్న మిక్కిలి శ్రేష్ఠము.

వాతరోగమున స్నేహపానాదిగుణము.

పానే నస్యేఽన్వాసనేఽభ్యంజనే చ
స్నేహాః కాలే సమ్యగేతే ప్రయుక్తాః,
దుష్టాన్వాతానాశు శాంతిం నయేయు
ర్వంధ్యా నారీః పుత్రభాజశ్చ కుర్యుః. ౮౧

పైచెప్పిన స్నేహములను రోగదేశబలాదులననుసరించి, పాననస్య అనువాసన వస్తి అభ్యంజనలయందు, యుక్తియుక్తముగ యుక్తకాలమున ప్రయోగించిన; దుష్టవాత రోగములన్నియు శీఘ్రముగ నశించుటయేగాక, గొడ్రాండ్రకుగూడ సంతానము కలుగును.

వాతరోగమునకు వస్తికర్మ.

స్నేహస్వేదైర్ద్రుతశ్శ్లేష్మా యదా పక్వాశయే స్థితః,
పిత్తం వా దర్శయేద్రూపం వస్తిభిస్తం వినిర్హరేత్. ౮౨

స్నేహస్వేదకర్మలచు చేయించుటవలన కఫము ద్రవత్వమునుజెంది, పక్వాశయముచు జేరియుండినను,పిత్తము పక్వాశయమును, జేరియుండినను, ఆ కఫ పిత్తములను వస్తికర్మలచే చికిత్స చేయనగును.

ఏకవింశాధ్యాయము ముగిసెను.



# ద్వావింశాధ్యాయము.

అవ: వాతశోణితరోగము వాతవ్యాధులలో జేరినదిగ నుండుటవలనను, దుష్ట రక్తముతో గూడియుండు వాతముచే జనించిన దగుటవలనను, వాతవ్యాధిచికిత్సితా ధ్యాయనిరూపణానంతరము వాతశోణితచికిత్సితాధ్యాయము చెప్పఁబడుచున్నది. మరియు, నీవాతశోణితరోగము వాతవ్యాధిభేద మగుటచే పైయధ్యాయముననే చెప్ప దగి యున్నను, ఈవ్యాధి నుద్దేశించి చికిత్సలు విస్తారముగా జెప్పవలసియుండుటచే స్వతంత్రముగ ప్రత్యేకాధ్యాయము చెప్పబడెను.

వాతశోణిత చికిత్సితాధ్యాయప్రారంభము.

సూ. అథాతో వాతశోణితచికిత్సితం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

వాతవ్యాధిచికిత్సితాధ్యాయ నిరూపణానంతరము వాతరక్తరోగచికిత్సలను తెలియపరచునట్టి వాతశోణితచికిత్సితమను నీయధ్యాయమును వివరించెదము.

వాతశోణితచికిత్సాక్రమము.

వాతశోణితినో రక్తం స్నిగ్ధస్య బహుశో హరేత్,
అల్పాల్పం పాలయన్ వాయుం యథాదోషం యథాబలమ్. ౧

వాతరక్తరోగముగలవానికి స్నేహకర్మను చేయించి, వాతమునకు ప్రకోపావస్థను గలుగనియ్యక రక్షింపుచు, దోషములు దూష్యములు రోగిశరీరబలము, మున్నగువానిని గమనించి తదనుసారముగ కొంచెము కొంచెముగ రక్తమును అప్పుడప్పుడును వెలిపరచ వలయును.

వాతశోణితమునందు రక్తమోక్షణక్రమము.

రుగ్రాగతోదదాహోషు జలౌకాభిర్వినిర్హరేత్,
శృంగతుంబైశ్చిమిచిమాకండూరుగ్దాయనాన్వితమ్. ౨
ప్రచ్ఛానేన సిరాభిర్వా దేశాద్దేశాంతరం వ్రజేత్,

వాతరక్తరోగికి శూల, ఎఱుపువర్ణము, పోట్లు, మంట, ఇవి కలిగియుండినచో జలగలచే రక్తమును దీయవలయును. చిమచిమయనుచు దురదయు నొప్పియు కలిగియుండినచో కొమ్ము, సొరకాయబుఱ్ఱ, వీనిచే రక్తమును తీయవలయును. రక్త మొకప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు సంచరించుచుండిన ప్రచ్ఛానము (ఛేదించుట) చేనైనను, సిరలవేధించుటచేగాని రక్తమును వెలిపుచ్చవలయును.

### దుర్బలవాతరోగికి రక్తమోక్షణనిషేధము

అంగగ్లానౌ తు న స్రావ్యం రూక్షం వాతోత్తరం చ యత్. 3
గంభీరం శ్వయథుం స్తంభం కంపస్నాయుసిరామయాన్,
గ్లానిమన్యాంశ్చ వాతోత్థాన్ కుర్యాద్వాయురసృక్ క్షయాత్.

శరీరము బడలికనొందియుండు వాతశోణితరోగికి రక్తమోక్షణము చేయం జనదు. రూక్షముగ వాతాధిక్యముగనుండు రక్తమును వెలిపరుపంగూడదు. అటులచేసిన రక్తముక్షయించును. అందువలన వాతము ప్రకోపించి గంభీరమైనవాపు, స్తబ్ధత్వము, వణుకు, స్నాయురోగము, సిరలయందునొప్పి, బడలిక, పలుదెరంగులైన వాతరోగములు ఇవి కలుగును.

### వాతరక్తరోగికి విరేచనము.

విరేచ్యస్స్నేహయిత్వా తు స్నేహయుక్తైర్విరేచనైః,

విరేచనకర్మ కర్హుడుగనుండువాతరక్తరోగికి తొలుత స్నేహకర్మను చేయించి, ఘృతాది స్నేహములతోగూడిన విరేచనౌషధము నొసంగవలయును.

### వాతాధికవాతరక్తమునకు ఘృతపానము.

వాతోత్తరే వాతరక్తే పురాణం పాయయేద్ఘృతమ్ ౪

వాతాధిక్యముతో గూడియుండు వాతరక్తరోగమునందు పాతదిగనుండు ఆవు నెయ్యిని పానము చేయించవలయును.

### వాతరక్తరోగమునకు శ్రావణ్యాదిఘృతము.

శ్రావణీక్షీరకాకోలీ క్షీరిణీజీవకైస్సమైః,
సిద్ధం సపఞ్చగుణక్షీరం... 

బోడతరము, క్షీరకాకోళి, పిన్నపాల, జీవకము, ఆవాలు, వీనిని సమభాగ ములుగ గ్రహించి కల్కముజేసి ఆవునేతిలో కలిపి అందు ఆవుపాలు పోసి ఘృతపాక విధిగ పక్వముచేసి దానిని పానముచేయించిన వాతరక్తరోగము హరించును.

### వాతరక్తరోగమునకు ద్రాక్షాఘృతాదులు.

ద్రాక్షామధూకవారిభ్యాం సిద్ధం వా ససితోపలమ్,
ఘృతం పిబేత్తథా క్షీరం గుడూచీస్వరసే శృతమ్ ౬
తైలం పయశ్శర్కరాం చ పాయయేద్వాసుమూర్ఛితమ్,

ద్రాక్ష, అతిమధురము, వీనితో పక్వముచేయబడిన ఘృతములో పంచదార కలిపిగాని; తిప్పతీగె స్వరసముతో కాచబడిన ఆవుపాలనుగాని; నువ్వులనూనె, పంచ

దార, ఆవుపాలు, వీనిని సమభాగములుగ చేర్చి గాని, వాతరక్తరోగికి పానముచేయించ వలయును.

వాతరోగహరక్షీరము.

బలాశతావరీరాస్నాదశమూలైస్సపీలుభిః ౯
శ్యామైరండస్థిరాభిశ్చ వాతార్తిఘ్నం శృతం పయః,

బలామూలము (చిట్టాముట్టివేరు), పిల్లిపీచర, దుంపరాష్నము, దశమూలములు, గోగు, నల్లతెగడ, ఆముదము, ముయ్యాకుపొన్న, వీనిని సమభాగములుగ గ్రహించి, ఆవుపాలలోకలిపి, కాచి, పానముచేయించిన, వాతరోగములు నశించును.

వాతరోగమునకు ధారోష్ణాదిక్షీరపానము.

ధారోష్ణం మూత్రయుక్తం వా క్షీరం దోషానులోమనమ్. ౯

ధారోష్ణమైన ఆవుపాలను గోమూత్రములోకలిపి పానముచేయించిన వాతాది దోషముల కనులోమగతి కలుగును.

పిత్తాధికవాతరక్తరోగహర కషాయము.

పైత్తే పక్వా పరీతిక్తాపటోలత్రిఫలామృతాః,
పిబేద్ఘృతం వా క్షీరం వా స్వాదుతిక్తకసాధితమ్. ౧౦

పిత్తాధిక్యముతో గూడియుండు వాతరక్తరోగమునందు పిల్లిపీచర, కటుక రోహిణి, చేదుపొట్ల, త్రిఫలములు, తిప్పతీగె, వీనిని సమభాగములుగ గ్రహించి యుదక ములోవైచి కాచిన కషాయమును పానము చేయించవలయును. లేక మధురముగ చేదుగనుండు ద్రవ్యములతో పక్వముచేయబడిన ఘృతమును గాని, పైద్రవ్యములను చేర్చికాచిన ఆవుపాలనుగాని, పానము చేయించవలయును.

పిత్తాధికవాతరక్తరోగికి విరేచనము.

క్షీరేణైరండతైలం చ ప్రయోగేణ పిబేన్నరః,
బహుదోషో విరేకార్థం జీర్ణే క్షీరోదనాశనః. ౧౧
కషాయమభయానాం వా పాయయేద్ఘృతభర్జితమ్,
క్షీరానుపానం త్రివృతాచూర్ణం ద్రాక్షారసేన వా. ౧౨

దోషాధిక్యముతో గూడియుండు వాతశోణితరోగికి విరేచనమగుటకై ఆముదముతో ఆవుపాలనుకలిపి పానముచేయించి, యది జీర్ణమైన పిదప ఆవుపాలతో అన్న మును భుజింపజేయవలయును. లేక కరక్కాయల కషాయమును ఘృతముతోడ పానము చేయించవలయును. లేక తెల్లతెగడవేళ్ల చూర్ణమును ద్రాక్షపండురసములో కలిపి పానము చేయించి తోడనే ఆవుపాలను పానముచేయించవలయును.

వాతరక్తరోగమున వస్తికర్మ.

నిర్హరేద్వా మలం తస్య సఘృతైః క్షీరవస్తిభిః,
నహి వస్తిసమం కించిద్వాతరక్తచికిత్సితమ్. ౧౩
విశేషాత్పాయుపార్శ్వోరుపర్వాస్థిజఠరార్తిషు,

వాతరక్తరోగముగలవానికి ఆవునెయ్యి సహితముగనుండు క్షీరవస్తికర్మలను ప్రయోగించి మలమును బైలుపరచవలయును. వాతరక్తరోగమునందు వస్తికర్మకు సమమైన చికిత్స వేరొద్దియు లేదు. మఱియు గుదము, ప్రక్కలు, తొడలు, గణుపులు, ఎముకలు, కడుపు, వీనియందు శూలగలవానికి వస్తికర్మ మిక్కిలి శ్రేష్ఠమయినది.

కఫాధికవాతరక్తమునకు ముస్తాదికషాయము.

ముస్తధాత్రీహరిద్రాణాం పిబేత్క్వాథం కఫోల్బణే. ౧౪
సక్షౌద్రం త్రిఫలాయా వా గుడూచీం వా యథా తథా,

కఫాధిక్యముగల వాతరక్తరోగమునకు తుంగముస్తలు, ద్రాక్ష, వసుపు, వీని కషాయమునుగాని; త్రిఫలముల కషాయమునుగాని, తేనెతోడ పానము చేయించవల యును. అనేకవిధముల తిప్పతీగె నుపయోగించవలయును.

వాతరక్తరోగికి వమనము.

యథార్హస్నేహపీతం చ వామితం మృదు రూక్షయేత్. ౧౫

వాతరక్తరోగికి దోషానుగుణముగ స్నేహనము చేయించి, పిదప వమనమున కొసంగి మృదువుగ రూక్షచికిత్సలను చేయవలయును.

వాతరక్తమునకు త్రిఫలాదికల్కము.

త్రిఫలావ్యోషపత్రైలాత్వక్ క్షీరీచిత్రకం వచామ్,
విడంగం పిప్పలీమూలం లోమశం వృషకం త్వచమ్. ౧౬
ఋద్ధిం లాంగలికం చవ్యం సమభాగాని పేషయేత్,
కల్కైర్లిప్త్వాయసీం పాత్రీం మధ్యాహ్నే భక్షయేదిదమ్. ౧౭
వాతాస్రే సర్వదోషేఽపి పరం శూలాన్వితే హితమ్,

త్రిఫలములు, త్రికటుకములు, ఆకుపత్రి, ఏలకులు, తవక్షీరి, చిత్రమూలము, వస, వాయువిడంగములు, మోడి, తెల్లఆతివస, అడ్డసరము, లవంగపట్ట, ఋద్ధి, చన్న చర్లగడ్డ, చవ్యము, వీనిని సమభాగములుగ గ్రహించి; చక్కగనూరి ప్రాతఃకాలమున నొక యినుపపాత్రకు బూసి, దానిని మధ్యాహ్నమున భక్షింపవలయును. ఇది దోషా ధిక్యమ ,శూలలు, వీనితోగూడియుండు వాతరక్తరోగమునకుత్కృష్టమైనయౌషధము.

### వాతరక్తమునకు కోకిలాక్షకషాయము.

కోకిలాక్షకనిర్యూహః పీత స్తచ్ఛాకభోజినా. ౧౮
కృపాభ్యాస ఇవ క్రోధం వాతరక్తం నియచ్ఛతి,

గొబ్బిచెట్టు కషాయమును పానముచేసి, గొబ్బికూరను భుజించిన "దయను నాట నభ్యసించుటచే కోపమును పోకడచు భంగి" వాతరక్తమును పోకడచును.

### ఖుడరోగచికిత్స.

పంచమూలస్య ధాత్ర్యా వా రసై ర్లేలీతకీం వసామ్. ౧౯
ఖుడం సురాఢ్యమవ్యంగే బ్రహ్మచారీ పిబన్ జయేత్,

పంచమూలముల రసములోగాని, ఉసిరికకాయలరసములోగాని శుద్ధిచేసిన ఘకమును కలిపి పానముచేసి స్త్రీసంభోగము చేయకుండిన చిరకాల మనువర్తింపు డు ఖుడరోగము నివర్తించును.

ఇత్యాభ్యంతరముద్దిష్టం కర్మ బాహ్యమతః పరమ్. ౨౦

ఇటుల వాతరక్తరోగమునకు అభ్యంతరములైన చికిత్సలు చెప్పబడినవి. ఇక హ్యచికిత్సలు చెప్పబడును.

### ఆరనాళ తైలము.

ఆరనాళాఢకే తైలం పాదసర్జరసం శృతమ్,
ప్రభూతే ఖజితం తోయే జ్వరదాహార్తినుత్పరమ్. ౨౧

1 ఆఢకము కలిలో పాతికె భాగము సర్జరసము నువ్వులనూనె కలిపి, చక్కగ ముచేసి, యుదకములోచేర్చి, చిలికి యుపయోగించిన జ్వరము, సర్వాంగతాపము హారించును.

### వాతరక్తరోగమునకు పిండతైలము.

సమధూచ్ఛిష్ట మంజిష్ఠం ససర్జరససారిబమ్,
పిండతైలం తదభ్యంగాద్వాతరక్తరుజాపహామ్. ౨౨

1 ఆఢకప్రమాణము కలిలోపాతికె ఆఢకము నువ్వులనూనె కలిపి అందులో ము, మంజిష్ఠి, సర్జరసము, సుగంధిపాల, వీనిని సమభాగములుగ గ్రహించి ముచేసి చేర్చిపక్వముచేసిన, నది పిండతైల మనబడును. దీనిచే నభ్యంగముచేయిం వాతరక్తరోగము నిశ్శేషముగ హారించును.

### వాతరక్తరోగమునకు పరిషేకము.

దశమూలే శృతం క్షీరం సద్యశ్శూలనివారణమ్,

పరిషేకోఽనిలప్రాయే తద్వత్కోష్ణేన సర్పిషా. ౨౩
స్నేహైర్మధురసిద్ధైర్వా చతుర్భిః పరిషేచయేత్,

స్తంభాక్షేపకశూలార్తం కోష్ణైర్దాహే తు శీతలైః ౨౪
తద్వద్గవ్యావికచ్ఛాగైః క్షీరైస్తైలవిమిశ్రితైః,
నిఃక్వాథైర్జీవనీయానాం పంచమూలస్య వా లఘోః ౨౫

దశమూలములతో కాచబడిన ఆవుపాలచే పరిషేకము చేయించిన వాతరక్తరోగికి శూలలు అప్పుడే శమించును. వాతాధిక్యముగల వాతరక్తరోగమునందు కొంచెముష్ణముగనుండు ఆవునెయ్యిచేపరిషేకముచేయించిన హితముకలుగును. స్తంభము ఆక్షేపకము, శూలలు, వీనిచే పీడింపబడియుండు వాతరక్తరోగికి, మధురరసముగల ద్రవ్యములతో పక్వముచేయబడినదియు, కొంచెముష్ణముగనుండునదియు నైనఘృతము మొదలగు 4 స్నేహములచే పరిషేకము చేయించవలయును. ఆవుపాలు, మేకపాలు, గొఱ్ఱెపాలు, వీనిని సమభాగములుగ గ్రహించి యేకముజేసి, అందులో నువ్వులనూనె కలిపిగాని, జీవనీయగణద్రవ్యముల కషాయముచేగాని, లఘుపంచమూలముల కషాయముచేగాని, సుఖోష్ణముగ పరిషేకము చేయించినచో సుఖము కలుగును. తాపము గలిగినచో శీతముగనుండు పైస్నేహకషాయములచే పరిషేకము చేయించవలయును.

### పరిషేకయోగ్యద్రవ్యములు.

ద్రాక్షేక్షురసమద్యాని దధిమస్త్వమ్లకాంజికమ్,
సేకార్థం తండులక్షౌద్రం శర్కరాంభశ్చ శస్యతే. ౨౬

వాతరక్తరోగికి సర్వాంగతాపము గలిగినయెడల, ద్రాక్షరసము, చెఱకురసము, మద్యములు, పెరుగుమీఁదిమీగడ, కలి, గంజి, బియ్యపుకడుగు, తేనె, కలిపినయుదకము, పంచదారచేర్చిన యుదకము, వీనిచే పరిషేకము చేయించిన ప్రశస్తంబుగ నుండును.

### వాతరక్తరోగికి శరీరతాపనివర్తకోపాయము.

ప్రియాః ప్రియంవదా నార్యశ్చందనార్ద్రకరస్తనాః,
స్పర్శశీతాస్సుఖస్పర్శా ఘ్నంతి దాహం రుజం క్లమమ్ ౨౭

ప్రియురాండ్రుగ ప్రియమైన మాటలు చెప్పువారుగ చేతులు స్తనములు వీనియందు చందనమలదికొని చల్లగనుండు శరీరముగలవారుగ సుఖస్పర్శముగలవారుగ నుండుస్త్రీల నాలింగనముచేసికొనిన, వాతరక్తరోగికి సర్వాంగతాపము, శూల, బడలిక, ఇవి నివర్తించును.

### వాతరక్తమునకు ప్రపౌండరీకాదిలేపము.

సరాగే సరుజే దాహే రక్తం హృత్వా ప్రలేపయేత్,
ప్రపౌండరీకమంజిష్ఠాదార్వీమధుకచందనైః. ౨౮
ససితోపలకాశేక్షు మసూరైరకసక్తుభిః,
లేపో రుగ్దాహవీసర్పరాగశోఫనిబర్హణః ౨౯

వాతరక్తరోగికి ఎరుపువర్ణము, శూల, తాపము, ఇవి గలిగియుండినచో రాక్షణము చేయించి, పిదప ప్రపౌండరీకము, మంజిష్ఠి, మ్రానిపసుపు, అతిమ ౦, రక్తచందనము, పంచదార, రెల్లు, చెఱకు, చిరుసెనగలు, కాకివెదురుబియ్యపు వీటి నొకటిగ చేర్చి నూరి, లేపనము చేసిన, శూల, మంట, విసర్పకుష్ఠము, వర్ణము, వాపు, నివర్తించును.

### వాతరక్తమునందు కృసరాదియోగము.

వాతఘ్నైస్సాధితః స్నిగ్ధః కృసరో ముద్గపాయసః,
తిలసర్షపపిండైశ్చ శూలఘ్న ముపనాహనమ్. ౩౦

వాతహరద్రవ్యములతో పక్వము చేయబడినదిగ ఘృతాది స్నేహములు చేర్చబడి ండు కృసరము, పెసరపాయసము, వీనిని భుజించుటచేతను, నువ్వులు, ౦, వీనిని నూరి యుండలుజేసి వానిచే ఉపనాహ స్వేదము చేయుటచేతను ంహరించును.

### స్తంభాదిహరస్వేదము.

ఔదకాః ప్రసహానూపవేసవారాస్సుసంస్కృతాః,
జీవనీయౌషధస్నేహయుక్తాస్స్యురుపనాహనే. ౩౧
స్తంభతోదరుగాయామశోఫాంగగ్రహానాశనాః,
జీవనీయౌషధైస్సిద్ధాస్సపయస్కావసాపి వా. ౩౨

జీవనీయౌషధములతో పక్వము చేయబడినదిగ, ఘృతాదిస్నేహయుక్తముగ ఔదకమాంసము, ప్రసహజంతువులమాంసము, అనూపజంతువుల మాంసము, వారములచే ఉపనాహస్వేదములను చేయించినను లేక పై ఔదకజంతువులు సవాని క్రొవ్వును, జీవనీయౌషధములతో పక్వముచేసి, అందులో ఆవుపాలు ంనిచె ఉపనాహస్వేదము చేయించినను స్తంభము, పోట్లు, శూల ఆయామ , వాపు, అంగములుపట్టుకొనుట, ఇట్టి యుపద్రవములు హరించును. (ఉపనా మన - పైజెప్పిన యౌషధములచే వేడిగనుండుతరి కట్టుగట్టినట్లు శరీరముపై జట్టి బుట్టించుట.)

స్తంభాదిహర లేపము.

ఘృతం సహచరాన్మూలం జీవంతీ చ్ఛాగలం పయః,
లేపః పిష్ట్వా తిలాస్తద్వద్భృష్టాః పయసి నిర్వృతాః 33

పచ్చములుగోరింట, పిన్నమనుబాల, వీనివేళ్ళను నూరి కల్కముచేసి, అందులో ఆవునెయ్యి, గొఱ్ఱెపాలుకలిపి, లేపనముజేసినను; నువ్వులను వేయించి నూరి గొఱ్ఱెపాలలో కలిపి లేపనముచేసినను; స్తంభము, పోట్లు, మొదలగు నుపద్రవములు హరించును.

వాతరక్త శూలహర క్షుమాదిలేపము.

క్షీరపిష్టక్షుమాలేపమేరండస్య ఫలాని వా,
కుర్యాచ్ఛూలనివృత్త్యర్థం శతాహ్వాం వాఽనిలేఽధికే. 34

వాతరక్తరోగికి వాతమధికమై శూలజనించిన నది నివర్తించుటకై అగసి విత్తులనుగాని, ఆముదపువిత్తులనుగాని, సదాపనుగాని, ఆవుపాలతోనూరి లేపనము చేయవలయును.

వాతాధికవాతరక్తమునకు అభ్యంజనాదులు.

మూత్రక్షారసురాపక్వ ఘృతమభ్యంజనే హితమ్,
సిద్ధం సమధు శుక్తం వా సేకాభ్యంగే

వాతరక్తరోగికి వాత మధికముగ నుండినయెడల గోమూత్రము, సర్జక్షారము, సురయనుమద్యము, వీనితో పక్వముచేయబడిన ఘృతముచే అభ్యంజనము జేసికొనిన శూలలు నివర్తించును. లేక శుక్తమనుకలిసీళ్లలో తేనె కలిపి పరిషేకమునకును, అభ్యంగనమునకును ఉపయోగించుకొనిన హితము కలుగును.

కఫాధిక వాతరక్తమునకు గృహధూమాదిలేపము.

కఫోత్తరే. 35

గృహధూమో వచా కుష్ఠం శతాహ్వా రజనీద్వయమ్,
ప్రలేపశ్శూలనుద్వాతరక్తే

కఫాధిక్యముతో గూడియుండు వాతశోణితరోగమునందు కరుధూపము, వస, చెంగల్వకోష్టు, సదాప, మ్రానిపసుపు, వీనినినూరి లేపనము చేసికొనిన శూలలుహరించును.

వాతకఫాధిక రక్తహరలేపము.

వాతకఫోత్తరే. 36

మధుశిగ్రోర్హితం తద్వద్బీజం ధాన్యామ్లసంయుతమ్,
ముహూర్తం లిప్తమమ్లైశ్చ సించేద్వాతకఫోత్తరే. 37

శ్లేష్మాధిక్యముతో గూడియుండు వాతరక్తరోగమునందు ఎఱ్ఱ మునగవిత్తులను కాంజికములో కలిపి లేపనము చేసిన హితము కలుగును. ఎఱ్ఱ మునగవిత్తులను ముతో నూరి ముహూర్తకాలము లేపనము చేసికొని పిదప కలితో కడగవల

### ఉత్తానవాతరక్తచికిత్స.

ఉత్తానం లేపనాభ్యంగపరిషేకావగాహనైః,

ఉత్తానముగనుండు వాతరక్తరోగమునకు లేపము, అభ్యంగము, పరిషేకము హము, వీనిని చేయించవలయును.

### గంభీరవాతరక్తచికిత్స.

విరేకాస్థాపనైః స్నేహపానైర్గంభీరమాచరేత్. ౩౮

గంభీరముగనుండు (శరీరమున రసరక్తాది ధాతువుల లోభాగమున వ్యాపించి ు) వాతరక్తరోగమును; విరేచనము, ఆస్థాపనవస్తి, స్నేహపానము, వీనిచే చికి ంపవలెను.

### వాతకఫాధిక వాతరక్తచికిత్స.

వాతశ్లేష్మోత్తరే కోష్ణా లేపాద్యాస్తత్ర శీతలైః,
విదాహశోఫరుక్కండూవివృద్ధిః స్తంభనాద్భవేత్. ౩౯

వాతకఫములధికములై శరీరమున చర్మగతమైన వాతరక్తరోగమునకు సుఖోష్ణ ండు ఔషధాదులచే లేపనాదుల జేయుట హితకరము. పైరోగమునకు శీతల ేపనాదులను చేయించిన సర్వాంగతాపము, వాపు, శూల, దురద, ఇవి వృద్ధి .

### పిత్తరక్తసహిత వాతరక్తచికిత్స.

పిత్తరక్తోత్తరే వాతరక్తే లేపాదయో హిమాః,
ఉష్ణైః ప్లోషోపరుగ్రాగస్వేదావదరణోద్భవః ౪౦

పిత్తరక్తమధికముగనుండు వాతరక్తరోగమునకు చల్లగనుండు పట్టు మొదలగు తకరంబులు. పైరోగమున వేడిగనుండు పట్లువేసిన సర్వాంగతాపము పోట్లు, వర్ణము, చమట, పగుళ్లు, ఇవి కలుగును.

### మధుయష్టీతైలము.

మధుయష్ట్యాః పలశతం కషాయే పాదశేషితే,
తైలాఢకం సమక్షీరం పచేత్కల్కైః పలోన్మితైః. ౪౧

స్థిరాతామలకీదూర్వాపయస్యాభీరుచందనైః,
లోహహంసపదీమాంసీద్విమేదామధుపర్ణిభిః ౪౨
కాకోలీక్షీరకాకోలీశతపుష్పర్ధిపద్మకైః,
జీవంతీజీవకర్షభకత్వక్పత్రనఖవాలకైః. ౪౩
ప్రపౌండరీకమంజిష్ఠాసారిబైంద్రీవితున్నకైః,
చతుఃప్రయోగం వాతాసృక్పిత్తదాహజ్వరార్తినుత్. ౪౪

అతిమధురము నూరు పలములకు ఉదకములో వైచి, పాదావశేషముగ కషాయము కాచి, అందులో 1 ఆఢకము నువ్వులనూనె, 1 ఆఢకము ఆవుపాలు, వీనిని చేర్చి ముయ్యాకుపొన్న నేలయుసిరిక, గరికె, పిన్నమునుబాల, పిల్లిపీచర, చందనము, కృష్ణాగరు, హంసపది, జటామాంసి, మేద, మహామేద, కరుబూజదోస, కాకోళి, క్షీరకాకోళి, సదాప, ఋద్ధి, పద్మకము, పాలకూర, జీవకము, ఋషభకము, లవంగపుచెక్క, ఆకుపత్రి, వ్యాఘ్రనఖము, కురువేరు, ప్రపౌండరీకము, మంజిష్ఠ, నల్లసుంగధిపాల, పిన్నపాపర, దనియాలు, లేక తుంగముస్తలు వీనిని దినుసుకు 1 పలముచొప్పున, గ్రహించి కల్కముచేసి కలిపి తైలపాకవిధిగ పక్వము చేయవలయును. ఈతైలము పానము, నస్యము, అనువాసనము, వస్తి, అను నాలుగు తెరంగులైన ప్రయోగములయందు మిగుల శ్రేష్ఠమైనది. వాతరక్తము, పిత్తము, సర్వాంగతాపము, జ్వరము, శూలలు, వీనిని పోగొట్టును.

వాతరక్తమునకు బలాతైలము.

బలాకల్కకషాయాభ్యాం తైలం క్షీరసమం పచేత్,
సహస్రశతపాకం తద్వాతాసృగ్వాతరోగనుత్. ౪౫
రసాయనం ముఖ్యతమమింద్రియాణాం ప్రసాదనమ్,
జీవనం బృంహణం స్వర్యం శుక్రాసృగ్దోషనాశనమ్. ౪౬

చిట్టాముట్టివేళ్లకషాయమునకు సమభాగముగ నువ్వులనూనెను ఆవుపాలను జేర్చి, అందు చిట్టాముట్టివేళ్లకల్కము ను తైలమునకు నాల్గవపాలుకలిపి వేయిపర్యాయములైనను, నూరు పర్యాయములైనను మాటిమాటికి తైలపాకవిధిగ కాచి యుంచునది. ఈతైలము నుపయోగించినయెడ వాతరోగములు, వాతరక్తము, శుక్రదోషము, రక్తదోషము వీనిని పోగొట్టును. శ్రేష్ఠమైనరసాయనము, చక్షురాదీంద్రియములకు పటుత్వమును గలుగజేయును. ఆయుర్వృద్ధి, శరీరపుష్టి, మంచి కంఠస్వరము, వీనిని గలుగజేయును.

వాతమార్గనిరోధచికిత్స.

కుపితే మార్గసంరోధాన్మేదసో వా కఫస్య వా,
అతివృద్ధ్యానిలే శస్తమాదౌ స్నేహనబృంహణమ్. ౪౭

కృత్వా తత్రాఢ్యవాతోక్తం వాతశోణితికం తతః,
భేషజం స్నేహనం కుర్యాద్యచ్చ రక్తప్రసాదనమ్. ౪౮

మేదస్సు వృద్ధిజెందుటవలనగాని, కఫము వృద్ధిజెందుటవలనగాని, వాతమార్గము అడ్డగింపబడి, వాతము ప్రకోపించియుండినచో, తొలుత స్నేహకర్మను చేయించి, బృంహణౌషధము నిష్పించుటయేగాక, ఆఢ్యవాతరోగమునకు చెప్పియుండు చికిత్సలజేసి, పిమ్మట వాతశోణితరోగమునకు చెప్పియుండు చికిత్సలనుజేసి, స్నేహకర్మ, రక్తమునకు ప్రసన్నత్వమును గలుగజేయునట్టి చికిత్సలు వీనిని చేయవలయును.

## ప్రాణాదివాతప్రకోపచికిత్స.

ప్రాణాదికోపే యుగపద్యథోద్దిష్టం యథామయమ్,
యథాసన్నం చ భైషజ్యం వికల్ప్యం స్యాద్యథాబలమ్. ౪౯

ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానము 5 వాయువు లేకకాలంబున ప్రకోపమునుజెందినచో, రోగి బలకాలాదులను గుర్తెఱిగి, వాతవ్యాధికి చెప్పియుండు చికిత్సలను చేయించవలయును.

## ఆమవాత చికిత్స.

నీతే నిరామతాం సామే స్వేదలంఘనపాచనైః,
రూక్షైశ్చాలేపసేకాద్యైః కుర్యాత్కేవలవాతనుత్. ౫౦

ఆమసహిత వాతరోగమునకు స్వేదకర్మ, లంఘనము, పాచనౌషధము, రూక్షకరమైన ఆలేపము, సేకము, మొదలగు చికిత్సలచే ఆమాజీర్ణమును, శమింపజేసి, పిదప శుద్ధవాతరోగమునకు చెప్పియుండు చికిత్సలను చేయవలయును.

## శోషాద్యసాధ్యవాతములు.

శోషాక్షేపకసంకోచస్తంభస్వాపనకంపనమ్,
హనుస్రంసోఽర్దితం ఖాంజ్యం పాంగుల్యం ఖుడవాతతా. ౫౧
సంధిచ్యుతిః పక్షవధో మేదోమజ్జాస్థిగా గదాః,
ఏతే స్థానస్య గాంభీర్యాత్సిధ్యేయుర్యత్నతో న వా. ౫౨
తస్మాజ్జయేన్నవానేతాన్ బలినో నిరుపద్రవాన్,

శోషవాతము, (అవయవముల శోషింపజేయు వాతరోగము) ఆయామవాతము, అంగసంకోచవాతము, స్తంభవాతము, సుప్తవాతము, కంపవాతము, హనుస్రంసవాతము, అర్దితవాతము, ఖాంజ్యవాతము, పంగువాతము, ఖుడవాతము, (వాతరక్తవాతము) సంధిచ్యుతివాతము, పక్షాఘాతవాతము, మేదస్సు మజ్జ అస్థులు వీని నాశ్రయించియుండు

వాతరోగములు, ఇవి యన్నియుం శరీరాన్తర్భాగమున జనించుటంజేసి స్థానప్రభావమువలన చికిత్సలచే నివర్తింపనేరవు. మఱియుం నీ రోగములు బలిష్ఠుడుగనుండు పురుషునికి అపుడే జనించినవిగను ఉపద్రవరహితములుగను నుండిన నొకప్పుడు నివర్తించును.

### పిత్తావృతవాతచికిత్స.

వాయౌ పిత్తావృతే శీతాముష్ణాం చ బహుశః క్రియామ్. ॥౫౩
వ్యత్యాసాద్యోజయేత్సర్పిర్జీవనీయం చ పాయయేత్,
ధన్వమాంసం యవాశ్శాలిః విరేకః క్షీరవాన్ మృదుః. ॥౫౪
సక్షీరా వస్తయః క్షీరం పంచమూలబలాశ్రృతమ్,
కాలేఽనువాసనం తైలం మధురౌషధసాధితమ్. ॥౫౫
యష్టీమధుబలాతైలఘృతక్షీరైశ్చ సేచనమ్,
పంచమూలకషాయేణ వారిణా శీతలేన చ. ॥౫౬

వాతము పిత్తముచే కప్పబడియుండినచో శీతముగ, ఉష్ణముగనుండు చికిత్సలను వ్యత్యాసముగ అనగా—(తొలుత శీతచికిత్స పిదప నుష్ణచికిత్స, తొలుత నుష్ణచికిత్స, పిదప శీతచికిత్స) పలుమారు చేయించవలయును. జీవనీయగణద్రవ్యముల జేర్చి సిద్ధముచేయబడిన ఘృతమును పానము చేయించవలయును. జాంగలమాంసము, యవలు, సంబావు బియ్యము, క్షీరసహితముగ మృదువుగనుండు విరేచనౌషధము, వీనినిప్పించవలయును. మఱియు క్షీరసహితముగనుండు వస్తికర్మలను చేయించవలయును. మహాపంచమూలములు, బలామూలము, వీనిని చేర్చి కాచిన పాలను పానము చేయించవలయును. యుక్తకాలములో అనువాసనవస్తికి యోగ్యములుగ మధురరసములుగలవిగనుండు నౌషధములతో పక్వము చేయబడిన తైలములచే అనువాసనవస్తిని చేయించవలయును. యష్టిమధుకతైలము, బలాతైలము, ఆవునెయ్యి, ఆవుపాలు, పంచమూలకషాయము, శీతోదకము, వీనిచే సేచనము చేయించవలయును.

### కఫావృతవాతచికిత్స.

కఫావృతే యవాన్నాని జాంగలా మృగపక్షిణః,
స్వేదాస్తీక్ష్ణా నిరూహాశ్చ వమనం సవిరేచనమ్ ॥౫౭
పురాణసర్పిస్తైలం చ తిలసర్షపజం హితమ్,

వాతము కఫముచే కప్పబడియుండినచో యవాన్నము, జాంగలదేశమునందలి మృగములయొక్కయు, పక్షులయొక్కయుం మాంసములు, స్వేదకర్మలు, తీక్ష్ణముగనుండు నిరూహవస్తికర్మలు, తీక్ష్ణమైన వమన విరేచనౌషధములు, ప్రాతనెయ్యి, ఆవనూనె, నువ్వులనూనె, వీని నిప్పించవలయును.

### సంసృష్టవాతచికిత్స.

సంసృష్టే కఫపిత్తాభ్యాం పిత్తమాదౌ వినిర్జయేత్. ॥౫౮

వాతము కఫపిత్తములరెంటిచే కప్పబడియుండినచో తొలుత పిత్తమునకును జేసి యది శాంతమైనపిదప వాతముతోగూడియుండు కఫమునకు చికిత్స చేయ ను.

## రక్తమాంసావృతవాతచికిత్స.

కారయేద్రక్తసంసృష్టే వాతే శోణితికీం క్రియామ్,
స్వేదాభ్యంగరసాః క్షీరం స్నేహో మాంసావృతే హితః. ౪౯

వాతము రక్తముచే కప్పబడియుండినయెడల వాతరక్తమునకు చెప్పియుండు లను చేయవలయును. మాంసముచేఆవరింపబడియుండినయెడల స్వేదకర్మ, అభ్యం వీనిని చేయించుటయే గాక మాంసరసము, ఆవుపాలు,ఘృతాది స్నేహములు, వీనిని దోషానుగుణముగ నిప్పించవలయును.

## మేదోమజ్జాస్థిశుక్రావృతవాతచికిత్స.

ప్రమేహ మేదోవాతఘ్నమాఢ్యవాతే భిషగ్జితమ్,
మహాస్నేహోఽస్థిమజ్జస్థే పూర్వోక్తం రేతసాఽఽవృతే. ౫౦

వాతము మేదస్సుచే కప్పబడియుండినచో మేదస్సు వాతము ప్రమేహము పోగొట్టునట్టి యౌషధములను ఇప్పించవలయును. వాతము అస్థి మజ్జ వీనిచే డియుండినచో మహాస్నేహమును అనగా—(నెయ్యి, మజ్జ, క్రొవ్వు, నువ్వుల వీనితోసిద్ధముచేయబడిన స్నేహముకు) లేక నారాయణాది తైలముకు ఇప్పించ ను. శుక్రముచే కప్పబడియుండు వాతమునందు వాతవ్యాధియందు జెప్పబడిన తవాత చికిత్సలను చేయవలయును.

## అన్నావృతవాతచికిత్స.

అన్నావృతే పాచనీయం వమనం దీపనం లఘు,

వాతము అన్నముచే ఆవరింపబడియుండినచో వమనకారిగ పాచనకారిగ అగ్ని ను కలుగజేయునదిగ లఘువుగనుండు నౌషధములను ఇప్పించవలయును.

## మూత్రపురీషావృతవాతచికిత్స.

మూత్రావృతే మూత్రలాని స్వేద ఉత్తరవస్తయః. ౫౧
ఏరండతైలం వర్చస్సే వస్తిస్నేహాశ్చ భేదినః,

వాతము మూత్రముచే కప్పబడియుండినచోమూత్రమును విశేషముగ వెడలింప ట్టి ములుదోస మొదలగువాని నిప్పించుటయేగాక; స్వేదకర్మ, ఉత్తరవస్తి ప్రయోగించవలయును. వాతము మలముచే ఆవరింపబడియుండినయెడల ఆము ప్పించవలయును. దోషమును వెలిపరచునట్టి స్నేహములను ఇప్పించవలయును. లను చేయించవలయును.

### సర్వధాత్వావృతవాతచికిత్స.

కఫపిత్తావిరుద్ధం యద్యచ్చ వాతాఽనులోమనమ్. ౬౨
సర్వస్థానావృతే త్వాశు తత్కార్యం మాతరిశ్వని,
అనభిష్యంది చ స్నిగ్ధం స్రోతసాం శుద్ధికారణమ్. ౬౩
పాచనా వస్తయః ప్రాయో మధురాస్స్సానువాసనాః,
ప్రసమీక్ష్య బలాధిక్యం మృదు కార్యం విరేచనమ్ ౬౪
రసాయనానాం సర్వేషాముపయోగః ప్రశస్యతే,
శిలాహ్వస్య విశేషేణ పయసా శుద్ధగుగ్గులోః. ౬౫
లేహో వా భార్గవస్తద్వ దేకాదశసితాసితః,

వాతము పైచెప్పిన సర్వధాతువులచే నావరింపబడియుండినచో కఫపిత్తములకు విరుద్ధము కాకుండునదియు, వాతమున కనులోమగతిని కలుగజేయునదియునైన యౌషధమును, శీఘ్రముగ నిప్పింపవలయును. మఱియు కఫకరములు కానివిగ, స్నిగ్ధములుగ, స్రోతోమార్గముల శుద్ధిపరచునవిగనుండు అన్నపానౌషధముల నిప్పింపవలయును. పాచనవస్తికర్మలను చేయించి, మధురద్రవ్యములతో సిద్ధము చేయబడిన స్నేహవస్తికర్మలను చేయించవలయును. దోషబలాధిక్యమును పర్యాలోచించి మృదువుగ విరేచనము చేయించవలయును. రసాయనములనన్నిటి నిప్పించవలయును. విశేషముగ ఆవుపాలతో శిలాజతువు, శుద్ధిచేసిన గుగ్గిలము, రసాయనప్రకరణములో చెప్పియుండు భార్గవలేహము, చ్యవనప్రాశము, ఏకాదశసితాసితమను రసాయనౌషధములు, వీనిని ఇప్పించవలయును.

### ఆవృతాపానవాతచికిత్స.

అపానే త్వావృతే సర్వం దీపనం గ్రాహి భేషజమ్. ౬౬
వాతానులోమనం కార్యం మూత్రాశయవిశోధనమ్,
ఇతి సంక్షేపతః ప్రోక్తమావృతానాం చికిత్సితమ్. ౬౭
ప్రాణాదీనాం భిషక్కుర్యాద్వితర్క్య స్వయమేవ తత్,

అపానవాత మడ్డగింపబడియుండినచో జాఠరాగ్నిదీపనమును గలుగజేయునవియు, మలమును గట్టిపరచునవియు, వాతమున కనులోమగతిని గలుగజేయుచు మూత్రాశయమును శుద్ధిజేయునవియునైన ఔషధములనన్నిటి నిప్పించవలయును. అడ్డగింపబడియుండు వాతములకు పైచెప్పినప్రకారము చికిత్సలు సంగ్రహముగ చెప్పబడియె. బుద్ధిమంతుడగు వైద్యుడుచక్కగ పర్యాలోచించి పిత్తాదులచే ఆవరింపబడిన ప్రాణాది వాతములకు ఆయా దోషానుగుణముగ చికిత్సలను చేయవలయును.

### ఉదానాదివాత స్వస్థానానయనము.

ఉదానం యోజయేదూర్ధ్వమపానం చానులోమయేత్. ౭౮
సమానం శమయేద్విద్వాన్ త్రిధా వ్యానం చ యోజయేత్,
ప్రాణో రక్ష్యశ్చతుర్భ్యోఽపి తత్స్థితౌ దేహసంస్థితిః. ౭౯
స్వం స్వం స్థానం నయేదేవం వృత్తాన్వాతాన్విమార్గగాన్,

పండితుడగు వైద్యుడు ఉదానవాతము ఊర్ధ్వమార్గమున సంచరింపుచుండునటులను, అపానవాతము అధోమార్గముగ సంచరింపుచుండునటులను, చికిత్స చేయవలయును. సమానవాతమును ఊర్ధ్వాధోభాగములకు జేరకుండునటుల వాతహరౌషధములచే చికిత్స చేయవలయును. వ్యానవాతమును శరీరమునం దూర్ధ్వాధోమధ్య ప్రదేశములయందుసంచరించునటుల చికిత్స చేయవలయును. పైయుదానాది వాతములచే ప్రాణవాతమునకు బాధకలుగక రక్షింపుచుండవలయును. ప్రాణవాతము సమముగనుండిన యెడల శరీరము అపాయరహితముగ నుండును. ప్రాణవాతమున కపాయముగలిగిన మనుష్యుడు జీవించనేరడు. కావున విరుద్ధమార్గముగ సంచరించునదియు అడ్డగింపబడియుండునదియునైన ప్రాణాదివాతములు పైచెప్పినటుల తమతమ స్థానములను జేరునటుల చికిత్స చేయవలయును.

ఇచ్చట నీవివరణము నెరుంగునది—ఉదానవాతము శరీరమునం దూర్ధ్వభాగమున నుండునది కావున, అయ్యది స్వస్థానమును వదలి స్థలాంతరమున వ్యాపించియుండునెడ అట్టిదానిని మరలించి స్వస్థానమైన యూర్ధ్వభాగమున జేర్చునట్టి చికిత్స జేయవలెను. అపానవాతము శరీరమునం దధోభాగముననుండునది కావున, అయ్యది యూర్ధ్వభాగమున వ్యాపించినచో దాని ననులోమముగ జేసి తననెలవైన యధోభాగమున జేర్పందగిన చికిత్స జేయవలెను. సమానవాతము శరీరమునందు మధ్యదేశమైన నాభిస్థానమున నుండును. కావున అయ్యది స్థానాంతరమున వ్యాపించినచో దానిని అట్టిస్థానములనుండి మరలించి శరీరమధ్యభాగమున జేర్పందగిన చికిత్స జేయవలెను. వ్యానవాతము శరీరమునంతట వ్యాపించు స్వభావముకలది కావున వ్యానవాతము శరీరమునం దూర్ధ్వ మధ్య అధోభాగముల మూటియందును నిర్బాధకముగ వ్యాపించియుండునట్లు శమనౌషధమును చేయవలెను. ప్రాణవాతము శరీరధారణమునకు ప్రధానమైనది. అయ్యదివ్యత్యస్తమైన మనుజుడు జీవింపనేరడు కావున అట్టిప్రాణవాతమునకు పైజెప్పిన ఉదానాదివాతముల నాల్గిటిచే బాధకల్గనీయక తక్కినవాతముల దమతమ నెలవుల జేర్పుచు తగినచికిత్సల జేయవలెనని భావము.

### వాతావరణమునందు లశునప్రయోగము.

సర్వం సావరణం పిత్తరక్తసంసర్గవర్జితమ్. ౮౦
రసాయనవిధానేన లశునో హంతి శీలితః,

వెల్లుల్లిని రసాయనవిధిగ సేవింపుచుండినచో వాతములకు కలిగియుండు ఆవరణములన్నియుంహరించును. అయితే పిత్తరక్తసంబంధమువలనజనించిన వాతావరణమందుమాత్రము వెల్లుల్లిని ప్రయోగింపంజనదు.

పిత్తరక్తావృతోదానాదివాతచికిత్స.

పిత్తావృతే పిత్తహారం మరుతశ్చానులోమనమ్. ౭౧
రక్తావృతేఽపి తద్వచ్చ ఖుడోక్తం యచ్చ భేషజమ్,
రక్తపిత్తానిలహారం వివిధం చ రసాయనమ్. ౭౨

ఉదానాదివాతములు పిత్తముచే నడ్డగింపబడియుండినచో పిత్తహరముగ వాతమున కనులోమగతిని గలుగజేయునదిగనుండు చికిత్సలను చేయవలయును. ఉదానాదివాతములు రక్తముచే నడ్డగింపబడియుండిన వాతశోణితరోగమునకు చెప్పియుండు చికిత్సలు, పిత్తరక్తమునుపోగొట్టునదియు వాతమున కనులోమగతిని గలుగజేయునదియునైన యౌషధములు, వీనిని ప్రయోగించవలయును. నానావిధములుగనుండు రసాయనయోగములను దోషదూష్యబలాద్యనుగుణముగ నిప్పించవలయును.

చికిత్సాస్థానప్రశంస.

యథానిదానం నిర్దిష్టమితి సమ్యక్చికిత్సితమ్,
ఆయుర్వేదఫలం స్థానమేతత్సద్యోర్తినాశనమ్. ౭౩

నిదానస్థానంబునం జెప్పియుండు రోగనిదానక్రమంబుల ననుసరించి యీ స్థానమునం దాయా రోగంబులకు చికిత్సలు జెప్పంబడియె. దీనియందు జ్వరాద్యుపద్రవములను తత్క్షణము బోగొట్టునట్టి ఔషధముల జెప్పియుండుటవలన నీచికిత్సాస్థానము ఆయుర్వేదమునకు ఫలముగనుండును.

ఔషధపర్యాయనామములు.

చికిత్సితం హితం పథ్యం ప్రాయశ్చిత్తం భిషగ్జితమ్,
భేషజం శమనం శస్తం పర్యాయైస్స్మృతమౌషధమ్. ౭౪

చికిత్సితము, హితము, పథ్యము, ప్రాయశ్చిత్తము, భిషగ్జితము, భేషజము, శమనము, శస్తము, అనునవి ఔషధములకు పర్యాయనామంబులు.

ద్వావింశాధ్యాయము ముగిసెను.

ఇతి శ్రీవైద్యపతి సింహగుప్తసూను వాగ్భటవిరచితాయాం
అష్టాంగహృదయసంహితాయాం ఆంధ్రతాత్పర్య
సహితాయాం చతుర్థం చికిత్సాస్థానమ్
సంపూర్ణమ్.

లో మిగుల శ్రేష్ఠంబుగనుండును, అట్లనే తెగడవేళ్లు విరేచనౌషధములలో మిగుల ప్రశస్తంబు. వమనవిషయమున నితరములైన దాపరదంగి మొదలగు ద్రవ్యములు జ్వర శ్వాసాది రోగములయందు మాత్రము శ్రేష్ఠంబులు గనుండును. తెగడతప్ప యితరము లగు రేచనద్రవ్యములు కొన్నివ్యాధులయందుమాత్రమే ప్రశస్తములు. "త్రివృత్సుఖ విరేచనానామ్" అని పైయర్థము చరకమునందునయితము చెప్పఁబడియున్నది.

మదనఫలగ్రహణక్రమము.

ఫలాని తాని పాండూని న చాతిహరితాన్యపి,
ఆదాయాహ్ని ప్రశస్తర్క్షే మధ్యే గ్రీష్మవసంతయోః 2
ప్రమృజ్య కుశముత్యోళ్యాం క్షిప్త్వా బధ్వా ప్రలేపయేత్,
గోమయేనాను ముత్తోళీం ధాన్యమధ్యే నిధాపయేత్. 3
మృదుభూతాని మధ్విష్టగంధాని కుశవేష్టనాత్,
నిష్కృష్య నిర్గతేఽష్టాహే శోషయేత్తాన్యథాతపే. 4
తేషాం తతస్సుశుష్కాణా ముద్ధృత్య ఫలపిప్పలీః,
దధిమధ్వాజ్యపలలైర్మృదిత్వా శోషయేత్పునః 5
తతస్సుగుప్తం సంస్థాప్య కార్యకాలే ప్రయోజయేత్,

వసంతగ్రీష్మర్తువులయొక్క మధ్యకాలమునందు (అనఁగా ఆ ఋతువుల సంధియందు) శుభనక్షత్రముతోఁ గూడియుండుదివసమున మిక్కిలి పాండువర్ణము ఆకుపచ్చవర్ణము లేకుండునట్టి మ్రంగపండ్లను గ్రహించి పైభాగమునందుండు దుమ్ము మొదలగువానిని తుడిచి కుశగడ్డిచేచేయఁబడిన ముత్తోళి (అనఁగా బుట్ట) యందునిచి ద్వారమును కుశగడ్డిచే మూసి పైన ఆవుపేఁడను పూసి ధాన్యరాశియందు ఎనిమిది దినములు పూడ్చి పెట్టి పిదప మృదువుగ మధుగంధముగలదిగ లేక మనోహరమైన గంధముగలదిగ నుండు ఆపండ్లను బైటికితీసి యెండలో చక్కఁగఁ నెండించి యాపండు లోపలనుండు విత్తులను గ్రహించి పెరుగు-తేనె-ఆవునెయ్యి-మాంసము వీనితో పిసికి మరల నెండలో చక్కఁగ నెండించి ఆవిత్తులను పాత్రలో పోసి చక్కఁగ భద్రపరచి వమనమునందు ప్రయోగించవలయును.

మదనఫలప్రయోగక్రమము.

అథాదాయ తతో మాత్రాం జర్జరీకృత్య వాసయేత్. 6
శర్వరీం మధుయష్ట్యా వా కోవిదారస్య వా జలే,
కర్బుదారస్య బింబ్యా వా నీపస్య విదుళస్య వా. 7
శణపుష్ప్యాస్సదాపుష్ప్యాః ప్రత్యక్పుష్ప్యాదకేఽథవా,

తతః పిబేత్కషాయం తం ప్రాతర్మృదితగాలితమ్. ౮
సూత్రోదితేన విధినా సాధూక్తేన తథా వమేత్,
శ్లేష్మజ్వరప్రతిశ్యాయగుల్మాంతర్విద్రధీషు చ ౯
ప్రచ్ఛర్దయేద్విశేషేణ యావత్పిత్తస్య దర్శనమ్,

పై మ్రంగపండువిత్తులను తగుమాత్రము గ్రహించి చూర్ణముచేసి యష్టిమధుక కషాయములోఁగాని, కొండగోగుకషాయములోఁగాని, విరిగి కషాయములోఁగాని, దొండకషాయములోఁగాని, మొగులుకడిమి కషాయములోఁగాని, నీరుప్రబ్బలి కషాయములోఁగాని, జనుపకషాయములోఁగాని, యెఱ్ఱజిల్లేడుకషాయములోఁగాని, ఉత్తరేణు కషాయములోఁగాని, ఒకరాత్రి నానబెట్టి మరుదిన ముదయమున గ్రహించి పిసికి వడియఁగట్టి యాకషాయమును సూత్రస్థానములో వమన విరేచనాధ్యాయమున "శ్లోవమ్య" మిత్యాదిశ్లోకములలో చెప్పియుండు విధిప్రకారము పానముచేయించిన చక్కఁగ వమనంబగును. శ్లేష్మజ్వరము, పీనసము, గుల్మము, అంతర్విద్రధి ఈరోగములయందు పిత్తము బైలుపడుపఱకు వమనమును చేయించవలయును.

జ్వరాదులయందు వమనౌషధము.

ఫలపిప్పలిచూర్ణం వా క్వాథేన స్వేన భావితమ్. ౧౦
త్రిభాగత్రిఫలాచూర్ణం కోవిదారాదివారిణా,
పిబేజ్జ్వరారుచిష్వేవం గ్రంథ్యపచ్యర్బుదోదరీ ౧౧
పిత్తే కఫస్థానగతే జీమూతాదిజలేన తత్,

మ్రంగపండువిత్తులను నలియఁగొట్టి ఉదకములోవైచి పాతికభాగము మిగులునట్లు కషాయముకాచి వడియఁగట్టి అందులో భావనచేసిన మ్రంగవిత్తులచూర్ణము 1 భాగము, త్రిఫలచూర్ణము 3 భాగములు, వీనిని పైశ్లోకములోఁ జెప్పియుండు కొండగోగు మొదలగువాని కషాయములలో కలిసి జ్వరమునందును, అరుచియందును వమనముచేయించవలయును. పిత్తము కఫస్థానగతంబై గ్రంథి అపచి అర్బుదము ఉదరరోగము అనునీరోగములు గలిగియుండిన నిఁకఁజెప్పఁబోయెడు జీమూతాది కషాయములలో మ్రంగవిత్తులచూర్ణమును కలిపి నానబెట్టి పిసికి వడియకట్టి దానిచే వమనము చేయించవలయును.

హృద్దాహాదులయందు వమనక్రమము.

హృద్దాహేఽధోఽస్రపిత్తే చ క్షీరం తత్పిప్పలీశృతమ్. ౧౨
క్షైరేయీం వా

1 భాగము మ్రంగవిత్తులచూర్ణమును 8 పాళ్లు ఆవుపాలలోఁజేర్చి ఆవు పాలకు 4 గింత లుదకముకలిపి పాలుమిగులునటుల కాచి యాపాలనుగాని; ఆపాలతో పక్వముచేయఁబడిన గంజినిగాని ; హృద్దాహము, (అనఁగా ఱొమ్ములోమంట) అధోగతరక్తపిత్తము, వీనియందు పానముచేయించిన వమనంబగును.

"ద్రవ్యాదష్టగుణం క్షీరం క్షీరాత్తోయం చతుర్గుణమ్,
క్షీరావశేషః కర్తవ్యః క్షీరపాకే త్వయం విధిః."

ఇటుల క్షీరపాకవిధి తంత్రాంతరమునందు చెప్పఁబడియున్నది.

## కఫాదులయందు వమనక్రమము.

కఫచ్ఛర్దిప్రసేకతమకేషు తు,
దధ్యుత్తరం వా దధి వా తచ్ఛృతక్షీరసంభవమ్. ౧౩

కఫము వాంతియగుట, నోటసీరుగారుట, తమకశ్వాసము, అను నీరోగముల యందు పైశ్లోకమున చెప్పియుండు ప్రకారము మ్రంగవిత్తులను చేర్చి కాఁచఁబడిన పాల వలన జనించిన పెరుగునుగాని, యాపెరుగుమీఁది మీఁగడనుగాని, వమనార్థము ఇప్పించిన హితము కలుగును.

## కఫాధిక్యాదులయందు వమనక్రమము.

ఫలాదిక్వాథకల్కాభ్యాం సిద్ధం తత్సిద్ధదుగ్ధజమ్,
సర్పిః కఫాభిభూతేఽగ్నౌ శుష్యద్దేహే చ వామనమ్. ౧౪

మ్రగవిత్తులు లేక డావరడంగివిత్తులు మొదలగువాని చూర్ణమును ఆవుపాలలో కలిపి పైశ్లోకమున చెప్పినప్రకారము కాఁచి దానియందు తీయఁబడిన నేతిలో మ్రంగ విత్తులు లేక డావరడంగివిత్తులు అనువాని కషాయ కల్కములను చేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి యాఘృతముతో కఫముచే కప్పబడియుండు జాఠరాగ్నిగలవానికిని, దేహముశుష్కించినవానికిని వమనము చేయించవలయును.

## వమనకరమదనఫలావలేహము.

స్వరసం ఫలమజ్జో వా భల్లాతకవిధిశ్శృతమ్,
ఆదర్వీలేపనాత్సిద్ధం లీఢ్వా ప్రచ్ఛర్దయేత్సుఖమ్. ౧౫
తం లేహం భక్ష్యభోజ్యేషు తత్కషాయాంశ్చ యోజయేత్,

మ్రంగకాయగింజలోని పప్పునైనను, లేక మ్రంగకాయ స్వరసమునైనను భల్లాతకావలేహమునకు చెప్పియుండు విధిప్రకారము గరిటెకంటువరకు పాకముచేసి యాలేహమును నాకించిన సుఖముగ వమనంబగును. మఱియు పైలేహమునుగాని మ్రంగవిత్తుల కషాయమునుగాని భక్ష్యాన్నపానాదులయందు చేర్చియిప్పించిన వమనంబగును.

### సంతర్పణోత్థరోగములయందు వమనౌషధము.

వత్సకాదిప్రతీవాపః కషాయః ఫలమజ్జజః. ౧౬
నింబార్కాన్యతరక్వాథసమాయుక్తో నియచ్ఛతి,
బద్ధమూలానపి వ్యాధీన్ సర్వాన్ సంతర్పణోద్భవాన్. ౧౭

మ్రంగకాయగింజలోనిపప్పు నుదకములో వైచి చక్కగ కషాయముకాచి యందులోవత్సకాదిగణద్రవ్యములను సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి కలిపి వేఁప కషాయమునుగాని జిల్లేడుకషాయమునుగాని చేర్చి పానముచేయించినచో సంతర్పణక్రియ వలన జనించినదియు, చిరకాలముగ ననుసరించి రూఢమూలములై యుండునవియు నగు రోగముల నన్నిటిని పోఁగొట్టును.

### సుఖశరీరులకు వమనౌషధము.

రాటపుష్పఫలశ్లక్ష్ణచూర్ణైర్మాల్యం సురూక్షితమ్,
వమేన్మండరసాదీనాం తృప్తో జిఘ్రన్ సుఖం సుఖీ. ౧౮

వమనకష్టమును సహించలేనిరోగికి తొలుత గంజి-కృసరము-మాంసరసము మొదలగువానిని తృప్తిగ భుజింపఁజేసి వానికి మ్రంగపువ్వులు మ్రంగపండ్లు వీని చూర్ణములో పొదగబడిన నేదైన నొక పుష్పమును ఆఘ్రాణింపఁజేసిన సుఖముగ వమనంబగును.

### మదనఫలాభావమునందు కర్తవ్యము.

ఏవమేవ ఫలాభావే కల్ప్యం పుష్పం శలాటు వా,

మంచి మ్రంగపండు దొరకనియెడల మ్రంగపువ్వులనుగాని కాయలనుగాని గ్రహించి "అథాదాయ తతో మాత్రాం జర్జరీకృత్య వాసయేత్ ......యావత్పిత్తస్య దర్శనమ్" అనుగ్రంథముచే జెప్పబడిన మదనఫలవిధిప్రకారము సంస్కరించి వమనమున కుపయోగించునది.

### డావరడంగి మొదలగు వమనౌషధములు.

జీమూతాద్యాశ్చ ఫలవత్

మ్రంగపండునకు చెప్పియుండు విధిప్రకారము డావరడంగి-చేఁదానుగు-చేఁదుబీర-కొడిసెవిత్తులు వీనిని వమనమునకై యుపయోగించవలయును.

### జ్వరాదులయందు డావరడంగికల్పము.

జీమూతం తు విశేషతః. ౧౯
ప్రయోక్తవ్యం జ్వరశ్వాసకాసహిధ్మాదిరోగిణామ్,

జ్వరము, శ్వాసము, కాసము, ఎక్కిళ్లు మొదలగు రోగములుగలవారికి డావర డంగిని వమనమునందు తఱుచుగా ప్రయోగింపవలయును.

కఫజారోచకాదులయందు డావరడంగిప్రయోగము.

పయః పుష్పేఽస్య నిర్వృత్తే ఫలే పేయా పయస్కృతా. ౨౦
లోమశే క్షీరసంతానం దధ్యుత్తరమలోమశే,
శృతే పయసి దధ్యమ్లం జాతే హారితపాండుకే. ౨౧
ఆసుత్య వారుణీమండం పిబేన్మృదితగాలితమ్,
కఫావరోచకే కాసే పాండుత్వే రాజయక్ష్మణి. ౨౨

కఫమువలన జనించిన అరోచకము కాసము పాండువు క్షయము వీనియందు పూలుపూచియుండు డావరడంగిని పాలలోవేచ్చి కాచి పానముచేయించవలయును. డావరడంగిపండ్లను పాలలోవైచి కాచి యాపాలతోపక్వముచేయఁబడిన పేయను పానముచేయించవలయును. మఱియు డావరడంగి లోమశము (అనఁగా వెంద్రుకలతోఁ గూడినది) అలోమశము (అనఁగా వెంద్రుకలులేనిది) అనిద్వివిధంబుగనుండును. దానిలో వెంద్రుకలు గలిగియుండునది మృదువుగ వెంద్రుకలులేనిది కఠినముగనుండును వెంద్రుకలుండు డావరడంగి పాలలోవైచి చక్కఁగకాచి చల్లారినపిదప దానిమీఁద గట్టిగపేరి యుండుమీఁగడను వమనార్థమిప్పించవలయును. వెంద్రుకలులేకుండు డావరడంగిని చూర్ణముచేసి పెరుగుమీఁది మీఁగడతోకలిపి పానముచేయించవలయును. డావరడంగిని పాలలోవైచి కాచి పెరుగుచేసి పుల్లగనుండెడియాపెరుగును పానముచేయించవలయును. లేక డావరడంగి చూర్ణమును వారుణీయను మద్యములో కలిపి గరిటెతో కలియబెట్టి పిసికి వడియఁగట్టి పానముచేయించవలయును.

వమనకర తుంబ్యాదికల్పము.

ఇయం చ కల్పనా కార్యా తుంబీకోశాతకేష్వపి,

డావరడంగికి చెప్పియుండు విధిప్రకారము చేదుసొర-చేదుబీర వీనిని వమనము నందు ప్రయోగించవలయును.

వాతపిత్తాదిరోగములయందు డావరడంగిప్రయోగము.

పర్యాగతానాం శుష్కాణాం ఫలానాం వేణిజన్మనామ్. ౨౩
చూర్ణస్య పయసా శుక్తిం వాతపిత్తార్దితః పిబేత్,
ద్వే వా త్రీణ్యపి వాఽఽపోథ్య క్వాథే తిక్తోత్తమస్య వా. ౨౪
ఆరగ్వథాదినవకాదాసుత్యాన్యతమస్య వా,

విమృద్య పూతం తం క్వాథం పిత్తశ్లేష్మజ్వరీ పిబేత్. ౧౫

వాతపిత్తరోగముగలవానికి చక్కఁగపండి యెండినవిగనుండు డావరడంగిపండ్లను చక్కఁగ చూర్ణము చేసి యాచూర్ణమును అర్ధ పలము ఆవుపాలలోఁ కలిపి పానము చేయించవలయును. పిత్తశ్లేష్మజ్వరపీడితునికి 2 లేక 3 డావరడంగిపండ్లను చూర్ణముచేసి వేము కషాయములోఁ కలిపి పానముచేయించవలయును. లేక పైపండ్లను 2 లేక 3 టిని చూర్ణము చేసి ఆరగ్వధాదిగణములోఁ చెప్పియుండు రేల మొదలగు 9 ద్రవ్యములలోఁ నేదైన నొక ద్రవ్యముయొక్క కషాయములోఁ చేర్చి చక్కఁగ బిసికి వడియగట్టి పానముచే యించవలయును.

## పిత్తజ్వరాదులయందు డావరడంగిప్రయోగము.

జీమూతచూర్ణం కల్కం వా పిబేచ్ఛీతేన వారిణా,
జ్వరే పైత్తే కవోష్ణేన కఫవాతాత్మకేఽపి ౧౬

డావరడంగిపండ్ల చూర్ణమునుగాని, కల్కమునుగాని పిత్తజ్వరమునందు శీతోదకముతోఁడను; కఫజ్వరమునందును వాతకఫజ్వరమునందును కొంచెముష్ణముగనుండు ఉదకముతోఁడను; పానముచేయించవలయును.

## కాసాదిరోగములయందు ఇక్ష్వాకువమనకల్పము.

కాసశ్వాసవిషచ్ఛర్దిజ్వరార్తే కఫకర్శితే,
ఇక్ష్వాకు ర్వమనే శస్తః ప్రతామ్యతి చ మానవే ౧౭

కాసము-శ్వాసము-విషము-వాంతి-జ్వరము వీనిచే పీడింపఁబడియుండువారికిని, ప్రతమకమను శ్వాసరోగముగలవారికిని వమనవిషయమునందు చేదుసొరమిగుల ప్రశస్తమైనది.

## పిత్తాధికశ్లేష్మజ్వరమునందు ఇక్ష్వాకుకల్పము.

ఫలపుష్పవిహీనస్య ప్రవాళై స్తస్య సాధితమ్,
పిత్తశ్లేష్మజ్వరే క్షీరం పిత్తోద్రిక్తే ప్రయోజయేత్. ౧౮

పూయక-కాయక-లేతదిగనుండు చేదుసొరచిగుళ్లను చేర్చి కాఁచినపాలను పిత్తాధిక్యముతోఁగూడియుండు పిత్తశ్లేష్మజ్వరమునందు పానము చేయించవలయును.

## కఫజకాసశ్వాసరోగమునందు ఇక్ష్వాకుదధికల్పము.

హృతమధ్యే ఫలే జీర్ణే సితం క్షీరం యదా దధి.
స్యా త్తదా కఫజే కాసశ్వాసే వమ్యం చ పాయయేత్. ౧౯

కఫమువలనజనించిన కాసశ్వాసరోగమున చక్కగపండిన చేదుసొరపండుయొక్క లోపలనుండు విత్తులు మొదలగువానిని తీసి వైచి ఆబుఱ్ఱలో కాచిన పాలనుపోసి యది పెరుగైనపిదప దానిని వమనార్థము పానముచేయింపవలయును.

### పాండురోగమునందు వమనౌషధము.

మస్తునా వా ఫలాన్మథ్యం పాండుకుష్ఠవిషార్దితః,
తేన తక్రం విపక్వం వా పిబేత్సమధు సైంధవమ్. ౩౦

పాండువు, కుష్టువు విషము వీనిచే పీడింపఁబడువానికి చేఁదానుగుపండు విత్తనములలోపప్పును పెరుఁగుమీఁదిమీఁగడలో కలిపి వమనమగుటకై యిప్పించవలయును. లేక మజ్జిగలో కలిపి చక్కఁగ కాఁచి కొంచెము సైంధవలవణమును తేనెను కలిపి వమనార్థము పానముచేయించవలయును.

### విషోపద్రవాదులయందు వమనౌషధము.

భావయిత్వాజదుగ్ధేన బీజం తేనైవ వా పిబేత్,
విషగుల్మోదరగ్రంథిగండేషు శ్లీపదేషు చ. ౩౧

విషము, గుల్మము, ఉదరరోగము, గ్రంధి, గళగండము, శ్లీపదము అనురోగములయందు చేదుసొరవిత్తులను మేఁకపాలలో భావనచేసి మేఁకపాలతో నూఁరి మేఁకపాలలో కలిపి పానముచేయించవలయును.

### కఫజ్వరాదులయందు వమనౌషధము.

సక్తుభిర్వా పిబేన్మంథం తుంబీస్వరసభావితైః,
కఫోద్భవే జ్వరే కాసే గళరోగే ష్వరోచకే. ౩౨

కఫజనితంబైన జ్వరము, కాసము, కంఠరోగము, అరోచకము వీనియందు చేదుసొరరసములో భావనచేయఁబడిన యవసక్తువుచే చేయఁబడిన మంథమును పానము చేయించవలయును.

### గుల్మజ్వరములయందు వమనకల్పము.

గుల్మే జ్వరే ప్రసక్తే చ కల్కం మాంసరసైః పిబేత్,
నరస్సాధు వమత్యేవం న చ దౌర్బల్యమశ్నుతే. ౩౩
తుంబ్యాః ఫలరసైశ్శుష్కైస్సపుష్పైరవచూర్ణితమ్,
ఛర్దయేన్మాల్యమాఘ్రాయ గంధసంపత్సుఖోచితః. ౩౪

గుల్మము, దీర్ఘకాలమునుండి యనుసరించియుండు జ్వరము, వీనియందు చేదుసొర కల్కమును మాంసరసములోకలిపి పానముచేయించిన చక్కఁగ వమనంబగును,

దౌర్బల్యము కలుగకుండును. మఱియు చేదుపొరపండ్లు, పుష్పములు వీనిరసములో ఎండిన చేదుపొరవిత్తులచూర్ణమును చేర్చి అందులో నేదైనవొకపుష్పమును తడిపి యాఘ్రాణింపఁజేసిన అనాయాసముగ వమనంబగును.

కాసగుల్మోదరరోగాదులయందు వమనౌషధము.

కాసగుల్మోదరగరే వాతే శ్లేష్మాశయస్థితే,
కఫే చ కంఠవక్త్రస్థే కఫసంచయజేషు చ. 3౫
ధామార్గవో గదే ష్విష్ట స్థిరేషు చ మహత్సు చ,

కాసము, గుల్మము, ఉదరరోగము, విషము వీనియందును; కఫస్థానమునుజెందియుండు వాతమునందును; కంఠము నోరు వీనినాశ్రయించియుండు కఫమునందును; దీర్ఘకాలమనుసరింపుచుండునదియుమిగులవృద్ధిజెందియుండునదియునైన రోగములయందును; ధామార్గవము (అనఁగా చేఁతిబీర) వమనమునందు మిగులప్రశస్తము.

కాసహృద్రోగమునందు జీవకాదిలేహము.

జీవకర్షభకౌ వీరా కపికచ్ఛూశ్శతావరీ. 3౬
కాకోలీ శ్రావణీ మేదా మహామేదా మధూలికా,
తద్రజోభిః పృథగ్లేహా ధామార్గవరజోఽన్వితాః. 3౭
కాసే హృదయదాహే చ శస్తా మధుసితాద్రుతాః,
తే సుఖాంభోఽనుపానా స్స్యుః పిత్తోష్ణసహితే కఫే. 3౮

జీవకము, ఋషభకము, క్షీరకాకోళి, రేగటిదూలగోవిల, పిల్లిపీఁచర, కాకోళి, బోడతరము, మేద, మహామేద, యష్టిమధుకము వీనిని ప్రత్యేకప్రత్యేకముగ చూర్ణము చేసి యాచూర్ణములో చేదుబీరచూర్ణమును కలిపి పంచదార, తేనె వీనిని చేర్చి లేహము చేసి దానిని కాసము, హృదయతాపము వీనియందుపయోగించిన వమనంబగును. పిత్తోష్ణముతోఁగూడియుండు కఫమునకు పైలేహమునిచ్చి ఉష్ణోదకమును త్రాగనిచ్చిన సుఖముగ వమనంబగును.

విషోపద్రవమున వమనౌషధము.

ధాన్యతుంబురుయూషేణ కల్క స్తస్య విషాపహః,

చేదుబీర కల్కమును దనియాలు తుంబురు అనుగ్రంథ్యము వీనికషాయములో కలిపి పానముచేయించిన చక్కఁగ వమనంబై విషము హరించును.

చిత్తభ్రమమునందు బింబ్యాదికషాయము.

బింబ్యాః పునర్నవాయా వా కాసమర్దస్య వా రసే. 3౯

ఏకం ధామార్గవం ద్వే వా మానసే మృదితం పిబేత్,
తచ్ఛృతక్షీరజం సర్పిస్సాధితం వా ఫలాదిభిః. ౪౦

చిత్తభ్రమరోగమునందు దొండరసములోఁగాని గలిజేరురసములోఁగాని కసివెంద రసములోఁగాని 1.2 చేదుబీరపండ్లను చేర్చి పిసికి వమనార్థము పానము చేయించవలయును. లేక చేదుబీరపండును ఆవుపాలలో చేర్చి చక్కఁగ కాఁచి అందుండి నెయ్యితీసి దానిలో మ్రంగవిత్తులు, డావరడంగి, చేదుసొర, చేఁదుబీర, బీర,కొడిసెవిత్తులు వీనిని చేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి యాఘృతము నిప్పించిన చక్కఁగ వమనంబై చిత్తభ్రమము హరించును.

కుష్ఠాదిరోగములయందు వమనౌషధము

క్ష్వేడో౽తికటుతీక్ష్ణోష్ణః ప్రగాఢేషు ప్రశస్యతే,
కుష్ఠపాండ్వామయప్లీహశోఫగుల్మగరాదిషు. ౪౧

చేఁదుబీర మిగుల తీక్ష్ణముగ, ఉష్ణముగ, కటువుగ నుండును. కావున నది చిరకాల మనుసరింపుచుండునదియు మిగుల వృద్ధిజెందినదియునైన కుష్ఠ, పాండు, ప్లీహ, శోఫ, గుల్మ, విషరోగములయందు వమనార్థము ఇప్పించవలయును.

సామాన్యవమనౌషధము.

పృథక్ఫలాదిషట్కస్య క్వాథే మాంసమనూపజమ్,
కోశాతక్యా సమం సిద్ధం తద్రసం లవణం పిబేత్. ౪౨
ఫలాదిపిప్పలీతుల్యం సిద్ధం క్ష్వేడరసే౽థవా,
క్ష్వేడక్వాథే పిబేత్సిద్ధం మిశ్రమిక్షురసేన వా. ౪౩

మ్రంగవిత్తులు - డావరడంగి - చెదుసొర-చేఁదుబీర-బీర-కొడిసెవిత్తులు వీని కషాయములో అనూపమాంసమును చేర్చి మాంసమునకు సమముగ బీరను చేర్చి పక్వము చేసి యామాంసరసములో కొంచెము లవణముచేర్చి పానముచేయించిన సుఖముగ వమనంబగును. మ్రంగవిత్తులు-డావరడంగివిత్తులు-చేఁదానుగువిత్తులు వీనికి సమముగ అనూపమాంసము ఇటుల వీనిని చేఁదుబీరకషాయములో పక్వముచేసి యామాంస రసమునుగాని, చేఁదుబీరరసములో పక్వముచేయఁబడిన అనూపజంతుమాంసరసములో చెఱకురసము లవణము వీనినిచేర్చిగాని పానముచేయించవలయును.

జ్వరవిసర్పాదులయందు వమనకల్పము.

కౌటజం సుకుమారేషు పిత్తరక్తకఫోదయే,
జ్వరే విసర్పే హృద్రోగే ఖుడే కుష్ఠే చ పూజితమ్. ౪౪

వమనకష్టమును సహింపఁజాలనివారికి పిత్తరక్తము, కఫాధిక్యము, జ్వరము, విసర్పము, హృద్రోగము, ఖుడవాతము, కుష్ఠువు వీనియందు కొడిసెను వమనార్థము ఇప్పించవలయును.

### కుటజవమనౌషధకల్పము.

సర్షపాణాం మధూకానాం తోయేన లవణస్య వా,
పాయయేత్కుటజం బీజం యుక్తం కృసరయాఽథవా. ౪౫
సప్తాహం వార్కదుగ్ధాక్తం తచ్చూర్ణం పాయయేత్పృథక్,
ఫలజీమూతకేక్ష్వాకుజీవంతీజీవకోదకైః. ౪౬

ఆవాలకషాయములోఁగాని, యష్టిమధుకకషాయములోఁగాని, సైంధవలవణమున చేర్చిన యుదకములోఁగాని, కృసరములోఁగాని, కొడిసెవిత్తులచూర్ణమును కలిపి పానముచేయించవలయును. లేక కొడి సెవిత్తులను జిల్లేడుపాలలో 7 దినములు భావన జేసి యెండించి చూర్ణముచేసి యాచూర్ణమును మ్రంగపండు కషాయములోఁగాని, డావరడంగి కషాయములోఁగాని, చేదుబీరకషాయములోఁగాని, మనుబాలకషాయములోఁగాని, జీవకకషాయములోఁగాని కలిపి పానముచేయించవలయును.

వమనౌషధముఖ్యానామితి కల్పదిగీరితా,
బీజేనాన్యేన మతిమాననాన్యానపి చ కల్పయేత్. ౪౭

ఇటుల వమనమునందు ముఖ్యౌషధములుగనుండు మ్రంగపండు మొదలగువాని కల్పములు సెప్పఁబడియె; ఇటులనే బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు ఇతరములైనవమనౌషధ కల్పములను నిజబుద్ధిచే నూహించుకొనవలయును.

ప్రథమాధ్యాయము - ముగిసెను.



# ద్వితీయాధ్యాయము.



అవ: "వమనే మదనం శ్రేష్ఠం త్రివృణ్మూలం విరేచనే" వమనమునందు మ్రంగ పండు ముఖ్యౌషధమని వమనకల్పాధ్యాయమునందు వమనౌషధములను నిరూపించి పిదప,విరేచనౌషధములను సంగ్రహముగ వచించెను. ప్రతిజ్ఞానుసారముగ వమనౌషధములను చక్కఁగ నిరూపించి విరేచనౌషధములను బాగుగ బోధించునట్టి విరేచనకల్పమను నీయధ్యాయము నారంభించుచున్నాఁడు.

విరేచనకల్పాధ్యాయప్రారంభము.

సూ అథాతో విరేచనకల్పం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహు రాత్రేయాదయో మహర్షయః.

వమనకల్పాధ్యాయనిరూపణానంతరము విరేచనకల్పములను తెలియపరచునట్టి విరేచనకల్పమను నీ యధ్యాయమును వివరించెదము. విరేచనమనఁగా—అధోమార్గముగ దోషము బయలువెడలుట.

తెగడగుణము.

కషాయా మధురా రూక్షా విపాకే కటుకా త్రివృత్,
కఫపిత్తప్రశమనీ రౌక్ష్యాచ్చానిలకోపనీ. ౧

తెగడ వగరుగ-మధురముగ-రూక్షముగ-పాకమువలన కటువుగనుండును. కఫపిత్తములను పోకడచును. రూక్షముగనుండుటవలన వాతమును ప్రకోపింపఁజేయును. ఇది శరీరమునకు నుపద్రవములను కలుగఁజేయనిదిగ, విరేచనసాధ్యంబులగు వ్యాధులన్నిటియందును ప్రయోగింపఁదగినదిగ నుండుటవలన దంతీద్రవంత్యాది విరేచన ద్రవ్యములకంటె ముందుగఁ జెప్పఁబడినది.

సేదానీ మౌషధైర్యుక్తా వాతపిత్తకఫాపహైః,
కల్పవైశేష్యమాసాద్య జాయతే సర్వరోగజిత్. ౨

పైగుణములుగల తెగడ వాతపిత్తకఫహరంబులగు నౌషధముతోఁ జేరుటవలన విశేషగుణమునుబొంది విరేచనసాధ్యములైన రోగముల నన్నిటిని బోకడచును.

### తెగడభేదము-తద్గుణములును.

ద్విధా ఖ్యాతం చ తన్మూలం శ్యామం శ్యామారుణం త్రివృత్,
త్రివృదాఖ్యం వరతరం నిరపాయం సుఖం తయోః 3
సుకుమారే శిశౌ వృద్ధే మృదుకోష్ఠే చ తద్ధితమ్,

తెగడ శ్యామము-శ్యామారుణము అని ద్వివిధము. నల్లతెగడవేళ్లు శ్యామమనియు, నల్లగ-ఎఱ్ఱగనుండు తెగడవేళ్లు త్రివృత్తనియుఁ జెప్పఁబడును. ఈరెండిటిలో త్రివృత్తనునది మిగులశ్రేష్ఠము. ఉపద్రవములను గలుగఁజేయక సుఖకరముగ నుండును. సుకుమార శరీరులు బాలురు వృద్ధులు మృదుకోష్ఠముగలవారు వీరికి హితకరముగ నుండును.

### నల్లతెగడగుణము.

మూర్ఛాసమ్మోహహృత్కంఠకర్షణక్షణప్రదమ్. ౪
శ్యామం తీక్ష్ణాశుకారిత్వా దత స్తదపి శస్యతే,
క్రూరే కోష్ఠే బహౌ దోషే క్లేశక్షమిణి చాతురే. ౫

నల్లతెగడవేళ్లు మూర్ఛ, మోహము, హృదయమునం దుపద్రవము, కంఠమునందు నొప్పి వీనిని గలుగఁజేయును; అయితే తీక్ష్ణముగను, శరీరమునందు త్వరగా వ్యాపించునదిగను నుండుటవలన క్రూరకోష్ఠము, దోషాధిక్యము, ప్రబలరోగమునుగలవారికిని విరేచనకష్టము నోర్చువారికిని ప్రశస్తవిరేచనౌషధముగ నుండును.

### తెగడవేళ్లను గ్రహించుక్రమము.

గంభీరానుగతం శ్లక్ష్ణ మతిర్యగ్విసృతం చ యత్,
గృహీత్వా విసృజేత్కాష్ఠం త్వచం శుష్కాం నిధాపయేత్. ౬

భూమిలో వంకరలేక లోఁతులో ప్రవేశించియుండునదై, నున్నగనుండు త్రివృత్తను తెగడవేళ్లనుగ్రహించి దాని పైనుండు బెరడునుమాత్రము తీసి యెండలో నెండించి భద్రముగ నొకపాత్రలో నుంచుకొనవలయును.

(బెరడులోపల నరముపలెయుండు కట్టెనుదూరంబుచ్చి పైబెరడునుమాత్రము వలియకొట్టి గ్రహించవలెననుట)

### వాతాదులయందు తెగడచూర్ణోపయోగక్రమము.

అథ కాలే తు తచ్చూర్ణం కించిన్నాగరసైంధవమ్,

వాతామయే పిబేదమ్లైః పిత్తే సాజ్య సితామధు. ౭
క్షీరద్రాక్షేక్షుకాశ్మర్యస్వాదుస్కంధవరారసైః,
కఫామయే పీలురసమూత్రమద్యామ్లకాంజికైః. ౮
పంచకోలాదిచూర్ణైశ్చ యుక్త్వా యుక్తం కఫాపహైః,

అనంతరము విరేచనము చేయించవలసిన కాలములో పైజెప్పినరీతిగ గ్రహింపబడిన తెగడవేళ్ల పట్టను మాత్రము గ్రహించి చక్కఁగ చూర్ణముచేసి కొంచెము సొంటి సైంధవలవణముచేర్చి వాతరోగమునందు గంజిమొదలగువానితోడ పానము చేయించవలయును. పిత్తరోగమునందు పైచూర్ణములో పంచదార తేనె ఆవునెయ్యి వీనిని చేర్చి ఆవుపాలతోఁగాని ద్రాక్షపండ్లరసముతోఁగాని చెఱకురసముతోఁగాని నేలగుమ్ముడురసముతోఁగాని సూత్రస్థానములో రసభేదీయాధ్యాయమునందు మధురస్కంధమునందుఁ జెప్పఁబడిన యౌషధులరసములతోఁగాని త్రిఫలములరసముతోఁగాని పానము చేయించవలయును. కఫరోగమునందు పైచూర్ణములో కఫమును పోఁగొట్టునట్టి పంచకోలాదిచూర్ణమునుగాని పాచనదీపనకారిగనుండు చిత్రమూలచూర్ణమునుగాని తగుమాత్రముకలిపి గోఁగురసము-గోమూత్రము-మద్యము-కలి - కాంజికము వీనిలో దేనిలోనైన కలిపి పానముచేయించవలయును.

విరేచనకరమగు తెగడలేహము.

త్రివృత్కల్కకషాయేణ సాధితస్ససితో హిమః. ౯
మధుత్రిజాతసంయుక్తో లేహో హృద్యం విరేచనమ్,

త్రివృత్తను తెగడవేళ్ల కషాయ కల్కములను సమముగచేర్చి అందులో పంచదారకలిపి లేహపాకవిధిగ వండి చల్లారినపిదప అందులో తగుమాత్రము తేనె త్రిజాతకములుచేర్చి యిప్పించిన ఆయాసములేకయే చక్కఁగ విరేచనంబగును. కాస చికిత్సలో కంటకారిలేహమునకు చెప్పియుండునటుల ద్రవ్యప్రమాణపాకాదులను తెలిసికొనవలయును.

సన్నిపాతజ్వరాదులయందు విరేచనకల్పము.

అజగంధా తవక్షీరీ విదారీ శర్కరా త్రివృత్. ౧౦
చూర్ణితం మధుసర్పిర్భ్యాం లీఢ్వా సాధు విరిచ్యతే,
సన్నిపాతజ్వరస్తంభపిపాసాదాహపీడితః. ౧౧

సన్నిపాతజ్వరము, స్తంభించియుండుట, ఎక్కువదప్పి, సర్వాంగతాపము వీనిచే పీడింపఁబడియుండువారికి వాయింట-తవక్షీరి-నేలగుమ్ముడుగడ్డ - పంచదార -

త్రివృత్తను తెగడవేళ్లబెరడు వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి అందులో తేనె ఆవునెయ్యికలిపి నాకించిన చక్కఁగ విరేచనంబగును.

విరేచనకర ఇక్షుఖండములు.

లింపే దంతత్రివృతయా ద్విధాకృత్వేక్షుఖండికాః,
ఏకీకృత్య పచేత్స్విన్నం పుటపాకేన భక్షయేత్. ౧౨

చెఱకుతునుకలను రెండుగాచీల్చి దానినడమ త్రివృత్తను తెగడవేళ్లబెరడు చూర్ణమును పూసి రెండుతునుకల నొకటిగచేర్చి పుటపాకవిధిగ పక్వముచేసిభక్షించిన చక్కఁగ విరేచనంబగును.

వమనకరతర్పణౌషధము.

త్వగేలాభ్యాం సమా నీలీ తైత్రివృత్తైశ్చ శర్కరా,
చూర్ణం ఫలరసక్షౌద్రసక్తుభిస్తర్పణం పిబేత్. ౧౩
వాతపిత్తకఫోత్థేషు రోగేష్వల్పానలేషు చ,
నరేషు సుకుమారేషు నిరపాయం విరేచనమ్. ౧౪

లవంగపట్ట, ఏలకులు ఇవి సమభాగములు, వీనికిసమము నీలి,వీనికన్నిటికి సమము త్రివృత్తను తెగడవేళ్లు, ఇటుల వీనినన్నిటిని గూర్చి చూర్ణముచేసి చూర్ణమునకు సమభాగము పంచదారచూర్ణముకలిపి త్రిఫలరసము, తేనె, సక్తువు వీనితోడ చేర్చి పానముచేయించిన చక్కఁగ విరేచనంబగును. ఇది వాతపిత్తకఫములవలన జనించినరోగముల యందును, జఠరాగ్నిమందగించినవారికిని, సుకుమారమైన శరీరముగలవారికిని సుఖకరమును ఉపద్రవములేనిదియునైన విరేచనౌషధము.

గుల్మాదిరోగములకు విడంగాదివిరేచనకల్పము.

విడంగతండులవరాయావశూకకణాత్రివృత్,
సర్వేభ్యోఽర్ధేన తల్లీఢం మధ్వాజ్యేన గుడేన వా. ౧౫
గుల్మం ప్లీహోదరం కాసం హలీమకమరోచకమ్,
కఫవాతకృతాంశ్చాన్యాన్ పరిమార్ష్టి గదాన్ బహూన్. ౧౬

వాయువిడంగబియ్యము, త్రిఫలములు, యవక్షారము, పిప్పళ్లు, ఇవి సమభాగములు: వీనిసముదాయమున కర్థభాగము త్రివృత్తను తెగడవేళ్లబెరడు; ఇటుల వీని నన్నిటి నేకముచేసి చూర్ణించి తేనె నెయ్యి వీనిలో కలిపిగాని, బెల్లములో కలిపిగాని నాకించిన గుల్మము, ప్లీహము, ఉదరరోగము, కాసము, హలీమకము, అరోచకము, కఫవాతములవలన జనించిన బహువిధరోగములను నిశ్శేషముగ హరించును.

### కల్యాణకగుడము.

విడంగపిప్పలీమూలత్రిఫలాధాన్యచిత్రకమ్,
మరిచేంద్రయవాజాజీపిప్పలీహస్తిపిప్పలీః. ౧౭
దీప్యకం పంచలవణం చూర్ణితం కార్షికం పృథక్,
తిలతైలత్రివృచ్చూర్ణభాగౌ చాష్టపలోన్మితౌ. ౧౮
ధాత్రీఫలరసప్రస్థాంస్త్రీన్ గుడాద్ధతులాన్వితాన్,
పక్త్వా మృద్వగ్నినా ఖాదేత్తతో మాత్రామయంత్రణః. ౧౯
కుష్ఠార్శఃకామలాగుల్మమేహోదరభగందరాన్,
గ్రహణీం పాండురోగాంశ్చ హంతి పుంసవనశ్చ సః. ౨౦
గుడః కల్యాణకో నామ సర్వేష్వృతుషు యౌగికః,

వాయువిడంగములు, మోడి, త్రిఫలములు, దనియాలు, చిత్రమూలము, మిరియాలు, కొడిసెవిత్తులు, జీలకఱ్ఱ, పిప్పళ్లు, ఏనుఁగుపిప్పళ్లు, ఓమము, పంచలవణములు, వీనిచూర్ణము దినుసుకు ఒక కర్షము, నువ్వులనూనె 8 పలములు, త్రివృత్తను తెగడవేళ్ల చూర్ణము 8 పలములు, ఉసిరికెపండురసము 3 ప్రస్థములు, ప్రాతబెల్లము 50 పలములు ఇటుల వీనినన్నిటి నొకటిగచేర్చి మృద్వగ్నిచే పాకముచేసి మాత్రగ భక్షింపవలయును. ఇటుల భక్షించిన కుష్ఠము, అర్శస్సు, కామల, గుల్మము, ప్రమేహము, ఉదరరోగము, భగందరము, గ్రహణి, పాండురోగము అనునీరోగములన్నియు హరించును. దీనిని కల్యాణకగుడమని చెప్పుదురు. ఈగుడమును సేవించిన సంతానము కలుగును. సర్వర్తువుల యందు నుపయోగించఁదగినది. దీనిని సేవించునపుడు ఆహారమునందు పథ్యనియమము లేదు.

### విరేచనకరవ్యోషాదిగుటికలు.

వ్యోషత్రిజాతకాంభోదక్రిమిఘ్నామలకైస్త్రివృత్. ౨౧
సర్వైస్సమా సమసితాః క్షౌద్రేణ గుటికాః కృతాః,
మూత్రకృచ్ఛ్రజ్వరచ్ఛర్దికాసశోషభ్రమక్షయే. ౨౨
తాపే పాండ్వామయేఽల్పేఽగ్నౌ శస్తాస్సర్వవిషేషు చ,

త్రికటుకములు, త్రిజాతకములు, తుంగముస్తలు, ఉసిరికెపరుగు, వాయువిడంగములు, ఇవిసమభాగములు, వీనికన్నిటికిసమము తెగడవేళ్లు; తెగడవేళ్లకుసమము పంచదార; ఇట్లు వీనినొకటిగచేర్చి చూర్ణముచేసి తేనెకలిపి గుటికలు చేయవలయును. ఇది

మూత్రకృచ్ఛ్రము, జ్వరము, కాసము, వాంతి, క్షయము, శోష, భ్రమము, తాపము, పాండురోగము, అగ్నిమాంద్యము, సర్వవిషోపద్రవములు లోనగురోగములయందు మిక్కిలి ప్రశస్తమైనది.

## వర్షాకాలవిరేచనకల్పము.

త్రివృతా కౌటజం బీజం పిప్పలీ విశ్వభేషజమ్. ౨౩
క్షౌద్రద్రాక్షారసోపేతం వర్షాకాలే విరేచనమ్,

తెగడవేళ్లు, కొడిసెవిత్తులు, పిప్పళ్లు, శుంఠి, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి తేనె, ద్రాక్షపండురసము, వీనిలోకలిపి వర్షాకాలమునందు విరేచనౌషధముగ నిప్పించిన సుఖముగ విరేచనంబగును. ఇది వర్షాకాలయోగ్యవిరేచనౌషధము.

## శరత్కాలవిరేచనకల్పము.

త్రివృద్దురాలభాముస్తశర్కరోదీచ్యచందనమ్, ౨౪
ద్రాక్షాంబునా సయష్ట్యాహ్వం సాతలం జలదాత్యయే,

త్రివృత్తను తెగడవేళ్లబెరడు, దురదగొండి, తుంగముస్తలు, పంచదార, కురువేరు, చందనము, అతిమధురము, సంబరేణు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి ద్రాక్షపండురసములోకలిపి శరత్కాలమునందు విరేచనౌషధముగ నిప్పించవలయును. ఇది శరత్కాలమున నిప్పించవలసిన విరేచనౌషధము.

## హేమంతకాల విరేచనకల్పము.

త్రివృతాం చిత్రకం పాఠామజాజీం సరళం వచామ్. ౨౫
స్వర్ణక్షీరీం చ హేమంతే చూర్ణముష్ణాంబునా పిబేత్,

తెగడవేళ్లబెరడు, చిత్రమూలము, చిరుబొద్ది, ఓమము, సరళదేవదారుచెక్క, వస, సువర్ణక్షీరి, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి యుష్ణోదకములో కలిపి హేమంతకాలమున విరేచనమున కొసంగవలయును.

## గ్రీష్మకాలవిరేచనకల్పము.

త్రివృతా శర్కరాతుల్యా గ్రీష్మకాలే విరేచనమ్. ౨౬

తెగడవేళ్లబెరడును చూర్ణము జేసి దానికి సమభాగము పంచదార కలిపి యాచూర్ణమును గ్రీష్మకాలమున విరేచనమున కిప్పించవలయును.

## సర్వర్తువిరేచనకల్పము.

త్రివృత్త్రాయంతిహపుషాసాతలాకటురోహిణీః,
స్వర్ణక్షీరీం చ సంచూర్ణ్య గోమూత్రే భావయేత్త్ర్యహమ్. ౨౭
ఏష సర్వర్తుకో యోగస్స్నిగ్ధానాం మలదోషహృత్,

తెగడవేళ్లబెరడు, కలు(క్రా)నుగు, బోడతరము, సంబరేణు, కటుకరోహిణి, స్వర్ణక్షీరి, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి గోమూత్రలో మూడు దినములు భావనచేయవలయును. ఈయోగము అన్ని ఋతువులయందు నుపయోగించ తగినది. స్నేహకర్మను జేయించుకొనియుండు మనుజుల కీచూర్ణము నిప్పించిన చక్కగ విరేచనమై మలదోషములన్నియు హరించును.

—॥ రూక్షస్నిగ్ధులకు విరేచనకల్పము. ॥—

శ్యామాత్రివృద్దురాలంభాహాస్తిపిప్పలివత్సకమ్. ౨౭
నీలినీకటుకాముస్తాశ్రేష్ఠాయుక్తం సుచూర్ణితమ్,
రసాజ్యోష్ణాంబుభిశ్శస్తం రూక్షాణామపి సర్వదా. ౨౮

నల్లతెగడవేళ్లబెరడు, తెల్లతెగడవేళ్లబెరడు, దూలగోవిల, ఏనుఁగుపిప్పళ్లు, కొడిసెవిత్తులు, పెద్దనీలి, కటుకరోహిణి, తుంగముస్తలు, త్రిఫలములు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి యీచూర్ణమును మాంసరసము, ఆవునెయ్యి, ఉష్ణోదకము, అనువానిలో కలిపి రూక్షస్నిగ్ధశరీరుల కందరికి సర్వకాలములయందును విరేచనమునకై యిప్పించిన మిగుల శ్రేష్ఠముగనుండును.

—॥ జ్వరాదిరోగములకు విరేచనకల్పము. ॥—

జ్వరహృద్రోగవాతాసృగుదావర్తాదిరోగిషు,
రాజవృక్షోఽధికం పథ్యో మృదుర్మధురశీతళః. ౩౦

జ్వరము, హృద్రోగము, వాతరక్తము, ఉదావర్తము మొదలగురోగములయందు మృదువుగ, మధురముగ శీతలముగనుండు రేలకాయలలోనిజిగురు నుపయోగించుట తక్కినవిరేచన ద్రవ్యములకన్నిటికన్న మిక్కిలి ప్రశస్తంబుగ నుండును.

—॥ విరేచనమునందు రేలకు ప్రాశస్త్యము. ॥—

బాలే వృద్ధే క్షతే క్షీణే సుకుమారే చ మానవే,
యోజ్యో మృదుర్వనపాయిత్వాద్విశేషాచ్చతురంగులః. ౩౧

రేల మృదువుగ, బాధను గలుగజేయునిదిగ నుండుటవలన దానిని బాలురు వృద్ధులు క్షతులు క్షీణులు సుకుమారశరీరముగలవారు వీరికి విరేచనార్థ మిప్పించవలయును.

—॥ రేలపండును గ్రహించుక్రమము. ॥—

ఫలకాలే పరిణతం ఫలం తస్య సమాహరేత్,
తేషాం గుణవతాం భారం సికతాసు వినిక్షిపేత్. ౩౨
సప్తరాత్రాత్సముద్ధృత్య శోషయేచ్చాతపే తతః,

తతో మజ్జానముద్ధృత్య శుచౌ పాత్రే నిధాపయేత్. ౩౩

యుక్తకాలములో చక్కఁగ పండిన యిరువది రేల పండ్లను శుభదినమున గ్రహించి యేడు దినములు ఇసుకలోఁబూడ్చి పిదప ఎత్తి యెండనెండించి యాపండ్ల లోపలనుండు గుజ్జును గ్రహించి శుద్ధమైన పాత్రలో నుంచికొనవలయును.

### ఆరగ్వధమజ్జోపయోగక్రమము.

ద్రాక్షారసేన తం దద్యాద్దాహోదావర్తపీడితే,
చతుర్వర్షే సుఖం బాలే యావద్ద్వాదశవార్షికే. ౩౪
చతురంగుళమజ్జో వా కషాయం పాయయేద్ధిమమ్,
దధిమండసురామండధాత్రీఫలరసైః పృథక్. ౩౫
సౌవీరకేణ వా యుక్తం కల్కేన త్రైవృతేన వా,

నాల్గవసంవత్సరము మొదలు పండ్రెండు సంవత్సరములలోపలివయసుగలబాలురు సర్వాంగతాపము, ఉదావర్తము ఈరోగములచే పీడింపఁబడినచో అట్టివారికి రేల గుజ్జును ద్రాక్షపండురసములో కలిపి యిప్పించిన సుఖముగ విరేచనమగును. రేల గుజ్జుయొక్క శీతకషాయమును పెరుగుమీఁదిమీఁగడలోగాని, సురయనుమద్యపుమీఁగడలోఁగాని, ఉసిరికెపండురసములోఁగాని, గంజిలోఁగాని, తెగడకల్కములోఁగాని కలిపి యిప్పించిన సుఖముగ విరేచనంబగును.

### రగ్వధారిష్టము.

దంతీకషాయే తన్మజ్జో గుడం జీర్ణం చ నిక్షిపేత్. ౩౬
తమరిష్టం స్థితం మాసం పాయయేత్పక్షమేవ వా,

దంతివేళ్లకషాయములో రేలగుజ్జు ప్రాఁతబెల్లము వీనిని సమముగ కలిపి యొక మాసముగాని పదునైదు దినములుగాని యుంచి పిదప పానముచేయించిన సుఖముగ విరేచనంబగును. (ఇదియ ఆరగ్వధారిష్టము)

### తిల్వకకల్పము.

త్వచం తిల్వకమూలస్య త్యక్త్వాభ్యంతరవల్కలమ్. ౩౭
విశోష్య చూర్ణయిత్వా చ ద్వౌ భాగౌ గాలయేత్తతః,
రోధ్రస్యైవ కషాయేణ తృతీయం తేన భావయేత్. ౩౮
కషాయే దశమూలస్య తం భాగం భావితం పునః,
శుష్కం చూర్ణం పునః కృత్వా తతః పాణితలం పిబేత్. ౩౯
మస్తుమూత్రసురామండకోలధాత్రీఫలాంబుభిః,

లొద్దుగవేళ్లయొక్క పైబెరడును చివ్వి వర్జించి యావేళ్లపైనుండుపట్టను మాత్రము ఎండనెండించి చూర్ణముచేసి 3 భాగములుచేసి 2భాగములు లొద్దుగకషాయ

ములోకలిపి వడియగట్టి అందులో మిగతగనుండు మఱియొకభాగమును చేర్చి భావనచేసి యెండించి దానిని పిదప దశమూలకషాయములో భావనచేసి యెండించి యాచూర్ణము నొక కర్షప్రమాణము పెరుఁగుమీఁదిమీఁగడ, గోమూత్రము,సురయనుమద్యపుమీఁగడ, రేఁగుపండ్లస్వరసము,ఉసిరికెపండుస్వరసము వీనిలోనొకదానితో కలిపి పానముచేయించిన చక్కఁగ విరేచనంబగును.

తిల్వకలేహము.

తిల్వకస్య కషాయేణ కల్కేన చ సశర్కరః. ౮౦
సఘృతస్సాధితో లేహస్సచ శ్రేష్ఠం విరేచనమ్,

లొద్దుగుకషాయము, లొద్దుగుకల్కము వీనిని సమభాగములుగ చేర్చి అందులో పంచదారకలిపి ఆవునెయ్యిబోసి లేహపాకవిధిగ వండవలయును. ఇది మిక్కిలి శ్రేష్ఠమైన విరేచనౌషధము.

సుధాకల్పము.

సుధా భినత్తి దోషాణాం మహాంతమపి సంచయమ్. ౮౧
ఆశ్వేవ కష్టవిభ్రంశాన్నైవ తాం కల్పయేదతః,
మృదౌ కోష్ఠేఽబలే బాలే స్థవిరే దీర్ఘరోగిణి. ౮౨

జెముడు మిక్కిలి వృద్ధిజెందియుండు దోషములన్నిటిని శీఘ్రముగ పోకడచును. అయినను అది మిగుల కష్టమును గలుగఁజేయును. కావున మృదుకోష్ఠముగలవారు, బలహీనులు, బాలురు, వృద్ధులు, బహుకాలము రోగముచే పీడింపఁబడినవారు లోనగువారికి ప్రయోగింపఁజనదు.

గుల్మాదిరోగములయందు సుధాప్రాశస్త్యము.

కిలాస్య గుల్మోదరగరత్వగ్రోగమధుమేహిషు,
పాండౌ దూషీవిషే శోఫే దోషవిభ్రాంతచేతసి. ౮3
సా శ్రేష్ఠా కంటకైస్తీక్ష్ణై ర్బహుభిశ్చ సమాచితా,

గుల్మము, ఉదరరోగము, విషోపద్రవము, చర్మరోగము, మధుమేహము, పాండురోగము,దూషీవిషము,వాపు, వాతాదిదోషాధిక్యమువలన జనించినచిత్తభ్రమము అనుసిరోగములయందు జెముడుపాలను విరేచనార్థ మిప్పించవలయును. మిక్కుటముగ పదునుగల ముండ్లతోఁగూడియుండు జెముడు మిగుల ప్రశస్తమైనది.

సుధాక్షీరోపయోగక్రమము.

ద్వివర్షాం వా త్రివర్షాం వా శిశిరాంతే విశేషతః. ౮౪
తాం పాటయిత్వా శస్త్రేణ క్షీర ముద్ధారయేత్తతః,

బిల్వాదీనాం బృహత్యోర్వా క్వాథేన సమమేకశః. ౪౫
మిశ్రయిత్వా సుధాక్షీరం తతోఽంగారేషు శోషయేత్,
పిబేత్కృత్వా తు గుటికాం మస్తుమూత్రసురాదిభిః. ౪౬

రెండు లేక మూడు సంవత్సరములవయసుగల జెముడుచెట్టును శిశిరర్తుయొక్క అంతమున శస్త్రముచే ఛేదించి అందుండి స్రవించుపాలను గ్రహించి దానిలో మారేడు కషాయమునుగాని, చిన్నములక, పెద్దములక,వీనికషాయమునుగాని సమభాగములుగ కలిపి పొయిమీఁదఁబెట్టి చక్కఁగ నిగురునటుల పాకముచేసి గట్టియై పిదప గుటికలుచేసి ఆయారోగానుగుణముగ పెరుఁగుమీఁదిమీఁగడ గోమూత్రము సురయనుమద్యము అనువానిలో కలిపి విరేచనార్థము పానముచేయించవలయును.

### త్రివృతాదివిరేచనకల్పము.

త్రివృతాదీన్నవ వరాం స్వర్ణక్షీరీం ససాతలామ్,
సప్తాహం స్నుక్పయఃపీతాన్ రసేనాజ్యేన వా పిబేత్. ౪౭
తద్వద్వ్యోషోత్తమాకుంభనికుంభాదీన్ గుడాంబునా,

త్రివృత్తనుతెగడ, నల్లతెగడ, రేల, తెల్లలొద్దుగు, జెముడు, శంఖిని, విరజాజి, దంతి, ద్రవంతి, త్రిఫలములు, స్వర్ణక్షీరి, సంబరేణు వీనిని యేడు దినములు జెముడు పాలలో భావనచేసి దానిని మాంసరసములోఁగాని ఆవునేతిలోఁగాని కలిపి పానము చేయించినను; త్రికటుకములు, త్రిఫలములు, తెల్లతెగడ, దంతి, వీనిని ఏడుదినములు జెముడుపాలలో భావనచేసి పానకములోకలిపి పానము చేయించినను; సుఖముగ విరేచనంబగును.

### శ్లేష్మరోగాదులయందు శంఖిన్యాదికల్పము.

నాతిశుష్కం ఫలం గ్రాహ్యం శంఖిన్యా నిస్తుషీకృతమ్. ౪౮
సప్తలాయాస్తథా మూలం తే తు తీక్ష్ణవికాసినీ,
శ్లేష్మామయోదరగరశ్వయథ్వాదిషు కల్పయేత్. ౪౯

దంతిఫలమును గ్రహించి పైబెరడును తీసివేసి యెండలో నెండించవలయును. ఇటులనే విరజాజివేళ్లను గ్రహించవలయును. ఈరెండును తీక్ష్ణముగ శరీరమున వ్యాపించు స్వభావముగలవిగనుండును. వీనిని శ్లేష్మరోగము, ఉదరరోగము, విషము, వాపు వీనియందు విరేచనార్థము ప్రయోగించవలయును.

### శంఖినీసప్తలాప్రయోగక్రమము.

అక్షమాత్రం తయోః పిండం మదిరాలవణాన్వితమ్,
హృద్రోగే వాతకఫజే తద్వద్గుల్మే ప్రయోజయేత్. ౫౦

వాతకఫమువలన జనించినహృద్రోగము గుల్మము వీనియందు పైశంఖినీఫలము విరజాజివేళ్లు వీనిని నూరి కర్షప్రమాణముగ నుంటలుజేసి దానిని సురయను మద్యములో కలిపి కొంచెము సైంధవలవణము కలిపి యిప్పించవలయును.

### దంతీద్రవంతీమూలగుణములు.

దంతిదంతస్థిరం స్థూలం మూలం దంతీద్రవంతిజమ్,
ఆతామ్రశ్యావతీక్ష్ణోష్ణమాశుకారి వికాసి చ. ౫౧
గురుప్రకోపి వాతస్య పిత్తశ్లేష్మవిలాయనమ్,

ఏనుఁగుదంతమువలె గట్టిగను, లావుగనుండు దంతి, ద్రవంతి అనువానివేళ్లు కొంచెమెఱుపువర్ణము నలుపువర్ణముగలదిగ తీక్ష్ణముగ ఉష్ణముగ శీఘ్రముగ వ్యాపించునట్టి స్వభావముగలదిగ గురువుగ వాతమును ప్రకోపింపఁజేయునదిగ పిత్తశ్లేష్మముల కరగించునదిగ నుండును.

### దంతీద్రవంత్యుపయోగక్రమము.

తత్క్షౌద్రపిప్పలీలిప్తం స్వేద్యం మృద్దర్భవేష్టితమ్. ౫౨
శోష్యం మందాతపేఽగ్న్యర్కౌ హతో హ్యస్య వికాసితామ్,
తత్పిబే న్మస్తుమదిరాతక్రపీలురసాసవైః. ౫౩
అభిష్యన్నతను ర్గుల్మీ ప్రమేహీ జఠరీ గరీ,
గోమృగాజరసైః పాండు క్రిమికోష్ఠీ భగందరీ. ౫౪

పిప్పళ్లిచూర్ణమును తేనెతోకలిపి పైజెప్పిన దంతి ద్రవంతి వేళ్లకు పై భాగమునందు పూసి దర్భగడ్డిచేచుట్టి దానిపై మట్టిబూసి పుటపాకము చేసి పిమ్మట దానికిపైనుండు మట్టిమొదలగువానిని తీసివైచి మృదువుగనుండు ఎండలో ఎండించవలయును. ఇటుల జేసిన వానియందు దోషములు హరించును. పిదప వానిని చూర్ణముచేసి అభిష్యందము, గుల్మము, ప్రమేహము, ఉదరరోగము, విషోపద్రవము అనునీరోగములయందు పెరుఁగు మీఁదిమీఁగడ, మజ్జిగ, గోగురసము, ఆసవమనుమద్యము వీనితోడను; పాండువు, క్రిమికోష్ఠము, భగందరము, ఈరోగములయందు ఆవు, జింక, మేఁక వీనిమాంసరసములతోడను, విరేచనార్థము పానము చేయించవలయును.

### దంతీద్రవంత్యాదిఘృతకల్పము.

సిద్ధం తత్క్వాథకల్కాభ్యాం దశమూలరసేన చ,
విసర్పవిద్రధ్యలజీకక్షాదాహా న్ జయేద్ఘృతమ్. ౫౫
తైలం తు గుల్మమేహార్శోవిబంధకఫమారుతాన్,
మహాస్నేహాశ్శకృచ్ఛుక్రవాతసంగానిలవ్యథాః. ౫౬

దంతివేళ్లకషాయము, దంతివేళ్లకల్కము, దశమూలములకషాయము ఆవునెయ్యి వీనిని సమభాగములుగ నేకముజేసి ఘృతపాకవిధిగపక్వముచేసి యాఘృతము నిప్పించిన విసర్పము, విద్రధి, అలజీ, కక్షదాహము అనునవి హరించును. పైకషాయకల్కములతో

పక్వముచేయఁబడిన తైలము గుల్మము, ప్రమేహము, అర్శస్సు, మలబంధము, కఫవాతములు వీనిని పోఁగొట్టును. షైకషాయకల్కములతో పక్వముచేయఁబడిన మహాస్నేహము మలబంధము, శుక్రప్రతిబంధకము, అపానవాతబాధను వాతోపద్రవములు వీనిని పోఁగొట్టును.

### విరేచనకర శ్రేష్ఠద్రవ్యములు.

విరేచనే ముఖ్యతమా నవైతే త్రివృతాదయః!

త్రివృత్తను తెగడ, నల్లతెగడ, రేల, లొద్దుగు, జెముడు, శంఖిని, విరజాజి, దంతి, ఎలుకచెవిచెట్టు ఈ తొమ్మిది ద్రవ్యములు విరేచనమునందు మిక్కిలి శ్రేష్ఠములుగ నుండును.

### హారీతకీకల్పము.

హారీతకీమపి త్రివృద్విధానేనోపకల్పయేత్. ౫౭

"అథ కాలేతు తచ్చూర్ణం కించిన్నాగరసైంధవమ్"

అనుశ్లోకములచే త్రివృత్తను తెగడవేళ్లకు చెప్పియుండునట్లు కరక్కాయలను విరేచనమునం దుపయోగించవలయును.

### హారీతకీమోదకకల్పము.

గుడస్యాష్టపలే పథ్యా వింశతిస్స్యాత్పలంపలమ్,
దంతీచిత్రకయోః కర్షౌ పిప్పలీత్రివృతోర్దశ. ౫౮
ప్రకల్ప్య మోదకానేవం దశమే దశమేఽహని,
ఉష్ణాంభోఽను పిబేత్ఖాదే త్తాన్సర్వాన్విధినాఽమునా. ౫౯
ఏతే నిష్పరిహారాస్స్యుస్సర్వవ్యాధినిబర్హణాః,
విశేషాద్గ్రహణీపాండుకండూకోఠార్శసాం హితాః. ౬౦

8 పలముల ప్రాఁతబెల్లములో, కరక్కాయలు 20, దంతి 1 పలము, చిత్రమూలము 1 పలము, పిప్పళ్ళు 2 కర్షములు, త్రివృత్తు 2 కర్షములు వీనిని చేర్చి చక్కఁగ నూరి 10 మోదకములను (అనఁగా కుడుములను) జేసి పదిదినములకొకపర్యాయము ఒక మోదకము నిప్పించి యుష్ణోదకమును త్రాగించవలయును. ఇటుల 10 మోదకములను భుజింపఁజేసిన సర్వవ్యాధులు నివర్తించును. మఱియు నీమోదకములు గ్రహణి, పాండువు, దురద, కోఠరోగము, అర్శోరోగము, వీనియందు మిక్కిలి హితకరము.

### విరేచనౌషధోపయోగక్రమము.

అల్పస్యాపి మహార్థత్వం ప్రభూతస్యాల్పకర్మతామ్,

కుర్యాత్సంశ్లేషవిశ్లేషకాలసంస్కారయుక్తిభిః. ౬౧

బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు సంశ్లేషము (అనఁగా తగినయౌషధములను చేర్చుట) విశ్లేషము (అనఁగా కాలానుగుణముగ నౌషధములోఁజేరిన యోషధులను వర్జించుట) మధ్యాహ్నాదికాలము సంస్కారము అనఁగా పాకము యుక్తి (అనఁగా ఆయాకాలము ననుసరించి ద్రవ్యపరిమాణములను తెలిసికొనుట) వీనిచే మాత్రావీర్యములు అల్పముగ నుండు నౌషధమునకు అధికవీర్యమును, మాత్రావీర్యము లధికముగనుండు నౌషధములకు అల్పవీర్యమును కలుగఁజేసి యిప్పించవలయును.

### విరేచనౌషధానుపానములు.

త్వక్కేసరామ్రాతకదాడిమైలాసితోపలామాతులుంగైః
మద్యైశ్చిత్రైస్త్రైశ్చ మనోనుకూలైర్యుక్తాని దేయాని విరేచనాని.

లవంగపట్ట, నాగకేసరములు, అంబాళము, దానిమ్మపండు, ఏలకులు, పంచదార, తేనె, మాదీఫలము, పలుతెఱఁగులైన మద్యములు, ఇవి మున్నగువానిలో మనస్సునకు ప్రియమైన వస్తువులలో చేర్చి విరేచనౌషధముల నిప్పించవలయును.

ద్వితీయాధ్యాయము ముగిసెను.

—•—

# తృతీయాధ్యాయము.

---

అవ: వమనౌషధమును, విరేచనౌషధమును శరీరబల దేశకాలాదుల ననుసరింపక విధ్యుక్త ప్రకారము నుల్లంఘించి యుపయోగించుటంజేసి హీనమిథ్యాతియోగములవలన ననేకరోగములు కలుగును. అయ్యవివమనవిరేచనవ్యాపత్తులనిచెప్పబడును. అట్టిరోగములకుదగిన చికిత్సలను తెలియపరచుటకై వమనవిరేచన వ్యాపత్సిద్ధ్యధ్యాయమును జెప్పుచున్నాఁడు.

వమనవిరేచనవ్యాపత్సిద్ధ్యధ్యాయ ప్రారంభము.

సూ. అథాతో వమనవిరేచనవ్యాపత్సిద్ధిం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

వమన విరేచన కల్పాధ్యాయ నిరూపణానంతరము వమనవిరేచనౌషధసేవనవలన జనించెడు నుపద్రవములకు చికిత్సలను తెలియజేయు వమనవిరేచనవ్యాపత్సిద్ధియను నీ యధ్యాయమును వివరించెదము.

వమనవ్యాపత్సామాన్యచికిత్స.

వమనం మృదుకోష్ఠేన క్షుద్వతాల్పకఫేన వా,
అతితీక్ష్ణహిమస్తోకమజీర్ణే దుర్బలేన వా. ౧
పీతం ప్రయాత్యధ స్తస్మిన్నిష్టహానిర్మలోదయః,
వామయేత్తం పునస్స్నిగ్ధం స్మరన్పూర్వమతిక్రమమ్. ౨

మృదుకోష్ఠముగలవానికిఁగాని ఆఁకలిగలవానికిఁగాని స్వల్పకఫముగలవానికిఁగాని అజీర్ణరోగికిఁగాని దుర్బలునికిఁగాని అతితీక్ష్ణముగ శీతముగ స్వల్పపరిమాణముగలదిగ నుండు వమనౌషధమును పానముచేయించిన నది అధోభాగమును జేరును. అందువలన వమనముకాకుండుటయేగాక, కఫముసగావృద్ధిజెందును. కావుననట్టివానికి మరలస్నేహకర్మను చేయించి పూర్వముఏదోషముచే వమనముకాకపోయెనో ఆదోషమునుచక్కఁగ పర్యాలోచించి మరల వమనౌషధమునిప్పించి వమనము చేయింపవలయును.

విరేచనవ్యాపత్సామాన్యచికిత్స.

అజీర్ణినశ్శ్లేష్మవతో వ్రజత్యూర్ధ్వం విరేచనమ్,
అతితీక్ష్ణోష్ణలవణమహృద్య మతిభూరి వా. 3
తత్ర పూర్వోదితా వ్యాపత్సిద్ధిశ్చ న తథా పిబేత్,

ఆమాశయే తిష్ఠతి తతస్తృతీయం నావచారయేత్. ౪
అన్యత్ర సాత్మ్యాద్ధృద్యాద్వా భేషజాన్నిరపాయతః,

అజీర్ణముగలవానికిని, శ్లేష్మ మధికముగ వృద్ధిజెందియుండు వానికిని మిక్కిలితీక్ష్ణముగను ఉష్ణముగను లవణముగను, లేక, మనఃప్రియకరము కానిదిగను లేకఅధికప్రమాణముగలదిగను నుండువిరేచనౌషధము నిప్పించిన నది ఊర్ధ్వభాగమును జెంది వమనము గలుగజేయును. అందువలనవిరేచనము కాకుండుటయే గాక దోషముసగావృద్ధియగును. అట్టివానికి పూర్వమే దోషమువలన విరేచనము కాకుండెనో యాదోషమును చక్కఁగ పర్యాలోచించి మరల స్నేహకర్మను చేయించివిరేచనౌషధమునిప్పించవలయును. ఇటుల ప్రయోగింపఁబడిన విరేచనౌషధముసయితము ఆమాశయమునందుండక వమనంబైనచో నట్టివానికి మూడవపర్యాయము విరేచనౌషధమిప్పింపంజనదు. అయితే రోగికి సాత్మ్యముగను మనఃప్రియముగను ఉపద్రవమును గలుగజేయనిదిగను నుండునౌషధమును మూడవపర్యాయ మిప్పింపనగును.

## విరేచనాయోగ లక్షణము.

అస్నిగ్ధస్విన్నదేహస్య పురాణం రూక్ష మౌషధమ్. ౫
దోషానుత్క్లేశ్య నిర్హర్తు మశక్తం జనయేద్గదాన్,
విభ్రంశం శ్వయథుం హిధ్మాం తమసో దర్శనం తృషమ్. ౬
పిండికోద్వేష్టనం కండూమూర్వోస్సాదం వివర్ణతామ్,
స్నిగ్ధస్విన్నస్య వాత్యల్పం దీప్తాగ్నేర్జీర్ణమౌషధమ్. ౭
శీతైర్వా స్తబ్ధమామే వా సముత్క్లేశ్య హరేన్మలాన్,
తానేవ జనయేద్రోగానయోగస్సర్వ ఏవ సః. ౮

రోగిశరీరమునకు స్నేహస్వేదకర్మములనుజేయించక ప్రాఁతదిగను రూక్షగనునుండువిరేచనౌషధమునిప్పించినయది దోషములను తమస్థానమునందుండి చలింపఁజేసి విభ్రంశము, వాపు, ఎక్కిళ్ళు, నేత్రములకు చీఁకట్లుకమ్ముట, దప్పి, పిక్కలయందు నొప్పి, దురద, తొడలయందశక్తి, శరీరమునందు వికారవర్ణము, మొదలగునుపద్రవములను గలుగఁజేయును. మఱియు స్నేహస్వేదకర్మములను చేయించికొనియుండు వానికి విరేచనౌషధము స్వల్పముగ నిప్పించిన నది జీర్ణమై విరేచనమును గలుగఁజేయకుండును. లేక శీతముచే స్తబ్ధమై ఆమాశయమును జెంది దోషములను స్వస్థానమునుండి చలింపఁజేసి పైచెప్పిన విభ్రంశము మొదలగురోగములనుగలుగఁజేయును. ఇది యంతయు విరేచనాయోగమనంబడును.

## విరేచనాయోగ చికిత్స.

తం తైలలవణాభ్యక్తం స్విన్నం ప్రస్తరసంకరైః,

నిరూఢం జాంగలరసై ర్భోజయిత్వానువాసయేత్. ౯
ఫలమాగధికాదారుసిద్ధతైలేన మాత్రయా,
సిద్ధం వాతహరై స్స్నేహైః పునస్తీక్ష్ణేన శోధయేత్. ౧౦

పైచెప్పిన ప్రకారము దోషములు స్వస్థానములో చలించియుండువానికి లవణమును నువ్వులనూనెలో చేర్చి యభ్యంజనము చేయించి సూత్రస్థానమునందు స్వేదాధ్యాయములో చెప్పియుండు ప్రస్తరసంకరమను స్వేదకర్మములను చేయించి జాంగలదేశజంతుమాంసరసముతో నాహారమును భుజింపఁజేసి మంగపండు, పిప్పళ్లు, దేవదారు వీనిని సమభాగములుగ చేర్చి పక్వము చేయఁబడిన తైలముచే తగినపరిమితిగా అనువాసనవస్తిని ప్రయోగించవలయును. పిదప వాతహరద్రవ్యములతో పక్వము చేయఁబడిన స్నేహములచే స్నిగ్ధశరీరికి మరల తీక్ష్ణవిరేచనౌషధము నిచ్చించి దోషములను వెలిపుచ్చవలయును.

## విరేచనమిథ్యాయోగజరోగ చికిత్స.

బహుదోషస్య రూక్షస్య మందాగ్నేరల్పమౌషధమ్,
సోదావర్తస్య చోత్క్లేశ్య దోషాన్మార్గం నిరుధ్య తైః. ౧౧
భృశమాధ్మాపయేన్నాభిం పృష్ఠపార్శ్వశిరోరుజమ్,
శ్వాసం విణ్మూత్రవాతానాం సంగం కుర్యాచ్చ దారుణమ్,
అభ్యంగస్వేదవర్త్యాదిస నిరూహానువాసనమ్,
ఉదావర్తహరం సర్వం కర్మాధ్మాతస్య శస్యతే. ౧౩

దోషాధిక్యముగలవాఁడును, రూక్షకోష్ఠముగలవాఁడును, అగ్నిమాంద్యముగలవాఁడును, ఉదావర్తరోగముగలవాఁడును నైనరోగికి ఔషధమునుస్వల్పప్రమాణముగ నిచ్చించిన నది వాతాదిదోషములను తమతమస్థానములనుండి చలింపఁజేసి స్రోతోమార్గముల నడ్డగించి యాదోషములతో చేరి మిక్కుటముగ నాభిప్రదేశమునకడుపుబ్బునటుల జేయుటయే గాక వీపు, పార్శ్వములు, శిరము వీనియందునొప్పి, శ్వాసము, దారుణమైనఁ మలమూత్ర అపానవాత ప్రతిబంధము, వీనినిగలుగఁజేయును. అటుల నాభి యుబ్బియుండువానికి అభ్యంగము, స్వేదవర్తి, నిరూహానువాసనవస్తికర్మలు, ఉదావర్తహర చికిత్సలు వీనినన్నిటిని చేయించవలయును.

## విరేచనమిథ్యాయోగజనితరోగమునకుపచారము.

పంచమూలయవక్షారవచాభూతీకసైంధవైః,
యవాగూస్సుకృతా శూలవిబంధానాహనాశినీ, ౧౪

పంచమూలములు, యవక్షారము, వస, నేలవేము లేక కామంచిపూరి, సైంధవలవణము, వీనినిసమభాగములుగ చేర్చి చక్కఁగ పక్వము చేయఁబడిన యవాగు, అను గంజి నిచ్చించిన శూలలు,మలమూత్రాదిబంధము కడుపుబ్బరము, ఇవిహరించును.

విరేచనమిథ్యాయోగజాతప్రవాహికాదిచికిత్స.

పిప్పలీదాడిమక్షారహింగుశుంఠ్యమ్లవేతసాన్,
ససైంధవాన్ పిబేన్మద్యైస్సర్పిషోష్ణోదకేన వా. ౧౫
ప్రవాహికాపరిస్రావే వేదనాపరికర్తనే,

పిప్పళ్ళు, దానిమ్మ, యవక్షారము, ఇంగువ, శుంఠి, పుల్లబ్బబ్బలి,వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి అందులో కొంచెముగ సైంధవలవణముజేర్చి మద్యములోగాని ఆవునేతిలోగాని ఉష్ణోదకములోగాని కలిపి పానముచేయించిన విరేచనౌషధమిథ్యాయోగమునగల్గిన ప్రవాహిక, పరిస్రావము, శూల, పరికర్తనము, అను నీ రోగములు హరించును.

మలమూత్రాదులనడ్డగించుటవలనకలుగునుపద్రవములు.

పీతౌషధస్య వేగానాం నిగ్రహాన్మారుతాదయః. ౧౬
కుపితా హృదయం గత్వా ఘోరం కుర్వంతి హృద్గ్రహమ్,
హిధ్మాపార్శ్వరుజాకాసదైన్యలాలాక్షివిభ్రమైః. ౧౭
జిహ్వాం ఖాదతి నిస్సంజ్ఞో దంతాన్ కటకటాపయన్,

విరేచనౌషధముపుచ్చుకొనినవాడుమలమూత్రాది వేగముల నడ్డగింపజనదు. అట్లు అడ్డగించినచో వాతాదిదోషములు మిక్కుటముగ బ్రకోపించి హృదయమునుజేరి అొమ్మునందుపట్లు, ఎక్కిళ్ళు, పార్శ్వశూల, కాసము, దౌర్బల్యము, నోటనీరు వెడలుట, కండ్లుతిరుగుట, నాలుకనుకొరికికొనుట, ప్రజ్ఞలేకుండుట, పండ్లుకటకటయని కొరుకుట, మొదలగునుపద్రవములను కలుగజేయును.

మలాది వేగముల నడ్డగించుటవలన కలుగునుపద్రవములకుచికిత్స.

న గచ్ఛేద్విభ్రమం తత్ర వామయేదాశు తం భిషక్. ౧౮
మధురైః పిత్తమూర్ఛార్తం కటుభిః కఫమూర్ఛితమ్,
పాచనీయైస్తతశ్చాస్య దోషశేషం విపాచయేత్. ౧౯
కాయాగ్నిం చ బలం చాస్య క్రమేణాభిప్రవర్ధయేత్,

పైజెప్పిన మూర్ఛావస్థతో గూడియుండు రోగికి బుద్ధిమంతుడగు వైద్యుడు పిత్తజమూర్ఛయందు మధురౌషధముల చేతను, కఫజమూర్ఛయందు కారముగనుండు నౌషధములచేతను శీఘ్రముగ వమనముచేయించి కడుపులో శేషించియుండు దోషమును పాచనీయద్రవ్యములచే జీర్ణమగునట్లు జేయవలయును. మఱియు నీరోగికి జాఠరాగ్ని, శరీరబలము, వీనిని క్రమక్రమముగ వృద్ధిచేయించవలయును.

అధికవమనంబగుటచే కలుగు హృదయపీడకు చికిత్స.

పవనేనాతివమతో హృదయం యస్య పీడ్యతే. ౨౦

తస్మై స్నిగ్ధామ్లలవణం దద్యాత్పిత్తకఫేఽన్యథా,

వమనమధికంబుగనై వాతముచే హృదయమునందు బాధకలిగియుండురోగికి స్నిగ్ధముగ, పుల్లగ, ఉప్పగనుండు నన్నపానాదుల నిప్పించవలయును. పిత్తకఫములు ప్రకోపమును జెందియుండినచో మధురముగ శీతముగ నుండు నన్నాదుల నిప్పించవలయును.

వమనవిరేచనముల నడ్డగించుటవలన జనించు నుపద్రవములకు చికిత్స.

పీతౌషధస్య వేగానాం నిగ్రహేణ కఫేన వా. ౨౧
రుద్ధోఽతివా విశుద్ధస్య గృహ్ణాత్యంగాని మారుతః,
స్తంభవేపథునిస్తోదసాదోద్వేష్టార్తిభేదనైః. ౨౨
తత్ర వాతహరం సర్వం స్నేహస్వేదాది శస్యతే,

వమనవిరేచనౌషధములను సేవించినవానికి మలమూత్రాదివేగముల నడ్డగించుటచేఁగాని కఫముచేగాని వాతముఅడ్డగింపఁబడి అవయవములు పట్టుకొనినను లేక శుద్ధకోష్ఠముగలవానికి వాతము ప్రకోపించి అంగములయందు స్తబ్ధత్వము, వణఁకు, సూదితోపొడుచునటులపోట్లు, బలహీనత, నొప్పి, చీల్చునటుల వేదన యీ యుపద్రవములు కలిగిన వాతహారములైన స్నేహస్వేదాది చికిత్సలనన్నిటిని చేయవలయును.

విరేచనాతియోగము.

బహ్వతీక్ష్ణక్షుధార్తస్య మృదుకోష్ఠస్య భేషజమ్. ౨౩
హృత్వాశు విట్పిత్తకఫాన్ ధాతూనాస్రావయేద్ద్రవాన్,

మిక్కిలి యాఁకలిగలవాఁడును, మృదుకోష్ఠము గలవాఁడును నైన మనుజునికి తీక్ష్ణముగనుండు విరేచనౌషధము నధికముగ నిప్పించిన నది మలపిత్తకఫముల నతిశీఘ్రముగ వెడలించి ద్రవరూపములగు రసాదిధాతువులను అధికముగ వెడలింపజేయును. ఇది విరేచనాతియోగ మనంబడును.

విరేచనాతియోగచికిత్స

తత్రాతియోగే మధురైశ్శేషమౌషధముల్లిఖేత్. ౨౪
యోజ్యోఽతివమనే రేకో విరేకే వమనం మృదు,
పరిషేకావగాహాద్యైస్సుశీతైస్స్తంభయేచ్ఛ్రుతమ్. ౨౫

పైవిరేచనాతియోగమునందు శేషించియుండు విరేచనౌషధమును మధుద్రవ్యములచే బైలువెడలింపఁజేయవలయును. అటులజేసియు వమనంబధికముగనైనచో విరేచనమున కిప్పించవలయును. విరేచనంబధికముగనయినచో మృదువైనవమనౌషధమును ప్రయోగించవలయును. మిక్కిలి శీతముగనుండు పరిషేకము, అవగాహము, చల్లని

గాలి మొదలగువానిచే విరేచనాతియోగమునం దుపచరించి విరేచనములను నిలుపవలెను.

విరేచనాతియోగహరమంథము.

అంజనం చందనోశీరమజ్జాసృక్ఛర్కరోదకమ్,
లాజచూర్ణైః పిబేన్మంథమతియోగహరం పరమ్. ౨౬

రసాంజనము, చందనము, వట్టివేరు, మజ్జ, రక్తము, పంచదార, ఉదకము, వీనిలోవరి పేలాలచూర్ణమునుకలిపి పానము చేయించిన అధికవిరేచనమునునిలుపును.

వమనాతియోగహరౌషధము.

వమనస్యాతియోగే తు శీతాంబుపరిషేచితః,
పిబేత్ఫలరసై ర్మంథం సఘృత క్షౌద్రశర్కరమ్. ౨౭
సోద్గారాయాంభృశంఛర్ద్యాంమూర్వాయా ధాన్యముస్తయోః,
సమధూకాంజనం చూర్ణం లేహయేన్మధుసంయుతమ్. ౨౮

అధికముగ వమనమైనచో శీతోదకమునుశరీరముపై చిలకరించి ద్రాక్షపండు రసములో వరిపేలాలచూర్ణమును కలిపి అందులో తేనెశర్కర నెయ్యిచేర్చి పానము చేయించవలయును. ఓంకర మిక్కుటముగ కలిగియుండినయెడల చాగ, ధనియాలు, తుంగముస్తలు, యష్టిమధుకము, రసాంజనము, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి తేనెలోకలిపి నాకించవలయును.

వమనములచే నాలుకలోనికిలాగికొన్నచో చికిత్స.

వమనేఽంతఃప్రవిష్టాయాం జిహ్వాయాం కబళగ్రహాః,
స్నిగ్ధామ్లలవణా హృద్యా యూషమాంసరసా హితాః. ౨౯
ఫలాన్యమ్లాని ఖాదేయుస్తస్య చాన్యేఽగ్రతో నరాః,
నిస్సృతాం తు తిలద్రాక్షాకల్కలిప్తాం ప్రవేశయేత్. ౩౦

వాంతియగునపుడు నాలుకలోనికిలాగికొని పోయినచో కబళగ్రహములు; ఘృతాదిస్నేహములు చేర్చఁబడినపిగ, పుల్లగ, ఉప్పగ, మనస్సుకిష్టముగనునుండు కట్టులు; మాంసరసము వీనినిప్పించవలయును. మఱియు నారోగి చూచుచుండఁగా పుల్లగనుండు పండ్లను ఇతరులఁదిను నటులుంజేయవలయును. ఇటుల జేసిన నాలుక బైటికి వచ్చును; వమనాతియోగమున నాలుకనోటనుండి వెలికిపొడవుగ వెడలివ్రేలుచున్న తోడనే యానాలుకకు నువ్వులు ద్రాక్షపండు వీనినినూరి కల్కముజేసిపూయవలయును. పిదపనాలుకనులోనికి ప్రవేశింపజేయవలెను.

వాగ్గ్రహవాతరోగచికిత్స.

వాగ్గ్రహానిలరోగేషు ఘృతమాంసోపసాధితమ్,

యవాగూం తనుకాం దద్యాత్స్నేహస్వేదౌ చ కాలవిత్. ३१

నోరుపట్టుకొనుట మొదలగువాతరోగములయందు ఆవునెయ్యి మాంసము వీనితోపక్వము చేయఁబడి లేతగనుండుగంజిని పానము చేయించవలయును; కాలావస్థాదులను తెలిసికొనినయందు వైద్యుఁడుతత్తదనుగుణముగ స్నేహస్వేదకర్మములను చేయవలయును.

## జీవితరక్తపిత్తపరీక్ష.

అతియోగాచ్చ భైషజ్యం జీవం హరతి శోణితమ్,
తజ్జీవాదానమిత్యుక్తమాదత్తే జీవితం యతః. ३२
శునే కాకాయ వా దద్యాత్తేనాన్నమసృజా సహ,
భుక్తే తస్మిన్ వదేజ్జీవమభుక్తే పిత్తమాదిశేత్. ३३
శుక్లం వా భావితం వస్త్రమావాసం కోష్ణవారిణా,
ప్రక్షాళితం వివర్ణం స్యాత్పిత్తే శుద్ధం తు శోణితే. ३४

అధికముగ విరేచనౌషధము నిచ్చించినదానంజేసి అధికముగ విరేచనమై ప్రాణాధారమైన జీవమను పేరుగలరక్తమును వెడలింపఁజేయును. అందువలన నాయౌషధమును జీవాదానమనిబుధులు చెప్పుదురు. పిత్తము రక్తము వీనికి గంధము వర్ణము ఇవి సమముగనుండుటంజేసి యాయౌషధాతియోగమువలన వెడలిన జీవితరక్తమునందు నిది జీవితరక్తమో లేక పిత్తమో యనుశంకగలుగును. కావున నీ క్రిందఁజెప్పఁబోయెడు ప్రకారము పరీక్షించవలయును. విరేచనంబగునపుడు ఔషధాతియోగమువలన రక్తమువలె వెడలినదానిని గ్రహించి అందులో అన్నముకలిపి కుక్కకుగాని కాకికిగాని వేయవలయును. అటులవేసిన యన్నమును ఆజంతువులు భుజంచినయెడల నది జీవరక్తమనియు భుజించనిచో పిత్తమనియు నిర్దేశింపవలయును. మఱియు పైరక్తమును గ్రహించి దానిలో తెల్లనివస్త్రమును తడిపి యెండించి మరల ఉష్ణోదకములో పులిమిన యావస్త్రము తెల్లగనుండిన జీవరక్తమనియు, వికారవర్ణముగనుండిన పిత్తమనియు తెలిసికొనవలయును.

## జీవితరక్తస్రావచికిత్స.

తృష్ణామూర్ఛామదార్తస్య కుర్యాదామరణం క్రియామ్,
రక్తపిత్తాతిసారఘ్నీం తస్యాశు ప్రాణరక్షిణీమ్. ३५
మృగగోమహిషాజానాం సద్యస్కం జీవతామసృక్,
పిబేజ్జీవాభిసంధానం జీవం తద్ధ్యాశు యచ్ఛతి. ३६
తదేవ దర్భమృదితం రక్తం వస్తౌ నిషేచయేత్,

అధికముగ విరేచన మగుటవలన జీవరక్తము బైలువెడలినచో దప్పి, మూర్ఛ భ్రమ మొదలగు నుపద్రవములు కలుగును. అట్టిసమయమునందు రక్తపిత్తాతిసారమును పోగొట్టునదియు ప్రాణములను రక్షించునదియు నైన చికిత్స నతిశీఘ్రముగ చేయుటయే గాక ప్రాణముతోఁగూడియుండు జింక ఆవు బఱ్ఱె మేఁక అనువాని శరీరములోనుండి అపుడే రక్తమును తీసి యారోగికి పానము చేయించిన నతఁడు జీవించును. పైజింక మొదలగువాని రక్తములలో పచ్చిదిగనుండు దర్భగడ్డిని వేసి పిసికి నారక్తమును వస్తికర్మయందు ప్రయోగించవలయును

### జీవశరక్తస్రావమునందు వస్తికర్మ

శ్యామాకాశ్మర్యమధుకదూర్వోశీరై శ్శృతం పయః ౩౮
ఘృతమండాంజనయుతం వస్తిం వా యోజయేద్ధిమమ్,
పిచ్ఛావస్తిం సుశీతం వా ఘృతమండానువాసనమ్. ౩౯

నల్లసుగంధిపాల, గుమ్ముడు, యష్టిమధుకము, గరికె, వట్టివేరు, అనువానిని సమభాగములుగ చేర్చి కాఁచఁబడిన ఆవుపాలలో నేతిమీఁగడ రసాంజనము వీనిని కలిపి శీతలముగ వస్తికర్మను ప్రయోగించవలయును. లేక నేతిమీఁద పేరియుండు మీఁగడచే పిచ్ఛావస్తిని అనువాసనవస్తిని ప్రయోగించవలయును.

### విరేచనాతియోగజగుదభ్రంశచికిత్స.

గుదం భ్రష్టం కషాయైశ్చ స్తంభయిత్వా ప్రవేశయేత్,
విసంజ్ఞం శ్రావయేత్సామ వేణుగీతాదినిస్స్వనమ్ ౪౦

విరేచనాతియోగమువలన గుదము బైటికి వచ్చెనేని ఆగుదమునకు వగరురసము గల ద్రవ్యములతో కాఁచఁబడిన కషాయమును బూసి లోనికి త్రోయవలయును. అట్టిసమయమున రోగికి ప్రజ్ఞ లేకుండిన సామవేదగానము, పిల్లంగ్రోవిశబ్దము మొదలగు మధురశబ్దములను వినిపించవలయును.

తృతీయాధ్యాయము ముగిసెను.



# చతుర్థాధ్యాయము.



అవ. వమనవిరేచనకర్మలు రోగములను పోఁగొట్టునటులనే వస్తికర్మము సర్వరోగములను పరిహరింపఁజేయుటచే వమనవిరేచనవ్యాపత్సిద్ధ్యధ్యాయనిరూపణానంతరము వస్తికల్పాధ్యాయము చెప్పఁబడుచున్నయది.

## వస్తికల్పాధ్యాయప్రారంభము.

సూ. అథాతో దోషహరణసాకల్యం వస్తికల్పం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః

వమనవిరేచన వ్యాపత్సిద్ధ్యధ్యాయ నిరూపణానంతరము సకలదోషములను హరింపంజేయు వస్తికల్పములను తెలియపరచునట్టి వస్తికల్పమను నీయధ్యాయమును వివరించెదము.

## సర్వరోగహరవస్తికల్పము.

బలాం గుడూచీం త్రిఫలాం సరాస్నాం
ద్విపంచమూలం చ పలోన్మితాని
అష్టౌ ఫలాన్యర్ధతులాం చ మాంసా
చ్ఛాగాత్పచేదప్సు చతుర్థశేషమ్. ౧

పూతో యవానీఫలబిల్వకుష్ఠవచాశతాహ్వాఘనపిప్పలీనాం,
కల్కైర్గుడక్షౌద్రఘృతైస్సతైలైర్యుక్తస్సుఖోష్ణోలవణాన్వితశ్చ.
వస్తిః పరం సర్వగదప్రమాథీ స్వస్థే హితో జీవనబృంహణశ్చ,
వస్తౌ చ యస్మిన్పతితోనకల్కః పర్వత్ర దద్యాదముమేవతత్ర. ౩

చిట్టాముట్టి, తిప్పతీఁగె, త్రిఫలములు, సన్నరాస్నము, దశమూలములు ఇవి దినుసు కొక్కొకపలము, మ్రంగపండ్లు ఎనిమిది, మేఁకమాంసము ఏబదిపలములు వీనిని ఉదకములో వైచి నాలవభాగము మిగులునటుల కషాయముకాఁచి వడియగట్టి అందులో ఓమము, మ్రంగపండు, మారేడు, చెంగల్వకోష్టు, వస, సదాప, తుంగముస్తలు, పిప్పళ్లు, వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి కలిపి మఱియు దానిలో బెల్లము తేనె నెయ్యి నువ్వులనూనె సైంధవలవణము వీనిని చేర్చి సుఖోష్ణముగనుండు నాకషాయముచే వస్తికర్మ ప్రయోగించిన సమస్తరోగములు హరించును. దీనిని వస్తికర్మయందు స్వస్థశరీరుల కుపయోగించిన ఆయుర్వృద్ధి శరీరపుష్టియుఁగలు

గును. వస్తికషాయమునకు కల్కమును చెప్పకుండు స్థానములలో నీయోగమునందు చెప్పియుండు కల్కమును చేర్చుకొనవలయును.

"తతః క్వాథచతుర్థాంశం స్నేహం వాతే ప్రకల్పయేత్,
పిత్తే స్వస్థే చ షష్ఠాంశమష్టమాంశం కఫాధికే"

వాతరోగమునందు వస్తికషాయములో నాల్గు భాగములు ఘృతాదిస్నేహమును చేర్చుకొనవలయును. పిత్తరోగము స్వస్థశరీరము ఇవిగలవారికి ఆరవభాగము స్నేహమును, కఫాధిక్యమునందు కషాయమున కెనిమిదవభాగము స్నేహమును చేర్చవలయునని తంత్రాంతరమునందు చెప్పఁబడియుండుటవలన పైవస్తికషాయములో నాల్గు భాగములు నువ్వులనూనె చేర్చవలయును. "స్వస్థే కల్కపలద్వయమ్," అనువచనముచుపట్టి పైకషాయములో యవానాద్యాదికల్కమును రెండు పలములు చేర్చుకొనవలయును.

## వాతరోగహరనిరూహకల్పము.

దశపంచమూలస్య రసోఽమ్లయుక్తస్సచ్ఛాగమాంసస్య సపూర్వకల్కః,
త్రిస్నేహయుక్తః ప్రవరో నిరూహస్సర్వానిలవ్యాధిహరః ప్రదిష్టః.

దశమూలములు, మేఁకమాంసము, వీనికషాయములో కలిని కలిపి అందులో పైసర్వరోగహరవస్తికల్పమునకు చెప్పియుండు యవానాద్యాది ద్రవ్యకల్కము నెయ్యి క్రొవ్వు మజ్జ యీమూడుస్నేహములును మిశ్రముజేసి నిరూహవస్తిని ప్రయోగించవలయును. ఇది మిక్కిలిశ్రేష్ఠమైనది. వాతరోగములనన్నిటిని పోఁగొట్టునని మహర్షులు చెప్పుచున్నారు.

## బలాదిదీపనవస్తికల్పము.

బలాపటోలీలఘుపంచమూలంత్రాయంతికైరండయవాత్సుసిద్ధాత్
ప్రస్థో రసాచ్ఛాగరసార్ధయుక్తస్సాధ్యఃపునః ప్రస్థసమస్స యావత్
ప్రియంగుకృష్ణాఘనకల్కయుక్తస్సతైలసర్పిర్మధుసైంధవశ్చ,
స్యాద్దీపనో మాంసబలప్రదశ్చ చక్షుర్బలం చోపదధాతి సద్యః.

చిట్టాముట్టి, చేఁదుపొట్ల, లఘుపంచమూలములు, కలుక్రానుగు, ఆముదము, యవలు, వీనిని సమభాగములుఁగ గ్రహించి యుదకములోవైచి కాఁచఁబడినకషాయము ఒక ప్రస్థము, మేఁకమాంసము, అర్ధప్రస్థము ఇటుల నీ రెంటిని ఏకముజేసి మరల నొక ప్రస్థము మిగులునటుల కాఁచి అందులో ప్రేంకణము, పిప్పళ్లు, తుంగముస్తలు, వీని కల్కము, నువ్వులనూనె, నెయ్యి, తేనె, సైంధవలవణము, వీనిని చేర్చి వస్తికర్మను ప్రయోగించవలయును ఈవస్తికషాయము అగ్నిదీపనము, శరీరబలము, వీనిని గలుగఁ జేయుంటయేగాక తత్క్షణమే నేత్రములకు హితము గలుగఁజేయును.

### శ్లేష్మవాతజరోగములకేరండమూలాదివస్తికల్పము.

ఏరండమూలా త్త్రిపలం పలాశా త్తథా పలాశం లఘుపంచమూలమ్,
రాస్నా బలా చ్ఛిన్నరుహాశ్వగంధాపునర్నవారగ్వధదేవదారు. ౭
ఫలాని చాష్టౌ సలిలాఢకాభ్యాం విపాచయేదష్టమశేషితేఽస్మిన్,
వచాశతాహ్వాహ్వపుషాప్రియంగుయష్టీకణావత్సకబీజముస్తమ్. ౮
దద్యాత్సుపిష్టం సహతాగ్రశైలమతఃప్రమాణంలవణాంశయుక్తమ్
సమాక్షికస్తైలయుత స్సమూత్రో వస్తిర్జయేల్లేఖనదీపనోఽసౌ. ౯
జంఘోరుపాదత్రికపృష్ఠకోష్ఠహృద్గుహ్యశూలంగురుతాంవిబంధమ్,
గుల్మాశ్మవర్ధగ్రహణీగుదోత్థాంస్తాంస్తాంశ్చరోగాన్కఫవాతజాతాన్.

ఆముదపువేళ్లు 3 పలములు, మోదుగ 3 పలములు, హ్రస్వపంచమూలములు 1 పలము, దుంపరాస్నము, చిట్టాముట్టి, తిప్పతీఁగె, పెన్నేరుగడ్డ, గలిజేరు, రేల, దేవదారు, ఇవి దినుసుకొక్కొక పలము; మ్రంగపండ్లు ౮ వీనిని 2 ఆఢకములజలములోవైచి ౮-వ భాగము మిగులునటుల కషాయముకాఁచి అందులో వస, సదాప, బోడతరము, ప్రేంకణము, యష్టిమధుకము, పిప్పళ్లు, కొడిసెవిత్తులు, తుంగముస్తలు, రసాంజనము అను వానిని దినుసుకు కర్షప్రమాణము చొప్పున గ్రహించి చక్కఁగనూరి కలిపి అందులో సైంధవలవణము 1 కర్షముచేర్చి దానిలో తేనె నువ్వులనూనె గోమూత్రముపోసి వస్తినిప్రయోగించిన పిక్కలు, తొడలు, కాళ్లు, వెన్నెముకకుక్రిందిభాగము, వీపు; కోష్ఠము, ఱొమ్ము, గుదము, వీనియందలిశూలలు, గురుత్వము, మలబంధము, గుల్మము, అశ్మరి, వృద్ధి, గ్రహణి, అర్శోంకురములు, కఫవాతములవలన జనించునవేకరోగములు ఇవియన్నియు నివర్తించును. మఱియు నీవస్తి మలమును భేదించి అగ్నిదీపనమును గలుగఁజేయును.

### పిత్తరోగహరవస్తికల్పము.

యష్ట్యాహ్వరోధ్రాభయచన్దనైశ్చ శృతం పయోగ్ర్యం కమలోత్పలైశ్చ
సశర్కరాక్షౌద్రయుతం సుశీతం పిత్తామయాన్ హంతి సజీవనీయమ్.

అతిమధురము, లొద్దుగు, వట్టివేరు, చందనము, తామరపువ్వు, నల్లకలువ, వీనిని సమభాగములుగ చేర్చి ఆవుపాలలో వీనినన్నిటినిగూర్చి చక్కఁగకాఁచి అందులో శర్కర, తేనె జీవనీయద్రవ్యములు వీనినికలిపి శీతముగవస్తికర్మను ప్రయోగించిన పిత్తరోగములు హరించును.

### పిత్తమువలన కలిగినరోగములకు రాస్నాదినిరూహవస్తికల్పము.

రాస్నాంవృషం లోహితికామనంతాంబలాంకనీయస్తృణపంచమూల్యౌ

గోపాంగనాచందనపద్మగన్ధాయష్ట్యాహ్వరోధ్రాణి పలార్ధకాని.
నిఃక్వాథ్య తోయేన రసేన తేన శృతం పయోఽర్ధాఢకమంబుహీనమ్,
జీవంతిమేదర్ధివరీవిదారీవీరాద్వికాకోళికసేరుకాభిః. ౧౩
సితోపలాజీవకపద్మరేణుప్రపౌండరీకోత్పలపుండరీకైః,
లోహాత్మగుప్తామధుయష్టికాభిర్నాగాహ్వముంజాతకచందనైశ్చ.
పిష్టైర్ఘృతక్షౌద్రయుతైర్నిరూహం ససైంధవం శీతలమేవ దద్యాత్,
ప్రత్యాగతే ధన్వరసేన శాలీన్ క్షీరేణ వాద్యాత్పరిషిక్తగాత్రః ౧౪
దాహాతిసారప్రదరాస్రపిత్తహృత్పాండురోగాన్విషమజ్వరం చ,
సగుల్మమూత్రగ్రహకామలాదీన్ సర్వామయాన్పిత్తకృతాన్నిహంతి.

దుంపరాస్నము, అడ్డసరము, మంజిష్టి, చిన్నదూలగొండి, చిట్టాముట్టి, తృణపంచమూలములు, లఘుపంచమూలములు, నల్లసుగంధిపాల, చందనము, పద్మకము, బుద్ధి, యష్టిమధుకము, లొద్దుగు, వీనిని దినుసు కరపలమువంతున గ్రహించి జలములోవైచి పాదావశేషముగ కషాయముకాచి అందులో 1 ఆఢకము ఆవుపాలుచేర్చి పిన్నమను బాల, మేద, బుద్ధి, పిన్నపిల్లిపీచర, నేలగుమ్ముడుగడ్డ, పెద్దపిల్లిపీచర, కాకోళి, క్షీరకాకోళి, తుంగముస్తెలు, ఖండశర్కర, జీవకము, పద్మకము, రేణుకలు, ప్రపౌండరీకము, (కర్పూరపుబెండ) నల్లకలువ, తెల్లతామరపువ్వు, నల్లఅగరు, రేగటిదూలగోవెల, యష్టిమధుకము, నాగకేసరములు, ముంజగడ్డి, చందనము, వీనిని సమభాగములుగ గ్రహించి చక్కగనూరి కల్కముచేసి కలిపి ఆవునెయ్యి, తేనె, సైంధవలవణము వీనిని దానిలో జేర్చి శీతముగ నిరూహవస్తిని ప్రయోగించి ఆవస్తికషాయము బైటికివచ్చినపిదప జాంగలమాంసరసముతోగాని ఆవుపాలతోగాని సంబావ్రబియ్యపుఅన్నము తినునటులంజేసిన సర్వాంగతాపము, అతిసారము, భగందరము, రక్తపిత్తము, అొమ్మునొప్పి, పాండురోగము, విషజ్వరము, గుల్మము, మూత్రప్రతిబంధము, కామల యీరోగములను హరించును. మఱియు నీవస్తికల్పము పిత్తజనితములయిన సర్వరోగములను పోగొట్టును.

మందాగ్న్యాదులకు నిరూహవస్తికల్పము.

కోశాతకారగ్వధదేవదారుమూర్వాశ్వదంష్ట్రాకుటజార్కపాఠాః,
పక్త్వా కుళుత్థాన్ బృహతీం చ తోయే రసస్య తస్య ప్రసృతా దశస్యుః.
తాన్ సర్షపైలామదనైస్సకుష్ఠైరక్షప్రమాణైః ప్రసృతైశ్చ యుక్తాన్,
క్షౌద్రస్య తైలస్య ఫలాహ్వయస్య క్షారస్య తైలస్య చ సర్పిషశ్చ ౧౫
దద్యాన్నిరూహం కఫరోగితాయ మందాగ్నయే చాశనవిద్విషే చ,

చేదుబీర, రేల, దేవదారు, చాగ, పల్లేరు, కొడిసె, జిల్లేడు, చిరుబొద్ది, ఉలపలు, ప్రాకుడు, వీనిని సమభాగములుగ గ్రహించి యుదకములో వైచి చక్కఁగ పాకము చేసి యాకషాయమును ఇరువదిపలములు, గ్రహించికొని అందులో ఆవాలు, ఏలకులు, మ్రంగపండు, చెంగల్వకోష్టు, వీనిని ప్రత్యేకము కర్షప్రమాణముచొప్పున జేర్చి, తేనె, మ్రంగపండుతైలము, నువ్వులనూనె, ఆవునెయ్యి, సర్జక్షారము, ఇవి ప్రత్యేకము రెండు పలములు కలిపి యాకషాయము చేకఫరోగికి, అగ్నిమాంద్యముగలవారికి, అన్నద్వేషము గలవారికి నిరూహవస్తిని ప్రయోగించిన హితము కలుగును.

ఇచ్చట కోశాతకాది ద్రవ్యములగూర్చి సిద్ధముచేయబడిన క్వాథము పదిప్రసృతము (ఇరువదిపలము) లుండవలెను. కోశాతకాది ద్రవ్యములకు ప్రత్యేకముగ పరిమాణముచెప్పియుండలేదు. సామాన్యపరిభాష ననుసరించి ద్రవ్యపరిమాణమును జలమును కల్పించుకొనవలెను. అదియెట్టులన:—"పానీయం షోడశగుణం క్షుణ్ణే ద్రవ్యపలేక్షిపేత్" అనుసామాన్యపరిభాష చేత జలమునకు పదునారవవంతు ద్రవ్యసముదాయముండవలెను. నాల్గవపాలు మిగులునట్లు కాచబడిన కషాయము ప్రకృతమున ఇరువది పలములు కావలసియున్నదిగాన నాల్గింతజలము ఎనుబదిపలములగును. ఆజలమునకు పదునారవవంతు కల్కద్రవ్యముల సముదాయము ఐదుపలము లుండవలెను. ఇచ్చట కోశాతకి మొదలు వాకుడువరకుంగల పది ద్రవ్యములను ఒక్కొకటి అరపలమువంతున జేర్చినచో ద్రవ్యసముదాయము జలమునకు పదునారవవంతు ఐదు పలములగును; కావున కోశాతకాది ద్రవ్యముల పదింటిని ప్రత్యేకముఅరపలమునుగూర్చి నలియఁగొట్టి యెనుబదిపలముల నీళ్లలో జేర్చి నాల్గవపాలు (ఇరువదిపలములు) మిగులునట్లుకాచి యాకషాయమున ఆవాలు మున్నగువానిని యథోక్తపరిమాణముగ జేర్చి నిరూహవస్తి కుపయోగింపవలెనని నిష్కృష్టార్థము.

వక్ష్యేమృదూన్ స్నేహకృతో నిరూహాన్
సుఖోచితానాం ప్రసృతైఃపృథక్స్వ్యః. ౧౯

అథేమాన్ సుకుమారాణాం నిరూహాన్ స్నేహనాన్ మృదూన్,
కర్మణా విప్లుతానాం తు వక్ష్యామి ప్రసృతైః పృథక్. ౨౦

సుకుమారశరీరులకును, వమనాదికర్మలచే పీడింపఁబడినవారికిని, హితముగను మృదువుగను, స్నేహయుక్తం బైనదిగనునుండు నిరూహవస్తికల్పములను ప్రత్యేక ప్రత్యేకముగ నిఁక వచించెదను.

## వాతహరప్రసృతవస్తికల్పము.

క్షీరా ద్ద్వౌ ప్రసృతౌ కార్యౌ మధుతైలఘృతా త్త్రయః,

ఖజేన మథితో వస్తిర్వాతఘ్నో బలవర్ణకృత్. ౨౧
ఏకైకః ప్రసృతస్తైలప్రసన్నాక్షౌద్రసర్పిషామ్,
బిల్వాదిమూలక్వాథాద్ద్వౌ కౌలుత్థాద్ద్వౌ సవాతజిత్. ౨౨

ఆవుపాలు 4 పలములు, తేనె 2 పలములు, నువ్వులనూనె 2 పలములు ఆవునెయ్యి 2 పలములు వీని నొక్కటిగా కలిపి కొయ్యగవ్వెతో చక్కఁగ చిలికి దానిచే వస్తిని ప్రయోగించిన వాతరోగములు నివర్తించుటయేగాక శరీరమునకు బలము మంచి వర్ణము కలుగును. నువ్వులనూనె, ప్రసన్నయను మద్యము, తేనె, ఆవునెయ్యి, యివి ప్రత్యేకము 2 పలములు, బిల్వాదిపంచమూలకషాయము 4 పలములు, ఉలవకషాయము 4 పలములు వీనినన్నిటి నేకముజేసి వస్తికర్మ చేయించిన వాతరోగములన్నియు నివర్తించును.

## పంచతిక్తవస్తికల్పము.

పటోలనింబభూతీకరాస్నాసప్తచ్ఛదాంభసః,
ప్రసృతః పృథగాజ్యాచ్చ వస్తిః స్సర్షపకల్కవాన్. ౨౩
స పంచతిక్తోఽభిష్యందకృమికుష్ఠప్రమేహహా,

చేదుపొట్ల, వేము, నేలవేము, దుంపరాష్ట్ర, ఏడాకులపొన్న, వీనికషాయము ప్రత్యేకము 2 పలములు, ఆవునెయ్యి 2 పలములు ఇటుల వీని నేకముజేసి అందులో ఆవాలకల్కము కలిపి దానిచే వస్తిప్రయోగము చేయవలయును. ఇది పంచతిక్తవస్తి యనఁబడును. దీనిచే అభిష్యందము, క్రిమిరోగము, కుష్ఠువులు, ప్రమేహరోగములను హరించును.

## మలబంధాదిహరప్రసృతవస్తికల్పము.

చత్వారస్తైలగోమూత్రదధిమండామ్లకాంజికాత్. ౨౪
ప్రసృతాస్సర్షపైః పిష్టైః విట్సంగానాహభేదినః,

నువ్వులనూనె 2 పలములు, గోమూత్రము 2 పలములు పెరుఁగుమీఁదిమీఁగడ 2 పలములు, పుల్లనికడుగు 2 పలములు వీని నొక్కటిగఁజేర్చి అందులో ఆవాలకల్కము కలిపి వస్తికర్మను చేయించిన మలబంధము, కడుపుబ్బరమును నివర్తించును.

## శుక్రవృద్ధికరప్రసృతవస్తికల్పము.

పయస్యేక్షుస్థిరారాస్నా విదారీక్షౌద్రసర్పిషామ్. ౨౫
ఏకైకప్రసృతో వస్తిః కృష్ణాకల్కో వృషత్వకృత్,

పిన్నమనుబాల కషాయము 2 పలములు, చెఱకురసము 2 పలములు, ముయ్యాకుపొన్న కషాయము 2 పలములు, దుంపరాష్ట్రకషాయము 2 పలములు, నేలగుమ్మడు

గడ్డ కషాయము 2 పలములు, తేనె 2 పలములు, ఆవునెయ్యి 2 పలములు వీని నొక్కటిగ కలిపి అందులో పిప్పళ్లకల్కమును చేర్చి వస్తికర్మను ప్రయోగించిన శుక్రము వృద్ధిజెందును. సంభోగశక్తి అధికమగును.

## సిద్ధవస్తికల్పములు.

సిద్ధవస్తీనతో వక్ష్యే సర్వదా యాన్ ప్రయోజయేత్,
నిర్వ్యాపదో బహూంఫలాన్ బలపుష్టికరాన్ సుఖాన్. ౨౬

సర్వకాలములయందును ప్రయోగించఁదగినవియు, ఉపద్రవములులేనివియు, శరీరబలము పుష్టి శుక్రవృద్ధి మొదలైన యనేకఫలములను కలుగజేయునవియు, సుఖముగ ప్రయోగించఁదగినవియునైన సిద్ధవస్తుల నిఁక వచించెదను.

"యస్మిన్యుక్తే యథా వస్తౌ ధ్రువా సిద్ధిః ప్రకీర్తితా,
సిద్ధవస్తిరితి ఖ్యాతో మునిభి స్తత్వదర్శిభిః."

ఏవస్తికర్మను చేయించినయెడల శరీరమునకు బల పుష్టి సుఖాదులు నిస్సంశయముగ కలుగునో యది సిద్ధవస్తియని తత్వవేత్తలైన మహర్షులచే జెప్పఁబడెనని సుశ్రుతాచార్యుఁడు సిద్ధవస్తిలక్షణమును చెప్పియున్నాఁడు.

## మధుతైలికసిద్ధవస్తి.

మధుతైలే సమే కర్షః సైంధవాద్ద్విపిచు ర్మిసిః ౨౭
ఏరండమూలక్వాథేన నిరూహో మధుతైలికః,
రసాయనం ప్రమేహార్శఃకృమిగుల్మాంత్రవృద్ధినుత్. ౨౮
సయష్టిమధుక శ్చైష చక్షుష్యో రక్తపిత్తజిత్,

తేనె, నువ్వులనూనె సమభాగములు, సైంధవలవణము ఒక కర్షము, సదాప రెండు కర్షములు, వీనిని ఆముదపువేళ్లకషాయములో కలిపి నిరూహవస్తిని ప్రయోగించవలయును. ఇది మధుతైలికవస్తి యనఁబడును. వీర్యవృద్ధికారిగనుండును. ప్రమేహము, అర్శస్సు, క్రిమిరోగము, గుల్మము, అంత్రవృద్ధి మొదలగువానిని పోఁగొట్టును.

" యస్మాన్మధు చ తైలం చ ప్రాధాన్యేనాత్రవర్తతే,
మధుతైలికఇత్యేష విజ్ఞేయో వస్తిచింతకైః. "

ఈవస్తికల్పమునందు తేనె, నువ్వులనూనె ఇవి ప్రధానద్రవ్యములుగ నుండుట వలన నిది మధుతైలికవస్తియని వస్తికర్మవేత్తలచేఁ జెప్పఁబడినది. మఱియు పైవస్తికర్మకషాయములో యష్టిమధుకమును చేర్చి ప్రయోగించిన నేత్రములకు హితముకలుగును. రక్తపిత్తరోగము హరించును.

## యాపననిరూహవస్తి.

యాపనో ఘనకల్కేన మధుతైలరసాజ్యవాన్. ౨౯
పాయుజంఘోరువృషణవస్తిమేహనశూలజిత్,
ప్రసృతాం శై ర్ఘృతక్షౌద్రవసాతైలైః ప్రకల్పయేత్. ౩౦

ఆముదపువేళ్లకషాయములో తుంగముస్తలకల్కము, ఆవునెయ్యి, తేనె, మాంసరసము, నువ్వులనూనె, వీనిని చేర్చి దానిచే వస్తికర్మను ప్రయోగించవలయును, ఇది యాపనవస్తి యనఁబడును, గుదము, పిక్కలు, తొడలు, వృషణములు, పొత్తికడుపు, మేఢ్రము వీనియందలి శూలలను పోఁగొట్టును. ఆవునెయ్యి, తేనె, క్రొవ్వు, నువ్వులనూనె ఇవి దినుసుకు 2 పలములు, సైంధవలవణము అర్ధకర్షము, సదాప అరపలము వీని నొక్కటిగ చేర్చిన నది యాపనవస్తికల్ప మనఁబడును.

## యుక్తరథవస్తికల్పము.

ఏరండమూలనిఃక్వాథో మధుతైల స్ససైంధవః,
ఏష యుక్తరథో వస్తి స్సవచాపిప్పలీఫలః. ౩౧
స క్వాథో మదుషడ్గ్రంథాశతాహ్వాహింగుసైంధవః,
సురదారువచా రాస్నావస్తి ర్దోషహరః పరః. ౩౨

ఆముదపువేళ్లకషాయములో తేనె, నువ్వులనూనె, సైంధవలవణము, వస, పిప్పళ్లు, మ్రంగపండు, వీనిని సమభాగములుగ చేర్చి వస్తికర్మను చేయించవలయును. దీనికి యుక్తరథపుని పేరుగలదు.

"రథేష్వపి హి యుక్తేషు హస్త్యశ్వేష్వపి యోజయేత్,
తస్మా న్నప్రతిషిద్ధోఽయమతో యుక్తరథస్మృతః."

ఏనుగులు గుఱ్ఱములు రథములు మున్నగువానిపై సవారి చేయునప్పుడును నిషేధము లేక సేవింపఁదగినదియగుటంజేసి యీవస్తియుక్త రథవస్తియని చెప్పఁబడెనని సుశ్రుతమునందును చెప్పఁబడియున్నది. పైఆముదపువేళ్లకషాయములో యష్టిమధుకము వస, సదాప, ఇంగువ, సైంధవలవణము, అతివస, దుంపరాస్నము వీనిని చేర్చి వస్తికర్మను ప్రయోగించవలయును. ఇది దోషములను పోఁగొట్టును. మిగులనుత్కృష్టమైనది.

## సిద్ధవస్తి.

పంచమూలస్య నిఃక్వాథః తైలం మాగధికామధు,
ససైంధవస్సమధుకస్సిద్ధవస్తి రితి స్మృతః ౩౩

పంచమూల కషాయములో నువ్వులనూనె, పిప్పళ్లు, తేనె, సైంధవలవణము, యష్టిమధుకము వీనిని చేర్చి వస్తికర్మను ప్రయోగించవలయును. దీనిని సిద్ధవస్తియని ఋషులు చెప్పుదురు.

## ద్విపంచమూలాదివస్తికల్పము.

ద్విపంచమూలత్రిఫలాఫలబిల్వాని పాచయేత్,
గోమూత్రేణ చ పిష్టైశ్చ పాఠావత్సకతోయదైః. ౩౪
సఫలైః క్షౌద్రతైలాభ్యాం క్షారేణ లవణేన చ,
యుక్తో వస్తిః కఫవ్యాధిపాండురోగవిసూచిషు. ౩౫
శుక్రానిలవిబంధేషు వస్త్యాటోపే చ పూజితః,

దశమూలములు, త్రిఫలములు, మ్రంగపండు, మారేడుపండు, వీనిని సమభాగములుగ గోమూత్రములోచేర్చి చక్కఁగ పాకముచేసి యాకషాయములో చిరుబొద్ది, కొడిసె,తుంగ స్తలు, మ్రంగపండు, వీనిని సమభాగములుగ గ్రహించి కల్కము జేసి కలిపి, తేనె,నువ్వులనూనె, సర్జక్షారము, సైంధవలవణము అను వీనిని చేర్చిదానిచే వస్తికర్మను ప్రయోగించవలయును. ఇది కఫరోగములు, పాండురోగము, విషూచి, శుక్రబంధము, అపానవాతబంధము, ప్రేఁగులరచుట యీరోగములయందు మిగుల శ్రేష్ఠమైనది.

## ముస్తాదినిరూహవస్తికల్పము.

ముస్తాపాఠామృతైరండబలారాస్నాపునర్నవాః. ౩౬
మంజిష్ఠారగ్వధోశీరత్రాయమాణాక్షరోహిణీః,
కనీయఃపంచమూలం చ పాలికం మదనాష్టకమ్. ౩౭
జలాఢకే పచేత్తచ్చ పాదశేషం పరిస్రుతమ్,
క్షీరద్విప్రస్థసంయుక్తం క్షీరశేషం పునః పచేత్. ౩౮
సపాదజాంగలరసస్సర్పిర్మధుసైంధవః,
పిష్టైర్యష్టిమిసిశ్యామాకలింగకరసాంజనైః. ౩౯
వస్తిస్సుఖోష్ణో మాంసాగ్నిబలశుక్రవివర్ధనః,
వాతాసృఙ్మోహమేహార్శోగుల్మాధ్మానసంగ్రహమ్. ౪౦
విషమజ్వరవీసర్పవర్ధ్మాధ్మానప్రవాహికాః,
వంక్షణోరుకటీకుక్షిమన్యాశ్రోత్రశిరోరుజః. ౪౧
హన్యాదసృగ్దరోన్మాదశోథకాసాశ్మకుండలాన్,
చక్షుష్యః పుత్రదో రాజ్ఞాం యాపనానాం రసాయనమ్. ౪౨

తుంగముస్తలు, చిరుబొద్ది, తిప్పతీగె, ఆముదపుచెట్టు, చిట్టాముట్టి, సన్నరాస్నము, గలిజేరు, మంజిష్ఠి, రేల, వట్టివేరు, కలుత్రాయుగు, తాడి, కటుకరోహిణి, లఘుపంచమూలములు, ఇవి దినుసు కొక్కొకపలము, మ్రంగపండ్లు 8 వీనిని ఆఢకప్రమాణముదకములోవైచి పాదావశేషముగ కషాయముకాచి వడియగట్టి అందులో 2 ప్రస

ములు ఆవుపాలుబోసి పాలుమాత్రము మిగులునటుల మరలకాంచి ఆరుపలములు జాంగలమాంసరసము, ఆవునెయ్యి, తేనె, సైంధవలవణము చేర్చి యష్టిమధుకము, సదాప, నల్లసుగంధిపాల, కొడిసెవిత్తులు, రసాంజనము, వీనికల్కము కలిపి సుఖోష్ణముగ నిరూహవస్తిని ప్రయోగించిన మాంసము, జాఠరాగ్ని బలము, శుక్రము ఇవి వృద్ధియగును. మఱియు నిది వాతరక్తము, మూర్ఛ, ప్రమేహము, అర్శస్సు, గుల్మము, మలమూత్రబంధము, విషమజ్వరము, విసర్పము, గుష్ఠువు, వృద్ధి, కడుపుబ్బరము, ప్రవాహిక, గజ్జలు తొడలు నడుము కడుపు పెడతల పెద్దనరము చెవులు శిరము వీనియందలి శూలలు, అసృగ్దరము, ఉన్మాదము, శోఫ, కాసము, అశ్మరి యందలి ఆయా రోగములను పోఁగొట్టును. ఈఉత్తమమైన రసాయనము నేత్రములకు హితమును సంతానమును కలుగఁజేయును.

## వాతహరనిరూహవస్తికల్పము.

మృగాణాం లఘుబభ్రూణాం దశమూలస్య చాంభసా,
హపుషామిసిగాంగేయీకల్కై ర్వాతహరః పరమ్. ౪౩
నిరూహోఽత్యర్థవృష్య శ్చ మహాస్నేహసమన్వితః,

పెద్ద మృగములయొక్క మాంసము, చిన్నమృగములయొక్క మాంసము, దశమూలములు వీని నుదకములోవైచి కషాయముకాఁచి వడియగట్టి అందులో బోదతరము, సదాప, తుంగముస్తలు, వీనికల్కమునుకలిపి నిరూహవస్తిని ప్రయోగించిన వాతమును హరించును. మఱియు పైకషాయములో మహాస్నేహమును (అనఁగా నెయ్యి మజ్జ క్రొవ్వు) చేర్చి నిరూహవస్తిని చేయించిన మిక్కుటముగ శుక్రము వృద్ధియగును.

## శుక్రవృద్ధికరనిరూహవస్తికల్పము.

మయూరం పక్షపిత్తాంత్రపాదవిట్తుండవర్జితమ్. ౪౪
లఘునా పంచమూలేన పాలికేన సమన్వితమ్,
పక్త్వా క్షీరజలే క్షీరశేషం సఘృతమాక్షికమ్. ౪౫
తద్విదారీకణాయష్టిశతాహ్వాఫలకల్కవత్,
వస్తి రీషత్పటుయుతః పరమం బలశుక్రకృత్. ౪౬
కల్పనేయం పృథ క్కార్యా తిత్తిరిప్రభృతిష్వపి,
విష్కిరేషు సమస్తేషు ప్రతుదప్రసహేషు చ. ౪౭
జలచారిషు తద్వ చ్చ మత్స్యేషు క్షీరవర్జితా,

ఆవుపాలు 2 ఆఢకములు, ఉదకము 2 ఆఢకములు వీని నేకముజేసి అందులో నెమలియొక్క రెక్కలు, పిత్తము, ప్రేగులు, కాళ్లు, మలము, ముక్కు, వీనిని వర్జించి

గ్రహింపఁబడినమాంసము పది పలములు, హ్రస్వపంచమూలములు దినుసు కొకపలము వీనిని చేర్చి పాలుమాత్రము మిగులునటుల కాఁచి, దానిలో నేలగుమ్ముడుగడ్డ, పిప్పళ్లు, యష్టిమధుకము, సదాప, మ్రంగపండు వీనికల్కమునుకలిపి కొంచెము లవణమును ఆవునెయ్యిని తేనెను చేర్చి నిరూహవస్తిని ప్రయోగించిన శరీరబలమును శుక్రము ఇవి విశేషముగ వృద్ధియగును. తిత్తిరిపక్షి మొదలగుపక్షిమాంసములు సూత్రస్థానములో అన్నస్వరూపవిజ్ఞానీయాధ్యాయమునందు చెప్పియుండు ప్రతుదజంతుమాంసములు, ప్రసహాజంతుమాంసములు జలచంజంతుమాంసములు అనువానితోను పైనెమలిమాంసమునకు చెప్పియుండునటుల వస్తికషాయకల్పములను వేర్వేరుగ చేయవలయును. మత్స్యమాంసముచే పైవస్తికల్పమును చేయునపుడు పాలను వర్జించి నీళ్లనుమాత్రము గూర్చి పక్వము చేయునది.

### రసాయనవస్తికల్పము.

గోధానకులమార్జారశల్యకోందురజం పలమ్ ౪౮
పృథగ్దశపలం క్షీరే పంచమూలం చ సాధయేత్,
తత్పయః ఫలవైదేహీకల్కద్విలవణాన్వితమ్. ౪౯
ససితాతైలమధ్వాజ్యో వస్తిర్యోజ్యో రసాయనమ్,
వ్యాయామమథితోరస్కక్షీణేంద్రియబలౌజసామ్. ౫౦
విబద్ధశుక్రవిణ్మూత్రఖుడవాతవికారిణామ్,
గజవాజిరథక్షోభభగ్నజర్జరితాత్మనామ్, ౫౧
పునర్నవత్వం కురుతే వాజీకరణసత్తమః,

ఉడుము, ముంగిస, పిల్లి, ముండ్లపంది పందికొక్కు వీనిమాంసము ప్రత్యేకము పది పలములు, పంచమూలములు పది పలములు వీనినన్నిటిని ఆవుపాలలో వైచి కాఁచి అందులో మ్రంగపండు, పిప్పళ్లు, వీనికల్కము, సైంధవలవణము, సౌవర్చలవణము వీనిని చేర్చి దానిలో పంచదార, నువ్వులనూనె, తేనె, ఆవునెయ్యి, వీనినికలిపి నిరూహవస్తిని ప్రయోగించవలయును. ఇది శ్రమకరమైనపనుల చేయుటచే ఱొమ్ముపగిలినవారు; ఇంద్రియము, బలము, తేజస్సు ఇవి క్షయించియుండువారు, మలమూత్ర శుక్రప్రతిబంధము, ఖుడవాతము, ఇవిగలవారు; ఏనుఁగు, గుఱ్ఱము, రథము మొదలగువాని నారోహించుటచే శైథిల్యమును జెందినవారును లోనగువారికి రసాయనమువలె శరీరబలపుష్ట్యాదులను గలుగఁజేయును. వాజీకరణయోగములలో నిది కడుశ్రేష్ఠము. పైబాధలన్నిటిని నివర్తింపజేసి శరీరమును క్రొత్తగ జేయును.

### వస్తికర్మయందు దాహారక్రమము.

సిద్ధేన పయసా భోజ్యమాత్మగుప్తోచ్ఛటేక్షురైః. ౫౨

రేగటదూలగోవిల, గురిగింజలు, గొలిమిడి, వీనిని సమభాగములుగ చేర్చి కాచం బడిన ఆవుపాలతో అన్నము నిప్పించవలయును.

స్నేహవస్తికల్పము.

స్నేహాంశ్చాయంత్రణాన్ సిద్ధాన్ సిద్ధద్రవ్యైః ప్రకల్పయేత్,

పరిహారరహితముగ అనుభవసిద్ధముగనుండు స్నేహవస్తికల్పములను పక్వము చేయవలయును.

వాతహరస్నేహవస్తికల్పము.

దోషఘ్నాస్సపరీహారా వక్ష్యంతే స్నేహవస్తయః. ౫౩
దశమూలం బలాం రాస్నామశ్వగంధాం పునర్నవామ్,
గుడూచ్యేరండభూతీకభార్గీవృషకరోహిషమ్. ౫౪
శతావరీం సహచరం కాకనాసాం పలాంశకమ్,
యవమాషాతసీకోలకులుత్థాన్ ప్రసృతోన్మితాన్. ౫౫
వహే విపాచ్య తోయస్య ద్రోణశేషేణ తేన చ,
పచేత్తైలాఢకం పేష్యైర్జీవనీయైః పలోన్మితైః ౫౬
అనువాసనమిత్యేతత్సర్వవాతవికారనుత్,
అనూపానాం వసా తద్వజ్జీవనీయోపసాధితా. ౫౭

దోషములను హరించునవిగ పరిహారయుక్తముగనుండు స్నేహవస్తికల్పము లీకం జెప్పఁబడుచున్నయవి. దశమూలములు, చిట్టాముట్టి, సన్నరాస్నము, పెన్నేరుగడ్డ, గలిజేరు, తిప్పతీఁగె, ఆముదపువేళ్లు, నేలవేము, గంటుభారంగి, అడ్డసరము, కామంచిగడ్డి, పిల్లిపీఁచర, పచ్చములుగోరింట, కాకిదొండ ఇవి దినుసు కొక్కొక పలము, యవలు, మినుములు, అగసి, రేఁగుపండ్లు, ఉలవలు ఇవి దినుసుకు, రెండేసిపలములు, వీనిని నాల్గు ద్రోణములజలములో వైచి, ద్రోణప్రమాణము మిగులునటుల కషాయముకాఁచి అందులో నొక ఆఢకము నువ్వులనూనెపోసి ఒకపలము జీవనీయగణద్రవ్యములనునూరి కల్కముచేసి కలిపి చక్కఁగ పాకముచేసి దానిచే అనువాసనవస్తిని ప్రయోగించిన సర్వవాతరోగములను హరించును. పైఁజెప్పినప్రకారము అనూపదేశజంతువులక్రొవ్వు జీవనీయగణద్రవ్యములు వీనితో పక్వముచేయఁబడిన వస్తికషాయము వాతరోగములనన్నిటిని పోగొట్టును.

వాతహరశతాహ్వాదివస్తికల్పము.

శతాహ్వాచిరిబిల్వాత్వైస్తైలం సిద్ధం సమీరణే,

వాతరోగమునందు సదాప, శానుగ, కలివీనితో పక్వము చేయఁబడిన తైలముచే అనువాసనవస్తికర్మను చేయించవలయును.

వాతహారవస్తిఘృతము.

సైంధవేనాగ్నివర్ణేన తప్తం వానిలజిద్ఘృతమ్. ౫౮

సైంధవలవణమును నిప్పులో నెఱ్ఱఁగ కాల్చి దానిని ఆవునేతిలో ముంచి యాఘృతముచే ఆనువాసనవస్తిని చేయించిన వాతరోగములు హరించును.

జీవంత్యాద్యనువాసనవస్తికల్పము.

జీవంతీం మదనం మేదాం శ్రావణీం మధుకం బలామ్,
శతాహ్వర్షభకౌ కృష్ణాం కాకనాసాం శతావరీమ్. ౫౯
స్వగుప్తాం క్షీరకాకోలీం కర్కటాఖ్యాం శఠీం వచామ్,
పిష్ట్వా తైలఘృతంక్షీరే సాధయేత్తచ్చతుర్గుణే. ౬౦
బృంహణం వాతపిత్తఘ్నం బలశుక్రాగ్నివర్ధనమ్,
రజశ్శుక్రామయహరం పుత్రీయమనువాసనమ్. ౬౧

మనుబాల, ముంగపండు, మేద, బోడతరము, అతిమధురము చిట్టాముట్టి, సదాప, ఋషభకము, పిప్పళ్ళు, కాకిదొండ, పిల్లిపీచర, దిరదగొండి, క్షీరకాకోళి, కర్కాటకశృంగి, కచోరములు, వస, అనువానిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి నువ్వులనూనె, ఆవునెయ్యి, వీనిలోకలిపి నూనె, నెయ్యి వీనికి నాలుగింతలావుపాలుబోసి తైలపాకవిధిప్రకారము పక్వముచేయవలయును. దీనిచే అనువాసనవస్తిని ప్రయోగించిన శరీరమునకు పుష్టికలుగును. వాతపిత్తములు, రజోదోషము, శుక్రదోషము ఇవి హరించును. బలము, శుక్రము, జాఠరాగ్ని యివి వృద్ధిజెంది సంతానముకలుగును.

సైంధవాద్యనువాసనవస్తికల్పము.

సైంధవం మదనం కుష్ఠం శతాహ్వా నిచులో వచా,
హ్రీబేరం మధుకం భార్గీం దేవదారు సకట్ఫలమ్. ౬౨
నాగరం పుష్కరం మేదా చవికా చిత్రక శ్శఠీ,
విడంగాఽతివిషా శ్యామా హరేణుర్నీలినీ స్థిరా. ౬౩
బిల్వాజమోదచపలా దంతీ రాస్నా చ తైస్సమైః,
సాధ్య మేరండతైలం వా తైలం వా కఫరోగనుత్. ౬౪
వర్ధ్మోదావర్తగుల్మార్శఃప్లీహమేహాఢ్యమారుతాన్,
ఆనాహమశ్మరీం చాశు హన్యాత్తదనువాసనమ్. ౬౫

సైంధవలవణము, మ్రంగపండు, చెంగల్వకోష్టు, సదాప, నీరుప్రబ్బలి, వస, వట్టివేరు, అతిమధురము, గంటుభారంగి, దేవదారు, పెద్దదేకు, సొంటి, పుష్కరమూలము, మేద, చవ్యము, చిత్రమూలము, కచోరములు, వాయువిడంగములు, అతివస, నల్లసుగంధిపాల, రేణుకలు, పెద్దనీలి, ముయ్యాకుపొన్న, మారేడు, ఓమము పిప్పళ్ళు, దంతి, సన్న రాస్నము, వీనిని సమభాగములుగ గ్రహించి కల్కము చేసి ఆముదములోఁగాని నువ్వుల నూనెలోఁగాని చేర్చి చక్కఁగ కాఁచి దానిచే అనువాసనవస్తిని చేయించిన కఫరోగములు, వృద్ధి, ఉదావర్తము, గుల్మము, అర్శస్సు, ప్లీహము, ప్రమేహము, ఆఢ్యవాతము, కడుపుబ్బరము, మూత్రకృచ్ఛ్రము వీనినన్నిటి నతిశీఘ్రముగ హరించును. ఆముదము నువ్వులనూనె వీనిని సమభాగములుగ నొకటిగఁ జేర్చి అందులో సైంధవలవణాదికల్కమును కలిపి పక్వముచేయవలయునని కొందఱాచార్యులు వ్యాఖ్యానము చేసిరి.

## కఫహరానువాసనవస్తికల్పము.

సాధితం పంచమూలేన తైలం బిల్వాదినాఽథవా,
కఫఘ్నం కల్పయే త్తైలం ద్రవ్యై ర్వా కఫఘాతిభిః. ౬౬
ఫలై రష్టగుణై శ్శుక్తై స్సిద్ధ మన్వాసనం కఫే,

బిల్వాదిపంచమూలములతో పక్వము జేయఁబడినదియు, కఫమును పోఁగొట్టునదియునైన తైలముచే కఫమునం దనువాసనవస్తిని చేయించవలయును. లేక, కఫహారద్రవ్యములు మ్రంగపండు వీనికెనిమిదింతలు కలివీనితో పక్వముచేయఁబడిన తైలము కఫరోగి కనువాసనవస్తియందు శ్రేష్ఠము.

## మృదువస్తిదోషహరచికిత్స.

మృదువస్తిజడీభూతే తీక్ష్ణోఽన్యో వస్తి రిష్యతే. ౬౭
తీక్ష్ణైర్వికర్షితస్స్నిగ్ధో మధురశ్శిశిరో మృదుః,

మృదువుగనుండు వస్తికర్మ మధురముగ శీతలముగ నుండుటవలన నదియొకప్పుడు కోష్ఠమునందే స్థిరముగనుండినచో మరల తీక్ష్ణవస్తిని ప్రయోగించవలయును. గోమూత్రాదులచే చేయఁబడిన తీక్ష్ణవస్తికర్మలచే కోష్ఠము పీడింపఁబడియుండునపుడు స్నిగ్ధముగ మధురముగ శీతలముగనుండు మృదువస్తిని ప్రయోగించవలయును.

## తీక్ష్ణమృదువస్తిస్వరూపము.

తీక్ష్ణత్వం మూత్రపీల్వగ్ని లవణక్షారసర్షపైః. ౬౮
ప్రాప్తకాలం విధాతవ్యం ఘృతక్షీరై స్తు మార్దవమ్,

వస్త్యౌషధములకు గోమూత్రము, గోఁగు, చిత్రమూలము, లవణములు, క్షారములు, ఆవాలు, వీని చేరికవలన తీక్ష్ణత్వముకలుగును. ఆవునెయ్యి, ఆవుపాలు ఈ రెండు

చేరుటచే మృదుత్వము కలుగును; కావున యుక్తకాలములో క్రిందజెప్పబడురీతి బలదోషప్రకృత్యాద్యనుసారముగ పైతీక్ష్ణ మృదుద్రవ్యములనుజేర్చి వస్తికర్మను ప్రయోగించవలయును.

### వస్తిప్రయోగక్రమము.

బలకాలరోగదోషప్రకృతీః ప్రవిభజ్య యోజితో వస్తిః,
స్వైస్స్వైరౌషధవర్గైస్స్వాన్స్వాన్ రోగాన్నివర్తయతి. ౧౯

బలము, కాలము, రోగము; దోషములు, ప్రకృతి వీనిని చక్కగా పర్యాలోచించి ఆయారోగములకుఁదగిన యౌషధములతో పక్వముచేయఁబడిన వస్తికల్పములను ప్రయోగించిన ఆయారోగములు నివర్తించును.

### ఉష్ణశీతశరీరులకు వస్తికల్పము.

ఉష్ణార్తానాం శీతాన్ శీతార్తానాం తథా సుఖోష్ణాంశ్చ,
తద్యోగ్యౌషధయుక్తాన్ వస్తీన్ సంతర్క్య యుంజీత. ౨౦

ఆయారోగములకుఁదగిన యౌషధములతోఁగూడియుండు వస్తికల్పముల నుష్ణశరీరముగలవారికి శీతముగను, శీతపీడితులకు సుఖోష్ణముగను ప్రయోగించవలయును.

### బృంహణశోధనవస్తికర్మానర్హులు.

వస్తీన్న బృంహణీయాన్ దద్యాద్వ్యాధిషు విశోధనీయేషు,
మేదస్వినో విశోధ్యా యే చ నరాః కుష్ఠమేహార్తాః ౨౧
నక్షీణక్షతదుర్బలమూర్ఛితకృశశుష్కశుద్ధదేహానామ్,
దద్యాద్విశోధనీయాన్ దోషనిబద్ధాయుషో యే చ. ౨౨

వమనవిరేచన రూపములైన శోధనకర్మలకు యోగ్యమైన రోగములయందును, మాంసవృద్ధిగలవారియందును, కుష్ఠమేహరోగ పీడితులయందును బృంహణవస్తిని ప్రయోగింపంజనదు. క్షీణులు, క్షతులు, దుర్బలులు మూర్ఛజెందినవారు, కృశులు, శుష్కించినశరీరముగలవారు, రోగరహిత శరీరముగలవారు, దోషాధిక్యముగలవారు వీరికి శోధనీయ వస్తికర్మలను చేయంజనదు.

చతుర్థాధ్యాయము ముగిసెను.



సైంధవలవణము, మ్రంగపండు, చెంగల్వకోష్టు, సదాప, నీరుప్రబ్బలి, వస, వట్టివేరు, అతిమధురము, గంటుభారంగి, దేవదారు, పెద్దబేసు, సొంటి, పుష్కరమూలము, మేద, చవ్యము, చిత్రమూలము, కచోరములు, వాయువిడంగములు, అతివస, నల్లసుగంధిపాల, రేణుకలు, పెద్దపేలి, ముస్త్యాకపొన్న, మారేడు, ఓమము పిప్పళ్ళు, దంతి, సన్న రాస్నము, వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముచేసి ఆముదములోగాని నువ్వుల నూనెలోగాని చేర్చి చక్కగ కాచి దానిచే అనువాసనవస్తిని చేయించిన కఫరోగ ములు, వృద్ధి, ఉదావర్తము, గుల్మము, అర్శస్సు, ప్లీహము, ప్రమేహము, ఆఢ్యవాతము, కడుపుబ్బరము, మూత్రకృచ్ఛ్రము వీనినన్నిటి నతిశీఘ్రముగ హరించును. ఆముదము నువ్వులనూనె వీనిని సమభాగములుగ నొకటిగఁజేర్చి అందులో సైంధవలవణాదికల్క మును కలిపి పక్వముచేయవలయునని కొందఱాచార్యులు వ్యాఖ్యానము చేసిరి.

## కఫహరానువాసనవస్తికల్పము.

సాధితం పంచమూలేన తైలం బిల్వాదినాఽథవా,
కఫఘ్నం కల్పయే త్తైలం ద్రవ్యై ర్వా కఫఘాతిభిః. ౬౬
ఫలై రష్టగుణై శ్ఛాగ్మై స్సిద్ధ మన్వాసనం కఫే,

బిల్వాదిపంచమూలములతో పక్వముజేయఁబడినదియు, కఫమును పోఁగొట్టునది యునైన తైలముచే కఫమునం దనువాసనవస్తిని చేయించవలయును. లేక, కఫహరద్ర వ్యములు మ్రంగపండు వీనికెనిమిదింతలు కలవీనితో పక్వముచేయఁబడినతైలము కఫ రోగి కనువాసనవస్తియందు శ్రేష్ఠము.

## మృదువస్తిదోషహరచికిత్స.

మృదువస్తిజడీభూతే తీక్ష్ణోఽన్యో వస్తి రిష్యతే. ౬౭
తీక్ష్ణైర్వికర్షితస్స్నిగ్ధో మధురశ్శిశిరో మృదుః,

మృదువుగనుండు వస్తికర్మ మధురముగ శీతలముగ నుండుటవలన నదియొకప్పుడు కోష్ఠమునందే స్థిరముగనుండినచో మరల తీక్ష్ణవస్తిని ప్రయోగించవలయును. గోమూ త్రాదులచే చేయఁబడిన తీక్ష్ణవస్తికర్మలచే కోష్ఠము పీడింపఁబడియుండునపుడు స్నిగ్ధముగ మధురముగ శీతలముగనుండు మృదువస్తిని ప్రయోగించవలయును.

## తీక్ష్ణమృదువస్తిస్వరూపము.

తీక్ష్ణత్వం మూత్రపీల్వగ్ని లవణక్షారసర్షపైః. ౬౮
ప్రాప్తకాలం విధాతవ్యం ఘృతక్షీరై స్తు మార్దవమ్,

వస్త్యౌషధములకు గోమూత్రము, గోఁగు, చిత్రమూలము, లవణములు, క్షార ములు, ఆవాలు, వీని చేరికవలన తీక్ష్ణత్వముకలుగును. ఆవునెయ్యి, ఆవుపాలు ఈ రెండు

చేరుటచే మృదుత్వము కలఁగును; కావున యుక్తకాలములో క్రిందజెప్పబడురీతి బల దోష ప్రకృత్యాద్యనుసారముగ తైలీక్ష్ణ మృదుద్రవ్యములనుజేర్చి వస్తికర్మను ప్రయోగించవలయును.

## వస్తిప్రయోగక్రమము.

బలకాలరోగదోషప్రకృతీః ప్రవిభజ్య యోజితో వస్తిః,
స్వైస్స్వైరౌషధవర్గైస్స్వాన్స్వాన్రోగాన్నివర్తయతి. ౧౯

బలము, కాలము, రోగము; దోషములు, ప్రకృతి వీనిని చక్కఁగ పర్యాలోచించి ఆయారోగములకుఁదగిన యౌషధములతో పక్వముచేయఁబడిన వస్తికల్పములను ప్రయోగించిన ఆయారోగములు నివర్తించును.

## ఉష్ణశీతశరీరులకు వస్తికల్పము.

ఉష్ణార్తానాం శీతాన్ శీతార్తానాం తథా సుఖోష్ణాంశ్చ,
తదర్హౌషధయుక్తాన్ వస్తీన్ సంతర్క్య యుంజీత. ౨౦

ఆయారోగములకుఁదగిన యౌషధములతోఁగూడియుండు వస్తికల్పముల నుష్ణ శరీరముగలవారికి శీతముగను, శీతపీడితులకు సుఖోష్ణముగను ప్రయోగించవలయును.

## బృంహణశోధనవస్తికర్మానర్హులు.

వస్తీన్న బృంహణీయాన్ దద్యాద్వ్యాధిషు విశోధనీయేషు,
మేదస్వినో విశోధ్యాయే చ నరాః కుష్ఠమేహార్తాః ౨౧
నక్షీణక్షతదుర్బలమూర్ఛితకృశశుష్కశుద్ధదేహానామ్,
దద్యాద్విశోధనీయాన్ దోషనిబద్ధాయుషో యే చ. ౨౨

వమనవిరేచన రూపములైన శోధనకర్మలకు యోగ్యమైన రోగములయందును, మాంసవృద్ధిగలవారియందును, కుష్ఠమేహారోగ పీడితులయందును బృంహణవస్తిని ప్రయోగింపంజనదు. క్షీణులు, క్షతులు, దుర్బలులు మూర్ఛజెందినవారు, కృశులు, శుష్కించినశరీరముగలవారు, రోగరహిత శరీరముగలవారు, దోషాధిక్యముగలవారు వీరికి శోధనీయ వస్తికర్మలను చేయంజనదు.

చతుర్థాధ్యాయము ముగిసెను.

# పంచమాధ్యాయము.

వస్తికర్మను పైయధ్యాయమునఁజెప్పినవిధి ననుసరింపక వ్యత్యస్తముగ నుపయోగించినచో నీయోగాతియోగమిథ్యాయోగములంజేసి కొన్నియుపద్రవములు కల్గును. అయ్యవివస్తివ్యాపత్తు లనబడును. అట్టిరోగములకు దగినచికిత్సలను దెలియపరచుటకై వస్తికల్పాధ్యాయనిరూపణానంతరము వస్తివ్యాపత్సిద్ధ్యధ్యాయముచెప్పఁబడుచున్నయది.

## వస్తివ్యాపత్సిద్ధ్యధ్యాయప్రారంభము.

అథాతో వస్తివ్యాపత్సిద్ధిం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

వస్తికల్పాధ్యాయనిరూపణానంతరము శాస్త్రప్రకారము చేయఁబడనివస్తికర్మల వలన జనించు నుపద్రవములకు చికిత్సలను బోధించునట్టి వస్తికర్మవ్యాపత్సిద్ధియను నీయధ్యాయమును వివరించెదము.

## వస్తికర్మాయోగతదుపద్రవములు.

అస్నిగ్ధస్విన్నదేహస్య గురుకోష్ఠస్య యోజితః,
శీతోఽల్పస్నేహలవణద్రవ్యమాత్రోఘనోపి వా 1
వస్తిస్సంక్షోభ్య తం దోషం దుర్బలత్వాదనిర్హరన్,
కరోత్యయోగం తేన స్యాద్వాతమూత్రశకృద్గ్రహః. 2
నాభివస్తిరుజాదాహోహృల్లేపశ్వయథుర్గుదే,
కండూర్గండాని వైవర్ణ్యమరతిర్వహ్నిమార్దవమ్. 3

స్నేహస్వేదకర్మలను జేయించుకొనక యుండువాఁడును, కఠినకోష్ఠముగలవాఁడునునైన రోగికి శీతలంబును, స్నేహలవణములను కొంచెముగ చేర్పబడినదియును, ఔషధద్రవ్యములు స్వల్పపరిమాణముగ (లేక) అధికప్రమాణముగ చేర్చఁబడినదియునైన వస్తికషాయమును ప్రయోగించిన ఆకషాయము దుర్బలముగ నుండుట వలన దోషములను స్వస్థానమునుండి చలింపఁజేసి రోగమును నివర్తింపఁజేయనేరదు. దీనినే వస్తికర్మ అయోగమనియెదరు. ఇది అపానవాత మలమూత్ర ప్రతిబంధములు నాభి పొత్తికడుపు వీనియందుశూల, సర్వాంగతాపము, ఱొమ్మునొప్పి, గుదమునందు వాపు, దురద, పిటికలు, శరీరమునందు వికారవర్ణము, ఉత్సాహములేకుండుట, జాఠరాగ్ని మాంద్యము మొదలగు రోగములను కల్గించును.

## వస్తికర్మాయోగచికిత్స.

క్వాథద్వయం ప్రాగ్విహితం మధ్యదోషేఽతిసారిణి,
ఉష్ణస్య తస్మాద్ధ్యేకస్య తత్ర పానం ప్రశస్యతే. ౪
ఫలవర్త్యస్తథా స్వేదాః కాలం జ్ఞాత్వా విరేచనమ్,
బిల్వమూలత్రివృద్దారుయవకోలకులత్థవాన్. ౫
సురాదిమాంస్తత్ర వస్తిస్స ప్రాక్పేష్యస్త మానయేత్,

పైనిచెప్పిన వస్తికర్మాయోగమునకు అతిసార చికిత్సాప్రకరణమున మధ్యదోషముగల అతిసారరోగమునకు చెప్పియుండు భూతీకపిప్పల్యాదికషాయము, బిల్వధనికాది కషాయము అనునీరెంటిలో దేనినైన నొక కషాయమును ఉష్ణముగ పానము చేయించవలయును. మఱియు ఫలవర్తులు నానావిధస్వేదకర్మలు అవస్థానుగుణముగవిరేచనము వీనిని చేయించవలయును. మారేడువేళ్లు, తెగడ, దేవదారు, యవలు, రేగు, ఉలవలువీనితోఁ గూడినవస్తి, సురయనుమద్యముతోఁగూడినవస్తి, వీనిలోపూర్వాధ్యాయములో "బలాంగుడూచీ" త్యాది శ్లోకములలో సర్వరోగహరవస్తి కల్పమునకు వచించియుండు యవాన్యాదికల్కమును కలిపి ప్రయోగించవలయును. ఇటులచేసిన వస్త్యయోగముచే స్వస్థానమునందుండి చలించియుండుదోషము బైలువెడలును.

## దోషాధిక్యాదులయందు అల్పవీర్యవస్తిజనితోపద్రవము.

యుక్తోఽల్పవీర్యో దోషాఢ్యే రూక్షే క్రూరాశయేఽథవా. ౬
వస్తిర్దోషావృతో రుద్ధమార్గో రుంధ్యాత్సమీరణమ్,
స విమార్గోఽనిలః కుర్యాదాధ్మానం మర్మపీడనమ్. ౭
విదాహం గుదకోష్ఠస్య ముష్కవంక్షణవేదనామ్,
రుణద్ధి హృదయం శూలైరితశ్చేతశ్చ ధావతి. ౮

దోషాధిక్యముగలవారికిని లేక కఠినకోష్ఠముగలవారికిని అల్పవీర్యముగలవస్తిని ప్రయోగించిన నది వాతాదిదోషములచే నావరింపఁబడి స్తబ్ధమై వాతమును అడ్డగించును. అటుల తనమార్గ మడ్డగింపఁబడియుండుటవలన ఆవాతము విరుద్ధమార్గముగ సంచరించుచు కడుపుబ్బరము, మర్మస్థానములయందుబాధ, గుద కోష్ఠములయందు మంట, వృషణములయందును గజ్జలయందును శూల, ఉమ్మడచుట వీనిని కలుఁగఁజేయుచు శరీరమునం దచటచట సంచరింపుచుండును.

## అల్పవీర్యవస్తిప్రయోగజనితరోగమునకు నిరూహవస్తి.

స్వభ్యక్తస్విన్నగాత్రస్య తత్ర వర్తిం ప్రయోజయేత్.

బిల్వాదిశ్చ నిరూహస్స్యాత్తైలుసర్షపమూత్రవాన్. ౯
సరళామరదారుభ్యాం సాధితం వాఽనువాసనమ్,

పైజెప్పిన యవస్థావిశేషమునందు రోగి శరీరమునకు అభ్యంగస్వేదకర్మలను చేయించి ఫలవర్తిని ప్రయోగించవలయును. బిల్వాదులతో పక్వముచేయఁబడిన నిరూహవస్త్యౌషధములలో గోఁగు, ఆవాలు, గోమూత్రము వీనిని కలిపి నిరూహవస్తిని ప్రయోగించవలయును. సరళదారు, దేవదారు వీనితో పక్వముచేయఁబడిన తైలముచే అనువాసనవస్తిని చేయించవలయును.

## న్యూనాధికవస్తిప్రయోగజనితోపద్రవములు.

కుర్వతో వేగసంరోధం పీడితో వాఽతిమాత్రయా. ౧౦
అస్నిగ్ధలవణోష్ణో వా వస్తిరల్పోఽల్పభేషజః,
మృదుర్వా మారుతేనోర్ధ్వం విక్షిప్తో ముఖనాసికాత్. ౧౧
నిరేతి మూర్ఛాహృల్లాసతృడ్దాహాదీన్ ప్రవర్తయన్,

మలమూత్రాది వేగముల నడ్డగించువానికి వస్తికర్మను ప్రయోగించినను, లేక వస్తికర్మను అధికముగ చేయించినను, స్నేహము లవణముచేర్చక ఉష్ణముగ వస్తికర్మను ప్రయోగించినను, లేక స్వల్పప్రమాణముగ లేక అల్పవీర్యముగల యౌషధములు గలదిగనుండు వస్తికర్మను ప్రయోగించినను, లేక మృదువైన వస్తికర్మను ప్రయోగించినను ఆవస్త్యౌషధములు వాతముచే ఊర్ధ్వభాగమునకు త్రోయఁబడినవై మూర్ఛ, హృల్లాసము, దప్పి, సర్వాంగతాపము మొదలగు నుపద్రవములను గలుగఁజేయుంటయే గాక నోరు ముక్కు వీనినుండి బైలువెడలును.

## న్యూనాధికవస్త్యాదిజనితోపద్రవచికిత్స.

మూర్ఛావికారం దృష్ట్వాఽస్య సించేచ్ఛీతాంబునా ముఖమ్.
వ్యజేదాక్లమనాశాచ్చ ప్రాణాయామం చ కారయేత్,
పృష్ఠపార్శ్వోదరం మృజ్యాత్కరైరుష్ణైరధోముఖమ్. ౧౩
కేశేషూత్క్షిప్య ధున్వీత భీషయేద్వ్యాళదంష్ట్రిభిః,
శస్త్రోల్కారాజపురుషైర్వస్తిరేతి తథా హ్యధః. ౧౪
పాణివస్త్రైర్గళాపీడం కుర్యాన్నమ్రియతే యథా,
ప్రాణోదాననిరోధాద్ధి సుప్రసిద్ధతరాయనః. ౧౫
అపానః పవనో వస్తిం తమాశ్వేవా పకర్షతి,
కుష్ఠక్రముకకల్కం చ పాయయేత్తాఽమ్లసంయుతమ్. ౧౬

ఔష్ణ్యాత్తైక్ష్ణ్యాత్సరత్వాచ్చ వస్తిం సోఽస్యానులోమయేత్,
గోమూత్రేణ త్రివృత్పథ్యాకల్కం చాధోఽనులోమనమ్. ౧౭
పక్వాశయస్థితే స్విన్నే నిరూహో దశమూలికః,
యవకోలకుళుత్థైశ్చ విధేయో మూత్రసాధితైః. ౧౮
వస్తిర్గోమూత్రసిద్ధైర్వా సామృతావంశపల్లవైః,
పూతీకరంజత్వక్పత్రశఠీదేవాహ్వరోహిషైః, ౧౯
సతైలగుడసింధూత్థవిరేకౌషధకల్కవాన్,
బిల్వాదిపంచమూలేన సిద్ధో వస్తి రురస్స్థితే. ౨౦
శిరస్స్థేనావనం ధూమః ప్రచ్ఛాద్యం సర్షపైశ్శిరః,

రోగికి వస్తికర్మవిధిప్రకారము ప్రయోగించకుండుటవలన జనించు మూర్ఛావికారములను చక్కఁగ తెలిసికొని వానియొక్క ముఖమునందు శీతోదకమును చల్లవలయును. బడలికశమించువరకు విసనకఱ్ఱ మొదలగువానిచే విసరవలయును. వానిని ప్రాణాయామ (శ్వాసబంధ) మొనర్చునటుల చేయవలయును. నిప్పులో చేతులనుకాఁచి వేడిగనున్న యాచేతులతో నడుము ప్రక్కలు కడుపు వీనియందు మెల్లగ నధోముఖముగ చరమవలయును. మఱియు వానిని బోరగిలపరుండఁజేసి వానివెండ్రుకలఁబట్టుకొని పైకెత్తి విదిలించవలయును. పాము, కోరలుకల దుష్టజంతువులు, ఆయుధము, కొరవి, రాజభటులు మొదలగువానిచే భయపరచవలయును. ఇటులజేసిన పైభాగమునందుఁజేరియుండు నిరూహవస్త్యౌషధము క్రిందికిదిగును. మఱియు వానికి ప్రాణమున కపాయము గలుగనీయక చేతితో కంఠమును పట్టవలయును. లేక వస్త్రముచే కంఠమును కట్టవలయుం. ఇటులజేసిన ప్రాణోదానవాతములమార్గము లడ్డగింపఁబడును. అందువలన అపానవాతము స్పష్టమైన తనమార్గమునందు సంచరించుచు పైభాగమును జెందియుండు నావస్తిని క్రిందిభాగమునకు శీఘ్రముగలాగికొనును. చెంగల్వకోష్టు పోఁకలువీనిని చక్కఁగనూరి కల్కముచేసి కలిలో కలిపి పానముచేయించవలయును. ఇటులజేసిన యాకల్కము ఉష్ణముగను, తీక్ష్ణముగను, శీఘ్రముగ వ్యాపించుస్వభావముగలదిగను నుండుటవలన నావస్తిని క్రిందిభాగమునకుదెచ్చును. తెగడ, కరక్కాయ, వీనినినూరి గోమూత్రములోకలిపి పానముచేయించిననావస్తి క్రిందికిదిగును. ఆవస్తిపక్వాశయమునందుండిన స్వేదకర్మనుచేయించి దశమూలములతో పక్వముచేయఁబడిన నిరూహవస్తిచేతగాని, గోమూత్రములో యవలు, రేఁగుపండు, ఉలవలు వీనిని పక్వముచేసి దానిచేతగాని, లేక గోమూత్రములో తిప్పతీఁగె, వెదురుచిగుళ్లు, కలుగ్రానుగు, లవంగపుచెక్క, ఆకు

పత్రి, కచోరములు, దేవదారు, కామంచిగడ్డి, వీనిని చేర్చి పక్వముచేసి అందులో నువ్వులనూనె, బెల్లము సైంధవలవణము, విరేచనౌషధకల్కము, వీనినికలిపిదానిచేఁగాని నిరూహవస్తిని ప్రయోగించవలయును. ఆవస్తి ఆమాశయమునందుండినచో బిల్వాదిపంచ మూలములతో పక్వముచేయబడిన, క్వాథముతో వస్తిని ప్రయోగించవలయును. శిర మును జేరియుండినచో నస్యము, ధూమము, శిరమునకు ఆవాలపట్టు వీనిని చేయించ వలయును.

## వస్తికర్మాతియోగచికిత్స.

వస్తి రత్యుష్ణతీక్ష్ణామ్లఘనోఽతిస్వేదితస్య వా. ౨౧
అల్పే దోషే మృదౌ కోష్ఠే ప్రయుక్తో వా పునఃపునః,
అతియోగత్వమాపన్నో భవేత్కుక్షిరుజాకరః. ౨౨
విరేచనాతియోగేన స తుల్యాకృతిసాధనః,

మిగుల నుష్ణముగను తీక్ష్ణముగను పుల్లగను గట్టిగనునుండు ఔషధములచే చేయఁ బడినవస్తి; స్వేదకర్మను అధికముగ చేయించుకొనిన వానికిప్రయోగించిన వస్తి లేక దోషము స్వల్పముగనుండు వానికిఁగాని మృదుకోష్ఠము గలవానికిఁగాని ప్రయోగించిన వస్తి; పలుమారు ప్రయోగించిన వస్తి; ఇవి అతియోగమును జెంది కడుపునొప్పిని కలుగఁ జేయును. మఱియు దీనియందు విరేచనాతియోగమునకుచెప్పియుండు లక్షణము లన్నియు కలుగును. కావున విరేచనాతియోగమునకు చెప్పియుండు చికిత్సలనే చేయ వలయును.

## క్షారామ్లాదివస్తిజనితోపద్రవచికిత్స.

వస్తిః క్షారామ్లతీక్ష్ణోష్ణలవణః పైత్తికస్య వా. ౨౩
గుదం దహేత్ లిఖేత్ క్షిణ్వేత్ కరోత్యస్య పరిస్రవమ్,
సవిదగ్ధం స్రవత్యస్రం వర్ణైః పిత్తం చ భూరిభిః. ౨౪

బహుశశ్చాతివేగేన మోహం గచ్ఛతి సోఽసకృత్,
రక్తపిత్తాతిసారఘ్నీ క్రియా తత్ర ప్రశస్యతే. ౨౫
దాహాదిషు త్రివృత్కల్కం మృద్వీకావారిణా పిబేత్,
తద్ధి పిత్తశకృద్వాతాన్ హృత్వా దాహాదికాన్ జయేత్. ౨౬
విశుద్ధశ్చ పిబేచ్ఛీతాం యవాగూం శర్కరాయుతామ్,
యుంజ్యాద్వాతిపరిక్తస్య క్షీణవిట్కస్య భోజనమ్. ౨౭
మాషయూషేణ కుల్మాషాన్ పానం దధ్యథవా సురామ్,

పిత్తప్రకృతి గలవానికి ప్రయోగించిన వస్తి; కారముగను పుల్లగను తీక్ష్ణముగను ఉష్ణముగను లవణముగను నుండు వస్తి, ఇది గుదస్థానమున మంటబుట్టించుచు గుదద్వారమును చీల్చుచు బాధగల్గించి స్రవింపజేయును. మఱియు నట్టివానికి విదగ్ధాజీర్ణముతోడ రక్తము స్రవించును. అనేకవర్ణములలో పలుమారు పిత్తము అతివేగముతో వెడలుచుండును. పలుమారు మూర్ఛ లగును. ఇట్టియుపవస్థయందు రక్తపిత్తము, రక్తాతిసారము వీనికిచెప్పియుండు చికిత్సలను జేసిన హితముకలుగును. సర్వాంగతాపము, గుదమునందు మంట మొదలగు నుపద్రవములుకలిగిన చలచేసిన తెగడకల్కమును ద్రాక్షపండురసములో కలిపి పానము చేయించవలయును. ఇది పిత్తము మలము వాతము వెడలించి మంట మొదలగు నుపద్రవములను పోకడచును. పిదప శుద్ధిజెందినకోష్ఠముగలవానికి గంజిని పంచదారతోడ శీతముగ పానము చేయించవలయును. అధికవిరేచనమగుటచే మలము క్షయించియుండిన అట్టివానికి కాఱుమినుముల గుగ్గిళ్లనుగాని మినుపకట్టుతో అన్నమును గాని భుజింపజేయవలయును. పెరుగునైనను సురయనుమద్యమునైనను పానము చేయించవలయును.

సిద్ధి ర్వస్త్యాపదా మేవం స్నేహవ స్తేస్తు వక్ష్యతే. ౨౮

ఇట్టుల నిరూహవస్తి వ్యాపత్తులకు చికిత్సలు చెప్పబడినవి. ఇక అనువాసన వస్తుల వ్యాపత్తులకు చికిత్సలు చెప్పబడుచున్నవి.

## అనువాసనవస్తివ్యాపచ్చికిత్స.

శీతోఽల్పోవాఽధికే వాతే పిత్తేఽత్యుష్ణః కఫే మృదుః,
అతిభుక్తేగురుర్వర్చస్సంచయేఽల్పబల స్తథా. ౨౯
దత్తస్తై త్వావృతస్నేహః నాయాత్యభిభవాదపి,
స్తంభోరుసదనాధ్మానజ్వరశూలాంగమర్దనైః ౩౦
పార్శ్వరుగ్వేష్టనై ర్విద్యాద్వాయునా స్నేహమావృతమ్,
స్నిగ్ధామ్లలవణోష్ణై స్తం రాస్నాపీతద్రుతైలికైః. ౩౧
సౌవీరకసురాకోలకులుత్థయవసాధితైః,
నిరూహైర్నిర్హరేత్సమ్యక్సమూత్రైః పంచమూలకైః. ౩౨
తాభ్యా మేవ చ తైలాభ్యాం సాయం భుక్తేఽనువాసయేత్,

వాతము అధికముగనుండుతరి శీతముగనైనను స్వల్పముగనైనను నుండు ఔషధమునుగూర్చి వస్తికర్మ జేసినను, పిత్తప్రకోపమున మిక్కుటియుష్ణమైన యౌషధముచే వస్తికర్మ జేసినను, కఫాధిక్యమున మృదువైనవస్తిని ప్రయోగించినను, మిక్కుటముగభుజించిన

పుడు గురుగుణముకలవస్తిని ఉపయోగించినను, మలము మిక్కిలి సంచిత
నవుడు పరిమాణముచేనైనను వీర్యముచేనైనను స్వల్పబలమైనవస్తిని ప్రయో
ఆయోగమునుజెంది శీతాదికారణములవలన వాతాదిదోషములచేనావరింప
మార్గమునుండి బైలువెడలకుండును. దానివలన స్తబ్ధత్వము, తొడలయందు
కడుపుబ్బరము, జ్వరము, శూల, శరీరమంతటనొప్పి, పార్శ్వశూల యీరోగ
లుజనించును. అట్లుజనించిన స్నేహవస్తివాతముచే నావరింపఁబడినదని తెలిసి
మగను పుల్లగను ఉప్పగను ఉష్ణముగనుండు నిరూహవస్తిని ప్రయోగము చేసి
నవస్తిని వెలిపరచవలయును. సన్నరాస్నతైలము, మ్రానిపసుపుతైలము, వీని తో
గను, కలి, సురయనుమద్యము, రేఁగు, ఉలవలు, యవలు వీనితో పక్వము చే
గను, గోమూత్రము పంచమూలకషాయము అనువానితోఁగూడినవిగనునుండు
వస్తికర్మలచే పైస్నేహవస్తిని చక్కఁగ వెలిపరచుటయేగాక సన్నరాస్నపుతైల
పసుపుతైలముచేఁగాని దోషాద్యనుగుణముగ సాయంకాల భోజనానంతరము
వస్తిని ప్రయోగించవలయును.

## పిత్తావృతస్నేహవస్తివ్యాపచ్చికిత్స.

తృడ్దాహరాగసమ్మోహవైవర్ణ్యతమకజ్వరైః,
విద్యాత్పిత్తావృతం స్వాదుతిక్తైస్తం భవస్త్రిహరేత్,

దప్పి, సర్వాంగతాపము, అపథ్యవస్తువులయందిచ్ఛ, మోహము, వి
తమకశ్వాసము, జ్వరము అనునీరోగములు కలిగియుండిన యెడల స్నేహవ
నావరింపఁబడియున్నదని తెలిసికొని మధురముగ చేఁదుగనుండు ద్రవ్య
పక్వముచేయఁబడిన వస్తికషాయముచే పైస్నేహవస్త్యౌషధమును బైలు
యును.

## శ్లేష్మావృతస్నేహవస్తిచికిత్స.

తంద్రాశీతజ్వరాలస్యప్రసేకారుచిగౌరవైః,
సమ్మూర్ఛాగ్లానిభిర్విద్యాచ్ఛ్లేష్మణా స్నేహమావృతమ్,
కషాయతిక్తకటుకైః సురామూత్రోపసాధితైః,
ఫలతైలయుతైస్సామ్లైర్వస్తిభిస్తం వినిర్హరేత్,

తంద్ర, శీతజ్వరము, ఉత్సాహములేకుండుట, నోటియందు నీరూరు
గురుత్వము, మూర్ఛ, బడలిక ఇవిగలిగియుండినచో స్నేహవస్తి కఫముచే నా
యున్నదని తెలిసికొని వగరు కారము చేదు ఈరసములుకలవియైనను
మద్యము గోమూత్రము వీనితో పక్వముజేయఁబడినవియును ఉష్ణవీర్యముగల

మొదలగు ఫలములయొక్క తైలముతోఁగూడినవియును నైన వస్తికర్మల ప్రయోగము చేసి స్నేహవస్తిని బయలువెడలింపఁ జేయవలయును. "ఫలతైలయుతైః" అను మూల శ్లోకవాక్యమునకు ప్రసంగపండు, నువ్వులనూనె వీనిని వస్తికషాయములో చేర్చవలయు నని కొందఱు వ్యాఖ్యానము చేసిరి.

### అన్నావృతస్నేహవస్తిచికిత్స

ఛర్దిమూర్ఛారుచిగ్లానిశూలనిద్రాంగమర్దనైః. ౩౬
ఆమలింగైస్సదాహైస్తం విద్యాదత్యశనావృతమ్,
కటూనాం లవణానాం చ క్వాథైశ్చూర్ణైశ్చ పాచనమ్. ౩౭
మృదుర్విరేకస్సర్వం చ తత్రామవిహితం హితమ్,

వాంతి, మూర్ఛ, అరుచి, బడలిక, శూల, నిదుర, శరీరమంతటనొప్పి, సర్వాంగతాపము మొదలగు అజీర్ణలక్షణంబులు కలిగియుండినయెడల స్నేహవస్త్యౌషధము అధికాహారముచే నావరింపఁబడియున్నదని తెలిసికొని కారముగ, ఉప్పగనుండు ద్రవ్యములకషాయములచేతను చూర్ణములచేతను స్నేహము జీర్ణమగునటులచేసి మృదువైన విరేచనమును, అజీర్ణమునకుచెప్పియుండు చికిత్సలను చేయించవలయును.

### మలావృతస్నేహవస్తిచికిత్స.

విణ్మూత్రానిలసంగార్తిగురుత్వాధ్మానహృద్గ్రహైః, ౩౮
స్నేహం విడావృతం జ్ఞాత్వా స్నేహస్వేదైస్సవర్తిభిః,
శ్యామాబిల్వాదిసిద్ధైశ్చ నిరూహైస్సానువాసనైః. ౩౯
నిర్హరేద్విధినా సమ్యగుదావర్తహరేణ చ,

మలమూత్ర అపానవాతములుబంధింపబడుట, శూల, గురుత్వము, కడుపుబ్బరము, ఱొమ్ముపట్టు అనునీయుపద్రవములు గలిగియుండినచో స్నేహవస్తి మలముచే నావరింపఁబడినదని తెలిసికొని స్నేహస్వేదకర్మలు, వర్తులు, తెగడ, బిల్వాదిగణద్రవ్యములువీనితోపక్వముచేయఁబడిననిరూహవస్త్యౌషధము, అనువాసనవస్త్యౌషధము, ఉదావర్తమును పోఁగొట్టునట్టిచికిత్సలువీనిని ప్రయోగించి స్నేహవస్తిని బైలుపరచవలయును.

### అభుక్తాదులకు స్నేహవస్తిజనితోపద్రవచికిత్స.

అభుక్తే శూనపాయౌ వా పేయామాత్రాశితస్య చ. ౪౦
గుదే ప్రణిహితస్స్నేహో వేగాద్ధావత్యనావృతః,
ఊర్ధ్వం కాయం తతః కంఠాదూర్ధ్వేభ్యః ఖేభ్య ఏత్యపి. ౪౧

మూత్రశ్యామాత్రివృత్సిద్ధో యవకోలకులత్థవాన్,
తత్సిద్ధతైలో దేయస్స్యాన్నిరూహస్సానువాసనః. ౪౨
కంఠా దాగచ్ఛతః స్తంభకంఠగ్రహవిరేచనైః,
ఛర్దిఘ్నైభిః క్రియాభిశ్చ తస్య కుర్యాన్నిబర్హణమ్. ౪౩

ఆహారమును భుజింపకయుండువానికి స్నేహవస్తిని ప్రయోగించినను, గుదము ఉబ్బియుండువానికి స్నేహవస్తిని ప్రయోగించినను, పేయమను గంజిని మాత్రము భుజించినవానికి గుదమున స్నేహవస్తిని ప్రయోగించినను, అది అతివేగముతో అడ్డము లేక శరీరమంతట వ్యాపించి ఊర్ధ్వశరీరమును జెంది కంఠమునకు పైభాగమునందుండు నాసికాది ద్వారము మొదలగు రంధ్రములనుండి బైలువెడలును. దీనియందు గోమూత్రము, నల్లతెగడ, తెల్లతెగడ, యవలు, రేగు, ఉలవలు, వీనికషాయముతో పక్వము చేయబడిన తైలముచే నిరూహానువాసన వస్తికర్మలను చేయించవలయును. మఱియు పైస్నేహము కంఠమార్గముగ బైలువెడలిన కంఠగ్రహము, వాంతిని పోగొట్టునట్టి చికిత్సలు, విరేచనము మొదలగు చికిత్సలచే స్నేహము కంఠమును జేరకుండునటుల జేయవలయును.

### వస్తికర్మయందపక్వస్నేహనిషేధము.

నా పక్వం ప్రణయేత్స్నేహం గుదం స హ్యుపలింపతి,
తతః స్యాత్సతృణ్మోహకండూశోఫా క్రియాత్ర వా. ౪౪
తీక్ష్ణో వస్తిస్తథా తైలమర్కపత్రరసే శృతమ్,

చక్కగ పాకమును జెందకుండునట్టి స్నేహమును వస్తికర్మయందు ప్రయోగింపంజనదు. అటుల ప్రయోగించిన నది గుదమునంటుకొని దప్పి, మోహము, దురద, వాపు మొదలగునుపద్రవములను కలుగజేయును. దీనియందు తీక్ష్ణమైన వస్తికర్మలను, ప్రయోగించవలయును. జిల్లేడాకులతో కాచబడిన తైలమును గుదమునకు పూయవలయును.

### నిశ్శేషవస్తిప్రయోగజనితోపద్రవచికిత్స.

అనుచ్ఛ్వాస్య తు బద్ధే వా దత్తే నిశ్శేష ఏవ వా. ౪౫
ప్రవిశ్య క్షుభితో వాయుశ్శూలతోదకరో భవేత్,
తత్రాభ్యంగో గుదే స్వేదే వాతఘ్నాన్యశనాని చ ౪౬

వస్తియంత్రముయొక్క ద్వారము మూయఁబడియుండునపుడు వస్తికర్మను ప్రయోగించినను, లేక వస్తియంత్రమునందలి కషాయాదులను నిశ్శేషముగ ప్రయోగించినను, లోన వాతము ప్రకోపించి శూలలను పోట్లను కలుగఁజేయును. దీనియందు గుద

మున కభ్యంగస్వేదకర్మలను చేయించుటయేగాక వాతహరమైన అన్నపానాదుల నిప్పించవలయును.

## వేగముగ వస్తికర్మను ప్రయోగించుటవలన జనించు నుపద్రవముల చికిత్స.

ద్రుతం ప్రణీతే నిష్కృష్టే సహసోత్క్షిప్త ఏవ వా,
స్యాత్కటీగుదజంఘోరువస్తిస్తంభార్తిభేదనమ్ ౪౭
భోజనం తత్ర వాతఘ్నం స్వేదాభ్యంగాస్సవస్తయః,

వస్తినిశీఘ్రముగ నీడ్చినను, పైకెత్తినను, నడుము, గుదము, పిక్కలు, తొడలు, పొత్తికడుపు వీనియందు స్తబ్ధత్వము, శూల, చీల్చునటుల యుపద్రవము ఇవి జనించును. దీనికి వాతహరమైన భోజనము, స్వేదము, అభ్యంగము వస్తికర్మలు ఈచికిత్సలను చేయవలయును.

## వస్తియంత్రమునుచక్కఁగ ప్రయోగింపకుండుటచే జనించునుపద్రవముల చికిత్స.

పీడ్యమానేఽంతరా ముక్తేగుదే ప్రతిహతోఽనిలః. ౪౮
ఉరశ్శిరోరుజం సాదమూరోశ్చజనయేద్బలీ,
వస్తిస్స్యాత్తత్ర బిల్వాదిఫలైశ్శ్యామాదిమూత్రవాన్. ౪౯

వస్తియంత్రము గుదమునం దునిచి ప్రయోగించునపుడు మధ్యకాలమున యంత్రమును వదలిపెట్టిన వాతము గుదములో దుష్టంబై రొమ్మునొప్పి తలనొప్పి తొడలయందు దౌర్బల్యము వీనిని కలుగజేయును. దీనియందు బిల్వాదిగణద్రవ్యములు, మ్రంగపండు, తెగడ, గోమూత్రము, వీనితో పక్వము చేయఁబడినకషాయముచే వస్తిని ప్రయోగించవలయును.

## వస్తిని మిక్కుటముగ ప్రయోగించుటచే జనించు నుపద్రవముల చికిత్స.

అతిప్రపీడితః కోష్ఠేతిష్ఠత్యాయాతి వా గళమ్,
తత్ర వస్తిర్విరేకశ్చ గళపీడాదికర్మ చ. ౫౦

వస్తియంత్రమును అధికముగనీడ్చి ప్రయోగించిన ఆవస్త్యౌషధము కోష్ఠమును గాని కంఠమునుగాని చేరును. దీనియందు వస్తికర్మ విరేచనము కంఠపీడనము మొదలగు చికిత్సలను చేయవలయును.

## వమనాదికర్మవిశుద్ధరక్షణావశ్యకత్వము.

వమనాద్యైర్విశుద్ధం చ క్షామదేహబలానలమ్,
యథాండం తరుణం పూర్ణం తైలపాత్రం యథా తథా. ౫౧
భిషక్ప్రయత్నతో రక్షేత్సర్వస్మాదపవాదతః,

"అపుడు జనించిన గ్రుడ్డును మిగులజాగరూకతతో రక్షించునటులను, నూనెచే పూర్ణంబైయుండు పాత్రమును కడుప్రయత్నముతో రక్షించునటులను" వమనవిరేచనాది క్రియలచే శుద్ధిజెందిన శరీరముగలవానిని కృశించిన శరీరముగలవానిని శరీరబలము జాఠరాగ్నిబలము ఇవి తగ్గియుండువానిని మిక్కిలి ప్రయత్నముతో రక్షించవలయును.

వమనాదికర్మలచే శుద్ధశరీరికి రసోపయోగక్రమము.

దద్యాన్మధురహృద్యాని తతోఽమ్లలవణౌ రసౌ. ॥౨
స్వాదుతిక్తౌ తతో భూయః కషాయకటుకౌ తతః,
అన్యోన్యప్రత్యనీకానాం రసానాం స్నిగ్ధరూక్షయోః. ॥౩
వ్యత్యాసాదుపయోగేన క్రమాత్తం ప్రకృతిం నయేత్,

వమనాదికర్మలచే శుద్ధశరీరుఁడును దుర్బలుఁడునునైనవానికి తొలుత మధురముగను చేఁదుగను, మనసున కింపుగనునుండురసముల నిప్పించవలయును. తర్వాత కషాయకటురసములను, పిదప మధురతిక్తరసములను, పదంపడి అమ్లలవణరసములను ఇప్పించవలయును. ఇటుల పరస్పరవిరుద్ధములుగనుండురసములను మార్చిమార్చి పలుమారు ప్రయోగించుటవలనను, పరస్పరవిరుద్ధములగునట్టి స్నిగ్ధరూక్షయోగములనుమార్చి ప్రయోగించుటవలనను రోగికి మునుపటివలె శరీరస్వాస్థ్యమును గలుగజేయవలయును.

సర్వాం సహాస్థిరబలః విజ్ఞేయః ప్రకృతిం గతః ॥౪

పథ్యాపథ్యవస్తువులను భక్షించి వానిని జీర్ణముచేసికొనుటకు శక్తి, తగినజాఠరాగ్ని బలమునుకలవాఁడును దృఢమైన శరీరబలముగలవాఁడు నగుపురుషుఁడు తన స్వభావరీతిని జెందినవాఁడని తెలిసికొనవలయును.

పంచమాధ్యాయము ముగిసెను.

# షష్ఠాధ్యాయము.



అవ. పూర్వాధ్యాయములయందు ప్రశస్తౌషధములను అక్షప్రమాణముగను, కర్షప్రమాణముగను, ఇప్పించవలయుననిచెప్పబడియున్నది. ప్రశస్తౌషధస్వరూపమును, కర్షాది ప్రమాణస్వరూపంబును తెలియనియెడల ఔషధమును ప్రయోగించుటకు శక్యము కానేరదు. కాఁబట్టి ప్రశస్తౌషధములు కర్షాదిప్రమాణములు వీనిలక్షణములను తెలియపరచుటకై భేషజకల్పాధ్యాయము చెప్పఁబడుచున్నయది.

భేషజకల్పాధ్యాయప్రారంభము.

సూ. అథాతో భేషజకల్పం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

వస్తివ్యాపత్సిద్ధ్యధ్యాయనిరూపణానంతరము ఔషధముల కల్పములను తెలియపరచునట్టి భేషజకల్పమను నీయధ్యాయమును వివరించెదము.

ప్రశస్తౌషధస్వరూపము.

ధన్వసాధారణే దేశే సమే సన్మృత్తికే శుచౌ,
శ్మశానచైత్యాయతనశ్వభ్రవల్మీకవర్జితే. ౧
మృదౌ ప్రదక్షిణజలే కుశరోహిషసంస్తృతే,
అఫాలకృష్టేఽనాక్రాంతే పాదపైర్బలవత్తరైః. ౨
శస్యతే భేషజం జాతం యుక్తం వర్ణరసాదిభిః,
జంత్వజగ్ధం దవాదగ్ధమవిదగ్ధం చ వైకృతైః. ౩
భూతైశ్ఛాయాతపాంబ్వాద్యైర్యథాకాలం చ సేవితమ్,
అవగాఢమహామూలముదీచీం దిశ మాశ్రితమ్. ౪

మిట్టపల్లములు లేక సమముగను ప్రశస్తమైనమట్టితోఁగూడినదియు, పరిశుద్ధమైనదియు, శ్మశానము చైత్యము దేవాలయము బొరియలు పుట్టలు ఇవిలేనిదియు, మృదుస్పర్శముగలదియు, మంచి యుదకముతోఁగూడినదియు, కుశగడ్డి కామంచిగడ్డి యివిగలదియు, దున్నకుండునదియు, గొప్పవృక్షములచేఁ గప్పఁబడకుండునదియు నైన జాంగలదేశ సాధారణదేశములయందు జనించినదిగను, మంచివర్ణరసములతోఁగూడినదిగను, జంతువులచేభక్షింపఁబడనిదిగను, కార్చిచ్చుచేకాల్చఁబడనిదిగను, వికృతభూతంబులచే చెరచఁబడనిదిగను, యుక్తకాలంబులో నీడ యెండ ఉదకము దలగునవి

కలిగియుండునదిగను, భూమికిలోపల లోతునదిగియుండు గొప్పవేరుతోఁగూడినదిగను, ఉత్తరదేశమునందు వ్యాపించెడునదిగనునుండు ఓషధి శ్రేష్ఠంబు.

### ఓషధిగ్రహణక్రమము.

అథ కల్యాణచరిత శ్శ్రాద్ధశ్శుచిరుపోషితః,
గృహ్ణీయాదౌషధం సుస్థం స్థితం కాలే చ కల్పయేత్. ౫
సక్షీరం తదసంపత్తావనతిక్రాంతవత్సరమ్,
ఋతే గుడఘృతక్షౌద్ర ధాన్యకృష్ణావిడంగతః. ౬

స్వస్తివాచనము మొదలగుమంగళాచరణమును జేసినవాఁడును, ఔషధముల యందు నమ్మికగలవాఁడును, స్నానాదులచే పరిశుద్ధుఁడును, ఉపవాసము జేసినవాఁడును నగుమనుజుఁడు మంచిముహూర్తమునందు పైచెప్పిన గుణములతోఁ గూడినదియు పాలు గలదియు పచ్చిదిగనుండునదియునైన యోషధిని గ్రహించవలయును. పచ్చివిగనుండు ఓషధులు దొరకనియెడల గ్రహించి ఒక సంవత్సరమునకు పైఁబడకయుండు నోషధులను గ్రహించుకొనవలయును. బెల్లము, నెయ్యి, తేనె, దనియాలు, ధాన్యములు, పిప్పళ్లు, వాయువిడంగములు ఇవి ఒక సంవత్సరమునకు పైఁబడినవిగనుండినను గ్రహించ వచ్చును.

### క్షీరాదిగ్రహణక్రమము.

పయో బాష్కయణం గ్రాహ్యం విణ్మూత్రం తచ్చ నీరుజమ్,
వయోబలవతాం ధాతుపిచ్ఛశృంగఖురాదికమ్. ౭

ఆఱునెలల దూడగలదియు,రోగములేనిదియునైన ఆవుయొక్క పాలు, మూత్రము, పేఁడ, వీనిని ఔషధమునకై గ్రహించవలయును. యౌవనము వయస్సు బలమువీనితోఁ గూడియుండు జంతువులయొక్క రక్తాదిధాతువులు పిత్తము కొమ్ములు గిట్టలు మొదలగు వానిని ఔషధమునకై గ్రహించుకొనవలయును.

### స్వరసాదిపంచవిధకషాయములు.

కషాయయోనయః పంచ రసా లవణవర్జితాః,
రసః కల్కశ్శృతశ్శీతః ఫాంటశ్చేతి ప్రకల్పనా ౮
పంచధైవంకషాయాణాం పూర్వం పూర్వం బలాధికా,

లవణముతప్ప మధురాది రసము లైదుగలద్రవ్యములు కషాయముల కాధారముగనుండును. స్వరసము కల్కము శృతము శీతము ఫాంటము నని కషాయము లైదు విధములు. వీనిలో ఫాంటమనునది మిక్కిలివీర్యముగలది; దానికంటె శీతకషాయము, శీతకషాయమునకంటె శృతకషాయము, శృతకషాయమునకంటె కల్కము, కల్కమునకంటె స్వరసము ఇటుల యొకదానికంటె నొకటి అధికవీర్యముగలదిగ నుండును.

"కల్పనావశతః పంచానాం రసానాం కషాయసంజ్ఞావ్యవహారః, తస్మాద్గుణగుణినోరభేదోపచారాదిహ రసగ్రహణేనతదాశ్రయాణాం ద్రవ్యాణాం గ్రహణం మంతవ్యమ్."

లవణముదక్క తక్కినమధుర, అమ్ల, కటు, తిక్త, కషాయములను నట్టిరసములు గల ద్రవ్యములచేగల్పింపబడినయౌషధము కల్పనావిశేషమునంజేసి కషాయమనివ్యవహరింపబడునుగాని మధురకషాయము అమ్లకషాయము తిక్తకషాయము, కటుకషాయము, కషాయకషాయమునని ఆయారసభేదములబట్టి వ్యవహరింపబడదు. మరియు పంచానాం రసానాం, అన్నచోట గుణగుణుల కభేదము నంగీకరించి వస్తునిష్ఠమైనరసపదముచే రసవిశిష్టములగు ద్రవ్యములే గ్రహింపబడునని చరకముని యానతిచ్చిరి.

## స్వరసలక్షణము.

సద్యస్సముద్ధృతాత్క్షుణ్ణాద్యస్స్రవేత్పటపీడితాత్, ౯
స్వరస స్స సముద్దిష్టః

శ్రేష్ఠమైనభూమిలోనుండి యపుడే గ్రహింపఁబడినయోషధులను చక్కఁగ నలియకొట్టి వస్త్రఖండములోనుంచి పిండిన దానియందుండి స్రవించునట్టిరసము స్వరసమనఁబడును.

"ఆహృతాత్తత్క్షణాత్కృష్టాద్ద్రవ్యాత్ క్షుణ్ణాత్సముద్ధరేత్.
వస్త్రనిష్పీడితోయస్స్యాత్స్వరసో రస ఉచ్యతే.
కుడవం చూర్ణితం ద్రవ్యం క్షిప్తంచద్విగుణేజలే,
అహోరాత్రం స్థితం తస్మాద్భవేద్వారస ఉత్తమః,
ఆదాయ శుష్కం ద్రవ్యం వా స్వరసానామసంభవే,
జలేఽష్టగుణితే సాధ్యంపాదశిష్టం చ గృహ్యతే,
స్వరసస్య గురుత్వాచ్చ పల మర్ధం ప్రయోజయేత్,
నిశోషితం చాగ్నిసిద్ధం పలమాత్రం రసం పిబేత్,
మధుశ్వేతాగుడక్షారాన్ జీరకం లవణం తథా,
ఘృతం తైలం చ చూర్ణాదీన్ కోలమాత్రాన్ రసేక్షిపేత్."

ఓషధులనుగ్రహించి తోడనే నలియగొట్టి వస్త్రములోనుంచి పిండిన నది స్వరసము, రసము, అనిచెప్పఁబడును. 1 కుడవము ఓషధిని గ్రహించి చూర్ణముచేసి, 2 కుడవము లుదకములోవైచి, 1 యహోరాత్రము నానబెట్టి వడియగట్టిన యదియు రసమనియే చెప్పఁబడును. పచ్చిదిగనుండునోషధి దొరకనియెడల ఎండినయోషధిని గ్రహించి 8 రెంత లుదకములోవైచి నాలవభాగముమిగులునటుల కాఁచినదియు రసముతో తుల్యముగనుండును. పైస్వరసము గురుత్వముగలది యగుటంజేసి దీనిని $\frac{1}{2}$ పలము నిప్పించ

వలయును. దీనియందు తేనె, బెల్లము, క్షారములు, జీలకఱ్ఱ, లవణము, నెయ్యి, నువ్వుల నూనె, చూర్ణము ఇవి చేర్చవలసియుండినయెడల కోలప్రమాణము చేర్చుకొనవలయు నని తంత్రాంతరమునందు చెప్పఁబడియున్నది.

## కల్కలక్షణము.

కల్కః పిష్టో ద్రవాప్లుతః,

చూర్ణోఽప్లుతః

పైచెప్పినప్రకారమౌషధులను గ్రహించి చక్కఁగనూరి ఉదకాదిద్రవద్రవ్యములతో కలిపిన నది కల్కమనఁబడును. మఱియు నెండినద్రవ్యములను చూర్ణముచేసి యుదకముతో కలిపిన నదియును కల్కమనియే చెప్పఁబడును.

"ద్రవ్యమార్ద్రం శిలాపిష్టం శుష్కం వా సజలం పిబేత్
ప్రక్షేపావాపకల్కాస్తే తన్మాత్రా కర్షసమ్మితా,
కల్కే మధు ఘృతం తైలం దేయం ద్విగుణమాత్రయా,
సితాం గుడం సమం దద్యాద్ద్రవా దేయాశ్చతుర్గుణాః."

పచ్చిదిగనుండుద్రవ్యమును చక్కఁగనూరి ఉదకాదిద్రవ్యములలో కలిపిన నది కల్కమనఁబడును. ఎండియున్నయౌషధమును నీళ్లుపోసినూరిన నదియు కల్కమనియే చెప్పబడును. అయ్యది ప్రక్షేపము, ఆవాపము, కల్కమునను పర్యాయపదముల చే వ్యవహరింపబడును. దీనిని కర్షప్రమాణ మిప్పించవలయును. పైకల్కములో తేనె, నెయ్యి, నువ్వులనూనె యివిచేర్చవలసియుండినపుడు రెండింతలధికముగను; పంచదార, బెల్లము చేర్చవలసియుండిన సమభాగములుగను; ద్రవద్రవ్యములు చేర్చవలసియుండిన నాలుగింతలధికముగను చేర్చవలయునని తంత్రాంతరమునందు చెప్పఁబడియున్నది.

## శృతకషాయలక్షణము.

శృతః క్వాథః

ద్రవ్యముల నుదకములోవైచి చక్కఁగకాచిన నది శృతకషాయ మనబడును.

"పానీయం షోడశగుణం క్షుణ్ణే ద్రవ్యపలే క్షిపేత్
మృత్పాత్రే క్వాథయేద్గ్రాహ్యమష్టమాంశావశేషితమ్
తజ్జలం పాయయేద్ధీమాన్ కోష్ణం మృద్వగ్నిసాధితమ్,
శృతః క్వాథః కషాయశ్చ నిర్యూహస్సనిగద్యతే,
క్వాథే క్షిపేత్సితామంశైశ్చతుర్థాష్టమషోడశైః,
పిత్తవాతకఫాతంకే విపరీతం మధుస్మృతమ్,
జీరకం గుగ్గులుం క్షారం లవణాని శిలాజతు

హింగు త్రికటుకం చైవ క్వాథే శాణమితం క్షిపేత్,
క్షీరం ఘృతం తైలమూత్రం చాన్యద్ద్రవ్యే తథా క్షిపేత్,
కల్కచూర్ణాదికం క్వాథే నిక్షిపే త్కర్షసమ్మితమ్."

1 పలము ద్రవ్యములను నలియగొట్టి మట్టిపాత్రలోవైచి 16 పలము లుదకము పోసి 8 వ భాగము మిగులునటుల కాచి సుఖోష్ణముగ నిప్పించవలయును. ఇది శృతము, క్వాథము, కషాయము నిర్యూహమునని చెప్పఁబడును. దీనిలో పంచదార చేర్చవలసియుండినయెడల పిత్తరోగమునందు 4 వ భాగమును, వాతరోగమునందు 8 వ భాగమును, కఫరోగమునందు 16 వ భాగమును చేర్చవలయును. తేనె చేర్చవలసియుండిన యెడల పిత్తరోగమున 16 వ భాగమును, వాతరోగమున 8 వ భాగమును, కఫరోగమున 4 వ భాగమును చేర్చవలయును. జీలకఱ్ఱ, గుగ్గిలము, క్షారములు, లవణములు, ఇంగువ, త్రికటుకములు, పాలు, నెయ్యి, నువ్వులనూనె, గోమూత్రము మొదలగు ద్రవ్యములను శాణప్రమాణముగను, కల్కచూర్ణాదులను కర్షప్రమాణముగను చేర్చుకొనవలయును. అని తంత్రాంతరమునందు చెప్పఁబడియున్నది.

### శీతకషాయలక్షణము.

శీతో రాత్రిం ద్రవే స్థితః. ౧౦

ద్రవ్యములను నలియగొట్టి శీతోదకాది ద్రవద్రవ్యములలోవైచి యొక రాత్రి నానబెట్టిన నది శీతకషాయ మనఁబడును.

"క్షుణ్ణద్రవ్యపలం సమ్య క్షడ్భి ర్నీరపలైః స్సృతమ్,
నిశోషితం హిమస్స స్యా త్తథా శీతకషాయకః."

1 పలము ద్రవ్యములనునలియగొట్టి 6 పలము లుదకములోవైచి 1 రాత్రి నానబెట్టిన నది శీతకషాయ మనఁబడును. అని తంత్రాంతరమునందు చెప్పఁబడియున్నది.

### ఫాంటలక్షణము.

సద్యోఽభిషుతపూతస్తు ఫాంటః

ఔషధద్రవ్యముల నలియగొట్టి యుష్ణోదకములోవైచి చక్కఁగఁబిసికి అపుడే వడియగట్టికొనిన నది ఫాంట మనఁబడును.

" క్షుణ్ణద్రవ్యపలే సమ్యగ్జల ముష్ణం వినిక్షిపేత్,
మృత్పాత్రే కుడవోన్మానం తతస్తు స్రావయేత్పటాత్,
స స్యా చ్చూర్ణద్రవః ఫాంటః తన్మానం ద్విపలోన్మితమ్."

1 పలముద్రవ్యములనునలియఁగొట్టి మట్టిపాత్రలోవైచి 2 కుడవము లుష్ణోదకముబోసి వడియగట్టిన నది చూర్ణద్రవము ఫాంటము అనఁబడును. దీనిని 2 పలము లిప్పించవలయును. అని తంత్రాంతరమునందు ఫాంటలక్షణము చెప్పఁబడియున్నది.

### స్వరసాదిద్రవ్యప్రమాణనిర్ణయము.

తస్మానకల్పనే,
యుంజ్యా ద్వ్యాధ్యాదిబలత స్తథా చ వచనం మునేః. ౧౧
మాత్రాయా నహ్యవస్థాస్తి వ్యాధిం కోష్ఠం బలం వయః,
ఆలోచ్య దేశ కాలౌ చ యోజ్యా తద్వచ్చ కల్పనా. ౧౨

రోగియొక్క దోషధాతువయోబలాదులను ఔషధులయొక్క రసవీర్యాదులను చక్కఁగ పర్యాలోచించి వానికనుగుణముగ పైస్వరసాదిద్రవ్యప్రమాణముల నిశ్చయించుకొనవలయును. వ్యాధి, కోష్ఠము, బలము, వయస్సు, దేశము, కాలము వీనిని పర్యాలోచించి పైస్వరసాదికషాయమునందు అనుగుణముగా ద్రవ్యముల చేర్చుకొనవలయు నని చరకాచార్యుఁడు "మాత్రాయా న వ్యవస్థాస్తి" అనుశ్లోకముచే చెప్పియున్నాఁడు.

### స్వరసమధ్యమప్రమాణము.

మధ్యం తుమానం నిర్దిష్టం స్వరసస్య చతుష్పలమ్,

స్వరసమునకు నాల్గు పలములు మధ్యమ ప్రమాణమని చెప్పఁబడియున్నది.

### కల్కద్రవ్యమధ్యమప్రమాణము.

పేష్యస్య కర్షమాలోడ్యం తద్ద్రవస్య పలత్రయే ౧౩

ఒకకర్షపరిమితములగు ద్రవ్యములను చక్కఁగనూరి 3 పలములయుదకము మొదలగు ద్రవద్రవ్యములలో కలపవలయును. ఇదియ కల్కమునకు మధ్యమ ప్రమాణము.

### శృతకషాయమధ్యమప్రమాణము.

క్వాథం ద్రవ్యపలే కుర్యా త్ప్రస్థార్ధం పాదశేషితమ్,

1 పలము ద్రవ్యమును ½ ప్రస్థ ముదకములోవైచి పాదావశేషముగ కాఁచవలయును. ఇదియ శృతకషాయమునకు మధ్యమప్రమాణము.

### శీతకషాయద్రవ్యప్రమాణము.

శీతం పలే పలైష్షడ్భిః

1 పలము ద్రవ్యములను ఆఱుపలము లుదకము మొదలగు ద్రవద్రవ్యములలో కలిపి శీతకషాయమును సిద్ధముచేయవలయును.

### ఫాంటకషాయద్రవ్యప్రమాణము.

చతుర్భి శ్చ తతోఽపరమ్. ౧౪

1 పలము ద్రవ్యమును 4 పలము లుదకము మొదలగు ద్రవద్రవ్యములలో కలిపి ఫాంటకషాయమును సిద్ధము చేయవలయును. స్వరసాది పంచవిధకషాయములకు

మధ్యమ ప్రమాణము చెప్పఁబడినది. దీని ననుసరించి దేశకాలాద్యనుగుణముగ అధికముగఁగాని తక్కువగఁగాని ప్రమాణము నూహించుకొనవలయును.

### తైలఘృతాది పాకమున కల్కాదిపరిమాణము.

స్నేహపాకే త్వమానోక్తౌ చతుర్గుణవివర్ధితమ్,
కల్కస్నేహద్రవం యోజ్యం

తైలఘృతాదిస్నేహములయొక్క పాకప్రకరణమునందు కల్కము స్నేహము ద్రవద్రవ్యము వీనికి ప్రమాణము చెప్పఁబడకయుండిన నచట కల్కమునకన్న నాలుగింతలు స్నేహమును, స్నేహమునకన్న నాలుగింతలు ఉదకాదిద్రవద్రవ్యములను చేర్చుకొనవలయును.

### శౌనకమతకల్కాదిపరిమాణము.

అధీతే శౌనకః పునః. ౧౫
స్నేహే సిద్ధ్యతి శుద్ధాంబునిఃక్వాథస్వరసైః క్రమాత్,
కల్కస్య యోజయేదంశం చతుర్థం షష్ఠమష్టమమ్. ౧౬
పృథక్స్నేహసమం దద్యాత్పంచప్రభృతి తు ద్రవమ్,

తైలఘృతాదులను శుద్ధోదకములోఁగాని కషాయములోఁగాని స్వరసములోఁగాని కలిపి పాకముచేయునపుడు యథాక్రమముగ స్నేహమునకు 4 - 6 - లేక 8 వ భాగముకల్కమును చేర్చుకొనవలయును. (తైలమున శుద్ధోదకమునుకలిపిపక్వము చేయునపుడు తైలమునకు నాల్గవవంతు కల్కద్రవ్యముండవలెననియు, క్వాథమును కలిపితైలమును పక్వముచేయునెడ తైలమున నారవవంతు కల్కద్రవ్యముండవలెననియు, స్వరసమునుకలిపితైలమును పక్వముజేయునెడ తైలమున నెనిమిదవవాలు కల్కద్రవ్యముండవలెననియు భావము).

మరియు తైలమున నాల్గుద్రవద్రవ్యములకన్ననధికముగనీళ్లు, క్వాథము, స్వరసము, క్షీరము, మున్నగునైదారుసంఖ్యలుకలద్రవములు గూర్చి పక్వముచేయునెడ ఆద్రవములలో నొక్కొకటియు తైలమునకు సమభాగములుగనుండవలెను. నాల్గు ద్రవములవరకు మాత్రము ద్రవములన్నియు కలిసి తైలమునకు నాలుగింతలుండవలెను. ఇది శౌనకాచార్యునిమతము

### స్నేహపాకలక్షణము.

నాంగులిగ్రాహితా కల్కే నస్నేహేఽగ్నౌ సశబ్దతా. ౧౭
వర్ణాదిసంపచ్చ యదా తదైనం శీఘ్రమాహరేత్,

తైలాది స్నేహమును పాకముచేయునపుడుకల్కముగ్రహించిన నది చేలికంటకుండుట, ఆ స్నేహమును నిప్పులోవేసిన చటచట శబ్దములేకుండుట, వర్ణము గంధము

రసము స్పర్శము ఇవి చక్కఁగనుండుట, ఈ లక్షణములు కలిగినతోడనే పక్వమైనదని తెలిసి దించుకొనవలయును.

## ఘృతాదిసమ్యక్పాకలక్షణము.

ఘృతస్య ఫేనోపశమ స్తైలస్య తు తదుద్భవః. ౧౮
లేహస్య తంతుమత్త్వాప్సు మజ్జనం శరణం న చ,

ఘృతమును పాకము చేయునపుడు నురుగు శమించుట, తైలమును పాకము చేయునపుడు నురుగు కలుగుట, ఇవి సమ్యక్పాకలక్షణంబులు. లేహమును పాకము చేయునపుడు దానిని చేతితో నెత్తిన తీఁగవలె వచ్చుట, ఉదకములో వైచిన మునుఁగుట, శీర్ణముకాకుండుట, చక్కఁగా పాకమైనందుకు లక్షణమని తెలిసికొనవలయును.

## స్నేహాదులకు త్రివిధపాకము.

పాకస్త్రివిధో మందశ్చిక్కణః ఖరచిక్కణః. ౧౯
మందః కల్కసమే కించిచ్చిక్కణో మదనోపమే,
కించిత్సీదతి కృష్ణే చ వర్తమానే చ పశ్చిమః. ౨౦
దగ్ధోఽతఊర్ధ్వం నిష్కార్యస్స్యాదామ స్త్వగ్నిసాదకృత్,
మృదుర్నస్యే ఖరోఽభ్యంగే పానే వస్తౌ చ చిక్కణః, ౨౧

మందము చిక్కణము ఖరచిక్కణము అని స్నేహపాకము మూడువిధములు. ఘృతాదిస్నేహములను పాకము చేయునపుడు వానియందలి కల్కమును చేతితో నెత్తినది చేతికి అంటకయుండిన మందపాకమనియు, చేతికంటికొనినచిక్కణపాకమనియు, కొంచెమధికముగ పాకమును జెంది కృష్ణవర్ణముగలదిగనుండిన ఖరచిక్కణమనియు తెలిసికొనవలయును. విశేషముగ పాకమును జెందినదది దగ్ధమన బడును ఇదివ్యాధినికుదుర్చను. ప్రయోజనములేనిది. కొంచెముగ పాకముజెందిన స్నేహాదులుఅగ్నిమాంద్యమునుగలుగఁజేయును. మందపాకముగ స్నేహము నస్యమునందును, ఖరచిక్కణపాకముగల స్నేహమును అభ్యంగమునందును, చిక్కణపాకముగల స్నేహమును పానము వస్తికర్మ వీనియందును ఉపయోగించవలయును.

## శాణాదిపరిమాణలక్షణము.

శాణం పాణితలం ముష్టిః కుడవం ప్రస్థ మాఢకమ్.
ద్రోణం వహం చ క్రమశో విజానీయా చ్చతుర్గుణమ్. ౨౨

శాణము, పాణితలము, ముష్టి, కుడవము, ప్రస్థము, ఆఢకము, ద్రోణము, వహము, అనునవి యథాక్రమముగ ఒకదానికంటె నొకటినాలుగింతలధికముగనుండును. (అనఁగా 4 శాణములు 1 పాణితలము 4 పాణితలములు 1 ముష్టి), ఇటుల కుడవాదిపరిమాణభేదములను తెలిసికొనవలయును.

## శుష్కార్ద్రద్రవ్యపరిమాణము.

ద్విగుణం యోజయే దార్ద్రం కుడవాది తథా ద్రవమ్,

ఒకయోగమున రెండిన ద్రవ్యములు పచ్చివిగనుండు ద్రవ్యములును సమభాగములుగ చేర్చవలసినదని చెప్పియుండిన నచట ఎండిన ద్రవ్యమునకంటె రెండింతలు పచ్చివిగనుండు ద్రవ్యములను చేర్చవలయును. ఎండిన ద్రవ్యములు దొరకనియెడల పచ్చివిగనుండు ద్రవ్యములను రెండింతలు చేర్చవలయును. ఎండిన ద్రవ్యములు ద్రవద్రవ్యములు వీనిని సమభాగములుగ చేర్చవలసినస్థలమున ద్రవద్రవ్యములను ఎండినద్రవ్యములకన్న నాలుగింతలు చేర్చుకొనవలయును.

అనుక్తద్రవప్రకరణమునం దుదకగ్రహణము

పేషణాలోడనే వారి స్నేహపాకే చ నిర్ద్రవే. ౨౩

ఘృతాదిస్నేహపాకద్రవ్యములను నూరుటకును, కలియబెట్టుటకును వీనికి ద్రవద్రవ్యము చెప్పకుండుస్థలములో ఉదకము గ్రహించుకొనవలయును. స్నేహపాకమునందు ద్రవద్రవ్యము చెప్పకుండిన ఉదకమునే చేర్చుకొనవలయును.

పరిమాణము చెప్పకుండుస్థలమున పరిమాణనిర్ణయము.

కల్పయేత్సదృశాన్ భాగాన్ ప్రమాణం యత్ర నోదితమ్,
కల్కీకుర్యాచ్చ భైషజ్యమనిరూపితకల్పనమ్. ౨౪

ఏయోగమునందు ద్రవ్యమునకు పరిమాణము చెప్పఁబడకుచున్నదో యాస్థలమునందు సమభాగములుగ ద్రవ్యములను చేర్చుకొనవలయును. మఱియు నోషధులకు కల్పము చెప్పఁబడకుండుస్థలములో ఆ ద్రవ్యమును కల్కము చేసి చేర్చుకొనవలయును.

కోలాదిపరిమాణనిర్ణయము.

ద్వౌ శాణౌ వటకః కోలం బదరం ద్రంక్షణ శ్చతౌ,
అక్షం పిచుః పాణితలం సువర్ణం కబలగ్రహః ౨౫
కర్షో బిడాలపదకం తిందుకః పాణిమానికా,
శబ్దాన్యత్వ మభిన్నే౽ర్థే శుక్తిరష్టమికా పిచూ. ౨౬
పలం ప్రకుంచో బిల్వాం చ ముష్టిరామ్రం చతుర్థికా,
ద్వే పలే ప్రసృత స్తౌ ద్వావంజలిస్తౌ తు మానికా. ౨౭
ఆఢకం భాజనం కంసో ద్రోణః కుంభో ఘటో౽ర్మణమ్,
తులా పలశతం తాని వింశతి ర్భార ఉచ్యతే. ౨౮

వటకము కోలము బదరము ద్రంక్షణము అనునవి రెండుశాణముల యెత్తునకు పేళ్లు. అక్షము, పిచువు, పాణితలము, సువర్ణము, కబళగ్రహము, కర్షము, బిడాలపదకము, తిందుకము, పాణిమానిక అనునవి రెండుకోలముల యెత్తునకు పేళ్లు. శుక్తి, అష్టమికా అనునవి రెండుకర్షములకు పేళ్లు. పలము, ప్రకుంచము, బిల్వము, ముష్టి, ఆమ్రము, చతుర్థికా, అనునవి 1 పలమునకు పేళ్ళు. రెండుపలముల ప్రమాణము ప్రసృతమనియు రెండు ప్రసృతములు అంజలియనియు, రెండంజలులు మానికయనియు చెప్పఁబడును,

ఆఢకము, భాజనము, కంసము, ద్రోణము, కుంభము, ఘటము, అర్మణము అనునవి 1 ఆఢకమునకు పేళ్లు 100 పలములు తులమనియు 20 తులములు 1 భారమనియు చెప్పఁబడును.

"షడ్వంశ్యో మరీచీ, తాః షణ్మరీచ్యః సర్షప ఉచ్యతే,
అష్టౌ సర్షపాస్తండులః, తౌ ద్వౌ తండులౌ పేశో ధాన్యమాషః,
తౌ ద్వౌ ధాన్యమాషౌ యవః, అతఃపరం చతుర్గుణవృద్ధ్యాంబుకాః,
మాషకశాణకర్షపల కుడవ ప్రస్థాఢక ద్రోణ వహాః కల్ప్యంతే."

6 వంశీలొకమరీచియనియు, 6 మరీచులొకసర్షపమనియు, 8 సర్షపము లొక తండులమనియు, రెండుతండులము లొక ధాన్యమాషమనియు, రెండుధాన్యమాషము లొక యవమనియు, 4 యవము లొక అంబుకమనియు 4 అంబుకములు మాషకమనియు, 4 మాషము లొకశాణమనియు, 4 శాణము లొకకర్షమనియు, 4 కర్షము లొకపలమనియు, 4 పలము లొకకుడవమనియు, 4 కుడవము లొకప్రస్థమనియు, 4 ప్రస్థము లొకఆఢకమనియు, 4 ఆఢకము లొక ద్రోణమనియు, 4 ద్రోణములు వహమనియు, చెప్పఁబడును. అసంగ్రహమునందు చెప్పఁబడియున్నది. సుతియు నొక పలములో 10 వ భాగము ధరణ మనఁబడును. మాషమునకు హైమమనియు, కర్షమునకు షోడశికమనియు, ఆఢకమునకుపాత్రమనియు, ద్రోణమునకు నల్వణమనియు పర్యాయనామంబులు. రెండుద్రోణములు శూర్పమనఁబడును. ఇటులతంత్రాంతమునందు చెప్పఁబడియున్నది.

### దేశభేదమువలన ద్రవ్యభేదము.

హిమవద్వింధ్యశైలాభ్యాం ప్రాయో వ్యాప్తా వసుంధరా,
సౌమ్యం పథ్యం చ తత్రాద్య మాగ్నేయం వైంధ్యమౌషధమ్.

భూమి హిమాలయపర్వతముచేతను వింధ్యపర్వతముచేతనువిశేషముగ వ్యాపించియున్నయది. హిమవత్పర్వతములో జనించిన యౌషధము స్వభావముగనే సౌమ్యముగను పథ్యముగను నుండును. వింధ్యపర్వతము నందలి యౌషధులు ఆగ్నేయముగ (అనఁగా నుష్ణవీర్యముగలదిగ) నుండును. శరీరమునకు పథ్యకరముకానేరవు.

## షష్ఠాధ్యాయము ముగిసెను.

ఇతి శ్రీవైద్యపతి సింహగుప్తసూను వాగ్భటవిరచితాయాం అష్టాంగహృదయ
సంహితాయాం ఆంధ్రతాత్పర్యసహితాయాం
పంచమం కల్పస్థానం సంపూర్ణమ్.






చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1930.